ా రత్న మాల 251

# గోరా

శ్రీ రవీంద్రనాథ ఠాకూరు

వంగ భాషలో రచించినది

కవిరాజహంస, కవికులాలంకార

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

ఆంధ్రీకరించినది



లిమిటెడ్

# పీఠిక

పలుకు నిలుపరింపఁ బలుకున నలరింపఁ బలుకు భావమునను వెలుఁగరింపఁ
బలికి పలుకరింపఁ బలుకుచుఁ బులకింప నీరవీంద్రుఁ డొక్కఁడే యెఱుంగు.

ఈనవల రవీంద్రకవిచంద్రు విరచిత వంగభాషామాతృక కనువాదము. విశ్వభారతీమూర్తి యగు రవీంద్రునివాణి యిందు సహస్రముఖముల సరసమనోరంజనముగ శాంతమధురగానము చేసినది. దేశాభిమానుల దివ్యతత్త్వము లిందున్నవి. మతాభిమానుల మంత్రబీజము లిందున్నవి. సంస్కరణాభిమానుల సాధుభావము లిందున్నవి. కవితాభిమానుల కావ్యకళ లిందున్నవి ఇది నవలయే కాదు, నవభావకుసుమాకరము, నవరసకమలాకరము, నవరత్నరత్నాకరము, నవనవానందసుధాకరము, నవజీవనప్రభాకరము !

మనోభావములఁ గన్నులఁగట్టుటకును హృదయాంతర్భావముల హృదయముల ముద్రించుటకును వివిధప్రకృతుల విచిత్రముగఁ జిత్రించుటకును రవీంద్రుఁడు మిగుల నేర్పరి. భావనాతీతముల ప్రకృతిరహస్యములను బలుకులలో బయటఁబెట్టుటయం దతఁడు గడుదిట్ట.

శ్రీరవీంద్రనాథ ఠాకూరు వంగభాషయందలి తమకృతుల నన్నిటి నాంధ్రీకరించుటకు మా కవకాశము కల్పించినందులకు వారికి మే మెంతయుఁ గృతజ్ఞులము.

మా యెడలఁ బరిపూర్ణాదరభావము కలిగి మమ్మెల్లవిధముల నాత్మీయులనుగా భావించి మా యుద్యమమును మన్నించి మాకవితను [illegible]పు శ్రీ రఘుపతి వేంకటరత్నము నాయుఁడు గారి యమూల్య[illegible] వారి కీగద్యకావ్యము నాంధ్రీకరించి యంకిత మొనరింపఁగలిగినందులకు పరమానందభరితులము !

వేంకట పార్వతీశ్వర కవులు

IV

# ప్రేమ రత్నాంకితము

శ్రీవిలసద్గుణమణికిన్
ధీవిభవాచార్యమణికి దివ్యప్రేమా
ప్లావితజీవనమణికిన్
శ్రీవేంకటరత్నభక్తచింతామణికిన్.

నిండినయమృతనదమువలెఁ
బండినపాలమువలెఁ గంటఁబడిన గనివలెన్
దండ నిలిచి యగతికజన
మండలిఁ గరుణించువిబుధమానితమణికిన్.

కల్యాణమయమైన గనిలోనఁ బ్రభవించి
ఘనతపోమయమైన తనువు గాంచి
శాంతమయంబైన శాణఘట్టనఁ దేఱి
ధర్మమయంబైన తళుకుఁ జెంది
సౌభాగ్యమయమైన సాధుమాళినిఁ జేరి
విశ్వమయంబైన విలువ నలరి
ఆనందమయమైన యమృతతేజము నొంది
విజ్ఞానమయమైన వెలుఁగు సూపి

అమృతకళలచే నఖిలంబు నలరఁజేయు
రఘుపతికులాబ్ధికౌముదీరత్నమునకు
రమ్యగుణనిధి వేంకటరత్నమునకు
నంకితంబుగ నీకృతి యలరుఁగాత!

[illegible]

# గోరా

## ౧

శ్రావణమాసమందలి యొకనాఁటి ప్రభాతసమయమునఁ గలకత్తానగరమున ఘనాఘనవినిర్ముక్త మగు నాకాశము నిర్మలబాలాతపకాంతులచే విరాజిల్లుచుండును. అప్పుడు పనియేమియు లేకయున్న వినయభూషణుఁడు తన సౌధమున రెండవయంతస్తునందలి వరాండాలో నొంటిగ నిలువఁబడి వీథివెంట వచ్చుచుఁ బోవుచుండువారిని గనుంగొనుచుండెను. కాలేజీ చదువు చాలదినములక్రిందటనే పూర్తియైనను నాతఁడింకను సంసారమధ్యమునఁ బ్రవేశింపలేదు. ఆతఁడికి సభలను సాగించుటయందును, వర్తమానపత్రికలకు వ్రాయుటయందును మనసున్నది గాని యంతగా వానియందుఁగూడ శ్రద్ధపూర్తిగా లేదు. అందుచేతనే నేటియుదయమున నాతని కేమిచేయుటకును దోఁపక చంచలహృదయముతో నటు నిటుఁ జూచుచుండెను. అప్పుడు ప్రక్కనుండెడు హరిదాసుఁ డొకఁడు చెంగటనున్న యంగడి కెదురుగ నిలువఁబడి యీ క్రిందిగీతమును గానము చేయుచుండెను.

"అపరంజి కూటిలో, నంతలో నే తోఁచి యపురూపమై పోవు చిలుకా!
ఎపుడు వచ్చెదవో నీ వెపుడు పోయెదవో నిన్నెఱుంగఁడే నెఱుంగనీ చిలుకా!
జీవరత్నమువోలి నీ వెప్పుడైన, నా చేతి కందితివేని, చిలుకా!
భావసూత్రంబుతోఁ బట్టి నీపాదాల బంధించి వైతునే చిలుకా"

ఆ హరిదాసునిఁ బిలిచి యా చిలుకపాట పూర్తిగఁ బాడించి వ్రాసికొనవలయునని వినయునకుఁ గోరిక కలిగెను; కాని, ప్రాతఃసమయము చలిగా నుండుటచేఁ గప్పుకొన్న దుప్పటమునైనను దొలఁగించుట కిష్టము లేనంతటి బద్ధకముగా నుండుట వలన నాతఁ డాగీతమును వ్రాసికొనఁజాలకపోయెను. కాని యాగీతస్వర మాతని హృదయమధ్యమున ప్రతిధ్వనించుచునే యుండెను.

అప్పు డాతనియింటి కెదురుగా వీథిని బోవుచున్న యొక యద్దెబండిపై బలమైన జోడుగుఱ్ఱములబండి యొకటి పడుటచే బండిచక్రము విరిగిపడిపోయెను. గుఱ్ఱపుబండి యతివేగముగ నదృశ్యమైపోయెను. అద్దెబండి పూర్ణముగా బోరగిలఁబడలేదు; కాని యొకప్రక్కకుమాత్రము వొరగిపోయెను. అది చూచి వినయభూషణుఁడు తత్తరముతోఁ గ్రిందికి దిగి వీథిలోనికి వచ్చెను. అప్పటికా బండిలోనుండి పదునేడు పదునెనిమిదేండ్ల వయసుగల యొకయువతీరత్నము మెల్లగా దిగెను. బండిలోపలనున్న పెద్దమనుష్యుఁ డగు నొకవృద్ధుఁడు దిగుట కుపక్రమించుచుండెను. వినయభూషణుఁ డావృద్ధునిఁ బట్టుకొని మెల్లగాఁ గ్రిందికి దింపెను. అప్పు డావృద్ధుని వదనము వికలమై యుండుటం గాంచి వినయుఁ డాదరముతో "అయ్యా! మీకు దెబ్బ తగిలినదా?" అని ప్రశ్నించెను.

వృద్ధుఁడు లేదని చెప్పుచు నించుక మందహాసము తెచ్చుకొనఁ బ్రయత్నించెను గాని యానవ్వంతలోనే విలీనమైపోయి యాతఁడు మూర్ఛిల్లుటకు సిద్ధముగా నుండెను. వినయుఁ డాతనిం బట్టుకొని యుత్కంఠితయై చూచుచున్న యాసుందరిం గాంచి "ఈయెదుటిదియే మాయిల్లు! లోపలికిఁ బోవుదము!" అనియెను.

తోడనే వినయుఁ డావృద్ధుని లోనికిఁ దీసికొనిపోయి యొకపర్యంకముపై శయనింపఁజేసెను. ఆసుందరి యప్పు డాగదినలుమూలలను బరిశీలించి యొకమూల నున్న జలకలశమును గాంచి యందలిజలము నొకగ్లాసుతోఁ దెచ్చి యావృద్ధుని మొగముపైఁ జల్లి చల్లగా విసరుచు వినయభూషణునిం గాంచి "వైద్యుఁ డెవ్వఁడైన దొరకునా?" అని ప్రశ్నించెను.

ఆయింటికి సమీపముననే యొక డాక్టరుండెను. వినయుఁ డాతని దీసికొని వచ్చుటకై యొకసేవకునిఁ బంపించెను. ఆగదిలో నొకబల్లపై నొకయద్దమును, తలనూనెసీసాయును, తలదువ్వుకొనువస్తువులు నుండెను. వినయుఁ డాయువతివెనుక నిలువఁబడి యద్దములో నామెవదనప్రతిబింబమును దదేకదృష్టితోఁ గాంచుచు స్తంభీభూతుఁడై యుండెను. ఆతఁడు చిన్నతనమునుండియుఁ గలకత్తాయందే యుండి చదువుకొనుచుండెను. ఆతనికిఁ గల లోకజ్ఞాన మంతయును బుస్తకములవలనఁ గలిగినది మాత్రమే. సంబంధములేని గొప్పయింటియాఁడువాండ్రతో నాతఁ డిదివఱ కెన్నఁడును గలిసి యుండలేదు.

ఆయద్దములో నాతఁ డారమణీమణి మనోహరవదనమండలమును గాంచుచుండెను. ఏమి యారామణీయకము! ఆతనిచూపులలో నాసుందరి వదనసౌందర్యమున శృంగారరేఖలను విభజించి చూడవలయునను నుద్దేశము లేదు.

కేవలమును బ్రేమోద్వేగముచే నించుక వంగియున్న యారమణీయతరుణముఖకమలమందలి లావణ్యసౌకుమార్యము లాతనిదృష్టులకు సృష్టియందలి సద్యఃప్రకాశితమగు నొకనూతనవిస్మయము నాపాదించుచుండెను.

కొంతసేపటి కావృద్ధుఁడు మెల్లమెల్లఁగఁ గన్నులను విచ్చి "అమ్మా!" అని యొక నిట్టూర్పు విడిచెను. అప్పు డాయువతి కన్నుల నీరు నిండఁ దన నెమ్మొగము నాతని మొగమునొద్దఁ జేర్చి ప్రేమార్ద్రస్వరముతో "బాబా! మీ కెక్కడ దెబ్బ తగిలినది?" అనియెను.

"నీ వెక్కడకు వచ్చితివి?" అని పలుకుచు వృద్ధుఁడు మెల్లఁగ లేచి కూర్చుండుటకుఁ బ్రయత్నించెను. అంతలో వినయుఁ డాతనియొద్దకు వచ్చి "అయ్యా! మీరు లేవవలదు. ఇంచుక విశ్రమింపుఁడు. ఇంతలో డాక్టరు వచ్చును!" అనియెను.

అప్పుడు వృద్ధునకు బాగుగ స్మృతి కలుగుటచే "నాతలపై నీభాగమున నించుక వేదనగా నున్నది; కాని యంతవిశేషబాధ యేమియును లేదు." అనియెను.

అంతలోఁ బాదరక్షలశబ్దముతో డాక్టరచ్చటికి వచ్చి యావృద్ధుని బరీక్షించి "విశేషాపాయ మేమియును లేదు. కొంచెము వేఁడిపాలలో నించుక బ్రాందిని జేర్చి త్రాగింపుఁడు!" అని చెప్పి వెడలిపోయెను. ఆమాటకు వృద్ధుఁ డతిసంకుచితచిత్తముతో విరక్తుఁడయ్యెను. ఆసుందరి వృద్ధునిభావమును గ్రహించి "బాబా! ఏల సంకోచించెదరు? డాక్టరు వచ్చినందులకును, మందునకును గావలసినసొమ్ము మన మింటికిఁ బోయి పంపించివేయుదము!" అని పలుకుచు నామె వినయభూషణుని మొగమువంకఁ దిలకించెను.

ఆహా! ఏమి యానయనవిలోకనము! ఆకన్నులు పెద్దవియా చిన్నవియా, నల్లనివా యెఱ్ఱనివా యను వితర్కము మనసునకుఁ దోఁచుటలేదు! చూపులయం దొకయసందిగ్ధప్రభావము విరాజమానమగుచున్నట్లు ప్రథమదర్శనముననే పొడకట్టుచుండెను. ఆదృష్టులయం దెట్టిసంకోచమును లేదు. ఎట్టిద్వైధీభావమును లేదు. కేవల మవి యేకమాత్రస్థిరశక్తిసంపన్నములై యుండెను.

వినయభూషణుఁడు ప్రయత్నపూర్వకముగ మాటాడుట కుపక్రమించి "వైద్యున కిచ్చునది స్వల్పము. అందుకొఱకు- అది మీరు- అది నేనే" అనియెను. ఆసుందరి యాతని మొగమువంకనే చూచుచుండుటచే సరిగా నాతఁడు మాటాడఁజాలకపోయెను. కాని వైద్యునకుఁ గొంతసొమ్మీయవలసియుండు ననుసంగతిమాత్రము నిస్సంశయముగాఁ దెలిసిపోయెను.

అప్పుడు వృద్ధుఁడు "నాకు బ్రాందియక్కఱలేదు" అనియెను. ఆయువతి యామాట కడ్డువచ్చి "ఏమి బాబా! డాక్టరుగారు చెప్పినట్లు చేయవలదా?" అనియెను.

వృద్ధుఁడు "ఇప్పటి డాక్టరులకది దురభ్యాసమైపోయినది. నానీరసము వేఁడిపాలు పుచ్చుకొన్నను దగ్గిపోవును." అని చెప్పి యాతఁడు పాలనుమాత్రము త్రాగి యించుక విశ్రాంతినంది వినయభూషణుని గాంచి "ఇంక మేము పోయెదము- మీకుఁ జాలశ్రమ కలిగించితిమి" అనియెను. తోడనే యాసుందరి వినయునివంకఁ జూచి "ఒకబండి" అనియెను. వృద్ధుఁడు సంకోచముతో "ఆయన కింకను దొందర కలిగించుటయేల? మనయిల్లు సమీపమే కదా! ఒకనిమిషములోఁ బోవుదము!" అనియెను. అంత నాతరుణీమణి "వలదు బాబా! మీరు నడువఁజాలరు" అనియెను.

వృద్ధుఁడింక మారాడలేదు. వినయుఁడు స్వయముగఁ బోయి బండిని దీసికొని వచ్చెను. బండి నెక్కుటకుముందే వృద్ధుఁ డాతనిం గాంచి "మీ పేరేమి?" అని ప్రశ్నించెను.

విన— నా పేరు శ్రీ వినయభూషణచట్టోపాధ్యాయుఁడు.

వృద్ధు — పేరు పరేశచంద్రభట్టాచార్యుఁడు. మేమీ సమీపమునందే 78 వ నంబరు గృహమునం దున్నాము. అవకాశము కల్గించుకొని యెప్పుడైనను మీరు మా యింటికి వచ్చినచోఁ జాల సంతోషించెదను.

అప్పు డాయువతియుఁ దన నయనద్వయవిలాసముచేతనే నిశ్శబ్దముగ నా ప్రార్థనమును సమర్థించెను. వినయుఁ డాబండిమీఁదనే పోయి వారి నింటికిఁ జేర్చి రావలయు ననుకొనియెను గాని యది శిష్టాచార మగునో కాదో యనుసంశయముచే నిలిచిపోయెను. బండి కదలునప్పు డాసుందరి వినయమున కొకచిన్ననమస్కారమును గావించెను. ఆమె అట్లు చేయు నని యాతఁ డిదివఱకెంతమాత్రమును దలంచి యుండకపోవుటచే హతబుద్ధియై ప్రతినమస్కారము చేయఁజాలకపోయెను. ఈవిధముగా నాతఁ డీచిన్న తప్పుచేసి గృహంబునఁ బ్రవేశించి పలుమాఱు తన్నుఁ దానే నిందించుకొనఁ దొడంగెను. తరువాత నాతఁడు వారు వచ్చినదిమొదలు పోవువఱకును దా నాచరించినపను లన్నిటిని విమర్శించుకొనియెను. అప్పుడు తన యాచరణమంతయు నసభ్యముగనే యున్నట్లాతనికిఁ దోఁచెను. సమయోచితముగఁ బ్రవర్తింపఁజాలక పోయినందుల కాతఁ డాందోళనపడఁదొడంగెను. ఆరమణీమణి వృద్ధుని మొగము తుడిచినచేతిరుమాలు గదిలో నాపర్యంకముమీఁదనే పడియుండెను. వినయుఁడు త్వరముతోఁ బోయి దానిని దీసికొనియెను. అప్పు డాతని హృదయాంతరాళమున—

"అపరంజిగూటిలో నంతలోనే తోఁచి
యపురూపమైపోవు చిలుకా!
ఎపుడు వచ్చెదవో నీ వెపుడు పోయెదవో ని
న్నెన్నఁడే పట్టఁగనే చిలుకా!"

అను గీతము ప్రతిధ్వనితము కాఁదొడంగెను. ప్రొద్దెక్కుచుండెను. వర్షాకాలాతపము తీక్ష్ణమగుచుండెను. వినయున కాదినమున నేపనియందును మనసు లేకపోయెను. ఆతని కప్పుడు తన భవనముతోఁగూడఁ గలకత్తాపుర మంతయును మాయానగరముగాఁ దోఁచుచుండెను. ఆవర్షాప్రభాతతీవ్రాతప మాతని మస్తిష్కమధ్యమునఁ బ్రవేశించి యాతనిరక్తనాళములలోఁ బ్రవహించి యాతని యంతఃకరణసాన్నిధ్యమునందొక జ్యోతిర్మయయవనికంబోలి దోఁచుచు నాతని సమస్తజీవితమును నిక్కృష్టమైనదిగాఁ దోఁపఁజేయుచుండెను.

అప్పు డేడెనిమిదేండ్లబాలుఁ డొకఁడు వీథిలో నిలువఁబడి యింటినంబరును బరిశీలించుచుండెను. వినయుఁడు మేడపైనుండి యాతనిం గాంచి "ఈయిల్లే!" అని చెప్పుచుఁ జటాలునఁ గ్రిందికిదిగిపోయి పరమాదరముతో నాబాలకుని లోనికిఁదీసికొని వచ్చి యాతని మొగమువంక దిలకించుచుండెను. ఆబాలుఁ డప్పుడు "మాయక్క—

మీ కీచీటి నిచ్చిరమ్మని నన్ను బంపినది" అని యుత్తరము వినయున కిచ్చెను. వినయుఁడు దాని నందుకొని చూచెను. కవరుపై నింగ్లీషు భాషలోఁ దన పేరు వ్రాయఁబడి యుండెను. లోపల నెట్టిచీటియును లేదు. కేవలమును కొన్ని రూపాయలు మాత్రముండెను.

తరువాత నా బాలకుఁడు వెడలిపోవఁ దలంచెను గాని వినయుఁ డాతనిఁ బోనీయక చేయి పట్టుకొని రెండవ యంతస్తు మీఁదికిఁ దీసికొనిపోయెను. ఆబాలకుని వన్నె నిరంగాతని సోదరికంటె నొకచాయ తక్కువ. కాని యాతని ముఖమున నామె పోలికలు కావలసినన్ని యున్నవి. ఆతనిఁ గాంచుటచే వినయుని హృదయము ప్రేమానందరసపరిపూర్ణమయ్యెను. ఆపిల్లవాఁడు మిక్కిలి ప్రతిభావంతుఁడు. ఆతఁడు గదిలో నున్న యొక చిత్రఫలకముం గాంచి "ఇది యెవ్వరి ప్రతిబింబము?" అని ప్రశ్నించెను.

విన—ఇది నామిత్రునిది.

బాలు—మిత్రునిదా? ఆతఁ డెవ్వరు?

విన—(నవ్వుచు) నీవాతని నెఱుంగవు. నామిత్రుఁడు గౌరమోహనుఁడు. ఆతనిని గోరా యని పిలుతురు. చిన్నతనమునుండియు నేను నాతఁడు నొక్కచోఁ జదువుకొంటిమి.

బాలు—ఇంకను జదువుకొనుచున్నారా?

విన—లేదు. ఇప్పుడు చదువు మానివైచితిమి.

బాలు—మీకు జదువంతయును బూర్తియైనదా?

వినయభూషణుఁడు తటాలున పిల్లవాని యెదుటనైనను దనగర్వమును బ్రకటించు నుత్సాహము నడఁచుకొనఁజాలక "ఔను. నాకుఁ జదువంతయును బూర్తియైనది" అనియెను. అప్పుడా బాలుఁడు విస్మితుఁడై యొక్క నిట్టూర్పు విడిచెను. అంత విద్యను దన కెప్పుడు పూర్తియగునో యని యాతఁడు భావించుకొనియుండును గాఁబోలు!

విన—అబ్బాయీ! నీపేరేమి?

బాలు—నాపేరు సతీశచంద్రముఖోపాధ్యాయుఁడు.

వినయుఁడు విస్మితుఁడై "ముఖోపాధ్యాయుఁడా" అని ప్రశ్నించెను.

క్రమముగా వినయుఁ డాబాలునిఁ బ్రశ్నించి పరేశచంద్రుఁడు వారి తండ్రి కాఁడనియు నాబాలకుని నాతనిసోదరిని జిన్నతనమునుండియు నాతఁడు పెంచుచుండెననియు బాలునిసోదరి పేరు రాధారాణి యనియు, పరేశునిసహధర్మిణి కోరికకు బదులుగా నామెకు "సుచరిత" యని నామకరణము గావించెననియుఁ దెలిసికొనియెను.

చూచుచుండఁగనే బాలుఁడగు సతీశునకు వినయునికడ మిక్కిలి చనవు కలిగెను. సతీశుఁడు. కొంతసేపైన తరువాత నింటికిఁ బోయెద ననియెను. వినయుఁడు "నీవొక్కఁడవును బోఁగలవా?" అని ప్రశ్నించెను.

సతీశుఁడు గర్వముతో "ఏమి! నేనొంటిగ నేపోఁగలను!" అనియెను.

వినయ—వలదు. నేనుగూడ వచ్చి నిన్నింటికిఁ బంపెదను.

తనసామర్థ్యమునుగూర్చి వినయుఁడు సంశయించుచుండె నని సతీశుఁ డభిమానపడి "నేనొంటిగఁ బోలేనా?" అని చెప్పుచుఁ దా నిదివఱకొంటిగాఁ బోయినసంగతులంగూర్చి యనేకవిస్మయకరంబులగు దృష్టాంతములను వక్కాణింపఁదొడంగెను. కాని, వినయుఁ డాబాలకునితోఁగూడ నాతనియింటిగుమ్మమువఱకును బోయెను. దానికిఁ గారణ మాబాలునకుఁ దెలియలేదు. అప్పుడు సతీశుఁడు "మీరు లోనికి రారా?" అని ప్రశ్నించెను.

వినయుఁడు తనమనశ్చాంచల్యము నంతయు నడంచుకొని "మఱియొకప్పుడు వచ్చెదను" అనియెను.

తరువాత వినయభూషణుఁ డింటికి వచ్చి తన పేరు వ్రాసినయాకవరను జేబులోనుండి వెలికిఁదీసి చాలసేపటివఱకును జూచికొనియెను. పిమ్మట నాతఁ డాకవరను రూపాయలతోఁగూడ నొక పెట్టెలో భద్రముగ దాఁచిపెట్టెను. ఆసొమ్మెట్టి యావశ్యకసమయమందైనను వ్యయపరుపఁగూడ దని యాతఁడు నిశ్చయించుకొనియెను.

౨

వర్షాసంధ్యాకాశము నతినిబిడముగ నంధకార మాక్రమించుకొనియెను. వర్ణహీనంబులును, వైచిత్ర్యహీనంబులు నగు మేఘముల నిశ్శబ్దశాసనమునకు లోఁబడి కలకత్తానగర మంతయుఁ బ్రకాండశునకముం బోలి గుండెలపై మొగ ముంచుకొని చుట్టుచుట్టుకొని పడియుండెను. సాయంకాలమునుండియును జినుకులు పడుచుండుటచే వీథులన్నియును బురదగా నుండెను. ఆబురదను దేల్చికొనిపోవునంతబలముగా వర్షించుట లేదు. అట్టిసమయమున—నిర్జనప్రవాహమధ్యమునం దుండుటకుఁ గాని వెలుపలకుఁ బోవుటకుఁగాని యుత్సాహము కలిగింపని యాసమయమున నిరువురుపురుషులు మేడమీఁదవయంతసుపైఁ గూర్చుండియుండిరి.

ఆమిత్రు లిరువురును జిన్నతనమునుండియు బడిలోనుండి వచ్చి యచ్చటనే కూర్చుండి పాటలాడుకొనుచుండెడివారు. పరీక్షకు ముందచ్చటనే బిగ్గఱఁగఁ బాఠములను జింతనసేయుచు నున్మత్తులవలెఁ బ్రచారముచేయుచుండెడివారు. బడినుండివచ్చి వేసవి కాలపురాత్రులలో నచ్చటనే భోజనముచేసెడివారు. అచ్చటనె రాత్రి రెండు గంటలవఱకును దర్కవితర్కములు చేసికొనుచు నిదురించి సూర్యకాంతులు మొగంబులపైఁ బడినతరువాత నదరిపడిలేచి లోనికిఁబోవుచుండెడివారు. కాలేజిచదువు ముగిసినతోడనే వారా మేడమీఁదనే హిందూహితైషిణీసభను నెలకొల్పి నెల కొకసారి మీటింగు చేయుచుండిరి. అందొకఁ డాసభకధ్యక్షుఁడు రెండవవాఁడు కార్యదర్శి.

కథానాయకుని పేరు గౌరమోహనుఁడు. ఆతనిమిత్రు లాతని గోరాయని పిలుచుచుందురు. ఆతఁ డందఱ ననాదరముగాఁ దిరస్కరించుచుండును. ఆతనిని గాలేజి పండితుఁడు రజతగిరి యని పిలుచుచుండెను. ఆతనిశరీరచ్ఛాయ కేవలమును దెల్లపు. ఆతఁడు సామాన్యముగ నాఱడుగుల పొడగుండును; జమిలియెముకవాఁడు. ఆతని ముష్టిబంధము వ్యాఘ్రముష్టివలె దృఢమైనది. కంఠస్వరము మోటుగను, గంభీరముగ నుండును. అకస్మికముగ విన్నచో నదటుకలిగించును. ఆతనివదన ముండఁగలసినదాని కంటెఁ బెద్దదియుఁ గఠినమైనదియు నైయుండెను. ఆతనిక్రిందిదౌడయు జుబుకమును దుర్గద్వారమునందలి దృఢార్గళమువలె నుండెను. ఆతనికన్నులపై భ్రూరేఖలు లేవనియే చెప్పవచ్చును. ఆతని యోష్ఠాధరములు సన్ననివై తప్పువడి యుండును. వానిపై నాసిక ఖడ్గమువలె వంగియుండును. కన్నులు చిన్నవియే కాని తీక్ష్ణములై యుండును. ఆతనిదృష్టి బాణమువలె నతిదూరమున నదృశ్యస్థానమునుగూడ లక్ష్యముచేసి క్షణములో వచ్చి సమీపవస్తువునందుఁగూడ విద్యుచ్ఛక్తివలె బ్రయోగింపఁగలదు. గౌరమోహనుఁడు మాపులకంత సుందరుఁడని చెప్పుట కవకాశములేదు. కాని యాతని జూడకుండ నున్నవారు లేరు. ఆతఁ డెల్లప్పుడు నందఱికన్నులఁ బడుచునే యుండును.

ఆతనిమిత్రుఁ డగు వినయభూషణుఁడు చదువుకొన్న గొప్పయింటి బంగాలీ బిడ్డవలెనే నమ్రస్వభావుఁడు. స్వభావసౌకుమార్యమును, కుశాగ్రబుద్ధియును గలసిన యాతని ముఖశ్రీ విశిష్టతేజముతో విరాజిల్లుచుండును. కాలేజితరగతులలో నాతఁ డెప్పుడును మొదటివాఁడుగనే యుండెను. గోరా యేవిధముచేతను నాతనితో సమానుఁడు కాఁజాలకుండెను. గోరాకుఁ జదువునందంతయాసక్తియును లేదు; అంతత్వరగాఁ దెలిసికొను బుద్ధిశక్తియును లేదు. వినయభూషణుఁడే తగినంత సాయము చేసి గౌరమోహనుని గాలేజి పరీక్షలలోఁ దనవెనువెంటనే యుత్తీర్ణుఁ డగునట్లు గావించెను.

గోరా—వినయా! వింటివా? అవినాశచంద్రుఁడు బ్రహ్మసమాజమును నిందించెను. దీనిబట్టి యాతఁడు స్థిరహృదయుఁడై స్వాభావికావస్థయందుండు నని తోఁచుచున్నది. ఏమి నీవంతగా బెంగను ముసుచుకొనుచున్నావు?

విన—ఎంతపని చేసెను; ఈసంబంధమున నింకను నెట్టిప్రశ్నలు వచ్చునో నే నూహింపఁజాలకున్నాను.

గోరా—అట్లయినచో నది నీమానసికదోషము! ఒకసమాజమువారు మనసమాజమును భేదించివైచుచుండఁగా మనము నిశ్చలభావముతోఁ బ్రవర్తింపవలయు ననుట స్వాభావికనియమము కాదు. మనసమాజమువారు వారితప్పులను దెలుపవలయును. వారు నేర్పుతోఁ జేయుపను లన్నియును మనకన్నులతో సామాన్యములుగాఁ జూపవలయును. వారిగొప్పతనము మనకంటెఁ దక్కువగా నుండునట్లు చేయవలయును.

ఇవియే మనసమాజమున నుచితకృత్యములు. పరసమాజబల మేవిధముగ క్షీణించునో యావిధముగఁ బనిచేయవలయును.

విన—ఇట్టి పనులు స్వాభావికముగా మంచి వని నేను చెప్పఁజాలను.

గోరా యించుక తీవ్రస్వరముతో "మనకు మంచిచెడ్డలతోఁ బనిలేదు. ఈపృథివియందుఁ గేవలము మంచివారే యిద్దఱుముగ్గు రుందురో కాని తక్కినవా రందఱును సాధారణులే. అట్లు గాకున్నచోఁ బనులు నడచుటయు, జీవితములు గడచుటయును గూడఁ గష్టమే. బ్రాహ్మసామాజికుఁడు తనగొప్పతనమును బ్రకటించుచుండఁగా నితరమతస్థుఁ డాతనిలోపముల నుగ్గడించినప్పు డాతఁ డాకష్టమును సహించియుండవలయును. వారు సంతోషముతోఁ గులుకుచుండఁగా విరుద్ధపక్షమువారుఁగూడ వారిని గీర్తించుచు వారివెనుకనే పోవుట యెన్నఁటికిని గలుగదు. అట్లు చేయవలయు ననుట లోకవిరుద్ధము.

విన—నేను సమాజమును నిందించుటలేదు- వ్యక్తులను గూర్చి—

గోరా—ఇఁక సమాజనింద యనిన నెట్టిది? మతామతవిచారము చేయుటయే సమాజకార్యము. వ్యక్తులమూలముననే సమాజమైనది. ఆహా! ఎంతయోగ్యుఁడవు! అట్లయినచో నీవుమాత్రము నిందనీయుఁడవు గావా?

విన—కావచ్చును. కాని నేనందుకొఱకు సిగ్గుపడుచుందును.

గోరా వినయుని కుడిచేతి మణిబంధమును గట్టిగఁ బట్టుకొని "వినయా! ఇన్ని మాటలేల? ఇఁక నీపని జరుగదు. ఎంతమాత్రమును జరుగదు" అనియెను.

వినయుఁ డొకనిమిష మూరకుండి "ఏమి? ఏమిజరిగినది? నీ కాధయ మేల?" అనియెను.

గోరా—నీహృదయము దుర్బలమైపోయినట్లు నాకు స్పష్టముగాఁ దెలియుచున్నది!

వినయుఁ డించుక యుత్తేజితుఁడై "దుర్బలమా? ఏమి! నాకిష్టమే యున్నచో నేనిప్పుడే వారియింటికిఁ బోఁగలను. వారుగూడ నన్నుఁ బిల్చియే యున్నారు. కాని నేను పోవుట లేదు" అనియెను.

గోరా—వెళ్లలేదు కాని యామాటమాత్రము మఱచిపోవుట లేదు. వెళ్లలేనుగదా యని రేయుంబవలు భావించుచునే యున్నావు. అట్లు చింతించుటకంటె వెళ్ళుటయే మంచిది కాదా?

విన—అట్లయినచో నీవు నన్ను వెళ్లుమనియే చెప్పుచుంటివా?

గోరా వ్రేళ్లను దొడలపైఁ జఱచుకొనుచు "లేదు—నేను వెళ్లుమనుటలేదు. కాని వెళ్లునప్పుడు నీయంతట నీవే యెవ్వరికిని దెలుపకుండఁ బరుగెత్తిపోయెదవనిమాత్రము నేను వ్రాసి యియ్యఁగలను. తరువాత దినమునుండి యు నాయింటనే యుండి యచ్చట

భోజనమునకుఁ బ్రారంభించెదవు. క్రమముగా బ్రాహ్మసమాజపుపట్టీలోఁ జేరవ్రాయించుకొని యొక్కసారిగా దిగ్విజయప్రచారకుఁడ వయ్యెదవు!" అనియెను.

విన—ఏమనుచున్నావు ? తరువాత ?

గోరా—తరువాత నేమున్నది ? చచ్చినను గౌరవము లేదుగదా ! బ్రాహ్మణకులమునఁ బుట్టి జంతువుంబోలి చావవలయును. నీయాచారవ్యవహారము లన్నియుఁ బోవును. దిక్ప్రదర్శనయంత్రము లేని యోడవలె నీకు దిక్కు తెలియకుండఁబోవును. అప్పుడు నీకు నౌక యొడ్డునకుఁ జేరుటయే కుసంస్కార మనియు సముద్రమధ్యమునఁ గేవలమును దేలిపోవుటయే స్వభావగమనమనియును దోఁచును. కాని నాకీవిషయమునఁ బూర్ణముగాఁ దెలుపుటకు ధైర్యము చాలదు. ఇంతయేఁ? నీవు వెళ్లుము. అధఃపతనమున కభిముఖుఁడవై నిలిచియుండి మమ్మికయేల భయపెట్టెదవు?

వినయుఁడు మందహాసము చేయుచు "వైద్యుఁడాశ వదలుకొన్నచోటుల నెల్ల రోగి మరణించుటగలుగదు. ఇప్పుడంతటి వినాశకాలసూచన లేవియు నగపడుటలేదు" అనియెను.

గోరా—లేదా ?

విన—లేదు.

గోరా—నాడి చెదరిపోవుట లేదా ?

విన—లేదు. దివ్యముగా నున్నది.

గోరా—స్త్రీహస్తముచే స్పృశింపఁబడినంతమాత్రమున మ్లేచ్ఛాన్నము దేవతానివేదనమున కర్హము కానేరదని నీమనసునకుఁ దోఁచుట లేదా ?

వినయుఁడు విరక్తిభావముతో "గోరా! ఇఁకఁ జాలింపుము. ఊరకుండుము!" అనియెను.

గోరా—నామాటలోఁ దప్పేమున్నది ? స్త్రీహస్త మెందకన్న అంగనిది కాదు. పురుషకరస్పర్శము చేసిన యాపవిత్రకరపల్లవము పేరెత్తుటయే నీకుఁ గష్టముగా నున్నది.

విన—గోరా! నాకు స్త్రీజాతియందు భక్తిగలదు. మనశాస్త్రములును—

గోరా—స్త్రీజాతి నెట్లు భజింపవలయునో యాశాస్త్రములే చెప్పుచున్నవిగాదా! అది భక్తిగాదు—అట్లన్నచో నెంగముపై నుమియుదురు.

విన—నీవు కేవలమును మొండివాదము చేయుచున్నావే !

గోరా—స్త్రీలనుగురించి "పూజార్హా గృహదీప్తయః" అని శాస్త్రములు చెప్పుచున్నమాట నిజమే-ఏమనిన-వారు గృహమును బ్రకాశింపఁజేయువారు గావున—పురుషులహృదయములను బ్రకాశింపఁజేయుదురు గావున వారు పూజార్హలని చెప్పు పాశ్చాత్యసాంప్రదాయము కేవలము నింద్యమైనది.

వినయ—అక్కడక్కడ లోపము లగపడినంత మాత్రమున సత్పద్ధతుల నీవిధముగా విమర్శింపవచ్చునా ?

గోరా—(తెల్లపోయి) వినయా ! నీకాలోచనాశక్తి శూన్యమైపోయినది. అందుచేతనే నామాట తలకెక్కకున్నది. విదేశసాంప్రదాయమున స్త్రీలనుగూర్చి చెప్పిన యత్యుక్తులన్నియును కేవలమోహపూర్ణములైనవి. దివ్యమగు దినమున గృహిణీపీఠము నలంకరించియున్న శ్రీగౌరీసరస్వతులుమాత్రమే పూజార్హలు. ఆ మెట్టుదిగి యీవలకు వచ్చినతరువాత స్త్రీలనుగురించి కావించు స్తుతిభాషణము లన్నియు దూషణములే కాని వేఱుకావు. ఎందుచేత నీమనసు పక్షివలె నెగిరిపోయి పరేశబాబుగృహము చుట్టును దిరుగుచున్నదో, యాభావమునే యింగ్లీషుభాషలో "లవ్" అని చెప్పుదురు—దానినే యింగ్లీషువారు ప్రపంచమునందలి పరమపురుషార్థముగా భావించుచుందురు. నీవట్టి చిక్కులలోఁ బడకుందువుగాక !

వినయుండు చబుకుదెబ్బ దిన్న క్రొత్తగుఱ్ఱమువలె నెగసిపడి "గోరా ! ఇంకఁ జాలింపుము. శ్రుతి మించిపోవుచున్నది !" అనియెను.

గోరా—మించుట కేమున్నది ? ఏమియును లేదు. స్త్రీపురుషులపరస్పరసంబంధము మనోవికారమునకుఁ గారణమని మన మెన్నియింగ్లీషుపుస్తకములలోఁ జదువలేదు !

వినయ—ఓహో ! బాగుగ నీ గ్రహించితివి. స్త్రీపురుషసంబంధ మెట్లుండవలయునో యట్లుండనీయక మోహావేశముచే నియమోల్లంఘనము చేసినచో నదియనర్థదాయకమే యగును. ఈయపరాధ మొక్క విదేశీయులదిమాత్రమేనా ? ఈసంబంధమున నింగ్లీషువారికవిత్వము మిథ్యయైనచోఁ గామినీకాంచనములఁ బరిత్యజించుటయే సర్వవిధముల శ్రేయోదాయక మని చెప్పినమనవారికవిత్వమును మిథ్యయే! మానవహృదయములు కాంతాకనకములయెడల మోహాంధములైపోవుట స్వభావము. అందుచేతనే నీతిబోధకులగు కొందఱుకవులు స్త్రీలయందలి సౌందర్యాంశమునుమాత్రమే సముజ్జ్వలముగ వర్ణించి మోహమును నిందించియున్నారు. మఱికొందఱుకవులు మోహప్రపూర్ణములగు కామినీకాంచనములు కేవలము పరిత్యాజ్యము లనియే విధించియున్నారు. ఈరెండును నిరుదెఱఁగులకు భిన్నప్రకృతుల భిన్నపద్ధతులు. ఇందొకదానిని మాత్ర మామోదించి రెండవదానిని దిరస్కరించుట సమంజసము కాదు.

గోరా—కాదు నీవు పొరపాటు పడుచున్నావు. నీయవస్థ యింతవఱకు మారిపోయినది. అంతటివేదాంతము నీతలలో నున్నప్పుడు నీవు నిర్భయముగా "లవ్" చేయవచ్చును. కాని సమయము వచ్చినప్పు డట్టిభావము నడంపుటకును సామర్థ్యముండవలయును. ఇదియే మనసామాజికనియమము.

విన— (వ్యగ్రహృదయముతో) గోరా! నీకు మతిపోవుచున్నదా! ఇంకను నాకు "లవ్" అనిరాదవేమి? కాని నేనొక్కమాట యంగీకరించెదను. నేను పరేశబాబునుజూచి యాతనింగతి దెలిసికొన్నప్పటినుండియు నాకు వారియందు గౌరవము కలిగినది. అందుచేతనే వారిజీవితచరిత్రమును దెలిసికొనవలయునని నాకుఁ గోరిక కలుగుచున్నది.

గోరా— మంచిమాటయే. అట్టికోరికలనే యడంచుకొనవలయును. నీవెంత ప్రయత్నించినను వారిజీవితచరిత్రమునందొక్క యధ్యాయమునైనను గ్రహింపజాలవు. వారు కేవలమును బ్రాహ్మణపరులు. నీవు వారిసిద్ధాంతములనుగూర్చి చర్చించుటకుఁ గడంగితివేని నీకుఁ దుదకు వారి యనుజ్ఞాపత్రము లేకుండ దర్శనము చేయుటకుఁ గూడ నవకాశము లేకుండఁబోవును.

విన— నీయందున్న గొప్పదోషమే యిది. పరమేశ్వరుఁడు సర్వశక్తులను నీకొక్కనికే ప్రసాదించెననియు, దక్కిన మానవులందఱును కేవలము దుర్బలులనియు నీయభిప్రాయము!

గోరా కీమాట కొంత తగఁ దోఁచెను. అందుచే నాతఁడుత్సాహముతో వినయుని వెన్నపైఁ జఱచుచు "మిత్రమా! సరిగాఁ జెప్పితివి! ఇదియే నాయందున్న దోషము!" అనియెను.

విన— కాదు. నీబుద్ధియందింతకంటెను మఱియొకదోషమున్నది. పరులనెల్లప్పుడును దిరస్కరించుచుండుటయే కాని వారియందలి మంచితనమును గ్రహించు నుద్దేశము నీకెంతమాత్రమును లేనేలేదు.

వారిట్లు సంభాషించుకొనుచుండఁగా గోరాసవతియన్నయగు మహిముఁడు లంబశరీరము కలవాఁడగుటచే వగర్చుకొనుచు మేడమీఁదికెక్కి వచ్చి "గోరా!" అని పిలిచెను. గోరా తత్తరముతో లేచి నిలువఁబడి "ఏమి సెలవు?" అనియెను.

మహి— విశేషములేమి? వర్షాకాలమేఘము లన్నియు మనమేడమీఁద యలముకొని గర్జించుచున్నట్లగపడుచున్నది. ఇంగ్లీషు తోసికొని భారతసముద్రమువఱకు మన సముద్రము దాఁటితివా? ఇంగ్లీషువారు లోపములేదు; కాని క్రిందిగదిలోఁ దలనొప్పితోఁ బడియున్న మీవదినెకు నీసింహనాదము దుస్సహముగా నున్నది.

అని చెప్పి యాతఁడు దిగిపోయెను.

3

గోరాయును వినయుఁడును మేడదిగుట కుపక్రమించుచుండఁగా గోరాతల్లి పైకి వచ్చెను. తోడనే వినయుఁడామెకుఁ బ్రణామంబు చేసి యామె పాదధూళిని శిరంబునఁదాల్చెను. గోరాతల్లి యగు నానందమయిని జూచినచో నామె గోరాతల్లి యని యెవ్వరు ననుకొనరు. ఆమె సన్నముగాఁ బలుచగా సమున్నతముగా నుండును.

ఆమె కుంతలము లందందు నెరసియున్నను పైకిమాత్రము స్పష్టముగా నగపడుటలేదు. ఆకస్మికముగఁ జూచినచో నామె నలుబదియేండ్లకు లోఁబడినవయసుగలదానివలె నగపడును. ఆమె వదనమండల మతిసుకుమారమైనది. నాసికయు, నోష్ఠాధరములును చుబుకమును, లలాటమును దిద్ది తీర్చినట్లుండును. ఆమెయంగంబునఁ దేజోమయంబగు బుద్ధి ! యెప్పుడును దాండవించుచుండును. ఆమె శ్యామలాంగి. గోరాశరీరచ్ఛాయతో నామెను బోల్చుట కెంతమాత్రము నవకాశములేదు. ఆమెను జూచినంతమాత్రముననే యొకవిధమగుశాంతి కలుగును. ఆమె లంగాయును, గమీజును ధరించును. మనకథాకాలమునాఁటి కప్పటినవనాగరికయువతు లందం దట్టిదుస్తులను ధరించుటయున్నదిగాని చాలమందియిల్లాం డ్రట్టివారిని కిరస్తానీలని నిందించుచుండిరి. ఆనందమయిభర్త కృష్ణదయాళుఁడు కమీషనరుపని చేసెను. చిన్నతనమునందే యామె యాతనితోఁగలసి పశ్చిమదేశ మంతయును దిరిగివచ్చెను. అందుచేత నే యామె కట్టిదుస్తులనుధరించుట కెట్టిసంశయమును లేకుండఁబోయెను. సామాన్యగృహిణివలె నామె యింటిపనులను జేయుచు, బంధువులతో భాషించుచుఁ, బొరుగిండ్లకుఁ బోవుచు నీవిధముగాఁ బ్రొద్దుపుచ్చుకొను స్వభావము కలదికాదు.

ఆమె మేడమీఁదికివచ్చి "గోరా! నీకేకలు క్రిందికిఁగూడ వినఁబడునట్టి యుత్సాహపూరితములై యుండుటచే వినయుఁడు వచ్చియుండునని నేనప్పుడేయనుకొంటిని. చాలదినములనుండి యిల్లంతయు నిశ్శబ్దముగా నున్నది. ఏమిబాబూ ! వినయా ! వచ్చుటలేదేమి ! ఆరోగ్యముగ లేదుగద ?" అనియెను.

విన—లేదమ్మా ! వర్షాకాలముగదా !

గోరా—అమ్మా ! వింటివా యీతనిప్రత్యుత్తరము ! ఈవర్షాకాలము పోయినచో నెండకాలము వచ్చెననును ! ఊరక దేవతలపై దోషారోపణము చేసినను వారు ప్రత్యుత్తరము చెప్పరుగదా ! మనసులోనియుద్దేశ మాయంతర్యామి యొక్కఁడే తెలిసికొనఁగలఁడు.

విన—గోరా ! నీమాటల కర్థములేదు.

ఆనం—వినయా ! ఆమాట నిజమే బాబూ ! నేనందుకొఱకుఁ జెప్పుటలేదు. మానవహృదయము లొకప్పుడునిర్మలములుగను,మఱియొకప్పుడు కళంకితములుగను నుండును. కాని యెల్లప్పుడు నేకరీతిగానుండవు. ఈవిషయమునుగూర్చి చెప్పవలసివచ్చినచో నాతరమా యున్నది. వత్సా! రమ్మా! లోనికిరమ్మా! తినుట కేమైనఁ బెట్టెదనురమ్మా!

గోరా తీవ్రముగఁ దల నడ్డముగఁ ద్రిప్పుచు "వలదు! వలదు ! అట్లెన్నటికిని జరుగదు ! వినయుని నీయింటిలో నేమియును దిననీయను" అనియెను.

ఆనం—ఔను బాబూ! నిన్ను నేను దినుమని చెప్పలేదు. నీతండ్రి శిష్టాచారసంపన్నుఁడు! స్వయముగ వండుకొనిగాని భుజింపఁడు! వినయుఁడు నాప్రియకుమా

రుఁడు. అతఁడు నీవలె దుడుకువాఁడు కాఁడు. కేవలము నీవే యాతని బలవంతముగ నిరోధించుచున్నావు.

గోరా—ఆమాట నిజమే. ఆక్రిష్టియను దాసిని దొలగించుకొనుదనుక నీయింట భుజించుట జరుగదు.

అనం—గోరా! నీవంతమాట యనకుము! చాలకాలమునుండి నీవామెచేతి యన్నము తినుచున్నావు. చిన్నప్పటినుండియు నిన్నామెయే పెంచినది. ఆమెచేసిన పచ్చడియే గాని నీకు రుచిగా నుండదు. చిన్నతనమున నీవు స్ఫోటకపడినప్పు డామె నీకుఁ జేసినయుపచారమును నేను నాజీవితములో మఱచిపోఁగలనా?

గోరా—ఆవిశ్వాసము కలదేని నీవామెకు కూరక జీతము నిమ్ము, భూమిఁగొని పెట్టుము; ఇల్లుకట్టించి పెట్టుము; నీయిష్టమువచ్చిన యుపకారము చేయుము. అంతేకాని దాని నింటియందుంచుకొనుట మర్యాద కాదమ్మా!

అనం—గోరా! కావలసినంత ధన మిచ్చివైచినచో ఋణము తీరిపోవు ననుకొనుచున్నావు కాఁబోలును! దానికి భూమి లక్కఱలేదు; ఇల్లక్కఱలేదు; నిన్నొక్క నిమిషము చూడకున్నచో నది బ్రతుకఁగలదా?

గోరా—సరే. అట్లయినచో నీవామె నే యుంచుకొనుము. కాని వినయుఁడు మాత్రము నీయింట భుజింపఁడు. నియమమును పాలింపవలయును అమ్మా! నీవంతటి శిష్టవంశమున జన్మించితివిగదా—ఆచారమును పాటింపనక్కఱలేదా?

అనం—బాబూ! ఈ మీయమ్మ యొకప్పు డాచారమును పాలించినదే! అందు కొఱ కప్పుడెందఱికో కన్నుల నీరునిండినది. అప్పుడు నీవెక్కడనున్నావు? ప్రతిదినమును శివాలయమునకుఁ బోయి పూజచేయుచుఁ గూర్చుండి మీతండ్రి వచ్చి పిలిచినను నెంత సేపటికిని వచ్చెడిదానను గాను. అపరిచితుఁడగు బ్రాహ్మణుఁ జేతియన్నమునైనను దినుటకు సందేహించెడిదానను. ఆకాలమున నిప్పటివలె రైలు చాలదూరము వఱకును లేదు. అప్పుడు బండ్లమీఁదను, పల్లకులమీఁదను గొన్నిదినములు తిండిలేకుండఁ బ్రయాణము చేయవలసివచ్చెడిది. మీతండ్రిగా రెంతప్రయత్నించినను నా యాచారమును మాన్పింపఁజాలకపోయిరి. భార్యనగు నన్నుఁ గూడ వెంటఁబెట్టుకొని యాయన తనయుద్యోగపు గ్రామములు తిరుగుచుండుటచేఁ బెద్దయుద్యోగులగు దొరలాయనను బొగడుచు నధికారములు జీతమునుగూడ వృద్ధిఁ జేయుచుండిరి. ఆగౌరవముకలననే మాకుఁ దరుచుగా నొకచోటనుండి యొకచోటికి మారుట యుండెడిది కాదు. ఇప్పుడాయన పెద్దవాఁడై యుద్యోగమును వదలుకొని కావలసినంత ధనము సంపాదించి యాకస్మికపరివర్తనముం గాంచి శిష్టాచారసంపన్నుఁడయ్యెను కాని, నాకు మాత్ర మట్టిభాగ్యము కలిగినది కాదు. నాసప్తపురుషాంతరసంస్కారము లన్నియుఁ గ్రమముగా నిర్మూలములైపోయినవి. అవి యిఁక నెంత ప్రయత్నించినను లభించునా?

గోరా—నీపూర్వపురుషులమాట యటుంచుము. వారిప్పుడు నిన్నేమైన బోధింతురా! కాని నీవు మేము గౌరవించు దక్షుల నవలంబింపవలయును. నీకు శాస్త్రమునందు గౌరవము లేకపోయినను క్రియయం దభిమాన ముండఁగూడదా?

ఆనం—ఓరీ! నీవింతగా నాకు బోధింపనక్కఱలేదు. నాహృదయము నే నెఱుంగుదును. నాస్వామి, నాపుత్రుఁడు, నన్నుఁ దమస్వత్వముగాఁ జేసికొని నాపాదములకు సంకెలల వైచినప్పుడింకను నాకు సుఖమెక్కడిది? నిన్నెప్పుడు నాయుత్సంగమునఁ జేర్చుకొంటినో యప్పుడే నాయాచార మంతయుఁ గొట్టుకొనిపోయినది. చంటిబిడ్డను వక్షమునం జేర్చుకొను నానందము నెఱింగి యింకను గులాచారములఁ గ్రమములఁ బాలింపగలవా రీపృథివియం దెవ్వరును జన్మించియుండలేదు. ఆయానందమును గ్రహించినప్పుడే నేనిట్లు నిశ్చయించుకొంటిని. ఇప్పుడు నేనెవ్వరినైనఁ గ్రిష్టియనులనిగాని, హీనకులులనిగాని నిందించినచోఁ బరమేశ్వరుఁడు నాకును నీకును నెడఁబాటు ఘటిల్లఁజేయునేమోయని భయపడుచుందును. కుమారా! నీవు నాయొడిని నిండించి నాగృహంబును బ్రకాశింపఁజేయుచు నుంటివి! నేనీప్రపంచమునందలి యెల్లజాతుల చేతినీళ్ళను ద్రాగెదను.

అప్పటియానందమయిమాటలకు వినయునిహృదయమునం దేదియో యస్పష్టముగ నొకశోకచ్ఛాయ సోఁకెను. అప్పుడాతఁ డొక్కసారిగా నానందమయిఁ గను గౌరమోహనునివంకను దిలకించెను. తోడనే యాతనిసంశయము దూరమై పోయెను.

గోరా—అమ్మా! నీమాటలంతయు క్రియాయుక్తములుగా లేవు. శాస్త్రగౌరవము గలిగి యాచారమును బాటించువారి యిండ్లయందుఁ గూడ బిడ్డలు జీవించుచునే యున్నారు. అట్టిచో నీశ్వరుఁడు కేవలము నీవిషయమునమాత్రమే క్రొత్తచట్టము నుపయోగించు ననుబుద్ధి నీకెట్లు కలిగినది?

ఆనం—బాబూ! ఎవ్వఁడు నిన్ను నాకొసంగెనో యాతఁడే నాకిట్టిబుద్ధిని గూడఁ బ్రసాదించినాఁడు. ఆసంగతి నేనేమని చెప్పుదును! ఈవిషయమున నాస్వాతంత్ర్యమేమియును లేదు. కాని, వెఱ్ఱివాఁడా! నీ వెఱ్ఱితనమును జూచి నవ్వవలయునో యేడువవలయునో నాకే బోధపడకున్నది. సరే. ఆమాటలకేమి! వినయుఁడు నాయింటిలో భుజింపఁడు గాఁడా?

గోరా—అమ్మా! ఒక్కసారి కక్కుర్తిపడినచోఁ బదిసారులుపడవలసివచ్చును. అది నాకిష్టములేదు. అతనిది శుద్ధబ్రాహ్మణకుటుంబము. అతఁ డొకటిరెండుమంచి మాటలకుఁ బొరపాటుపడఁగూడదు. అతఁడెన్నింటినో వదలుకొనవలయును; ప్రవృత్తుల నడఁగించుకొనవలయును; జన్మగౌరవమును నిలుపుకొనవలయును; తల్లీ! కోపపడకుము! నీపాదధూళిని గైకొందును!

ఆనం — ఏమంటివి? నాకుఁ గోపమా? నీవు చేయుపని యేదియును జ్ఞానముతోఁ జేయుటలేదని చెప్పుచున్నాను. నేను నిన్ను, పెంచి పెద్దవానిని జేసితిని. ఏమైన నేమి- నీమతమునందు నాకెంతమాత్రమును గౌరవము లేదు. అదియే నాకుఁ గష్టముగా నున్నది. పోనిమ్ము. నీవు నాయింటిలో నుండి నాచేతులతో విహారింపకపోయినను నీవు ప్రతిదినమును ప్రాతస్స్నానము కాలఁగు వచ్చి నాకన్నులఁబడుచున్నచో నదియే నాకుఁ బరమానందము. వినయా! అట్లు బిక్కమొగము పెట్టుకొని యుంటివేమి బాబూ! నీ మనసు మిగుల మెత్తనిది. నాకుఁ గష్టముగా నున్నదనుకొంటివి కాఁబోలును? లేదు నాయనా! మఱియెప్పుడెప్పుడైన నిన్నుఁ బిలచి మంచి బ్రాహ్మణునిచేత నే వంట చేయించి పెట్టెదను లెమ్ము! నీవు మఱి యిఁకలా గనుకొనవలదు. నేనుమాత్రము మాలక్ష్మిదాని చేతియన్నమునే తినెదను.

అని చెప్పి యామె క్రిందికి దిగిపోయెను. వినయుఁడు కొంతసేపటివఱకు మౌనముతో నిలువఁబడి పిదప మెల్లమెల్లగా "గోరా! నీవెఱ్ఱి చాలవఱకు ముదిరిపోయినది." అనియెను.

గోరా — అణుమాత్రమైనను లేదు. ఎవ్వరిమతమును వారు నిలుపుకొనుటకుఁ బ్రయత్నించుచుందురు లోపమున కేమాత్రమును సందేహించినను క్రమముగ నంతయును జెడిపోవును.

విన — ఆహా! ఏమి తల్లి!!

గోరా — ఆసంగతి నీవు బోధింపనక్కఱలేదు. నాకును దెలియును! నాతల్లివంటి తల్లి యెవ్వరికిని లేదు. కాని యాచారమును పాలింపనప్పుడు తల్లినైనను నేనొక్కనాఁటికి గౌరవింపను. చూచుచుంటివా వినయా! నీకొక్కటేమాట చెప్పుచున్నాను. మనసు నందుమఱి నుము. హృదయమత్యుత్తమమైనదే కాని సర్వోత్తమమైనది మాత్రము కాదు.

విన — గోరా! ఇప్పటి యమ్మమాటలవలన నామనసున కేమో తల్లడముగా నున్నది. ఆమె తనమనసులోని యుద్దేశమును మనకుఁ దెలుపఁజాలనందులకుఁ జింతిల్లుచున్నట్లగపడుచున్నది.

గోరా యించుకయధీరుఁడై "వినయా! అంతదూరముగా నాలోచింపవలదు. అందువలన వృథా కాలహరణమే గాని లాభము లేదు" అనియెను.

విన — గోరా! నీవిప్రపంచమునందలి యెట్టి యుత్తమవస్తువునైనను మంచి కంటితోఁ జూడఁజాలవు. ఇంతేకాక కల్పనాబలముచే నీవు చూడని వస్తువును గూడఁ దిరస్కరించుచునే యుందువు. అమ్మ యెందుచేతనో గాని వ్యస్తహృదయయైనట్లున్నది. ఆమె కేదియో గృహసంబంధమగు చింత యుండి యుండును. గోరా! నీవామె చెప్పిన మాట వినఁగూడదా?

గోరా — వినవలసినంతవఱకు వినియే యుంటిని. ఇంకను వినఁదలఁచినచో, పెద్ద మాటలుకూడ వినవలసివచ్చునని యాప్రయత్నము మానుకొంటిని.

## ౪

మతప్రసిద్ధమగు నొకయుపదేశము నెంతతీవ్రముగ విందుమో యంతతీవ్రముగ దానిని మానవులయెడలఁ బ్రయోగించుపట్టున నెల్లసమయములందును ధైర్యమును వహింపఁజాలము. విశేషించి వినయునికడ నట్టిధైర్యములేదు. వినయుని హృదయ ప్రవృత్తి యతిప్రబలమైనది. అందుచేతనే యాతఁడు మతచర్చ చేయుపట్టున మతమే సర్వోత్తమమైనదని భావించుచుండును. కాని వ్యవహారసమయములయందు మానవులనంతకంటెను విశేషముగ గౌరవింపకుండ నుండఁజాలఁడు. గోరాచేఁ బ్రచారితములగు మతపద్ధతులలో నెన్నిటిని వినయుఁడు మతమునందలి గౌరవముచేఁ బ్రేమించుచుండెనో, యెన్నిటిని గోరాయందలి ప్రీతిచే గౌరవించుచుండెనో చెప్పుటకష్టము.

ఆవరాకాలసంధ్యాసమయమున వినయుఁడు గోరా యిలువిడచి పంకిలమగుమార్గమున మెల్లఁగా దనయింటికిఁ బోవుచుండెను. అప్పుడాతనిహృదయమున మతము, మానవుఁడు ననురెండువిషయములను గూర్చి చర్చజరుగుచుండెను. కాలము ననుసరించి ప్రకాశముగనో, గూఢముగనో తటస్థించుచుండు నానావిధములగు నాఘాతములనుండి సమాజమునురక్షింపఁ దలంచినచో, నాహారవిహారవిషయములందుసయితము విశేషించి జాగ్రత్తగా నుండవలయునని గోరా వినయునకు బోధించియుండెను. వినయుఁడు దాని నతిసులభముగనే గ్రహించెను. ఆయుపదేశమునకు విరుద్ధముగా నున్నవారితో గోరా యతితీవ్రముగ వాదించియుండెను. శత్రువులు కోటనలుదిసల ముట్టడించినప్పు డాత్మసంరక్షణమునకై కోటయందలి ప్రత్యేకమార్గములను, సందులను, ద్వారములను, గిటికీలను, రంధ్రములను బంధించి యుంచుట యౌదార్యమునకు లోపము కాదనియు నాతఁ డుపదేశించి యుండెను. కాని నేఁడు తల్లియగు నానందమయియింట భుజించుటకు గోరా యడ్డగించుట వినయునకు హృదయాఘాతమై యాంతరికవేదనను గలిగించుచుండెను.

పాపము వినయునకుఁ దండ్రి లేఁడు; తల్లి చిన్నతనమునందే మరణించినది; పినతండ్రిమాత్రము స్వదేశమునం దుండెను. వినయుఁడు చిన్నతనమునుండియుఁ గలకత్తాయందే యొంటరిగా నుండి చదువుకొని పెద్దవాఁడయ్యెను. గోరాతో స్నేహము కలిగినప్పుడే యాతని కానందమయివాత్సల్యము లభించినది. అప్పటినుండియు వినయుఁడామె నమ్మాయని పిలుచుచుండెను. వినయుఁడు తఱచుగా నానందమయియింటికిఁ బోవుచు నామెయొద్దనుండి తనకుఁ గావలసిన వన్నియును బలవంతముగఁ దీసికొని తినుచుండెడివాఁడు; ఆమె తనకును గోరాకును వడ్డించుసమయమున "నీవు పక్షపాతముచేయుచున్నావు" అని యామెపైఁ గృత్రిమకోపమును జూపుచుండెడివాఁడు. తానొకటి రెండుదినములు రాకుండినచో నానందమయి తనకొఱ కెంతయాత్రపడుచుండెడిదో, వచ్చినప్పుడు చెంతఁగూరుచుండి తనకు భోజనము పెట్టుట కామె యెంత వేడుక

పడుచుండెడిదో, సభ ముగించి యెప్పుడు వచ్చునా యని యామె తనకొఱకెట్లు నిరీక్షించుచుండెడిదో వినయునకు బాగుగఁ దెలియును. అట్టివినయుఁ డిప్పుడు సామాజిక నియమముల ననుసరించి తనయింట భుజింపకుండుట యానందమయి సహింపఁగలదా? వినయుఁడు మాత్రము సహింపఁగలఁడా?

"ఇంతటినుండి నీకు మంచి బ్రాహ్మణునిచే వండించి పెట్టెదను. ఇఁక నెన్నఁడును నా చేతియన్నమును బెట్టను లెమ్ము!" అని నవ్వుమొగముతోఁ దల్లి చెప్పినది. కాని యాపలుకు హృదయశల్యము గదా! ఈమాటనే వినయుఁడు సారెసారెకు మనంబున భావించుకొనుచు నిల్లు చేరుకొనియెను.

ఆశూన్యమందిర మంధకారమయమై యుండెను. నలుదెసలఁ గాగితములును, బుస్తకములును గత్తరగాఁ బడియుండెను. వినయుఁ డగ్గిపుల్లతో దీపమును వెలిఁగించెను. అతని వ్రాఁతబల్లపైఁ గప్పఁబడిన తెల్లనిబట్టపై నంతటఁ జమురుడాగులు పడియుండెను. ఆయింటిలో నాతనిప్రాణములు కొట్టుకొనపోవుచుండెను. మానవసంఘమును, స్నేహభావము నను నిమయము లిప్పు డాతనిహృదయమున ముద్రితములై యుండెను. దేశోద్ధరణము సమాజరక్షణము నను సమస్తకర్తవ్యములు నేచుతమునందును, స్వప్నముగను, సత్యముగను, నాతని కగపడుటలేదు. ఒకనాఁటి శ్రావణనిర్మలప్రభాత సమయమునఁ బంజరముకడకు వచ్చి మరల నాపంజరమునుండి వెడలిపోయిన యాచిలుకయే యాతనికిఁ బ్రత్యక్షసత్యముగాఁ గానవచ్చుచుండెను. ఆయజ్ఞాతవిహంగినిం గూర్చి యాతనిహృదయమునం దింకను నిట్టియాలోచనయుఁ బుట్టలేదు. కాని యింతకు ముందే గోరా తన్నుఁ బ్రవేశింపకుండఁ జేసిన యాకంపము మందిరప్రతిబింబమే యాతనిహృదయమునం దంకితమై యుండెను.

ఆగది యందలి చలువరాతినేల మిలమిల మెఱయుచుండెను. ఒక సోఫాపై రాయంచ ఱెక్కంబోలి తెల్లని మెత్తని పాన్పు పఱుపఁబడియుండెను. దానిప్రక్కనున్న చిన్నబల్లపై దీపమింకను వెలుఁగుచునే యుండెను. ఆదీపమునొద్ద నిజముగా నానందమయి వన్నెవన్నెలదారములను గైకొని యొకకంబళిపైఁ జిత్రశిల్పమును గావించుచుండెను. దాసి లక్ష్మి క్రింద నొకపీటపైఁ గూర్చుండి యొక్కటే ధోరణిగా నేమేమియో మాటలాడుచుండెను. చాలవఱ కానంద యామాటలను వినుచుండుటయే లేదు-తల్లియగు నాయానందమయి మనసెపుఁ గష్టముగా నున్నప్పుడెల్ల కుట్టుపనిలో మగ్నయగుచుండును. అట్టిపనిలో నిమగ్నయై యున్న యామె ప్రశాంతవదనమండలమే యిప్పుడు వినయుని మనోనయనములకు గోచరించుచుండెను. అప్పు డాతఁడు తనలో "ఈవదనమునందలి ప్రేమతేజమే నామనోవైకల్యమును బాఱఁద్రోలి నన్ను రక్షించుఁగాక! ఈపవిత్రముఖమండలమే నామాతృభూమి ప్రతిమాస్వరూపమగుఁగాక! ఇదియే నాయఁ గర్తవ్య కార్యప్రేరకమగుఁగాక! ఇదియే నన్ను స్వధర్మనిరతునిం గావించుఁగాక!"

2

అని యనుకొనుచు మనసునందే యామెంగూర్చి యొకసారి "అమ్మా!" యని పిలిచి "అమ్మా! నీయున్నదియు నామ్మతముకాకని యెట్టిశాస్త్రములు సప్రమాణముగ నిరూపించినను నేను విశ్వసింపను" అనియెను.

నిశ్శబ్దముగనున్న వినయుని గృహమునందలి పెద్దగడియారము టిక్కు టిక్కు మనుచు నేయుండెను. ఆయింట నుండుట యాతనికి దుస్సహమయ్యెను. దీపమునొద్ద గోడపైనుండి యొకబల్లి పురుగులను బట్టుకొనుచుండెను. వినయుఁడు దానివంక నించుకసేపు చూచిచూచి చటాలున లేచి గొడుగుఁ దీసికొని వెలుపలికి వచ్చెను. ఏమి చేయవలయునో యాతఁడు నిశ్చయించుకొనలేదు. మరల నానందమయినొద్దకుఁ బోవలయుననియే యాతని యభిప్రాయమై యుండెను. కాని యాకస్మికముగా నాతనికి నేఁడాదివారమనియు, బ్రాహ్మసమాజమందు కేశవచంద్రుఁ డుపన్యసించు ననియు జ్ఞప్తికి వచ్చెను. అది తోఁచినవెంటనే వినయుఁడు తక్కినవాని నన్నిటిని మఱచిపోయి వేగముగా నడవ నారంభించెను. ఉపన్యాస మీపాటికిఁ జాలవఱకు ముగిసివచ్చునని తోఁచినది గాని యాతఁడు మరల తనయుద్దేశమును మార్చుకొనలేదు.

ఆతఁడు పోవునప్పటికి సామాజికులందఱును వెలుపలికి వచ్చుచుండిరి. వినయుఁడు గొడుగు వైచుకొని యొకప్రక్కను నిలుచఁబడిపోయెను. అప్పటికి పరేశబాబు శాంతప్రసన్నవదనముతో మందిరమునుండి యీవలకు వచ్చెను. అతనితో నలుగురైదుగురు పరిజనులుండిరి. వారిలో నొకతరుణసుందరీవదనమును వీథిదీపపువెలుఁగున వినయుఁ డొక్కసారిమాత్రము వీక్షించెను. తోడనే బండిచక్రముల చప్పుడయ్యెను. వెంటనే యదృశ్యమైపోయెను. వినయుఁ డింటికిఁ బోక తిరిగి తిరిగి తిన్నగా గోరాయింటికిఁ బోయెను. అప్పటికి సంధ్యాంధకారము సాంద్రమైపోయెను. అప్పుడు గోరా యొకదీపమునొద్దఁ గూర్చుండి యేమియో వ్రాయుచు మొగము పైకెత్తకయే "వినయా! ఇది యేమి! ఈగాలి యేవైపునుండి వచ్చినది?" అనియెను.

వినయుఁ డామాట వినకయే "గోరా! నిన్నొకమాట యడిగెదను. నీయుద్దేశమున భారతవర్షము సత్యస్వరూపమైనదేనా? స్వప్నస్వరూపమైనదేనా? రేయుంబవలు నీవాలోచించుచుందువుగదా — ఈవిషయమున నీయభిప్రాయ మేమి?" అనియెను.

గోరా వ్రాయుట మాని తీవ్రదృష్టితో వినయునివంక నించుకసేపు తిలకించి కలము నొకచో నుంచి కుర్చీవెనుకకు మొగము త్రిప్పి "వినయా! నావికుఁడు తన నౌకను సముద్రమున విడిచి యేపనులలో నిమగ్నుఁడైయున్నను తాను పోవు రేవును లక్ష్యమునందుంచుకొనునట్లే నేనును నాభారతవర్షమును నామనమునందు నిలుపుకొని యున్నాను" అనియెను.

విన — నీభారతవర్ష మెక్కడ నున్నది?

గోరా—గుండెలపైఁ జేయుంచి "ఈవిక్రపదర్శనయాత్రము (కంపను) నిరంతరము నావైపునకు ముల్లు నూపుచున్నదో నాభారతవర్షమచ్చటనే యున్నది. అంతే కాని మీమార్షల్ దొంగారి హిందూదేశచరిత్రలో లేదు." అనియెను.

వినయ—నీముల్లే వైపునకుఁ దిరిగి యున్నదో యచ్చట నేమైన నున్నదా?

గోరా—లేకేమి? నేను దారి తప్పిపోవచ్చును; మునిఁగి చచ్చిపోవచ్చును; కాని నాముల్లాయదృష్టస్థానమునే—భాగ్యలక్ష్మీస్వరూప మగునారేవునే లక్ష్యము చేయుచున్నది. అదియే నాసమగ్రభారతవర్షము! అదియే ధర్మపూర్ణమైనది; జ్ఞానపూర్ణమైనది అట్టిభారతవర్షము మఱి యెచ్చటను లేదు. అది కానిదంతయు నలువైపుల నసత్యమే—ఈ నీకలకత్తాపట్టణము, ఈచేరీలు, ఈకోర్టులు, ఈభవనములు-ఇవి యన్నియును బుద్బుదప్రాయములు! ఛీ!

అని చెప్పి గోరా వినయుని మొగమువంకఁ దదేకదృష్టితోఁ గొంతసేపటివఱకును జూచుచుండెను. వినయుఁ డేమియును మాటాడక భావించుకొనఁదొడంగెను. అప్పుడు గోరా మరల నందుకొని "వినయా! ఎచ్చట మనము చదివియుంటిమో, వినియుంటిమో, ఉద్యోగములకొఱకు గడపడ్డవారినెల్ల నాశ్రయించుచుంటిమో, ఇంతచేసినను కుటుంబపోషణమునకుఁ దగినంత సంపాదించుకొనుటకు దిక్కులేక యుంటిమో యిట్టి యీయైంద్రజాలికమిథ్యాస్వరూపమునే భారతవర్ష సత్యస్వరూపముగా భావించుచు నిండలి యిరువదియైదుకోట్లప్రజలును మిథ్యాగౌరవమును గౌరవముగను, మిథ్యాకర్మమును సత్కర్మముగను నెంచుకొనుచు విభ్రాంతులై సంచరించుచున్నారు. ఇట్టి మరుమరీచికామధ్యమునందేయుండి యెట్లో మనముందఱను ప్రాణములను నిలుపుకొనఁ గలుగుచున్నాము. అందుచేతనే నానాఁటికిఁ గృశించి పోవుచున్నాము. సత్యభారతవర్షమొకటి యున్నది. అదియే పరిపూర్ణభారతవర్షము! అందుండుభాగ్యమే లభింపకున్నచో మన మేజ్ఞానముతో, నేహృదయముతో సత్యజీవామృతమును గ్రోలఁగలుగుదుము? అందుచేతనే సర్వమును మఱచిపోవలయునని చెప్పితిని. బిరుదుచదువులు బిరుదుమాయలు, ముష్టిమోహములు సర్వమును ద్రోసివైచి మనయోడ నారేవునకభిముఖముగా నడిపింపవలయును. మునిఁగిన మునుఁగుగాక! చచ్చినఁ జత్తుముగాక! కాని నేను నాభారతవర్షసత్యమూర్తిని-పూర్ణమూర్తిని ఎప్పటికైన మఱచిపోఁగలనా? అనియెను.

వినయ—గోరా! నీవిట్లుద్రేకముతోఁ జెప్పుచుంటివా, సత్యముగనే చెప్పుచుంటివా?

గోరా మేఘగంభీరభాషణములతో "సత్యమే చెప్పుచున్నాను!" అనియెను.

వినయ—గోరా! నీవలె నెవ్వరును గ్రహింపలేరా?

గోరా—అట్లందఱును గ్రహించునట్లు చేయుటయే సాధన! సత్యస్వరూపమును దెలిసికొనజాలకున్నచో లోకులు ఛాయాస్వరూపమునందే యాత్మసమర్పణము చేసికొనరా? భారతవర్ష సర్వాంగసౌందర్య మందఱికన్నులయెదుటను బ్రదర్శింపవలయును. అప్పు డందఱును దానికివశులైపోవుదురు. అప్పుడు నీవు చందాలకొఱకు గ్రామముల వెంటఁ దిరుగవలసి యుండదుగా? జనులు తమంతట దామే ప్రాణములనైన నర్పించుటకు సర్వసిద్ధులై యుందురు!

వినయ—గోరా! అట్లయినచో నాకా సత్యస్వరూపమును జూపింపుము! కాదేని లోకముతోఁబాటుగ నన్నుఁబోనిమ్ము!

గోరా—సాధన చేయుము! విశ్వాస మున్నచో నుపాసనాబలమువలన నీకును [illegible] కలుగఁగలదు. నుభాషకులగు మనదేశాభిమానులంతగా సత్యవిశ్వాసము కలవారు గారు. అందుచేతనే వారు తమశక్తియందును, నితరులశక్తియందును, గూడ నమ్మకము లేనివారగుచున్నారు. స్వయముగాఁ గుబేరుఁడు ప్రత్యక్షమై వరమిచ్చెద ననినను గవర్నరు దొరగారి జమాదారు మెడలోని గిల్టుడవాలికంటె నెక్కువ కోరుకొనుటకు వారికి ధైర్యముండునని నేననుకొనను. వారికి విశ్వాసము లేదు కావుననే ధైర్యమును లేదు!

వినయ—గోరా! అందఱిస్వభావము నొక్కరీతిగా నుండదు. నీవు నీబుద్ధియందే విశ్వాసము కలిగియున్నావు; స్వశక్తినే యాశ్రయించి పని చేయుచుందువు అందుచే తనే నీవితరులశక్తిగతులను గ్రహింపఁజాలవు. నీవు నన్నెదైనపనియందు నియోగింపుము. నాకుఁ బ్రొద్దు పోవుటలేదు. నీయొద్ద నున్నప్పుడుమాత్రమే నాకుఁ గొంచెము కాలక్షేపమగుచున్నది. తరువాత నూరక యుండవలసివచ్చుచున్నది.

గోరా—నీవు పనిమాట యడుగుచున్నావా? స్వదేశసంబంధము లగువానిని నిస్సంకోచముగను, నిస్సంశయముగను, సంపూర్ణముగను బ్రేమించుటయును, దేశము నందు విశ్వాసములేనివారి హృదయములయం దట్టిప్రేమభావమును బుట్టించుటయును మనకిప్పు డవశ్యకర్తవ్యమై యున్నది. దేశవిషయమున నభిమానహీనులమై యుండి మనము మనహృదయములను దాసత్వవిషముచే దుర్బలములైనవానిగాఁ జేసికొనుచున్నాము. మనలో నొక్కొక్కఁడు సాదర్శుఁడై దానికి బ్రతీకారమును గావింపఁగలిగినచో నప్పుడు మనకార్యక్రమమునకు సుక్షేత్రము లభింపఁగలదు. అట్లు కాక మన మేపనిచేసినను కేవలమును బాఠశాలయందలి చరిత్రపాఠపుస్తకము ననుసరించి యితరు లందఱు చేసినపనివలెనే యుండును. ఇట్టి నిరర్థకకార్యమునకై సత్యముగా మనసర్వశక్తులను, బ్రాణములను నెట్లర్పింపఁగలుగుదుము! అట్లు చేయుట మనహైన్యమును మఱింత వర్ధిల్లఁజేసికొనుటయే.

దేశమున కిట్టిగతి కలిగినది! ఎవ్వఁడైనను పాపానించి యాతనిదొంగతనము బట్టుకొన్న చో నాతఁ డేమాత్రమును దన పనికి సిగ్గుపడక పైపెచ్చు పరమసాధువువలెఁ బైఁ బడి కొట్టుటకు సిద్ధపడును. ఇది నిజమేనా?

వినయ—సత్యము కాకేమి?

మహి—అంతకంటెను నసత్యప్రవర్తనమునకు దిగి మిథ్యావినయముతో నాతని పాదములను సేవించినచో నప్పు డాతఁడు నీకు సేవకుఁడై పోవును. అందువలన మన కు మంచికొలువులు లభించుటయే కాక మన జాతికి భంగము లేకుండ నుండును. బాగుగ నాలోచించినచో నిదియే దేశభక్తి. కాని మనగోరా కీమాట యన్నఁ గోప ము! అతఁడు హిందువుఁడైనప్పటినుండియు నగ్రసోదరుఁడ నని నన్ను గౌరవించు చుండెను. కాని యిప్పుడేమో నామాట లాతనికి నచ్చుట లేదు. కాని, యేమి చేయు దును? అతఁడు సోదరుఁడు! అసత్యసంబంధమునందుఁగూడ సత్యమునే చెప్పవలసి వచ్చుచున్నది. వినయా! ఆయుత్తరము నొకసారి చూడుము! ఉండుము ముందుము! నేను చిత్తువ్రాసి యున్నాను. అది తీసికొని వచ్చెదను.

అని చెప్పుచు మహిముఁడు తంబాకు సేవించుచు వెలుపలకుఁ బోయెను. అప్పు డు గోరా వినయునిం గాంచి "వినయా! నీ వన్నగారిగదిలోనికిఁ బోయి చూచు చుండుము. ఇంతలో నేను నాయుత్తరమును బూర్తి చేసికొందును" అనియెను.

౫

"వినుచున్నారా? నేను పూజామందిరములోనికి రాను లెండి! భయము ఆహ్నికకృత్యములు ముగిసినచో మీ రొకసారి యాగదిలోనికి రండు! మాటాడ పని యున్నది. ఎవ్వరైన సన్న్యాసులు వచ్చినచో నింక మీ దర్శనమే దొరక దుచేతనే యిప్పుడు వచ్చి మనవిచేసికొనుచున్నాను! మఱచిపోక యొకసా అని భర్తకుఁ దెలిపి యానందమయి యింటిపనులు చేసికొనుటకుఁ బోయెను.

కృష్ణదయాళుఁడు శ్యామలశరీరులతరగతిలోనివాఁడు. అతం డం కాఁడు. అతని మెయి యంతయును నెరసిన గడ్డముచేఁ గప్పఁబడియుండును. అం కన్నులుమాత్రమే స్పష్టముగఁ గానవచ్చుచుండును. అతఁ డెప్పుడును గైరిక ములను ధరించి చేతియందుం గమండలువును, పాదములయందుఁ బాదుకలను దాల్చి యుండును. అతని నడినెత్తి జుట్టుయును బట్టతల యయ్యెను. మిగిలినకుంతలములను జేర్చి యాతఁడు మొగమీఁదనే ముడివైచుకొని యుండును.

పశ్చిమమునందున్న దినములలో నాతఁడు గోరాతోఁ గలసి మద్యమాంసములను భుజించినవాఁడే. ఇప్పు డాతనికి దేశమునందలి పూజారులు, పురోహితులు, వైష్ణవులు సన్న్యాసులు మొదలగువారిపాదములపైఁ బడి ప్రణతిని జూపుటయే పౌరుష మగు

చూచుచుండఁగనే నగరమందు గోరాకు గౌరవప్రతిష్ఠలు వర్ధిల్లుచుండెను. కాని యింటియందు మాత్రము కష్టములే. మహిముఁడప్పటికి యుద్యోగము చేయుచుండెను. అతఁడు గోరానుజూచి యొకప్పుడు "దేశాభిమానాగ్రణి" అనియు నొకప్పుడు "అపరనారీశముఖ్యుఁడు!" అనియుఁ బరిహసించుచుండెను. అందుచే గోరా యప్పుడప్పుడతని గొట్టఁబోవుటకూడ జరుగుచుండెను. గోరాకుఁగల యాంగ్లేయద్వేషమునకై యానందమయి మనమున విచారించుచుండెను. ఆమె యాతని శాంతింపఁజేయుటకనేకవిధములఁ బ్రయత్నించెను గాని లాభము లేకపోయెను. గోరా వీథులయందును, ఘట్టములయందును, ఎట్టియెన నింగ్లీషువానితో డీకొనఁగలిగినచో, తనజీవనము ధన్యమాయెనట్లు తలంచుకొనుచుండెను.

క్రియముగా నప్పుడు గోరా కేశవచంద్రుని యుపన్యాసములకు ముగ్ధుఁడై బ్రహ్మసమాజముచే విశేషముగా నాకర్షింపఁబడియెను. మరల నిప్పుడు కృష్ణదయాళుఁడు పూర్వాచారపరాయణుఁడై గోరా తన గదిలోపలికి వచ్చుటకుఁగూడ సహింపకుండెను. అతఁడు ప్రత్యేకముగ నొకయిల్లు తీసికొని ద్వారమునందు "సాధనాశ్రమము" అను పేరుతో నొకబోర్డును గట్టుకొనియెను. తండ్రి యట్లుచేయుట గోరాకుఁ గష్టముగానుండెను. "ఈయాడంబరమును నేను సహింపఁజాలను! ఇది నాకన్నులకు శూలములవలెనున్నది" అని యనుకొనుచు గోరా తండ్రితోడి సర్వసంబంధములు తెగతెంపు చేసికొని యెక్కడకైనఁ బోవుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆనందమయి యాతని నెట్లో యందలించి బోధించుచుండెను.

గోరా యావకాశము దొరికినప్పుడెల్లఁ దండ్రియొద్దకు వచ్చుచుఁ బోవుచుండు బ్రాహ్మణపండితులతో వాదములు చేయుట కారంభించుచుండెను. అది తర్కమే కాదు. విచారణ పరాయే చెప్పవచ్చును. అందుఁ జాలమంది పండితులకుఁ బాండిత్యమంతకంటె ధనలోభమే హెచ్చుగా నుండుటవలన వారు గోరా నతిక్రమింపఁజాలక యాతఁడనఁ బెద్దపులివలె భయపడుచుండిరి. వారిలోఁ గేవల మొక హరచంద్రవిద్యావాగీశ్వరునియందు మాత్రమే గోరాకు గౌరవము కలిగెను.

కృష్ణదయాళుఁడీ విద్యావాగీశ్వరుని వేదాంతచర్చకొఱకు నియోగించియుండెను. గోరా మొట్టమొదట నీతనితోఁగూడ నుద్ధతభావముతో వివాదపడుటకుఁ బ్రయత్నించెను గాని యది కొనసాగలేదు. విద్యావాగీశ్వరుఁడు కేవలము పండితుఁడు మాత్రమే కాక యాశ్చర్యకరముగ నుదారస్వభావుఁడుకూడ నైయుండెను. కేవల సంస్కృతవిద్యాభ్యాసమువలన నట్టి తీక్ష్ణబుద్ధి లభించు నని గోరా యూహించియుండలేదు. విద్యావాగీశ్వరుని స్వభావమునందు శాంతము క్షమయును ధైర్యగాంభీర్యములును బరిపూర్ణముగ నుండుటచే నాతనియెడ గోరా విధేయత చూపకుండ నుండఁజాలకపోయెను. అప్పటినుండి గోరా హరచంద్రునియొద్ద వేదాంతచర్చ

నములను జదువుట కారంభించెను. గోరా యేపనియైనను సగముసగము చేయువాఁడు కాఁడు. అతఁడు కేవలము నప్పుడు దర్శనాలోచనమునందే నిమగ్నుఁడైపోయెను.

ఘటనాక్రమమున నాసమయమున నొక యాంగ్లేయ మతగురు వొకపత్రికయందు హిందూశాస్త్రములను సమాజమును నిరసించి యావిషయమునఁ దనతో వాదించుటకు హైందవపండితుల నాహ్వానించెను. అది చూచి గోరా మండిపడియెను. అవకాశము దొరికినప్పుడెల్ల దాను శాస్త్రములను లోకాచారములను నిందించుచు విరుద్ధమతస్థుల నెంతగాఁ బీడించుచున్నను నిప్పుడు విదేశీయుఁ డొకఁడు హిందూమతము నధిక్షేపించుట గోరా కంకుశముతోఁ బొడిచినట్లయ్యెను. గోరా యప్పుడు పత్రికాముఖముననే వాదించుట కారంభించి ప్రతిపక్షులు హిందూమతమునందును, సమాజమునందును నారోపించిన దోషములలో నొకదానినైనఁ గొంచెమైనను నంగీకరింపలేదు. పత్రికాధిపతి యిఁక నేను ప్రకటింపఁజాలననుటంతవఱకును వాదము జరిగెను. గోరా యిఁకఁ గోపము నడంచుకొని యింగ్లీషులో "హిందూయిజమ్" అను నొకపుస్తకమును వ్రాయ నారంభించెను. అందు సాధ్యమైనంతవఱకును సమస్తయుక్తులను శాస్త్రములను నుద్ఘాటించి హిందూధర్మమును గూర్చియు హిందూసమాజశ్రేష్ఠత్వమును గూర్చియుఁ బ్రమాణములను సంగ్రహింపఁదొడఁగెను. ఈవిధముగా గోరా మిషనరీలతో వాదించి తుదకు దనవాదమును నెగ్గించుకొనియెను. "నాదేశము విదేశీయులకోర్టులయందు, విదేశీయుల శాసనానుసారముగా విచారింపఁబడుటను నే నంగీకరింపను. ఏమైననేమి విదేశీయులయాదర్శములతో మే మేకీభవింపఁజాలము. మా జన్మభూమియందలి యాచారములను విశ్వాసములను, శాస్త్రములను, సమాజమును గౌరవించుటయందు మే మెవ్వరియొద్దను నించుకంతయైన సంకుచితులమై యుండఁజాలము. సబలముగ—సగర్వముగ మా దేశగౌరవమును మా నెత్తిపైఁ బెట్టుకొని మా దేశమునకును మాకు నెట్టి యవమానమును గలుగకుండ రక్షించుకొందుము" అని చెప్పుచు గోరా గంగాస్నానములను, సంధ్యాహ్నికములను జేయుట కారంభించెను.

అతఁడు నెత్తిపై నొక చిన్నజుట్టుపిలక నుంచుకొని, తినుట త్రాగుట మొదలగు వానిలోఁగూడ జాగరూకుఁడై యుండెను. ఇది మొదలతఁడు ప్రతిదినమున సంధ్యాకాలమున దల్లిదండ్రులపాదధూళిని దలను దాల్చుట కారంభించెను. ఇదివఱకు వలె నింగ్లీషుభాషలో "కాడ్, స్నోబ్" అని నిందించుట మాని గోరా తనయన్నగారగు మహిముని జూడఁగనే లేచి నమస్కారము చేయ మొదలుపెట్టెను. ఈయాకస్మికభక్తిం గాంచి మహిముఁడు నోటికి వచ్చినట్లెల్ల ననుచున్నను గోరా దానికిఁ బ్రత్యుత్తర మిచ్చుట లేదు. గోరా తనయుపదేశముచేతను నాచరణముచేతను దేశమునందలి కొంతమందిని దనతోఁ జేర్చుకొనఁగలిగెను.

ఆసమాజమువా రందఱును నాతనిసాహాయ్యముచే నెమ్మదిగనుండి "మేము మంచిచెడ్డలనుగూర్చిగాని, సభ్యతాసభ్యతలనుగూర్చిగాని యొకరియొద్దఁ బ్రకటించుకొను నుద్దేశము గలవారము కాము. మాకు మేమే లోకముగా గేవలమును మాకష్టసుఖములను మేమే యనుభవించుచుందుము" అని పలుకుచు సర్వసంసిద్ధులై యుండిరి.

గోరాయెడలం గలిగిన యీనూతనపరివర్తనము కృష్ణదయాళున కించుకమాత్రము నిష్టముగ లేకుండెను. అతఁ డొకనాఁడు గోరాను బిలిచి "బాబూ! హిందూశాస్త్ర మతిగంభీరమైనది. మనఋషులు స్థాపించిన యీధర్మమునుగూర్చి తెలిసికొనుట సామాన్యులకు సాధ్యము కాదు. నీ విట్టిపనికిఁ బూనుకొని కష్టపడకుండుటయే మంచిదని నాకుఁ దోఁచుచున్నది. నీవు చిన్నవాఁడవు ఇంగ్లీషువిద్య బాగుగ నభ్యసించితివి. నీవు బ్రహ్మసమాజమునఁ జేరినచో వారందఱును నీవు చెప్పినట్లు చేయుచుందురు. నీ విట్లు చేరుట నాకెంతమాత్రమును కష్టముగ నుండదు. మఱియు సంతోషముగనే యుండును. కాని నీ వీమార్గమునే యవలంబించినచో నీ కంతగా నుపయోగము కలుగదు. ఇది నీకుఁ దగినపద్ధతి కాదు." అనియెను.

గోరా—అదియేమి యట్లనుచున్నారు! నేను హిందువుఁనను. నాకిప్పుడు గాకున్న నెప్పటికైనఁ బ్రయత్నించినచో హిందూధర్మతత్త్వము తెలియక మానదు. ఎప్పటికిని దెలియకున్నచో నప్పుడు దీనిని బరిత్యజింపవచ్చును. నేను పూర్వజన్మమున హిందూసమాజసంబంధమును విడువఁజాలనివాఁడ నగుటచేతనే నాకిప్పు డీబ్రాహ్మణజన్మము లభించినది. ఇట్లే ప్రతిజన్మమునందును హిందూధర్మము నవలంబించుచుఁ దుట్టతుదకు సర్వోత్కృష్టస్థానమును గాంచెదను. ఏదైనఁ బొరపాటుచే నిప్పుడొకఁ దోవ తప్పినను మరల ద్విగుణీకృతవేగముతో యథామార్గమునకు మరలఁగలుగుదును.

కృష్ణదయాళుఁడు తలద్రిప్పుచు "కాని, బాబూ! హిందువు నని చెప్పుకొన్నంతమాత్రమున హిందువు కానేరఁడు. ముసల్మానుకావచ్చును—క్రిష్టియను కావచ్చును, కాని హిందు వగుటయా? ఎంతమాట! అదిమాత్రము సాధారణకార్యము కాదు!" అనియెను.

గోరా—ఆమాట నిజమే కాని నేను హిందువునై జన్మింపఁగలుగుటచేత నే సింహద్వారమునొద్దకు రాఁగలిగితిని. ఇప్పుడు సరిగఁ బ్రయత్నించినచో నతిసులభముగనే లోపలఁ బ్రవేశింపఁగలను.

కృష్ణ—బాబూ! నేను నీతో వాదింపఁజాలను. కాని నీమాటయందును సత్యము లేకపోలేదు. ఎవ్వరికర్మఫల మెట్లున్నదియో యట్లుకాక మానదు. దానినిమాత్ర మెవ్వరు నడ్డగింపఁజాలరు భగవత్సంకల్పమునకు మన మేమిచేయఁగలము? మనకేమి తెలియును?

భగవదుద్దేశము, కర్మఫలము, సోహంవాదము, భక్తితత్వము ననునీవిషయములను కృష్ణదయాళుఁడు సంపూర్ణముగను, సమానముగనే గ్రహించెను. కాని వీని సమన్వయమును గూర్చి గాని ప్రయోజనమును గూర్చి గాని యాతనికింతవఱకు నెంతమాత్రము ననుభవము కలుగలేదు.

ఇన్నాళ్ళకు నేఁడు కృష్ణదయాళుఁడు స్నానాహ్నికములను ముగించుకొని యానందమయి గదిలోనికి వచ్చి యొకబల్లపైఁ దనచిత్రాసనము నేర్పఱచికొని యెట్టిసంపర్కమును దనకుఁ గలుగకుండునట్లు చూచుకొని సావధానముగఁ గూర్చుండి యుండెను.

ఆనం—మీయీతపస్సులో నింటిగోడవయే లేకుండఁ బోయినది. కాని నేను మాత్రము నిరంతరమును గోరాకొఱకు భయపడిపోవుచున్నాను.

కృష్ణ—భయమేమి!

ఆనం—నేను సరిగాఁ జెప్పఁజాలను. గోరా యిప్పుడు హిందూమతము నవలంబించి పని చేయుచున్నాఁడు. క్రమముగా నందువలన నెట్టికష్టములు సంఘటిల్లునో యని భయపడుచున్నాను. ఈతనికి వడుగుచేయవద్దని నే నప్పుడే చెప్పియుంటిని. మీరు నామాట లెక్కచేసినారు కారు. మెడలో రెండుమూడునూలుపోచలను వైచినంతమాత్రమున వచ్చినదియు లేదు; పోయినదియు లేదని నాకు సమాధానము చెప్పితిరి. కాని యవి వట్టినూలుపోగులు కాలేదు ఇంతవఱకును బుట్టి పెంపొందినవి!

కృష్ణ—ఔను. ఆ తప్పంతయును నాదే—నీబలవంతముచేతనే నేను పొరఁబడితిని. అప్పుడు నీ వాతని నెంతమాత్రము విడఁజాలకుంటివి. ఆ దినములలో నేనును నిర్లక్ష్యముగా నుంటిని. ధర్మకర్మములను గూర్చి నాకప్పు డెట్టిజ్ఞానమును లేనేలేదు. ఇప్పుడైనచో నట్టిపని చేయఁగలుగుదునా?

ఆనం—మీ రేమన్నను సరియే! నేనుమాత్ర మధర్మము చేయలేదు. నే నాబిడ్డను బెంచుట కెంతకష్టపడితినో మీరే యెఱుఁగుదురు. ఎవ్వ రేమి చెప్పిన నట్లు చేసితిని! ఎన్ని మందులు, ఎన్ని మంత్రములు నుపయోగించితినో మీ రెఱుఁగరా? ఒకనాఁటిరాత్రి కుజ్జనిండఁ బుష్పాలుంచుకొని శివపూజ చేయుచున్నట్లు కలగంటిని. తరువాతఁ గొంతసేపటి కాపుష్పములు మాయమైపోయి యంతకంటెను తెల్లని పిల్లవాఁడొకఁడు నా కౌఁగిలిలో నగపడియెను. అప్పుడు నాకేమియును బోధపడలేదు. నాకన్నుల నీరు నిండిపోయెను. నేనప్పుడా బిడ్డను తలెత్తి చూడఁబోయి యెత్తుకొంటిని. తోడనే నాకు నిద్రాభంగమయ్యెను. తరువాతఁ బదిదినములు గాకుండఁనే నాకీగోరా లభించెను. ఇది నా కీశ్వరప్రసాదము! నే నాతని నెట్లు విడువఁగలను? నే వీనిఁ బూర్వజన్మమున గర్భమున ధరించి యెంతయో కష్టపడియుందును. అందుచేతనే యీనాఁడు నన్నమ్మాయని పిలుచుటకు వచ్చియున్నాఁడు. ఈతఁ డెంతవిధాయకుఁడుగా మనకు

లభించెనో యాలోచించి చూడుఁడు. అప్పుడు నలువంకల హత్యలు యుద్ధములు జరుగుచున్నవి. మనమే ప్రాణభయమునఁ జచ్చిపోవుచుంటిమి. అట్టిసమయమున నర్ధరాత్రివేళ నాయింగ్లీయయువతి మాయింటికి వచ్చి దాఁగినది. ఆమె నింటనుంచుకొనుటకు మీరు భయపడితిరి. నేనప్పుడు మీకుఁ దెలియకుండ నామెను బసులసాలలోఁ దాఁచితిని. ఆరాత్రియే యామె యొకమగశిశువును బ్రసవించి మరణించినది. తల్లిదండ్రులులేని యీబిడ్డను నేను బెంపకున్నచో వాఁ డెట్లు బ్రతుకును? మీరప్పు డాబిడను పాదిరీ కొప్పగింపవలయు నని తలంచితిరి. పాదిరీ యాబిడకుఁ దల్లియా తండ్రియా? అతని కేల యొప్పింపవలయును? అతఁ డేల యీబిడ్డను రక్షించును? అట్లు లభియించినయీబిడ్డ కడుపునఁబుట్టిన బిడ్డకంటెఁ దక్కువా? మీ రేమన్నను సరియే. నాబిడ్డ నెవ్వఁడు ప్రసాదించెనో స్వయముగా నాతఁడే తీసికొనవలయును గాని నా ప్రాణము లుండఁగా నే నీతని నెవ్వరికి నొప్పగింపఁజాలను.

కృష్ణ—ఆసంగతి నాకుఁ దెలియును. అందుచేత నీవు నీగోరాతోనే యుండుము. నా కాయభ్యంతర మేమియును లేదు. ఆతఁడు మాబిడ్డయే యని చెప్పుచున్నప్పు డాతనికి వడుగు చేయకున్నచో సంఘములో గౌరవము కలుఁగదు. అందుచేతనే యాతని నుపనయనము చేసితిమి. కాని యిప్పుడు రెండు సంగతు లాలోచింపవలసి యున్నది. న్యాయానుసారముగా నాసర్వస్వము మహిమునకే చెందవలసియున్న—అలాగు—

అనం—మీయాస్తిలో భాగ మెవ్వరు కోరుచున్నారు? మీసర్వస్వమును మహిమునకే యీయవచ్చును—అందొక కాసయైనను గోరా కక్కఱలేదు. వాఁడు మగవాఁడు! బాగుగఁ జదువుకొన్నవాఁడు. స్వయముగా సంపాదించుకొనఁగలఁడు. వాని కొకరిధనములో భాగ మెందుకు? వాఁడు బ్రదికి యుండుటయే పదివేలు, నా కట్టిభాగ్యముతోడను బనిలేదు.

కృష్ణ—అక్కఱలేదు. ఆతని కంతయన్యాయము చేయను. భూసంపత్తి యాతయు గోరాకే యిచ్చెదను. అందువలన నాతనికి వత్సరమునకు వేయిరూపాయిలు వచ్చును. ఇప్పు డాతనివివాహమునుగుఱించి యాలోచింపవలయును. ఇదివఱకు జరిగినదేదియో జరిగినది. ఇఁక నే నాతనికి బ్రాహ్మణకన్యనుమాత్రము హిందూమతప్రకారము పెండ్లిచేయఁదలఁచుకొనలేదు. నీకుఁ గోపము వచ్చినను సరియే; ఏమైనను సరియే—

అనం—ఆహాహా! మీవలెఁ బ్రపంచ మంతయును గంగానదియే ప్రవహింపవలయు ననునంతటిధర్మజ్ఞానము నాకు లేదు. బ్రాహ్మణకన్యనే పెండ్లి చేయవలయు నని నేనేల కోరవలయును? ఏల పట్టుపట్టవలయును?

కృష్ణ—బ్రాహ్మణులబిడ్డవై యుండియు నీ విట్టిమాట యనుచున్నావు?

అనం—అయిన నేమి? నేను నాబ్రాహ్మణత్వమును వదలుకొన్నాను. మన మహిమునిపెండ్లిసమయమున కిరస్తానీదాన నని నన్నందఱును నిందించియే యున్నారు.

అప్పుడు నేనన్నిటికి నంగీకరించి మరుమాట చెప్పకుండఁ దప్పుకొనియే యుంటిని. లోకులందరును క్రిస్టియనీ యనుచున్నారు. ఇంకను నానావిధముల ననుకొను చున్నారు. నేనందరిమాటలను సహించి యూరకున్నాను! క్రిస్టియనీలు మాత్రము మనుష్యులు కారా? మీరు మాత్రమే గొప్పజాతివారని భగవంతుఁడు నిశ్చయించి యాదరించి యున్నచో నాతఁడొకప్పుడు పటానుల పాదధూళియందును, మఱియొకప్పుడు మొగలాయీల పాదధూళియందును, నిప్పుడు క్రిస్టియనీల పాదధూళియందును మీతలలను దొర్లించుట కేల యంగీకరించును?

కృష్ణ— ఆమాటలకేమిలెమ్మా! నీవాఁడుదానవు. అనంగతులు నీవు గ్రహింపఁజాలవు. కాని, సంఘమొకటి యున్నది. దాని కంతయును దెలియును. దానిని నీవు గౌరవింపవలయును.

ఆనం— నాకుఁ దెలిసికొనవలసిన పనిలేదు. నేను గోరాను నాబిడ్డగా నెంచుకొని పెంచుకొన్నప్పుడే నాయాచారవ్యవహారములను మతమునుగూడ వదలుకున్నాను. నేను మతమునకొఱకు భయపడి యెప్పుడును దాఁగి యుండలేదు. నేను క్రిస్టియనీమునగనే ప్రవర్తించుచు నెల్లరనిందలకును లోనగుచునే యున్నాను కేవల మొక్క సంగతి మాత్రమే దాఁచియుంచితిని. దానికొఱకే దేవుని కెక్కడఁ గోపమువచ్చునో యని భయపడుచున్నాను. చూడుఁడు! గోరా కిది యంతయుఁ జెప్పివేయవలయు నని యున్నది. తరువాత నేమైనను సరియే.

కృష్ణదయాళుఁ డాత్రముతో “వలదు. వలదు. నేను జీవించియుండఁగా నా రహస్యమును బయటఁ బెట్టకుండుము. గోరానే తెలిసికొననిమ్ము! తెలిసినతరువాత నాతఁ డేమిచేయునో మన మూహింపఁజాలము. సమాజములో గోలపట్టును. ఇంతే కాదు; దొరతనమువారేమి చేయుదురో చెప్పఁజాలము. గోరాతండ్రి యుద్ధములో మరణించినట్లును, నాతనితల్లి ప్రసవించి మరణించినట్లును మన మెఱిఁగియుండియు సర్కారుకు రిపోర్టుచేయలేదు. ఇప్పుడది యంతయును గలసి పెద్దగందరగోళ మగును. ఇట్లయినచో నాసాధనయును, భజనయును, మంటఁ గలసిపోవును. ఇంకను నెట్టికష్టములు కలుగునో!” అనియెను.

ఆనందమయి నిరుత్తరయై కూరుచుండెను. కృష్ణదయాళుఁడును గొంతసేపటి వఱకు నూరకుండి యనంతరము మెల్లగా “గోరా పెండ్లివిషయమై నేనొకవిధముగా నాలోచించితిని. పరేశభట్టాచార్యుఁడు చిన్నతనమునందు నాతోఁ జదువుకొన్నవాఁడు. అతఁడు స్కూళ్ళఇనస్పెక్టరుపని చేసి పెన్షన్ తీసుకొని యిప్పుడు కలకత్తాయందున్నాఁడు. అతఁడు ఘోరబ్రాహ్మసామాజికుఁడు. అతనియింటఁ జాలమంది కన్యలున్నట్లు వినియున్నాను. గోరా కట్లయిన నాతనితోఁ జనవు కలిగించినచో వాఁడు తఱచుగా నాయింటికిఁ బోవుచుండును. అప్పుడు వాని కాకన్యకలలో నెవ్వ

రిస్తానఁ బెండ్లియాడవలయు ననుకోరికకలుగవచ్చును. తరువాత దేవుఁ డున్నాఁడు" అనియెను.

ఆనం—ఏమనుచున్నారు? గోరా బ్రహ్మసామాజికులయిండ్లకుఁ బోవుటయా ఇప్పు డాతనికా కాలము తిరిగిపోయినది :

ఇట్లనుచుండఁగనే గోరా తనమేఘమంద్రస్వరముతో "అమ్మా! యని పిలుచుచు నాగదిలోఁ బ్రవేశించి కృష్ణదయాళుఁ డట నుండుటంగాంచి విస్మితుఁడైపోయెను. ఆనందమయి చటాలున లేచి యాతనియొద్దకుఁబోయి ప్రేమాశ్రుపూర్ణనయనములతో "ఏమి బాబూ! ఏమి కావలయును?" అనియెను.

"విశేష మేమియును లేదు. ఏమియు నక్కఱలేదు. కూర్చుండుము" అని చెప్పి గోరా వెడలిపోవుట కుద్యుక్తుఁ డగుచుండెను. అప్పుడు కృష్ణదయాళుఁడు "రమ్మ! కొంచెముసేపు కూరుచుండుము! నిన్నొకమాట యడుగవలసి యున్నది. నా బ్రాహ్మమిత్రుఁ డొకఁడిప్పుడు కలకత్తాకువచ్చి హెదోతలాయందు వసించి యున్నాఁడఁట!" అనియెను.

గోరా—పరేశభట్టాచార్యుఁడా?

కృష్ణ—ఔను. నీవాతని నెట్లెఱుంగుదువు?

గోరా—మనవినయుని యిల్లాతనియింటియొద్దనే, వినయునివలన నేనాతనిసంగతి వినియుంటిని.

కృష్ణ—నీవాతని క్షేమసమాచారమును దెలిసికొని నాకుఁ జెప్పెదవా?

గోరా యించుకసే పాలోచించి యాకస్మికముగా "రేపటియుదయమున నచ్చటికిఁ బోయెదను" అనియెను. ఆనందమయి యామాటకించుక వింతపడియెను. గోరా మరల నాలోచించి యంతలోనే "రేపు నేనచ్చటికిఁ బోఁజాలను." అనియెను.

కృష్ణ—ఎందుచేత?

గోరా—రేపు నేను త్రివేణికిఁ బోవలయును.

కృష్ణదయాళుఁ డాశ్చర్యముతో "త్రివేణికా?" అనియెను.

గోరా—ఔను. రేపు సూర్యగ్రహణస్నానము!

ఆనం—అది యేమిపని గోరా! స్నానము చేయఁదలఁచినచోఁ గలకత్తాయందు గంగ లేదా? త్రివేణి లేకయున్నచో నీకు స్నానముకాదా? ఇక్కడ స్నానము చేయువారందఱును మూఢులేనా?

ఆమాటను గోరా యెట్టిప్రత్యుత్తరము నీయలేదు. చాలమంది తీర్థయాత్రికు లచ్చటికివత్తురను నుద్దేశముతో గోరా త్రివేణికిఁ బోవలయునని సంకల్పించుకొనియెను. అవకాశము దొరకినప్పు డెల్ల నాతఁడు తనసమస్తసంకోచములను, సకలపూర్వసంస్కా-

రములను బరిత్యజించి దేశమునందలి సామాన్యు లందఱితోడను కలసి సమానక్షేత్రమున సమభావముతో నిలిచి "నేను నీవాఁడను! మీరు నావారు!" చెప్పుకొనుట కభిలాషపడుచుండెను.

౨

సగము రాత్రివేళకే యాకస మంతయును నిర్మల మైనట్లు వినయుఁడు ప్రాతఃకాలమున లేచి చూచి తెలిసికొనియెను. అప్పటికీ ప్రభాత కాంతి పసిబిడ్డపాలబుగ్గలపైఁ జిఱునవ్వుఁబోలె నిర్మలమై వికసించి యుండెను. ఒకటిరెండు తెల్లని మేఘశకలములు మాత్రము నిష్ప్రయోజనముగ నాకసమున నందందుఁ దిరుగాడుచుండెను.

వినయుఁడు వరాండాలో నిలువఁబడి పులకితశరీరుఁ డై యాప్రభాతసౌందర్యమును దిలకించుచుండెను. అప్పుడు పరేశబాబు ఒకచేతితోఁ గఱ్ఱను, రెండవచేతితో సతీశుని హస్తమును బట్టుకొని యావీధిని బోవుచుండెను. సతీశుఁడు తలయెత్తి వినయునిం గాంచి చప్పటలు చఱచుచు "వినయబాబు!" అని కేకవైచెను. అప్పుడు పరేశుఁడును మొగమెత్తి వినయునిం గాంచెను. తోడనే వినయుఁడు క్రిందికి దిగియెను. పరేశుఁడు సతీశునితోఁగూడ వినయుని మందిరమునఁ బ్రవేశించెను. అప్పుడు సతీశుఁడు వినయుని చేయి పట్టుకొని "మీ రాదినమున మాయింటికి వచ్చెద నంటిరి. రాలే దేమి?" అనియెను. వినయుఁడు సస్నేహముగ నాబాలుని వెన్నుపైఁ దట్టుచు మందహాసము చేసెను.

పరేశుఁడు సావధానముగఁ దనచేతికఱ్ఱను బల్లపై నుంచి కుర్చీపైఁ గూర్చుండి "ఆనాఁడు మీరు లేకున్నచో మేము చాలఁ గష్టపడి పోయియుందుము! చాల నుపకారము చేసితిరి" అనియెను.

వినయుఁడు వ్యస్తహృదయముతో "నేను చేసిన దేమున్నది?" అనియెను.

అప్పుడు సతీశుఁ డాకస్మికముగా "వినయబాబూ! మీకుఁ గుక్కలేదా!" అని ప్రశ్నించెను.

విన—లేదు కుక్క లేదు.

సతీ—కుక్కను బెంపకపోవుట యేమి?

విన—ఆమాట నాకెప్పుడును దోఁచలేదు.

పరే—ఈసతీశుఁ డాదినమున మీయింటికి వచ్చినట్లు వినియుంటిని. చాల నల్లరి చేసెనుగాఁబోలును! వీఁడెప్పుడు నిట్లే వదరుచుండును. అందుచేతనే వీనికి వీనిసోదరి "భక్తియార్ ఖిల్జీ" యని పేరు పెట్టినది.

విన—నేనుకూడ మాటకారినే, అందుచేతనే మాయిద్దఱికిని స్నేహము కలిసినది. ఔనా సతీశా?

సతీశుఁడామాట కుత్తరము చెప్పలేదు. కాని తననూతనానుకరణము వినయుఁడు దెలిసిపోవుటచేఁ దనగౌరవమునకు భంగము గలిగెనని యాతఁడు మనసులో సిగ్గుపడుచు “అదియును మంచిదే. భక్తియార్ ఖిల్జీయును మంచివాఁడే. వినయబాబూ! భక్తియార్ ఖిల్జీ యుద్ధము చేసెనుగదా? అతఁడు బంగాళమును జయించెనుగాదా? అనియెను.

వినయుఁడు నవ్వుచు “మొదట నాతఁడు యుద్ధమే చేసెను. ఇఁకనిప్పుడు యుద్ధముతోఁ బనిలేదు. ఇప్పుడాతఁ డొక్క ఉద్ఘోషణిగా మాటలాడుటయే గాని బంగాళవిజయముతో నాతనికిఁ బనిలేదు” అనియెను.

ఈవిధముగాఁ గొంతసేపు సంభాషణ జరిగెను. అందరికంటెను దక్కువగ మాటాడినవాఁడు పరేశుఁడు. అతఁడు కేవలమును సుప్రసన్న శాంతివదనముతో నడుమ నడుమ నవ్వుచు నొకటిరెండుమాటలాడుచుండెను. సెలవు తీసికొనుసమయమున నాతఁడు కుర్చీనుండి దిగి లేచి “మాయిల్లీవైపుననే యున్నది.” అనియెను.

సతీ—ఈయనకు మనయిల్లు తెలియును; ఆనాఁడీయన నాతోఁగలసి మనయింటి గుమ్మమువఱకును వచ్చియున్నాఁడు.

ఆమాట కంతగా సిగ్గుపడవలసినపని లేదు గాని వినయున కదియేమో దొంగతనము చేసి దొరకిపోయినట్లు మనసులో సంకోచము కలిగెను.

పరే—ఇట్లయినచో మీరు మాయిల్లెఱుఁగుదురు. కావున నెప్పుడైనమీరు-

విన—ఇట్లు. మీరు సెలవీయనక్కఱ లేదు. నేను—

పరే—మన మొక్కచో నుండియు నింతకాలమును గలిసికొనుటయే లేదు.

వినయుఁడు వీధివఱకును వచ్చి పరేశుని సాగనంపి ద్వారమునొద్ద నించుకసేపు నిలుచఁబడి యుండెను. పరేశుఁడు మెల్లమెల్లఁగ నడచుచుండెను. సతీశుఁడేమేమో మాటలాడుచు నాతని ననుసరించి పోవుచుండెను. వినయుఁడు తనలో “ఈపరేశబాబువంటి వృద్ధుని నే నెప్పుడును జూడలేదు. ఈతనిపాదధూళినిఁ దలఁదాల్పవలయునని కోరిక యగుచున్నది. ఈసతీశుఁడో, అతిచమత్కృతిగలపిల్లవాఁడు! బ్రదికి బాగుగ నున్నచో గొప్పవాఁడు కాఁగలఁడు. వీని కెంతబుద్ధియో యంతసరళత యున్నది'' అని యనుకొనియెను.

ఆ బాలుఁడును, వృద్ధుఁడును నెంతమంచివారైనను వారియెడల నీయల్పపరిచయమాత్రమున నింతటిస్నేహమును, భక్తియుఁ గలుగుట యసంభవమే కాని వినయునిహృదయమింతకంటె నధికపరిచయమైనచో సహింపఁజాల దనియే తోఁచుచున్నది. అప్పుడు వినయుఁ డిఁక నెట్లయినఁ బరేశునింటికిఁ బోక తప్పదనియుఁ, బోకున్నచో మర్యాద కాదనియు నిశ్చయించుకొనియెను. కాని గోరాబోధించిన భారతవర్షమాతనిం గూర్చి “నీవచ్చటికి బోవలదు! జాగ్రత్త!” అని నిరోధించుచుండెను. వినయుఁడు

తరచుగా సమాజము నిషేధించిన నియమముల నన్నిటిని పాలించుచుండెను. అనేక సమయముల యందాతఁడు సంశయముగఁ దోఁచిన నియమములనుగూడ నంగీకరించెను. ఇప్పుడాతని హృదయాంతరమునం దొకవిద్రోహభావము కలిగెను. భారతవర్షమును గేవలము నిషేధముల ప్రత్యక్షస్వరూపమువలె నాతనికిఁ దోఁచెను.

ఇంతలో సేవకుఁడు వచ్చి వంట యైనదని చెప్పెను. కాని వినయుఁ డింకను స్నానమే చేయలేదు. పండ్రెండుగంటలయ్యెను. అతఁ డాకస్మికముగా "నేను భోజనము చేయను. మీరు పొండు" అని యొకగొడుగు వైచుకొని వీధిలోఁ బడియెను. ఒక యుత్తరీయమైనను బుజముపై వైచుకొనలేదు; తిన్నగా గోరాయింటికిఁ బోయెను. గోరా ప్రతిదినమును మధ్యాహ్నసమయమున 'అమ్హెరిస్టు' వీధినున్న హిందూహిత సమాజమునందుండి బంగాళమునందున్న తమసమాజమువారికందఱకును జాబులువ్రాయుచుండును. అచ్చటనే యాతని భక్తులాతని యుపదేశములం గాంచుచు నాతనికిఁ దోడుపడి పనిచేయుటయే ధన్యత్వముగా భావించుచుందురు. నేఁటిదినమునఁ గూడ గోరా యచ్చటికే పోయియుండెను. అందుచే వినయుఁ డొక్కసారిగా గంతువైచి యంతఃపురమున నానందమయి గదిలోఁ బ్రవేశించెను. అప్పు డానందమయి భోజనము చేయుచుండెను. లక్ష్మి దాని పార్శ్వమునఁ గూర్చుండి యామెకు వడ్డించుచుండెను.

ఆనందమయి యాశ్చర్యముతో వినయునిం గాంచి "ఏమిబాబూ! ఇప్పుడు వచ్చితివి?" అనియెను.

వినయుఁ డామెదగ్గఱకుఁ బోయి కూర్చుండి "అమ్మా! నాకుఁ జాల నాఁకలిగానున్నది. అన్నము పెట్టుము!" అనియెను.

ఆనందమయి వ్యస్తహృదయముతో "అయ్యో! బాబూ! ఎంతపనిజరిగినది! వంటబ్రాహ్మణుఁ డిప్పుడే వెళ్ళిపోయినాఁడు. మీరు—మతి—" అనియెను.

విన—నేను నీయింట బ్రాహ్మణుని చేతియన్నమును దినుటకై రాలేదు! అట్లయినచో మాయింట బ్రాహ్మణుఁడు లేడా? అతఁడేమిపాపము చేసినాఁడు? నేనిప్పుడు నీపాత్రలోని ప్రసాదమును భుజించుటకే వచ్చియుంటిని—లక్ష్మీ! నాకొక గ్లాసులో మంచినీళ్ళను దెచ్చిపెట్టుము

లక్ష్మి జలమును దెచ్చెను. వినయుఁడు గడగడ త్రాగెను. అప్పు డానందమయి యొక ప్లేటును దెప్పించి తనపాత్రలోనియన్నము నతిప్రేమతో దానియందు నెత్తి యాతనికొసంగెను. వినయుఁ డెన్నిదినములనుండియో తిండిలేనివానివలె నాయన్నమును దినుచుండెను.

ఆనందమయి హృదయవేదన యిప్పుడు దూరమైపోయెను. ఆమె సుప్రసన్నవదనముఁ గాంచుటచే వినయుని గుండెలలోని బరువు దిగిపోయెను. ఆనందమయి బాలీసు

తట్టుచుఁ గూరుచుండెను. వినయుఁ డామె పాదముల చెంతఁ జేతిపైఁ దల నుంచుకొని యరశాయియై పడియుండెను. మఱియు నాతఁడు ప్రపంచ మంతయును మఱచిపోయి పూర్వమువలెనే యుత్సాహముతో నానందమయితో మాటలాడుచుండెను.

౮

ఈ బంధ మొంకటి తెగినను, వినయుని హృదయమునం దింకొక బంధ మతిదుస్సహము గానుండెను. ఆతఁ డానందమయి మందిరమునుండి వెడలి యొక్కసారిగా వీధివెంట బయలుదేఱెను. పాదములు భూమిపై నిలువనంతటి వేగముతో నాతఁడు పోవుచుండెను. ఆతఁ డింతవరకు నొరులకడఁ దెలుపుటకుఁగూడ సంశయించుచున్న కార్యము నిప్పు డందఱియెదుటను బ్రత్యక్షముగఁ జేయవలయు నని నిశ్చయించుకొనియెను. వినయుఁ డొకముహూర్తములో 78 వ నంబరు గృహద్వారమునొద్దకుఁ జేరుకొనియెను. అప్పటికే యావలివైపునుండి పరేశుఁడు నచ్చటికి వచ్చి చేరుకొనియెను.

“వినయబాబూ ! దయచేయుము ! చాలసంతోషముగానున్నది” అని చెప్పుచుఁ బరేశుఁడు వినయుని వీధిగదిలోనికిఁ దీసికొనిపోయి కూర్చుండఁ జేసెను.

ఒకచిన్న టేబిలు, క్రింద నొకపక్క నొక బెంచి, మఱియొకవైపునఁ గఱ్ఱకుర్చీలును బెత్తపుఁగుర్చీలును, గోడపై నొకవైపున రంగువైచిన యేసుక్రీస్తుని పటమును, మఱియొకవైపునఁ గేశచంద్రసేనుని పటము నుండెను. టేబిలుపై నొకటిరెండు వార్తాపత్రికలుండెను. పక్క నొక పేపరు వెయిటుండెను.

ఒకమూలఁ జిన్నయలమా రుండెను. దానినిండ వరుసలువరుసలుగా థియోడరు పార్కరుగారిచే రచింపఁబడిన పుస్తకము లన్నియు నమర్పఁబడి యుండెను. అలమారునకుఁ బైభాగమున గుడ్డతోఁ గప్పఁబడిన యొకగులోబుండెను.

వినయుఁడు కూరుచుండెను. కాని యాతని హృత్పిండ మతివేగముగఁ గొట్టుకొని పోవుచుండెను. అతనివెనుకవైపున నున్న ద్వారమును దెఱచుకొని యెవ్వరైన నాలోపలఁ బ్రవేశింతురేమో యని యాతనిమనసునకుఁ దట్టుచుండెను.

పరే—వినయబాబూ! నేఁడు సోమవారముగావున సుచరిత నామిత్రునికుమార్తెకుఁ జదువుచెప్పుటకై వారియింటికిఁ బోయినది. చదువుకొనువారిలోఁ బసియాఁడువారుగూడ నుండుటచే సతీశుఁడు నామెతోడనే యచ్చటికిఁ బోయియున్నాఁడు. ఇప్పుడే వారిని నేనచ్చటకిఁ బంపి వచ్చితిని. ఇంకఁ గొంతయాలస్యమైనచో మీదర్శనము దొరకక పోయియే యుండును.

ఆమాట విని వినయుఁ డొక్కసారిగా నాశాభంగమును, హృదయపరితాపము ననుభవించెను. పరేశునితో నాతఁడు మనోహరముగను సహజముగనే మాటలాడెను. ప్రసంగవశమునఁ బరేశుఁడు వినయుని చరిత్ర మంతయును దెలిసికొనియెను. వినయునకుఁ

దల్లిదండ్రులు లేరు. ఆతని పినతండ్రి స్వగ్రామమునందే యుండి జమీని జూచుకొనుచుండెను. అతని కిరువురు తనయు లుండిరి. వారిరువురును వినయునితోఁ గలసి యొకచోటనే చదువుకొనిరి. అందుఁ బెద్దవాఁడిప్పుడు జిల్లాకోర్టులోఁ బేరుగల వకీలై యుండెను. చిన్నవాఁడు చదువుకొను సమయముననే యాకలకత్తానగరమున మరణించెను. వినయుఁడు డిప్యూటీ మేజస్ట్రేటుపనికొఱకుఁ బ్రయత్నించు నని పినతండ్రి యాశపడుచుండెను. కాని వినయుఁ డట్టియత్నము నుజేయక నిరర్థక కార్యములయందు నియుక్తుఁడై యుండెను. ఈ సంగతు లన్నియుఁ బరేశుఁడు తెలిసికొనెను.

గంటసేపయ్యెను. పనిలేకుండ నూరక చాలసేపు గూరుచుండుట మర్యాద కాదని యెంచి వినయుఁడు లేచి "నా ప్రియమైన సతీశునిఁ జూచుట కలుగనందుకు విచారముగా నున్నది. నేను వచ్చితినని యాతనితోఁ జెప్పుడు!" అనియెను.

పరే—ఇఁక నించుకసేపాఁగినచో నాతని గూడఁ జూడవచ్చును. వారు వచ్చు వేళయైనది. ఆలస్యము కాదు.

ఆచిన్నమాటపై నాధారపడి మరలఁ గూర్చుండుట వినయునకుఁ జిన్నతనముగాఁ దోఁచెను. పరేశుఁ డింకొకసారి నిర్బంధించినచో నాతఁ డాఁగియే యుండును. కాని పరేశుఁ డధికప్రసంగము చేయుస్వభావము కలవాఁడు కాఁడు. అందుచే వినయునకు సెలవు గైకొనవలసియే వచ్చెను. అప్పుడు పరేశుఁడు "మీరప్పుడప్పు డొకసారి దయచేయుచుండుఁడు" అనియెను.

వినయుఁడు వీథిలోనికి వచ్చెను గాని యప్పు డాతనికిఁ దనయింటికిఁ సినపని యేమియు నున్నట్లు దోఁచలేదు. అచ్చట నేమియుఁ బనిలేదు. పత్రికలలో లేఖలను వ్రాయుచుండును. ఇంగ్లీషునం దాతని లేఖలను జాలమ వముతోఁ జదివి యానందించుచుండిరి. కొన్నాళ్లనుండి యాతనికి వ్రా దోఁచుటలేదు. వ్రాయుటకు బల్లయొద్దఁ గూర్చుండుటయే తడవుగా నాత చెదరిపోవుచుండెను. అందుచేతనే వినయుఁడిప్పు డిటువైపు తిరుగక యకా మతియొకవైపునకు బయలుదేరెను. ఆతఁడు రెండుమూఁడడుగులు నడచునప్పటికే "వినయబాబూ! వినయబాబూ!" అని యొక బాలకంఠస్వరము బిగ్గరగా వినవచ్చెను.

వినయుఁడు వెనుదిరిగి చూచెను. ఒకయద్దెబండిలోనుండి తొంగితొంగి చూచుచు సతీశుఁ డట్లు పిలుచుచుండెను. ఆబండిలో నింకొకరుకూడఁ గూర్చుండియుండిరి. దుస్తులనుబట్టి వారెవ్వరో తెలిసికొనుట యాతని కంతకష్టము లేకపోయెను. బంగాలీ పెద్దమనుష్యుల మర్యాదననుసరించి యాతఁ డాబండివైపునకుఁ జూపులు నిగుడింపకుండ నుండుటకు సమర్థుఁడు కాకపోయెను. ఇంతలో నచ్చటనే బండి దిగి సతీశుఁడు వచ్చి యాతనిచేయి పట్టుకొని "రమ్ము! మాయింటికి రమ్ము!" అనియెను.

వినయ— నేనిప్పుడు మీయింటియొద్దనుండియే వచ్చుచున్నాను.

సతీ— ఆహా! మేము లేనప్పుడు వచ్చితివా?

సతీశునినిర్బంధమును వినయుఁడు తప్పించుకొనఁ జాలకపోయెను. ఆబాలుఁడు వినయుని బంధితునివలెఁ గావించి గృహంబునఁ బ్రవేశించి బిగ్గఱగా "బాబా! వినయబాబును దీసికొని వచ్చితిని" అనికేక వైచెను. పరేశుఁడు లోపలినుండి వచ్చి వినయునిం గాంచి మందహాసము చేయుచు "బలవంతునిచేతికి దొరకితివి. శీఘ్రముగఁ దప్పించుకొనుట కవకాశము లేదు. సతీశా! మీయక్కను బిలువుము!" అనియెను.

వినయుండు లోనికిఁ బోయి కూర్చుండెను. అతనిగుండెలు కొట్టుకొనుచుండెను. పరేశుఁ డాతనిం గాంచి "మీకాయాసముగ నున్నట్టున్నది! సతీశుఁడు కొంటెపిల్లవాఁడు బలవంతముగ లాగికొనివచ్చెను గాఁబోలును!" అనియెను. సతీశుఁడు తన సోదరిని వెంటఁబెట్టుకొని యాగదిలోఁ బ్రవేశించెను. అప్పుడు వినయుఁ డొకమృదుమధురపరిమళము నాఘ్రాణించెను; అంతలోనే పరేశుఁడు "రాధా! వినయబాబు వచ్చెను. నీ వీయన నెఱుఁగుదువు!" అని పలికినపలుకు నాకర్ణించెను. అందుచే వినయుఁ డొకరపడి మొగమెత్తి చూచెను. సుచరిత యాతనికి నమస్కారముచేసి యెదురుగ నొకకుర్చీపైఁ గూర్చుండెను. ఈసారిమాత్రము వినయుఁడు ప్రతినమస్కారము చేయుట మఱచిపోలేదు.

సుచ— మీరు వీథివెంటఁ బోవుచుండిరి. సతీశుఁడు మిమ్ములను జూచి యెంత హెచ్చిన నాఁగక బండిలోనుండి తొంగితొంగి చూచుచు మిమ్ములను బిలువ నారంభించెను. మీ రేదియో పనిమీఁదఁ బోవుచుండి యుందురు— ఇబ్బంది యేమియును గద!

సుచరిత నిస్సంకోచముగఁ దనతో మాటలాడు నని వినయుఁ డూహించియుండెను. అతఁడు నివ్వెఱపడి తత్తరముతో "లేదు. చెడిపోవుపని యేమియును" అనియెను.

అప్పుడు సతీశుఁడు సుచరితకొంగు పట్టుకొని లాగుచు "అక్కా! ఒకసారి యినిమ్ము! నాసంగీతపుబెట్టెను దెచ్చి వినయబాబునకుఁ జూపించెదను" [illegible]ను.

[illegible] సుచరిత నవ్వుచు "ఈభక్తియార్ ఖిల్జితో సహవాసము చేసినవారికి నామది, [illegible]గు. వారితనిసంగీతము వినవలసినదే. ఇంకను నెన్నికష్టములైనఁ బడవలసినదే. [illegible]బాబూ! నీయాస్నేహితుఁడు చిన్నవాఁడే కాని యాతనిస్నేహాధికారము [illegible]ము చాలగొప్పది. దీని మీరు సహింపఁజాలుదురో చాలరో మాత్రము నే [illegible]ంగను." అనియెను.

ఇట్లు నిస్సంశయముగఁ దనతో సంభాషించుచున్న సుచరితతో స్వభావముగ మాటలాడుటకు వినయునకు సాధ్యము కాకపోయెను. అతఁడు సిగ్గుపడఁగూడదని ప్రతిజ్ఞ

చేసికొనియును నేదియో యొకవిధమున దొంగచాటుగా నతికియు నతుకనట్లు "లేదు— ఏమియును లేదు మీరట్లు—నేను—నాకట్లుండుట చాలసంతోషమే!" అనియెను.

ఇంతలో సతీశుఁడు సోదరియొద్దనుండి తాళమును దీసికొనిపోయి సంగీతపుఁ బెట్టెను దీసికొని వచ్చెను. అది యొకయద్దపుఁబెట్టెలోఁ దరంగితనీలసముద్రమువలె నల్లనిరంగుగలగుడ్డపై నాటపడవతోఁగూడ నమర్పఁబడి యుండెను. సతీశుఁడు సంతోషముతో దానిని వాయించుట కారంభించెను ఆస్వరములోఁగూడ నాయాటపడవ కదలుచుండెను. అప్పుడాబాలుఁడా పడవవంకను వినయునివంకను జూచుచుఁ దనహృదయోత్సాహము నడంచుకొనఁజాలక యదేపనిగ వాయించుచుండెను. ఈవిధముగా సతీశుఁడు నడుమనుండి వినయునిసంకోచమును మెల్లమెల్లగఁ దొలఁగించుచుండెను. నడుమనడుమఁ దలయెత్తి యొకసారి సుచరితతోఁగూడ నాతఁడు మాటలాడుచునే యుండెను.

ఇట్లు కొంతసేపైనతరువాత లీల యాగదిలోనికి వచ్చి "అయ్యయు, నమ్మయును మిమ్ములను మేడమీఁదికి రమ్మనుచున్నారు" అని చెప్పెను.

౬

మేడమీఁదివరాండలో నొకబల్లపైఁ దెల్లనివస్త్రము పఱుపఁబడి యుండెను. దానికిఁ జుట్టును కుర్చీ లమర్పఁబడెను. ఆప్రక్కను పిట్టగోడవంచను జిన్నచిన్నకుండీలతోఁ బూలమొక్క లుంపఁబడియెను. ఆమోరనే వీధిలోనిదిరిసెనచెట్లకొమ్మలను, దమాలవృక్షశాఖలు నలముకొని యుండెను. వానినవపల్లవములు వర్షజలక్షాళితములై మిలమిల మెఱయుచుండెను. ఇంకను సూర్యాస్తమయము కాలేదు. పశ్చిమాకాశము నుండి నీరెండ యావరాండాయం దొకభాగమునకుఁ బ్రసరించుచుండెను.

మేడపై నెవ్వరును లేరు. కొంతసేపటికి సతీశుఁడు తెల్లనినల్లని రంగులుగలకుక్కపిల్లను వెంటఁబెట్టుకొని యచ్చటికి వచ్చెను. ఆకుక్కపేరు టుడే. ఆకుక్క నేర్చినవిద్యయంతయును సతీశుఁడు వినయునకుఁ జూపించెను. అది యొకకాలెత్తి సలాముచేయును; తల నేలపైనుంచి ప్రణామము చేయును; చిన్నబిస్కట్టుముక్కను జూపినచోఁ దోఁకపైఁ గూర్చుండి రెండుకాళ్ళను జోడించి భిక్షమడుగును. ఈవిధముగా గుక్క సంపాదించిన కీర్తిని సతీశుఁడు తనవశము చేసికొని గర్వపడుచుండును. ఈయశోలాభమాత్రమున వాకుక్క కించుకంతయు నుత్సాహములేదు. అది కీర్తికంటె బిస్కట్టుముక్కనే యెక్కుడుగ గౌరవించుచుండును.

ఏదియో యొకగదిలోనుండి రమణీమణులమందహాసములును, గాజులకలనిస్వనములును, వానితోఁగూడ నొకపురుషకంఠస్వరమును వినవచ్చుచుండెను. అంతులేని యాహాస్యాలాపములు వినయుని హృదయాంతరమునం దొకయపూర్వమాధుర్యమును, దానితోఁగూడ నొకవిధమగు నీర్ష్యావేదనమును గలిగించుచుండెను. ఈవిధముగా

మందిరపు లోపలి సుందరీమణుల యానందకలకలస్వనములను వినయుఁడు తనవయస్సు వచ్చినతరువాత నెన్నఁడును వినియుండలేదు. ఈయానందమధురరస మాతని కెంత సమీపమునఁ బొంగిపొరలుచున్నను, వానిని కడు దూరమునం దున్నట్లే యుండెను. అప్పుడు వినయునకు చెవులు గింగురుమనునట్లు సతీశుఁడు పలుకుచున్నపలుకులలో నొక్కదానినైనను మనసుంచి వినుటకు సమర్థుఁడు కాఁజాలకపోయెను.

ఇంతలో పరేశునిభార్య తనముగ్గురుకన్యలను వెంటఁబెట్టుకొని యటకు వచ్చెను. వారితోఁగూడ నొకయువకుఁడు కూడ వచ్చెను. అతఁడు వారికి దూరబంధువు.

పరేశునిభార్యపేరు వరదాసుందరి. ఆమె యంతచిన్నవయసుది కాదు. కాని యామె యతిప్రయత్నములో నలంకరించుకొని వచ్చినట్లు చూచినమాత్రముననే బోధపడును. ఆమె చాలకాలము క్రిందటివఱకును సామాన్యస్త్రీలవలెనే కాలముగడపి యాకస్మికముగా మాత్రి యిప్పటికాలపు నాగరికయువతులను మీరి చరింపవలయునని యాత్రపడుచుండెను. అందుచేతనే యామెసిల్కుచీర యంతగా గరగరలాడుచుండును. ఆమె జోడుమడిమ లంతగా టకటకలాడుచుండును. ఆమె యీపృథ్వియందలి యన్నివస్తువులను బ్రాహ్మసమాజము లుపయోగించునవి యగునా కాదా యని కడు జాగరూకతతోఁ బరిశీలించుచుండును. ఆకారణముచేతనే యామె సుచరితకు రాధారాణి యనునామమును మార్చివైచెను.

ఆమెపెద్దకుమార్తె పేరు లావణ్య. ఆమె లావుగా నుండును. నగుమొగముతో నుత్సాహముగ నుండును, అందఱితోడను గలసిమెలసి మాటాడుట యామె కెంతయో వేడుకగా నుండును. ఆమెముఖమండలము వర్తులమై, కన్నులు విశాలములై, శరీరచ్ఛాయ సముజ్జ్వలశ్యామలమై యుండును. ఆమె వేషభూషణరచనలయం దంతటి వేడుకపడుస్వభావముకలదికాదు. కాని యీవిషయమున నామె తల్లి యిష్టము ననుసరించి ప్రవర్తించుచుండును. ఎత్తుమడిమలుగలజోళ్ళను దొడుగుట యామె కిష్టము లేదు. అయినను మానుట కవకాశములేదు! ఉదయమునందే దుస్తులను దొడుగుసమయమునఁ దల్లియే యామెకు పౌడరువైచి చెక్కిలులను రంగు వైచుచుండును. ఆమె లావుగనుండుటచేఁ దల్లి యామెకు దుస్తులను గుత్తముగఁ గుట్టించును. వానిని దాల్చి యామె మరలో నొక్కఁబడినబేలువలె నుండును.

రెండవకుమార్తెపేరు లలిత. ఆమెయెల్లవిషయములందును నప్పగారికి విపరీతముగనుండును. ఆమె యక్కకంటెఁ బొడుగు—సన్నము—మఱియు నించుకనలుపు. ఆమె మితభాషిణి—తనకుఁ దోఁచినపద్ధతిని మెలంగుట కిష్టపడుచుండును. ఆమె స్పష్టముగను గఠినముగను, ఖండితముగను మాటలాడుచుండును, వరదాసుందరి యామె యనిన భయపడుచుండును. ఆమెమనసు నొప్పించుటకుఁ దల్లి యొంతమాత్రమును సాహసింపఁజాలదు.

చిన్నబిడ్డ యగు లీల పదునొకొండేండ్లది. ఆమె పరుగెత్తుటయందును, గంతులు వైచుటయందును, నల్లరిచేయుటయందును మిగుల సమర్థురాలు. ఆమెకును సతీశునకును నిరంతరమును పోరాటము జరుగుచునే యుండెను. విశేషించి కుక్కనుగూర్చియే నాది నాది యని యాయిరువురకును జగడము! ఇంతకు నది యెవ్వరిదైనట్టును దేలనే లేదు. ఆకుక్క యింతవఱకు నెవ్వరిని దనయధికారిగా నిశ్చయించుకొనలేదు. కాని యాయిరువురిలోనను సతీశునే యది యెన్నుకొనియుండెను. ఏమనిన— లీలయనుగ్రహావేగమును భరించుట కాక్షుద్రజంతువు సహింపజాలకపోయెను. ఆబాలికయాదరముకంటె నాబాలకునిశాసనమే దానికి సహ్యముగా నుండెను.

వరదాసుందరి వచ్చినతోడనే వినయుఁడు లేచి యించుక వంగి నమస్కారము చేసెను. అప్పుడు పరేశుఁడు భార్యం గాంచి "ఆదినమున వీనిగృహమునందే మేము." అనియెను.

వర— ఔను! మంచియుపకారము చేసినారు. మీకు నేననేక ధన్యవాదములం గావించుచున్నాను.

ఆమాటలు విని వినయుఁడు సంకుచితుఁడై యెట్టిప్రత్యుత్తరమును జెప్పఁజాలక పోయెను. ఆకాంతలతో వచ్చినయువకునితోడనే యాతఁడు సంభాషించుచుండెను. అతని పేరు సుధీరుఁడు; కాలేజిలో బీయే పరీక్షకు జదువుచుండెను. అతనియాకృతి దర్శనీయమైనది; గౌరవర్ణము; అతఁడు సులోచనములను దాల్చియుండెను. అతని కప్పుడే నూగుమీసములు మొలకెత్తుచుండెను. అతనిహృదయము చంచలమైనది; ఒక్కచో నొకగడియైనఁ గూర్చుండఁజాలఁడు; ఏదియో యొకపని చేయుచునే యుండును. అతఁ డెప్పుడు నాఁడువారితోఁ గలసి నవ్వుచుఁ బరిహసించుచు నల్లరి చేయుచుండును. వారుకూడ నాతనిఁ దర్జించుచుందురు గాని యాతఁడు లేకున్నచో వారి కొకనిమిషమైన గడవదు. సర్కసులు చూపించుటకు, జూయలాజికల్ గార్డెనునకుఁ దీసికొనిపోవుటకును, మంచి మంచివస్తువులను గొని తెచ్చి పెట్టుచుండుటకును నాతఁడు సిద్ధముగా నుండును. స్త్రీలతోఁ గలసి యంతనిస్సంశయముగా సుధీరుఁడు మెలఁగుట వినయున కాశ్చర్యముగను, గ్రొత్తగను దోఁచెను. ఇట్టివ్యవహారమునుగూర్చి వినయుఁడు మొదట మనసులోనే యాతని నిందింపఁదొడగెను. కాని క్రమముగా నాతనిహృదయమునఁ దిరస్కారముతోఁబాటు నీర్ష్యాభావముకూడ సమ్మిళితమయ్యెను.

వరదాసుందరి వినయునిం గాంచి "మిమ్ము నొకటిరెండుసారులు సమాజములోఁ జూచినట్లున్నదే!" అనియెను.

వినయున కప్పుడు తనతప్పు బయటఁ బడినట్లయ్యెను. అతఁ డనావశ్యకముగా సిగ్గుపడుచు "ఔను. నేను కేశవచంద్రుని యుపన్యాసమును వినుటకై యప్పుడప్పుడు వచ్చితిని" అనియెను.

వర—మీరు కాలేజిలోఁ జదువుకొనుచున్నారా ?

విన—లేదు. ఇప్పుడు చదువుకొనుట లేదు.

వర—ఎంతవఱకుఁ జదివితిరి ?

విన—ఎం. యే. ప్యాసు చేసితిని.

ఆమాట విని బాలకునింబోలియున్న యాయువకునియందు వరదాసుందరి కత్యంతప్రేమ యుదయించెను. అప్పుఁడామె పరేశునివంకఁ దిరిగి నిట్టూర్పు విడుచుచు "మన మనూ బ్రతికియున్నచో నిప్పటికి వాఁడును ఎం. యే. ప్యాసగును గదా!" అనియెను.

వరదాసుందరిప్రథమసంతాన మగుమనోరంజనుఁడు తొమ్మిదవయేఁటనే మరణించెను. ఏయువకుఁడు పెద్దపరీక్ష ప్యాసయినను, పెద్దయుద్యోగము చేసినను, పెద్ద పుస్తకమును వ్రాసినను, మంచిపనిచేసినను దనకుమారుఁడుజీవించియున్నచో నిట్లుచేయఁగలుగును గదాయని వరదాసుందరి భావించుకొనుచుండును. ఏమైన నేమి; అతఁడు లేఁడు. ఇఁక నిప్పుడామెకుఁ దనకుమార్తెలగుణములను జనసమాజమునందుఁ బ్రచారము చేయుటయే యవశ్యకర్తవ్యమై యుండెను.

ఆమె తనకుమార్తెలచదువునుగుఱించి విశేషముగా వినయునకుఁ దెలియఁజేసెను. తనకుమార్తెలబుద్ధిగుణములనుగూర్చి దొరసాని యెప్పు డెప్పు డేయేరీతిగా గౌరవించెనో యాసంగతులుకూడ వినయునకుఁ దెలుపకుండ నుండలేదు. ఒక్కప్పుడు గరల్‌స్కూలులో బహుమతు లిచ్చుసందర్భమున లెప్టినెంటుగవర్నరుదొరయు, దొరసానియు వచ్చియుండిరి. అప్పుడు వారికిఁ బుష్పహారములు వైచుటకు బడిపిల్లలందఱిలోను లావణ్యమయి యొక్కతెయే నియోగింపఁబడియెను. అప్పుడు దొరయును దొరసానియును గూడ లావణ్యమయి నెన్నియో ప్రియభాషణములతో నాదరించిరి. ఆసంగతియు నామె వినయునకుఁ దెలుపకపోలేదు.

తుట్టతుదకామె లావణ్యమయిం బిలిచి "అమ్మా! కుట్టుపనినిగుఱించి నీకు బహుమానము వచ్చినది కాదా ? ఏదీ ! దానిని దీసికొనిరమ్మా !" అనియెను.

ఊలుదారముతోఁ జేయఁబడినచిలుక—ఇది యాయింటికి వచ్చుమిత్రులచేతను బంధువులచేతను విఖ్యాతిం గాంచినది. ఇది చాలదినములక్రిందట దొరసానిసాయముచే లావణ్యమయిచేఁ జేయఁబడినది. ఈరచనమునందు లావణ్యమయి గొప్పతన మున్నదని కాదు—నూతనముగ నుండుటచేఁ బ్రదర్శనీయ మయ్యెను. ఆప్రదర్శన మెందులకని పరేశుఁడు వారించుచునే యుండును గాని క్రమముగా వారిఁ దట్లు చెప్పుట మానుకొనియెను. లావణ్యమయి యాయూలుచిలుకను దెచ్చి చూపెను. వినయుఁడు విస్మయవిస్ఫారితనయనములతో నందలి చిత్రరచనముం గాంచుచుండెను. అంతలో సేవకుఁడువచ్చి పరేశబాబునకొకయుత్తరము నిచ్చెను. పరేశుఁ డాచీటిని జదువుకొని ప్రఫుల్లవదనముతో "బాబును మేడమీఁదికిఁ దీసికొని రమ్మా !" అనియెను.

వర—వారెవరు ?

పరే—నాచిన్ననాఁటిస్నేహితుఁడు కృష్ణదయాళుఁడు. నాకు బరిచితునిం జేయుటకై తనకుమారుని బంపియున్నాఁడు.

ఆకస్మికముగ వినయునిగుండె గుభిల్లుమనియెను. మొగము వివర్ణమైపోయెను. పరక్షణమందే యాతఁడు ధైర్యము తెచ్చుకొనియెను. ఇప్పు డాతఁ డెట్టిప్రతికూలవాదము నైనను ఖండించి తన్ను సమర్థించుకొనుటకు సంసిద్ధుఁడైయుండెను. బ్రాహ్మసామాజికుల నగౌరవముగఁ జూడవలయు ననియు, వారిని బాగుగఁ బరిశీలించి పరీక్షింపవలయుననియు గోరా మొదటినుండియు బోధించుచు వినయున కించుకయుత్తేజనము గలిగించి యుండెను.

౧౦

ఒకతబుకులో రుచ్యము లగుఖాద్యవస్తువులను, తేనీటికిఁ గావలసినవస్తువులను సిద్ధముచేసి యొకసేవకునిచేఁ బట్టించుకొని సుచరిత మేడమీఁదికి వచ్చి కూర్చుండెను. ఆసమయమునకే సేవకునితోఁగూడ గోరాయు వచ్చుటఁ బ్రవేశించెను. సుదీర్ఘమును శుభ్రము నగు నా గోరారూపమును, వేషమును గాంచి యందఱును విస్మితులైపోయిరి.

అతని కపాలమున గంగామృత్తికారేఖలు ముద్రితములై యుండెను. అతఁ డొక ముదుకదోవతిని గట్టి పట్టుపట్టీలుగలచొక్కాను దొడిగి ముతకచాదరును భుజముపై వైచుకొని స్వదేశపాదరక్షలను దాల్చియుండెను. అతఁడు వర్తమానకాలపు నవపద్ధతులకు విరుద్ధముగా మూర్తీభవించినవిద్రోహమువలెఁ గానవచ్చుచుండెను. అతని యిట్టివేషము నిదివఱకు వినయుఁడును జూచియుండలేదు. ఇప్పుడు గోరాహృదయమున నొకవిరోధాగ్ని భగ్గునఁ బ్రజ్వరిల్లిపోవుచున్నది.

అతఁడు ప్రాతఃకాలమున నొకస్టీమరుపై నెక్కి గ్రహణస్నానమునకు యాత్రికులతోఁ గలసి త్రివేణికిఁ బోవుచుండెను. మార్గమధ్యమున నొక్కొక్కస్టేషను నుండి చాలమంది స్త్రీలొక రిద్దఱు పురుషుల సాయము దీసికొని స్టీమరు నెక్కుచుండిరి కాని కావలసినంతచోటు లేకపోవుటచే సమ్మర్దముగా నుండెను. కాలిబురదచే స్టీమరంతయును బాడియగుటవలనఁ దొందరలో నెక్కునప్పుడు జారి కొందఱు గంగాజలమునఁ బడిపోవుచుండిరి కొందఱిని కళాసులు త్రోసివైచుచుండిరి. ఎక్కినవారు కొందఱు తమతోడివారు రాలేదని వెనుదిరిగి చూచి వ్యాకులపడుచుండిరి. నడుమ నడుమ జడివాన యొకటిరెండుసారులు కురిసి వారిని దడిపివైచుచుండెను. కూర్చుండుతా వంతయును బురదతోఁ నిండియుండెను. పాపమప్పు డాయాత్రికుల మొగములను, గన్నులను భయము, చాంచల్యము, ఉత్కంఠ, కరుణ మున్నగుభావములచే నిండి

యుండెను. సామాన్యులగు వా రేమి చేయఁగలరు ? స్టీమరు నాయకుఁడు మొదలు సేవకునివఱకు నెవ్వరును దమ కెట్టి సాయమును జేయకుండుటచే నేమియు గత్యంతరమును గానక వారు కొట్టుమిట్టాడుచుండిరి. ఇంతేకాక కళాసులుగూడ వారిని భయపెట్టుచుండిరి. అట్టిసమయమున గోరా సాధ్యమైనంతవఱకు యాత్రికులకు సాహాయ్యము చేయుచుండెను.

అప్పుడు పైని మొదటిక్లాసు డెక్కు మీఁద నొకయాంగ్లేయుఁడును నొకనవనాగరికబంగాళీబాబును గూర్చుండి పరస్పరమును హాస్యసంభాషణము చేసికొనుచుఁ జుట్టలు కాల్చుకొనుచుఁ యాత్రికులఁ జూచుచుండిరి. అప్పుడప్పు డాయాత్రికులకష్టములను వారి యవివేకమును గూర్చి పరిహసించుచు నాయాంగ్లేయుఁడు నవ్వుచుండెను. బంగాళీబాబును వానితోఁ గూడఁ బల్లిగిలించుచుండెను. ఈవిధముగా నొకటిరెండు స్టేషనులు గడచునప్పటికి గోరా యిఁక సహింపఁజాలకపోయెను. తోడనే యాతఁడు పైకిఁ బోయి వజ్రగర్జనము చేయుచు "ఛీ! మీకు సిగ్గులేదా" అనియెను. ఆంగ్లేయుఁడు కఠోరదృష్టితో గోరా యాపాదమస్తకమును బరీక్షించెను. అప్పుడు బంగాళీయువకుఁడు "సిగ్గా ? కాదు; మనదేశమునం దింతమంది పశువులవలె మూఢులైపోయిరని సిగ్గుపడవలసినదే ?" అనియెను.

గోరా మొగ మెఱ్ఱవడిపోయెను. ఆతఁడు తీవ్రస్వరముతో "మూఢుని మించిన పశువుకూడ నున్నాఁడు. వాఁడే హృదయములేనివాఁడు" అనియెను.

బంగాళీ కోపముతో "నీ విక్కడ నిలువఁగూడదు ! ఇది మొదటిక్లాసు. ఇది నీచోటు కాదు!" అనియెను.

గోరా—కాదు. నీవంటివారితోఁ గలసియుండుచోటు నాకక్కఱలేదు. ఈ యాత్రికులున్నచోటే నాచోటు! మీక్లాసునకు రమ్మని నన్ను మీరుబలవంతపెట్టవలదు.

అని చెప్పి గోరా క్రిందికి దిగిపోయెను. తరువాత నయ్యాంగ్లేయుఁడు తనపడకకుర్చీచేతులపైఁ బాదములను సాచి పరుండి యొకనవలను జదువుకొనుచుండెను. ఆతనితో నున్న బంగాళీయువకుఁడు మరల నాతనితో మాటాడుటకుఁ బ్రయత్నించెను గాని యాంగ్లేయుఁడు వినిపించుకొనలేదు. ఆతఁడు తాను సామాన్యులగు దేశస్థులవంటివాఁడను గానని నిరూపించుటకై బట్లరుం బిలిచి "తినుటకేమైన యున్నదా ?" అని ప్రశ్నించెను. బట్లరు "లేదు. కొంచెము తేనీరు, రొట్టెయుమాత్రమే యున్నవి." అనియెను. ఆమాటవిని దొరకు వినుపించులాగున నింగ్లీషుభాషతో బంగాళీయువకుఁడు "ఈస్టీమరునందు సదుపాయములు చాల హీనముగా నున్నవి ?" అనియెను.

దొర యెట్టిప్రత్యుత్తరము నీయలేదు. అప్పు డాతనిబల్లపైనుండి న్యూసుపేపరు క్రిందఁ బడిపోయెను. తోడనే బంగాళీ లేచి దానిని దీసి దొరకిచ్చెను. కాని యాదొర

యాతనికొక్క ప్రశంసావాక్యమైనను బహుమానముగ నీయలేదు. స్టీమరు చందననగరమునకుఁ బోయెను. అందఱును దిగిపోవుచున్నయపుడు నాకస్మికముగా దొర గోరాయొద్దకువచ్చి తనటోపీని దీసివైచి "అయ్యా! నేను జేసినతప్పునకు సిగ్గుపడుచున్నాను. నన్ను క్షమింపవలయునని కోరుచున్నాను" అని వేడుకొని వెడలిపోయెను. కాని చదువుకొన్న బంగాళీవాఁడు సామాన్యులగు తనవారి దుర్గతిని గాంచుచు దానినే గొప్పవానివలె విదేశీయునితో నవ్వుచుండెనే కాని, తనకైనఁ దనతప్పు తెలిసికొని పశ్చాత్తాపపడలేదను క్రోధముచే గోరాహృదయము దగ్ధమైపోవుచుండెను. దేశమునందలి జనసామాన్యమంతయు నిట్టే తమ్ముఁ దావవమానించుకొనుచు దుర్గతికి లోనైపోవుచున్నారు. పశువులతో సమానముగఁ జేసినను సహించుచున్నారు. దేశమంతయు నిట్టియజ్ఞానముచే నిక్కృష్టమైపోవుటకు గోరాగుండెలు పగిలిపోవుచుండెను.

దేశమునకుఁ జిరకాలమునుండి సంభవించుచున్న యవమానమును, దుర్గతిని గాంచుచు విద్యాధికు లగువా రేమియును కలుగఁజేసికొనక తమ్ముఁ గాస్తు నిర్భయముగా సంచరించుచు నదియే తమ కెంతయో గౌరవముగా భావించుచున్నారు. ఇది యన్నిటికంటెను గోరాహృదయమును బాధించుచుండెను. అందుచేతనే యాతఁ డిప్పుడు విద్యాధికు లగువారి సమస్తపుస్తకవిజ్ఞానమును, వారి యనుకరణసంస్కారములను సంపూర్ణముగ నాక్షేపించుటకే కపాలమున గంగామృత్తికారేఖలను దాల్చి చెప్పులజోడు తొడిగికొని వికసితహృదయముతో బ్రాహ్మసామాజికులయింటికి వచ్చియుండెను.

గోరా యిప్పటివేషముం గాంచి యుద్వేషమని వినయుఁ డనుకొనెను. గోరా యిప్పు డిచ్చటి కెందుకొఱకు వచ్చెనో తెలియకుండుటచే వినయునిహృదయమున భయమును నించుకసంకోచమును, క్రోధభావమునుగూడఁ గలిగెను.

వరదాసుందరి వినయునితో మాటలాడుచున్నంతసేపును సతీశుఁ డొకమూలఁ గూర్చుండి బొంగరము త్రిప్పుకొనుచు నాటలాడుకొనుచుండెను. గోరా వచ్చినతోడనే యాతఁ డాయాట మాని, వినయునిప్రక్కకు వచ్చి నిలిచి తదేకదృష్టితో గోరాను జూచుచు వినయునిచెవిచెంతఁ జేరి "నీస్నేహితుఁ డితఁడేనా?" అని ప్రశ్నించెను. వినయుఁడు "ఔను!" అనియెను.

గోరా మేడమీఁదికి వచ్చినప్పుడే యొకసారి వినయుని వంకఁ జూచెను. మఱి యాతనిఁ జూడనట్లే యుండెను. ఆతఁడు పరేశునకు నమస్కారము చేసి, నిస్సంశయముగా టేబిలుకడనున్న యొక కుర్చీ నీవలకు లాగి వారికిఁ గొంచెము దూరముగా వైచికొని కూర్చుండెను. అచ్చట నాఁడువాం డ్రున్నారని యెన్నడును లక్ష్యము చేయలేదు. అట్లు చేయుట యాతనికి గౌరవముగా నగపడలేదు. ఇట్టి యనభ్యదరిద్రుని యెదుట నుండి తనబిడ్డలను దీసికొని పోవలయునని వరదాసుందరి భావిం

చుచుండెను. ఇంతలో బరేశుఁడామెను బిలిచి "ఈతనిపేరు గౌరమోహనుఁడు. నాస్నేహితుఁడగు కృష్ణదయాళుని కుమారుడు" అని చెప్పెను.

అప్పుడు గోరా యామెవంకకుఁదిరిగి నమస్కారము చేసెను. సుచరిత యిదివఱకే వినయునివలన గోరాసంగతి వినియున్నను, నీవచ్చినవాఁడే వినయుని మిత్రుఁడని యామె తెలిసికొనఁజాలకపోయెను. ప్రథమదృష్టియందే యామెకు గోరాపైఁ గోపము కలిగెను. ఇంగ్లీషు చదువుకొన్నవారిలో నింతటి పూర్వాచారపరాయణత్వ ముండుటం గాంచి సహించియుండునంతటి సంస్కారమును, సమానభావమును నామెకులేవు.

పరేశుఁడు తనబాల్యమిత్రుఁడగు కృష్ణదయాళునింగూర్చి గోరాకుఁ జెప్పఁదొడంగెను. మాచిన్నతనమున మేమిరువురమును గాలేజీలో జతగానుండి చదువుకొన్నాము. మాయిరువురిబుద్ధులును గొండశిఖరములపై నుండెడివి. ఎట్టిదానిని విశ్వసించువారము కాము; హోటలులో భుజించుటయే కర్తవ్యకార్యముగా భావించెడివారము. మేమిరువురమును జాలదినములు సంధ్యాసమయమున గోళదీర్ఘికయందుండి ముసల్మాను దుకాణమున కబాబులను దినుచు రాత్రి రెండుజాములవఱకును హిందూసమాజసంస్కారవిషయమునుఁ జర్చించుచుండెడివారము.

వరదాసుందరి యంతయును విని "ఇప్పుడాయన యేమి చేయుచున్నారు?" అని ప్రశ్నించెను.

గోరా—ఆయన యిప్పుడు హిందూమతాచారములను బాలించుచున్నారు.

వరదాసుందరి కోపములో మండిపడుచు "అట్లుచేయుట కాయనకు సిగ్గులేకపోయినదా" అనియెను.

గోరా నవ్వుచు "సిగ్గుపడుట దుర్బలస్వభావుల లక్షణము! కొందఱు కొందఱు తండ్రిపేరు చెప్పుకొనుటకుఁగూడ సిగ్గుపడుచుందురు" అనియెను.

వర—పూర్వ మాతఁడు బ్రాహ్మసామాజికుఁడు కాఁడా?

గోరా—ఒకప్పుడు నేను కూడా బ్రాహ్మసామాజములోనివాఁడనే.

వర—ఇప్పుడు మీరు సాకారోపాసనమును విశ్వసించుచున్నారా!

గోరా—కారణము లేకుండ సాకారమును నిరసించునంతటి కుసంస్కారము నాహృదయమునకు లేదు. సాకారమును నిందించినంతమాత్రమున దానికి లోపము కలుగునా? ఆకారరహస్యమును భేదించుటకు సమర్థు లెవ్వరున్నారు?

పరేశుఁడు మందహాసము చేయుచు "ఆకార మనఁగనే యంత విశిష్టమై యుండును." అనియెను.

గోరా—అంతము లేకున్నచోఁ బ్రకాశమే లేదు. అనంతుఁడు దనప్రకాశము కొఱకే యంతము నాశ్రయించుచుండును. కాకున్నచో నాతనికిఁ బ్రకాశమెక్కడిది!

ఎక్కువనికిఁ బరిణామము లేదో యాతనికి సంపూర్ణత్వమును లేదు. వాక్యమధ్యమునందలి భావమువలెనే యాకారమధ్యమున నిరాకారము పరిపూర్ణమైయున్నది.

హరిదాసుందరి తల యూచుచు "నిరాకారముకంటె సాకారమే పరిపూర్ణమైనదనియా మీరు చెప్పుచున్నారు ?" అనియెను.

గోరా — నేను చెప్పకపోయినంతమాత్రమున వచ్చిన దేమియును లేదు. ఈప్రపంచమునం దాకారము మనమాటలపై నాధారపడి యుండలేదు. నిరాకారమే సత్యముగాఁ బరిపూర్ణత్వము నందియున్నచో నింక నాకారమున కెచ్చటను జోటులేకయే యుండును.

ఈయుద్ధతుని వాదమును ఖండించి యెవ్వరైన నీతనికిఁ బరాభవము కల్పించిన బాగుగ నుండునని సుచరిత వేడుకపడుచుండెను. వినయుఁ డాతనిమాటల నాలకించుచు నూరకుండుట యామెకుఁ గష్టముగా నుండెను. గోరా యెంతతీవ్రముగ మాటలాడుచుండెనో యాతనిఁ దిరస్కరింపవలయునను నుద్దేశము సుచరితహృదయములో నంతకంటెఁ దీవ్రముగు నుండెను.

ఇంతలో సేవకుఁడు తేనీరుకొఱకు వేడినీళ్ళను దెచ్చెను. సుచరిత లేచి తేనీరు సిద్ధముచేయుపనియం దుండెను. నడుమనడుమ నొకసారి వినయుఁడు భయముతో సుచరిత మొగమువంకఁ దిలకించుచుండెను. ఉపాసనాసందర్భమున నిప్పుడు గోరాచెప్పిన మాటలయెడలఁ దనకభిప్రాయభేదము లేకపోయినను బిలువని పేరంటముగా నితరమతస్థుల యింటికి వచ్చి గోరా వారికి విరుద్ధముగు తనయభిప్రాయమును నిస్సంశయముగాఁ బ్రకటించుట వినయునకుఁ జాలకష్టముగా నుండెను. గోరా యిప్పటికీ పోచరణముతోఁ బరేశునియాత్మసమాహితప్రసన్నభావమును బోల్చి యెల్లవిధముల విమర్శింపఁగా వినయునిహృదయము పరేశునియెడల భక్తిపూర్ణమైపోయెను. అప్పు డాతఁడు తనలో "అభిప్రాయభేదములతో నిమిత్తము లేదు. అంతఃకరణమధ్యమునఁ బూర్ణత్వము, సత్యత్వము, ఆత్మప్రసన్నత్వము — ఇవియే యన్నిటికంటెను దుర్లభము లైనవి. మాటలలోఁ గొన్ని సత్యములును, గొన్ని యసత్యములను నైకొని యెంతతర్కించిన నేమిలాభము? అనుభవమునందు సత్యమైన దేదియో యదియే శుద్ధసత్యము!" అని భావించుకొనియెను.

పరేశుఁడు సంభాషణసమయమున నప్పుడప్పుడు తనకన్నులను మూసికొని తన హృదయాంతరాళమునందలి దివ్యశక్తి నాకర్షించుచుండెను. ఇది యాతని కభ్యాసము. అప్పటిపరేశుని నిర్మలాంతఃకరణవిశిష్టంబగు శాంతవదనమును వినయుఁడు తదేకదృష్టితో గాంచుచుండెను. అట్టి వృద్ధునియందు భక్తినిఁ జూపక పెంకివాదము చేయుచున్న గోరాను జూచి యాతఁడు చిరాకుపడుచుండెను.

సుచరిత తేనీరు సిద్ధము చేసి పరేశుని మొగమువంకఁ జూచెను. ఎవ్వరి కీయవచ్చునో యెవ్వరి కీయఁగూడదో యని యామెకు సంశయము కలిగెను. అప్పుడు వరదాసుందరి గోరాను జూచి "మీ రివి యేమియును దీసికొనరు కాఁబోలును!" అనియెను.

గోరా—తీసికొనను.

వర—ఏమి? జాతిపోవునా?

గోరా—ఔను.

వర—మీరు—జాతిని విశ్వసింతురా?

గోర—ఏల విశ్వసింపఁగూడదు? సమాజమును గౌరవించుచున్నప్పుడు జాతినిగూడ గౌరవింపవలయును.

వర—సమాజము చెప్పినవాని నెల్ల మీరు నమ్మెదరా?

గోరా—నమ్మకున్నచో సమాజమునకు భంగము కలుగదా?

వర—కలిగినచో నష్టమేమి?

గోరా—అందఱమును గూర్చుండియున్న కొమ్మవిఱిగిపోయినచో నష్టములేదా?

సుచరిత మనసులో నత్యంతవిరక్తయై "అమ్మా! ఈవృథావాదములవలన నేమి లాభము? వారు మనతేనీరు త్రాగరు!" అనియెను.

అప్పుడు గోరా తనతీక్ష్ణదృష్టి నొకసారి సుచరితవంకకు మరలించెను. సుచరిత వినయునివంకఁ జూచి యించుక సంశయముతో "మీరో?—" అనియెను.

వినయుఁ డెప్పుడును తేనీరు త్రాగలేదు; మసల్మానులు చేయు రొట్టెలను బిస్కట్లను దినుట యాతఁడు చాలదినములు మానివైచెను. కాని యిప్పుడు తినకుండ నుండుటలేదు. వినయుఁ డప్పుడు ధైర్యముతో మొగ మెత్తి "తినకేమి?" అని గోరా మొగమువంకఁ జూచెను. గోరా యోష్ఠప్రాంతమున రేఖామాత్రమగు కఠోరహాస మాతని కగపడియెను. వినయునకా తేనీరు తిక్తముగను, నరుచిగనే యుండెను; గాని యాతఁడు త్రాగుటమాత్రము మానలేదు. అప్పుడు వరదాసుందరి తనలో 'ఆహా! ఈవినయకుమారుఁడు చాల మంచివాఁడు." అని యనుకొని గోరాయొద్దనుండి తనదృష్టిని వినయునివంకకు మరలించెను. అది చూచి పరేశుఁడు తనకుర్చీని గోరాకు సమీపముగఁ దీసికొని మృదులస్వరమున నాతనితో సంభాషించుచుండెను.

ఇంతలో చీనాబాదముపాల్వా నమ్మువాఁ డొకఁడు వీథిని బోవుచుండఁగా లీలచూచి చప్పటులు చఱచుచు "అన్నా! సుధీరా! ఆ చీనాబాదమువానినిఁ బిలువుము!" అనియెను. ఆమాటలోనే సతీశుఁడు లేచి వరాండా పిట్టగోడయొద్దకుఁబోయి వానిని కేకలువైచి పిలువఁదొడంగెను.

ఆసమయమునం దొక పెద్దమనుష్యుఁ డచ్చటికి వచ్చెను. అతని నందఱును "పానూబాబూ" అని పిలుతురు. కాని యాతని పేరు హారానచంద్ర నాగుఁడు. ఈతఁడు

బుద్ధిమంతుఁడనియు, విద్వాంసుఁ డనియు సమాజములోఁ బ్రసిద్ధియున్నది. ఏపక్షమందును, నెట్టిమాటయు నింతవఱకు స్పష్టముగాఁ జెప్పకపోయినను, నీతనికిని సుచరితకును బెండ్లియగునను నూహ యాకాశమువఱకు నావరించి యుండెను. పానూబాబుహృదయము సుచరితయందు లగ్నమయ్యె ననుట కెవ్వారికిని సందేహము లేదు. దీని ననుసరించియే యాకన్యలందఱును సర్వదా సుచరితను బరిహాసము చేయుచుండిరి.

పానూబాబు స్కూలుమాష్టరుపని చేయుచుండెను. వరదాసుందరి స్కూలుమాష్టరని చెప్పి యాతని గౌరవించుటలేదు. ఆతఁడు తన[illegible]లలో నెవ్వరినైనఁ బ్రేమించుటకు సాహసింపలేదుగదా యనియే యామె కాతని యెడల గౌరవము! ఆమెకుఁ గాఁబోవుజామాతలు డిప్యూటీమేజస్ట్రేటుగిరీ యనులక్ష్యమును భేదింపఁగలవారై యుండవలయు నని యామె కోరిక.

సుచరిత హారానబాబున కొకకప్పు తేనీటి నిచ్చుచుండఁగా లావణ్య దూరమునుండి యామె మొగమువంకఁ జూచి తానించుక మొగము త్రిప్పుకొని నవ్వెను. ఆ నవ్వును వినయుఁడు చూడకపోలేదు. స్వల్పకాలములోనే యొకటిరెండువిషయములందు వినయుని దృష్టి యించుక తీక్ష్ణముగను, సతర్కముగను బ్రవర్తింపఁదొడంగెను. పూర్వమాతని కింతటిదర్శననైపుణ్యము లేదు. హారానబాబును, సుధీరుఁడును నీయింటిలోని యాఁడువాండ్రకందఱకును చాలదినములనుండి పరిచితులై యుండిరి. వారు వీరిజీవితచరిత్రముతో నేకీభవించి యుండుటయే కాక యింటియందలి స్త్రీల పరస్పర రహస్యసంజ్ఞలకుఁ గూడ లక్ష్యభూతులై యుండిరి. ఇవి కేవలమును వినయున కస్పష్టముగాఁ దోఁచెను.

హారానబాబు వచ్చుటవలన సుచరితహృదయమునం దొక్కింత యాశకలిగెను. ఆతఁ డెట్లయిన వాదించి గోరాను గర్వభంగము చేసి తనమొదలిమంట చల్లార్చునని యామె యుద్దేశము! ఆతనితర్కముల కామె యిదివఱ కనేకపర్యాయములు విరక్తయై యుండెను, కాని యిప్పు డాతర్కవీరుని గాంచి సుచరిత యానందముతో రొట్టెయునుఁ దేనీరును నొసంగెను.

పరే—పానూబాబూ! ఈతఁడు నాస్నేహితుని—

హారా—నేనీతనిని బాగుగ నెఱుంగుదును. ఈతఁ డొకప్పుడు మనబ్రాహ్మసమాజమునం దత్యుత్సాహము గలసభ్యుఁడై యుండెను.

అని చెప్పి హారానబాబు గోరాతో మాటలాడకుండఁగనే తేనీరు త్రాగుటకై యుపక్రమించెను. అప్పుడు సుధీరుఁడు సివిల్ సర్వీసు పరీక్ష ప్యాసయి యింగ్లండునుండి వచ్చిన యొకబంగాళీయువకుని గౌరవించుసందర్భమునుగుఱించి ప్రస్తావించెను. హారానబాబు తూష్ణీంభావముతో మనబంగాళీ లెంతెంతటిపరీక్షలం ప్యాసయినను సరియే, వారేమియును జేయఁజాలరు ఏబంగాళీయైనఁ గలెక్టరుపని చేసెనా? జడ్జిపని

చేసెనా? జిల్లాపై నధికారము వారికి దొరకదు" అని బంగాళీచరిత్రమునందలి దోషములను, దుర్బలత్వమును వ్యాఖ్యానము చేయ నారంభించెను.

చూచిచూచి గోరాముఖ మెఱ్ఱనైపోయెను. అతఁడప్పుడు తనసింహనాదమును సాధ్యమైనంతవఱకడంచుకొని "ఆమాటయే సత్యమైనచో నింతయానందముతో టేబిలు నొద్దఁ గూర్చుండి రొట్టె నారగించుటకు మీకు సిగ్గు కలుగుట లేదా?" అనియెను. హారాణ్‌బాబు విస్మితుఁడై కనుబొమలు ముడివైచి "ఏమిచేయుమనియెదవు?" అనియెను.

గోరా—బంగాళీచరిత్రమునందలి కళంకమోచనమును జేయనైనఁ జేయవలయును కాదేని గొంతున ఉరి పోసికొని చావనైనఁ జావవలయును. అంతే కాని వట్టి మాటలతో బంగాళీజాతి నిష్ప్రయోజనమైనదని నిందించుటా? ఆరొట్టెముక్క మీగొంతులో నడ్డుకొనుట లేదా?

హారా—నేనేమి యసత్యము చెప్పితినా?

గోరా—కోపపడవలదు. కాని యీసంగతి సత్యమే యని మీరు నిశ్చయముగా భావించియున్నచో నింతయుత్సాహముగను, నింత విలాసముగను, బలికియే యుండరు. ఇది యసత్యము కావుననే యీమాట మీనోటినుండి యలవోకగా వెలువడినది. హారాణబాబూ! అసత్యము పాపము! అసత్యనింద యంతకంటెనుఁ బాపము! స్వజాతి నన్యాయముగ నిందించునంతటి పాపము మఱియొకటి లేనే లేదు.

హారాణబాబు క్రోధోద్దీప్తుఁడయ్యెను. అప్పుడు గోరా మరల నందికొని "అయ్యా! మీజాతివారందఱికంటెను మీరే గొప్పవారు కాఁబోలును? మీరు కోపపడియెదరని మాపితృపితామహులను నిందించుచుండఁగా మేము సహింపవలయునా?" అనియెను.

హారాణబాబిఁక సహించియుండఁజాలక కంఠస్వరమును మఱింత హెచ్చించి బంగాళీలను మఱింకను నిందించుట కారంభించెను. బంగాళీసమాజమునందలి దురాచారముల నన్నిటి నుగ్గడించి యధిక్షేపించెను. బంగాళీ లెందులకైనను బనికివత్తురను నాశ యొంతమాత్రమును లేదని సిద్ధాంతము చేసెను.

గోరా—మీ రిప్పుడు చెప్పిన దురపవాదము లన్నియు ఇంగ్లీషుగ్రంథములలోఁ జదివి వల్లించినవే—అంతే కాని మీరిందులో స్వయముగా గ్రహించిన దొక్కటియును లేదు. ఇంగ్లీషువారి సమస్తదురాచారములనుగూడ నీమర్యాదగాఁ దిరస్కరించుటకు మీరు సమర్థులు కాఁగలిగినచో నప్పుడు మీ కీవిషయమున మాటలాడుట కధికారము కలుగును.

పరేశుఁడీవాదము నడంచివేయవలయునని ప్రయత్నించెను. కాని క్రుద్ధుఁడగు హారాణబాబు విరమింపఁడయ్యెను. సూర్యాస్తమయమయ్యెను. మేఘములలోపలనుండి యొకవిధమగు నపరూపరక్తకాంతి వెలువడి యాకసము నంతను లావణ్య

మయముగఁ జేసివైచెను. ఆతర్కకోలాహలముచే వినయుని చెవులు గింగురుమనిపోవుచుండెను. పరేశుఁడు సాయంకాలప్రార్థనమునకై లేచిపోయి యుద్యానమునందలి యొకచంపకవృక్షవేదికపైఁ గూరుచుండెను. వరదాసుందరికి గోరాయెడల నెంతటివైముఖ్యము కలిగెనో హారానబాబునెడలనంతటిసాముఖ్యము కలిగియుండెను. ఆయుభయుల వాదము నామెకసహ్యముగా నుండుటచే వరదాసుందరి వినయునిం గాంచి "వినయబాబూ! మనము లోనికిఁబోవుదము రమ్ము!" అనియెను.

ప్రేమపూర్వకమగు నామెయాదరముఁబట్టి వినయుఁడు నటనుండి తప్పక లోనికిఁబోవలసివచ్చెను. వరదాసుందరి తనకుమార్తెలనుగూడఁ బిలిచెను. సతీశుఁడా వాదమునకుఁ బూర్వమే కొంచెము బాదముహల్వాను దీసికొని తనకుక్కతో నంతర్థానుఁడైపోయెను.

వరదాసుందరి లోపలికిఁబోయి లావణ్యం గాంచి "అమ్మా! నీనోటుబుక్కును దీసికొనివచ్చి వినయబాబునకుఁ జూపుము!" అనియెను.

అయింటికిఁ గ్రొత్తగ వచ్చినవారి కందఱకును దననోటుబుక్కును జూపుట లావణ్యమయి కభ్యాసమై యుండెను. వినయునకుఁ జూపవలయునని యామెయును వేచికొనుచునే యుండెను, గాని యావృథావాదము జరుగుచుండుటవలన నవకాశము కలిగినది కాదు.

వినయుఁడాబుక్కును దెఱచి చూచెను. అందు మూర్, లాంగ్‌ఫెల్లో మొదలగు నింగ్లీషుకవుల పద్యములు లిఖింపఁబడి యుండెను. అందలియక్షరములు పటిపటి వ్రాసినట్లు చక్కగా నగపడుచుండెను. విషయముల నామములును, పద్యముల ప్రథమాక్షరములును, జక్కని జిలుగక్షరములతో వ్రాయఁబడియెను. అదనూరి చూచి వినయుఁడు నిజముగా విస్మితుఁడయ్యెను. ఆదినములలో నట్టి యింగ్లీషుపద్యముల నాఁడువాండ్రు కాపీచేయఁగలుగుట యెంతగౌరవము! అప్పటివినయుని యాభిముఖ్యముం గాంచి వరదాసుందరి తనరెండవబిడ్డయగు లలితం బిలిచి "అమ్మా! నీకీపద్యములు—" అనియెను.

విస్పష్టముగా "అమ్మా! నాకుఁ పద్యములు రావు. నాకవి బాగుగ జ్ఞప్తియుండులేవు" అని చెప్పి దూరమునందున్న కిటికీయొద్దకుఁబోయి వీధివంకఁ జూచుచుండెను.

వర—బాబూ! ఈమె కన్నియును వచ్చును. కాని యాడంబరముగాఁ దనకు వచ్చునని చెప్పుకొనుట దీనికిష్టములేదు. ఈమె చిన్నతనమునుండియు నిట్లే యున్నది. ఎంతదుఃఖసమయమందైన నీమె కన్నీరు పెట్టుకొనదు. ఈవిషయమున నీమె తండ్రిని బోలినది.

అని యీవిధముగా లలితవిద్యాబుద్ధులను గుఱించి వినయునకుఁ బరిచయము కలిగించెను. ఇఁక లీల వంతువచ్చినది. మొట్టమొదట మాత్రము లీల సిగ్గుపడియెను. కాని పిమ్మటఁ గిలకిలనవ్వుచు సంగీతపుఁబెట్టెవలె నర్థములేకుండ నొక్కగ్రుక్కలో

"Twinkle twinkle little Star" అను పద్యమును గడగడఁ జదివి వైచి యింక సరిశీతవిద్యాపరీక్ష జరుగునని యనుకొని యొక్కపనుపున నటనుండి వెడలిపోయెను.

అవల మేడపై నింకను బ్రబలముగా వాదము జరుగుచునేయుండెను. క్రమముగా హారానబాబు కోపము మదురుటచేఁ దర్కమును విడిచి తిట్లలోనికి దిగుచుండెను. అతని యసహనభావమునకు విరక్తయై సుచరిత సిగ్గుపడి గోరాపక్షము నవలంబించెను. ఇది హారానబాబునకు హృదయశల్యముగా నుండెను. ఆకసమున నంధకారమును, శ్రావణమేఘములను ఘనీభవించుచుండెను. వీధిలోఁ బువ్వులమ్మువారు పువ్వుహారములను దీసికొని కేలు వైచుచుఁ బోవుచుండిరి. ఎదుటనున్న తమాలశాఖయందలి చిగురుజొంపమున మిణుఁగురుపురుగులు మిలమిల మెఱయుచుండెను. అవ్విక్కనున్న పుష్కరిణీజలంబులపై నిబిడాంధకారచ్ఛాయ లలమికొని యుండెను.

పరేశుఁడు సంధ్యోపాసనము గావించుకొని మరల మేడమీఁదికి వచ్చెను. అతని జూచి గోరాయును హారానబాబును సిగ్గుపడి తమవాదమును విరమించిరి. అప్పుడు గోరా లేచి నిలువఁబడి "రాత్రియైపోయినది. నేను మరల నింకొకప్పుడు వచ్చెదను!" అనియెను.

ఇంతలో వినయుఁడును లోపలినుండి సెలవు గైకొని మేడమీఁదికి వచ్చెను. పరేశుఁడు గోరాను జూచి "బాబూ! నీవు బుద్ధిపుట్టినప్పు డెప్పుడైన నిటకు వచ్చుచుండుము! కృష్ణదయాళుఁడు నాసోదరునివలె నుండెడివాఁడు. అతనికిని నాకు నిప్పుడు మతభేదము కలిగినది. అందుచేఁ జూచుకొనుటయైనఁ దటస్థించుటలేదు. ఉత్తరప్రత్యుత్తరములైనను లేవు. అయినను జిన్ననాటిస్నేహభావముమాత్రము రక్తనాళములలోఁ బ్రవహించుచునే యున్నది. కృష్ణదయాళుని సంబంధమువలన నీవు మాకుఁ జాలదగ్గఱవాఁడవైతివి" అని ప్రేమమయ శాంతస్వరముతోఁ బలుకుచు వాదముచే నలసియున్న గోరాహృదయమునకు శాంతిని గలిగించెను.

మొట్టమొదటమాత్రము గోరా పరేశునంతగా లెక్కచేయలేదు కాని వెడలిపోవునప్పుడుమాత్రము మాతఁడు భక్తిపూర్వకముగాఁ బరేశునకుఁ బ్రణామము చేసిపోయెను. అప్పుడు గోరా సుచరితతో నెట్టిమాటయు నాడకుండఁగనే సెలవు గైకొనకుండఁగనే పోయెను. ఆఁడుది యగు సుచరిత మగవాఁ డగుతనయెదుట నుండుటకుఁ దా నాచరణరూపముగా నంగీకరించుటయే యగౌరవమని గోరాకుఁ దోఁచెను. వినయుఁడును బరేశునకు వంగి నమస్కరించి సుచరితవంకఁదిరిగి యామెకును నమస్కరించి సిగ్గుపడుచుఁ దత్తరముతో గోరా వెనువెంటనే వెడలిపోయెను.

వినయుఁడును గోరాయు నట్లు వెడలినతోడనే హారానబాబు తొందరగాఁ బరేశునియొద్దకువచ్చి "మనస్త్రీల నింటికివచ్చినవారందఱితోడను మాటాడనిచ్చుట నాకంతబాగుగఁ దోఁచుటలేదు!" అనియెను.

సుచరిత యిదివఱకే లోలోపలఁ గోపముతో మండిపోవుచుండెను. ఇఁక నా మె యడఁచుకొనఁజాలక "బాబా! అట్టినియమమునే గౌరవింపఁదలఁచినచో నిఁక టినుండి మేము మీతోఁగూడ మాటాడుట న్యాయము కాదు!" అనెను.

హారా—సమాజమువారితో మాత్రమే మాటలాడవచ్చునను నియమ మెంకటి యుండఁదలయును!

పరేశుఁడు నవ్వుచు "నీవు పారివారికజనానాపద్ధతి నొకదానినిఁ జూపి క్రమ ముగా సమాజమున కంతకును మరల జనానాపద్ధతిని గల్పింపఁజూచుచున్నట్లున్నావు! కాని సకలమతములయందలి పెద్దమనుష్యులతోడను గలసి స్త్రీలు సంభాషించుట యుచితమనియే నాయుద్దేశము! అట్టియవకాశము కల్పింపకున్నచో బలవంతముగ వారిబుద్ధివికసముల నడ్డగించినవార మగుదుము. ఈవిషయమున భయపడుటగాని, సిగ్గు పడుటగాని కారణ మేమియును లేదు" అనియెను.

హారా—భిన్నమతములవారితో స్త్రీలు కలిసియుండఁగూడదని చెప్పుటలేదు. స్త్రీలయెదుట నెట్లు మసలవలయునో యితరమతములవారి కాగౌరవము తెలియదని చెప్పుచున్నాను.

పరే—కాదు కాదు అట్లనుకొనుట తప్పు! అది గౌరవము తెలియకపోవుట కాదు. అది కేవల మొకవిధమైన సంకోచము—స్త్రీలతోఁ గలసిమెలసి యుండినఁ గాని యట్టి సంకోచము పోనేరదు.

## ౧౧

ఆదినమున వాదమునందు గోరా నోడించి సుచరితయెదుటఁ దనజయపతాకను స్థాపింపవలయు నని హారానబాబెంతో యాశపడి యుండెను. మొదట సుచరితయు నట్టియాశతోనే యుండెను. కాని దైవయోగముచే నది విపరీతమైపోయెను. ధర్మవిశ్వాసమునందును, సామాజికనియమములయందును గోరా భిన్నాభిప్రాయుఁడై యున్నను స్వదేశాభిమానము, స్వజాత్యభిమానము ననువిషయముల యందుఁగల సుచరితయభిప్రాయము మాత్రముఁ దనకనుకూలముగ నైయుండెను. ఆమె యెల్లప్పుడును స్వదేశవ్యవహారములను గూర్చియే యాలోచించుచుండునది కాకపోయినను, స్వజాతినిందను విన్నంతమాత్ర మున గోరా యప్పు డాకస్మికముగ సింహనాదము చేయుచు విజృంభించుట యామె హృదయాంతరమునం దున్నదేశాభిమానభావమున కనుకూలప్రతిధ్వనివలె నుండెను. ఇంతటి ధైర్యముతో, నింతటిదృఢవిశ్వాసముతో నామెయెదుట దేశమునుగూర్చి యీ విధముగా మాటాడినవా రింతవఱ కెవ్వరును లేరు.

ఇంతే కాక గోరాయును వినయుఁడును వెడలిపోయినతరువాత హారానబాబు వారియెడ లవమానకరమగు నపవాదము నారోపించెను. అప్పుడే సుచరిత నీచస్వభా వుఁ

డగు హారానుబాబుకంటె గోరయే నిశ్చలహృదయుండని నిశ్చయించుకొనియెను. అందుచేతనే మొదటినుండియు గోరాను జూచి యసహ్యించుకొనుచున్న సుచరిత హృదయము మారిపోయెను. కాని యాతని హిందూమతప్రబలాభిమానమిప్పటికి నామెహృదయమును వేధించుచునే యుండెను. "హిందూమతమునం దొకవిధమగు ప్రతికూలభావమున్నది. ఇది సహజముగఁ బ్రశాంతమైనది కాదు—ఇది కేవలమును స్వభక్తివిశ్వాసములమీఁదనే యాధారపడియున్నది—ఇది కేవల మితరులను బాధించుటకే యెల్లప్పుడు నుగ్రభావముతోఁ బ్రయత్నించుచుండును" అని హిందూమతమునుగూర్చి యామె యొకమాదిరిగా దెలిసికొనఁగలిగినదై యుండెను.

ఆనాఁటిసంధ్యాసమయమున మాటలాడునప్పుడును, బనులుచేయునప్పుడు, భుజించునప్పుడును, లీలకుఁ గథలు చెప్పునప్పుడును గూడ సుచరితహృదయాంతరమునందేమోకాని యొకవిధమగు వేదన కలిగి యుండెను. ఆమె దాని నేయుపాయముచేతను మరలించుకొనఁజాలకుండెను. ముల్లు గ్రుచ్చుకొన్నచోటును దెలిసికొనఁగలిగినచో ముంటిని దీసివేయవచ్చును. సుచరిత తనమనసులో నాటుకొన్న కంటకమును వెదకి తీసివైచుకొనుటకై యానాఁటిరాత్రి యామేడమీఁదివరాండాలో నొక్కతెయును గూర్చుండి యుండెను. ఆగభీరాంధకారముతోఁ దనహృదయమునందలి యకారణపరితాపమును గలిపివేయవలయునని యామె యెంతయో ప్రయత్నించెను; కాని, యెట్టిలాభమును లేకపోయెను. అప్పుడామె తనహృదయమునందలి నిర్దేశింపరానియనుభవమును గూర్చి యేడువవలయు నని కోరుకొనియెను—కాని కన్నీరు వచ్చినదికాదు!

అపరిచితుఁ డగునొకయువకుఁడు కపాలమునఁ దిలకమును ధరించి వచ్చెను. ఆతనిని వాదమునవోడించి గర్వభంగము సేయుట తటస్థించినదికాదు—ఇందుచేతనే నాహృదయమట్లు పరితపించుచున్నదా యనిసుచరిత యెంతసేపటివఱకును నాలోచించుచుండెను. ఇంతకంటెను బరిహాసాస్పద మగువిషయమే మైననుండునా యని యామె యాతలంపును దనమనమునుండి త్రోసివైచుకొనియెను. అప్పుడు ప్రధానకారణ మామెమనసునకుఁ దట్టెను. తోడనే యామె యభరింపరానంత సిగ్గుతోఁచెను. సుచరిత నేఁడా వినయుని సన్నిధిని నాలుగైదుగంటల సేపటివఱకును గూర్చుండి యున్నది. నడుమనడుమ నాతనిమాటలతో మాటలనుగూడఁ గలిపినది. కాని యొక్కసారియైనను నాతనిఁ గన్నెత్తి చూడనే లేదు! వెడలిపోవునప్పుడైనను నొక్కసారి కన్నులారఁ జూడఁజాలకపోయెను. సంపూర్ణముగ నీయుపేక్షాభావమే యామెహృదయమును భేదించుచుండెను. సందేహము లేదు—ఇతరస్త్రీలతోఁగలసి మెలసియుండుటయభ్యాసములేనివారి కట్టిసంకోచ ముండునో యట్టిసంకోచమే వినయునిపనులలోనగపడుచుండెను. కాని, యాసంకోచమధ్యమున నొకవిధమగు లజ్జయు, నమ్రత్వమును మిళితములై యుండెను—గోరా యందట్టి

లక్షణము లేశమాత్రమును లేదు — అంతటి ఘోరంబును, ప్రబలంబు నగువాతని యుదాసీనభావమును సహించుటకుఁగాని, తిరస్కరించి త్రోసివైచుటకుఁగాని సుచరిత కిప్పు డసంభవముగా నున్నదా? అంతమంచి ప్రతిపక్షుఁ డెదుట నాతఁ డాత్మగౌరవమును బోఁగొట్టుకొనకుండఁ బ్రాగల్భ్యముచే మండిపడుచు వాదమునకు డీకొనియెను. ఆసమయమునం దొకప్పుడు సుచరిత హారాణబాబుచేసిన యన్యాయవాదమును విని మెచ్చుకొనినట్లగపడియెను; అప్పు డొకసారి గోరా యామె మొగమువంకఁ జూచెను. ఆచూపునందు లేశమాత్రమైనను సంకోచభావము లేదు. ఆచూపులలో నెట్టిభావ మున్నదో యాశ్చర్యముగా నుండెను. “ఈయువతికి సిగ్గులేదా? ఈమె కింతగర్వమా? పెద్దవారలు మాటాడుకొనుచుండఁగాఁ బిలువనిపేరంటముగా నిచ్చటి కేల వచ్చినది?” అని యప్పు డాతఁడు తనమనసులో ననుకొనియుండునా? ఒకవేళ నిజముగా నప్పు డాతనిమనసులో నట్లేయున్నను నింతమాత్రమునఁ బోయిన దేమి? ఏమియును లేదు. కాని సుచరిత హృదయ మింకను బరితపించుచునే యుండెను. దానిని మఱచిపోవుటకును, కప్పివైచుటకును నామె యనేకప్రయత్నములను జేయుచుండెను. కాని సాధ్యమగుట లేదు. గోరాపై నామెకుఁ గోపమున్నది; ఆతఁడు దురాచారి యనియు, నుద్ధతుఁ డనియు నామె మనసులో నిందించుచుండెను. కాని, విపులకాయుఁడును వజ్రకంఠుఁడు నగువాతని నిస్సంకోచదృష్టి స్ఫూర్తిసమ్ముఖమునఁ దా నెంతయో హీనముగా నుంటినని సుచరిత యనుకొనుచుండెను. ఏవిధముచేతను నామె తన గౌరవమును నిలుపుకొనఁజాలకుండెను.

సుచరిత యీవిధముగాఁ జాలరాత్రివఱకును మనఃపరితాపము ననుభవించుచుఁ గూరుచుండెను. దీపములను సన్నముగఁ జేసికొని యింటివా రందఱును నిద్రించుచుండిరి ఇంతలో ద్వారము మూసినచప్పు డయ్యెను. సేవకులు పనులను ముగించుకొని నిద్రించుటకుఁ బ్రయత్నించుచున్నట్లామె గ్రహించెను. అప్పుడు లలిత రాత్రిదుస్తులను దాల్చి యచ్చటికి వచ్చి సుచరితతో మాటాడకుండ నామెప్రక్కనే యొక గోడ నానుకొని నిలిచియుండెను. లలిత తనపైఁ గోపగించినదని గ్రహించి సుచరిత మనసులోనే నవ్వుకొనియెను. నేఁడు లలితయును నామెను బరుండవలయునని నిశ్చయించుకొనియుండిరి. సుచరిత యామాటయే మఱచిపోయెను. కాని మఱచిపోయితినని చెప్పినమాత్రమున లలిత క్షమించునది కాదు. అన్నింటికంటె మఱపునే యామె గొప్పతప్పుగా భావించుచుండెను. సమయోచితవాక్యములచే నామె సమాధానపడునదియును గాదు. ఇంతవఱకు నామె యెట్లో సహించి యొంటరిగాఁ బరుపుపైఁ బడియుండెను. ఆలస్యమైనకొలఁదియు నామెకోపము హెచ్చిపోవుచుండెను. తుదకామె యెట్టును సహింపఁజాలక పక్కవిడిచి లేచివచ్చి మౌనముచేతనే తానింకను మేల్కొనియున్నట్లు తెలియఁజేయుటకై యచ్చటికి వచ్చెను.

సుచరిత కుర్చీనుండి లేచి మెల్లమెల్లగా లలితయొద్దకుఁ బోయి యామెను కౌఁగిలించుకొని "కన్నతల్లీ! లలితా! కోపగించుకొనకమ్మా!" అనియెను.

లలిత సుచరితచేతులను వదలించివైచి "లేదు. నాకేమి కోపము? నీవు కూర్చుండఁగూడదా?" అనియెను.

సుచరిత యామె చేతులను బట్టుకొని "సోదరీ! రమ్ము! శయనింతము రమ్మా!" అనియెను.

లలిత యెట్టిప్రత్యుత్తరమును జెప్పకుండ మౌనముతో నిలువఁబడియెను. తుదకు సుచరిత బలవంతముగా నామెను బడకటింటికిఁ దీసికొనిపోయెను. అప్పుడు లలిత రుద్ధకంఠస్వరముతోఁ "ఇంతయాలస్య మేలచేసితివి? పదునొకండుగంట లయ్యెను. నేనిన్నిగంటలను వినుచునే యున్నాను. ఇప్పుడా నీకు నిద్రముచ్చట!" అనియెను. సుచరిత లలితను కౌఁగలించుకొని "నేనీదినమునఁ జాలతప్పు చేసితిని తల్లీ!" అనియెను.

తప్పు నొప్పుకొన్నతోడనే లలితకుఁ గోపము వదలిపోయెను. ఆమె యొక్కసారిగాఁ బ్రసన్నమై "సోదరీ! ఇంతసేపటివఱకు నొంటిగాఁ గూర్చుండి యెవ్వరి సంగతి నాలోచించుచున్నావు? పానూబాబునుగూర్చియా?" అనియెను. సుచరిత యామెను దర్జనితోఁ గొట్టుచు "చాలును" అనియెను.

లలితకు పానూబాబు బనిన నంతగా నిష్టములేదు. అందఱుసోదరీమణులవలెనే పానూబాబుపేరుచెప్పి సుచరితను హాస్యమాడుట లలితకలవాటునులేదు. పానూబాబు సుచరితను బెండ్లియాడఁ దలంచె ననుమాటయే యామెమనమునకుఁ గష్టముగా నుండును. లలిత కొంతసేపటివరకు నూరకుండి "అక్కా! వినయబాబుమాత్రము చాల మంచివాఁడు! నిజమేనా!" అనియెను.

ఈప్రశ్నలో సుచరితమనోభావము దెలిసికొనవలయు ననునుద్దేశ మున్నదియో లేదో చెప్పఁజాలము! — అప్పుడు సుచరిత లలితవంకఁ జూచి "వినయబాబు మంచి వాఁడు కాకేమి? చాల మంచివాఁడు" అనియెను.

సుచరిత యెట్టికంఠస్వరముతోఁ బ్రత్యుత్తర మీయవలయునని లలిత వాంఛించి యుండెనో యట్టిస్వరముతో సుచరిత మాటాడలేదు. అప్పుడు లలిత మరల "సోదరీ! నీవేమన్నను సరియే — కాని గౌరమోహనబాబుమాత్ర మంత మంచివాఁడుగా నగపడలేదు. అసహ్యాకరమగు రూపము — అతఁ డీపృథ్వియం దెవ్వానిగూడ లక్ష్యము చేయడు! — నీకెట్లు తోఁచుచున్నది" అనియెను.

సుచ — అతఁడు విశేషముగ హిందూమతాభిమానము కలవాఁడు.

లలి — కాదు కాదు. మా మేనమామగారు గొప్పహిందూమతాభిమాని — కాని యాతన యొక్కరకము! ఈతఁ డేరకపువాఁడో నేను సరిగాఁజెప్పఁజాలను.

సుచరిత నవ్వుచు 'ఏదియో యొకరకము!' అని చెప్పుచు నున్నతఱి భ్రూలలాటమున దిలకధారణముం గావించి యున్న యాగోరామూర్తి నొకసారి మనసునఁ దెచ్చుకొని తిరస్కరించెను. అట్లు నిందించుటకుఁ గారణ మేమనఁగా—అతని కపాలమునందలి గంగామృత్తికాతిలకమునందుఁ బెద్దపెద్దయక్షరములతో "మీతో నాకేటి సంబంధమును లేదు!" అని లిఖింపఁబడి నట్లుండెను. ఈభేదబుద్ధిసంబంధమగు దుర్గర్వమును ధూళిపాలు చేయఁగలిగినప్పుడుగాని సుచరితయొడలిమంట చల్లారదు—

క్రమముగా నాలోచన లడఁగిపోయె. ఇరువురును నిద్రించిరి. రాత్రి రెండుగంటలవేళ సుచరిత మేల్కాంచి చూచెను. వర్షము కురియుచుండెను. నడుమనడుమ దోమతెరను భేదించుకొని వచ్చి విద్యుత్కాంతులు కన్నుల మిఱుమిట్లుగొలుపుచుండెను. గదిలో నొకమూల నింతవఱకును వెలుఁగుచున్న దీప మాఱిపోయెను. ఆనిశ్శబ్దనిశీథసమయమునందు—ఆ యంధకారమునందు—ఆ యవిరామవర్షనిస్వనమునందు—సుచరితహృదయమునందు దేనిచో యొకవిధమగు వేదన యగుచుండెను ఆమె యిటునటు దొరలుచు నిద్రించుటకుఁ బ్రయత్నించెను. లలిత హాయిగఁ గాఢముగ నిదురించుచున్నందుల కసూయపుట్టినది గాని సుచరిత కించుకంతయైనను నిద్రపట్టినదికాదు. ఆమె చిరాకుతో శయ్యనుండి లేచి వెలుపలికి వచ్చి తలుపునొద్ద నిలిచి చూచుచుండెను. అప్పుడప్పుడు వాయువేగముచే వానజల్లా మెపైకి వచ్చుచుండెను. ఇప్పుడు మరలఁ దిరిగి తిరిగి సాయంకాలపు సంగతులన్నియు నొక్కొక్కటిగా నామెహృదయమునఁ బొడకట్టనారంభించెను.

ఆసంధ్యారాగరంజితమగు వరాండాయందు గోరాప్రచండవదనమండలము సృష్టిచిత్రమువలె నామెస్మృతిపటమునఁ దోఁచుచుండెను. ఘటియు వాదమునందు విని మఱచిపోయినమాటలన్నియును గోరాగంభీరప్రచండస్వరముతోఁ గూడ నొక్కొక్కటిగా జ్ఞప్తికివచ్చుచుండెను. చెవులలోఁ బ్రతిధ్వనించుచుండెను—"మీ రెవ్వరి నవివేకు లనుచున్నారో, నే నాజాతివాఁడనే. మీ రేసంస్కారము దుష్టమైన దనుచున్నారో, ఆసంస్కారమే నాది. మీరు మీ దేశమును బ్రేమింపనంతవఱకు—మీ దేశమునందలి ప్రజలతో సమానముగ నిలువఁబడనంతవఱకు—దేశమును నిందించు మీ నోటినుండి వెలువడు నొక్కయక్షరమునైనను నేనుసహింపజాలను!" అని గోరాపలుకుచుండును. దానికిఁ బ్రత్యుత్తరముగా హారానబాబు "ఇట్లున్నచో దేశమును బాగుచేయుటెట్లు?" అనియెను. గోరా గర్జించి లేచి "బాగుచేయుటయా? అది తరువాతి మాట! బాగుచేయుటకంటెను బ్రేమించుట గొప్పది. శ్రద్ధకలిగి యుండవలయును. మనమందఱ మేకము కావలయును. అప్పుడు దేశము తనంతటఁదానే బాగుపడును. మీరు వేఱై దేశమును ఖండఖండములుగఁ జేయుచున్నారు. దేశమంతయును జెడ్డసంస్కారములతో నిండియున్నదనియు మేము మంచి సంస్కారములతోఁ గూడిన సామాజికులమని

యుందు మీరు చెప్పుదురు. ఎవ్వరికంటెను శ్రేష్ఠుఁడను గానుంటయు నెవ్వరికంటెను వేఱుగానుండుటయు నన్నిటికంటె ముఖ్యమైన నాయాకాంక్ష యని నేను చెప్పుచున్నాను. తరువాత నే సంస్కారముండునో, యే సంస్కారము పోవునో దేశమే తెలిసికొనుం గాక! దేశమాతయు దేవుఁడే పాలించును గాక!" అనియెను. దానిపై పానూబాబు "ఇన్ని మతములు నిన్ని భేదములుఁగల దేశ మంతయు నేక మగుట పొసఁగదు!" అనియెను. ఆమాటకు గోరా "మీకట్లు తోఁచినచో ముందుగా నట్టిభేదభావమును నిర్మూలము చేయవలయును. అప్పుడు దేశ మంతయు నేకమగును. అప్పుడే హిందూ మహాసముద్రమున మనవిహారనౌక నిరపాయముగ విహరించుటకుఁ బ్రయత్నింపవలయును. అహంకారమును, అజ్ఞతను దూరము చేసి నమ్రభావముతోఁ బ్రేమమయహృదయమున సర్వకార్యముల నాచరింపవలయును. ఆప్రేమభావమునెదుట వేయి యపరాధములును, వేయిలోపములును గూడఁ బరిమార్జితములై పోవును. ప్రతిదేశమందును, ప్రతిసమాజమునందును నేవియో కొన్నితప్పులును, లోపములు నుండియే యుండును; కాని, జనులలో స్వజాత్యభిమానమును బ్రేమయు నున్నంతవఱకు లోపమనియెడి విషము సమాజమునకు గాయమును మాత్రమే చేయఁగలిగియుండును కాని కుళ్ళించి దుర్గంధమును వ్యాపింపనీయదు. దుర్గంధమునకుఁ గారణము శ్వాసములందే యున్నది. సమాజము జీవించి యున్నచో నిది గాయముగనే యుండును. చచ్చినచోఁ గుళ్ళి కంపుకొట్టును. మీరు దేశమును బాగుచేయుదు మని చెప్పుకొనుమాటలను మేము సహింపఁజాలము. మీరుగాని మీమిత్రవర్గముగాని యట్లు చేయఁజాలరు." అనియెను. పానూబాబు "ఏల చేయఁజాలము?" అనియెను. అంతట గోరా "మనబాగుకొఱకు మనతల్లిదండ్రులు చెప్పినబోధనలను మనము వినఁగలము కాని పోలీసువాఁడు చెప్పిన యధికారవాక్యము లింపుగా లేకుండుటయే కాక యవమానకరముగఁగూడ నుండును. అట్టిబోధనలనే సహింపవలసివచ్చినచో మనుష్యత్వమును జంపుకొనవలసియుండును. అందుచేత నే ముందుగ నాత్మీయుఁడు కాకుండ సంస్కర్త కాఁగూడదు. ఆత్మీయుఁడు కానివాఁ డెంతమంచిమాటలతో సంస్కరణము నారంభించినను బ్రజలకనిష్టముగనే యుండును" అనియెను—ఈవిధముగా వారి వాక్యోపవాక్యము లన్నియు సుచరితహృదయమునఁ బ్రతిధ్వనించుచుండెను. వానితోఁగూడ ననిర్దేశ్య మగునొక వేదనకూడఁ గలుగుచుండెను. అప్పుడు సుచరిత యాయాసముతో మరల శయ్యయొద్దకు వచ్చి చేతులతోఁ గట్టిగఁ గన్నులను మూసికొని సకలాలోచనములను ద్రోసివైచి నిద్రించుటకుఁ బ్రయత్నించెను కాని, యామె మొగమును జెవులును మండిపోవుచుండెను. మరల గర్వమును దలంపునకు వచ్చుచుండెను. ఆమె హృదయ మంతయును గందరగోళముగా నుండెను.

## ౧౨

గోరాయును వినయుఁడును వీథిలోనికి వచ్చినతోడనే వినయుఁడు "సోదరా! గోరా! కొంచెము మెల్లగ నడువుము! నీయడుగులు నాయడుగులకంటెఁ జాల పెద్దవి. నీ వడుగులు సాచి వడిగ నడచుటచే నాకు నీతోఁ గలసి వచ్చుట కాయాసముగా నున్నది" అనియెను.

గోరా— నేనొంటిగనే పోవఁదలఁచితిని. నాకనేకవిషయములను గురించి యాలోచించుకొనవలసి యున్నది.

అని చెప్పుచు నాతఁడు స్వాభావికశీఘ్రగమనముతోఁ బోవుచుండెను. వినయుని హృదయము పరితపించిపోవుచుండెను. వినయుఁ డిప్పుడు గోరాకు విరుద్ధముగా నియమోల్లంఘనమును గావించెను. ఈవిషయమున గోరా యాతని దిరస్కరించి చీవాట్లు పెట్టినచో వినయునకు సుఖముగనే యుండును. ఒక్క తుఫాను పట్టినచో వారి చిరకాలస్నేహ మనునాకాశము నిష్కళంక మే యైయుండును. అట్లు జరిగినచో వినయుఁ డొక్కనిట్టూర్పు విడిచి బ్రతికితి ననుకొనియే యుండును.

గోరా యిట్లు కోపగించి తన్నుఁ బరిత్యజించి పోవుట వినయున కన్యాయముగా నగపడలేదు. అయినను వారి చిరస్నేహసంబంధమున కింతకాలమున కిప్పు డొకనిజమగు నవిశ్వాసము కలిగెను.

అపరరాత్రి యందలి నిబిడాంధకారమును జలింపఁజేయుచు నడుమనడుమ వర్షమేఘ మావర్షించుచుండెను. వినయుని హృదయమున దుస్సహ మగుభారము తోఁచుచుండెను. చిరకాలమునుండి పట్టియున్నమార్గమును విడిచి తన జీవిత మింకొక నూతనమార్గమునకు మరలుచున్నట్లాతనికిఁ బొడకట్టెను. ఆయంధకారమధ్యమునం దిప్పుడు గోరా యొకవైపునకుఁ బోయెను; వినయుఁడు మఱియొక వైపునకుఁ బోయెను.

మఱునాఁటియుదయమున లేచునప్పటికి వినయునిహృదయము తేలికయైపోయెను. రాత్రి యంతయు నాలోచనలతో నాతఁడు తనహృదయవేదనను నిష్కారణముగఁ బెంచుకొనియెను — ఉదయమున లేచి విమర్శింపఁగా గోరాతోడిస్నేహమునకును, పరేశుని పరివారముతోడి సంభావణసంబంధమునకును గేవలము పరస్పరవిరోధ మేమియును లేదని యాతనికిఁ దోఁచెను. అప్పుడు వినయుఁడు తాను రాత్రి పడిన పరితాపమునంతను దలఁచుకొని "ఎంతపని జరిగినది" అని యొకసారి నవ్వుకొనియెను.

తోడనే యాతఁ డొకశాలువ భుజముపైని వైచుకొని త్వరితగమనముతో గోరాయింటికిఁ బోయెను. అప్పటికి గోరా క్రిందిగదిలోఁ గూర్చుండి వార్తాపత్రికను జదువుకొనుచుండెను. వినయుఁడు వీధిలో నుండఁగనే గోరా చూచెను. కాని విన

యుఁడు వచ్చెనని తెలిసికొనియుండియు గోరా తనదృష్టిని వార్తాపత్రికనుండి మరలింపలేదు. వినయుఁడు లోపలఁ బ్రవేశించియుఁ బ్రవేశింపకుండఁగనే గోరాచేతియందలిపత్రికను మాటాడకుండ లాగికొనియెను.

గోరా—వినయా! నీవు పొరపాటు పడితి వనుకొనుచున్నాను. నేను గౌరమోహనుఁడను. కుసంస్కారాచ్ఛన్నుఁడ నగు నొకహిందువును!

విన—నీవే పొరపాటు పడుచున్నావు! నేను శ్రీయుత వినయభూషణుఁడను. అట్టికుసంస్కారాచ్ఛన్నుఁ డగు గౌరమోహనుని మిత్రుఁడను.

గోరా—కాని, గౌరమోహనుఁ డెంత ధైర్యము లేనివాఁడైనను, నాతఁ డెన్నఁడు నెవ్వరియొద్దను దన కుసంస్కారమునకై సిగ్గుపడి యుండలేదు!

విన—వినయుఁడుకూడ నట్టివాఁడే! కాని యాతఁడు తనసంస్కారములచే నితరుల నాక్రమింపవలయు ననుస్వభావము కలవాఁడుమాత్రము కాఁడు!

చూచుచుండఁగనే యిరువురకును వాదము పెరిఁగిపోయెను. వినయుఁడు గోరాయొద్దకు వచ్చిన ట్లిరుగుపొరుగువా రందఱకును దెలిసిపోయెను.

గోరా—నీవు పరేశబాబు గృహమునకుఁ బోవుచు వచ్చుచున్న ట్లాదినమున నాయొద్ద నొప్పుకొనకుండుటకుఁ గారణమేమి?

విన—ఏమియును లేదు. పోవుట లేకుండుటచేతనే యప్పుడొప్పుకొనలేదు! ఇన్నాళ్ళకు నిన్నటిదినమే మొదటిపర్యాయముగా నే నాతనియింటికిఁ బోయితిని.

గోరా—నీ వభిమన్యునివలె లోపలఁ బ్రవేశించు త్రోవయేగాని, వెలుపలికి వచ్చుమార్గము తెలియదని నాకు సందేహముగా నున్నది.

విన—అట్లే కావచ్చును. అదియే నాసహజప్రకృతి యైయుండును. నేనెవ్వరినిఁ బ్రేమించుచుందునో, గౌరవించుచుందునో, వారి నెన్నఁటికిని బరిత్యజింపఁజాలను.

గోరా—అట్లయినచో నింతటినుండి నీకచ్చటికి రాకపోకలు జరుగుచుండు ననుకొనియెదను.

విన—గమనాగమనసామర్థ్యము నాకొక్కనికే కలదనియా నీయుద్దేశము? నీకును జలనశక్తి యున్నది! నీవు కేవలమును స్థావరపదార్థమవు కావు!

గోరా—నేను పోఁగలను; రాఁగలను—కాని నీలక్షణమునుబట్టి చూడఁగాఁ బోవుటమాత్రమే నీకుఁ దెలియునని తోఁచుచున్నది. ఆవేఁడి తేనీ రెట్లున్నది?

విన—కొంచెము దుస్సహముగానే యున్నది!

గోరా—ఎందుచేత?

విన—దానిని దీసికొనకుండుట యంతకంటెను దుస్సహముగా నుండెను!

గోరా—సమాజరక్షణ మనఁగాఁ గేవలము గౌరవమును గాపాడుకొనుట యేనా?

వినయ—అన్నిసమయములయందు నట్లు కాదు. చూడుము గోరా! సమాజశాసనము నాహృదయమునకుఁ గష్టముగా నున్నప్పుడు మాత్రము నేను—

గోరా యిఁక శాంతమును వహింపఁజాలక వినయుని నింక మాటాడనీయక గర్జించుచు "నీవు మాటిమాటికిని నీహృదయఘాతమునుగూర్చియే చెప్పుచు సమాజము నల్పమైనదానిగను, నీచమైనదానిగను దోషిఁజేయుచున్నావు కాని సమాజమున కాఘాతమైనచో నాబాధ యెంతవఱకు వ్యాపించునో నీవనుభవమునకుఁ దెచ్చుకొనఁగలిగినచో నీమనఃకష్టమునుగూర్చి తెలుపుటకు సిగ్గుపడియే యుందువు! పరేశబాబుకుమార్తెల హృదయముల కించుకకష్టమును గలిగించుట నీకు దుస్సహముగాఁ దోఁచెను. కాని స్వల్పమాత్రమగు నీమనఃకష్టమునకొఱకు సంఘము నంతను బాధించుటకు సిద్ధపడఁగలిగితివి!" అనియెను.

వినయ—గోరా! అట్లయినచో సత్యము చెప్పుచున్నాను. ఒక్కగ్లాసు తేనీరు త్రాగినంతమాత్రముననే దేశమున కంతకును బాధ కలిగినచో నాబాధయందే దేశమున కుపకారము కలుగఁగలదు. ఈమార్గము ననుసరించియే ప్రయత్నించినచో దుర్బలమగు మనదేశము నుద్ధరింపవచ్చును.

గోరా—ఓమహాశయా! ఈయుక్తు లన్నియు నేను నెఱుంగుదును. నేనంతటి బుద్ధిహీనుఁడ నని తలంపకుము. కాని యివి యన్నియును బ్రకృతవిషయములు కావు. జబ్బుచేసినబిడ్డ మందు మ్రింగనప్పు డారోగ్యవతి యగుతల్లి యౌషధమును దాను సేవించి యాతనికి బోధించును. నీకును నాకును గలసంబంధ మట్టిది. ఇది యుక్తివచనము గాదు. ఇందుఁ బ్రేమ ప్రధానమైనది. అట్టిప్రేమయే లేకున్నచోఁ దల్లికిని, బిడ్డకును గలసంబంధము నష్టమైపోవును. ప్రేమ లేకున్నచోఁ గార్యమును నష్టమైపోవును. నేనిప్పుడు తేనీటిగ్లాసునుగూర్చి వాదించుటలేదు. కాని సమాజముతోడి సంబంధమును విచ్ఛేదము కావించుటకు నేను సహింపఁజాలను. దానిముందఱఁ దేనీటిని బరిత్యజించుట యేపాటిపని? పరేశబాబుతనయలహృదయములకుఁ గష్టము గలిగించుట యొక్కలెక్కయా? దేశీయులగునందఱితోడను గలసిమెలసి యేకమైయుండుటయే యిప్పటియవస్థలో మనకన్నిటికంటెను బ్రధానకార్యమై యున్నది. అట్లు కలిసికొన్నప్పుడు తేనీరు త్రాగుటయా, మానుటయా యనువిషయము రెండుమాటలలో సిద్ధాంతము గాఁగలదు.

వినయ—అట్లయినచో నాకు రెండవ తేనీటిగ్లాసు చాలకాలమువఱకును లభింపదు గాఁబోలును!

గోరా—అక్కఱలేదు. ఎంతయో కాలము పట్టదు! కాని, వినయా! ఇంకను నేనెందులకు? హిందూమతమునందలి ప్రియవిషయములతోఁగూడ నన్నును విడువవలసినసమయము వచ్చినది! కాకున్నచోఁ బరేశబాబు పుత్రికలకు మనఃకష్టము గాకుండదా?

ఇట్లు సంభాషణ జరుగుచుండఁగా, అవినాశుఁడు వచ్చి గదిలోఁ బ్రవేశించెను. అతఁడు గోరాశిష్యుఁడు. గోరా చెప్పినయుపదేశములన్నిటి నాతఁడు తనబుద్ధిచే సంకుచితములుగను, దనభాషచే వికృతములుగను జేసి యెల్లయెడల బోధించుచుఁ బ్రచారము చేయుచుండును. గోరాయుపన్యాసములను గొంచెమైనను గ్రహింపఁజాలనివారందఱు నవినాశునిమాటలను బాగుగ గ్రహించి ప్రశంసించుచుందురు. అవినాశుఁడు వినయుని యెడల నసూయ కలిగి యుండెను. అందుచేతనే యాతఁ డవకాశ మైనప్పుడెల్ల వినయునితో బుద్ధిహీనునివలె వాదము చేయుచుండును. వినయుఁ డాతనిమూఢత్వమును, సహింపక తిరస్కరించుచుండను. ఆటివేళల గోరా యవినాశునిపక్షమును గైకొని వినయునితో వాక్కలహమునకు డీకొనుచుండును. అప్పు డవినాశుఁడు తన యుక్తులే గోరానోటినుండి వెలువడుచున్నట్లానందించుచుండును! అవినాశుఁడు వచ్చినతోడనే వినయుఁడు గోరా యొద్దనుండి లేచి పైకిఁ బోయెను.

అప్పు డానందమయి వంటయింటియెదుటఁ గూర్చుండి కూరలను దఱుగుచుండెను. ఆమె వినయుని గాంచి "బాబూ! నీమాట చాలసేపటినుండి వినఁబడుచునే యున్నది. ఇంత వెడలిపోవ వచ్చితి వేమి? ప్రాతఃకాలభోజనము చేయకుండఁగనే బయలుదేఱితివా?" అనియెను.

మఱియొకప్పుడైనచో "నేను భోజనము చేయలేదు" అని చెప్పి యానందమయియొద్దఁ గూర్చుండి వినయుఁడు భుజించియే యుండును కాని యిప్పు డాతఁడు "అక్కఱలేదమ్మా! భుజించియే వచ్చితిని!" అనియెను.

ఇప్పుడు వినయుఁడు మరల గోరా కిష్టములేని యింకొకపనిచేయుటకు సాహసింపఁజాలకపోయెను. వినయుఁడు పరేశునియింటికిఁ బోయినందులకే గోరాకుఁ గోపముగానున్నది. అది యింకను శాంతింపనేలేదు. అది యెంతవఱకు వచ్చునో యనియే వినయుని హృదయము పరితపించుచుండెను. వినయుఁ డప్పుడు తనజేబులోనుండి చాకునుదీసి యానందమయిచెంతఁ గూరుచుండి బంగాళాదుంపలను దఱుగుచుండెను.

పదిపదునైదు నిమిషములకుఁ దరువాత వినయుఁడు క్రిందికివచ్చి చూచెను. గోరా యవినాశుని వెంటఁబెట్టుకొని వెలుపలకుఁ బోయియుండెను. వినయుఁడు చాలసేపటివఱకును గోరాగదిలో మౌనముతోఁ గూర్చుండి యుండెను. తరువాత వార్తాపత్రికను దీసికొని శూన్యహృదయముతో విజ్ఞాపనములు జూచుచుండెను. పిమ్మట నొక దీర్ఘశ్వాసమును విడిచి యటనుండి వెడలిపోయెను.

## ౧౩

మధ్యాహ్నభోజన మైనతోడనే వినయునకు గోరాయింటికిఁ బోవలయు నని తొందర కలిగెను. గోరాయెడల విధేయుఁడై యుండుటకు వినయుఁ డెన్నఁడును సంకో

చించి యుండలేదు. కాని, వినయుఁడు తనగౌరవముమాట యేమైనను స్నేహగౌరవమును మాత్రము బాగుగఁ బరిశీలించుచుండును. పరేశబాబునింటికిఁ బోయి తాను గోరాయెడల నెన్నఁడును జేయని యపచారమును జేసితినని వినయుఁడు తెలిసికొనియే యుండెను. కాని యట్లు చేసినందులకు గోరా తన్నుఁ బరిహసించి తిరస్కరించు ననిమాత్రమే యాతఁడు నిశ్చయించుకొనియెను. అట్లు కాక గోరా యీవిధముగాఁ దన్నుఁ దృణీకరించి పోవునని యాతఁ డూహించియైన నుండలేదు. వినయుఁ డిట్లు విడిచి కొంతదూరముమాత్రము పోయి మరల వెనుకకుఁ దిరిగి వచ్చెను. మిత్రభావమున కెట్టి యగౌరవము కలుగునో యనుభవముచే నాతఁడు గోరాయింటికిఁ బోఁజాలకపోయెను.

అప్పుడు వినయుఁడు గోరా కొకయుత్తరము వ్రాయఁదలఁచి కలమును, కాగితమును దీసికొని కూర్చుండెను. అతఁడు వ్రాయుచు నకారణముగాఁ గలము మొండ్డుగ వ్రాయుచున్నదని విసిగికొని యొకకత్తితో దానిని జాగరూకతతో సంస్కరించుచుండెను. ఇంతలోఁ గ్రిందినుండి "వినయా!" అను కేక వినఁబడియెను. తోడనే వినయుఁడు కలమును గ్రిందఁ బడవైచి తొందరగాఁ గ్రిందికిఁ బోయి "సోదరా! మహిమా! దయచేయుము! పైకి రమ్ము!" అనియెను.

మహిముఁడు మేడమీఁదికి వచ్చి వినయుని మంచముపైఁ గూర్చుండి యింటి యందలి వస్తుసముదాయమును బాగుగఁ బరీక్షించుచు "చూడుము వినయా! నాకు నీయిల్లు తెలిసికొనవలయుననియే కాక యప్పుడప్పుడు నీ క్షేమసమాచారములం తెలిసికొనవలయుననికూడఁ గోరిక కలుగుచుండును. కాని మీరు పరిష్కృతకాలపునాగరిక బాలకులు. మీయింట తంబాకు దొరకుట కవకాశము లేదు—అందుచేత నే విశేష ప్రయోజనము లేక—" అనియెను.

వినయుఁడు త్వరముతో లేచెను. అతనిం గాంచి మహిముఁడు "నీవిప్పుడు బజారునకుఁ బోయి నాకు తంబాకు తెచ్చిపెట్టవలయునని యనుకొనుచున్నావు కాఁబోలును! అక్కఱలేదు. నూతనముగా నపరిశుభ్రము లగుచేతులతోఁ జేసినహుక్కాను నే నుపయోగింపఁజాలను" అని చెప్పి యొకవిసనకఱ్ఱ నందుకొని విసరుకొనుచు "నేఁటి యాదివారమునఁ బగటినిద్రకు నీళ్ళువదలుకొని నీయింటికి వచ్చుట కొకముఖ్యకారణమున్నది. నీవు నాకొకయుపకారము చేయవలయును!" అనియెను.

విన—ఎట్టియుపకారము ?

మహి—చేసెద నన్నచోఁ జెప్పెదను.

విన—నాచేఁతనైనచోఁ జేసెదను.

మహి—అది కేవలము నీచేతనే కాఁగలదు. మఱియేమియును గాదు. నీవొక్కసారి "ఊఁ" యనినఁ జాలును!

విన—నన్నింతగా నడుగవలయునా? నేను మీ యింటివాఁడనే యని మీరు నెఱుఁగుదురుగదా! చేతనైనచో మీ యుపకారము చేయుటకంటెను నాకుఁ గావలసినదేమున్నది?

మహిముఁడు తనజేబులోనుండి తములపాకులను దీసి కొన్నిటిని వినయున కిచ్చి కొన్నిటిని దననోట వైచుకొని నములుచు “మా శశిముఖిని నీ వెఱుఁగుదువుగదా! ఆమె చూచుటకంతగాఁ గురూపిణి కాదు. తండ్రినైన నన్నుఁ బోలలేదు. ఆమె కిప్పుడు పదునొండ్లయీడు వచ్చినది. పెండ్లిచేయవలసిన సమయము! ఏయదృష్టవంతుని చేతులలోఁ బెట్టవలసివచ్చునో యని నాకు రాత్రులయందు నిద్ర పట్టుట లేదు.” అనియెను.

వి—అంత తొందరపడియెదరేల? ఇంకను గావలసినంత కాలమున్నది.

మహి—నీకొక్క కూఁతురుబిడ్డ యున్నచో నప్పుడు నాతొందరఁగూర్చి గ్రహింపఁగలిగియుందువు. వత్సరములు గడచినకొలఁదియు వయసు తనంతనే వచ్చును గాని వరుఁడట్లు వచ్చునా? అందుచేతనే దినములు గడచినకొలఁదియు నావ్యాకులత్వము వర్ధిల్లిపోవుచున్నది! ఇప్పుడు నీవు నాకించుక యూఱట కలిగించినచో నేను ధైర్యము వహించి యుండఁగలను.

విన—నాకంతగా నెవ్వరితోడను విశేషపరిచయము లేదు. కలకత్తానగరమున మీయిల్లుతక్క మఱి యేయిల్లును నే నెఱుంగ ననియే చెప్పవచ్చును. అయినను నేను ప్రయత్నించి చూచెదను.

మహి—శశిముఖి స్వభావచరిత్రముకూడ నీకుఁ దెలియునుగదా!

విన—తెలియకేమి? ఆమె నెన్నాళ్ళనుండి చూచుటలేదు! ఆమె కడుఁ జక్కనిబాలిక!

మహి—అట్లయినచోఁ జాలదూరము పోయి వెదకుట యెందులకు బాబూ! ఆబిడ్డను నీహస్తములయందే సమర్పింతును.

వినయుఁ డొక్కసారిగా నదరిపడి “ఏమనుచున్నారు?” అనియెను.

మహి—ఏమి? నేనేమైనఁ దప్పాడితినా? కులగౌరవమున మాకంటె మీరు గొప్పవారనుమాట నిజమే కాని, వినయా! ఇంతగాఁ జదివినమీవంటివారే కులము కొఱకు సంశయించుచున్నచో నింక జెప్పవలసిన దేమున్నది?

విన—కాదు. కులముమాట కేమిలెండు! కాని—వయస్సు—

మహి—ఏమనియెదవు? శశిముఖిదిమాత్ర మంతచిన్నవయసా? ఆమె హిందువులయింటిబిడ్డ గాని దొరసాని కాదుగదా! సమాజనియమమును బాలింపకున్నచో నేమి లాభము?

మహిముఁడు సాధారణముగా విడిచిపెట్టుస్వభావముకలవాఁడు కాఁడు. అతఁడిప్పుడు వినయునకుఁ గిమితుసిగాఁ జేసినదైనను. వినయుఁ డేమిచెప్పుటకును దోఁచక తుదకు "ఆలోచించుకొనుటకు నాకించుక గడువీయవలయును!" అని వేఁడుకొనియెను.

మహి— అలాగే! నేనుమాత్రము మీ రాత్రియే స్థిరపఱుపు మని చెప్పితినా?

విన— కాని, నేను మావాళ్ళతో—

మహి— ఔను. వాళ్ళతోఁ దెలుపకుండ నెట్లు? మీపినతండ్రి జీవించియుండఁగా నాతనియిష్టము వచ్చినట్లే నడుచుకొనవలయును.

అని చెప్పి మహిముఁడు తన జేబులో మిగిలియున్న తమలపాకుల నన్నిటిని దీసికొని నమలుకొనుచు దనయభీష్టము సఫలమైనట్లుగనే భావించుకొనుచు వెడలిపోయెను.

ఈవివాహవిషయమునుగూర్చి యానందమయి యింతకుముందే వినయునియొద్ద నవ్యాపదేశముగాఁ బ్రస్తావించి యుండెను. కాని వినయుఁడప్పుడామాట చెవినిబెట్టనేలేదు. ఇప్పటి ప్రస్తావమైనను వినయుఁ డంతగాఁ బాటింపలేదు. కాని యాప్రశ్న యాతనిహృదయమునం దొకచో స్థానమును గాంచకపోలేదు. ఈవివాహము స్థిరపడినచో వినయుఁడు గోరాకుటుంబములోనివాఁ డగును. అప్పుడు గోరా వినయుని సులభముగా విడువఁజాలఁడు. వివాహవ్యాపారమును హృదయవేగముతోఁ గలిపి చూడిపెట్టుట యింగ్లీషుపద్ధతియని యాతఁడింతవఱకును బరిహసించుచుండెను. అందుచేతనే శశిముఖి పెండ్లియాడుట యాతని కసంబద్ధముగాఁ దోఁచుట లేదు. ఈవిషయమును గుఱించి మహిముఁడు గోరాతోఁ బ్రస్తావింపక మానఁడని యాతఁ డనుకొని సంతోషించెను. ఈసందర్భమున గోరా తన్ను నిర్బంధించు ననికూడ నాతఁడు భావించుకొనియెను. తాను మహిమునియొద్దఁ దనసమ్మతిని దెలుపకపోవుటచే మహిముఁడు గోరామూలమునఁ దన్ను నిరోధించుటకుఁ బ్రయత్నించుననియును భావించుకొనియెను.

ఈయాలోచనలతో వినయునిహృదయ మవసన్నమై పోయెను. వినయుఁడప్పుడు గోరాయింటికిఁ బోవలయునని యుత్తరీయమును బైనివైచికొని బయలుదేఱెను. ఆతఁడు కొన్నియడుగులు నడచునప్పటికి వెనుకనుండి "వినయుబాబూ" అని పిలిచినట్లయ్యెను. వినయుఁడు తిరిగిచూచెను. సతీశుఁ డాతని బిలుచుచుండెను. అప్పుడు సతీశుని వెంటఁబెట్టుకొని వినయుఁడు మరల నింటఁ బ్రవేశించెను. సతీశుఁడు జేబునుండి యొకరుమాలుమూటను బైకిదీసి "దీనిలో నేమున్నదో చెప్పుకో!" అనియెను.

వినయుఁడు "తలకాయ, కుక్కపిల్ల—" అని యీవిధముగా నసంభవములగు మాటలు చెప్పి సతీశునిచేఁ గాదనిపించుకొనియెను. అప్పుడు సతీశుఁడు మూటను విప్పి యైదునల్లనిపండ్లను బైకిదీసి "ఇవియేమిటో చెప్పు చూతము!" అనియెను.

వినయుఁడు నోటికి వచ్చిన పేరు లన్నియును జెప్పి తానోడిన ట్లంగీకరించుటయు నప్పుడు సతీశుఁడు "రంగూనులో మామామ యున్నాఁడు. ఆయన యచ్చటియీపండ్లను మాయమ్మకు బంపినాఁడు. అమ్మ యీరెండుపండ్లను నీకుఁ బంపినది!" అనియెను.

బర్మాదేశమునందలి మంగుస్తానీపండ్లాదినములలోఁ గలకత్తా కంతసులభముగా వచ్చుటలేదు. అందువలన వినయుఁడాపండ్లను దిప్పి త్రిప్పి వేడుకగాఁ జూచుచు "సతీశబాబూ! ఈపండ్లను దిందురా" అనియెను. సతీశుఁడు వినయునియెఱుఁగనితనమునకు నవ్వుచు "చూడుము! వానిని గొఱికి తినవలదు! కత్తితోఁ గోసికొని తినవలయును" అనియెను.

సతీశుఁ డింతవఱకుం దాపండ్లను గొఱికి తినవలయునని ప్రయత్నించి తనవారందఱియెదుటను హాస్యాస్పదుఁ డయ్యెను. అందుచేత నే యిప్పు డాతఁడు వినయుని యజ్ఞానమునకుఁ దనవిజ్ఞానోచితముగు నవ్వు నవ్వి తనపరాభవమును దూరమున చేసికొనియెను. ఈకజోడుగాని యాయిరువురుమిత్రులకును నీవిధముగాఁ గొంతసేపటివఱకు ముచ్చటలు జరిగెను.

సతీ—వినయబాబూ! మీకుఁ గొంచెము యవకాశ మున్నచో మాయింటి కొక సారి రమ్మని యమ్మ చెప్పినది. నేఁడు మాలీల పుట్టిన రోజు!

విన—బాబూ! నా కిప్పుడు తీరికలేదు. నేనొకచోటికిఁ బోవలసియున్నది.

సతీ—ఎక్కడకుఁ బోయెదవు?

విన—నామిత్రునియింటికి—

సతీ—ఆస్నేహితుఁడేనా?

విన—ఔను.

మిత్రునియింటికిఁ బోవుటకును, దమయింటికి రాకపోవుటకును గల హేతువును సతీశుఁడు తెలిసికొనఁజాలక పోయెను.

విశేషించి వినయుని యామిత్రునియెడల సతీశున కంతగా నిష్టములేదు. అతఁడు తనస్కూలులోని ప్రధానోపాధ్యాయునికంటెను జెడ్డవాఁడుగా నాతని దలఁచుచుండెను. ఆతఁడు తనసంగీతప్రజ్ఞను వినిపించి మెప్పొందుటకుఁ దగినవాఁడు కాఁడు. అట్టివానియొద్దకు వినయుఁడు పోవుట సతీశున కిష్టము లేకపోయెను. అప్పుడు సతీశుఁడు వినయునిం గాంచి "వినయబాబూ! అక్కడకుఁ బోవలదు. మీరు మాయింటికే రండు!" అనియెను.

వినయుఁ డప్పుడు సతీశునిమాటను మన్నించుటకెంతయో సేపుపట్టలేదు. "పోనా; మాననా?" అని యోచించి యోచించి తుదకు వినయుఁ డాబాలకునిచేయి పట్టుకొని తిన్నగా 78 నెంబరు గృహమువైపునకే పోయెను. బర్మానుండివచ్చిన దుర్లభఫలములలోఁ

గొన్నిటిని దనకుఁ బ్రేమపూర్వకముగఁ బంపి తనయెడల సాత్మీయత్వము బ్రకటించుచుండు యామెను గౌరవింపకుండుట వినయునకు దుర్ఘటమయ్యెను.

వినయుఁడు పరేశబాబు నింటియొద్దకుఁ బోవుప్పటికి లోపలనుండి హానూబాబును, మఱికొంద ఱపరిచితవ్యక్తులును వెలుపలికి వచ్చుచుండిరి. ఆనాఁడు లీల జన్మదినము కావున వారందఱును మాధ్యాహ్నికభోజనమునకు నిమంత్రితులై యుండిరి. అప్పుడు హానూబాబు వినయుని జూచియుఁ జూడనట్లు వెడలిపోయెను.

లోపలఁ బ్రవేశించునప్పటికి వినయునకు హాసకోలాహలధ్వనులును, గమనాగమనపదశబ్దములు వినవచ్చెను. సుధీరుఁడు లావణ్య తాళపుచేతిని దొంగిలించెను; అంతే కాదు—ఆమె డ్రాయరులోని నోటుబుక్కును దీసి యందలి కవియశఃప్రార్థినుల నధిక్షేపించుపద్యముల నాదొంగ నలువురియెదుటను జదువుటకుఁ బ్రయత్నించుచుండెను. అది కారణముగా నుభయపక్షములకును సంఘర్షణ మగుచుండెను. అప్పుడా సంకుల సమరరంగమున వినయుఁడు ప్రవేశించెను.

అతనిం గాంచినంతనే లావణ్యప్రభృతులువా రందఱు నంతర్ధానమైపోయిరి. సతీశుఁడు వారియానందమును బంచుకొనుటకై వారివెన్నంటియే పోయెను. మఱికొంతసేపటికి సుచరిత యాఁగదిలోనికివచ్చి "అమ్మ మిమ్ముఁ గాచుకొనే యుండుమన్నది. ఆమె యిప్పుడే వచ్చును. తండ్రిగా రనాథబాబుగారియింటికిఁ బోయియున్నారు. ఆయన కూడఁ ద్వరలోనే వచ్చెదరు!" అనియెను.

సుచరిత యప్పుడు వినయునిసంకోచభావము వెడలించుటకై గోరాప్రస్తావము నెత్తి నవ్వుచు "ఆయన యిఁక నెప్పుడును మాయింటికి రారని తోఁచుచున్నది!" అనియెను.

విన—ఎందుచేత ?

సుచ—మేము పురుషులయెదుట బహిరంగముగా సంచరించుట యాతనికి విరుద్ధముగాఁ దోఁచినది. ఆఁడువాండ్రిల్లు విడిచి బయటికి వచ్చుట యాతఁడు సహింపఁజాలఁడని తోఁచుచున్నది.

దీనికిఁ బ్రత్యుత్తరము చెప్పుటకు వినయుఁడు చిక్కులఁబడియెను. ఆవాదమును ఖండింపవలయు నని యాతనికిఁ గుతూహలముగనే యుండెను. కాని యసత్యము చెప్పుట యెట్లు ? వినయుఁ డప్పుడు సుచరితం గాంచి "ఆఁడువాండ్రు గృహకార్యములయందు సంపూర్ణ మగుశ్రద్ధ లేకయున్నచో వారిస్వధర్మనిష్ఠకు నష్టము కలుగునని గోరాయుద్దేశము!" అనియెను.

సుచ—అట్లయినచో స్త్రీపురుషులు కలిసి యింటిపనులను వీథిపనులను బ్రత్యేకముగ విభాగించుకొనుట బాగుగా నుండును; అప్పుడు పురుషులు లోపలికి రాకున్నచో వారివీథిపను లన్నియును జెడిపోవునని చెప్పవలసియుండునుగదా! మీరును మీమిత్రుని మతములోఁ జేరినవారేనా ?

వినయుఁడింతవఱకు స్త్రీనీతిసంబంధమున గోరామతమునే యవలంబించి యుండెను. ఆమతము ననుసరించియే యాతఁడు పత్రికలకుఁగూడ వ్రాసియుండెను. కాని యీవిషయమున వినయుని స్వతంత్రాభిప్రాయ మింతవఱకును వెలువడి యుండలేదు.

విన— కేవలము నీసందర్భమున మన మందఱము నభ్యాసమునకు దాసులమై యున్నాము. అందుచేతనే స్త్రీలు, వీథిలోఁ దిరుగుచుండఁగా జూచినప్పుడు మనః కష్టము కలుగుచున్నది. అది యన్యాయ మనిగాని, యకర్తవ్య మనిగాని యితరులు నిందించినచో దానిని ఖండించుటకు మన మనేకవిధములగు ప్రమాణములను నిరూపించుటకుఁ బ్రయత్నించుచుందుము. ఈసందర్భమున యుక్తి కేవలము నుపలక్ష్యమాత్రమైనది. సంస్కారమే ప్రధానము!

సుచరిత గోరాప్రస్తావమును విడువక యేవియో చిన్నచిన్న ప్రశ్నలను వైచుచుండెను. వినయుఁడును గోరాపక్షమున దాను జెప్పవలసిన దంతయును బాగుగనే చెప్పుచుండెను. ఇంతయుక్తియుక్తముగను, నింతయుదాహరణపూర్వకముగను, నింత స్పష్టముగను వినయుఁ డిదివఱకెన్నఁడును మాటలాడి యుండలేదు. తనమతమును గోరా సయిత మింతస్పష్టముగను, సముజ్జ్వలముగను జెప్పఁజాలునో, చాలఁడో సందేహమే! తనబుద్ధికిని, బ్రబోధసామర్థ్యమునకును నింతటియపూర్వోత్తేజనము కలిగినందులకు వినయుని హృదయమున నొకవిధమగు నానంద ముదయించెను. ఆయానందముచే నాతని వదనమండలము దీప్తిమంతము కాఁజొచ్చెను. వినయుఁ డప్పుడు సుచరితం గాంచి "చూడుము! 'ఆత్మానం విద్ధి' తన్నుఁ దాను దెలిసికొనవలయు నని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్లు కాకున్నచో ముక్తిలేదు. మాగోరా యీయాత్మప్రబోధమును భరతవర్ష మంతటను వ్యాపింపఁజేయుటకే యావిర్భవించెనని చెప్పఁగలను! నేనాతని సామాన్యమానవునిగాఁ దలఁచుటలేదు. మనవంటివారిహృదయము లన్నియును, దుచ్ఛాకర్షణములకును, నవీనప్రలోభములకును వివశములై పోవుచున్నప్పుడుగూడ నాతఁ డొక్కఁడే యీసమస్తనిక్షిప్తతామధ్యమున సుస్థిరుఁడై నిలువఁబడి సింహగర్జనముతో 'ఆత్మానంవిద్ధి' అను పురాతనదివ్యమంత్రమును బ్రబోధించుచుండును."

ఈవిధముగాఁ జాలసేపటివఱకు నాలోచన జరుగుచునే యుండెను. సుచరితయు నాత్రముతో వినుచునే యుండెను. కాని, యింతలో నాకస్మికముగా సతీశుఁడు ప్రక్కగదిలోనుండి కేకలు వైచుచు,

"సర్వదృష్టమైన ♦ జగము మాయ యటంచు
సర్వజీవితంబు ♦ స్వప్నమనుచు
సత్య మరయకుండ ♦ స్వరము తోట్రిబుచుండ
బోధనంబు సేయఁ ♦ బోకుమోయి!"

అని యొకగీతమును పాడుచుండెను. పాపము, సతీశునకుఁ దమయింటికి వచ్చి పోవువారియెదుటఁ దనవిద్యాప్రాగల్భ్యమును జూపుట కవకాశము లేదు. లీలగూడఁ దన యింగ్లీషుకవితాపఠనముచే సభలో మెప్పొందుచుండును. కాని వరదాసుందరి యెన్నఁడును సతీశుని సభకుఁ బిలుచుట లేదు. మఱియు నెల్లవిషయములందును సతీశుఁడు లీలకుఁ బ్రతిద్వంద్వియై యుండెను. ఎట్లయిన నామెకు గర్వభంగము చేయఁ గలయుననియే యాతనిప్రధానోద్దేశము! నిన్నను వినయునియెదుట లీలకుఁ బరీక్షయైనది. అప్పు డనాహూతుఁడగు సతీశుఁ డామె నోడించుట కట్టిప్రయత్నమును జేయలేదు. చేసినను, వరదాసుందరి యాతని నడ్డగించియే యుండును.

అందుచేతనే యిప్పు డాతఁడు ప్రక్కగదిలోఁ గూర్చుండి యుచ్చైస్స్వరముతో నీవిధముగాఁ గార్యచర్చయందుఁ బ్రవృత్తుఁడై యుండెను. ఆపాట నాలకించి సుచరిత నవ్వు నాఁపుకొనఁజాలకపోయెను.

ఇంతలో లీల విడిపోయినజడ వెన్నునఁ జీరాడుచుండ నచ్చటికివచ్చి సుచరితను గౌఁగిలించుకొని యామెచెవిలో నేమియో చెప్పుచుండెను. అప్పుడే సతీశుఁడును జటాలున వచ్చి లీలవెనుక నిలువఁబడి "లీలా! చెప్పుము చూతము! మనోయోగము అనగా నేమి?" అనియెను.

లీల—చెప్పను.

సతి—ఓస్! చెప్పవు తెలియదు గనుక చెప్పవు!

వినయుఁడు సతీశునిదగ్గఱకుఁ దీసికొని నవ్వుచు "నీవు చెప్పుము! మనోయోగమనగా నేమి?" అనియెను.

సతీశుఁడు సగర్వముగాఁ దలయెత్తి "మనోయోగమనగా, మనోనివేశము!" అనియెను.

అప్పుడు సుచరిత "మనోనివేశ మనఁగా నీకేమిబోధపడినది?" అనిప్రశ్నించెను.

ఆత్మీయుని విపత్తునఁ బడఁద్రోయుట కాత్మీయుఁడు కాక మఱియెవ్వఁడుసమర్థుఁడు కాఁగలఁడు? సతీశుఁ డాప్రశ్నమును వినియు విననట్లుగా నొక్కపరుగునవ్వలకుఁ బోయెను. వినయుఁడు పరేశునింటినుండి సెలవు గైకొని గోరాయింటికిఁ బోవఁ దలఁచి వచ్చియుండెను. ఇంతసేపటినుండియు గోరాప్రస్తావమే చెప్పుకొనుచుండుట వలన నాతని కాయుద్దేశము మఱియును బ్రబలమయ్యెను. అందుచేతనే యాతఁడు గడియారము నాలుగుగంటలు కొట్టుట నాలకించి చటాలునఁ గుర్చినుండిలేచెను.

అప్పుడు సుచరిత "మీరిప్పుడే పోవలయునా? అమ్మ మీకొఱకుఁ దేనీరు [illegible]ము చేయుచున్నది. ఒక్కించుక సేపాఁగి పోఁగూడదా?" అనెను.

వినయున కిది ప్రశ్నగా లేదు—ఆజ్ఞవలెనుండెను. అందుచే నాతఁడట్లే కూర్చుండిపోయెను. ఇంతలో లావణ్య సిల్కుదుస్తులను ధరించి యచ్చటికి వచ్చి "సోదరీ! తేనీరు సిద్ధమైనది. అమ్మ మేడమీఁదికి రమ్మన్నది!" అని చెప్పెను.

మేడమీఁదికిఁ బోయి వినయుఁడు టీత్రాగుటయందుఁ బ్రవృత్తుఁడై యుండెను. అప్పుడు వరదాసుందరి తనపుత్రికల జీవితచరిత్ర మంతయు నాతనికిఁ దెలుపుచుండెను. లలిత సుచరితను గదిలోనికిఁ దీసికొనిపోయెను. లావణ్య యొకకుర్చీపైఁ గూర్చుండి కుట్టుపని చేసికొనుచుండెను. కుట్టుపని చేయునప్పు డామెకోమలాంగుళము లెంతయో సుందరములై యుండు నని యెవ్వరో యొకప్పుడు ప్రశంసించియుండిరి! అప్పటినుండియు నామె యేదియో ప్రత్యేక కారణ మున్నప్పుడుతప్ప యెల్లప్పుడును బదిమందియెదుటనే కుట్టుపని చేయుచుండును.

ఇంతలోఁ బరేశుఁడు వచ్చెను. సాయంకాలమయ్యెను. నేఁ డాదివారము ఉపాసనామందిరమునకుఁ బోవలసియుండెను. అప్పుడు వరదాసుందరి వినయునిం గాంచి "అభ్యంతరము లేకున్నచో మీరును మాతోఁగూడ సమాజమందిరమునకు వచ్చెదరా?" అనియెను. వినయునినుండి వ్యతిరేకపు ప్రత్యుత్తరము రాలేదు. తరువాత రెండుబండ్లు చేసికొని యందఱును ప్రార్థనామందిరమునకుఁ బోయిరి. వారచ్చటినుండి వెలుపలికి వచ్చి మరలఁ బండ్ల నెక్కుచున్నప్పుడు సుచరిత యాకస్మికముగా నదరిపడి "అదిగో! గౌరమోహనబాబు బోవుచున్నాఁడు!" అనియెను.

గోరా వారిని జూచియే యుండుననుట కెట్టిసంశయమును లేదు. కాని చూడనట్లే యాతఁ డతిత్వరితముగఁ బోవుచుండెను. అప్పటిగోరాయౌద్ధత్యమునకును, నష్టత్వమునకును వినయుఁడు లజ్జించి పరేశబాబుయెదుటఁ దల వంచుకొనియెను. కాని తన్నుఁ జూచియే గోరా యింతటిప్రబలవేగముతో విముఖుఁడై పోవుచుండె నని వినయుఁడు స్పష్టముగాఁ దెలిసికొనియెను. అందుచే నింతవఱకు నాతని హృదయమున వెలుఁగుచున్న యానందతేజోలేశ మొక్కసారిగా నంతర్ధానమైపోయెను. వినయుని భావపరివర్తనమును, నందులకుఁ గల కారణమును సుచరిత యప్పుడే గ్రహింపఁగలిగెను. మిత్రుఁడగు వినయుని యెడల నిట్లు ప్రవర్తించినందులకును, బ్రాహ్మసమాజము నింతయన్యాయముగ నగౌరవించినందులకును గోరాయెడల సుచరితకు మరలఁ గోపము కలిగెను. ఆతని నెట్లయినఁ బరాభవింపవలయు నని యామె మనసులోనే సంకల్పించుకొనియెను.

## ౧౪

గోరా మధ్యాహ్నభోజనము చేయుచుండెను—ఆనందమయి యటకు వచ్చుచు వచ్చుచు "నేఁటియుదయమున వినయుఁడు వచ్చియున్నాఁడు! నీవాతనిఁ జూచితివా?" అనియెను.

గోరా భోజనపాత్రనుండి మొగము నెత్తకయే "ఆఁ! చూచితిని" అనియెను.

ఆనందమయి సమీపమునకు వచ్చి కూర్చుండెను; చాలసేపటివఱకును మాటాడలేదు. తరువాత నామె "అతని నుండుమని చెప్పుచునే యున్నాను. ఏమో గాని యాతఁడు పరాకుగ లేచిపోయినాఁడు." అనియెను.

గోరా యెట్టిప్రత్యుత్తరము నీయలేదు. మరల నానందమయి "అతనిమనస్సున కేదియో కష్టము తోఁచినది. గోరా! అతఁ డట్లుండుట నేనెన్నఁడును జూడలేదు! నామన సంతయును గలఁగిపోవుచున్నది!" అనియెను.

గోరా మాటాడక భోజనము చేయుచుండెను. ఆనందమయి గోరా నత్యధికముగ ప్రేమించుచునే యుండును గాని యాతఁ డనిన నించుక భయపడుచుండును. అప్రసన్నుఁడైయున్నప్పు డామె యాతనితో మాటలు పెట్టుకొని తొందర కలిగింపదు. ఇప్పుడైనను నామె మాటాడకయే యుండును. కాని వినయునికొఱకామెమనమున వేదన కలుగుచుండుటచే నిట్లు సంభాషించినది. ఆమె మరల గోరానుద్దేశించి "బాబూ! ఇటు చూడుము! పరమేశ్వరుఁ డనేకజీవులను సృష్టించెను కాని యందఱు నొక్కటే త్రోవను దెఱచియుంచలేదు! వినయుఁడు నిన్నుఁ బ్రాణముతో సమానముగఁ బ్రేమించి యున్నాఁడు. వాఁడు నీవు చేయువాని నన్నిటిని సహించుచున్నాఁడు. కాని, అతఁడు నీత్రోవనే రావలయు నని బలవంతపెట్టుట సమంజసము కాదు!" అనియెను.

గోరా—అమ్మా! మఱికొంచెముపాలు తెచ్చిపెట్టుము!

ఇంతటితో సంభాషణ మాఁగిపోయెను. అనంతర మానందమయియును భోజనము చేసి తనపఱుపుపై మౌనముతోఁ గూర్చుండి కుట్టుపని చేసికొనుచుండెను. ఇంతలో లక్ష్మి వచ్చి యొకసేవకుని యపచారమునుగూర్చి యామెకు నివేదింపవలయు నని వృథాప్రయత్నము చేసిచేసి తుద కొకబల్లపైఁ బరుండి నిదురించెను.

గోరా యుత్తరములను వ్రాసికొనుచుఁ జాలసేపు కాలక్షేపము చేసెను. గోరా తనపైఁ గోపముగ నున్నాఁడని వినయుఁ డిదివఱకే స్పష్టముగ గ్రహించియుండెను. కాని యాకోపము నెట్లయిన శాంతింపఁ జేయుటకై వినయుఁడు గోరాచెంతకు వచ్చియుండలేదు. కారణము తెలియక గోరా యెల్లపనులయందును వినయునియడుగుల చప్పుడు వినుటకై చెవి యొగ్గియే యుండెను. ప్రొద్దు పోవుచుండెను. వినయుఁడు వచ్చుటలేదు. వ్రాయుట మాని గోరా లేచుటకు సిద్ధముగనుండఁగా మహిముఁ డా గదిలోనికి వచ్చి కుర్చీపైఁ గూర్చుండి "గోరా! శశిముఖి పెండ్లిమాట యేమాలోచించితివి!" అని ప్రశ్నించెను.

ఈమాట గోరా యొకప్పుడైనను భావించి యుండలేదు. కేవలము నపరాధము చేసినవానివలె నాతఁ డూరక నిర్విణ్ణుఁడై కూర్చుండెను. అప్పుడు మహిముఁడు వర

శుల్కములు హెచ్చుటను గూర్చియు, గృహమున ధనాభావమై యుండుటం గూర్చియుఁ దెలిపి యుపాయ మాలోచింపు మనియెను. గోరా యెంతయో యాలోచించి కర్తవ్యమును నిశ్చయింపఁజాలకపోయెను. మహిముఁ డప్పుడు వినయునిమాట సూచించెను. మహిముఁ డింతతలక్రిందుగా నిప్పుడు మాటాడవలసినపనిలేదు. కాని గోరా యభిప్రాయ మేమో, యాతఁ డేమి చెప్పునో యని మహిముఁడు భయపడుచుండెను.

ఈసందర్భమున వినయునిమాట వచ్చునని గోరా యెన్నఁడును స్వప్నమునందైనను భావించి యుండలేదు. పెండ్లి యాడకుండ దేశోద్ధరణకార్యములయందే జీవితములను గడపవలయు నని గోరాయును వినయుఁడు నిదివఱకే నిశ్చయించుకొని యుండిరి. అందుచేతనే గోరా యప్పుడు "వినయుఁడు పెండ్లిచేసికొనునా?" యని ప్రశ్నించెను.

మహి—ఇదియేనా మీహిందూత్వము? ఎన్నిపిలక లుంచుకొన్నను, ఎన్ని బొట్లు పెట్టుకొన్నను నెపములను బట్టియున్న యింగ్లీషుపద్ధతిమాత్రము మిమ్ములను విడువదు. శాస్త్రప్రకారము బ్రాహ్మణకుమారునకు వివాహ మనునది యొకసంస్కార మని యెఱుఁగవా ?

మహిముఁ డిప్పటియువకులవలె నాచారము నుల్లంఘించుటయును లేదు; శాస్త్రముల ననుసరించుటయును లేదు. హోటలులలో భోజనములు చేసి గొప్పతనమును ప్రదర్శించుట గాని, గోరావలె నిరంతరమును శ్రుతిస్మృతులరాద్ధాంతసిద్ధాంతములు చేయుచుండుట గాని వివేకలక్షణముగా మహిముఁడు భావించుట లేదు. కాని "ఏదేశమునం దాయాచారము!" అనునట్లు గోరాయెదుట శాస్త్రమునే ప్రదర్శింపవలసినవాఁ డయ్యెను.

ఈప్రస్తావము రెండుదినములకు ముందుగనే జరిగినచో గోరా వినిపించుకొనకుండెడివాఁడే—కాని యిప్పు డాతఁ డెంతమాత్రము నుపేక్షింపఁ జాలకపోయెను. ఇంతేకాక యీప్రస్తావమునుబట్టి యిప్పుడే వినయునింటికిఁ బోయి యొకసారి చూడవలయునని గోరా కుద్దేశము కలిగెను. తుట్టతుదకు గోరా మహిముని జూచి "మంచిది! వినయుని యభిప్రాయ మెట్లున్నదియో చూచెదను!" అనియెను.

మహి—అది తెలిసికొనవక్కఱలేదు. ఆతఁడు నీమాట నెంతమాత్రము నతిక్రమింపజాలఁడు. కాని చెప్పుటయును మంచిదే. నీవుకూడఁ జెప్పవచ్చును.

ఆసంధ్యాసమయముననే గోరా వినయునియింటికిఁ దుపానువలెఁ బోయిచూచెను. ఇంట నెవ్వరునులేరు. సేవకునిఁబిలిచి యడుగఁగా "బాబు 78 నెంబరుగృహమునకుఁ బోయియున్నారు" అని చెప్పెను. పరేశుబాబు కుటుంబముమీఁదను, బ్రహ్మసమాజముమీఁదను గోరా కొక్కసారిగా విరుద్ధభావమును, విరక్తభావమును కలిగెను. అప్పుడు గోరా తనహృదయమధ్యమున భయంకరవిద్రోహభావము తాండవ మాడుచుం

డఁగాఁ బరేశునియింటివైపునకుఁ బోయెను. వినయుని కనిష్టముగ నున్నను బ్రాహ్మసామాజికులగు వారిహృదయములు మండిపోవునట్లు స్పష్టముగా మాటలాడవలయునని గోరా నిశ్చయించుకొనియెను. అతఁడు తిన్నగాఁ బరేశునింటికిఁ బోయెను గానియచ్చట నెవ్వరును లేకపోయిరి. అందఱును ప్రార్థనామందిరమునకుఁ బోయియుండిరి. వినయుఁడుకూడఁ బోయియుండునా యని యాతని కొక్కింతసేపు సంశయము కలిగెను. కాని యాతఁ డీపాటికి నాయింటికే పోయియుండు నని గోరా యనుకొనియెను.

గోరా యింక నట నిలువఁజాలక స్వాభావిక మగుశరవేగముతో మందిరము వైపునకుఁ బోయెను. గుమ్మమునొద్దకుఁ బోయిచూచునప్పటికి వినయుఁడు వరదాసుందరితోఁగూడ బండి నెక్కుచుండెను. నట్టనడివీథిలో సిగ్గులేక యితరకుటుంబస్త్రీలతోఁ గలిసి యొక్కబండిపై నెక్కి చనుచుండుటయా? మూఢుఁడా! ఈవిధముగా నింతలో నీ నాగపాశబద్ధుఁడవైపోయితివా? ఇంతశీఘ్రముగ—ఇంతసులభముగ—ఇఁక స్నేహమునకు గౌరవములేదు!—గోరా గిఱ్ఱున దిరిగి ప్రబలవేగముతో వెడలిపోయెను. బండిలోని యంధకారమధ్యమునం దుండి వినయుఁడు వీథివంకఁ బరిశీలించుచు మౌనముతోఁ గూరుచుండెను.

"ఆచార్యుని యుపదేశ మీతనిహృదయాంతరాళమునఁ బనిచేయుచున్నది. ఈతఁ డేమియును మాటాడుట లేదు." అని వరదాసుందరి యనుకొనియెను.

## ౧౫

గోరా రాత్రి యింటికివచ్చి చీఁకటిలో మేడమీఁద నిటునటు తిరుగుచుండెను. మహిముఁడు వగర్చుకొనుచు నచ్చటికివచ్చి "మనుష్యులు ఱెక్కలు లేనివారుగదా! వారు మూడంతస్తులమేడలు కట్టుకొనుటయెందులకు? భూచరులగుమానవు లాకాశవిహారము చేయుటకు ఖేచరులు సహింతురా?—గోరా! నీవు వినయునియొద్దకుఁ బోయితివా?" అనియెను.

గోరా దానికి సరిగాఁ బ్రత్యుత్తరము చెప్పక వినయునితో "శశిముఖికిఁ బెండ్లియగుట యసంభవము!" అనియెను.

మహి—ఏమి? వినయున కిష్టము లేదా?

గోరా—నాకిష్టము లేదు!

మహిముఁడు చేతులు త్రిప్పుచు "సరిసరి! మరల నింకొక నూతనచాంచల్యము కలిగిన ట్లుపడే! నీకిష్టము లేదా? కారణమేమి?" అనియెను.

గోరా—వినయుని మాసమాజమున నిలిపి యుంచుట చాలకష్టమని నాకుఁ దోచుచున్నది. మనయింటిబిడ్డ నాతని కిచ్చుట నాకిష్టము లేదు.

మహి—ఎంతమందిరో హిందూమతాభిమానులను జూచితిని. కాని నీవంటి వానినెచ్చటను జూడలేను. నీయెదుటఁ గాశీపండితులుకూడ నిలువనట్లు కనఁబడుచున్నది. నీవు భవిష్యత్ఫలమును నిర్ణయించువానివలె నగపడుచున్నావు. అతఁడు క్రిష్టియనుఁడయినట్లును, గోమాంసమును దినుజాతివాఁడైపోయినట్లును నీకుఁ గలవచ్చినదని కూడ నెవ్వఁడో యొకప్పుడు చెప్పుదువు.

అని యిట్లెన్నియో మాటలాడి మహిముఁడు తుదకు 'నేను నాబిడ్డ శోకమూర్తిచేతిలోఁ బెట్టజాలను. చదువుకొన్నవాఁడు, బుద్ధిమంతుఁడైనవాఁ డెప్పుడైన శాస్త్రము నతిక్రమించును గాక! అప్పుడు నాతనితో వాదించి యాతనిఁ దిరస్కరింపవచ్చును. కాని యాతని పెండ్లి కడ్డమువచ్చి "నాబిడ్డకు శాస్తి చేయుచున్నావేమి? నీవన్నియుఁ దలక్రిందులాలోచనములు!" అని చెప్పుచు మహిముఁడు క్రిందికి దిగిపోయి యానందమయిం గాంచి "అమ్మా! నీవొకసారి గోరాను మందలింపుము." అనియెను.

ఆనందమయి యుద్విగ్నచిత్తముతో "ఏమి జరిగినది?" అనియెను.

మహి—వినయుఁడు మనశశిముఖిని బెండ్లియాడునట్లు నేనొకవిధముగా నంగీకరింపఁజేసి యుంటిని. సాయంకాలముక గోరానుగూడ సమ్మతింపఁజేసితిని. ఇంతలోనే గోరా వినయుఁడు సంపూర్ణముగ హిందువుఁడు కాఁడనియు, మనుపరాశరులమతముతో నాతనికిఁ గొంచెమో గొప్పయో యభిప్రాయభేద మున్నదనియు స్పష్టముగా గ్రహించినట్లు చెప్పి మండిపడుచున్నాఁడు. కోపము కలిగినప్పు డాతఁ డెట్టుండునో నీకే తెలియును. కలియుగమున జనకుఁ డెవ్వఁడైనను బాణము నేర్పుఁజూచి ప్రదర్శించినప్పుడుగాని గోరా సీతాదేవినైనను, శ్రీరామచంద్రునైనను గౌరవింపఁడని నేను పందెమువైచి చెప్పఁగలను. మనుపరాశరులకుఁ దరువాత నీప్రపంచములో నాతఁడు నిన్నొక్కనినుమాత్రమే గౌరవించుచుండును. కావున నాబిడ్డ యుద్ధరింపఁబడుటకు నీవిప్పు డొకగతిని గల్పింపుము! అటువంటివరుఁ డెంతప్రయత్నించినను మన కిఁక లభింపఁడు!

అని చెప్పి మహిముఁడు మేడమీఁద గోరాకును దనకును జరిగినసంభాషణ మంతయు నెఱింగించెను. వినయునియెడల గోరా విరోధభావము కలిగియున్నట్లు తెలిసికొని యానందమయి మిగుల నుద్విగ్నహృదయయై పోయెను, తోడనే యామె మేడమీఁదికిఁ బోయెను. గోరా యప్పటికిఁ బ్రచారమును మాని గదిలోనికిఁ బోయి యొక కుర్చీపైఁగాళ్ళు సాచి యొకకుర్చీపైఁ బరుండియుండెను. ఆనందమయియును నొకకుర్చీని దెచ్చుకొని యాతని కెదురుగఁ గూర్చుండెను. గోరా యానందమయినిగాంచి రెండవకుర్చీపైనున్న పాదములను దీసివైచి లేచి కూర్చుండెను.

ఆనం—బాబూ! గోరా! నాది యొకమాట యున్నది. వినయునితో జగడమాడకుము! మీయిరువురును సోదరులుగనే నేను భావించుచున్నాను. మీయిరువురిలో నెడఁబాటు కలిగినచో నేను సహింపఁజాలను!

గోరా—బంధువు బంధమును ద్రెంచుకొనఁదలఁచుచుండఁగా నూరక యాతని వెనువెంటఁ దిరుగుచు నేను నా కాలమును వ్యర్థము చేసికొనఁ జాలను !

ఆనం—బాబు ! మీయిరువురిలో నేమి జరిగినదో నే నెఱుఁగను. కాని, వినయుఁడు బంధమును ద్రెంచుకొనఁదలచుచుండెనని విశ్వసించుచున్నావు. అట్లయినచో నింక నీ స్నేహబంధమునకు దృఢత్వ మెక్కడ నున్నది ?

గోరా—అమ్మా ! నేను తిన్నని నడవడిని మాత్రమే ప్రేమింతును. రెండవనాక యందనుగు పెట్టుస్వభావముగలవారి పాదములు నానాఁటను దితొలఁగింపఁబడవలసినదే. ఇది నాకుఁ గష్టమైనను సరియే, వారికి గష్టమైనను సరే—

ఆనం—ఏమి జరిగినదో చెప్పవు చూతము! బ్రహ్మసామాజికులయింటికిఁ వచ్చుచుఁ బోవుచుండుటయేనా యాతని యపరాధము ?

గోరా—ఇంకను జాలసంగతులున్నవి తల్లీ !

ఆనం—ఉండిన నుండనిమ్ము! కాని నేనొక్కమాట యడిగెదను. నీవు సకల విషయములను దిరస్కరించుచుందువు. నీవు పట్టినపట్టు నెవ్వరును విడిపింపఁజాలరు. అట్టి నీవు వినయునిపట్టు నంత తేలికగాఁ జూచెద వేమి? ఒకవేళ నవినాశుఁడు నీ సంఘమునుండి విడిపోవఁదలఁచినచో నీవు సులభముగా నాతనిని విడువఁగలవా? నీకున్నలయెడుట వినయుఁ డింతలోకువ యైపోవుట నీ స్నేహితుఁడగుటచేతనేనా ?

గోరా మాఱుమాటాడక భావించుకొనుచుండెను. ఇప్పటి యానందమయిమాటలవలన గోరాకుఁ దనహృదయము విస్పష్టముగాఁ గానవచ్చెను. స్వధర్మనిర్వాహణముకొఱకాతఁడు మిత్రత్వమును గూడఁ బరిత్యజింపవలయు ననియే యింతవఱకును దలంచుకొనుచుండెను. ఇప్పు డది యంతయును దప్పుత్రోవయని యాతనికి స్పష్టముగా నగపడుచుండెను. గోరా తనకు స్నేహాభిమానమున బాధకలుగుటచే వినయునకు స్నేహసంబంధమున నంత్యశిక్ష చేయవలయునని ప్రయత్నించి యుండెను. కాని యిప్పుడాతఁడు వినయునితోడి సంబంధమును నిలుపుకొనుటకు స్నేహమే సర్వసమర్థ మైనదనియు, మఱియొకవిధముగాఁ బ్రయత్నించుట స్నేహమునకగౌరవ మనియు సంపూర్ణముగ గ్రహించుకొనియెను.

తనమాట గోరాహృదయమునకు నాటినదని యానందమయి గ్రహించి మఱేమియు మాటాడకుండఁ జల్లఁగా వెడలిపోవుట కుద్యమించెను. ఆకస్మికముగ గోరాయుం నదరిపడి లేచి చిలుకకొయ్యనున్న యుత్తరీయము పై వైచికొనియెను.

ఆనంద—ఎక్కడకుఁ బోయెదవు బాబూ ?

గోరా—వినయునియొద్దకు—

ఆనం—వంట యైనది. భోజనము చేసి మఱి పొమ్ము !

గోరా— నేనిప్పుడు పోయి వినయుని దీసికొని వచ్చెదను. అతఁడు కూడ నిచ్చటనే భుజించును.

ఆనందమయి మాఱుమాట చెప్పక క్రిందికిఁ బోవుచు మెట్లపై నడుగులచప్పుడు విని యాఁగి— "ఇదిగో ! వినయుఁడు వచ్చినాఁడు !" అని యామె యనుచుండఁగనే వినయుఁడు వచ్చి పడియెను. ఆనందమయికన్నులఁ నీరు నిండిపోయెను. ఆమె ప్రేమార్ద్రహృదయముతో వినయునివెన్నుపైఁ జేయివైచి దువ్వుచు "బాబూ ! వినయా ! నీవు భోజనము చేసి రాలేదా" అనియెను.

విన— లేదమ్మా !

ఆనం— నీవిక్కడనే భుజింపుము !

వినయుఁడు గోరావంకఁ జూచెను. అప్పుడు గోరా "వినయా ! నీకు వేయేండ్ల ఆయుష్యమున్నది. నేనిప్పుడే నీకొఱకు రావలయు ననుకొంటిని. నీవేవచ్చితివి !" అనియెను. ఆనందమయి హృదయభారము తీరిపోయెను. ఆమె తత్తరముతోఁ గ్రిందికి దిగిపోయెను.

ఇరువురుమిత్రులును గదిలోఁ గూర్చుండిరి. ఎవ్వరినోటికిని మాటలు వచ్చుట లేదు. అప్పుడు గోరాయే యేదియో యొకమాట యెత్తుకొని "వినయా ! మనచిన్నతనమునం దొకజిమ్నాస్టిక్‌టీచ రుండెడివాఁడు. అతఁడు మంచిబోధకుఁడు సుమా!" అనియెను. కాని తమ మనసులోనిమాటలను వెలువరించుట కిర్వురును సాహసింపజాలకుండిరి.

తరువాత వారిరువురును భోజనమునకుఁ బోయిరి. భోజనసమయమున వారిమాటలనుబట్టి యానందమయి వారిమనసులోని తెర యింకను మాయమైపోలేదని గ్రహింపఁగలిగెను. అప్పు డానందమయి "వినయా! చాలరాత్రి యైనది. నీవీరాత్రి యిచ్చటనే యుండుము! ఇంటికిఁ గబురు పంపెదను !" అనియెను.

వినయుఁడు గోరామొగమువంక బెదరిబెదరి చూచుచు "భుక్త్వా రాజవదాచరేత్" భుజించి వీధులవెంటఁ దిరుగుట శాస్త్రసమ్మతము కాదు. కావున నేనిచ్చటనే శయనించెదను" అనియెను.

భోజనానంతరమున నిరువురుమిత్రులును మేడమీఁదికిఁబోయి యొకచాఁప డాబాపైఁ బఱచుకొని కూర్చుండి యుండిరి. భాద్రపదమాసము— శుక్లపక్షచంద్రికలలో నాకాశము తేలిపోవుచుండెను. పలుచనైపోయిన తెల్లనిమేఘశకలములు కునుకుపాట్లు పడుచున్నవియుంబోలె నప్పుడప్పు డొక్కొక్కసారి చంద్రకాంతికి మాంద్యమును గల్పించుచుఁ బోవుచుండెను. ఎల్లయెడలదిగంతములపర్యంతమును గల నానావిధమందిరములనిమ్నోన్నతచ్ఛద శ్రేణులయందును, వానినడుమనడుమనున్న సమవిషమవృక్షా

గ్రముల యందును గూడ వెన్నెలలును, ఛాయలును సమ్మిళితములై యనిర్వేద్యంబును, నప్రయోజనంబును నగునొక ప్రకాండస్వరూపమును దాల్చియుండెను.

చర్చిలోని గడియారము పదునొకండుగంటలు కొట్టెను. మంచునమ్మువాఁడు తనబండికేకను వైచి వెడలిపోయెను. బండ్లనడచు చప్పుడు తగ్గిపోవుచుండెను. గోరా యుంటివీథియందు జాగరణలక్షణము లేవియును లేవు. కేవలము సమీపమునందలి గుఱ్ఱపుసాలలోని గుఱ్ఱములసకిలింపులును, కుక్కలభౌభౌరావములు, నప్పుడప్పుడు వినవచ్చుచుండెను. ఇరువురును గొంతసేపటివఱకు మౌనముతోనే యుండిరి. వినయుఁడు మొట్టమొదటఁ గొంచెము సంశయించి క్రమముగా ధైర్యము వహించి తనమనసులోని మాటలకు బంధవిముక్తిని గావించెను. వినయుఁడు "సోదరా! గోరా! నాహృదయము నిండిపోయినది! ఈమాట లన్నియును నీవు నచ్చవని నేనెఱుఁగుదును. కాని నీకుఁ జెప్పకున్నచో బ్రదుకఁజాలను! అది మంచిదియో చెడ్డదియో నేనెఱుంగను—కాని దానియెదుట నాటిచాతుర్యమును నిలువదనిమాత్రము నిశ్చయముగఁ జెప్పఁగలను. పుస్తకములలో ననేకవిషయములనుగూర్చి చదివి నాకన్నియును దెలియు నని నేఁటివఱకును, సంతోషించుచునే యున్నాను. చిత్రపటమున నదిని జూచినప్పుడు—ఈఁదుట సుళభమే యని భావించుకొంటిని—కాని యిప్పుడు నిజముగా జలమధ్యమునఁ బ్రవేశించి యీఁదుట సాధారణకార్యము కాదని స్పష్టముగాఁ దెలిసికొనఁగలిగితిని!" అని యీవిధముగా వినయుఁడు తనజీవితమునఁ దోఁచినయాశ్చర్యభావోదయమును గూర్చి రహస్యముగా గోరాయెదుట నుపోద్ఘాతమును గావించెను.

వినయుఁడు చెప్పుచుండెను:—ఇప్పు డాతనికి సమస్తదినములయందును, రాత్రులయందును, నెచ్చటను దెరపి లేనట్లును, సమస్తాకాశమునందు నెచ్చటను నెట్టి ఛిద్రమును లేనట్లును దోఁచుచు సమస్తము నొక్కసారిగ నిండి నిబిడీకృతమైయుండెను. వసంతకాలమున మధుపూర్ణమగు వికసనోన్ముఖకదళీపుష్పమువలె నుండెను. ఇప్పుడు సమస్తమును నాతని కభిముఖముగా నుండెను. సమస్తము నాతని స్పృశించుచుండెను. సమస్తమును నొకవిధమగు నూతనభావముచేఁ బరిపూర్ణమై యుండెను. ఈప్రపంచము నింతగాఁ బ్రేమించుచున్నట్లును, ఈయాకాశము నింతయాశ్చర్యముగఁ గాంచుచున్నట్లును, ఈయాలోకనము నింతయపూర్వముగఁ బ్రకాశించుచున్నట్లును, ఈవీథులయందలిపథికప్రవాహము నింతసత్యముగ భావించుచున్నట్లును, నాతఁ డింతవఱ కెఱుంగనే యెఱుంగఁడు! ఆతఁడు తనశక్తి నంతను నాకాశమునందలి సూర్యుని వలెఁ బ్రపంచమునకుఁ జిరంతనసామగ్రిగాఁ జేయవలయునని సంకల్పించుకొనియెను.

ఈవిధముగా వినయుఁడు దా నెవ్వరినిగుఱించి యీమాట లన్నియును జెప్పుచుండెనో సులభముగా బోధపడకుండునట్లు మాటలాడుచుండెను. ఎట్టి [illegible]

చేయుటలేదు. సూచన చేయుటకుఁగూడ నాతనికి సంకోచము కలిగెను. ఇట్లు మాటాడి తా నపరాధము చేయుచున్నట్లుకూడ నాతఁడు గ్రహింపఁగలిగెను. ఔను ఇది యన్యాయమే—అవమానమే—కాని యిప్పు డీనిర్జననిశీథసమయమున—ఈ నిస్తబ్ధాకాశమధ్యమున మిత్రుని సమీపమునఁ గూర్చుండి వినయుఁ డీయపరాధలేశమును, బరిమార్జితముగఁ జేసికొనఁజాలకపోయెను.

ఆహా! ఏమి యావదనమండలము! ఆకోమలవదనమున దీపకళ యెంతసుకుమారముగఁ బ్రకాశించుచున్నది! ఆనవ్వులలో నామె యంతఃకరణ మెట్టియెంత కాంతులతో విస్పష్టమగుచున్నది! ఏమి యాలలాటమునందలి జ్ఞానతేజము! ఏమి యాచిగురులాంగలిఱెప్పలనీడల మిలమిల మెఱయు నాకన్నుదోయి యనిర్వచనీయసౌందర్యము! ఆహా! ఆ హస్తములు సేవకును స్నేహమునకును నియోగించి తమసౌందర్యమును సార్థకపఱచుకొనుచున్నవి.

వినయుఁ డీవిధముగాఁ బ్రశంసించుచుఁ దనజీవనమును, యౌవనమును ధన్యమైన వానిగా భావించుచుండెను. అతనిహృదయ మంతయు నానందప్రపూర్ణమై యుండెను. లోకములోఁ జాలమందిజనులు దేనిని దమజీవితమునందు సంపూర్ణముగాఁ గనుఁగొనఁజాలకుండఁగనే మరణించుచున్నారో, యట్టిప్రేమమూర్తి నిప్పుడు వినయుఁడు తనకన్నులయెదుట మూర్తీభవింపఁజేసికొని సందర్శించుచు నానందించుచున్నాఁడు! ఇంతకంటె నాశ్చర్యవిషయ మేమున్నది?

కాని, ఇది యేమివిపత్తి! ఇదియేమి యన్యాయము! అన్యాయమే యగుఁగాక! ఇఁక సవరించుకొనుట కుపాయము లేదు. ఈప్రవాహమునందే పడి యేదియో యొక యొడ్డునకుఁ జేరవలయును. లేదా దీనిలోనే తేలిపోవలయును! లేదా దీనిలోనే మునిఁగిపోవలయును! ఇఁక నుపాయాంతరము లేదు! ఉద్ధరింపఁబడవలయు నను కోరికయును లేదు. ఎప్పటికైన నీసమస్తసంస్కారములను, నీసమస్తస్థితులను మఱచిపోఁగలుగుటయే జీవితమునకు సార్థకపరిణామము!

గోరా మాటాడక వినుచుండెను. ఈమేడపై నాయిరువురకు ననేక సంభాషణములతో నిదివఱ కెన్నియో వెన్నెలరాత్రులు గడచిపోయినవి. వివిధసాహిత్యములను గూర్చి వివిధలోకచరిత్రములనుగూర్చి వివిధసమాజహితపద్ధతులనుగూర్చి భవిష్యజ్జీవన సంబంధమైన నిరువురకును గలుగుచుండు వివిధసంకల్పములనుగూర్చి యిదివఱకీయిద్దఱికిని సంభాషణములు జరిగెను గాని యిప్పటిమాదిరిసంభాషణ మెన్నడును జరగియుండలేదు. మానవహృదయమునందలి యిట్టిసత్యపదార్థము, ఇట్టిప్రబలప్రకాశము ఈవిధముగా నెన్నఁడును గోరాకుఁ బ్రత్యక్షగోచరము కాలేదు. ఇట్టివిషయము లన్నియును

గవిత్వాకర్షణములని యెంచుచు నింతకాలము కలఁకను గోరా సంపూర్ణముగ నుపేక్షించి యుండెను. కాని యవి యిప్పుడు ప్రత్యక్షీభవించుటచే నాతఁడు త్రోసివేయఁ జాలకపోయెను. ఇంతే కాదు—ఆ యావేగ మాతనిహృదయమునందును వ్యాపించెను. ఆయుచ్ఛ్వాస మాతని సకలాంగకములయందును విద్యుద్వేగమున నుప్పొంగెను. అతని యౌవనసంబంధ మగునొక యగోచరస్థానము నావరించుకొనియున్న తెర యప్పు డొక్క నిమిషములో విచ్చిపోయెను! ఇంతకాలమునుండియు రుద్ధమై యున్న యాభాగమున శరన్నిశీథచంద్రిక లో నొక్కసారిగాఁ బ్రవేశించి యొకవిధ మగు ప్రేమను వెల్లిఁజేసెను.

చంద్రుఁ డప్పటికిఁ గ్రిందికి దిగిపోయెను నిద్రపోవుచున్నవాని ముఖమునందలి నవ్వువలె నప్పుడు తూర్పుదిక్కునం దాలోకాభాస మల్పమాత్రమై యుండెను. ఇంత సేపటికి వినయునిమనసు తేలికపడియెను. అప్పు డాతని కించుక సంకోచము కలుగుటచేఁ గొంతసే పూరకుండి పిమ్మట “గోరా! ఇప్పటి నాసంభాషణ మంతయును నీకు క్షుద్రముగాఁ దోఁచియుండును. నీవు నీమనసులో నన్ను నిందించుచుంటివి కాఁబోలును! కాని యేమి చేయుదును. నీయెదుట నెన్నఁడు నే నేదియు దాఁపఁజాలను—ఇప్పుడును దాఁపలేదు. నీవు గ్రహించినను సరియే, గ్రహింపకున్నను సరియే!” అనియెను.

గోరా—వినయా! ఈసమస్తవిషయములను నేను సరిగాఁ దెలిసికొంటి నని చెప్పఁజాలను. రెండుమూడుదినములక్రిందటివఱకు నీకును దెలియదు! జీవితమునందలి యిట్టియావేగములను, నావేశములను క్షుద్రములైనవని నేనింతవఱకు నుపేక్షించుచున్న మాటమాత్రము సత్యమే—కాని నిజముగా నవి క్షుద్రములు కావు. వీనిశక్తిని, వీనిగాంభీర్యమును, నేను ప్రత్యక్షము చేసికొనలేదు. అందుచేతనే యివి యసత్యములనియు మాయామాత్రము లనియు నేననుకొంటిని. కాని నీయం దిప్పు డట్టివాని యనుభవమును గన్నులారఁ జూచియుంటిని యిపుడు నే నిట్లు సత్యము చెప్పఁగలను! ముఖ్యవిషయ మేమనిన—స్వధర్మనిరతుఁ డగువాఁ డితరధర్మములయందలి సత్యము తనకంటె నల్పమైనదిగా భావింపకున్నచోఁ గార్యనిర్వహణము చేయఁజాలఁడు. అందుచేతనే పరమేశ్వరుఁడు దూరవస్తువులు మానవదృష్టులకు సూక్ష్మము లగునట్లుగాఁ జేసియున్నాఁడు. సర్వసత్యములను సమానముగఁ బ్రత్యక్షము చేసి మానవుని విపన్నభగ్నునిగాఁ జేయలేదు. మన మొక్క దిక్కు ననుసరించి పోవలయును; అన్నిటి నొక్కచోఁ గుదిగుచ్చవలయు ననులోభమును ద్యజింపవలయును—అప్పుడుగాని సత్యము గ్రహింపఁజాలము. నీ విప్పు డచ్చట నిలిచి నీసత్యమూర్తిని బ్రత్యక్షము చేసికొంటివో, యాసత్యమూర్తిని గూర్చి నేనును నీవు నిలిచినచోటున నిలిచి యభివాదము చేయఁజాలను. అట్లయినచో నాజీవితసంబంధ మగు సత్యమును గదలుకొన వలసివచ్చును. ఈమార్గమైనఁ గావలయును; లేదా యామార్గమైనఁ గావలయు!

విన.— సోదరా! వినయుఁ డెన్నటికిని గోరా కాఁజాలఁడు! నేను నన్ను ధరించుకొని నిలిచి యున్నాను; నీవు నిన్నుఁ ద్యజించుకొని నిలిచియున్నావు!

గోరా యసహ్యాభావముతో "వినయా! మాటమాటకును గవిత్వము చేయకుము. నీమాటలనుబట్టి నేనొకసంగతిని స్పష్టముగా గ్రహించితిని. నీజీవితమున నీవిప్పు డొకప్రబలసత్యము నెదుట నభిముఖుఁడవై నిలిచి యున్నావు. దానితో నాటలాడిన లాభములేదు. సత్యమును గ్రహించినంతనే దానియం దాత్మసమర్పణము చేయవలయును. అంతకంటె మఱియొకయుపాయము లేదు. నే ననుసరించినమార్గమునుబట్టి యందలిసత్యమునుగూడ నెప్పటికైన నీవలెనే నేనును సంపాదింపఁగలనని నాయుద్దేశము. నీ విప్పటికిను బుస్తకములను జదివి ప్రేమపరిచయమునందే పరితృప్తుఁడవగుచుంటివి. నేను నట్లే చదువుచు స్వదేశప్రేమనే తెలిసికొనుచుంటిని. పుస్తకములలోని ప్రేమ కంటె ననుభవసిద్ధమగు ప్రేమ యెంతసత్యమైనదియో నీవిప్పుడు గ్రహింపఁగలిగితివి. ఇప్పు డా ప్రేమ నీసచరాచరసమస్తప్రపంచము నావరించుకొని యున్నది. దీనినుండి నిష్కృతి నందుటకు నీకిచ్చటను దావు లేదు—ఈవిధముగనే స్వదేశప్రేమ యెప్పటికైన సంపూర్ణరూపముతో నాకుఁ బ్రత్యక్షమైనచో నాదినమున నాకును జోటు లేకుండఁ బోవును. ఆదినముననే యది నాసమస్తధనప్రాణములను, నాయస్థిమజ్జారక్తములను, నాయాకాశాలోకములను, నాసర్వస్వమును ననాయాసముగ నాకర్షించివైచును. స్వదేశసంబంధమగు నాసత్యమూర్తి యెంతయాశ్చర్యకరమైనది! ఎంతయపురూపమైనది! ఎంతసునిశ్చితమైనది! ఎంతసుప్రసన్నమైనది! ఆయానందము, ఆవేదన ఎంతప్రచండమైనది! ఎంతప్రబలమైనది! అది వననిర్ఝరిణింబోలి యొక్కనిమిషములో జననమరణములను దాఁటిపోవును! నీమాటలనుబట్టి నా కాసత్యమూర్తింగూర్చినయనుభవము కొంచెముగాఁ గలుగుచున్నది! నీజీవితమునందలి యీయనుభవ మిప్పుడు నాజీవితమున కాఘాతమువలె నున్నది. నీవలె నేనుగూడ నాసత్యము నెప్పటికైన ననుభవింపఁజాలుదునో చాలనో చెప్పఁజాలకున్నాను. కాని నేను పొందగోరినయనుభవమును ఛాయామాత్రముగ నీమూలముననే గ్రహింపఁ గలిగితిని!

అని పలుకుచు గోరా లేచి యటునిటుఁ దిరుగ నారంభించెను. పూర్వదిక్కునం దోఁచినప్రభాతకాంతు లాతనియెదుట మాటలాడుచున్నట్లును, వార్తలను బ్రకటించుచున్నట్లును, ప్రాచీనతపోవనసంబంధములగు వేదమంత్రముల నుచ్చరించుచున్నట్లును బొడకట్టెను. గోరా సర్వాంగకములును బులకించిపోయెను. ఒక్కనిమిష మాతడు స్తంభితుడై నిలువఁబడిపోయెను. ఆతనిబ్రహ్మరంధ్రము భేదించుకొని యొకజ్యోతిర్లేఖ సూక్ష్మమృణాళముంబోలి బయలుదేఱి యొకజ్యోతిర్మయశతపత్రమువ సమస్తాకాశమునందు వ్యాపించుచు నాకున వికసింపఁ జేసినట్లాతనికిఁ దోఁచెను. ఆతని సమస్తప్రాణములును

సమస్తచేతనములను, సమస్తశక్తులు నొక్కసారిగా దానియం దానందనిశ్శేషితములై పోయినట్లు పాడకట్టెను !

గోరా తన్నుఁ దానే మఱలించుకొని వచ్చి యాకస్మికముగా "వినయా! నీ విట్టి ప్రేమనుగూడ దాఁటవలసి యున్నది. అచ్చటనే యాఁగిపోయినచో లాభము లేదు. నన్నిపు డాహ్వానించినమహాశక్తి యెట్టిసత్యస్వరూపిణియో యొకప్పుడు నీకు జూపించెదను. నాహృదయ మిప్పు డానందముచే నిండిపోయినది. నేనిప్పుడు నిన్ను మఱి యెవ్వరి చేతులలోనను విడువఁజాలను !" అనియెను.

వినయుఁడు గోరాసమీపమునకు వచ్చి నిలువఁబడియెను. గోరా యప్పు డాతని నొకవిధమగు నపూర్వోత్సాహముతోఁ గౌఁగిలించుకొని "తమ్ముడా! వినయా! మనము మరణించినచో నొక్కసారిగా మరణింతము! మన మిరువురము నొక్కటిగా నుందము! మన కెవ్వరును విచ్ఛేదమును గల్పింపఁజాలరు! భేదమును గూర్పఁజాలరు!" అనియెను.

గోరా యొక్క గంభీరోత్సాహవేగము వినయుని హృదయాంతరాళమునుగూడఁ దరంగితముగఁ జేసివైచెను. వినయుఁ డేమియు మాటాడకుండ గోరా ప్రేమాకర్షణమున కాత్మసమర్పణము గావించుకొనియెను. ఆయిరువురు నట్లే కౌఁగిలించుకొని ప్రచారము చేయుచుండిరి. పూర్వాకాశమున నుదయరాగ మలముకొనియెను. అప్పుడు గోరా "సోదరా! నేను నాదేవిమూర్తిని గాంచినస్థానము సౌందర్యస్థానము కాదు—అది దుర్భిక్షదారిద్ర్యములును, దుఃఖావమానములును గలస్థానము! అక్కడ మాటలు పాడి పువ్వులతోఁ బూజకాదు—రక్తమునర్పించి ప్రాణములతోఁ బూజింపవలయును! నాకుమాత్ర మదియే యన్నిటికంటె నానందముగా నుండును. అచ్చట సుఖవిస్మృతి యెంతమాత్రమును లేదు! ఆత్మశక్తిపూర్ణమగుజాగరణమే నిండి యుండును! అది మధురమోహనమూర్తి కాదు!—దుర్జయమును దుస్సహము నగు నొక యావిర్భావము! ఎంతనిష్ఠురమైనది! ఎంతభీకరమైనది! అందలికఠిన ఝంకారము సప్తస్వరముల యేకీభావనినాదముకంటెను గభీరతమంబై యుండును. తలఁచుకొన్నచో నాహృదయమున నుల్లాసము పొంగిపోవుచున్నది. ఇదియే పురుషానంద మని నాకుఁ దోఁచుచున్నది—ఇదియే జీవితసంబంధ మగు తాండవనృత్యము! పురాతన ప్రళయయజ్ఞకుండమునందలి యగ్నిజ్వాలలలో నూతనమనోజ్ఞ దివ్యమూర్తిని దర్శించుటకే పురుషునిసాధన! రక్తవర్ణమగునాకాశక్షేత్రమున బంధముక్తంబును, జ్యోతిర్మయంబు నగుభవిష్యత్తును జూడఁగలిగితిని! ఈయాసన్నప్రభాతకాంతులలోపలను జూడఁగలిగితిని! వినుము వినయా! నాగుండెలలో నెవ్వరో డమరుకమును మ్రోగించుచున్నారు!" అని వినయునిచేయి పట్టుకొని గోరా తనగుండెలపైఁ బెట్టుకొనియెను.

వినయ—సోదరా! గోరా! నేను నీతోడనే యుండెదను. కాని, నీవెన్నఁడును నన్ను మఱియొకలాగు తలంపవలదు. విధివలె నిర్దయుడవై నీవు నన్నొక్కసారిగా నీతో నీడ్చుకొని పొమ్ము! మన మిరువురము నొక్కదారినిఁ బోవుదము. కాని నాకు నీయంతటి శక్తి లేదు!

గోరా—మనయిరువురిలోను ప్రకృతిభేద మున్నది. కాని యొకమహానందమున మనభిన్నప్రకృతులను మన మేకము చేసికొనవలెను! నీయందును నాయందును గల ప్రేమను మన మాయనంత ప్రేమమునం దైక్యము చేయవలయును. ఆప్రేమయట్టి సత్యస్వరూపమును దాల్పనంతవఱకు మనయిరువురిలోను ననేకాఘాతములును, సంఘాతములును, విరోధములును, విచ్ఛేదములును గలుగుచునే యుండును. మనప్రేమకు సత్యత్వము కలిగినచో నప్పుడు మనము భిన్నత్వమును బంధుత్వమును గూడ మఱచిపోయి ప్రచండమగు నాత్మసమర్పణ మధ్యమున నాత్మబలముచే నేకీభావముం గాంచి నిలువఁగలము! ఈదుర్భరానంద మే మనమైత్రిత్వమునకు శేషపరిణామము కావలయును!

వినయుఁడు గోరాచేయి పట్టుకొని "అట్లే యగుగాక!" అనియెను.

గోరా—అంతవఱకును నేను నిన్ను ననేకవిధముల బాధించుచుందును. నాబాధ లన్నియును నీవు సహింపవలయును. ఏమనిన—ఈమనమైత్రిత్వమే మన జీవితమునకుఁ జరమలక్ష్యముగాఁ జూచుకొనఁ గూడదు. అయినను దానిని వర్ధిల్లఁ జేసికొనుటకే ప్రయత్నింపవలయును; కాని తృణీకరింపరాదు. అదిలేకున్నచో నుపాయములేదు. అది వర్ధిలినప్పుడే మనయత్నము సర్వము సార్థకము కాఁగలదు.

ఇంతలోన నడుగులచప్పుడు వినవచ్చుటచే గోరా యదరిపడి చూచెను. ఆనందమయి మేడమీఁదికి వచ్చి తోడనే యాయిరువురను రెండుచేతులఁ బట్టుకొని గదిలోనికిఁ దీసికొనిపోయి "పొండు! ఈపాటికిఁ బరుండుఁడు!" అనియెను. అప్పుడు గోరావినయు లిరువురును "మాకింక నిద్దుర రాదమ్మా!" అని చెప్పిరి. "వచ్చును!" అనిచెప్పుచు నానందమయి యొకశయ్యపై వారిద్దఱిని బరుండఁజేసి తలుపులుమూసి వారిప్రక్కయొద్దఁ గూర్చుండి విసరుచుండెను.

వినయ—అమ్మా! నీవు విసరుచుఁ గూర్చున్నచో మాకు నిద్దురరాదు.

ఆనం—ఎందులకు రాదో చూతము! నేనిక్కడనుండి లేచిపోయినచో మీరు మరల మాటల కారంభింతురు.

ఆయిరువురును నిద్రించినతరువాత నానందమయి మెల్లగా గదినుండి వెలుపలికిఁ బోయెను. ఆమె మెట్లను దిగుచుండఁగా మహిముఁడు మీఁదికెక్కుటకుఁ బ్రయత్నించుచుండెను. ఆనందమయి యాతని నడ్డగించి "ఇప్పుడు వలదు! రాత్రి యంతయును వాళ్ళు నిద్రింపరైరి, ఇప్పుడే నేను వారిని నిద్రింపఁజేసి వచ్చుచున్నాను!" అనియెను.

మహి—ఆహాహా! ఏమిమిత్రత్వము! పెండ్లిమాట లేమైన జరిగినవేమో తెలిసినదా ?

ఆనం—తెలియలేదు—

మహి—ఏమిరో కొంచెము జరిగియే యుండును. ఎప్పటికి లేచెదరు? శీఘ్రముగాఁ బెండ్లిజరుగకున్నచో నెన్నియో విఘ్నములు ఘటిసించును.

ఆనందమయి నవ్వుచు "వారిందరిపోవుటలో మాత్రము విఘ్నములు లేవు. వారీదినమధ్యమునందే లేచెదరు!" అనియెను.

## ౧౬

"మీరు సుచరితకొకనిఁ బెండ్లిచేయరు కాదా?" అని వరదాసుందరి ప్రశ్నించెను.

పరేశబాబు స్వాభావికశాంతగంభీరభావముతోఁ గొంతసేపటివఱకును గడ్డమును దువ్వుకొనుచుఁ బిమ్మట మృదుస్వరముతో "వరుఁ డెక్కడనున్నాఁడు?" అనియెను.

వర—ఏమి ? పానూబాబునకు సుచరితకును పెండ్లిమాటలు జరుగనే జరిగినవి. మనమందఱము నెఱుంగుదుము. సుచరితయు నెఱుంగును.

పరే—రాధారాణి పానూబాబుకు సరిగా నెన్నుకొన్నట్లు నాకుఁ దోఁచుట లేదు—

వర—ఈమాటలు నాకంతబాగుగాఁ దోఁచుటలేదు. సుచరితను మనము మనబిడ్డలకంటె నెప్పుడైనఁ దక్కువగాఁ జూచితిమా? అందుచేత నీ యీమాటకూడఁ జెప్పవలసివచ్చుచున్నది. ఆమె కీప్రత్యేకభావమేల ? పానూబాబువంటి విద్వాంసుఁడు, ధార్మికుఁడు తన్నుఁ గోరియున్నాఁడు. ఈయవకాశము సామాన్యముగఁ బోఁగొట్టుకొనవలసినదా ? మీ రేమన్నను సరియే. మనలావణ్య యీమెకంటె నెన్నియోవిషయములందధికురాలు ! నేనిప్పుడు చెప్పుచున్నాను. ఆమె సుచరితవలె మనము నిర్దేశించినవరుని పెండ్లియాడనని చెప్పదు, ఎన్నటికినిఁ జెప్పదు ! మీ రీవిధముగా సుచరితయహంభావత్వమును వర్ధిల్లజేయుచున్నచో నిఁక నామెకుఁ దగినవరుఁడు దొరకుటయే దుర్లభమైపోవును.

పరేశుఁ డికఁ నేమియు మాటాడలేదు. వరదాసుందరితో నాతఁ డెప్పుడును వాదము చేయఁడు ! విశేషించి సుచరితవిషయమున నసలే వాదము చేయఁడు !

సుచరితతల్లి సతీశుని బ్రసవించి మరణించెను. అప్పటికి సుచరిత యేడేండ్లదయెను. ఆమెతండ్రి రామశరణహాల్దారు. భార్యమరణానంతరమున బ్రాహ్మసామాజికుఁడయ్యెను. మఱియు రైతులదుర్మార్గములవలన నాతఁడు స్వగ్రామమును విడిచి డాకాకు వచ్చి పోస్టాఫీసులో నుద్యోగము సంపాదించుకొని యుండెను. ఆసమయమున

నందే యాతనికిఁ బరేశబాబుతో విశేషమైత్రి కలిగెను. అప్పటినుండియు సుచరిత పరేశుని దనతండ్రితో సమానముగఁ జూచుకొనుచుండెను. ఇంతలో రామశరణుఁడాకస్మికముగ మరణించెను. అతఁడు మరణసమయమునఁ దనసర్వస్వమును బుత్రికాపుత్రికలు సమానభాగములుగాఁ దీసికొనవలయు ననియు, వారు పెద్దవారగువఱకును బరేశబాబు వ్యవహరించుచుండవలయు ననియు మరణశాసనము వ్రాసి బిడ్డలను బరేశున కొప్పగించెను. అదిమొదలుగా సతీశుఁడును; సుచరితయుఁగూడఁ బరేశునికుటుంబమువారై యుండిరి.

పానూబాబు విశేషోత్సాహము గల బ్రాహ్మసామాజికుఁ డనియు, సకలసమాజకార్యములయందును నాతని చేయి యుండుననియుఁ బాఠకు లిదివఱకే వినియున్నారు. అతఁడు రాత్రిపాఠశాలయందు శిక్షకుఁడు; పత్రికాసంపాదకుఁడు; స్త్రీవిద్యాలయ కార్యదర్శి—అతని కెంతమాత్రమును శాంతిలేదు. ఈయువకుఁ డెప్పటికైన బ్రహ్మసమాజమునం దత్యున్నతాధికారముం గాంచునని యందఱు నాశపడుచుండిరి. అతని యింగ్లీషు భాషావైశద్యమునుగూర్చియు, దర్శనశాస్త్ర పారదర్శిత్వముంగూర్చియు సమాజముసందేకాక వెలుపల విద్యార్థులలోఁగూడ విఖ్యాతి వ్యాపించియుండెను. ఈ సకలవిశేషకారణములచే గొన్ని సమాజమువారివలెనే సుచరితయును, పానూబాబును విశేషముగ గౌరవించుచుండెను. ఆమె డాకానుండి క్రొత్తగాఁ గలకత్తాకు వచ్చిన దినములలో నెట్లయిన పానూబాబుతోఁ బరిచయము చేసికొనవలయునని యామెకు కుతూహలము కలుగుచుండెను.

తుట్టతుదకు సుప్రసిద్ధుఁడగు హారానబాబుతో నామెకుఁబరిచయము కలుగుటయేకాదు—హారానబాబు తన హృదయమునందలి ప్రేమభావమును సుచరితయెదుట నిస్సంకోచముగఁ దెలుపఁగలుగునంతటి చనవుకూడఁ గలిగెను. అంతటినుండి యాతఁడు సుచరిత లోపములను బూరించుటయందును, నామెతప్పులను సవరించుటయందును, నామె యుత్సాహమును వర్ధిల్లఁజేయుటయందును, నామెయున్నతిసాధనముంగూర్చి యాలోచించుటయందును నిమగ్నుఁడైయుండెను. దీనినిబట్టి యాతఁడామెను దనకుఁ దగినసహధర్మిణిగాఁ జేసికొనఁగోరి ప్రయత్నించుచుండెనని యెల్లరకును స్పష్టపడిపోయెను. అంతటి సుప్రసిద్ధుఁడగు హారానబాబుహృదయమును జయింపఁగలిగినందుల కప్పుడు సుచరితయును దనమనసులో భక్తిసమ్మిశ్రిత మగు గర్వానుభవమును గాంచియుండెను.

పెద్దవారలెవ్వరును బ్రస్తావింపకపోయినను సుచరితను హారానబాబునకేయిచ్చుట నిశ్చయమని యందఱును భావించుకొనిరి. సుచరితయును దనమనసులో నట్లే యనుకొని యాతఁడు సమాజహితమునకై తనజీవితము నెట్లు ధారపోయుచుండెనో యట్లే తానును శిక్షాసాధనములమూలమున నాతనికుపయుక్తురాలను గావలయునని యొకవిధముగు ను

త్కంఠ కలిగియుండెను. ఈవివాహకల్పన మామెకు భయము, సంభ్రమము, బాధ్యతా నిర్దేశము నొందఁగువారిచేఁ గల్పింపఁబడిన యొకవిధమగుజాతికోటవలె బోధ యగుచుండెను. అది యుద్ధముచేయుట కుపయోగించునదిగాని సుఖముగ నివసించుటకుఁ గాదు—అది యైతిహాసికము గాని, పారివారికము కాదు!

ఇట్టిస్థితిలోఁ గూడ గన్యకపక్షమువారి కందఱకు నీవివాహము సౌభాగ్యదాయకమనియే తోఁచుచుండెను. కాని హారానబాబుమాత్ర మన్యోన్యానురాగము లేకుండ బాగుగ నుండునంతమాత్రముననే పెండ్లి చేసికొనుటకుపరమోత్కృష్టజీవితబాధ్యతల నెఱిఁగియున్న తనవంటివానికిఁ దగినపని కాదని భావించుచుండెను. ఈవివాహము వలన బ్రహ్మసమాజమున కెంతవఱకు లాభముకలుగునో సంపూర్ణముగఁ దెలిసికొనకుండఁ గార్యప్రవృత్తుఁ డగుట కాతఁడు సంశయించుచుండెను. అందుచేతనే యాతఁ డాదినుండి సుచరితను బరీక్షించుచుండెను.

పరీక్షించుటయును, బరీక్షింపఁబడుటయుఁ గూడ నయ్యెను. హారానబాబు క్రమముగాఁ బరేశునికుటుంబమునకుఁ బరిచితుఁ డైపోయెను. ఇంటివా రందఱు నాతని పానూబాబని పిలుచునంతటి చనవయ్యెను. ఇప్పు డాతనివిగ్రహము నింగ్లీషువిద్యాభాండారముగను, తత్త్వజ్ఞానాధారముగను, బ్రహ్మసమాజమంగళావతారముగను జూచుట యసంభవమయ్యెను. ఇప్పు డాతఁ డందఱియెదుటను నొకమానవమాత్రుఁడుగనే యుండెను. ఇప్పు డాతఁడు కేవలగౌరవసంభ్రమముల కధికారి గాక, గుణదోషములకుఁ నిష్టానిష్టములకును నధీనుఁడై పోయెను.

ఆశ్చర్యవిషయ మేమనిన—హారానబాబుసంబంధ మగునేభావ మిదివఱకు సుచరితభక్తి నాకర్షించి యుండెనో, యాభావమే యిప్పు డామెహృదయమున కాఘాతమగుచుండెను. హారానబాబు బ్రహ్మసమాజమునకు రక్షకుఁడై యుండి సమాజసత్యమును, సమాజమంగళమును, సమాజసౌందర్యమును బాలించుభారమును వహించుపట్టున నసమర్థునివలెఁ గానవచ్చుచుండెను. మానవునకు సత్యముతోడిసంబంధము భక్తిసంబంధమే—అది మానవుని వినయవంతునిగాఁ జేయును. అది లేక యహంకారమును నౌద్ధత్యమును గలమానవునియందు సత్యమునెదుట క్షుద్రత్వముగ నగపడుచుండును. ఈవిషయమున సుచరిత హారానబాబును, బరేశునితోఁ బోల్చి చూచి భేదమును గ్రహింపకుండ నుండఁజాలకపోయెను. పరేశునిప్రశాంతవదనమును జూచినంతనే యాతని హృదయమందలి సత్యమహత్త్వము కన్నులఁ బడుచుండును—హారానబాబునెంగమునం దట్లగుపడుట లేదు. అతనిబ్రాహ్మత్వ మనియెడు నొకవిధమగు నుగ్రమైనయాత్మప్రకాశమన్నిటికంటెను మించి మాటలయందును గార్యములయందును నమంగళస్వభావముతో బహిర్గత మగుచుండును.

హారానబాబు బ్రాహ్మసమాజమంగళమును గూర్చి యాలోచించుపట్టునఁ బరేశబాబునందుఁగూడఁ దప్పు పట్టకమానఁడు. అట్టిసమయములయందు సుచరిత యాహత భుజంగినివలె నసహిష్ణురాలైపోవుచుండును. ఆకాలమున బంగాళాదేశమునందలి యింగ్లీషువిద్యాధికులలో భగవద్గీత చదువునాచారము లేదు. కాని పరేశబాబు సుచరితచే నప్పుడప్పుడు గీతను జదివించుచుండెను. మహాభారత మంతయు నాతఁడు సుచరితచేఁ జదివి వినిపించియుండెను. హారానబాబు కది సమ్మతముగా లేదు. అతఁడట్టిగ్రంథము లేవియు బ్రాహ్మగృహములం దుండఁగూడదను పక్షములోనివాఁడు! అతఁడు వీని నెన్నఁడును జదువలేదు. రామాయణము, భారతము భగవద్గీత—ఇవి యన్నియు హిందువులగ్రంథము లని యాతఁడు వేఱుపఱచుచుండును. శాస్త్రచర్చలయందును మంచిచెడ్డల నిర్ణయించుసకల విషయములందును బరేశబాబు బ్రాహ్మనియమములను, నబ్రాహ్మనియమములనుగూడ ఖండించుచుండును. అది హారానబాబునకు హృదయశల్యముగానుండును. పరేశునియందు బహిరంగముగఁ గాని రహస్యముగఁ గాని దోషారోపణము చేయుట సుచరిత యెంతమాత్రమును సహింపఁజాలకుండెను. హారానబాబట్లు ప్రవర్తించుచుండుటచేతనే క్రమముగా సుచరిత కాతనియందుఁ గటువు దోఁచెను.

ఈవిధముగాఁ దనసాంప్రదాయకోత్సాహావేగముచే హారానబాబు సుచరిత హృదయమునుండి నానాఁటికి వైముఖ్యమును బొందుచుండెను. కాని యిప్పటికిని వారి వివాహ విషయమై యెవ్వరికి నెట్టిసంశయమును గలుగుట లేదు. ఎవ్వఁడైన నొకఁడు ధర్మసమాజమను దుకాణమునందుఁ దనపేరుఁ బెద్దయక్షరములతోడి పెద్దతగటి టిక్కెట్టును గొనియున్నను, గ్రమముగా నితరలోకమునం దాతఁడు తనయల్పమూల్యమును దానే గ్రహింపఁగలఁడు! అందుచేతనే పరేశబాబు హారానుని వాంఛితమునుగూర్చి యసహ్యించుకొనలేదు హారానబాబు నందఱును సమాజమునకు భవిష్యదాలంబనస్వరూపముగ భావించుచుండిరి. అతఁడును వారియభిప్రాయముల నంగీకరించియే యుండెను. హారానబాబువంటి వానియెడల సుచరితకు సమ్మతికలిగెనో లేదో యను విషయమే విచారణీయము—హారానబాబు సుచరితకెంతవఱకు నచ్చియుండెనో యాసంగతి యామెహృదయమునకే తెలియకుండెను.

ఈవివాహవిషయమున సుచరితయుద్దేశము తెలిసికొనుట ముఖ్యమని యెవ్వరును భావింపలేదు. అట్లే సుచరితయును దనసంగతిని భావించుకొనలేదు. బ్రాహ్మసమాజమునందలి యందఱివలెనే యామెయును బ్రవర్తించుచుండెను. హారానబాబు "నేనీమెను బెండ్లియాడెదను" అని చెప్పిననాఁటినుండియు నామె వివాహరూపమగు కర్తవ్యము నంగీకరించియుండెను.

ఈవిధముగనే జరుగుచుండెను. ఇట్లుండఁగా నాదినమున గోరాయెదుట సుచ
రిత హారానబాబుం గూర్చి యొకటిరెండు తీవ్రవాక్యముల నుచ్చరించి యుండెను.
ఆస్వరమునుబట్టి యామె హారానబాబు నంతగా గౌరవించుట లేదని పరేశుఁడు సంశ
యించెను. ఆయిరువురిహృదయములును గలియకుండుటకుఁ గారణ మున్నదని యెం
చియే పరేశుఁడు వరదాసుందరిప్రశ్నలకుఁ బూర్ణముగా నిప్పుడు ప్రత్యుత్తర మీ
యఁజాలకపోయెను. అప్పుడు వరదాసుందరి సుచరితను రహస్యముగఁ బిలిచి "నీవు
మీ తండ్రిగారికి విచారమును గూర్చుచున్నావు" అనియెను.

ఆమాట విని సుచరిత యదరిపడియెను. ఆమె పొరపాటుననైనను, బరేశుని
హృదయమున కెన్నఁడును గష్టము గలిగింపఁజాలదు. అప్పుడు సుచరిత వివర్ణవదనము
తో "అమ్మా! ఇదియేమి? నేనేమిచేసితిని!" అనియెను.

వర—నాకెట్లు తెలియును తల్లీ! నీవు పానూబాబును ప్రేమించుటలేదని
యాయనకుఁ దోఁచినది కాఁబోలును! నీకు నాతనికిని వివాహము స్థిరపడినట్లు బ్రహ్మ
సమాజమువా రందఱు నెఱుఁగుదురు. ఇట్టిస్థితిలో నీవుమాత్రము—

సుచ—అమ్మా! అట్లనియెదవేమి? నేనెవ్వరియొద్దను నసంబద్ధముగ నేమి
యు మాటాడలేదే!

సుచరిత యాశ్చర్యపడుటకుఁ గారణ మున్నది. ఆమె హారానబాబునెడలఁ గేవ
లము విరక్తయై యున్నమాట నిజమే—కాని వివాహమునుగూర్చి యామె యెప్పుడు
ను మనసులోనైనను నిట్టియాలోచనమును జేసికొనియుండలేదు. తన సమస్తజీవిత
సుఖదుఃఖములు నీవివాహమునందే యిమిడియున్నవని పాప మామెకుఁ దెలియదు.
ఆదినమునఁ బరేశబాబునెదుటనే తాను హారానబాబును దిరస్కరించినసంగతి
యామెకిప్పుడు జ్ఞప్తికివచ్చెను. అందుచేతనే యాతఁడు దుఃఖిన్నుఁడై యుండెనని గ్ర
హించి సుచరిత పరితపించి పోవుచుండెను. ఆమె యిట్టితప్పిద మెన్నఁడును జేసి
యుండలేదు. ఇఁక నెన్నఁడును జేయ నని సంకల్పించుకొనియెను.

అంతలో హారానబాబు వచ్చెను. వరదాసుందరి యాతని తనగదిలోనికిఁ బిలిచి
"మంచిది. పానూబాబూ! నీవు మా సుచరితను పెండ్లియాడెద నని యందఱు నను
కొనుచున్నారు. కాని నీనోటినుండిమాత్ర మెప్పుడు నొక్కమాటయైనను వినలేదు.
నీకు నిజముగా నట్టియభిప్రాయమే యున్నయెడల స్పష్టముగాఁ జెప్పకపోవుటకుఁ
గారణమేమి?" అనియెను.

హారానబా బింక విలంబనమున కోర్వఁజాలకుండెను. ఎట్లైన సుచరితను దన
బందీగాఁ జేసికొనుటయే సుఖమని యాతఁ డనుకొనియెను. తనయందలి ప్రేమను
గూర్చి, బ్రహ్మసమాజహితమును గూర్చి యోగ్యతాపరిశీలనమును గూర్చి యోచించుట

యాంతరకరణీయము గా సాగనికిఁ దోఁచెను. తోడనే యాతఁడు వరదాసుందరిం గాంచి "పునరుక్తిగా నుండునని నేనీవిషయమును గూర్చి మాటాడుట లేదు. సుచరిత పదునెనిమిదవ యేఁటికొఱకుఁ బ్రతీక్షించుచున్నాను" అనియెను.

వర — మీరింకను బోడిగించుచున్నారా? నేను పదునాలుగేండ్లవయసే చాలు ననుకొనుచున్నాను.

ఆనాఁడు తేనీరు త్రాగునప్పుడు పరేశుఁడు సుచరితభావముం గాంచి యాశ్చర్య పడియెను. ఆమె యంతశ్రద్ధతో హారానబాబు నెన్నఁడును గౌరవింపలేదు. ఆతఁడు వెడలిపోవుట కుద్యమించుచుండఁగా లావణ్యచేసిన శిల్పకళను బరీక్షింపవలయు నని చెప్పి సుచరిత యాతని నాఁపి కూర్చుండఁ జేసెను! అందుచేఁ బరేశుని హృదయము నిశ్చింతమయ్యెను. అతఁ డప్పుడు తాను పొరపాటు పడితి ననికొనియెను. "ఈయిరువురిలోనను విదికలి కొంవిధమగు ప్రణయకలహము జరిగినది. మరల నిరువురు నెప్పటివలెనే కలిసికొన్నారు!" అని భావించి యాతఁడు మనసులోనే నవ్వుకొనియెను.

హారానబాబు వెడలిపోవునప్పుడు పరేశునియెదుట వివాహప్రస్తావముం దెచ్చెను; ఇఁక నాలస్యము చేయుట నాకిష్టములేదనికూడఁ జెప్పెను! పరేశుఁ డించుక యాశ్చర్యముతో "నీవు పదునెనిమిదేండ్లువచ్చినతరువాతఁ గాని కన్యలకుఁ బెండ్లి చేయరాదని చెప్పితివి కాదా? ఇట్లు నీవు పత్రికలలోఁ గూడఁ బ్రకటించితివి!" అనియెను.

హారా — ఈమాట సుచరితయెడల వర్తింపదు. ఏమనిన — ఆమె మనఃపరిణామము వయోవృద్ధ లగుస్త్రీలకంటెను మించియున్నది.

పరేశుఁడు ప్రశాంతదృఢస్వరముతో "పానూబాబూ! అట్లే యుండుఁగాక! అయినను విశేషముగు సహితము లేనప్పుడు నీమతము ననుసరించి రాధారాణివయసు పూర్ణమగువఱకును బ్రతీక్షించుటయే కర్తవ్యము!" అనియెను.

హారానబాబు తనదౌర్బల్యము బయల్పడినందులకు లజ్జితుఁడై "నిశ్చయముగాఁ గర్తవ్యమే. కేవల మిప్పుడు నాయుద్దేశ మేమనిన — ఒకదినమున మనవారి నందఱను పిలిచి యాశీర్వాదప్రార్థనము గావించి సంబంధము స్థిరపఱచుకొనవలయునని —" అనియెను.

పరే — సరే; మంచిమాటయే!

## ౧౭

రెండుమూఁడుగంటలు నిద్రించినతరువాత గోరాకు మెలకువవచ్చెను. పార్శ్వమున నింకను వినయుఁడు నిద్రించుచుండుటం గాంచి యాతనిహృదయ మానందపరిపూర్ణమై పోయెను. ఒకప్రియమైనవస్తువును బారవైచికొన్నట్లు కలఁగని యంతలో మేల్కొనియావస్తువును జూచికొన్నప్పుడెంతయానందముగ నుండునో గోరా కిప్పు డట్లుండెను. వినయుని బరిత్యజించుటచేఁ దనజీవిత మెంతవఱకుఁ గుంటువడిపోవునో

గోరా యిప్పుడు మేల్కొని లేచి ప్రక్కను నిద్రించుచున్న వినయునిఁ జూచి యనుభవమునకుఁ దెచ్చుకొనియెను. ఈ యానందాఘాతముచే నాతఁడు చంచలుఁడై తొందరగా వినయుని మేల్కొలిపి "పనియున్నది రమ్ము!" అనియెను.

గోరాకుఁ బ్రతిదినమును జేయు విధాయక కార్య మొకటి యున్నది. అతఁడు చదువుకొన్న నిమ్నజాతి బాలురయిండ్లకుఁ బోవుచుండును. వారి కుపకారము చేయుటకుఁ గాని, యుపదేశము చేయుటకుఁ గాని కాదు— కేవల మొకసారి వారిని జూచుటకే పోవుచుండును. తనతోఁ జదువుకొన్న వారిని గూడ గోరా యింతగాఁ జూడఁడనియే చెప్పవచ్చును. ఆ బాలకు లందఱును గోరాను దాదాఠాకూ రని పిలుచుచు నాతని హుక్కా మూలమున నభ్యర్థించుచుందురు. కేవలము వారి యాతిథ్యమును స్వీకరించుటకే గోరా తంబాకును సేవించుచుండును.

వారిలో నందుఁడనువాఁడు గోరాకుఁ బ్రధానభక్తుఁడై యుండెను. అతఁడొక వడ్రంగికొడుకు! ఇరువది రెండేండ్లవాఁడు. అతఁడు తన తండ్రి దుకాణమునందుండి కఱ్ఱపెట్టెలను జేయుచుండును. అతఁడు ఫుట్ బాలు, క్రికెట్టు మొదలగు నాటలయం దద్వితీయుఁడు. ఖేలవరంగమునం దాతని మించినవాఁ డెవ్వఁడును లేఁడు. గోరా యొక ఖేలవరంగమును స్థాపించి యందు గొప్పయింటిబిడ్డలతోఁ గూడ నీ వడ్రంగిపిల్లలను గలిపి యాటలాడించుచుండెను. నందున కన్నియాటలును సమానముగాఁ దెలియును. అతఁ డాటలయందు మేలుచేయి వడయుచుండుట గొప్పయింటిబిడ్డల కందఱకు నసూయాకరముగా నుండెను. కాని గోరాశాసనముచే నాతని నెవ్వరు నేమియుఁ జేయఁజాలకుండిరి.

ఒకనాఁ డానందునికాలిలో "ఉలి" గ్రుచ్చుకొనియెను. అందుచే నాతఁ డాటలకు వచ్చుటలేదు. గోరా కొన్నిదినములనుండి వినయునిగూర్చి విచారము కలియుండెను. అందుచే నాతనికి నందుని జూచుట తటస్థింపలేదు. నేఁటి ప్రాతఃకాలమున గోరా వినయుని వెంటఁబెట్టుకొని నందుని జూడవలయునని బయలుదేరెను. వారట్లు నందునియింటిగుమ్మమునొద్దకుఁ బోవునప్పటికి లోపలనుండి యాఁడువాండ్ర రోదనధ్వని వినవచ్చెను. నందునితండ్రి గాని, మరి యితరపురుషులు గాని లోపలలేరు. ఆప్రక్కనొక తంబాకుదుకాణ మున్నది, ఆయంగడివాఁడు వచ్చి నేఁటి తెల్లవారుజామున నందుఁడు మరణించెనని చెప్పెను.

నందుఁడు మరణించెను! అంతటి స్వాస్థ్యము, అంతశక్తి అంతటి తేజము, అంతటి హృదయము, అంతటి యల్పవయసు— అట్టి నందుఁ డీ తెల్లవారుజామున మరణించెను! నందుఁడొక సామాన్యమగు వడ్రంగిపిల్లవాఁడు— అతని యభావముచే నింతటి ప్రపంచమునం దొకచిన్న కుటుంబమునకు మాత్రము కొలదినేపు మాత్రమే కష్టముగా నుండును. కాని, గోరా కిప్పుడు నందునిమరణ మతిదారుణముగను, నసంగతముగను, నసంభవము

గను దోఁచెను—అతఁడు ప్రతివస్తువును జీవకళతోఁ జూచుచుండును. ఇంతమంది జీవించియున్నారు కాని యాతనివంటి ప్రమదప్రాణి యెక్కడ నున్నాఁడు!

అతఁడు ధనుర్వాతముచే మరణించెనని తెలియవచ్చెను. నందునితండ్రి డాక్టరు కొఱకుఁ బ్రయత్నించెను గాని నందునితల్లిమాత్రము తనబిడ్డకు భూతము పట్టినదని చెప్పి డాక్టరు వలదని బలవంతముగ నడ్డగించెను. భూతవైద్యుఁడు రాత్రి యంతయు నాతనిశరీరమున రక్షలువేసెను; కొట్టెను; మంత్రములు చదివెను. జబ్బు హెచ్చుచేసెను. ఆసమయమునందే నందుఁడు గోరాను బిలువవలయు నని బలవంతముచేసెను. అతఁడువచ్చి డాక్టరువైద్యము చేయించునేమో యనుభయముచేఁ దల్లి సమ్మతింపలేదు. గోరా యీసంగతు లన్నియును దెలిసికొనియెను.

అటనుండి తిరిగివచ్చునప్పుడు వినయుఁడు "ఆహా! ఎంతటిమూఢత్వమున కెంత శాస్తియైనది!" అనియెను.

గోరా—ఇటిమూఢత్వము నొకమూలకుఁ ద్రోసివైచి వెలుపల నున్నచో శాంతి లభించునని నీవనుకొనుచున్నావు కాఁబోలును! కాదు. ఈప్రబలమూఢత్వమునకుఁ బ్రబలశత్రు వయ్యెనని నీవు స్పష్టముగాఁ దెలిసికొనఁగలిగినను, నీవీవిషయమును నీసన్నిధినుండి యెక్కువయాక్షేపోక్తి మాత్రమునఁ ద్రోసివేయఁజాలవు.

మనసునందలి యుత్తేజనముచే గోరాపాదవిక్షేపము క్రమముగా వేగవంతమగుచుండెను. వినయుఁ డాతనిమాటకు మాఱుచెప్పక వేగముగా నాతనితో నడచుటకుఁ బ్రయత్నించుచుండెను. గోరా యించుకసే పూరకుండి యాకస్మికముగా "కాదు వినయా! నానందుని జంపివైచిన భూతవైద్యునిదెబ్బ నన్ను బాధించుచున్నది నాదేశమునంతను బాధించుచున్నది. ఇట్టివిషయము లన్నియు స్వల్పము లనిగాని, విచ్ఛిన్న ఘటనములనిగాని నేనెంతమాత్రము నూహింపఁజాలను" అనియెను.

అప్పుడుగూడ వినయుఁడు నిరుత్తరుఁడై యుండుటచే గోరా గర్జించుచు "వినయా! ఇప్పటి నీమనసులోనియుద్దేశము నేను గ్రహించితిని! ఇట్టివానికిఁ బ్రతీకారములేదనియు, నున్నను నట్టిది లభించుకాలము చాలదూరమునం దున్నదనియు నీవనుకొనుచున్నావు! నేనట్లనుకొనుట లేదు—అనుకున్నచో జీవింపఁజాలకయే యుందును—నాదేశమున కెట్టియాఘాతమైనను దానికిఁ బ్రతీకార మున్నది. అది యెంతగొప్పదైనను నేనే చేయఁగలను. అది నాకెంతమాత్రము నసాధ్యము కాదు—ఈవిశ్వాసము నాహృదయమున దృఢముగా నుండుటచేతనే నేనీదిగంతవ్యాప్తమగు నింతటిదుఃఖమును, నింతటిదుర్గతిని, నింతటియవమానమును సహింపఁగలుగుచున్నాను!" అనియెను.

విన—ఇంత తీవ్రముగా దేశమంతట నాక్రమించుకొనియున్న యీప్రబలదుర్గతికెదురుగా నిలువఁబడి విశ్వాసమును నిలిపి యుంచుకొనునంతటి సాహసము నాకు లేదు.

గోరా—దుర్గతి చిరస్థాయియై యుండునను మాట నేనెన్నటికిని విశ్వసింపఁజాలను. ఈ సమస్తప్రపంచసంబంధ మగు జ్ఞానశక్తియును, ప్రాణశక్తియును దానిని ద్రోసివైచుటకుఁ బ్రయత్నించుచునే యున్నది. వినయా! ఈ సంగతి నీకు నేనెన్నియో సారులు చెప్పితిని. ఇది యసంభవ మని నీవు కలలోనైనను భావింపవలదు. మనదేశమునకు ముక్తిలభించును! ఈ మాట మనసునం దుంచుకొనియే మనము ప్రతిదినమునను సంసిద్ధులమై యుండవలయును. భారతవర్షవిముక్తికై యెప్పుడో యొకప్పుడు మహారణము జరుగఁగలదని మీరందఱును దానిపై నాధారపడి నిశ్చింతులై యున్నారు. నేను చెప్పునదేమనిన, యుద్ధము జరుగుచునే యున్నది! ప్రతినిమిషమును జరుగుచునే యున్నది. ఇట్టిసమయమున మీరందఱును నిశ్చింతులై యుండుటకంటెఁ గాపురుషత్వము మఱియొకటి లేదు.

వినయ—గోరా! నీకును మాకును చాలభేద మున్నది! మనదేశమునందలి మార్గములందును, ఘట్టములందును ప్రతిదినమును జరుగుచుండు సంఘటనముల నన్నిటిని నీ విప్పటికప్పుడే నూతనదృష్టులతోఁ బరీక్షించుచుందువు. ఇట్టివాని నన్నిటిని మేము మా నిశ్వాసప్రశ్వాసములను మఱచినట్లే మఱచిపోవుచుందుము. వీనియందు మాకాశగాని నిరాశగాని లేదు. ఈ విషయమున మాకానందమును లేదు! దుఃఖమును లేదు! దినములపై దినములు గడచిపోవుచున్నవి. ఈ ప్రపంచమధ్యమున మాకచ్చటను మమ్మును గూర్చి గాని మా దేశమును గూర్చి గాని యనుభవము కించిన్మాత్రమును లేదు!

ఆకస్మికముగ గోరా ముఖ మెఱ్ఱబడిపోయెను. అతని కపోలములందలి రక్తనాళములు పొంగిపోయెను. అతఁడు రెండుచేతులను బిడికిలిపట్టి వీధినడుమ రెండుగుఱ్ఱముల బండివెనుకనే నడచుచు వజ్రగర్జన స్వరముతో వీధిలోనివారందఱును భయపడునట్లు "బండినాపుము!" అని కేకవైచెను. లావుపాటిబంగాళిబాబొకఁడా బండిని నడపుచుండెను. అతఁ డొకసారి వెనుకకుఁ జూచి తనచురుకైన గుఱ్ఱములను జబుకుతో నదలించి యొక్కనిమిషములో నదృశ్యుఁడైపోయెను.

అప్పు డొకముసల్మానువృద్ధుఁ డొకజంగిలిలో ఫలములు, కూరలు, రొట్టెలు, వెన్న, మొదలగునాహారపదార్థముల నుంచి తలపైఁబెట్టుకొని యొకదొరగారి వంటసాలవైపునకుఁ బోవుచుండెను. ఆ బంగాళీబాబాతనిని దప్పుకొనుమని కేకవైచెను గాని యావృద్ధుఁ డాకేకను విని వినకుండగనే బండి యాతని తలపైఁ బడునట్లు వచ్చెను. అతఁ డెట్లో తప్పించుకొని బ్రతికెను గాని నెత్తిపై నున్న పదార్థములు చెల్లాచెదరై క్రిందఁ బడిపోయెను. ఇంతేకాక యా బంగాళీబాబు బండిపైనుండియే యాతనివంకఁ దిరిగి చూచి, యావృద్ధుని నోటికి వచ్చినట్లు తిట్టి చబుకుతోఁ గొట్టెను. అందుచే నాతని మొగము చీరుకొనిపోయెను. పాప మావృద్ధుఁడు "అల్లా"ను స్మరించుచు నిట్టూర్పులు

విడుచుచుఁ బడిపోయినవస్తువులను జంగిళిలోని కెత్తుకొనుటకుఁ బ్రయత్నించుచుండెను. గోరా చటాలున నచ్చటికిఁ బోయి యావస్తువుల నేరి యాతనిజంగిడిలోనికిఁ జేర్పఁ దొడంగెను. గోరావంటిగొప్పవాఁ డట్టిపని చేయుచుండుట కావృద్ధుఁడు సంకుచితుఁడై "బాబూ! మీరేల కష్టపడియెదరు? ఇఁక నివి యెందులకును బనికి రావు" అనియెను. అవి చెడిపోయినవని గోరాకుఁ దెలియును. తానాపని చేయుచున్నందుల కావృద్ధుఁడు సిగ్గుపడుచుండెననియు నెఱుంగును. సాహాయ్యము కారణమునఁ జేయుచున్న యీపనిలో నంతవిశేషము లేదనియును నెఱుఁగును. కాని యొకపెద్దమనుష్యుఁ డావృద్ధు నవమానింపఁగా వేఱొక పెద్దమనుష్యుఁ డాయవమానితునితోఁ దన్ను సమానునిగాఁ జేసికొని ధర్మసంక్షోభమునందు సామంజస్యమును గల్పించె నని లోకులు గ్రహించుటకై యాతఁ డాప్రయత్నమును జేసెను. కాని యీసంగతిని గ్రహింపఁగలుగుట లోకులకుఁ జాలకష్టము! జంగిడిపూర్తి యయ్యెను. గోరా యాముసల్మానునిం గాంచి "నీకుఁ జాలనష్టము కలిగినది. నీవు దీనికి భరింపఁజాలవు రమ్ము! మాయింటి యొద్ద నీకు వీనిమూల్యమంతయు నిచ్చివైచెదను. కాని నిన్ను బంగాళీబాబు తిట్టినప్పుడు నీవొక్క మాటయైన నాడక యవమానమును సహించియుంటివి! అల్లా నిన్నీ విషయమున క్షమింపఁజాలఁడు!" అనియెను.

వృద్ధు—బాబూ! ఎవ్వఁడు దోషియో, యల్లా వానికి శాస్తిచేయును. నాకేల జేయును!

గోరా—దోషమును సహించువాఁడుకూడ దోషియే. ఏమనిన—వాఁడు ప్రపంచమునం దొకదోషమును సృష్టించినవాఁ డగుచున్నాఁడు. నీవు నామాట బోధపడలేవు. కాని యిప్పుడు తెలిసికొనుము. మంచితనముగ నుండుటయే మతధర్మము కాదు అట్లుండుటవలన దుష్టులను వర్ధిల్లఁజేసిన ట్లగును. మీ మహమ్మదీసంగతిని స్పష్టముగ గ్రహించుటచేతనే యాతఁడు మంచితనమును రూపమునిచ్చి మతమును వ్యాపింపఁజేయలేదు!

అక్కడను గోరాయిల్లు దూరమగుటచే వృద్ధుఁడు వినయునింటికిఁ గొనిపోఁబడెను. గోరా వినయునిద్వారమునొద్ద నిలువఁబడి "సొమ్ముతీయుము!" అనియెను.

వినయ—అంతతొందర యేల—కొంచెమాఁగుము! నేనిచ్చెదను.

అని యాతఁడు తాళమును వెదకుచుండెను. అవసరములేదు—గోరా యిఁక నాఁగక ద్వారముతలుపును బలవంతముగఁ బట్టిలాగెను. తోసినంతనే దుర్బలమైయున్న బీగము పటుపడలి తలుపు తెఱవఁబడియెను. అప్పుడు గోరాకు ముందుగా నాపెట్టెలో నొక చిత్రపటము కన్నులఁబడియెను. అది పరేశుబాబు కుటుంబచిత్రపటము! దానిని వినయుఁడు సతీశునివలన సంపాదించియుండెను.

గోరా కొంతసొమ్ము తీసి ముసల్మానునకిచ్చి యాతనిఁ బంపివైచెను. కాని యాచిత్రపటమునుగూర్చి యేమియును మాటాడలేదు. అతఁ డట్లూరకుండుటం గాంచి వినయ

యుఁడును మాటాడఁజాలకపోయెను. తరువాత నొకటిరెండుమాటలు జరిగెను. వినయుఁడు స్వస్థుఁడయ్యెను. అప్పుడు గోరా యాకస్మికముగ లేచి "నేను పోయెదను" అనియెను.

విన—ఓహో! నీవొక్కఁడవే పోయెదవా? అమ్మ నన్నుఁగూడ మీయింటికి భోజనమునకుఁ బిలిచినది. కావున నేనుకూడ వచ్చెదను.

ఇరువురును బయలుదేరిరి. త్రోవలో గోరా యేమియును మాటాడలేదు. ఆడ్రాయరులోని చిత్రపటమును జూచినతోడనే గోరా యాకస్మికముగాఁ దఃజీవితముతో నెట్టిసంపర్కమును లేని యొకమార్గము ననుసరించి వినయునిహృదయ మింకను బ్రవహించుచునే యున్నదని స్మరించుకొనియెను. గోరా యట్లు మౌనమును వహించుటకుఁ గారణమును వినయుఁడు గ్రహించెను గాని దానిని బలవంతముగ భంగించుట కాతఁడు సంకోచించెను. గోరాహృదయము పడినచోట నొకవిధమగు నిగూఢసత్య మున్నదని కూడ వినయుఁడు గ్రహింపఁగలిగెను.

ఇంటియొద్దకుఁ బోవునప్పటికి మహిముఁడు ద్వారమునొద్ద వీధికంకఁ జూచుచు నిలువఁబడి యుండెను. అతఁ డామిత్రు లిరువురను గాంచి "విశేషము లేమి? రాత్రి యంతయును మీకు నిద్దురయే లేదు. ఇంతసేపటికిని యింటికి రాకుండుటచే నెత్రోవలోనైన హాయిగ నిద్రించుచుంటి రేమో యనుకొంటిని. తక్కువపొద్దు పోలేదు! వినయా! పొమ్ము! స్నానమునకుఁ బొమ్ము!" అనియెను.

ఆట్లు వినయుని స్నానమునకుఁ బంపి మహిముఁడు గోరానుజూచి "గోరా! నీతోఁ జెప్పినమాటనుగూర్చి యేమైన నాలోచించితివా! వినయుఁ డనాచారి యని బహిష్కరించినచో నీరోజులలోఁ దగిన హిందూవరుఁ డెక్కడ దొరకును? కేవలము హిందువైన నేమిలాభము? చదువుకొన్నవాఁడు కావలయును. అదియును నిదియును కలిగియున్నచో వాఁడు కేవలము శాస్త్రపరతంత్రుఁడును గాక—శాస్త్రవిహీనుఁడును గాఁడు మధ్యముఁడై యుండును. నీకొక్కకూఁతు రున్నచో నామతముతో నీ వేకీభవించి యుండుదువు!" అనియెను.

గోరా—అన్నా! మీరు చెప్పినమాట సత్యమే. వినయుఁడుకూడ నభ్యంతరము చెప్పఁ డనుకొందును.

మహి—ఒక్కమాట వినయుని యంగీకార మెవ్వరికిఁ గావలయును? నీయంగీకారమే సర్వప్రధానమైనది! నీవొక్కసారి వినయునితోఁ జెప్పుము! నాకింతకంటె నేమియు నక్కఱలేదు. నీమాట ఫలించినను సరియే ఫలింపకున్నను సరియే—

గోరా—సరే—అలాగే!

మహిముఁడు తనలో "ఈసారి మిఠాయిదుకాణమున భక్ష్యములకును గొల్లవాని దుకాణమునఁ బాలపెరుగులకు నుత్తరువు చేయుదును" అని యనుకొనెను.

గోరా తొందరగా వినయునిఁగలసికొని "వినయా! శశిముఖిని నీవుఁ బెండ్లి చేసికొనవని దాదా గట్టిపట్టు పట్టియున్నాఁడు. నీయభిప్రాయ మేమి?" అని ప్రశ్నించెను.

విన—నీయభిప్రాయ మేమో ముందుగాఁ జెప్పుము!

గోరా—నాకది యేమో చెడ్డగాఁ దోఁచుట లేదు.

విన—ఇదివఱకు నీవు చెడ్డ యనియే చెప్పితివి. మనయిరువురిలో నెవ్వరును బెండ్లి చేసికొనఁ గూడదనియే నిశ్చయించుకొంటిమి.

గోరా—ఇప్పుడు సవరించుకొందము. నీవు పెండ్లి చేసికొనుము—నేను చేసికొనను.

విన—ఒక్కయాత్రియందు పృథక్ఫలమేమి?

గోరా—పృథక్ఫల మగునను భయముచేతనే నేనిట్లేర్పఱచితిని. పరమేశ్వరుఁ డొక్కొక్కమానవుని విశేషభారగ్రస్తునిగను, నొక్కొక్కని సహజముగనే భారవిహీనునిగను గల్పించుచుండును. ఈయిరువురును సమానముగా నుండవలసివచ్చినచో నిందొకఁడు బహిర్భాగమున దప్పైఁ బెట్టుకొనవలసి యుండును. నీవు వివాహభారము వహించినచో నప్పుడు నీకును నాకును సమానత్వము కలుగును.

వినయుఁడు నవ్వుచు "నీవు చెప్పిన కారణములనుబట్టి నావైపుననే బరువుండవలయును!" అనియెను.

గోరా—ఈభారమును వహించుటకు నీకభ్యంతర మున్నదా?

విన—తూనిక సమానమగుటకుఁ జేతికి దొరికిన దేదైనను సరిపడును. అది రాయైననేమి? ఇటుకయైననేమి? ఏదైనను సరియే—

గోరా యీవివాహమును గూర్చి యింతయుత్సాహముతోఁ జెప్పుటకుఁ గారణము వినయుఁడు గ్రహింపకపోలేదు. పరేశబాబు నింటిలోనివారి నెవ్వరినైనఁ దాను పెండ్లియాడుదు నని గోరాయనుమానించుచుండెనని తెలిసికొని వినయుఁడు నవ్వుకొనియెను. మధ్యాహ్నభోజనానంతరమున రాత్రినిద్రను దీర్చుకొనుటమూలముననే పగలు గడచిపోయెను. ఆపగలు వారి కేట్టిసంభాషణమును లేకపోయెను. సంధ్యాంధకారచ్ఛాయలు జగద్రంగమునఁ దెరవైచినప్పుడు—మిత్రులయిరువురి హృదయములలోనను దెర దిగిపోయినప్పుడు—మేడమీఁద వినయుఁ డాకాశమువంకఁ జూచుచు "గోరా! చూడుము! నేనొక్కమాట చెప్పుచున్నాను. మనస్వదేశప్రేమయం దొకవిధమగు గొప్పయసంపూర్ణత్వ మున్నట్లు నాకుఁ దోఁచుచున్నది! మనము మన భారతవర్షమును సగముగాఁ జేసి చూచుచున్నాము!" అనియెను.

గోరా—ఎట్లు చూచుచున్నాము?

విన—మన మీ భారతవర్షము కేవలము పురుషుల దనిమాత్రమే చూచుచున్నాము. స్త్రీలది యెంతమాత్రమును గాదనియే—

గోరా—నీవు తోటలను, కొలువులను, జలములను, స్థలములను, శూన్యములను, ఆహారములందును, వినోదములందును, కార్యములందును, సర్వస్థలములను స్త్రీలను గూర్చి యింగ్లీషువారివలెఁ జూడఁదలఁచుచున్నావు. పురుషులకంటె స్త్రీలనే యధికముగఁ జూడవలయునని నీయుద్దేశము; కానియందుమాత్రము దృష్టిసామంజస్యమునకు నష్టము కలుగలేదా ?

విన—కాదు కాదు. నీవీవిధముగా నామాటలను ద్రోసివేయవలదు. ఇంగ్లీషువారివలెఁ జూడవలయునని యెవ్వరు చెప్పిరి? మనదేశమునందలి స్త్రీభాగమును గూర్చి మన మంతగాఁ దగురీతి నాలోచించుట లేదని చెప్పితిని. ఈమాట చెప్పుచున్నాను—నీవొక్కనిమిషములోనైనను స్త్రీలనుగురించి యాలోచించుట లేదు. ఈప్రపంచము స్త్రీహీనమైనట్లుగనే నీవు భావించుచుందువు. ఇట్టిజ్ఞానమెన్నటికిని సత్యజ్ఞానము కానేరదు.

గోరా—నేను మాయమ్మను జూచినప్పుడు ఆమెను భావించినప్పుడు—ఈదేశమునందలి సమస్తస్త్రీల స్థానమునందే చూచి తెలిసికొనుచుందును.

విన—ఇవి మఱపించుటకుఁ జక్కఁగాఁ గూర్చినమాటలే కాని వేఱు కావు. ఇంటిపనులలో నింటిలోనియాత్మీయస్త్రీలతోఁ బరిచయము మున్నంతమాత్రమున నది స్త్రీజాతియందంతటను సత్యపరిచయము మాత్రము కాదు. ఇంగ్లీషుదేశము ననుసరించి మాటాడినచో నీవు మండిపడియెదవు. నేనట్లు చెప్పఁగలవాఁడను లేను. మనస్త్రీ లెంతవఱకు నేవిధముగా సమాజమునఁ బ్రకాశితులైయున్నచో వారికిమర్యాదకు భంగము కలుగకుండ నుండునో నేను చెప్పఁజాలను. కాని వారిని బ్రచ్ఛన్నలఁజేసి యుంచుటచే మనదేశస్థులందఱు నర్ధసత్యజ్ఞానులై యున్నారనియు, వారిహృదయములయందుఁ బూర్ణప్రేమయుఁ, బూర్ణశక్తియుమాత్రము ప్రకటితమగుట లేదనియు నేను చెప్పఁగలను.

గోరా—వినయా! పగలు, రాత్రి యనునవి దినమునకు రెండుభాగములు. అట్లే పురుషులు స్త్రీలును సమాజమునకు రెండు భాగములు. సమాజస్వభావము ననుసరించి స్త్రీలు రాత్రింబోలె ప్రచ్ఛన్నలు. వారి సమస్త కార్యములును నిగూఢములు, నిభృతములు—అస్వాభావికసమాజమునందు బలవంతముగ రాత్రి పగలుగఁ జేయఁబడుచుండును. అందు దీపప్రకాశములచే రాత్రియందును నృత్యగానములచేఁ గడచిపోవుచుండును. అంతమాత్రమున నేమిలాభము ? రాత్రిసంబంధములగు స్వాభావికనిభృతకార్యముల కన్నిటికిని నష్టముకలుగును. క్లాంతి యతిశయించుచుండును. క్షతిపూరణము గాకయుండుటచే—మానవుఁడు వున్మత్తుఁడైపోవును. మనము మన స్త్రీలను బహిరంగకర్మక్షేత్ర

మునకుఁ దెచ్చినచో వారి నిగూఢశక్త్యవస్థ యంతయును జెడిపోవును. అందువలన సమాజస్వాస్థ్యమునకును శాంతికిని భంగముకలుగును. సమాజమునందొకవిధమగు మత్తత ప్రవేశించును. అపుడితరులకు యసుఖప్రీతి కలుగును. కాని యాశక్తియే వినాశనమును గలిగించును. సమాజశక్తికి నొకభాగము పురుషుఁడు; రెండవభాగము స్త్రీ—పురుషుఁడు వ్యక్తుఁడు. వ్యక్తుఁడన్నంతమాత్రముననే ప్రధానుఁడు కాఁడు. స్త్రీ యవ్యక్త; ఈయవ్యక్తశక్తిని వ్యక్తగాఁ జేయఁదలంచినచో సమస్తమూలధనమును వ్యయపరచి సమాజమును దారిద్ర్యమున ముంచివైచిన ట్లగును. అందుచేతనే పురుషులందఱును యజ్ఞక్షేత్రమున నిలిచి, స్త్రీలందఱును భాండారములయందు నిలిచియున్నచో నప్పుడు స్త్రీ లదృశ్యలైయున్నను యజ్ఞము సర్వసంపన్న మగునని చెప్పుచున్నాను. సమస్తశక్తి నొక్కసారిగా నొక్కవైపున నొక్కచోట నొక్కరీతిగా నుపయోగించువాఁ డున్మత్తుఁడే కాని వేఱుకాఁడు!

విన—గోరా! నేను నీమాటకుఁ బ్రతివాదము చేయఁదలఁచుకొనలేదు. కాని నేను చెప్పినమాటకు నీవును సరిగాఁ బ్రతివాదము చేయుటలేదు! ప్రధానాంశము—

గోరా—వినయా! దీనినిగుఱించి యెంత మాటాడినను వాదము ముగియదు. స్త్రీలవిషయమున నీవు యోచించుచున్నంతబాగుగా నేను యోచించుటలేదని యంగీకరించుచున్నాను. నీకావిషయమున ననుభవమున్నది. నాకాయనుభవమునుగూర్చిన ప్రయత్న మెప్పుడును సఫలముకాలేదు. అందుచే నీసంబంధమున నాకభిప్రాయభేదము కలుగుచున్నది. ఇంతయును నేనంగీకరించుట చాలునా?

గోరా యీప్రసంగమును దాఁటివైచెను. కాని బీజమును విడిచివైచినను నదియొక ప్రదేశమునందుఁ బడి యనుకూలసమయమున నంకురించుట కభ్యంతర ముండదు. గోరా యింతవఱకుఁ దనజీవితక్షేత్రమున స్త్రీలను దూరముచేసియేయుండెను. అట్లుచేయుట యభావమనిగాని లోపమనిగాని యాతఁడు కలలోనైనను భావింపలేదు. ఇప్పుడు వినయునియవస్థ గాంచుటచే లోకమున స్త్రీలకుఁ గూడ విశేషశక్తియును బ్రభావమును గలదని గోరాకు గోచరించెను. కాని "వారిస్థాన మెక్కడ, వారిప్రయోజనమేమి" అను విషయములంగూర్చి యాతఁ డింకను స్థిరపఱచుకొనజాలకుండెను. అందుచేతనే వినయునితో నీవిషయమున వాదించుట యాతనికి బాగుగ లేకపోయెను. వినయుని యభిప్రాయము నంగీకరించుటకుఁగాని త్యజించుటకుఁగాని గోరా శక్తుఁడు కాకపోయెను. కావుననే యాతఁ డావాదమును వదలుకొనియెను!

వినయుఁడు రాత్రి యింటికిఁ బోవుచున్నప్పు డానందమయి యాతనిం బిలిచి "వినయా! శశిముఖిని నీవు పెండ్లియాడుసంగతి నిశ్చయమైనదా?" అనిప్రశ్నించెను.

వినయుఁడు సిగ్గుతో నవ్వుచు "అమ్మా! స్థిరపడినది. ఈశుభకార్యమునకు గోరాయే సంధానకర్తయైనాఁడు." అనియెను.

ఆనం—శశిముఖి మంచిదే—కాని, బాబూ! నీవు చిన్నతనపుఁబని చేయఁద గదు. నీహృదయము నేనెఱుఁగుదును! కొంచెము మోమాటపెట్టుచున్నా రని యెంచి తొందరపడి పనిచేయకుము. ఆలోచించుకొనుటకు నీకుఁగావలసినంతసమయ మున్నది! నీవైనను బాలుఁడవు కావుగదా! ఇంతగొప్పకార్యము నశ్రద్ధగాఁ జేయఁగూడదు!

అని బోధించుచు నాతనివీపుపై దువ్వుచుండెను. వినయుఁ డేమియు మాటాడక మెల్లమెల్లగా వెడలిపోయెను.

## ౧౮

వినయుఁ డానందమయియొక్క మాటలను భావించుకొనుచు నింటికిఁ బోయెను. ఆనందమయి చెప్పినయేమాటయును వినయుఁ డింతవఱకెన్నఁడు నుపేక్షించి యుండలేదు. ఆరాత్రి యాతనిహృదయమునం దొకభారము ముద్రింపఁబడియెను.

మఱునాఁటిసూర్యోదయమున లేచినప్పటి కాతని కొకవిధమగు బంధమునుండి విడివడినట్లుగా ననుభవముఁ దోఁచెను. విశేషమూల్యము నొసంగి గోరాస్నేహఋణమును దీర్పఁగలిగితి నని యనుకొనియెను. వినయుఁ డొకవైపున శశిముఖినిఁ బెండ్లియాడి జీవితవ్యాప్తమగు నొకబంధమును గల్పించుకొనుట కంగీకరించి మఱియొకవైపున నింకొకబంధమును వదల్చుకొనుటకు బాధ్యుఁడై యుండెను. వినయుఁడు బ్రాహ్మవివాహము చేసికొనుటకు లుబ్ధుఁడై యుండె నని గోరా యనుమానించి యామిథ్యాసంశయమునకు శశిముఖివివాహమును జామీనుఁ జేసి నిశ్చింతుఁడై యుండెను. అటుతరువాత వినయుఁడు నిస్సంశయముగాఁ బరేశబాబునింటికి రాకపోకలు సాగించుట కారంభించెను.

వినయుఁ డెంతచనవుగలచోటనైనను నాత్మీయునివలె సంచరించుస్వభావము కలవాఁడు కాఁడు. కాని గోరావిషయమున సంశయము దూరమైనతోడనే యాతఁడు క్రమముగాఁ బరేశునియింటివారందఱకిని చిరకాలబంధునివలె నైపోయెను. సుచరితహృదయము వినయునిపై నింపుగ వ్రాలి యున్నదని భావించి మొట్టమొదటఁ గొంతకాలము వఱకును లలితహృదయము వినయునిపైఁ గత్తిని దూయుచుండెను. కాని సుచరితభావమంతగా నాతనియెడఁ బక్షపాతము వహింపలేదని లలిత యిప్పుడు గ్రహించెను. అందుచే నిప్పు డామెహృదయమునందలివిద్రోహము దూరమయ్యెను. వినయబాబు చాల మంచివాఁడని చెప్పుటకు లలితహృదయమున నిప్పు డెట్టికష్టమును లేకుండఁబోయెను.

హానూబాబుకూడ నింతవఱకును వినయునియెడల విముఖుఁడైయుండెను. అతఁడు కూడ నిప్పుడు వినయుఁడు పెద్దమనుష్యుఁడే యని యంగీకరించుచుండెను. అతఁడు గోరా మంచివాఁడు కాఁడని చెప్పుటచేతనే వినయుఁడు మంచివాఁ డనుభావమును

సూచించుచుండెను వినయుఁ డెప్పుడును పానూబాబుతో వాదము పెట్టుకొనుట లేదు. అట్టివాదము జరుగకుండుటకే సుచరిత ప్రయత్నించుచుండెను! అందుచేతనే టీటేబిలునొద్ద వినయుఁడు శాంతిభంగము చేయకుండ నుండెను.

కాని పానూబాబు లేనప్పుడు సుచరిత వినయునితో నాతని మతవిషయములను గూర్చి మాటలాడుచుండెను. ఇంతటివిద్యాధికు లగుగోరాయును వినయుఁడును గూడఁ బ్రాచీన దురాచారముల నేల మన్నించుచుండిరో తెలిసికొనవలయు నను కుతూహల మామెకు నతిల్లుచుండెను. ఇట్టిమతము నవలంబించియున్న గోరాను గాని, వినయుని గాని యామె స్వయముగా నెఱుఁగకయే యున్నచో సుచరిత రెండవమాట వినకుండ వారిని గర్హించియే యుండును. కాని గోరాను జూచినప్పటినుండియు నామె యాతని నంతగా నగౌరవించి మనసులోనుండి త్రోసివేయఁజాలకుండెను. అందుచేతనే యామె గోరామతమును, జీవితమును సంపూర్ణముగఁ దెలిసికొనుటకై ప్రశ్నలపైఁ బ్రశ్నలను వైచి వినయుని నడుగుచుండెను. అన్నిమతములనుగూర్చియుఁ దెలిసికొనుటయే సుచరిత బుద్ధిమత యగుటకు ప్రాయమని పరేశబాబు నిశ్చయించుకొని యుండెను. అందుచేతనే యాతఁ డెన్నఁడు నామెవాదమున నభ్యంతరమును గల్పింపఁడయ్యెను.

ఒకనాఁడు సుచరిత వినయుని గాంచి "గౌరమోహనుఁడు నిజముగానే జాతిభేదమును గౌరవించుచుండెనా? కాక దేశాభిమానముచే నట్లు చెప్పుచుండునా?" అని ప్రశ్నించెను.

విన—సోపానపరంపర యొకదానికంటె నొకటి మీఁదై విభాగింపఁ బడవలయు నని నీ వంగీకరింతువా?

సుచ—అట్లున్నచోఁ గ్రిందినుండి మీఁదికెక్కుట కనుకూలముగా నుండు నని యంగీకరింతును. లేకున్నచో నాసప్రయోజనమే లేదు. సమానప్రదేశమున సమానముగ నున్న మెట్లతోఁ బ్రయోజన మేమున్నది?

విన—మనసమాజమునకు నట్టి సోపానపరంపరయే క్రిందినుండి మీఁది కెక్కించుటయే దాని యుద్దేశము! అది మానవజీవితమున కొకవిధమగు పరిణామమును గల్పించుచుండును! సమాజమే—ప్రపంచమే పరిణామశీల మైనదని చెప్పఁజూచినచో నిఁక నట్టివిభాగ వ్యవస్థతోడను నిమిత్తమే లేదు. కాని యట్లయినచో యూరోపియ సమాజములవలె నొకదాని నొకటి మించవలయు నను నుద్దేశమున ప్రబల నిరంతరమును పోరాటములు జరుగుచునే యుండును.

సుచ—మీమాట నాకు స్పష్టముగా బోధపడుటలేదు. ఏయుద్దేశముచే సమాజమున వర్ణవిభాగము కల్పింపఁబడెనో యా యుద్దేశము సఫల మైనట్లు మీరు నిరూపింపఁగలరా?

విన—ఈప్రపంచమున సఫలతాస్వరూపమును నిరూపింపఁగలుగుట యసాధ్య కార్యము! భారతవర్షము సామాజికప్రశ్నకు జాతిభేదమను నుత్తరము నిచ్చియున్నది. ఆయుత్తర మింకను విస్మృతము గాలేదు—ఇప్పటికి నాప్రత్యుత్తరము భూమ్యంతరాళములఁ బ్రతిధ్వనించుచునేయున్నది. యూరపుఖండ మింకను సమాజప్రశ్న కింతకంటె మంచియుత్తర మేదియు నిచ్చియుండలేదు. అచ్చటఁ గేవలము గందరగోళమును పోరాటమును మాత్రమే జరగుచున్నవి. కాని, భారతవర్షసంబంధమగు నీప్రత్యుత్తర మింకను సాఫల్యముకొఱకుఁ బ్రతీక్షించుచునేయున్నది.

సుచరిత సంకోచముతో "మీరు కోపపడవలదు. సత్యము చెప్పుఁడు! ఇది యన్నియును గౌరమోహనుని మాటలకుఁ బ్రతిధ్వనులేనా? కాక మీరు సంపూర్ణముగ విశ్వసించియే చెప్పుచున్నారా?" అని ప్రశ్నించెను.

వినయుఁడు నవ్వుచు "నేను సత్యమునే చెప్పుచున్నాను. గోరామతమునే విశ్వసింపగలయంతను బలవంతము నాకులేదు. సమాజమునందు జాతిభేదవిషయమునఁ గానవచ్చువికృతులను జూచినప్పుడు నాసంశయముల నాతనికిఁ దెలుపుచునే యుందును. కాని యప్పు డాతఁడు గొప్పవస్తువునందలి ప్రత్యేకస్వల్పభాగమునుబట్టి పరీక్షించినచో సందేహములు కలుగుననియు, చిటిగినకొమ్మనుబట్టి గాని, రాలినయాకును బట్టి గాని వృక్షసంబంధమగు చరమపరిణామమును నిశ్చయింపరాదనియు, వనస్పతినే పరీక్షించి దానిమంచిచెడ్డల నెఱుంగుటకుఁ బ్రయత్నింపవలయు ననియు బోధించుచుండును.

సుచ—ఆకులను, కొమ్మలనుబట్టి నిర్ణయింపరాదు గాని ఫలమునుబట్టి నిర్ణయింపవచ్చును. జాతిభేదఫలము మనదేశమున కెంతవఱ కుపకరించినది?

విన—నీవిప్పుడు చెప్పినది యస్వాస్థ్యఫలము కాని, కేవలమును జాతిభేదఫలము కాదు. కదలినదంతముతో నమలినచో మనకు బాధగానుండును. అది దంతములతప్పు గాదు—కదలినదంతముతప్పు! నానాకారణములచే మనలో వికారమును దౌర్బల్యమును గలుగుచుండును. అంతమాత్రమున భారతవర్షాభిప్రాయమే వికృతమైనదిగా మనము భావింపఁగూడదు. గోరా యిందుకొఱకే యెల్లపుడు "స్వస్థుఁడవైయుండుము—సబలుఁడవైయుండుము!" అని బోధించుచుండును!

సుచ—మంచిది. అట్లయినచో బ్రాహ్మణులు నరదేవతలని మీ రంగీకరింతురా?

విన—ఈపృథ్వియందలి గౌరవము లన్నియును బాహ్యముగ మనము కల్పించుకొన్నవే—బ్రాహ్మణుని యథార్థ బ్రాహ్మణునిగాఁ జేయఁగలిగినచో నది సమాజమునకు సామాన్యలాభ మనుకొంటివా? మనము నరదేవతల నే కోరుకొనుచున్నాము—మనము బుద్ధిపూర్వకముగా యథార్థముగా సమస్తాంతఃకరణములతో దేవు వాంఛించినచో నరదేవతలను బడయఁగలుగుదుము! అట్లుకాక మూఢులమై ప్రవర్తించినచో సమస్త

గృహకర్మములను జేయుచు మనశిరంబులపైఁ బాదధూళిని బ్రసాదించుచు మూలలయందే జీవితమును గడపుకొనుచుండు నరదేవతలను వెడలఁజేసినవార మగుదుము.

సుచ — మీరు చెప్పిన యిట్టి నరదేవత లెచ్చటనైన నున్నారా?

విన — ఉన్నారు! బీజములందు వృక్షము లిమిడియున్నట్లే యున్నారు. భారతవర్ష సంబంధ మగు నాంతరంగికాభిప్రాయ మిట్టి ప్రయోజనమధ్యమునందే యున్నది. ఇతరదేశము లన్నియును విల్లింగ్టన్ వంటి సేనాపతులను, న్యూటన్ వంటి వైజ్ఞానికులను రాత్ష్చైల్డ్ వంటి లక్షాధికారులను గోరుకొనుచుండును — కాని, మన దేశ మెప్పుడును బ్రాహ్మణులనే కోరుకొనుచుండును. ఎవ్వఁడు భయంకరుఁడు కాకుండునో, యెవ్వఁడు లోభమును నిరసించుచుండునో, యెవ్వఁడు దుఃఖమును జయించునో, యెవ్వఁడభావమును లక్ష్యము చేయకుండునో, యెవ్వఁడు పరబ్రహ్మమునఁ జిత్తమును నిలిపి యుండునో యాతఁడే బ్రాహ్మణుఁడు! గభీరుఁడును, శాంతుఁడును, ముక్తుఁడు నగు నట్టి బ్రాహ్మణునే భారతవర్షము వాంఛించుచున్నది. అట్టి యథార్థబ్రాహ్మణుని బొంద గలిగినప్పుడే భారతవర్షమునకు స్వాతంత్ర్యము లభింపఁగలదు! మనము రాజునెదుటఁ దలవంచి యుండియు నత్యాచారము లనియెడు బంధనములలో మెడలు దూర్చుచుండుటలేదా? కేవలమును మనము మన భయములకు వినతులము; మన లోభములకు వివశులము! మన మూఢత్వములకు దాసానుదాసులము! — బ్రాహ్మణులను దపస్సు చేయనిమ్ము; వారే భయమునుండియు, లోభమునుండియు, మూఢత్వమునుండియు మనల నుద్ధరించెదరుగాక! మనము వారినుండి యుద్ధమును గోరవలదు! వాణిజ్యమును గోరవలదు! మఱి యెట్టి ప్రయోజనమును గోరవలదు!

ఇంతవఱకు నూరక వినుచున్న పరేశబాబప్పుడు మృదులస్వరముతో "భారతవర్ష మన నేమో నే నెఱుంగుదునని చెప్పఁజాలను; మఱియు దాని వాంఛితమేమో, యది యెప్పుడు సిద్ధించునో కూడ నిశ్చయముగాఁ జెప్పఁజాలను. కాని జరిగిపోయినదిన మెప్పటికైనఁ దిరిగి వచ్చునా? వర్తమానమున సంభవమగుదానినే మనము సాధింపవలయును కాని యతీతవిషయములకై చేతులు చాచుచు వృథా కాలహరణము చేయుటవలన నేమి ప్రయోజనము?" అనియెను.

విన — నేనును మీ రూహించినట్లే యూహించి చాలసారులు గోరాతోఁ జెప్పియుంటిని. అప్పుడు గోరా "అతీత మతీతమని త్రోసివైచి కూర్చున్నంతమాత్రమున నది యతీత మగునా? ఏ సత్యమును గూడ నెన్నటికి నతీతము కాఁజాలదు!" అని చెప్పుచుండును!

సుచ — ఇప్పుడు మీరు చెప్పిన యీపద్ధతులు సాధారణజనుల కలవియగునట్లు లేవు. అందుచే మీ మతము దేశమున కంతకును వర్తింపదేమో యని సంశయము కలుగుచున్నది!

విన — మేము పరమహిందువుల మని యభిమానముతోఁ జెప్పుకొనుచుండు దేశీయులందఱును హిందూబంధువులే యని గోరా యెన్నఁడు నంగీకరింపఁడు. అతఁడు హిందూధర్మము నంతరంగములనుండియే బాగుగఁ బరీక్షించుచుండును. అతఁ డెన్నఁడును హిందూమతము సుకుమారిణి యని తలంచి యుండలేదు. అది యెప్పుడు నేవో కొన్ని యాకస్మిక సంపర్కములచేఁ గృశించుచు, నకారణాఘాతములచే బాధపడుచు నుండునని యాతని యుద్దేశము!

సుచ — కాని యాతఁ డీయాకస్మిక సంపర్కములవిషయమునఁ జాలవఱకు సావధానుఁడై యుండుననియే తోఁచుచున్నది!

విన — అతని సావధానత యత్యద్భుతమైనది! ప్రశ్నించినంత మాత్రమున నాతఁడు ఇతరమతసంపర్కములచే జాతి పోవుననియు, నితరులతో భోజనముచేఁ బాపము కలుగుననియు, ఇవి యన్నియు, నభ్రాంతసత్యము లనియు, వీని నన్నిటిని నే నంగీకరింతుననియుఁ జెప్పుచుండును. కాని యివియన్నియు నుద్రేకపూరితము లగుమాటలని నాయభిప్రాయము. అతఁ డీసంగతుల నందరియెదుటను బిగ్గఱగాఁ జెప్పుచుండును. సాధారణజనుల కెక్కడ మతగౌరవమునం దశ్రద్ధ కలుగునో యనియు, నితరమతస్థుల వలనఁ దనకెక్కడ నపజయము కలుగునో యనియు నాతఁ డెల్లప్పుడును హిందూమతమందలి సామాన్యవిషయములను గూడఁ ద్రోసివేయక గౌరవించుచు జాగరూకుఁడై యుండెను. నాయొద్దఁగూడఁ దనశైథిల్యమును బ్రకటింపకుండ జాగ్రత్తగా మెలఁగుచుండును.

పరే — బ్రహ్మసమాజమునందుఁగూడ నిట్టివారు చాలమంది యున్నారు. వారు హిందూపద్ధతుల నన్నిటి నసాలోచితముగఁ బరిహరించుచుందురు. కాని, వారు తమ మతమునందలి కుసంస్కారములనుగూడ నంగీకరించుచుందురని యితరు లనుకొనునట్లుగాఁ బ్రవర్తించుచుందురు. ఈప్రపంచమునం దట్టివారప్రవర్తనములు సహజములుగానుండవు. ఊరక నటనమాత్రముననే గందరగోళము చేయుచుందురు. వారు సత్యమును దుర్బలమైనదానిగా భావింతురు. సత్యమును కౌశలముచేతను బలవంతముచేతను రక్షించుటయే వారి కర్తవ్యవిషయము. "సత్యము నాపై నాధారపడి యున్నది. నేను సత్యముపై నాధారపడి యుండలేదు" ఇదియె వారిప్రధానసూత్రము. నే నెప్పుడును పరమేశ్వరుని కభిముఖుఁడనై బ్రాహ్మసమాజమునందైనను సరియే, హైందవచండీమండపమునందైనను సరియే సర్వస్థలములయందును, సత్యమునకు సర్వదా వినతుఁడనై స్వభావముగ విద్రోహరహితముగ సాష్టాంగప్రణామము చేయుదును — బహిర్గతము లగు నట్టి యాటంకములు నన్ను డగుపజాలవు.

అని చెప్పి పరేశబాబు తనహృదయమును హృదయాంతరమున సమాధానము చేసినట్లు క్షణకాలము స్తబ్ధుఁడై యుండెను. ఇంతసేపటివఱకును జరిగినమాటలన్నిటిపై నిప్పటి పరేశునిమాట లోఁతైనదగు మధురస్వరముతోఁ గలసి యుండెను. అది కేవలము మాటలలోని మధురస్వరమే కాదు — పరేశబాబుజీవితమునందలి గంభీరప్రశాంతసంబంధమగు మధురస్వరము! అప్పుడు లలితాసుచరితలవదనకమలములం దానందభక్తితేజము ప్రకాశితమయ్యెను. వినయుఁడు మౌనముతో నుండెను. గోరాయందు బ్రచండసరోధభావ మున్నదనియు మతోద్ధారకులకు మనోవాక్కర్మములయందు సహజసరళశాంతభావము లుండవలయు ననియు, గోరా కట్లు లేవనియు వినయుఁ డెఱింగియే యుండెను. ఇప్పటి పరేశునిమాటలను విని వినయుఁ డాసంగతి మఱియును స్పష్టముగా గ్రహించెను.

ఆరాత్రి సుచరిత పరుండియుండఁగా లలిత వచ్చి మంచముపై నొకపార్శ్వమున గూర్చుండెను. అప్పుడు లలితమనసులో నేదియో యుద్దేశ మున్నదని సుచరిత గ్రహించెను. అది వినయునిసంబంధమై యుండు నని కూడ ననుకొనియెను. అందుచేతనే సుచరిత తానే మాటాడుట కారంభించి "లలితా! వినయుఁడు చాలమంచివాఁడు సుమా!" అనియెను.

లలి — అతఁ డెప్పుడును గోరామాటలనే చెప్పుచుండుటచే నీకు మంచివాఁడు కాకేమి!

ఈమాటలోని భావమును మాత్రము సుచరిత గ్రహింపలేదు. అందుచే నామె సరళభావముతో "ఆమాట నిజమే! అతఁడు గోరామాటలు చెప్పుచుండఁగా వినుట నాకుఁ బరమానందముగా నుండును. నిజముగా గోరాను జూచినట్లే యుండును!" అనియెను.

లలి — నాకంతయానందముగా నుండదు — కోపముగా నుండును.

సుచ — (ఆశ్చర్యముతో) ఏమి ?

లలి — గోరా, గోరా, యని రేయింబవలు గోరామాటయే! వినయునిమిత్రుఁడగు గోరా గొప్పవాఁడే యగుఁగాక! వినయుఁడుకూడ మనుష్యుడే నా ?

సుచరిత నవ్వుచు "ఏమి? నీ కీసంశయ మేల కలిగినది?" అనియెను.

లలి — ఆతనిమిత్రుఁడు వినయుని దనప్రత్యేకత్వమును బ్రకటించుకొనజాలనంతటియసమర్థునిగాఁ జేసివైచినాఁడు! గాజుపురుగు బొద్దింకను బట్టుకొన్నట్లున్నది! ఈస్థితిలో నాకు గాజుపురుగునందును గోపమే; బొద్దింకయందు నగౌరవమే!

లలితమాటలయందలి తీవ్రత్వమును గాంచి సుచరిత యేమియు మాటాడక నవ్వుచుండెను. అప్పుడు లలిత "సుచరితా! నీవు నవ్వుచున్నావు! గోరా వినయునింబోలె నన్నెవ్వరైన నాక్రమించి యసమర్థురాలిగాఁ జేయుదలంచినచో నే నింతమాత్రమును సహింపఁజాలను. లోకు లేమనుకొన్న నేమి? నీవుమాత్రము నన్నట్లాక్రమించి యాచ్ఛ

న్నరాలినిగాఁ జేయలేదు నీస్వభావముగూడ నట్టిదికాదు. అందుచేతనే నేను నిన్నుఁ బ్రేమించుచున్నాను. నీవు తండ్రిగారియొద్దనుండి యీయుపదేశమును బడయఁగలిగితివి. ఆయన ప్రకృతుల ననుసరించి స్థానములను నిర్ణయించుచుండును." అనియెను.

ఈకుటుంబమునందులలితయు, సుచరితయుమాత్రమే పరేశునకుఁబరమభక్తలై యుండిరి. తండ్రిపేరు విన్నంతమాత్రముననే వారిహృదయములు వికసించి పోవును.

సుచ—తండ్రిగారితో సమాను లెవ్వరున్నారు? కాని వినయబాబు మాత్ర మతినిపుణముగా మాటలాడఁగలఁడు! నీవేమన్నను సరియే.

లలి—ఆమాట లాతనివి కావు గనుకనే యంతచిత్రముగానున్నవి. అతఁడు స్వయముగ నే మాటలాడినచో నింతకంటె దివ్యముగను సహజముగను నుండును. ఆలోచించి యాలోచించి జ్ఞప్తికిఁ దెచ్చుకొని పలికినయాపలుకులు నాకంతబాగుగ లేవు. ఆచమత్కారభాషణములకంటె స్వభావభాషణములే నాకుబాగుగానుండును.

సుచ—కోపగింపకుము. సోదరీ! గోరామాటలే వినయునకు స్వభావభాషణములయి పోయినవి!

లలి—అట్లే యైనచో నది యెంతయుగౌరవము! ఈశ్వరుడు బుద్ధి నిచ్చుట యితరులమాటలను వ్యాఖ్యానము చేయుటకా? వాక్కు నిచ్చుట యితరులమాటలను జమత్కరించుటకా? ఇట్టిచమత్కారభాషణములతో నాకుఁ బనిలేదు!

సుచ—కాని వినయుఁడు గోరా నంతగాఁ బ్రేమించుచుండెనని యేల భావింపఁగూడదు. అతనితో నీతనిమనసు కలసిపోయినది!

లలి—(విసుగుతో) లేదు! లేదు! లేదు! పూర్తిగాఁగలిసిపోలేదు! గోరా చెప్పినట్లు మెలఁగుట యాతని కభ్యాస మైపోయినది! అది ప్రేమకాదు—దాసత్వము! ఆయిరువురిమతము నొక్కటియే యనకూడ నీవు సాహసించి చెప్పుచున్నావు. ప్రేమయున్నచో నాతనిమతముతో నేకీభవింపకున్నను నాతని గౌరవింపవచ్చును. గుడ్డితనము లేకున్నను నాతనికిఁ దన్నర్పించుకొనవచ్చును. నీవట్లు తలంచుటలేదు. వినయుఁడు గోరాను గౌరవించుచునే యున్నాఁడు. ప్రేమచేతనే—మఱియొకవిధముగా గౌరవించుచున్నట్లు నేనంగీకరింపను. ఆసంగతి యాతనిమాటలలోనే స్పష్టపడుచున్నది. సోదరీ! నీవు గ్రహింపలేదా? నిజము చెప్పుము!

సుచరిత లలితయూహించినట్లూహింపలేదు. గోరా సంపూర్ణస్వరూపమును గ్రహించుటయందే యామె వ్యగ్రయై యుండెను. ప్రత్యేకముగ వినయునిస్వభావమును బరీక్షించుటయం దామెకుఁ గుతూహలము లేదు. అందుచే సుచరిత లలితప్రశ్న కుత్తరము చెప్పక "సోదరీ! నీసిద్ధాంతమే నిశ్చయ మనుకొందము! యిప్పుడు నీయుద్దేశ మేమి?" అనియెను.

లలి—అతనిమిత్రుని నిర్బంధమునుండి వినయుని విడిపించి స్వాధీనము చేసికొనవలయు నని నాయుద్దేశము !

సుచ—సోదరీ ! అట్లయినచోఁ బ్రయత్నము చేయఁగూడదా ?

లలి—నాప్రయత్నమాత్రమున లాభము లేదు. నీవు కొంచెము తలఁచుకొన్నచో నగును.

వినయుఁడు తనయం దనురాగము కలిగియుండె నని నిగూఢముగ నెఱిఁగియుండియు నప్పుడు సుచరిత యామాటను నవ్వులాటక్రిందఁ ద్రోసివైచుటకుఁ బ్రయత్నించెను.

లలి—ఆతఁడు గోరాబంధమునుండి విడివడి నీకనుకూలములగు పద్ధతుల నవలంబించి యున్నచో నప్పుడు నేను వినయుని మంచివాఁ డందును. ఈతనిమ్మత మింకను గోరాతోఁ గలిసిపోలేదు. ఈస్థితిలో మఱియొకఁ డెవ్వఁడైన నైనచో నీపాటికి బ్రహ్మసమాజబాలికలను దిట్టుచు నొకనాటకమును వ్రాసియేయుండును! ఈతఁడింకను శాంతముగ నేయుత్సాహముగ నేయున్నాఁడు నిన్ను బ్రేమించుచున్నాఁడు. తండ్రిగారియెడల భక్తికలిగి యున్నాఁడు. ఆతఁడు గోరావంటివాఁడు కాఁడనుట కిదియే ప్రమాణము. అక్కా ! వినయబాబు నెట్లయిన స్వతంత్రునిగాఁ జేసితీరవలయును! అంతటివాఁడు కేవలమును గోరాకుఁ బ్రచారకుఁడై యుండుట నాకసహ్యముగా నున్నది !

'ఇంతలో "అక్కా ! అక్కా ! అని పిలుచుచు సతీశుఁ డాగదిలోనికి వచ్చెను. వినయుఁ డాతని సర్కసులోనికిఁ దీసికొనిపోయెను. సతీశునకు సర్కసు చూచుట యిదియే మొదటిసారి. అందుచే నాతఁడు చాలరాత్రి యైనను నుత్సాహముతో సర్కసును గూర్చి వర్ణించుచు "అక్కా ! వినయబాబును బరుండుట కిక్కడకే తీసికొనిరావలయు నని ప్రయత్నించితిని గాని రేపు మరల వచ్చెద నని చెప్పి తనయింటికిఁ బోయినాఁడు ! అక్కా ! నిన్నుఁగూడ నొకసారి సర్కసు లోనికిఁ దీసికొనిపోవలయు నని యాతనితోఁ జెప్పితిని !" అనియెను.

లలి—ఆతఁ డేమనియెను ?

సతీ—ఆఁడువాండ్రు పెద్దపులిని జూచి భయపడుదు రేమో యని చెప్పినాఁడు ! కాని నేనుమాత్రము పులిని జూచి భయపడలేదు !

అని చెప్పి యాతఁడు తనపౌరుషమును బ్రకటించి గర్వముతోఁ గూర్చుండెను.

లలి—కాదా మఱి ? మీవినయబాబుసాహసము తెలిసిపోయినది. సోదరా ఈసారి మేమే యాతని బలవంతముగ సర్కసునకుఁ దీసికొనిపోయెదము.

సతీ—రేపు పగలే సర్కసు జరగును.

లలి—అట్లయినచో బాగుగ నున్నది. పగలే పోవుదము !

మఱునాఁడు వినయుఁడు వచ్చినతోడనే లలిత "వినయబాబూ! సమయమునకు వచ్చితిరి! లెండు!" అనియెను ?

విన—ఎక్కడకుఁ బోవలెను ?

లలి—సర్కసునకు.

పగటివేళ బహిరంగముగా నాఁడువాండ్రను వెంటఁబెట్టుకొని సర్కసునకుఁ బోవుట ! వినయున కేమియుఁ దోఁచకుండఁబోయెను.

లలి—గోరాబాబునకుఁ దెలిసినచోఁ గోపపడునా యేమి ?

లలిత యిట్లు ప్రశ్నించుటకు వినయుఁ డదరిపడియెను. లలిత మఱల "ఆఁడువాండ్రతోఁ గలసి సర్కసునఁ బోవుట గోరా కిష్టముండునా ?" అనియెను.

విన—నిశ్చయముగా నుండును.

లలి—అయిష్ట మెట్టిదియో వ్యాఖ్యానముచేసి చెప్పుఁడు! నేను సోదరి సుచరితను దీసికొని వచ్చెదను. ఆమెకూడ వినును.

ఆమాట పొడిచి నట్లున్నను వినయుఁడు నవ్వివైచెను. అప్పుడు లలిత "వినయబాబూ! నవ్వెదరేమి? ఆఁడువాండ్రు పులినిఁజూచి భయపడెదరని రాత్రి మీరుసతీశునితోఁ జెప్పితిరఁట! మీరుమాత్ర మెవ్వరికిని భయపడరు కాబోలును?—"అనియెను.

తరువాత వినయుఁ డాఁడువాండ్రతోఁ గలసి సర్కసునకుఁ బోయెను. గోరాకును దనకును గలసంబంధమునుగూర్చి లలితయు నాయింటిలోనిస్త్రీ లందఱు నెట్టియుద్దేశముతో నుండిరో వారిమాటలను బట్టి వినయుఁ డూహించుకొనఁదొడంగెను—

మఱియొకప్పుడు వినయుఁడాయింటికి వచ్చినప్పుడు లలిత రిత్తకుతూహలముతో "వినయబాబూ! ఆనాఁటిసర్కసుకథ యంతయును మీరు గోరాబాబునకు నివేదించితిరా !" అనియెను.

ఈయెత్తిపొడుపుమాట వినయుని చెవులలో గింగురుమనియెను. అతని కర్ణమూలము లెఱ్ఱపడిపోయెను. అప్పుడు వినయుఁడు "ఇంకను జెప్పలేదు !" అని యుత్తరమిచ్చెను. ఇంతలో లావణ్య యటకు వచ్చి "వినయబాబూ ! ఒకసారి వచ్చెదరా ? అనియెను.

లలి—ఎక్కడకు ? సర్కసునకా ?

లావ—సరిసరి ! ఈవేళ సర్కసెక్కడ నున్నది ? నా రుమాలునకైఁ బెన్సిలుతో నందముగా నొకచిత్రమును వ్రాసి పెట్టినచో నేను ఊలుతోఁ గుట్టుకొందును. వినయబాబు చాల సుందరముగాఁ జిత్రింపఁగలఁడు !

అని చెప్పి లావణ్య యాతనిఁ దీసికొనిపోయెను.—

---

## ౧౯

మఱునాఁటియుదయమున గోరా వ్రాసికొనుచుండఁగా వినయుఁ డాకస్మికముగా వచ్చి యనావశ్యకముగనే "ఒకనాఁడు నేను పరేశబాబుకుమార్తెలను సర్కసులోనికిఁ దీసికొనిపోయితిని" అని చెప్పెను.

గోరా వ్రాసికొనుచునే "వింటిని!" అనియెను.

వినయుఁడు విస్మితుఁడై "ఎవ్వరు చెప్పిరి?" అనియెను.

గోరా—అవినాశుఁడు—అతఁడుకూడ నాదినమున సర్కసునకుఁ బోయెను" అని మఱి యేమియు మాటాడకుండ గోరా వ్రాసికొనుచుండెను.

గోరా కిదివరకే యీసంగతి తెలిసినది అవినాశుఁడుకూడ మరలఁ జెప్పియుండెను ఈవిషయమున వర్ణనములును వ్యాఖ్యానములును గూడ జరిగియే యుండును. తన పూర్వసంస్కారమును బట్టి వినయున కిది యంతయును లజ్జాకరముగా నుండెను. ఈ సంగతి యితరుల కెవ్వరికిని దెలియకున్నచో వినయునకు సంతోషముగా నుండును!

రాత్రి యంతయును గలలో లలితతో వాక్కలహము జేసినసంగతు లన్నియు వినయున కప్పుడు స్మృతికి వచ్చెను—"పిల్లవాఁడు తనసంరక్షకునకు భయపడినట్లు వినయుఁడు గోరాకు భయపడుచుండును. ఇట్టితప్పుత్రోవను బడినచో మనుష్యుఁడు తనమానవత్వమునే మఱచిపోవును. వినయుఁడును గోరాయును సమానులు. ఇట్టిచో నసమానత్వము నారోపించి గోరాను బూజించుట వినయునితప్పు! అట్లు పూజ చేయించుకొనుట గోరాకును దప్పే—వినయుఁడు బాలకుఁడు కాఁడు. గోరా యాతనికి సంరక్షకుఁడు కాఁడు!" ఇదియే లలితవాదము.

గోరా మాటాడక వ్రాసికొనుచున్నకొలఁదియు వాఁడిబాణములవంటి లలితమాటలు వినయునిహృదయమునకుఁ దాఁకుచునే యుండెను. ఆ శరాఘాతములను వినయుఁడు తప్పించుకొనఁ జాలకుండెను. చూచుచుండఁగనే వినయున కొకవిధమగు కోపము గలిగెను. "సర్కసునకుఁ బోయినంతమాత్రమున నేమి? ఈవిషయము నుగూర్చి గోరాయెదుటఁ దీవ్రముగా విమర్శించుట కవినాశుఁ డెవ్వడు? అతుల్లు గుమ్మడికాయ చేయు విమర్శనములను గోరామాత్ర మేల చెవియొగ్గి వినవలయును? నేనేమి గోరాకు బానిసనా? ఎవ్వరితోఁ గలసికొంటినో, యెక్కడకుఁ బోయితినో యీసంగతు లన్నియు నాతనికి నేనేల నివేదింపవలయును? చెప్పకున్నంతమాత్రమున స్నేహమున కేమైన నుపద్రవము కలుగునా?" అని యిట్లాతఁడు భావించుకొనుచుండెను.

వినయునకు సహజముగాఁ దనమనసులోని పిఱికితన మగపడుచున్నది! అందుచేతనే యాతఁ డవినాశునియెడలను, గోరాయెడలను నంతగాఁ గోపపడుచుండెను. ఇంతసేపటివఱకును దనతో నొక్కమాటయైన నాడలేదని వినయునకు గోరామీఁదఁ గూడఁ గోపము.

కలిగెను. పర్కానునకుఁ బోవుటనుగూర్చి గోరా కఠినముగా నొకటి రెండుమాటలన్నచో మిత్రత్వమునకు సమభావము కనఁబడి వినయునకుఁ గొంచెమూఱట కలిగియే యుండును. కాని గోరా గంభీరముగ నధికారివలెనుండి మౌనముచేతనే వినయు నవమానించెను. అందుచే లలిత వాఁడిబాణములవంటిమాటలు వినయుని హృదయమును మాటిమాటికిని భేదింపఁ దొడంగెను.

ఇంతలో మహిముఁడు హుక్కాతో నచ్చటికివచ్చి డబ్బిలోనితమలపాకులను గొన్నిటిని వినయునకిచ్చి "బాబూ! వినయా! మేమంతయును స్థిరపఱచుకొన్నాము. ఇఁక మీపినతండ్రియొద్దనుండి జాబు వచ్చినచో నిశ్చింతగా నుందుము. నీవాయన కుత్తరము వ్రాసితివా ?" అనియెను.

ఇప్పుడీపెండ్లిమాట వినయునకుఁ జిరాకుగా నుండెను. ఇందు మహిముని తప్పేమియు లేదని యాతఁ డెఱుంగును. మాటయిచ్చుటయు నైపోయినది. కాని, వినయునకది యెంతో దీనత్వముగా దోఁచుచుండెను. ఆనందమయి యాతని నొకవిధముగా హెచ్చరించినది! ఆతనికిఁ గూడ నీవివాహ మంతయిష్టముగా లేదు. కాని గందరగోళములో నొక్కనిమిషములో నెట్లు స్థిరపడిపోయినది! గోరా యాతని బలవంత పెట్టెనని చెప్పుటకు వలనుపడదు. వినయుఁ డభ్యంతరము చెప్పినప్పుడుగదా గోరా బలవంతపెట్టుట ? అట్లు జరుగలేదు! కాని—ఈ కానిమీఁదనే లలితమాట బల్లెపుఁ బోటువలె వినయుని దాఁకెను—అప్పుడెట్టిబలవంతమును లేదు గాని చిరకాలము నుండియున్న ప్రభుత్వమాతని లోఁబఱచుకొనియెను. వినయుఁడు ప్రేమచేతను మంచితనముచేతను గోరాయధికారము ననాయాసముగా సహించుట కలవాటుపడి యుండెను. అందుచే నాయధికారమే మిత్రత్వము నెత్తికెక్కి కూర్చుండెను! వినయుఁడీసంగతి యింతవఱకు నూహింపనేలేదు. కాని యిప్పుడంగీకరింపకుండుట కుపాయము లేదు. అందుచే నాతఁడు శశిముఖిని బెండ్లియాడి తీరవలయును!

విన—లేదు. ఇంకను మాతండ్రిగారికి జాబు వ్రాయలేదు.

మహి—అది నాదే తప్పు. ఆయుత్తరము నీవు వ్రాయవలసినది కాదు. నేనే వ్రాయవలసినది—వారిసంపూర్ణవిలాస మేమో చెప్పెదవా ?

విన—మీ కింతతొందర యెందులకు? ఆశ్వీజకార్తికమాసములలోఁ బెండ్లిండ్లు జరుగుట కవకాశము లేదు కదా! ఇఁక మార్గశిరము—కాని దానికిని గొడవయున్నది. మాకుటుంబములో నెప్పుడో యెవ్వరికో యామాసమునఁ గష్టము కలిగినది. అప్పటినుండియు మాకుటుంబమునందు మార్గశిరమాసమున శుభకార్యములు జరుగుటలేదు.

మహిముఁడు హుక్కా నొకమూల నుంచి "వినయా! విద్యాధికులగు మీవంటి వారే యిట్టివెఱ్ఱిలో మునిఁగిపోయినచో నిఁక మీ చదువంతయును వల్లించి చచ్చుట

కేనా? ఈపాడుదేశము లో శుభముహూర్తములు దొరకుటయే కష్టముగా నున్నది. అందుపై నింటింటికి నొకపద్ధతి యని యభ్యంతరములు కల్పించుకొన్నచో నిఁక శుభకార్యము లెట్లు జరుగును?" అనియెను.

విన — భాద్రపదాశ్వయుజమాసములను మీ రేల యంగీకరించుటలేదు?

మహి — నేనా? ఏమిచేయుదును బాబూ! భగవంతుని నమ్మకపోయినను సరియేకాని భాద్రపదాశ్వయుజములను, శనిగురువులను తిథినక్షత్రములను నంగీకరింపక పోయినచో నింటిలో నిలువఁగలేను? అంగీకరింపక యేపనియైనఁ జేసినచో నెట్టి లోపమైనఁ గలిగినయెడల మనసునకుఁ గష్టముగ నుండును. లోకము ననుసరించి పోవలయును! మలేరియాజ్వరమునకు భయపడినట్లు లోకాభిప్రాయమునకు భయపడవలయును! నేను సామాన్యముగాఁ ద్రోసివేయఁజాలను!

విన — మావాళ్ళకుఁగూడ మార్గశిరమాస మనిన నదియేభయము! ఇంతకు మా పినతల్లి యసలే యంగీకరింపదు!

అని చెప్పి వినయుఁ డప్పటి కెట్లో తప్పించుకొనియెను. అతని మాటలయందలి స్వరమునుబట్టి వినయుని యుద్దేశము మారినదని గోరా గ్రహించెను. కొన్నిదినముల నుండి వినయునిరాక లేదు. పరేశునింటి కాతఁడు తఱచుగఁ బోవుచున్నట్లు గోరా వినియుండెను. వివాహసంబంధమున నిప్పటివినయునిమాటలు గోరాకుఁ గష్టమును గలిగించెను. గోరా యిఁక వ్రాయుట మాని మొగమెత్తి "వినయా! నీవొకసారి యంగీకరించితివి. మరల నన్నగారి నిప్పుడేల సంశయములోఁ బెట్టి బాధించెదవు?" అనియెను.

వినయుఁ డాకస్మికముగ నసహిష్ణుఁడై "నేనంగీకరించితినా, బలవంతమున నంగీకరింపఁబడితినా" అనియెను.

గోరా విస్మితుఁడై కఠినస్వరముతో "నిన్నెవ్వరు బలవంతపెట్టిరి?" అనియెను.

విన — నీవు —

గోరా — నేనా? ఈవిషయమున నీతో నైదాఱుమాటలకంటె నెక్కువ ప్రసంగించితినా? అదియేనా బలవంతము!

నిజముగా వినయుఁడన్నమాటకు నిదర్శనము లేదు. గోరా చెప్పినమాటయే నిజము. గోరా కొలఁదిగనే మాటాడెను; బలవంతము చేయలేదు. కాని యొకమాట సత్యము! గోరా వినయునికడనుండి యాతనిసమ్మతిని లాగికొనియెను. దీనికి బాహ్య ప్రమాణమల్పమే. కాని, యిట్టిగొడవులందు మానవహృదయమునఁ దోఁచుసంక్షోభము మాత్రమల్పమైనది కాదు! అందుచేతనే వినయుఁ డసంగతక్రోధస్వరముతో "బలవంతము చేయుటకు విశేషప్రసంగ మక్కఱలేదు!" అనియెను.

గోరా యొక్కయుదుటున బల్లయొద్దనుండి లేచి "ఏదీ! మఱియొకసారి చెప్పుము! నిన్ను యాచించియో, బలాత్కరించియో యపహరించుటకీమాట వరాలమూటకాదు!" అని పలుకుచు "దాదా!" యని పిలిచెను.

ప్రక్కగదిలో నున్నమహిముఁడు పిల్లివలె నచ్చటికి వచ్చి నిలువఁబడియెను. గోరా యాతనిం గాంచి "దాదా! శశిముఖి వినయునకు పెండ్లియాడదని నేను మొట్టమొదటనే చెప్పితిని గాదా? నాకిష్టము లేదనికూడఁ జెప్పలేదా?" అని ప్రశ్నించెను.

మహి—ఔను. నీవుతక్క మఱియెవ్వఁడు నట్లు చెప్పలేదు. మఱియొకసోదరుఁడైనచో నన్నబిడ్డపెండ్లివిషయమున మొదటినుండి కొంచెము నుత్సాహముఁ జూపియుండును!

గోరా—వినయునితోఁ జెప్పుమని మీరు నన్నెందుకుఁ గోరితిరి ?

మహి—నీవు చెప్పినచోఁ బని జరుగునని నేననుకొంటిని. ఇంతకంటెఁ గారణమేమున్నది ?

గోరా మొగము ఎఱ్ఱచేసికొని "నాకీవ్యాపారములతో నిమిత్తము లేదు. పెండ్లిండ్లను గూర్చుటయే నాపని కాదు! నాకింకను జాలపనులున్నవి!" అని చెప్పుచు నాతఁడింటినుండి వెడలిపోయెను. హతబుద్ధియగు మహిముఁడీవిషయమున మాటాడఁదలంపఁగనే వినయుఁడు నటనుండి లేచిపోయెను. మహిముఁడు గోడకుఁ జేరగిలఁబడి కూర్చుండి నోటమాట లేకుండ హుక్కాను బీల్చుకొనుచుండెను.

గోరావినయులలోఁ బరస్పరము నిదివఱకనేక వాక్కలహములు జరిగినవి కాని యింతటిప్రచండాగ్నిజ్వాలవంటివ్యాపార మెన్నఁడును జరుగలేదు. వినయుఁడు తాను చేసినయీపనికిఁ బ్రథమమున స్తంభితుఁడైపోయెను. ఆతఁడింటికిఁ బోయి తనహృదయశల్యమును వెలికివైచుకొనుటకుఁ బ్రయత్నముచేయుచుండెను ఇంతశీఘ్రముగా గోరాహృదయమున నంతటియాఘాతమును గలిగించినందుల కాతని కాహారవిహారములపై నసహ్యభావము కలిగెను. విశేషించి గోరాపై దోషారోపణము చేయుట యాతని కద్భుతముగను, నసంగతముగను దోఁచెను! ఆబాధచే నాతనిహృదయము పరితపించిపోవుచుండెను. ఆతఁడప్పుడు నిశ్చయముగా "నేను చేసినది—అన్యాయము! అన్యాయము! అన్యాయము!" అని యనుకొనెను.

రెండుజాములైనతరువాత నానందమయి భోజనముచేసి కుట్టుపని చేసికొనుచు గూర్చున్నసమయమున వినయుఁడు వచ్చి యామెచెంతఁ గూరుచుండెను. ప్రాతఃకాలమున జరిగినసంగతి యంతయు నానందమయి మహిమునివలన నిదివఱకే వినియుండెను. భోజనసమయమున గోరా మొగము చూచినప్పుడే యేదో పుట్టిమునిఁగినదని యామె గ్రహించియుండెను.

విన—అమ్మా! నేను తప్పు చేసితిని. శశిముఖి పెండ్లివిషయమున నే నీయుదయమున గోరానన్నమాటలు చాల నసహ్యములైయున్నవి.

ఆనం—అగుఁగాక! బాబూ! మనసునకుఁ గష్టముగా నున్నప్పుడిట్టిపనులే జరగుచుండును దానికేమి! ఈకోప మొకటిరెండు దినములకు నీవును మఱచిపోవుదువు; గోరాయును మఱచిపోవును.

విన—కాని, అమ్మా! శశిముఖినిఁ బెండ్లియాడుటకు నాయభ్యంతర మేమియు లేదు. ఆమాటయే నీకుఁ జెప్పవచ్చితిని.

ఆనం—వత్సా! తొందరపడి పోరు తగ్గించుకొనవలయు నని ప్రయత్నించి మఱియొకపోరు తెచ్చుకొనవలదు. వివాహమనునది జీవితకాలబంధము—విరోధము రెండు మూఁడుదినములనాఁటిది!

వినయుఁ డామె మాటలను వినిపించుకొనలేదు. మరల గోరాయొద్దకుఁ బోయి తన యభిప్రాయమును దెలుపుట కాతనికి ధైర్యము లేకపోయెను. వినయుఁడు మహిముని కడకుఁ బోయి "పెండ్లి కెట్టియభ్యంతరమును లేదు. మాఘమాసమునఁ జేయవచ్చును. మాతండ్రిగారి నంగీకరింపఁజేయుభారము నాదే" అని చెప్పివైచెను.

మహి—తాంబూలములు పుచ్చుకొనవలయునుగదా, ఎప్పుడు?

విన—అన్నియును గోరాతో నాలోచించి చేయవచ్చును.

మహి—మరల గోరాతో నాలోచనయా?

విన—అది లేకుండ నేదియు జరుగదు.

మహి—అట్లయినచో నట్లే చేయుదును. కాని—

అని చెప్పి యాతఁడు తములపాకులను నోట వైచుకొని నములుచుండెను.

## ౨౦

ఆనాఁటికిఁ గాక మఱునాఁడు మహిముఁడు గోరాగదిలోనికిఁ బోయెను. అతని నీవిషయమున మరలనొప్పించుట చాలకష్టమని మహిముఁ డనుకొనియెను. కాని మహిముఁడు వచ్చి వినయుఁడు చెప్పినమాటల నన్నిఁటిని జెప్పినతోడనే గోరా "మంచిది! తాంబూలములు పుచ్చుకొనవచ్చును!" అనియెను.

మహి—నీవిప్పుడు సరియే యంటివి. మరి యెప్పుడైన నడ్డము చెప్పుదువు.

గోరా—నే నెప్పుడును నూరక యడ్డము చెప్పను. నిరోధించి—

మహి—అందుచేతనే నిన్నుఁ వేఁడుకొనుచున్నాను. నీవూరకుండవలదు; నిరోధింపనువలదు! కురుపక్షమునందలి నారాయణబలముతోఁ గాని, పాండవపక్షమునందలి నారాయణునితోఁ గాని మాకు నిమిత్తములేదు. నేనే నాయిష్టమువచ్చినట్లు చేసికొందును. నేను పొరపాటు పడితిని. నీసాహాయ్య మింతవిపరీతమైనదని నాకిదివఱకుఁ దెలియదు. ఎట్లయిననేమి? ఈశుభకార్యము జరుగుట నీకిష్టమే నా?

గోరా—ఆ! నాకిష్టమే.

మహి — అట్లయినచో నీయిష్టమే నాకుఁజాలును. నీప్రయత్నముతోఁబనిలేదు.

ఇఁక వినయుని దూరమునం దుంచరా దనియు, నాతని విపత్తిక్రమునఁ దాను గావలి యుండవలయు ననియు గోరా తలఁచెను. తానుకూడఁ బరేశునింటికిఁ దఱచుగాఁ బోవుచున్నచో వినయు నొకహద్దులో నిలిపి యుంచినట్లగు నని యాతఁడు నిశ్చయించుకొనెను. జగడము జరిగినమఱునాఁడే యపరాహ్ణసమయమున గోరా వినయునింటికిఁ బోయెను. ఇంతలో గోరా తనయింటికి వచ్చునని వినయుఁ డనుకొనలేదు. ఆకారణముచే వినయునిహృదయమున నాశ్చర్యమును సంతోషమును గలిగెను. ఇంతేకాక ముందుగా గోరా యెట్టివిరూపభావమును నగపడకుండఁ బరేశబాబుపుత్రికలమాట యెత్తుట మఱియు నాశ్చర్యకరముగా నుండెను. ఈవిషయమున వినయునిహృదయమున నుత్తేజనము కలిగించుటకు గోరా విశేషప్రయత్నము చేయనక్కఱలేకపోయెను. వారామాటలను మరలమరలఁ జెప్పుకొనుచుండఁగనే రాత్రియైపోయెను.

గోరా యామాటలనే తలంచుకొనుచు నొంటిగా నింటికివచ్చి నిదురించువఱకును బరేశునిపుత్రికలనుగూర్చియే భావించుచుండెను. ఆభావము నాతఁ డేవిధమునను దనహృదయమునుండి మరల్చుకొనఁజాలకుండెను. గోరా జీవితమునం దిట్టిభావ మీవఱ కెన్నఁడును గలుగలేదు. ఆఁడువాండ్రనుగుఱించి యాతఁ డెన్నఁడును యోచించియే యుండలేదు! ఈజగద్వ్యాపారమునందు స్త్రీసంబంధ మగునాలోచనముకూడ నొకవిషయమే యని వినయుఁ డీసారి సప్రమాణముగ నిరూపించియుండెను.

మరునాఁడు వినయుఁడు గోరాయొద్దకువచ్చి "పరేశునింటి కొకసారి పోవుదమా చాలదినములనుండి పోవుటలేదు. వారెప్పుడును నీమాటయే యడుగుచుందురు" అనియెను.

గోరా మాఱుమాట చెప్పక యంగీకరించెను. అతనిహృదయమునఁ బూర్వమువలె నిరుత్సాహభావములేదు. గోరాకుఁ బ్రప్రథమమునఁ బరేశబాబుపుత్రికలయెడలఁ గేవల ముదాసీనభావమే యుండెను. తరువాత వారియెడల నవజ్ఞాపూర్వ మగునిరోధభావ ముండెను. ఇప్పు డాతనిహృదయమున నొకవిధమగుకుతూహలభావ మంకురించియుండెను. వినయునిహృదయ మేకారణముచే నింతగా నాకర్షింపఁబడుచుండెనో తెలిసికొనవలయునని గోరా కిప్పుడు విశేషాభిలాష కలిగెను.

ఆయిరువురును బరేశునింటికిఁబోవునప్పటికి సాయంకాల మయ్యెను. అప్పుడు మేడ రెండవయంతస్తుపై దీపమునొద్దఁ గూర్చుండి హారానబాబు పరేశున కొకయింగ్లీషులేఖను జదివి వినిపించుచుండెను. పరేశబాబు మాటమాత్రమేగాని యాచదువు సుచరిత వినవలయునని హారానుని యుద్దేశము. సుచరిత యెదురుగా టేబిలునకు దూరమునం దొక కుర్చీపైఁగూర్చుండి విసనకఱ్ఱను వెలుతురులో మొగమునకుఁ జాటు చేసికొని

మౌనముగాఁ గూర్చుండి యుండెను. సుచరిత తన బాధ్యతను ననుసరించి వినవలయు నని విశేషప్రయత్నము చేయుచునే యుండెను గాని యుండియుండి యామె మనసు చెదరిపోవుచుండెను.

ఇంతలో సేవకుఁడు వచ్చి గోరా వినయుల యాగమనమును దెలియఁజేసెను. అప్పుడు సుచరిత యాకస్మికముగఁ బులకితయైపోయెను. తోడనే యామె లేచిపోవుట కుద్యమించుచుండఁగాఁ బరేశుఁడు "రాధా! ఎక్కడకు బోయెదవు? వారు మన గోరాయును, వినయుఁడును" అనియెను.

సుచరిత సంకుచితయై కూరుచుండెను. హారాణుని దీర్ఘలేఖా పఠన మాఁగిపోయి నందుచే నామెకు సంతోషము కలిగెను. గోరా వచ్చెనని యామె యుత్సాహము కలుగ లేదు గాని హారాణబాబుండఁగా వచ్చినందులకామె కించుక సంకోచము, నస్వస్థతయుం గలిగెను, ఇరువురకును వాదమును గలహమును గలుగునని యో మఱియెందుచేతనో గాని యామె యట్లుండెను. దానికిఁ గారణమిట్టిదని చెప్పుట దుర్వేద్యముగా నుండెను.

గోరా పేరు విన్నంతనే హారాణుని మనసున విముఖభావము కలిగెను. గోరా నమస్కారము నెట్లో ప్రతినమస్కారము చేసి గంభీరభావముతో నాతఁడు కూర్చుండెను. హారాణునిఁ జూచినతోడనే గోరా యుద్ధము చేయుటకు శస్త్రసన్నద్ధుఁడై యుండెను. వరదాసుందరియును, ముగ్గురు తనయలును నచ్చటికో విందునకుఁ బోయిరి. సాయంకాలమునకుఁ దరువాత వారిని పరేశబాబు తీసికొని రావలసియుండెను. ఇంతలో గోరా వినయులు వచ్చుటచేఁ బోవుటకుఁ బరేశుఁ డించుక సంశయించెను గాని వారి నింటికిఁ దీసికొనిరమ్మట తప్పనిసరి యయ్యెను. అప్పుడు పరేశుఁడు హారాణుని, సుచరితను గాంచి "మీరు వీరితోఁ గూడఁ గొంచెము సేపటివఱకును మాటలాడుచుండుఁడు! నేనిప్పుడే తిరిగివచ్చెదను!" అనిచెప్పి వెడలిపోయెను.

చూచుచుండఁగనే గోరాకును హారాణబాబునకును వాదము ప్రబలిపోయెను. ఆ వాదమునకు విషయమిది:—పరేశబాబు ఢాకాలో నున్నప్పటినుండియుఁ గలకత్తాకు సమీపమునందలి జిల్లాకలెక్టరు బ్రౌనుదొరగారితో స్నేహము గలిగియుండెను. పరేశబాబు భార్యను, బుత్రికలను జనానాలో నుంచుట లేదని యాదొర యాతని విశేషముగ గౌరవించుచుండెను. ఆదొర తన ప్రతిజన్మదినమునందును కృషిప్రదర్శన సమావేశమును గూర్చుచుండును. ఈసారి వరదాసుందరి యాదొరగారి దొరసానితోఁ గలిసికొని తనకుమార్తెల ఇంగ్లీషు భాషాపరిజ్ఞానమును గూర్చి విశేషముగ ముచ్చటించెను. దానిపై నాదొరసాని రాఁబోవుసమావేశమునకు లెప్టినెంటుగవర్నరు భార్యాసహితముగ వచ్చుననియు నప్పుడు నీతనయచే నొకచిన్న యింగ్లీషు నాటకమును వారిచేత నభినయింపఁజేసినచో బాగుగనుండునని యుఁ జెప్పెను. అందుచే వరదాసుందరి యుత్సాహము మితిమీరిపోయెను. ఆమె యిప్పుడు తన బిడ్డలు చదివిన నాటకమును ముందు (రి) వర్ష్యించి చూచుకొ

నట్టికై బిడ్డలతోఁగూడ నొకమిత్రునియింటికిఁ బోయెను— ఈసమావేశమునకు గోరా వచ్చునా రాఁడా యనుప్రశ్న వచ్చినమీఁదట గోరా యనావశ్యకతీవ్రస్వరముతో "రాఁడు!" అని చెప్పెను. ఈప్రసంగమున నింగ్లీషువారికిని, బంగాళీలకును బరస్పరసమ్మేళనసౌకర్యముల ననుసరించి వాద మారంభ మయ్యెను.

హారా— బంగాళీలదే తప్పు! ఇన్నిదురాచారములు, నిన్నిదుష్పద్ధతులును గల మన మింగ్లీషువారితోఁ గలసి యుండుటకు యోగ్యులము కాము !

గోరా— మీమాటయే నిజమైనచో నింతటియయోగ్యుల మగు మన మింగ్లీషు వారితోఁ గలియఁగలము నని యాత్రపడుచుండుట లజ్జాకరము గాదా ?

హారా— కాని యోగ్యులగువారే వారియొద్ద గౌరవమును బడయుచుందురు. వీరివలెనే— మనపరేశబాబు తనయలవలెనే !

గోరా— ఒక్కరికిమాత్రము కలుగుగౌరవమువలన నన్యులకగౌరవము కలుగుచున్నప్పుడు నేనట్టిగౌరవము నవమానముగనే పరిగణింతును !

ఆయిరువురు నిట్లువాదించుకొనుచుండఁగా సుచరిత దూరమునందుండి విసనకఱ్ఱ చాటునుండి యేకాగ్రదృష్టితో గోరావంకఁ జూచుచుండెను. అట్లు రెప్పవ్రాల్పక చూచుచున్నట్లు గ్రహింపఁగలిగియేయున్నయెడల సుచరిత సిగ్గుపడియే యుండును. కాని యప్పు డామె యాత్మవిస్మృత యైపోయుండెను. గోరా యప్పుడు తన బాహుద్వయము టేబిలుపై సాచి ముందునకు వంగి కూర్చుండి యుండెను. అతని ప్రశస్త శుభ్రలలాటముపై దీపకాంతి ప్రసరించుచుండెను. అతని మొగమున నొకప్పు డవజ్ఞాపూర్ణ మగుహాసమును, నొకప్పుడు ఘృణాపూర్వకమగు భ్రుకుటియును దరంగితములగుచుండెను. అతనిముఖమునందలి ప్రతిభాగమునందును నాత్మగౌరవ ముపలక్షితమగుచుండెను. అతనిమాటలు కేవలము సామయికతర్కములును, నాక్షేపోక్తులును మాత్రమే కావు; అతని ప్రతిభాషణమునందును జిరంతనవిజ్ఞానమును, జిరకాలానుభవమును నిస్సందిగ్ధరూపమున మూర్తీభవించి యుండెను. ఆమాటల యందు ద్వైధీభావము గాని, దౌర్బల్యము గాని యాకస్మికత్వము గాని యగుపడుట లేదు. అతని కంఠస్వరమే కాక ముఖమండలమును; సమస్తశరీరమును దృఢభావమును బ్రకటించుచుండెను.

సుచరిత యది యంతయు నాశ్చర్యముతోఁ జూచుచుండెను, విశేషమానసికత్వమును, విశేషపౌరుషత్వమును గలయొకపురుషునిఁ గాంచఁగలుగుట యామె జీవితమునం దిదియే మొదటిసారి. గోరాకుఁ బ్రతిపక్షమునం దున్నహారానబాబు చాల లోకువగా నగపడుచుండెను. అతని ముఖశరీరాకృతులును, హావభావములును, వేషభాషణములును గూడ హాస్యాస్పదములుగాఁ దోఁచుచుండెను. ఇన్నాళ్ళనుండియు వినయుని వలన గోరా సంగతులను దెలిసికొని యాతఁ డొకవిశిష్టమతపురుషుఁడును, విశిష్టసమాజము

నతను సంబంధించిన యసాధారణపురుషుఁ డని సుచరిత భావించుకొని యుండెను. అతనిచే నేకానేకవిధములగు దేశక్షేమము సాధింపఁబడు ననికూడ నామె నిశ్చయించుకొని యుండెను. ఆమె యిప్పు డేకాగ్రదృష్టితో గోరాను సమస్తసమాజములకును, సమస్తమతములకును, సమస్తదేశములకును వేఱుచేసి కేవలము గౌరమోహనునిఁగనే కాంచుచుండెను. పూర్ణచంద్రునిఁ గాంచినతోడనే సమస్తప్రయోజనములను, సమస్తవ్యవహారములను నతిక్రమించి సముద్ర ముప్పొంగిపోవునట్లే, గౌరమోహనునిం గాంచి సుచరితహృదయ మిప్పుడు సమస్తాలోచనములను, సమస్తసంస్కారములను, సమస్తజీవితమును నతిక్రమించి సమస్తమును మఱచి సమస్త స్వరూపముతో నుచ్ఛ్వసితమై పోవుచుండెను. మానవుఁ డన నెట్టివాఁడో, ఆత్మ యన నేమో యామె యిప్పుడే ప్రప్రథమమునఁ గ్రహింపఁగలిగెను. అందుచే నామె యిప్పుడు తన్నుఁ దానే మఱచి యుండెను.

సుచరిత తన్మయత్వమును హారానబాబు గుర్తించెను. అందుచేఁగూడ నాతని వాదశక్తి విజృంభింపఁజాలకపోయెను. అతఁడు మిగుల నధీరుఁడై చటాలున లేచి రెంతో యాత్మీయునివలె "ఒకసారి లోనికిరమ్ము! నీతో మాటలాడవలసి యున్నది!" అనియెను.

సుచరిత తన్నెవ్వరో యాకస్మికముగఁ గొట్టినట్లుగా నదరిపడియెను. హారానబాబునకు సుచరిత నట్లు పిలుచుటకుఁ దగినంతచనవు లేకపోలేదు. మఱియొకప్పు డట్లు పిలిచినచో నామెకును సంశయము లేకయుండును. కాని యిప్పుడు గోరా వినయులయెదుట నుండుటచే నామె కామాట యవమానకరముగాఁ దోఁచెను. విశేషించి యామె వదనమువంక నే యేకమనస్కుఁడై చూచుచున్నగోరా యామె యిప్పటి హారానునిమాట కసహ్యపడుచున్నట్లు గ్రహించెను. మొదట నామాట విననట్లే యామె మౌనముతోఁ గూర్చుండి యుండెను. అప్పుడు హారానుఁడు మరల విరక్తకంఠస్వరముతో "వినఁబడలేదా ? నీతో మాటాడవలసి యున్నది ! లోనికి వచ్చెదవా ?" అనియెను.

సుచరిత యాతని మొగమువంకఁ జూడకయే "ఇప్పుడు కాదు—తండ్రిగారు వచ్చెదరు ! అప్పుడు మాటాడవచ్చును ?" అనియెను.

వినయుఁడు లేచి "మేము పోవుదమా ?" అనియెను.

సుచరిత తత్తరముతో "వలదు; వినయబాబూ ! లేవవలదు ! తండ్రిగారు మిమ్ముల నుండుఁడని చెప్పియున్నారు. ఇప్పుడే వచ్చెద నని చెప్పిరిగదా !" అనియెను. వేటకాని చేతిలోఁ బడిపోవుచున్న విభీతహరిణీస్వరముంబోలి యప్పటియామె కంఠస్వరమున వ్యాకులానునయభావము విస్పష్టమగుచుండెను.

"నేనిఁక నుండఁజాలను; పోయెదను" అని హారానుఁడు తొందరగా వెడలిపోయెను. కోపముతో వెడలిపోయెను గాని యానిముసమునందే యాతనికిఁ బశ్చాత్తాపము కలిగెను. కాని మరల లోనికి వచ్చుట కుపాయ మేమున్నది? హారానబాబు పోవు

నప్పుడు సుచరిత గభీరలజ్జారక్తవదనమండలము నవనతముగఁ జేసికొని కూర్చుండియుండెను. ఏమనవలయునో, యేమిచేయవలయునో యామె భావింపనేలేదు. ఆసమయమున నామె నెమ్మొగమును స్పష్టముగఁ జూచుటకు గోరా కవకాశము కలిగెను.

చదువుకొన్న కాంతలు ప్రగల్భతయు, నౌద్ధత్యమును గలిగియుందు రని గోరా యూహించి యుండెను. కాని యిప్పుడు సుచరితముఖవిలాసమునందు ఛాయామాత్రము గనైన నటిభావ మున్నదా? ఆముఖమునందు సముజ్జ్వలబుద్ధిశక్తియే నిస్సందేహముగఁ బ్రకాశితమగుచుండెను. ఆకోమలసుందరవదనము లజ్జానమ్రత్వములచే నెంతటి మనోజ్ఞకళలసితమై యున్నది! ఆముఖకాంతి యెంతసుకుమారమైనది! కనుబొమ్మలపై నున్న యానున్నని లలాటము శరదాకాశఖండమువలె నెంతనిర్మలమై, యెంతస్వచ్ఛమై యున్నది! ఆమెయోష్ఠాధరపల్లవము లచంచలములుగనే యున్నవి; కాని యాయనుచ్చారితవచనమాధుర్యము వానినడుమఁ గోమలకోరకమువలె నెట్లు భాసిల్లుచున్నది! నాగరికరమణీమణుల వేషభూషణముల నిదివఱకెన్నఁడును గోరా యింతస్పష్టముగాఁ జూచియుండలేదు. అట్టివానియందాతని కసహ్యభావముకూడ నుండెను. ఇప్పుడు సుచరితరమణీయదేహమునందలి నూతనరచనలుగల దుస్తులయలంకార మాతనికన్నులకుఁ జాల బాగుగనే యగపడియెను.

సుచరితచేయియొకటి టేబిలుపై నుండెను. ఆజాకెట్టుజాలునడుమనుండి కానవచ్చుచున్న యాకోమలకరపల్లవ మామెకోమలహృదయమునుండి వెడలివచ్చిన శుభసంవాదమో యనునట్లుగా గోరా కనుభవమగుచుండెను. దీపప్రకాశిత మగునాకాంతసంధ్యాసమయమున సుచరితను బరివేష్టించియున్న యామందిరమునందలి కాంతియును, కుడ్యములయందలి చిత్రప్రతిమలును, గృహోపకరణరచనయు, గృహాలంకారమును నొకవిధమగువింతసౌందర్యమును వహించియున్నట్లు గోరాకు దోఁచెను. ఆగృహమంతయు సేవానిపుణ యగునారీమణి శ్రద్ధాస్నేహోపచారములచే సౌందర్యమండితమై గోరాకన్నులయెదుట నిమిషములోఁ బ్రత్యక్షమైనట్లగపడుచుండెను. చూచుచుండఁగనే క్రమముగా నాతనికి సుచరితకపోలములయందలి చెదరినముంగురులు మొదలు, పాదముల జీరాడుచీరకుచ్చెళ్ళవఱకును గలసమస్తమును దివ్యసౌందర్యమయముగను, విశేషతేజోమయముగను గానవచ్చుచుండెను. ఒక్కసారిగా నామె సమగ్రశరీరసౌందర్యమును బ్రత్యేకాంగకస్వతంత్రసౌందర్యమును గోరాదృష్టుల నాకర్షించివైచెను.

కొంతసేపటివఱకు నెవ్వరు నేమియు మాటాడఁజాలక యొక్కటే విధముగ గుంఠితులై యుండిరి. అప్పుడు వినయుఁడు సుచరితవంకఁ జూచి వెనుకఁ దామే మాటాడుకొన్న ప్రస్తావము నెత్తి "సుచరితా! మనము మనదేశమునుగూర్చి గాని, మనస

మాజనులనుగూర్చి గాని యేమియు నాశపడుట కవకాశము లేదనియు, నెప్పటికిని రక్షితబాలకులవలె నింగ్లీషువారి రక్షణమునందే నియుక్తులమై యుండవలసియుందు మనియు నీ కాదినమున జెప్పియుంటిని. మన దేశములో జాలమంది యభిప్రాయముకూడ నిదియే. ఇట్టిస్థితిలో మానవుడు స్వార్థపరుడైన గావలయును! ఉదాసీనుడైన గావలసి యుండును. నేనిట్లు నిశ్చయించియే గోరా తండ్రి నెట్లయిన బలవంతపెట్టి ప్రార్థించి యొక యుద్యోగమును సంపాదింపవలయు నని తలంచితి. కాని గవర్నమెంటునౌకరీ నీవు చేయవలదని గోరా నన్ను నిరోధించెను—”

ఆమాటకు సుచరిత మొగమునందు దోచినయాశ్చర్యచ్ఛాయం జూచినతోడనే గోరా “గవర్నమెంటుపై గోపముచే నేనిట్లు చెప్పితి నని భావింపవలదు! ఆ యుద్యోగమున జేరినతోడనే గవర్నమెంటుశక్తి తనశక్తిగనే భావించి గర్వముచే దా మీదేశస్థుల మనుమాటయే మఱచిపోవుదురు! దినములు గడచినకొలదియు గర్వము పెరుగుచునే యుండును!—మాబంధు డొకడు డిప్యూటీకలెక్టరుగా నుండెడివాడు. ఆయన నొకప్పుడు జిల్లాకలెక్టరు చూచి “నీతీర్పులలో జాలమందికి విడుదలలే యగుచున్నవి. కారణమేమి?” అని ప్రశ్నించెను. దానిపై నాతడు “దొరగారూ! దానికి గారణమున్నది మీరెవ్వరిని జైలునకు బంపుదురో వారిని గుక్కలుగను, పిల్లులుగను మాత్రమే మీరు భావింతురు. జైలునకు బంపవలసినవా రందఱును నాసోదరులని నేను భావింతును. ఇదియే నాతీర్పులలో శిక్షితులసంఖ్య తగ్గుటకు గారణము!” అని ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్టిడిప్యూటీకలెక్టరులును, గలెక్టరులును నిప్పుడుగూడ లేకపోలేదు. కాని క్రమముగా నుద్యోగమే జీవితమునకు బ్రధానాలంకారముగా జూచుకొను నీచనులలో డిప్యూటీలు తమదేశస్థులను గుక్కలకంటె నధములనుగా జూచుచున్నారు. వారియుద్యోగము పెరుగుచున్నకొలదియు దేశస్థులకు గేవల మధోగతి కలుగుచున్నది. ఒకరిపై నాధారపడి యున్నతినందగోరువాడు తనవారిని నీచముగా జూడవలసి యుండును. అందుచేతనే వారి కన్యాయము చేయుటకుగూడ బాధ్యుడు గావలసివచ్చును. కావున గవర్నమెంటునౌకరీవలన దేశమున కెట్టిలాభమును గలుగజాలదు!” అని గోరా బల్లపై నొకగుద్దు గుద్దెను. వత్తిదీపస్తంభము గడగడ వడకిపోయెను.

విన—గోరా! ఈబల్ల గవర్నమెంటుకాదు—ఈదీపము పరేశబాబుగారిది!

ఆమాట విని గోరా యుచ్చస్వరముతో నవ్వ నారంభించెను. ఆ హాస్యప్రబలస్వరముతో నామందిర మంతయు నిండిపోయెను. అట్లు బాలునివలె నతిప్రమరముగ నవ్వుచున్నగోరాను జూచి సుచరిత యాశ్చర్యపడియెను. “ప్రబలవిషయములను

గూర్చి బాగుగ హృదయమున భావింపఁగలవారే ప్రాణరసము పొంగిపొరలునట్లు నర్పఁగలరు!" అనుసంగతి యామెకుఁ దెలియదు.

ఆదినమున గోరా యెన్నియోవిషయములనుగూర్చి మాటలాడెను. సుచరిత మౌనముతో నున్నను నామెముఖభావమునందు సమ్మతి యగపడుటచే గోరా యుత్సాహపూరితహృదయుఁడైపోయెను. తుదకాతఁడు సుచరితనే సంబోధించి "చూడుము! ఒక్కమాట మనసునందుంచుకొనుము! మనసంస్కారములు భ్రాంతిమంతములనియు, నింగ్లీషుపద్ధతుల నవలంబించినచో మన కేవిధముగను నున్నతి లభించుట కవకాశము లేదనియు భావించుట యవివేకము. అట్లు వారిపద్ధతులను గేవల మనుకరణమాత్రముగ నవలంబించుచున్నచోఁ గ్రమముగా మనసురక్షితప్రాకారద్వారములను దెఱచి వైచుకొనుటయే యగును గాని, యసంభ్రమముగ నున్నతి యామూలమున నెన్నఁటికిని సంభవము కానేరదు. నీ వీభారతవర్షమునందే యుండుమని నేను నిన్ను వేడుఁకొనుచున్నాను. ఈభారతవర్షమునందలి గుణదోషములయొక్క ఫలమునందే సుస్థిరముగా నిలిచియుండుము! వికృతి యేమైననున్నచో లోపలియుండియే పరిశోధించుటకుఁ బ్రయత్నింపుము! సర్వదా, సర్వధా దీనినే చూచుచుండుము! భావించుచుండుము! తెలిసికొనుచుండుము! ఎప్పుడును నీమొగము నావంకకే మరలించియుండుము! దానితో నైక్యమైపొమ్ము!—దీనికి విరుద్ధముగ నిలిచి వెలుపలనుండి క్రిస్టియను సంస్కారములు చిన్నతనము మొదలుగా మనయెముకలవఱకును వ్యాపించిపోవుచున్నవి. అందుచే నీసంగతి నీవెంతమాత్రము నూహింపఁజాలకున్నావు! ఈసంస్కారములను గేవలమును ద్రోసివేయవలయును. ఏవిషయమునందును వీని నెంతమాత్రమును విశ్వసింపఁరాదు!" అని చెప్పెను.

గోరా వేఁడుకొనుచుంటి నని చెప్పెను గాని, యది నిజముగాదు. అతఁ డిట్లాజ్ఞాపించెను. ఆతనిమాటలయందలి తీవ్రవేగ మితరులయంగీకారము నపేక్షించి యుండదు! సుచరిత తల వంచుకొని యంతయును వినియెను. ఇంతయాదరముతో నీమాటలను దన్నుద్దేశించియే గోరా చెప్పుటచే నామెహృదయమునం దొకవిధమగు నాందోళనయు కలిగెను. సుచరిత యప్పుడు తన సంకుచితభావమును విడిచి సహజముగా వినయునిం గాంచి "నే నెన్నఁడును దేశవిషయమున నింతగా, విశేషముగా, సత్యముగా భావించియుండలేదు! కాని యొక్కప్రశ్న చేయుచున్నాను—మతమునకును దేశమునకును సంయోగ మన నేమి? మతము దేశమున కతీతమైనది కాదా?" అనియెను.

సుచరితమధురకంఠస్వరము గోరాచెవులకు కతిమధురముగా నుండెను. ఆమె విశాలనయనములలో నాప్రశ్న మఱింతయు మధురముగాఁ దోఁచుచుండెను. అప్పుడు

గోరా "దేశముకంటె నతీతమైనదియు దేశముకంటె నధికమైనదియు నగు వస్తువు దేశమునుండియే ప్రకాశించుచున్నది. ఈశ్వరుఁ డిట్లే విచిత్రభావమునందుఁ దనయనంత స్వరూపమును వ్యక్తపఱచుచున్నాఁడు! సత్య మేకమైన దనియుఁ, గావున నేకమత సంబంధమైనదియే సత్యమనియు, ఏకమతసంబంధ మగు నేకమాత్రస్వరూపమే సత్య మనియు భావించువారు కేవలము, నేకము నగు సత్యమునుమాత్రమే గ్రహించుచుందురు—కాని యనంతమగు సత్యమును వారు గ్రహింపఁజాలరు. అనంత మగు నేకత్వ మనంత మగున నేకత్వమునందుఁ దన్నుఁ బ్రకాశింపఁజేసికొనుచున్నది. నేను నిశ్చయముగాఁ జెప్పుచున్నాను! భారతవర్షమునందలి వికృతగవాక్షములనుండియే నీవు జ్ఞానసూర్యుని సందర్శింపఁగలవు! అందుకొఱకు నీవు సముద్రములను దాఁటి పోయి క్రైస్తవారాధనమందిరము లందలికిటికీలయొద్ద గూర్చుండనక్కఱలేదు!" అని యెను.

సుచ—భారతవర్ష ధర్మకంత్రి యొకవిశేషమార్గమున దేవుని సన్నిధికిఁ గొని పోవునని మీరు చెప్పుచున్నారుగదా! అవిశేషత్వ మెట్టిది ?

గోరా—నిర్విశేషుఁడయ్యును విశేషమధ్యమున వ్యక్తుఁడగు నాతఁడే బ్రహ్మ! నిరాకారుఁ డగు నాతని యాకార మనంతమైనది. హ్రస్వదీర్ఘస్థూలసూక్ష్మానంతప్రవాహ మాతనిదే. అనంతవిశిష్టుఁడగు నాతఁడు నిర్విశిష్టుఁడు. అనంతరూపుఁడగు నాతఁ డరూపుఁడు! ఇదియే భారతవర్షధర్మవిశేషము. ఇతరమతము లన్నియు నయ్యీశ్వరుని గొందిగనో గొప్పగనో యేదోయొక విధముగ నేకమాత్రవిశేషమధ్యమున బంధించుటకుఁ బ్రయత్నించుచుండును. భారతవర్షముకూడ నీశ్వరుని విశేషమధ్యమునఁ గనుఁగొనవలయునని ప్రయత్నించుచుండును గాని యావిశేషమే యేకమాత్ర మనియుఁ నేకప్రధానమనియును బరిగణించుట లేదు. ఈశ్వరుఁ డావిశేషమున కనంతగుణము లతిక్రమించియున్నాఁడనుమాట భారతవర్షమునందలి యేధర్మస్థుఁడు నెప్పుడు నంగీకరింపకుండ నుండఁజాలఁడు!

సుచ—సరే జ్ఞానియగువాఁ డట్లుచేయును. అజ్ఞానియో ?

గోరా—అజ్ఞాని యగువాఁడు సమస్తసత్యమును, సమస్తదేశమును గూడ వికృతముగనే చూచు నని నేనిదివఱకే చెప్పితిని.

సుచ—కాని మనదేశమునుండి యావికార మింకను దూరముగఁ బోలేదా ?

గోరా—పోవును. ధర్మసంబంధము లగుస్థూలసూక్ష్మములును, బహిరంతరములును, దేహాత్మలును గలసియే పరిపూర్ణధర్మ మని తెలిసియుండియు సూక్ష్మమును గ్రహింపఁజాలనివారు స్థూలమును, దీసికొని యనేకాద్భుతవికారఘటనములను గావించుచుందురు. కాని యెవ్వఁడు రూపమునందును, నరూపమునందును, స్థూలమునందును,

నాత్మమునందును, ధ్యానమునందును, ప్రత్యక్షమునందును గూడ సత్యమైయుండెనో యట్టివానిని మనోవాక్కాయకర్మములచే సాధించుటకై భారతవర్షము సర్వతోభావముగ నద్భుతప్రబలప్రయత్నములను జేయుచున్నది! ఇప్పట్టున మనము యూరపుఖండ సంబంధమగు నష్టాదశశతాబ్దికమైన యాస్తిక్యనాస్తిక్యసమ్మిశ్రితమగు నొకసంకీర్ణనీరస వికారమతమునే యేకమాత్రశరణ్యముగ నవలంబించుట సమంజసము కాదు.

సుచరిత యేమియు మాటాడకూరకుండెను. గోరా మరల "నీవు నన్ను దురభిమానినిగా భావింపవలదు. హిందూమతసంబంధమున దురభిమానులగువారు చెప్పునట్లు నేను చెప్పుటలేదు. భారతవర్ష సంబంధము లగు నానావిధప్రదర్శనములయందును, విచిత్రచేష్టితములయందును నొకపథముగా గభీరమును, బ్రహ్మాండమునగు నైక్యమును గాంచి యాయానందముచే నేనున్మత్తుడనై పోవుచుందును. ఈయైక్యానంద పారవశ్యముచేతనే భారతవర్షమునందలి మూఢజనులతోఁగూడఁ గలసిపోవుటకు నాకెట్టిసంకోచమును గలుగుట లేదు. వారందఱును భారతవర్ష సందేశమును గ్రహించినను గ్రహింపకపోయినను సరియే—నేను నాభారతవర్షమునం దండప్రీతితోడ నేకమై యుందును. వారికి నాసర్వస్వమునందును స్వత్వ మున్నది! వారందఱిలోనను గూడఁ జిరంతనభారతవర్షనిగూఢాంతర్భావము నియతకార్యచరణము గావించుచునే యున్నదనుటకు నాకెట్టిసంశయమును లేదు" అనియెను. అతని గభీరకంఠస్వరమునకు మందిరమును, గోడలును, బల్లలును, సకలవస్తువులును గూడఁ గంపించిపోవుచుండెను.

ఈమాటలన్నియును సుచరితకు స్పష్టముగా బోధపడునట్టివి కావు. కాని యనుభూతిసంబంధమగు స్పష్టసంచారము ప్రప్రథమమున నతిప్రబలవేగముకలదై యుండును. జీవనమనునది కేవలము నాలుగుగోడలనడుమను గాని సమాజమధ్యమునఁ గాని బంధింపఁబడునది కాదని దెలిసికొనుట సుచరితహృదయమునకుఁ బీడాకారముగానుండెను.

ఇంతలో మెట్లయొద్ద స్త్రీలనవ్వులతోఁ గూడినపదశబ్దములు విననయ్యెను. వరదాసుందరిని, బిడ్డలను వెంటఁబెట్టుకొని పరేశబాబు వచ్చియుండెను. మెట్లనెక్కుచుండఁగా సుధీరుఁ డేదియో పరిహాసము చేయుటచే నా కాంతలలో హాసధ్వని బయలుదేఱెను. లావణ్యయు, లలితయు, సతీశుఁడును నింటఁ బ్రవేశించినతోడనే గోరానుజూచి నివ్వెఱపడి నిలిచిపోయిరి. లావణ్య యటనుండియే వెడలిపోయెను. సతీశుఁడు వినయునికుర్చీయొద్ద నిలువఁబడి యాతనితో నేమేమో విస్రంభాలాపము లాడుచుండెను. లలిత సుచరితవెనుకను గుర్చీ నానుకొని యామె వెనుక నగపడియు నగపడనట్లు కూర్చుండెను.

పరే—నేనుమరలివచ్చుట కాలస్యమైపోయినది! పానూబాబు వెడలిపోయెనా?

సుచరిత యాప్రశ్న కెట్టియుత్తరము నీయలేదు. అప్పుడు వినయుఁడు "ఔను. ఆతఁడాహాస్యమును సహింపఁజాలకపోయెను!" అనియెను. అంతలో గోరా లేచి "ఇఁక మేము సెలవు గైకొందుము!" అని చెప్పుచు వినతుఁడై పరేశునకు నమస్కరించెను.

పరే—నేఁడు మీతోఁ గలసియుండుట కవకాశము కలిగినదికాదు. బాబూ! అప్పుడప్పుడు తెలిపి చేసికొని యొకసారి వచ్చుచుండుఁడు!

గోరాయును, వినయుఁడును వెడలిపోవుట కుద్యమించుచుండఁగా వరదాసుందరి వచ్చెను. ఇరువురు నామెకు నమస్కారము చేసిరి. అప్పుడామె "మీ రిప్పుడే పోయెదరా?" అని ప్రశ్నించెను.

గోరా—ఔను!

వర—వినయబాబూ! నీవు భోజనము చేసి పోవుదుగాని—నీతో మాటాడ వలసినపని యున్నది?

సతీశుఁడు గంతులు వైచుచువచ్చి వినయునిచేయి పట్టుకొని "ఔను; మాయమ్మ వినయబాబును బోనీయదు! ఆతఁడీరాత్రికి మాయింటనే యుండును!" అనియెను. వినయుఁడు కుంఠితుఁడై మారుమాట చెప్పఁజాలకుండుటం గాంచి వరదాసుందరి గోరాను జూచి "వినయబాబునుగూడ మీరు వెంటబెట్టుకొని పోయెదరా? ఈతనితో మీకావశ్యకమగుపని యున్నదా?" అని ప్రశ్నించెను.

గోరా—ఏమియును లేదు—వినయా! నీవుండుము! నేనుపోయెదను!

అని చెప్పి గోరా వెడలిపోయెను. వినయు నాఁపుమని వరదాసుందరి గోరాను గోరుచున్న సమయమునందే యొకసారి వినయుఁడు లలితవంకఁ జూడకుండ నుండఁజాలకపోయెను. లలిత చిఱునగవుతో మొగము మరల్చుకొనియెను. లలిత కావించుచుండు నిట్టిలేంతలేతనవ్వుఁజిఱునవ్వులబరిహాసముల నెదిరించుటకు వినయుఁడు సమర్థుఁడు కాఁజాలకుండెను—ఇప్పటి లలితచిఱునగవు గోడిమోరచూపాతనికి మతి యొకవాఁడిబాణ మయ్యెను. అప్పుడు లలిత మృదులస్వరముతో "వినయబాబూ! మీరీదినమునఁ దప్పించుకొని పోయిన బాగుగ నుండును!" అనియెను.

విన—ఏమి?

లలి—అమ్మ మిమ్ము విపత్తునఁ బడద్రోయఁ జూచుచున్నది. జిల్లాకలెక్టరు వారి ప్రదర్శనసమ్మేళనసమయమున నాటకమును బ్రదర్శించుట కొకయభినేత తక్కరగా నున్నాఁడు. అమ్మ యాదుకొఱకు మిమ్మేర్పాటు చేసికొన్నది.

వినయుఁడు వ్యస్తభావముతో "ఎంతపనిజరిగినది! ఈపని నావలనఁగాదు!" అనియెను.

లలి—(నవ్వుచు) ఆసంగతి నేనమ్మతో ముందే చెప్పితిని. ఈయభినయమున బ్రవేశించుటకు మిమ్ములను మీ మిత్రుఁ డంగీకరింపనీయఁ డనికూడఁ జెప్పితిని!

వినయునకు మతియొక యాఘాత మయ్యెను. అతఁడు "నామిత్రునిమాట య టుంచుము! సప్తజన్మములనుండి యెన్నఁడును నే నభినయ మన నేమో యెఱుంగను! నన్నేల బలవంతపెట్టెదరు?

లలి—జన్మజన్మాంతరముల నభినయించియే వచ్చితి మని మేమందఱము ననుకొనుచున్నాము!

ఇంతలో వరదాసుందరి వచ్చెను. లలిత యామెం గాంచి "అమ్మా నీవూరక ముందుగా వినయబాబు నభినయమునకుఁ బిలువఁదలఁచితివి. అతనిమిత్రుఁ డంగీకరించినతరువాత నైనచో—" అనియెను.

వినయుఁడు కాతరస్వరముతో "ఇందు మిత్రునియంగీకారముతో నావశ్యకము లేదు. అభినయించుటకు నాకు సామర్థ్యము లేదు!" అనియెను.

వర—అందుకొఱకు మీరు సంశయింపవలదు. మేము ముందుగ మీకు నేర్పియే తీసికొనిపోవుదము! చిన్న చిన్న బిడ్డలకే తెలియుచున్నప్పుడు మీకుఁ దెలియదా?

వినయునకిఁకఁ దప్పించుకొనుట కుపాయము లేకపోయెను.

## ౨౧

గోరా స్వాభావిక వేగమును విడిచి యన్యమనస్కుఁడై మెల్లమెల్లగ నడచుచు నింటికిఁ బోవుటకు సహజమార్గమును వదలి చాలసేపు తిరిగి తిరిగి గంగయొడ్డురోడ్డును బట్టి పోవుచుండెను. ఆ కాలమునాఁటికి గంగానదీజలప్రదేశమునఁగాని, గంగాకూలస్థలప్రదేశమునందుఁగాని వర్తకసభ్యతాసంబంధములు లాభలోభ మాక్రమించుకొని యుండలేదు. అప్పటికింకను గంగాతీరముపై రైలుగాని, గంగానీరముపై వంతెనగాని కల్పింపఁబడియుండలేదు. అప్పటి శీతకాలసంధ్యాసమయములందు నగరనిశ్వాసకాలుష్య మాకాశము నింత నిబిడముగా నాక్రమించుకొనుట లేదు. అప్పటిగంగానది బహుదూరమునందలి నిర్జన హిమాలయశిఖరమునుండి కలకత్తానగర ధూళిప్రవ్యస్తతామధ్యమునకు శాంతిసందేశమును మోసికొని తెచ్చుచుండెను.

గోరామనసు నాకర్షించుటకుఁ బ్రకృతి కింతవఱకెన్నఁడును నవకాశము కలుగలేదు. గోరాహృదయ మెప్పుడును స్వకార్యాలోచనములలోనే కొట్టుకొనిపోవుచుండెను. దాని కీస్థలజలాకాశములతో నెంతమాత్రము నిమిత్తమే లేకపోయెను. అది వీనిని లక్ష్యము చేయుటయే లేదు. కాని, యిప్పుడు గంగాజలోపరిభాగమునందలి యాకాశము తననక్షత్రములచే నభిషిక్తమై యున్న యంధకారమూలమున నాతనిహృదయమును నిశ్శబ్దముగా స్పృశింప నారంభించెను. గంగానది నిస్తరంగితమై యుండెను.

తీరమునందలి కొన్ని నౌకలలో దీపములు వెలుఁగుచుండెను; కొన్ని దీపహీనములై యుండెను. తీరమునందలి దట్టములగు చెట్లగుంపులోఁ గాఢచ్ఛాయ ఘనీభూతమై యుండెను. వానిపై భాగమున బృహస్పతిగ్రహ మంధకారాంతర్యామిఁబోలి యనిశమును వీక్షించుచున్న తీక్ష్ణవేధదృష్టితో సుస్థిరమై యుండెను.

ఇప్పుడీ ప్రగాఢనిస్తబ్ధప్రకృతి గోరాహృదయశరీరముల నభిభూతములుగాఁ జేయుచున్నట్లుండెను. గోరాహృత్పిండస్పందనముతో సమతాళమున నాకసమునందలి విరాడంధకారమూర్తి నర్తనము చేయుచుండెను. ప్రకృతియింతకాలమునకు ధైర్యమువహించి గోరాయంతఃకరణమునందలి యేద్వారము తెఱవఁబడియెనో గాని యాద్వారమును నిమిషములోఁ బ్రవేశించి భద్రతాప్రపూర్ణమగు నాతనిహృదయదుర్గము నాక్రమించుకొనియెను. గోరా యింతకాలమువఱకును దనవిద్యాబుద్ధులచేతనే యాలోచించి పనులను గావించుచుఁ గేవలమును స్వతంత్రుఁడై యుండెను—ఇప్పు డేమైనది ? అతఁ డిప్పు డొక్కించుక ప్రకృతి నంగీకరించినమాత్రముననే గభీరమగునీనీలజలమును, నిబిడమగు నీనీలకూలమును, సముదారమగు నీనీలాకాశమును నాతని నొక్కసారిగా నావరించుకొనియెను! కావున నాతఁ డిప్పుడు ప్రకృతికట్లో లొంగిపోయెను.

వీధిప్రక్కనున్న వర్తకశాగ్యస్థానమునందలి యుద్యానమున విదేశలత యొకటి యపరిచితములగు పుష్పములనుండి వెలువడు కోమలసుగంధపరిమళములచే గోరావ్యాకులహృదయమునకై హస్తప్రసారణము గావించుచున్నట్లుండెను. ఆ గంగానది యాతని కేలోకాలయకర్మక్షేత్రమునుండి దూరముననున్న యొకయనిర్దేశ్యస్థానము నంగుళినిర్దేశమునఁ జూపించుచున్నట్లుండెను. ఆయనిర్దేశ్యస్థానమున నిర్జననదీతీరమునందలి వృక్షములు శాఖలచే దట్టముగ నొండొంటి నలముకొని వింతపూవులను బూచియుండెను; వింతనీడలను బ్రసరించి యుండెను. అచ్చటి నిర్మలనీలాకాశముక్రిందిపగళ్ళు వికచనయనదృగ్విలాసములంబోలియు, రాత్రులు లజ్జావనతనయన పక్ష్మచ్ఛాయలంబోలియు విలసిల్లుచుండెను !-నలుదెసలనుండియు మధురావర్తములు బయలుదేఱి యపూర్వశక్తులతో నాతని నాకర్షించి యిదివఱకెన్నఁడు నెట్టిపరిచయమును లేనిగభీరస్థానమునకు గొనిపోవుచున్నట్లయ్యెను! ఒక్కసమయమునందే యాతనిసమస్తహృదయమును వ్యథావర్షములతో నీవైపునుండి యావైపునకుఁ గొట్టుకొనిపోవుచుండెను. ఇప్పుడీ హేమంతనిశాసమయమునందు—ఈ నదీతీరమునందు—ఈ యవ్యక్తనగరకోలాహలమునందు—ఈ యస్ఫుట నక్షత్రాలోకమునందు—విశ్వవ్యాపినియు, నవగుంఠితయు, నజ్ఞాతయు నగునొకమాయావినిసాన్నిధ్యమున గోరా యాత్మవిస్మృతుఁడై నిలువఁబడి యుండెను. ఇంతవఱకు నీతఁ డీమాయాదేవిని నంగీకరింపఁ బోవుటచేతనే యిప్పు డామె శాసనబంధమగునింద్రజాలము తనసహస్రవర్ణసూత్రములతో గోరాను జలస్థలాకాశసహితముగా

నలుదెసలనుండియు బంధించివైచెను! గోరా తన్నుఁగూర్చి తానే విస్మితుఁడైపోయి యా నిర్జనవీథీఘట్టమునం దొక సోపానముపైఁ గూలఁబడిపోయెను.

అతఁ డప్పుడు తనలో "నాజీవితమునం దీక్రొత్తయనుభవ మేల కలిగినది? దీని తో నేమైనఁ బ్రయోజన మున్నదా? నాజీవితసంకల్పానుసారముగా నాహృదయమునఁ బదిలపఱచుకొన్న విధిబంధములలో దీనికిఁ గూడ నెచ్చటనైనఁ జోటున్నదా? లేక యిది వానికి విరుద్ధమైనదా? అయినచో దీనితోఁ బోరాడి జయముందఁగలనా?" అని యీవిధముగా దృఢముష్టియై ప్రశ్నించుకొనుచుండెను. ఆక్షణమునందే సుస్నిగ్ధకోమలనయనములనుండి వెలువడిన విజ్ఞానోజ్జ్వలంబును, వినమ్రకోమలంబును, విభావసుందరంబును, విసంవాదపూర్ణంబును నగునొక మనోజ్ఞదృష్టి యాతనిమనోమధ్యమునందాకస్మికముగ జాగరిత మయ్యెను. అనింద్యసుందరమగు హస్తపల్లవమునందలి కోమలాంగుళిస్పర్శ సౌభాగ్యసంబంధ మగునొకానొకయనాస్వాదితమధురసుధారస మాతని ధ్యానసమ్ముఖమునను పలక్షిత మయ్యెను! గోరాసమస్తశరీరమును బులకితమైపోయెను! ఏకాకియై యున్నయాతని నాయంధకారమధ్యమునందలి ప్రగాఢానుభవము సమస్త ప్రశ్నలనుండియు, సమస్తద్విధీభావములనుండియును మరల్చివైచెను. అప్పుడాతఁడా నూతనానుభవమును మనఃపూర్వకముగ ననుభవించుచుండెను. దీనినిఁ ద్యజింపవలయు నను కోరిక యాతనికిఁ గలుగనేలేదు.

గోరా యింటికిఁ బోవునప్పటికిఁ జాలరాత్రి యయ్యెను. ఆనందమయి యాతనిం గాంచి "బాబూ! భోజనమునకు వేళ మించిపోయినది. ఇంతరాత్రివరకు నేమిచేయుచుంటివి?" అనియెను.

గోరా—నాకు నేమైపోయినదో నాకుఁ దెలియుటలేదమ్మా! చాలసేపటివరకును గంగయొడ్డున నే కూరుచున్నాను!

ఆనం—వినయుఁడుకూడ నున్నాఁడా?

గోరా—లేఁడు! నేనొంటిగనే యుంటిని.

ఆనందమయి కది యత్యాశ్చర్యముగా నుండెను. గోరా యిదివఱకెన్నఁడును నిష్ప్రయోజనముగ నింతరాత్రికలకును గంగయొడ్డునఁ గూర్చుండి యుండలేదు. అతఁ డూరక కూర్చుండి యాలోచించు స్వభావముకలవాఁడు కూడఁ గాఁడు. భోజనము చేయునప్పుడు కూడ గోరా యన్యమనస్కుఁడైయుండుట యామెకు సంకోచముగా నుండెను. ఆనందమయి కొంతసేపైనతరువాత మెల్లగా "నేఁడు నీవు వినయునియింటికిఁ బోయితివా?" అనియెను.

గోరా—లేదు. నేఁడు మేమిరువురమును బరేశునింటికిఁ బోయితిమి.

ఆమాటవిని యానందమయి కొంతసేపాలోచించి "ఆయింటివారందఱితోడను నీకుఁ బరిచయ మైనదా ?" అని ప్రశ్నించెను.

గోరా—ఐనది !

ఆనం—ఆయింటిలోని యాఁడువాండ్ర కవరోధము లేదఁటగాదా ?

గోరా—ఎంతమాత్రమును లేదు.

ఇదివఱ కిట్టిప్రశ్నలకు గోరా తీవ్రముగఁ బ్రత్యుత్తర మిచ్చెడివాఁడు. ఇప్పు డట్టిలక్షణము కాన రాకుండుటచే నానందమయి మరల నూరక కూర్చుండి యాలోచింపఁ దొడంగెను.

మఱునాఁటియుదయమున గోరా యెప్పటివలెఁ బెందలకడలేచి ముఖప్రక్షాళనము చేసికొని తనపనులయందుఁ బ్రవేశింపలేదు. అతఁడు తనగదిలోనికిటికీని దెఱచుకొని కొంతసేపటివఱకును నిలువఁబడి తూర్పువైపునఁగల వీథివంకఁ జూచుచుండెను. ఆవీథికిఁ దూర్పుభాగమునం దొకపాఠశాల యున్నది. ఆపాఠశాలయావరణమునందు స్నిగ్ధపురాతన జంబూవృక్షముపైఁ బలుచని తెల్లనిమంచు క్రమ్ముకొని యుండెను. క్రమముగ నుదయారుణకిరణములు వ్యాపించి గోరా చూచుచుండఁగనే కొంతసేపటికా మంచుతెరను వదల్చివైచెను. ప్రభాతబాలాతప మాతరుపత్రములనుండి మిలమిల మెఱయుచుండెను. చూచుచుండఁగనే గలకత్తానగరవీథు లన్నియును జనకోలాహలప్రపూర్ణము లైపోయెను.

ఇంతలో నవినాశుఁడు కొందఱుశిష్యులతోఁ గలసి వచ్చుచు సందుమలుపునం దగపడి గోరాభావావేశజాలమును బలవంతముగాఁ ద్రెంపివైచెను. అప్పుడు గోరా తనమనసును దానే నిందించుకొనుచు 'ఈపద్ధతి యేమియును బాగుగలేదు! ఈయాలోచన కెన్నఁటికి నెడమీయఁగూడదు!' అని యనుకొనుచు గదినుండి వెలుపలికిఁ బోయెను. తన సమాజమువారింటికి వచ్చునప్పటి కసంసిద్ధుఁడై యుండుట గోరా కిదివఱ కెన్నఁడును దటస్థించి యుండలేదు. ఈసామాన్యాపచారమునకే గోరా తన్ను నిందించుకొనియెను. ఇఁక నెన్నటికిని బరేశునింటికిఁ బోఁగూడ దనియు, వినయునితోఁ గొంతకాలమువఱకును గలసి యుండఁగూడదనియు నాతఁ డప్పుడు మనసులో నిశ్చయించుకొనియెను. తరువాత నాతఁడు తనసమాజమువారితోఁ గలసి యొకనిశ్చయము చేసికొనియెను. ఒకరిద్దఱు మిత్రులతోఁ గలసి గోరా వెంట నొకదమ్మిడీయైనఁ దీసికొనకుండ మార్గమధ్యమున దొరకెడుయాతిథ్యమును గ్రహించుచు గ్రాండుట్రంకు రోడ్డునుబట్టి కొంతకాలము దేశసంచారము చేయుట కేర్పఱచుకొనియెను.

ఈయపూర్వసంకల్పముచే గోరా యత్యుత్సాహపూరితుఁ డైపోయెను. సమస్తబంధములను ద్రెంచుకొని యీవిధముగాఁ నిరాబాధకమార్గము నవలంబించి పోవుట

యాతనికిఁ బరమానందముగా నుండెను. అతనిహృదయము దినదినము లోలోపలనుండియే తల్లికొనియున్న జాల మీసంకల్పమాత్రమున విచ్ఛిన్న మైపోయి నట్లాతనికిఁ బొడకట్టెను. ఈసమస్తభావావేశమును మాయామాత్రము మనుజుఁ గర్మ యొక్కటియే సత్య మైనదనియు నీప్రబోధవచన మతితీవ్రముగ నాతనిహృదయమునఁ బ్రతిధ్వనించుచుండెను. అతఁడు ప్రయాణోద్యతుఁడై బడినుండి వెడలు బాలకుంబోలి తనగది నుండి బయలువెడలెను. ఆసమయమునఁ గృష్ణదయాళుఁడు గంగాస్నానము చేసి కమండలువుతో గంగాజలమును దీసికొని నామావళిని బారాయణము చేసికొనుచు నింటికి వచ్చుచుండెను. తీవ్రవేగముతోఁ బోవుచున్నగోరా యాతనిపైఁ బడినతోడనే లజ్జితుఁడై తత్తరముతో నాతనిపాదములకుఁ బ్రణామము చేసెను. “ఉండుము ఉండుము!” అని పలుకుచుఁ గృష్ణదయాళుఁడు దూరముగ జరిగెను. పూజ కాకుండఁగనే గోరా ముట్టుకొనుటవలన నాతని గంగాస్నానఫలము మంటఁ గలసిపోయినది! శౌచమును గాపాడుకొనుటకై యాతఁ డితరసంపర్కము కలుగకుండ మెలఁగుచుండె ననిమాత్రమే యింతవఱకు గోరా యనుకొనుచుండెను. కాని ముఖ్యముగాఁ దనసంపర్కమునే నిషేధించియుండె ననుసంగతి గోరా గ్రహింపనేలేదు. కృష్ణదయాళుఁడు మ్లేచ్ఛ యని యానందమయిని దూరముగఁ బరిత్యజించెను. మహిముఁ డుద్యోగమునందే మునిఁగియుండువాఁ డగుటచే నాతనితోడి సంపర్కమున కవకాశమే లేదు. ఒక్క శశిముఖిమాత్రము నాతఁడు తనయొద్దఁ జేర్చుకొని యామెకు సంస్కృతస్తోత్రములను జెప్పుచుఁ బూజార్చనావిధులయం దామెను దీక్షితురాలిం గావించుచుండెను.

కృష్ణదయాళుఁడిప్పు డిట్లు తనసంపర్కమునకు సంశయించినసంగతి స్పష్టముగా గోరాకుఁ దెలిసిపోయెను. అందుల కాతఁడు మనసులో నవ్వుకొనియెను. ఈవిధముగాఁ దండ్రితోడిసంబంధ మంతయుఁ దనకు విచ్ఛిన్నమైపోయినను, దండ్రి తనతల్లి ననాచారిణి యని యెంత నిందించుచున్నను గోరామాత్రము తల్లియగునానందమయిని బ్రాణసమానముగ భక్తిసమర్పణముం గావించి పూజించుచుండెను.

గోరా భోజనమైనతరువాతఁ గొన్నిబట్టలను మూటగట్టి బిలాతీపాటసారివలె వెన్నున కట్టుకొని తల్లియొద్దకు వచ్చి ‘‘అమ్మా! నేను కొంతకాలముదనుక సంచారము చేసి వచ్చెదను’’ అనియెను.

ఆనం—ఎక్కడకు బోయెదవు బాబూ!

గోరా—ఆసంగతి నేనింకను స్థిరపఱచుకొనలేదు.

ఆనం—పని యేమి?

గోరా—చెప్పుటకు బోధపడినపని కాదు. పోవుటయే యొకపని.

ఆనందమయి యేమియు మాటాడక యూరకుండెను. అది చూచి గోరా "అమ్మా నన్నడ్డగింప వలదని వేఁడుకొనుచున్నాను. నీకు నాసంగతి యంతయును దెలియును. నేను సన్న్యాసి నగుదు నని భయపడవలదు. తల్లివగు నిన్ను విడిచి చాలకాలము నేనొంటిగా నుండఁజాలను!" అనియెను.

తల్లియందుఁ దనకుఁ గల ప్రేమనుగూర్చి గోరా యింతవఱ కెన్నఁడును నోటితోఁ జెప్పియుండలేదు. అందుచే నాతఁ డిప్పు డించుక లజ్జితుఁ డయ్యెను. ఆనందపులకిత యగు నానందమయి యప్పు డాతనిభావమును మరలించి "బాబూ! వినయుఁడుకూడ వచ్చునా?" అని ప్రశ్నించెను.

గోరా—రాఁడమ్మా! వినయుఁడు రాఁడు. వినయుఁడు లేకున్నచో మార్గమునందును, ఘట్టములయందు నీగోరాకు రక్షణము లేదనుకొనుచున్నావు కాఁబోలును! అమ్మా! వినయుఁడే నాకు రక్షకుఁ డనినీవు పొరపాటు పడుచున్నావు! నేను నిరపాయముగ నింటికి వచ్చినతరువాతనైన నీపొరపాటును సవరించుకొనఁగలవు.

ఆనం—అప్పుడప్పు డుత్తరములు వ్రాయుచుందువా?

గోరా—వ్రాయననియే యనుకొనుము! వ్రాసినచో మంచిదే. భయము లేదమ్మా! నీగోరా నెవ్వరు నెత్తికొనిపోరు! అమ్మా! నీవు నన్నెంతయో విలువగలవానిగా భావించుచున్నావు. ఇతరులందఱు నట్లు చూడరు. ఎవ్వరైన నాయీమూటపై లోభపడినచో వారి కప్పుడే దీని నిచ్చివేసెదను. అంతే కాని దీనికొఱకు నాప్రాణదానము జేయను. ఈసంగతి నిశ్చయముగా నమ్మి యుండుము!

అని చెప్పి గోరా యానందమయిపాదములకుఁ బ్రణామము చేసి యామెపాదధూళిని దలపైఁ దాల్చెను. ఆమెయు నాతనిమస్తకముపై హస్తమునుంచి చేతిని ముద్దుపెట్టుకొనియెను. ఒక్కనిషేధవాక్యమైనను బలుకలేదు. తనకెంతకష్టముగ నున్నను నమంగళశంకచే నామెయెన్నఁడును బ్రయాణసమయమున నిషేధవాక్యములు పలుకదు. ఆమె తన జీవితమునందే యనేకకష్టసుఖముల ననుభవించినది. ఈబాహ్యప్రపంచ మంతయు నామె కపరిచిత మైనది కాదు. ఆమె హృదయమున భయ మనుమాటయే లేదు; గోరా కేమైనఁ గష్టము కలుగునను శంకయే యామెకుఁ గలుగలేదు. కాని గోరాహృదయమునం దేదియో విప్లవము కలిగినదనిమాత్ర మామె నిన్నటినుండియును భావించుకొనుచుండెను. ఇప్పటిగోరా యాకస్మికప్రయాణ మామెసంశయమునకు మఱింత తోడయ్యెను.

గోరా మూట కట్టుకొని యిల్లు వెడలినతోడనే యెఱ్ఱని జంటగులాబిపువ్వులగుత్తిని జేతఁ బట్టుకొని వినయుఁ డాతని కెదురుపడియెను. అప్పుడు గోరా "వినయా! నీశకునము మంచిదో కాదో యీప్రయాణమునందే తేలును!" అనియెను.

విన—ప్రయాణమా యేమి ?

గోరా—ఔను.

విన—ఎక్కడకు ?

గోరా—ప్రతిధ్వని ప్రత్యుత్తరము—ఎక్కడకు ?

విన—ప్రతిధ్వనికంటె మంచియుత్తరము లేదా ?

గోరా—లేదు. నీవమ్మయొద్దకుఁ బోయినచో నంతయును దెలియును. నేను పోయెదను.

అని యాతఁ డతివేగముగఁ బోయెను. వినయుఁడు లోనికిఁ బోయి యానందమయికి నమస్కరించి యామెపాదధూళి గైకొని యా గులాబిపూవుల నామె పాదములపై నుంచెను. ఆనందమయి "ఈపువ్వులెక్కడివి ?" అనియెను.

వినయుఁ డాప్రశ్నకు స్పష్టముగా నుత్తరము చెప్పక "మంచివస్తువు లభించుటచే ముందుగాఁ దల్లిపూజకొఱ కుపయోగింపఁ దలఁచితిని! అని చెప్పుచు నామె పర్యంకముపైఁ గూర్చుండి "అమ్మా! ఇదియేమి యన్యమనస్కవై యున్నావు ?" అనియెను.

ఆనం—ఎందుచే నట్లనుచున్నావు ?

విన—నీవు నాకెప్పటివలెఁ దాంబూలము నిచ్చుట మఱచిపోయితివి !

ఆనందమయి లజ్జితయై వినయునకుఁ దాంబూలము నిచ్చెను. తరువాత రెండు జాములకాలమును వారికి సంభాషణ జరిగెను. గోరాప్రయాణమునుగూర్చి వినయుఁ డొక్కమాటయైనను స్పష్టముగాఁ జెప్పజాలకపోయెను. ఆనందమయి ప్రసంగవశమున "నీవు నిన్నటిదినమున గోరాను బరేశునింటికిఁ దీసికొనిపోయితివా?" అని ప్రశ్నించెను. వినయుఁడు సర్వమును స్పష్టముగాఁ దెలియఁజేసెను. ఆనందమయి ప్రతివిషయమును మనఃపూర్వకముగాఁ దెలిసికొనియెను. వినయుఁడు సెలవు దీసికొనునప్పుడు "అమ్మపూజ సాంగమైనది. ఇంక నీచరణప్రసాదము లగు నీనిర్మాల్యకుసుమములను దలపైఁ బెట్టుకొని పోయెదను!" అనియెను.

ఆనందమయి నవ్వుచు నాగులాబిపువ్వులను వినయుని చేతి కిచ్చెను. అప్పు డామె తనలో "ఈకుసుమములు కేవలము సౌందర్యముచేతనే యింతగా నాదరింపఁబడుటలేదు—ఈ యుద్భిజ్జతత్త్వమున కతీతమగు నింకొకగభీరతత్త్వ మేదియో నిశ్చయముగా వీనిలోపల నున్నది!" అని యనుకొనియెను.

అపరాహ్ణసమయమున వినయుఁడు వెడలిపోయెను. అప్పు డాతనిహృదయమున నెన్నియోభావములు తోఁచెను. అతఁ డప్పుడు "ప్రయాణమున గోరా కెట్టియసౌఖ్యమును గలుగకుండుఁగాక ! గోరాకును నాకును గలమిత్రత్వమున కెన్నఁడు నెట్టియాతంకమును గలుగకుండుఁగాక!" అని భగవంతుఁ బ్రార్థించెను.

## ౨౨

గులాబిపువ్వులనుగూర్చి యొకచిన్నకథ యున్నది !

నిన్నరాత్రి గోరా పరేశునిల్లు విడిచివచ్చెను. కాని రాత్రి నాటకాభినయమునుగూర్చి ప్రసంగము జరిగి వినయునిహృదయమునకుఁ జాలకష్టమును గలిగించెను— ఈవిషయమున లలిత కట్టియుత్సాహమును లేకుండుటయే కాక, యీవ్యాపార మామె కెంతమాత్రము నిష్టమే లేదు. కాని యెట్లయినను వినయు నీయభినయమునం జేర్పవలయునని యామెకుఁ బట్టుదల కలిగెను. గోరాకు విరుద్ధము లగుపనులన్నియును వినయునిచేఁ జేయింపవలయునని యామె రోషముతోఁ బూనుకొని యుండెను. వినయుఁడు గోరాకు విధేయుఁడై యుండుట లలితకు మితిలేనంతయసహ్యముగా నుండెను. ఎట్లయినను సమస్తబంధములను ద్రెంచివైచి వినయుని దనకు స్వాధీనునిగాఁ జేసికొటయే జీవితమునకుఁ జరితార్థత యని యామె భావించుకొని యుండెను.

అప్పుడు లలిత లలితవేణీబంధము చలించునట్లు తలయూఁచుచు "ఏమయ్యా! అభినయమునందు దోషమేమున్నది ?" అని ప్రశ్నించెను.

విన— అభినయమున దోషము లేకుండుఁగాక! ఆదొరయింటికిఁ బోయి అభినయించుటమాత్రము నాకంతబాగుగా లేదు.

లలి— ఇది మీమనసులోనిమాటయేనా? మఱి యెవ్వరియభిప్రాయమైన జెప్పుచున్నారా ?

విన— ఇతరులమనసులోనిమాట చెప్పవలసినభార మేదియు నామీఁద లేదు. అట్లు చెప్పుటయును గష్టమే— నాయభిప్రాయమే నేను చెప్పుచున్నట్లు నీకునమ్మకము లేదు ఒకప్పుడు నాయభిప్రాయమును, నొకప్పుడితరాభిప్రాయమును జెప్పుచుందునని నీ యూహ కాబోలును ?

లలిత యీమాట కెట్టియుత్తరమును జెప్పక యొక్కించుక చిఱునవ్వుమాత్రము నవ్వి కొంచెము సేపూరకుండి "దొరగా రొకవేళ నాహ్వానించినను నిరాకరించుటయే వీరత్వమని మీమిత్రు డభిప్రాయపడును గాఁబోలును— ఈమూలముననైన నింగ్లీషువారితో యుద్ధము చేసినఫలము లభించుననికూడఁ దలంచును గాఁబోలును !" అనియెను.

వినయుఁ డుత్తేజితుఁడై లేచి "నామిత్రుఁ డట్లనుకొనకపోయినను దప్పుండదు నేనట్లే భావింతును! యుద్ధము కాకేమి? కేవలమును వారు మనల ననాదరించుచుందురు. వారు తమకడవ్రేలితో సంజ్ఞచేసి పిలిచినతమాత్రముననే మనలను గృతార్థులనుగాఁ జేసినట్లు తలంచుచుందురు. అట్టియుపేక్షాభావముతో నుపేక్షామూలముననే పోరాడకున్నచో నిఁక నాత్మగౌరవమును నిలుపుకొనుటయెట్లు!" అనియెను.

లలితయును సహజముగా నభిమానవతి! వినయుండీయభిమానవాక్యము లామె నోటిపిరియములే యైయుండెను. కాని లలిత యభిమానవతి యగుటచేతనే తనపక్షమున యుక్తిదౌర్బల్యము కలిగినప్పుడకారణముగ నతిప్రౌఢపుమాటలచే వినయుని బాహాటుని గావించుచుండును— తుట్టతుదకు వినయుండు "లలితా! ఇంతవాగ్వాద మెందులకు? "నీవభినయమున కంగీకరింపవలయును. ఇట్లంగీకరించుటయే నాయిష్టము !" అని చెప్పఁగూడదా? అట్లయినచో నీకోరికను మన్నించి నాయభిమానమును విసర్జించుకొని సుఖపడుదునుగాదా !" అనియెను.

లలి— సరిసరి! నేనట్లేల చెప్పుదును ? నిజముగా మీకొకమతమే యున్నచో నది నాకోరికకొఱకేల పరిత్యజింపఁబడవలయును? కాని యది సత్యముగా నుండవలయు ననియే నాయుద్దేశము !

విన— మంచిది. నాకు నిజముగా నెట్టియభిప్రాయమును లేదు— కాని నీవిప్పుడు నన్నుఁగోరకుండఁగనే నీవాదమునకు విజితుండనై యీయభినయమున కంగీకరించితిని

అనునంతలో వరదాసుందరి యటకువచ్చెను వినయుండామెం గాంచి "నేనీయభినయమునకు సిద్ధుండనైతిని. ఏమి చేయవలయునో చెప్పుఁడు." అనియెను.

వరదాసుందరి గర్వముతో "అందుకొఱకు మీరాలోచింపనక్కఱలేదు. మేము ముందుగా మీకు నేర్పి సిద్ధముచేసియే తీసికొనిపోవుదుము! కేవల మభ్యాసముకొఱకు మాత్రము మీరు ప్రతిదినమును నియమితకాలమునకు వచ్చుచుండవలయును! "అనియెను

విన— మంచిది ! నేఁటికి సెలవు తీసికొందును.

వర— అదియేమిమాట ! భోజనముచేసి మరిపొండు.

విన— నేఁడు భోజనము చేయను.

వర— అలాగు కాదు.

ఇఁక మాఱుమాటాడక వినయుండు భోజనముచేసెను. కాని మునుపటివలె స్వాభావికప్రఫుల్లత్వముమాత్రము లేదు. అప్పుడు సుచరితకూడ వ్యగ్రమనస్కురాలై యూరక కూర్చుండియుండెను. లలితకును వినయునకును వాదము జరుగుచున్నసమయమునం దామె వరండాలోఁ బ్రచారము చేయుచుండెను. ఆరాత్రి యింక నెట్టిసంభాషణమును జరుగలేదు. వెడలిపోవునప్పుడుమాత్రము వినయుండు లలిత గంభీరవదనమండలమునుపలక్షించి "నేనూరక యంగీకరించితిని— కాని నీకు సంతోషమునుమాత్రము గలిగింపఁజాలకపోయితిని !" అనియెను.

లలిత యెట్టిప్రత్యుత్తరమును జెప్పక వెడలిపోయెను. లలిత సహజముగా నేడ్చుటనునదేమో యెఱుంగదు. కాని యిప్పుడామె నయనకమలములనుండి కన్నీరు పొంగిపొరలిపోవుచుండెను. ఏమిజరిగినది ? ఎట్టిహాస్యపుమాటలచే మాటిమాటికిని విన

యుని హృదయమును బాధించుచుంటినని యామె యిప్పుడు స్వయముగా దుఃఖించుచున్నది కాఁబోలును ?

వినయుఁ డభినయమున కంగీకరింపకున్నంతవఱకు లలితపట్టుదల హెచ్చిపోవుచునే యుండెను. కాని యిప్పుడాతఁ డంగీకరించినంతనే యామెయుత్సాహ మంతయును దగ్గిపోయెను. అంగీకరింపకుండుటకుఁ గల ప్రబలకారణము లిప్పు డామెకు విశ్వసనీయములై యుండెనో యిప్పుడే యామెహృదయమునకుఁ బరితాపము కలిగెను. అందుచేతనే యామె తనలో "కేవలమును నాకోరికను మన్నించుటకే వినయుఁ డిట్లంగీకరించుట యుచితముకాదు. కోరిక—ఏల మన్నింపవలయును ? నాకోరికను మన్నించి నన్ను గౌరవించితినని యాతఁ డనుకొనియెను. కాని యాతని యీగౌరవమును బడయఁ గలుగుటచేతనే నాకింతటిబాధ !" అని భావించుకొనుచుండెను.

కాని యిప్పుడు వ్యతిరేకించుట యెట్లు ? నిజముగా లలితయే యింతవఱకును వినయు నభినయమునకై నిర్బంధించినది. వినయుఁడు గౌరవము నాలోచించి తనకోరికను మన్నించినందులకుఁ గూడ లలిత కోపగించుటయా ?—ఈసంఘటనముచే లలితకుఁ దనయందుఁ దనకే యసహ్యభావమును సిగ్గును గలిగెను. ఇట్లగునని యామె భావించియైన నుండలేదు. లలితకు మనశ్చాంచల్యము కలిగినప్పుడు తఱచుగా సుచరితయొద్దకుఁ బోవుచుండెడిది. ఇప్పుడట్లు చేయక తనభావమును తనహృదయమునందే యడఁచుకొనుటచే నామె కన్నులనుండి యశ్రువులు వెలువడఁదొడంగెను. కాని యాకన్నీటి నామెయే సరిగాఁ జూచుకొనలేదు !

మఱునాఁటియుదయమున సుధీరుఁ డొకపూబంతిని లావణ్య కిచ్చెను. అందెఱ్ఱగులాబి పువ్వులజంట యొకటి యుండెను. లలిత యాబంతిని విప్పి యాగులాబిగుత్తిని దీసికొనియెను. అది చూచి లావణ్య యాబంతిని పాడుచేసినందులకుఁ గోపించెను. అప్పుడు లలిత "వట్టి యాకులకును, వట్టిపువ్వులకును, నడుమ మంచిపువ్వులను బంధించుట నాకుఁ గష్టముగాఁ దోఁచినది. ఈవిధముగా నన్నిటి నొక్కచో బలవంతముగ సమానముగఁ గూర్చియుంచుట యనాగరికపద్ధతి !" అని చెప్పుచు నాపువ్వుల నన్నిటిని గృహమునం దచ్చటచ్చట వేఱువేఱుగ నలంకరించి యాగులాబిపువ్వులను మాత్రము తాను దీసికొనియెను.

ఇంతలో సతీశుఁడు వచ్చి "అక్కా ! ఈపువ్వు లెక్కడివి ?" అనియెను ! లలిత యామాటలకు బదులు చెప్పక యే" నీవీదినమున నీమిత్రుని యింటికిఁ బోలేదా ?" అనియెను. సతీశున కిప్పుడు వినయునిమాట మనసులో లేదు. కాని లలిత తలఁపునకుఁ దెచ్చుటచే నాబాలుఁడు గంతులు వైచుచు "ఔను ! ఇప్పుడే పోయెదను" అని యాత్రపడియెను.

లలిత యాతనిం బట్టుకొని "అక్కడకుఁ బోయి యేమి చేసెదవు?" అని ప్రశ్నించెను. సతీశుఁడు సంక్షేపముగా "మాటలాడెదను!" అని చెప్పెను. అప్పుడు లలిత "నీకాతఁ డిన్ని బొమ్మల నిచ్చెనుగదా—నీవాతని కేమియును నీయనక్కఱ లేదా?" అని మరలఁ బ్రశ్నించెను.

వినయుఁడు వార్తాపత్రికలలోనిబొమ్మలను గత్తిరించి సతీశున కిచ్చుచుండెను. దాని నాబాలకుఁడు వరుసగా నొకపుస్తకములో నంటించుకొనుచుండెను. ఈవిధముగా మంచిబొమ్మలతోఁ దనపుస్తకమంతయు నింపించుకొనవలయు నని సతీశుఁడు మిగుల వేడుక కలిగియుండెను. లలిత యిప్పటిమాటవలన నీబొమ్మల నన్నిటిని వినయునియొద్ద నూరక తీసికొంటి నని యాతనికిఁ దోఁచినంతనే చాల కష్టముగా నుండెను. ఈప్రపంచమునందు బ్రతికినయును ననేకబాధ్యతలకు లోనుగావలసియుండు నని యప్పు డాతనిమనసులో నస్పష్టముగాఁ దోఁచెను. కాని యాబొమ్మలయం దాశక్తి నాతఁ డెడలించుకొనుట కష్టముగా దోఁచెను. కాని వాని నూరక దీసికొనుట యాతని కిప్పుడు చిన్నతనముగా నుండెను. అప్పుడు సతీశునియుద్విగ్నవదనముఁ గాంచి లలిత యాతనిఁ గౌఁగిలించుకొని "బాబూ! దానికేమి లెమ్ము! మఱియొకలాగను కొనవలదు—ఈగులాబిపువ్వులను దీసికొనిపోయి నీవాతని కిమ్ము!" అనియెను.

సతీశుఁ డప్పు డీవిషయ మింతసామాన్యముగాఁ దేలిపోయినందుకు సంతుష్టహృదయుఁడై యాపువ్వులను గైకొని యప్పుడే తనమిత్రునిఋణమును దీర్చుటకై వెడలిపోయెను. వినయుఁడు వీథిలోనే యాతని కగపడియెను. సతీశుఁ డాతని గట్టిగాఁ బిలుచుచు సమీపమునకుఁ బోయి చొక్కాలోపలఁ బువ్వులను దాఁచుకొని "నీకొఱకు నేనేమి తెచ్చితినో చెప్పుకో!" అనియెను. తుద కెట్లో వినయునిచేఁ జెప్పుకొనలే దనిపించి సతీశుఁడు పువ్వులను బయటికిఁ దీసెను.

అప్పుడు వినయుఁడు "ఆహా! ఈపువ్వు లెంతయందముగా నున్నవి! కాని సతీశా! ఇవి నీవి కానట్లున్నవే! ఈదొంగను దుదకుఁ బోలీసువారి కొప్పగింపవలసి వచ్చునేమో?" అనియెను. సతీశుఁ డాపువ్వులు తనవని చెప్పవచ్చునో కూడదో యాకస్మికముగ నిశ్చయించుకొనఁజాలక యాతఁ డించుక సేపాలోచించి "మాసోదరి లలిత యీపువ్వులను మీకిమ్మని నాచేఁ బంపినది!" అనియెను. ఈమాటల కిచ్చుటనే నిష్పత్తియై పోయినది. నేను మధ్యాహ్నము మీయింటికి వచ్చెద నని చెప్పి వినయుడు సతీశునిఁ బంపివైచెను.

నిన్నటిరాత్రి లలితదెబ్బలవలనఁ గలిగినబాధ వినయుఁ డింకను మఱవఁజాలకుండెను. వినయుఁ డెవ్వరికిని గష్టము కలిగించుస్వభావముకలవాఁడు కాఁడు. అందుచేతనే యెవ్వరును దన్ను నొవ్వనాడకుండవలయు నని కోరుకొనుచుండును. ఇదివఱకున

వినయుఁడు లలితను, సుచరితను సమానముగ భావించుచుండెను. కాని యిప్పు డంకుశపుఁబోటు తిన్న యేనుఁగు మావటివానిని మఱవఁజాలనట్లు వినయుఁడు లలితను మఱవఁజాలకుండెను. ఎటులైన లలితను బ్రసన్నురాలింగావించి శాంతినందవలయుననియే యాతని ముఖ్యాలోచన మైయుండెను. అతఁడు సాయంకాలమింటికి వచ్చెను. లలిత చిఱునవ్వుచే జ్వాలామయము లైయున్న యామాట లన్నియు నొక్కొక్కటిఁ జాతనిహృదయమునఁబ్రతిధ్వనించుచుండుటచే నాతనికినిద్రపట్టలేదు. గోరాకుఛాయామాత్రుఁడ వనియు, నీకుఁ బ్రత్యేకత్వము లేదనియు నామె పరిహాసించి యుండెను. ఆమాట సత్యముకాదని నిరూపించుట కాతఁ డెన్నియో కారణముల నూహించుకొనియెను కాని యాయుక్తులవలన నాతనికిఁ బ్రయోజన మగపడలేదు. ఏమనిన— ఆమె యీవిషయమున వినయునకు స్పష్టముగా వ్యతిరేకించి వాదింపలేదు. అందుచేఁ బ్రతివాదము చేయుటకు కవకాశము లేకుండఁ బోవుచున్నది. ఇన్నియుపపత్తులున్నను వాదించుట కవకాశము లేకపోయినందులకు వినయునకుఁ గష్టముగానుండెను. తెల్లవారినతరువాత నైనను లలిత ప్రసన్నురాలు కాలేదు. అతఁడస్థిరుఁడై యింటికివచ్చి "సత్యముగా నేనింతటియవజ్ఞాపాత్రుఁడ నేనా?" అని భావించుకొనఁదొడంగెను.

సతీశుఁ డిప్పుడే వచ్చి లలిత పంపిన దని చెప్పి గులాబిపువ్వుల నిచ్చుట వినయునిహృదయమున కించుక యుల్లాసమును గలిగించెను. అప్పు డాతఁడు తనలో "నా నభినయమున కంగీకరించుటయే సంధికి నిదర్శనస్వరూపముగా సంతోషించి లలిత నాకీపువ్వులను బంపినది!" అని భావించుకొనియెను. అతఁ డాపువ్వుల నింటియం దుంచి బయలుదేఱవలయునని మొదట ననుకొనియెను గాని "ఈశాంతికుసుమములను దల్లిపాదములపైనుంచి పవిత్రములుగఁ జేసి తీసికొని రావలయును!" అనియెంచి యానందమయి యొద్దకుఁ బోయెను !—

ఆసాయంకాలము వినయుఁడు పరేశునింటికి పోవునప్పటికి సతీశుఁడు లలితయొద్ద ఋషిపాఠము చెప్పించుకొనుచుండెను. వినయుఁడు లలితం గాంచి "రక్తవర్ణముయుద్ధసూచక మైనది.! కావున సంధికుసుమములు శ్వేతములైనచో నుచితముగా నుండును!" అనియెను. లలిత యాభావమును గ్రహింపఁజాలక వినయునివంకఁ జూచుచుండెను. వినయుఁడప్పుడు తెల్లపూలగుత్తి నొకదానిని రుమాలునుండి తీసి లలితకుఁ జూపుచు "నీపువ్వుము లెంతయందము కలవైనను వానియందించుక క్రోధచిహ్నమున్నది! నాపువ్వుము లంతయందమైనవి కాకపోయినను శాంతిని శుభ్రతను, నమ్రతను సూచించుచు నీసన్నిధిని నిలిచియున్నవి!" అనియెను.

లలిత తనకర్ణమూలములయందుఁ గెంజాయ గదుర "మీ రేపువ్వులను నాపువ్వులని చెప్పుచున్నారు ?" అని ప్రశ్నించెను.

వినయుఁడప్రతిభుఁడై "నేను పొరపాటు పడితిని. ఈసతీశు డెవ్వరిపువ్వుల నెవ్వరికిచ్చెనో ?" అనియెను.

తోడనే సతీశుఁ డుచ్చైస్స్వరముతో "సరిసరి! అక్కయే యీపుష్పముల నిమ్మని చెప్పినది !" అనియెను.

విన—ఎవ్వరి కిమ్మని ?

సతీ—మీకే—

లలిత వెంగ మెట్టుచేసికొని సతీశునివెన్నుపైఁ జఱచి "నీవంటి మూఢు నెచ్చటను జూడలేదు. వినయుబాబు బొమ్మల నిచ్చినందుల కీపువ్వుల నిచ్చెదనంటివి కాదా?" అనియెను.

సతీశుఁడు హతబుద్ధియై "ఔను. ఆమాటనిజమే—కాని నీవే యట్లిమ్మని చెప్పితివి !" అనియెను.

సతీశుని మఱపింపఁబోయి లలిత మఱియొకచిక్కునఁ దగులుకొనియెను. ఆపువ్వులు లలితవే యని వినయుఁడు స్పష్టముగా గ్రహించెను. కాని యట్లు తెలియకుండవల యు ననియే లలితయభిప్రాయ మనికూడ గ్రహించెను. అప్పుడు వినయుఁడు "నీపువ్వుల కంటె నావి చిన్నవియేకాని, నాపుష్పములలో నీప్రమాదములలోవలెఁ బొఱపాటేమి యును లేదు. మనపరస్పరవివాదనివృత్తి కీకుసుమములు శుభసూచకములై యున్నవి!" అనియెను.

లలిత తలయూఁచుచు "మనవివాదమేమి; దానికి నివృత్తియేమి?" అనియెను.

విన—ఒక్కసారిగా సర్వమును మాయయేనా? వివాదము, పువ్వులు, నివృత్తి యన్నియును మిథ్యలేనా! శుక్తియందు రజతభ్రమయే కాదు—కేవలము శుక్తియే భ్రమయా ! దొరగారియింట నాటకాభినయము మాటకూడ—

లలి—అది భ్రమ కాదు ! దానినిగూర్చి కలహమేమున్నది? దానికొఱకు మీ రంగీకరింపవలయునని నేను పోరాడితిననియు, మీరంగీకరించినంతనే నేను కృతార్థురాల నైతిననియు భావించుచున్నారు కాఁబోలును ! నిజముగా మీకిష్టమే లేకయున్నచో నొకరిమాటవిని యేల యంగీకరింపవలయును ?

అని చెప్పుచు లలిత యాగదిలోనుండి వెడలిపోయెను. ఆమె నాటకాభినయమునకు బలవంతపెట్టినందులకు వినయునియెదుటఁ దనతప్పు నంగీకరింపవలయునని యిదివఱకు స్థిరపఱచుకొనియుండెను. కాని యీప్రసంగముతో నిప్పు డామెయుద్దేశ మంతయును మాఱిపోయెను. ఆయభినయమునుగూర్చి తానింతదూరము వ్యతిరేకముగ వాదించుటకలనఁ గలిగినయీమెమనఃకష్ట మింకను బోలేదని వినయుఁ డనుకొనియెను. వినయుఁ డావిషయమునఁ బైకంగీకరించెను గాని లోపల నాతనికిఁ గష్టముగ నే యుం

డెనని లలితమనస్సు క్షోభించుచుండెను. ఆమె హృదయమున నిట్లు బాధపడుచుండుట వినయునకును గష్టముగనే యుండెను. ఇంక నీవిషయమున నెన్నఁడును బరిహాసమునకైన వాడింపఁగూడదనియు నీయాభినయకార్యమునందుఁ దా నుదాసీనుఁడైయున్నట్లితరు లెవ్వరును దోషారోపణము చేయకుండునట్లు మిగుల శ్రద్ధతోను నైపుణ్యముతోను గార్యమును సంపూర్ణముగ నెఱవేర్పవలయుననియు నాతఁడు నిశ్చయించుకొనియెను.

సుచరిత నేఁటిప్రాతఃకాలమునుండియుఁ దనగదిలో నొంటిగఁ గూర్చుండి "క్రీస్తువానుకరణము" అనునొక యింగ్లీషుమతగ్రంథమును జదువుటకుఁ బ్రయత్నించుచుండెను. నేఁడామె యితరకార్యములయందు మనసు పెట్టలేదు. కాని యప్పుడప్పుడామె మనసు చెదరుచుండుటచే నక్షరములు ఛాయామాత్రము లైపోవుచుండెను. ఆపరక్షణమునందే యామె తన్ను నిందించుకొనుచు మఱింత స్థిరబుద్ధితోఁ జదువుటకు బ్రయత్నము చేయుచుండెను—ఒకప్పుడొక కంఠస్వర మామెకు వినవచ్చుటచే వినయబాబు వచ్చుచుండెనని యామెకుఁ దోఁచెను. తోడనే యామె యదరపడి లేచి మఱియొకగదిలోనికిఁ బోవలయునని యాత్రపడియెను. కాని యంతలోనే తనయస్థిరభావమును నిందించుకొనుచు మరలఁగూర్చుండి చదువుకొనఁదొడంగెను. మరల "దియో శబ్దమైనట్లు తోఁచుటచే నాలించి వినుటకుఁ బ్రయత్నించెను.

తఱచుగా వినయుఁడు ముందు వచ్చుటయును, దరువాత గోరా వచ్చుటయును జరుగుచుండెను. నేఁడుకూడ నట్లే జరుగునేమోయని యామెకు భయముగా నుండెను. ఆమెకప్పుడు గోరా వచ్చునేమోయను భయమును, రాకుండునేమోయను సంశయముచే హృదయావేదనమునుగూడఁ గలుగుచుండెను.

ఇంతలో లలిత యామెగదిలోనికి వచ్చెను. సుచరిత యామె మొంగమువంకఁ జూచి "విశేషము లేమి ?" అనియెను.

లలి—ఏమియును లేవు.

సుచ—ఇంతసేపటినుండి యెచ్చట నున్నావు ?

లలి—వినయబాబు వచ్చియున్నాఁడు—ఆతఁడు నీతో మాటలాడఁదలఁచియున్నట్లున్నది.

సుచ—నీవుకూడ రావా ?

లలిత యధీరస్వరముతో "నీవు పోయి మాటాడుము. నేను తరువాత వచ్చెదను !" అనియెను.

సుచరిత వెలుపలగదిలోఁ బ్రవేశించి సతీశునితో మాటలాడుచున్న వినయునింగాంచి "వినయబాబూ ! తండ్రిగారు షికారుపోయినారు. ఇప్పుడే వత్తురు. తమనా

టకపాత్రము నొప్పగించుటకై లీలయును లావణ్యయును మాస్టరుగారింటికిఁ బోయినారు-లలితమాత్రము పోలేదు. మీరుపోయి శిక్షయిచ్చి రండని చెప్పి వారిని బంపివైచినది." అనియెను.

విన—నీ కీనాటకమున సంబంధములేదా ?

సుచ—అందఱును నాటక మాడువారైనచో నింకఁ జూచువారెవ్వరు ?

ఇట్టి సందర్భములలో వరదాసుందరి సుచరితను మాటలచేతనే సంతోషపెట్టి తప్పించివైచుచుండును. అందుచేతనే యీసారికూడ సుచరితకు దనసామర్థ్యము ప్రదర్శించుట కవకాశము గలిగినదికాదు. వినయుఁడును సుచరితయుఁ గలిసికొన్నప్పుడు సంభాషణమునకుఁ దెంపులేకుండ నుండెడిది. కాని, యిప్పు డుభయపక్షములయందును విఘ్నము తటస్థించుటచే మాటలే తోఁచుట లేదు. సుచరిత యింక గోరామాట యెత్తఁగూడదని యొట్టుపెట్టుకొని వచ్చియుండెను. వినయుఁడును మునుపటివలెఁ గోరానుగూర్చి మాటాడఁజాలకుండెను. లలితయే కాక యింటివారందఱును గోరానొక నీచోపగ్రహముగా భావించుచున్నారని యెంచి వినయుఁ డింక నాతనిమాట యెత్తకయే యుండెను.

సుచరిత వినయునితో నెట్లోయొకటి రెండుమాటలాడి సతీశుని బొమ్మలపుస్తకమునుగూర్చి సతీశునితో నేదేమో సంభాషింపఁ దొడఁగెను. మఱియు నడుమనడుమ బొమ్మలను సరిగా నంటించుకొనలేదని సతీశునిపైఁ గోపపడుచుండెను. సతీశుఁ డామెతో బిగ్గఱగా వాదప్రతివాదములు చేయుచుండెను. ఇంక వినయుఁడు బల్లపైనుంచిన తనపుష్పములవంకఁ జూచుచు లజ్జాసంకుచితహృదయముతో "ఈపుష్పములను గౌరవముకొఱకైన లలిత కిచ్చుట యుచితముగా నుండును!" అని భావించుకొనుచుండెను. ఇంతలో నడుగులచప్పుడు వినవచ్చుటచే సుచరిత వెనుదిరిగి చూచెను. హారానబాబు వచ్చుచుండెను. సుచరిత బెదరిచూచిన ట్లందఱికిని స్పష్టపడుటచే నామె మొగ మెఱ్ఱబడిపోయెను. హారానుఁ డొకకుర్చీపైఁ గూర్చుండి "ఏమి వినయబాబూ! మీగోరాబాబు రాలేదేమి ?" అనియెను.

అనావశ్యకముగ హారానుఁ డిట్లు ప్రశ్నించుటకు వినయుఁడు విరక్తుఁడై "ఏమి ? మీ కాతనితోఁ బని యున్నదా?" అనియెను.

హారా—మీరు వచ్చితిరి. ఆయన రాలేదు! ప్రాయికముగా నిట్లు జరుగుట లేదు. కాన నిట్లు ప్రశ్నించితిని.

వినయునకుఁ జాలకోపము కలిగెను గాని యది వెల్లడి యగునను నుద్దేశముతో సంక్షేపముగా "అతఁ డిప్పుడు కలకత్తానగరమున లేఁడు!" అని చెప్పి యూరకుండెను.

హారా—ప్రచారమునకుం బోయె ననుకొందును!

వినయునకు సహింపరానంతకోపము కలుగుటచే దాని కెట్టి ప్రత్యుత్తరము నీయలేదు. సుచరితయును మాటాడకుండ నటనుండి లేచిపోయెను. హారానుఁ డతివేగముతో నామెను వెంబడించెను గాని యామె యాతని కందలేదు. దూరమునుండియే యాతఁడు "సుచరితా! నీతో మాటాడవలసినపని యున్నది!" అని కేక వైచెను.

సుచ—నాకిప్పుడు స్తిమితముగా లేదు.

అని చెప్పుచు నామె తన శయనగృహమునకుఁ బోయెను.

ఇంతలో వరదాసుందరి వచ్చి నాటకాభినయమునుగూర్చి కొన్ని సంగతులను బోధించుటకై వినయునిఁ బిలుచుటచే నాతఁడు గదిలోనికిఁ బోయెను; తరువాత నప్పుడే వచ్చి చూచుకొనియెను గాని, వినయున కాబల్లపైనున్న పువ్వు లగపడలేదు. ఆరాత్రి యభినయపరీక్షకు లలిత యెంతమాత్రమును రాలేదు! సుచరిత యాయింగ్లీషుపుస్తకము నొడిలో నుంచుకొని లోపలిదీపము నొకమూలఁ జాటుగా నుంచి చాలరాత్రి వఱకును వెలుపలియంధకారమును జూచుచుఁ గూర్చుండి యుండెను. అప్పు డామె కన్నులయెదుట నొకయపూర్వము నపరిచితమునగు దేశము మరీచికంబోలి కానవచ్చుచుండెను. ఆమె జీవితమునందలి సమస్తజ్ఞానానుభవములకును, ఆదేశమునకును విశేష భేద మగపడుచుండెను. అచ్చటివాతాయనములయందలి దీపకాంతులు తిమిరనిశీధినియందలి నక్షత్రములం బోలి సుదూరమగు రహస్యమునందు మనమునకు భయము గొలుపుచుండెను. మఱియు నామె కప్పుడు "నాజీవితము తుచ్ఛమైనది ఇంతకాలము నేను నిశ్చయ మనుకొన్నది సంశయాకీర్ణమైనట్లు తోఁచుచున్నది. నేనిదివఱకుఁ జేసిన పను లన్నియు నర్థహీనములైనవి! ఇచ్చటనే జ్ఞానము సంపూర్ణము కావచ్చును, కర్మము మహత్త్వమును గాంచవచ్చును! జీవితమునకు సార్థక్యము లభింపవచ్చును! ఈయపూర్వంబును,నపరిచితంబును, భయంకరంబు నగు దేశమునందలి యజ్ఞాతసింహద్వారము నెదుట నన్ను నిలిపినవా రెవ్వరు? నాహృదయ మిట్లేల కొట్టుకొనుచున్నది? అగ్రసరంబులు కాఁగోరియు నాపాదము లిట్లేల స్తంభించి పోవుచున్నవి?" అని యీవిధముగా నాలోచనములం దోఁచుచుండెను.

## ౨౩

సుచరిత కొన్నిదినములనుండి యుపాసనయందు మనసుంచియుండెను. కాని మునుపటికంటె నధికముగనే పరేశు నాశ్రయించుటకుఁ బ్రయత్నించుచుండెను. ఒకనాఁడు పరేశు డొంటిగాఁ గూర్చున్నప్పుడు సుచరిత వచ్చి యూరక యాతనిచెంతఁ గూర్చుండెను. అప్పుడు పరేశుఁడు పుస్తకమును బల్లపై నుంచి "ఏమిరాధా!" అనియెను.

సుచ—ఏమియును లేదు.

అని చెప్పి బల్లపైనున్న పుస్తకములను, గాగితములను సవరించుచు నొకనిమిష మైన తరువాత "బాబా! పూర్వమువలె నన్నుఁ జదివించుట లేదేమి ?" అనియెను.

పరేశుఁడు సప్రేమముగఁ జిఱునవ్వు నవ్వుచు "అమ్మా! నీవు పాఠశాలలో నంతయునుఁ జదివి యుత్తీర్ణురాల వైతివి. ఇఁక నీవు స్వయముగనే చదువుకొని గ్రహింపఁగలవు!" అనియెను.

సుచ—కాదు. నేనేమియును గ్రహింపఁజాలను. మునుపటివలెనే మీయొద్దఁ జదివెదను.

పరే—మంచిది, రేపటినుండి యారంభింపుము!

సుచరిత కొంతసే పూరకుండి యాకస్మికముగా "బాబా! అదినమున వినయ బాబు జాతిభేదమునుగూర్చి విశేషముగఁ జెప్పియున్నాఁడు. మీరు నాకావిషయమున నేమియును బోధింపలేదేమి ?" అనియెను.

పరే—అమ్మా! నేనుగాని యితరులుగాని, బోధించినబోధనలనుమాత్రమే చిలుకపలుకులవలె నేర్చుకొనుట గాక మీరు స్వయముగా నెల్లవిషయముల నాలోచించి తెలిసికొనవలయు నని నాకోరిక! ఈసంగతి నీకును దెలియును. ప్రశ్న సరిగా మనసులో జాగరితము కాకముందే యుపదేశము కావించుట యాఁకలి కాకముందే యన్నము పెట్టుటవంటి దగుచున్నది. అందువలన నరుచియు, నజీర్ణమును గలుగుచుండును. నీవు నన్నిప్పుడు ప్రశ్నించితివి. కావున నాకుఁ దెలిసినదానిని జెప్పెదను.

సుచ—నేను మిమ్ములను బ్రశ్నయే యడిగితిని. మనము జాతిభేదమును నిందించుటకుఁ గారణ మేమి ?

పరే—ఒకపిల్లి విస్తరిలోఁ గూర్చుండి యన్నము తినినను దోషములేదు. కాని యొకమనుష్యుఁ డాయింటఁ బ్రవేశించినచో నన్నమును బారవేయవలయును. మనుష్యునందే మనుష్యున కసహ్యభావమును బుట్టించు నీజాతిభేదపద్ధతి యధర్మము కాక మఱే మందువు? మనుష్యుల నింతభయంకరముగా నవమానించుట తమ్మవమానించుటయే యగును!

సుచరిత గోరామాటల ననుకరించి "ఇప్పటిసమాజవికృతుల ననుసరించి యనేక దోషములు కలుగవచ్చును. అది సమాజదోష మనుటయుఁ గాని యాదోషమును బ్రధానధర్మమున కారోపించుట యేల ?" అనియెను.

పరే—ఆప్రధానవస్తు వెక్కడ నున్నదియో తెలిసినచోఁ జెప్పఁగలిగి యుందును. కాని దేశమునందు మానవులు మానవులనే యసహ్యించుకొనుటయు, నవమానించుకొనుటయుఁ, బరస్పరభేదముతోఁ జీలుకొనుటయు మనము కన్నులారఁ జూచు

చున్నారు! ఇట్టియవస్థలో నేనిఁక యీ కాల్పనికప్రధానధర్మముమాట యాలోచించుచు మనసున కూఱట కలిగించుకొనుట యెట్లు?

సుచరిత చాలసేపటివఱకును పరేశునిమాటలభావమును మనమునఁ బట్టించుకొనుచు తుదకు "బాబా! అట్లయినచో నీసంగతి యంతయును వినయబాబునకు బోధింపఁగూడదా?" అనియెను.

పరేశుఁడు నవ్వుచు "వినయబాబు గ్రహింపఁజాలఁడని నేనాతని కిది యంతయును బోధించుట మానలేదు. వారిప్పుడు సర్వోత్కృష్టసత్యమగుధర్మము వైపునుండి తమహృదయములం దీవిషయమునుగూర్చి యాలోచింతురో యప్పుడే వారి కది యంతయును నీతండ్రిగారిబోధనతో నిమిత్తము లేకుండఁగనే స్పష్టపడిపోవును. ఇప్పుడు వారన్యదిక్కునుండి చూచుచున్నారు. కావున నిప్పుడు వారియెడల నాబోధనము లెంతమాత్రమును పనిచేయఁజాలవు."

గోరావాక్యములను శ్రద్ధతో వినుచున్నప్పుడైనను నామెహృదయమున సంశయసహితమగువివాదమే కలిగి బాధాకరముగా నుండెనేగాని శాంతి కలిగినది కాదు. ఇప్పుడామె పరేశునితో మాటలాడి క్షణకాలములో వాదవిరోధభావమునుండి విముక్తి నందఁగలిగెను. సుచరిత గోరాను గాని, వినయుని గాని పరేశునికంటె గొప్పవారుగా నెట్టును భావించి యుండలేదు. పరేశునియుద్దేశముతో నేకీభవింపని వారియెడల నామెకు గోపముకూడఁ గలుగుచుండెను. ఇప్పుడు గోరాతో మాటలాడినతరువాత నామె కాతని మాటలయం దవజ్ఞనుగాని, కోపమునుగాని, చూపఁజాలకుండుట యామెకుఁ గష్టముగనే యుండెను. అందుచే నామె చిన్నతనమునందువలెనే పరేశునాశ్రయించి యెల్లప్పుడు ప్రక్కనుండవలయునని వ్యాకులపడుచుండెను. ఆమె లేచి ద్వారమువఱకును బోయి మరల వచ్చి పరేశునివెనుకభాగమునఁ గుర్చీపైఁ జేతు లానుకొని నిలిచి "బాబా! నేఁడు మీరు నాతోఁ గలసియుపాసన చేయవలయును!" అనియెను.

పరే—అల్లాగే తల్లీ!

తరువాత సుచరిత తనగదిలోనికిఁ బోయి తలుపు మూసుకొని కూర్చుండి గోరామాటల నగ్రాహ్యములుగాఁ జేసికొనుటకు బ్రయత్నించుచుండెను. కానిజ్ఞానవిశ్వాసప్రదీప్తమగుగోరాముఖ మామెకన్నులయెదుఁ గట్టినట్లె యుండెను. "గోరామాటలు వట్టిమాటలుకావు, ఒక్కొక్కమాటయు నొక్కొక్కగోరాయే! గోరామాటలలో నాకృతియున్నది; గతి యున్నది; ప్రాణమున్నది! ఆమాటలు విశ్వాసబలముచేతను, స్వదేశప్రేమసంతాపముచేతను, బరిపూర్ణములై యుండును. అవి ప్రతివాదములకు లొంగునవికావు. వానియందు సంపూర్ణమానవత్వ మున్నది. అది సామాన్యమానవత్వము కాదు. వానిని బూర్వపక్షము చేయుట కెవ్వరును సమర్థులు కాఁజాలరు!" అని యా[illegible]గా

నామెహృదయమునకుఁ దట్టుచుండెను. ఇట్టిద్వంద్వభావమధ్యమునం బడుటచే సుచరితకుఁ గన్నుల నీరు నిండుచుండెను. ఎవ్వరో తన్నీద్వైధీభావమధ్యమునఁ ద్రోసివైచి తామూరక దూరమునుండి చూచుచున్నట్లామె కనుభవ మగుచుండెను. అందుచే నామె హృదయము పగిలిపోవుచుండెను; పరితాపముచే నామె తన్నుఁ దానే నిందించుకొనఁ దొడఁగెను.

## ౨౮

“డ్రైడను” కవిచేఁ బద్యరూపముగ రచింపఁబడిన “సంగీతశక్తి” అను నాటకమును, వినయుఁడు ముఖస్థము చేసికొని చదువుటకును స్త్రీలందఱు నభినయరంగమున వేఱరచనలతో నుండి కావ్యలిఖితవ్యాపారములనుగూర్చి మూకాభినయములఁ గావించుటయే కాక సమయోచితము లగునింగ్లీషుపాటలను, పద్యములను జదువుచుండుటకును నేర్పాటు జరిగెను. వరదాసుందరి కష్టపడి నాటకాభినయమునకు వినయునిఁ దయారు చేయవలసియుండునని యనుకొనియుండెను. ఆమె కింగ్లీషువందు జ్ఞానము సామాన్యమే యైనను సమాజమునందలియొకరిద్దఱుపండితులపై నామె యీవిషయమున నాధారపడి యుండెను.

కాని ప్రదర్శన మారంభించినతోడనే వినయుఁడు చదువుట కారంభించి వరదాసుందరికిని బండితులకును గూడ నత్యాశ్చర్యమును గలిగించెను. తమసమాజమువాఁడు కాని వినయుని దిద్దితీర్పవలయునను కోరిక వరదాసుందరికిఁ దీరినది కాదు. ఇంతవఱకును వినయుని సామాన్యముగఁ జూచువా రందఱు నిప్పుడాతనియాంగ్లేయభాషావైదుష్యమును గాంచి విస్మితులై యాతని గౌరవింపకుండ నుండఁజాలకపోయిరి. హారానబాబుకూడఁ దనపత్రికకుఁ గొన్నిలేఖలను వ్రాసి యీయవలయునని యాతని వేఁడుకొనియెను. సుధీరుఁడు తమవిద్యార్థిసమాజమునం దొకటిరెం డుపన్యాసముల నీయవలయు నని యాతని బ్రార్థించెను.

లలితయవస్థ యత్యద్భుతముగా నుండెను. వినయుఁ డిప్పు డీయభినయవిషయమున నెవ్వరిసహాయము నపేక్షింపకుండుట యామెకు సంతుష్టిగను, నసంతుష్టిగను గూడనుండెను. వినయుఁడు తమసమాజములో నెవ్వరికిని లోఁబడకుండుటయే కాక యందఱికంటెను గొప్పవాఁడుకూడ నయ్యెను. అతఁ డిప్పుడు తనశ్రేష్ఠత్వమును భావించుకొనును. అతని కిప్పు డెవ్వరియొద్దను నేర్చుకొనవలసిన దేదియును లేదు—లలిత కదియే కష్టముగా నుండెను. వినయునిపట్ల నామె యేమి కోరుకొనుచున్నదో, యెట్లుండిన నామెకు శాంతిగా నుండునో యామెకే బోధపడుటలేదు. అప్పుడప్పుడామె యప్రసన్నత చిన్నచిన్న విషయములయందలి తీవ్రభావమునందు స్పష్టపడుచు వినయునకు లక్ష్య మగుచుండెను. వినయునిపట్లఁ దానిట్లుండుట గౌరవము కాదని లలిత

తెలిసికొనఁజాలకయే యుండెను. తెలిసికొని యామె పరితపించుచుండెను; తనతప్పు దిద్దుకొనవలయు నని కష్టపడి ప్రయత్నించుచునే యుండెను; కాని సామాన్యవిషయములందుఁగూడఁ గలుగుచున్న యామె యంతర్జ్వాలను శాంతింపఁ జేసికొనుట కామె కెట్టియుపాయమును దోఁచుటలేదు. ఇంతవఱకు నామెయే యీవిషయమున వినయుని బలవంతపెట్టి యొప్పించినది. ఇప్పు డాతని నొక్కసారిగా మరలింపవలయు ననునుద్దేశమామెను గలఁచివైచుచుండెను; కాని యిప్పు డీసమస్తాయోజనమును విపర్యస్తముగఁ జేసి వినయుం డకారణముగ నేమని చెప్పి తప్పించుకొనఁగలఁడు ? సమయమును కూడ సమీపించినది ! వినయుఁడు తన నైపుణ్య మంతయును జూపి తానే యీవిషయమునం దుత్సాహముతోఁ బని చేయుచున్నాఁడు ! ఇఁకఁ దప్పించుట కుపాయమేమున్నది ? తుదకు లలిత కేమియుం దోఁచక తల్లిం గాంచి “నేనీయభినయమునఁ బని చేయఁజాలను !” అనియెను.

వరదాసుందరికిఁ దనబిడ్డ యగులలితసంగతి బాగుగఁ దెలియును. అందుచే నామె యత్యంతమును శంకితయై “ఎందుచేత?” అని ప్రశ్నించెను. “ఈపని నాచేతఁ గాదు!” అని లలిత ప్రత్యుత్తర మిచ్చెను.

వినయుఁ డనఘుఁడు గాఁడని నిశ్చయింపఁబడినప్పటినుండియు లలిత వినయుని యొద్దఁ దననాటకభాగము నొప్పగించుటకుఁ గాని యభినయాభ్యాసముఁ గావించుటకుఁ గాని యిష్టపడలేదు. ప్రత్యేకముగ నేనే యభ్యాసము చేసికొందు నని చెప్పివైచెను. ఇందువలన నందఱియభ్యాసమునకును భంగము కలిగెను. కాని లలిత యెంత మాత్రము నంగీకరింపలేదు. తుదకు వారు లలిత లేకుండఁగనే యభ్యాసము గావించుకొనుచుండిరి. తుట్టతుద కిప్పుడు లలిత సర్వోత్సాహమునకును భంగము చేయుటకు సిద్ధపడి యుండెను. ఇది వరదాసుందరికిఁ దలపైఁ బిడుగుపడిన ట్లుండెను. లలిత యిఁకఁ దనమాట వినదని వరదాసుందరికి దెలియును. అందుచే నామె యిప్పుడు పరేశునిశరణమును గోరెను. పరేశబాబు సామాన్యవిషయములలోఁ దనకుమార్తెలయిష్టానిష్టములను శాసించువాఁడు కాఁడు, కాని యాతఁడు కలెక్టరునొద్ద నంగీకరించి యీ యభినయవిషయమునఁ బ్రోత్సాహమును గూర్చుచు నుండెను. సమయముకూడ సమీపించినది. ఇది యంతయు నాలోచించుకొని పరేశు లలితను బిలిచి యామెమస్తకమున హస్తము నుంచి “అమ్మా! లలితా! నీవిప్పుడు వదలుకొన్నచోఁ జాలతప్పుగా నుండునుసుమా!” అనియెను.

లలిత రుద్ధకంఠస్వరముతో “బాబా! నేనీపని చేయఁజాలను. నాచేతఁగాదు.” అనియెను.

పరే—నీవు బాగుగ నభినయింపఁజాలకున్నచో నపచారము లేదు; కాని, కేవల మభినయింపకుండుట తప్పు!

లలిత తలవంచుకొని నిలువఁబడి యుండెను. పరేశుఁడు మరల "అమ్మా! ఈ భారమును నీవు వహించినప్పుడు సరిగాఁ దీర్పవలదా? ఇది కోపము తెచ్చుకొని తప్పించుకొనవలసిన సమయము గాదు. కష్టముగా నున్నను నీకిది కర్తవ్యము. అంగీకరింపవా తల్లీ!" అనియెను.

లలిత తండ్రి మొగముకంకఁ జూచి "అంగీకరించితిని." అనియెను.

ఆనాఁటిసాయంకాలముననే లలిత వినయునియొద్దఁ దన సమస్తసంకోచమును దూరము చేసికొని యనుపమానసామర్థ్యముతోఁ బంతము పట్టినదియుంబోలెఁ దనయభినయభాగము నొప్పగించివైచెను. వినయుఁ డిదివఱకా మె చదువుట వినియుండలేదు; ఇప్పుడు విని పరమాద్భుతనిమగ్నుఁడైపోయెను. ఆహా! తేజోమయమగు నాయుచ్చారణ మెంతస్పష్టముగ నున్నది! అందెచ్చటను నొక్కించుకయైనను దడఁబాటు లేదు. ఆభావప్రకాశ మెంతనిస్సంశయముగ నున్నది! విని వినయుఁ డాశాతీతం బగు నానందము ననుభవించెను. ఆమనోహరకంఠస్వర మాతని వీనులయందుఁ జాలసేపటివఱకును బ్రతిధ్వనించుచుండెను. పాఠకుల మధురకంఠస్వరమును బట్టికూడఁ గవిత్వము శ్రోతలకు మనోహరములై యుండును. చెలువంపుఁజిగురుఁగొమ్మలలో వికసించిన పువ్వులవలెనే పాఠకులకలస్వనములలోఁ దులకించు కవితలు శోభాయమానములై యుండును!

లలితయును గ్రమముగా వినయునియొద్దఁ గవితాప్రసంగమును గావింప నారంభించెను. ఆమె యింతవఱకును దనతీవ్రభావముచేతనే వినయు నుత్తేజితునిం గావించుచుండెను; సమయము వచ్చినప్పుడెల్లఁ దిరస్కారవచనములచేతను దీవ్రహాస్యములచేతనే వినయుని నొప్పించుచుండెను. లలిత యెప్పు డేమి చేయునో, యెప్పు డేమనునో యనియే వినయుఁడు సంకోచింపవలసివచ్చుచుండెను. ఆమె యసంతోషభావరహస్యమును భేదింపఁజాలక వినయుఁడు నిరంతరము నామెను గూర్చియే యాలోచించుచుండెను. తెల్లవారి నిద్రనుండి లేచునప్పటికే యాతని కామెమాటలు స్మృతికి వచ్చుచుండెను. అతనికిఁ బ్రతిదినమును లలిత యీవేళ నెట్లుండునో యను నాలోచనమే తోఁచుచుండెను. ఆమెయం దొక్కించుక ప్రసన్నభావ మగపడిననాఁడు వినయుఁడు నిట్టూర్పు విడిచి బ్రదికితి ననుకొని యామె యల్లప్పుడు నిట్లుండుట కేమిచేయవలయునో యని యాలోచించుకొనుచుండెను. కాని యేయుపాయమును దోఁచక కేవలమును వినయుఁ డామె కధీనుఁడై యుండెను.

ఈవిచారములనడుమ నిప్పటి లలిత కావ్యపఠనమాధుర్యము వినయునకుఁ బరమానందదాయక మయ్యెను. తనయానందమును గూర్చి యెట్లు ప్రశంసింపవలయునో యాతనికిఁ దోఁచుటలేదు. లలిత మొగము నెదుట మంచిమాట చెప్పుటఁగూడ వానికి సాహసము కలుగుటలేదు. మంచిమాటలకు మానవులు సంతోషింతు రనుసామాన్యనియమము లలితకు వర్తింపదేమో యని యాతనికి సంశయము కలిగెను. అందుచేతనే వినయుఁడు తనయానందావేశమును బట్టఁజాలక వరదాసుందరితో లలితభాషానైపుణ్యమును గూర్చియు, పఠనమాధుర్యమును గూర్చియు విశేషముగఁ బ్రశంసించెను. అందువలన వినయుని విద్యాబుద్ధులయెడల వరదాసుందరికి గౌరవమును విశ్వాసమును మఱింత దృఢపడియెను.

మఱియొక వింతసంగతి! లలిత తనయభినయకౌశల్యమును వాక్చాతుర్యమును బ్రశంసనీయము లైనట్లు గ్రహించినతోడనే నిరుపద్రవకరమగు నోడ సముద్రతరంగములనుండి దాఁటినట్లుగా నామె తనకర్తవ్యాభిజ్ఞతనుండి తరింపఁగలిగెను. అప్పటినుండియు లలిత తనతీవ్రప్రభావమును వినయునియెడల నుపయోగించుట లేదు. వినయునకు వైముఖ్యముఁగూర్చుపని యేదియు నామె చేయుటయే మానివైచెను. ఈ యభినయకార్యమునం దామె యుత్సాహముతో వినయునితోఁ గలసిమెలసి పని చేయుచుండెను. చదువుటయందు, నభినయించుటయందును నామె వినయుని యుపదేశమును గైకొనుచుండెను.

లలిత యిట్లు మాఱుటచే వినయుని గుండెలలోని పెద్దబరువు దిగిపోయిన ట్లయ్యెను. ఆతనికిప్పు డానందమయి యొద్దకుఁ బోయి బాలునివలె నాటలాడుకొనవలయు ననునంతటి యానందము కలిగెను. వినయుని కప్పుడు సుచరితతో నెన్నియో మాటలాడవలయు నని యుండెను. కాని సుచరిత నేఁ డాతని కగపడ నేలేదు. అవకాశము కల్పించుకొని లలితయొద్దఁ గూర్చుండి సావధానముగ మాటలాడవచ్చును. కాని లలిత తన మాటలను తీవ్రముగా విమర్శించు ననుసంశయముచే సహజముగా నాతనికి మాటలే తోఁచవు.

లలిత—యప్పుడప్పుడు "ఇవి నీమాటలేనా? మఱియొకరివా?" అనుచుండును. "నాకింత వయసు వచ్చినను, పుస్తకజ్ఞానమే గాని యనుభవజ్ఞానము కలుగలేదు! అందుచే నాజ్ఞానము గ్రంథముద్రణాలయమువంటి దైపోయినది" అని వినయుఁడు చెప్పుచుండును. "నీవు బాగుగా మాటాడుటకుఁ బ్రయత్నింపుము? నీమాటలే నీవు సరిగా మాటాడవలయును. నీవు చమత్కారముగా మాటాడినప్పు డెల్ల నీమాటలు నీవి కావని సంశయము కలుగుచుండును!" అని లలిత చెప్పుచుండును. అందుచే నిపుణముగా మాటాడినచో లలిత సంశయించునని వినయుఁడు సులభముగను, సంక్షేపము

గను మాటాడవలసివచ్చుచుండెను. ఏదైన నలవాటుచే నొక యలంకారవాక్యము నోటినుండి వెలువడినంతనే వినయునకు సంశయము కలుఁగుచుండెను.

ఆ కారణమునఁ గ్రమ్ముకొన్నమబ్బు వదలి లలితహృదయ మిప్పుడు నిర్మలమై యుండెను. ఆ మెపరివర్తనముం గాంచి వరదాసుందరియు నాశ్చర్యపడియెను. లలిత యిప్పుడు మాటమాటకు వద్దని చెప్పుచు విముఖియై యుండుట లేదు. అన్నిపనుల యందును నుత్సాహముతో మెలంగుచుండెను; రాఁబోవు నభినయసందర్భమునకు వలయుపరికరములనుగూర్చి నూతనోత్సాహముతో నాలోచించుకొనుచుండెను; ఆ విషయమున నందఱను బ్రోత్సహించుచుండెను. వరదాసుందరి కందుచే సంతోషము కలుఁగవలసినదే కాని యామె కిప్పుడు ధనవ్యయమునుగూర్చి యాలోచన కలిగెను. ఆ కారణముచే లలిత యంగీకరించినప్పుడు కూడ నామె కించుక కష్టముగనే యుండెను. కాని యామె లలిత యుత్సాహము నడ్డగించుటకు సాహసింపఁజాలక పోయెను. లలిత సంతోషముతోఁ జేయుపనులయం దెట్టిలోపము కలిగినను సహింపఁజాలదు. అందుచేతనే యామె సామాన్యముగ నెట్టిపనికిని బూనుకొనదు!

లలిత యిట్టియుత్సాహముతో సుచరితయొద్దకు నేకపర్యాయము లాత్రముతోఁ బోయియుండెను. సుచరిత నవ్వుచునే మాటాడినది. కాని లలితకుమాత్ర మేమో మనసునకుఁ గష్టముగఁ దోఁచుచుండుటచే మనసులోనే కోపగించుకొని మరలి వచ్చుచుండెను. ఒకనాఁడు లలిత తండ్రికడకుఁ బోయి "బాబా! అక్క సుచరిత యింటనే కూర్చుండి చదువుకొనుచుండును, మేముమాత్రము నాటకాభినయమునకు శ్రమపడుటయేనా? ఇది తగదు! ఆమెకూడ మాతోఁగలసి పని చేయవలయును!" అనియెను.

సుచరిత కొలఁదిదినములనుండి చెలులతోఁ గలియక వేఱుగ మెలంగుచున్న సంగతి పరేశుఁడు గ్రహించియే యుండెను. ఈయవస్థ యామెనడవడి కుచితము కాదని కూడ నాతఁడు శంకించుచుండెను. ఇప్పటిలలితమాటలవలన సుచరితహృదయమున సంతోషముగ నందఱితోడను గలసి యుండఁజాలనంతటివ్యత్యస్తభావ మేదియో కలిగియుండెనని పరేశుఁ డనుకొనియెను. అప్పుడు పరేశుఁడు "అమ్మా! ఈసంగతి మీయమ్మతోఁ జెప్పలేదా?" అనియెను.

లలి—అమ్మతోఁ జెప్పెదను. కాని యక్క నంగీకరింపఁజేయుభారము మీ యందేయున్నది!

పరేశబాబు చెప్పినతోడనే సుచరిత యెట్టియభ్యంతరమును జెప్పఁజాలక తన కర్తవ్యపాలనమున కగ్రేసర యయ్యెను.

సుచరిత గదినుండి వెలుపలికి వచ్చినతోడనే వినయుఁ డామెతో మునుపటి వలెనే మాటాడఁ దలంచెను. కాని యామె యాభిముఖ్యమును బడయఁజాలకపోయె

ను. ఆమె మొగమునందును, చూపులయందును బ్రసన్నత కానరాకుండుటచే నాతఁడామెను సమీపింపఁజాలకపోయెను. కలిసిమెలసి యుండుటయందును, పనులయందును సుచరిత మునుపుగూడ నిర్లిప్తతతోనే యుండెడిది. కాని యిప్పుడది స్పష్టముగా నగపడుచుండెను. సుచరిత క్రియముగా నభినయాభ్యాససమయములయందుఁగూడఁ బ్రత్యేకముగనే యుండెను; పనులలో నావశ్యకమైనంతవఱకే కలుగఁజేసికొనుచుండెను. ఈవిధముగాఁ జూచుచుండఁగనే సుచరిత వినయునకు దూరమైపోయెను!

కొలఁదిదినములనుండి గోరా లేకుంటచే వినయుఁడు తఱచుగాఁ బరేశునింటికి వచ్చుచుఁ బోవుచుండెను. వినయునిస్వభావమునం దిట్టియవారితభావముం గాంచి పరేశునియింటివారెల్లరును సంతోషముతో నుండిరి. వినయుఁడును నిరాబాధక మగు స్వాతంత్ర్యలాభముం గాంచి యెన్నఁడు నెఱుంగనియానందము ననుభవించుచుండెను. ఆయింటివారందఱు నాతని గౌరవముగాఁ జూచుచుండుటచే నాతఁడు తనగౌరవమును మఱింత వర్ధిల్లఁజేసికొనుటకుఁ బ్రయత్నించుచుండెను. ఇట్టిప్రకృతిప్రసారణసమయమున—ఇట్టి స్వాతంత్ర్యానుభవసమయమున వినయునకు సుచరిత దూరమైపోయెను. ఈలోపము—ఈయఘాతము మఱియొకప్పుడైనచో దుస్సహముగనే యుండును. కాని యిప్పుడది సామాన్యముగ జరిగిపోవుచుండెను. లలితకూడ సుచరితభావాంతరమును గ్రహించి యామెను మునుపటివలె నాదరించుటలేదు! చదువునందు, నభినయమునందును గలయుత్సాహమే యిప్పుడు లలితహృదయమును నిండి యున్నదా యేమి ?

ఆకస్మికముగ సుచరిత యభినయమునఁ జేరుటం గాంచి హారానుఁడును సంతసముతో నుండెను. హారానుఁ డప్పుడు తానుగూడ "Paradise Lost" నుండి కొంతభాగమును జదివెద ననియును Dry-den నాటకముపై సంగీతమునుగూర్చి యొక చిన్నయుపన్యాసము నిచ్చెద ననియును జెప్పెను. వరదాసుందరికీమాట యసహ్యాగా నుండెను. లలితకును సంతుష్టిగా లేదు. కాని, హారానుఁ డివరకే యీవిషయమునుఁ గూర్చి కలెక్టరుతో మాటలాడి వచ్చెను. లలిత యీవిషయమునఁ గలెక్టరు సమ్మతింపఁ డని చెప్పినప్పుడు హారానుఁడు కలెక్టరుగారి యుత్తరువును జూపి యామెను నిరుత్తరం గావించెను.

గోరా పని లేకుండఁగనే ప్రయాణము చేసెను. ఎప్పుడు వచ్చునో యెవ్వరికిని తెలియదు. సుచరిత యీవిషయమున నేమియు నాలోచింపకపోయినను నెప్పటికప్పుడే గోరా నేఁడు వచ్చు ననువాక యామెమనస్సులోఁ గలుగుచుండెను. ఆయాశ నేవిధముచేతను నామె త్రోసివైచుకొనఁజాలకుండెను. గోరాయు నాసివకయుఁ దనమనసునందలి యబాధ్యతయు సుచరితను బీడించుచున్నప్పుడు, ఎట్లయిన

వివాహమును జేసికొని పోలేకయున్ననీయామె హృదయము వ్యాకులపడుచున్నప్పుడు హారానుఁడు సుచరితపెండ్లిసంబంధమును స్థిరపఱుపవలయునని మరల నొకసారి పరేశుని గోరెను! అప్పుడు పరేశుఁడు "పెండ్లి కింకను వ్యవధాన మున్నది కదా! ఇంత తొందరగా స్థిరపఱచుకొనుట యెందులకు?" అనియెను.

హారా—వివాహమునకుముందుఁ గొంతకాల మీసంబంధావస్థతోఁ గాలయాపనము చేయుట యుభయులహృదయపరిణామమునకు ననుకూలముగా నుండును. సాంసారిక బాధ్యతలు లేకుండియు సంబంధము కలిగి యుండుట యను నీవివాహపూర్వపరిచయ మొకవిధముగా నాధ్యాత్మిక సంబంధమువంటిది. ఇది చాల నుపకారకమైనది.

పరే—మంచిది. అట్లయినచో సుచరిత నడిగి చూడుము!

హారా—ఆమె యిదివఱకే యంగీకరించినది కాదా?

హారానునియెడల సుచరితమనోభావమునుగూర్చి పరేశున కింకను సందేహము గనేయుండెను. అందుచే నాతఁడు సుచరితను బిలిచి హారానుని యభిప్రాయమును దెలిపెను. సుచరితయును దనద్విధాగ్రస్తజీవనము నెచ్చటనో యొకచోట సంపూర్ణముగా నర్పించివైచుకొనుటయే మంచి దని యెంచి తోడనే నిశ్చింతతోఁ దనసమ్మతిని దెలియఁజేసెను. పరేశునిసందేహ మంతయును దూరమైపోయెను. వివాహమునకుముందే బంధింపఁబడుట యుక్తమునో కాదో బాగుగ నాలోచింపుకొమ్మని పరేశుఁడు చెప్పెను గాని సుచరిత యింతమాత్రము నభ్యంతరము చెప్పలేదు. నాటకాభినయమైనతరువాత నొకనాఁ డందఱను బిలిచి వివాహసంబంధము స్థిరపఱచుట కేర్పాటు జరిగెను

సుచరితకుఁ దనహృదయ మిప్పుడు రాహుగ్రాసమునుండి ముక్తమైన ట్లొకింతసేపు తోఁచెను. అప్పు డామె మనసులో "హారానుని బెండ్లియాడి సమాజకార్యములయందే హృదయమును బంధించి యుంచఁగలను! హారానుబాబునొద్దఁ బ్రతిదినము ధర్మతత్త్వసంబంధము లగుగ్రంథములనుజదివి యాపద్ధతుల నవలంబించి యుండవలయును" అని స్థిరపఱచుకొని యప్రియము కాని తోఁచుచున్నను నాకార్యమును జేయుటకు మనఃపూర్వకముగఁ బ్రతిజ్ఞ చేసికొనియెను.

హారానుఁడు ప్రకటించుచున్నపత్రిక నెన్నఁడును సుచరిత చదివియుండలేదు. ఆపత్రిక యిప్పుడు ముద్రితమైనతోడనే సుచరిత కందెను; హారానుఁడే పంపుచుండెనని సుచరిత గ్రహించెను. ఆపత్రిక నందికొని యామె గదిలోనికిఁ బోయి ప్రయత్నపూర్వకముగ నందలి మొదటిపంక్తినుండియుఁ జదువ నారంభించెను; తాను శిష్యురాలుగా భావించి శ్రద్ధతో నందలియుపదేశముల ననుభవమునకుఁ దెచ్చుకొనుచుండెను.

కాని పడవ నడచుచు నడచుచు నాకస్మికముగాఁ గొందకుఁ దాఁకి వెనుకకు మరలెను—ఆపత్రికలో "పూర్వకాలవాయుగ్రస్తులు" అను పేరితో నొక వ్యాసమున్నది. అందు వర్తమాన కాలమునందుండి పూర్వకాలమునకు మొగము ద్రిప్పి చూచు వారినిగూర్చి నింద లున్నవి. యుక్తు లంతయుసంగతములుగ లేవు ఇట్టియుక్తులను సంధానించుట సుచరిత కిష్టము—కాని యావ్యాసమును జది నంతనే యానింద లన్నియును గోరానుగూర్చియే యని యామెకుఁ దోఁచెను. అందు గోరాపేరు లేదు; ఆతనివ్రాఁతల యుల్లేఖమును లేదు. తుపాకిగుండతో నొకమానవునిఁ గొట్టి యొకవైరికుఁడు సంతోషించునట్లు యావ్యాసము ప్రతివాక్యముచేతను నొకసజీవపదార్థమును ఛేదించి యొకవిధమగు హింసానందముచే బ్రస్ఫుటితమైయుండెను.

అందుచే నావ్యాసము సుచరితకసహ్యముగా నుండెను. అందలి ప్రతియుక్తిని ప్రతివాదముచే ఖండించివేయవలయు నని యామెకుఁ దోఁచెను. గోరా తలఁచుకొన్న దీనిని దుమ్మున నెగురగొట్టి ధూళిపాలు చేయఁగలుఁడు నని యామె యనుకొనియెను. తోడనే గోరాసముజ్జ్వలవదనమండల మామెకన్నులకు గట్టినట్లు యాతనిగభీరకంఠస్వర మామెహృదయాంతరాళముఁ బ్రతిధ్వనించుచున్నట్లయ్యెను. ఆతని యసామాన్య వదనము నెదుట ఆతని గభీరభాషణములయెదుట నీవ్యాసలేఖకుఁడు నీచాతినీచునింబోలి కానవచ్చుచుండెను. సుచరిత యప్పుడాపత్రికను గ్రిందఁ బాఱవైచెను.

చాలకాలమున కానాఁడే సుచరిత వినయునికడఁ గూరుచుండి ప్రసంగవశమున "మంచిది. మీరిదివఱకుఁ బత్రికలకు వ్రాసినయుపన్యాసము లన్నియును నాకుఁ జదువుట కిచ్చెద నంటిరి. ఈయలేదేమి?" అనియెను. సుచరితహృదయమున భావాంతరము కలుగుటచేఁ దానాకాగితముల నిచ్చుట కవకాశము లేకపోయె నని చెప్పక వినయుఁడు మర్యాదగా "నేను వాని నన్నిటిని సంగ్రహించి యుంచితిని. రేపు తెచ్చి యిచ్చెదను" అనియెను.

మఱునాఁడు వినయుఁడు పుస్తకమును, గొన్ని కాగితములను దెచ్చి సుచరిత కిచ్చెను. సుచరిత వానిని దీసికొనియెను గాని చదువలేదు. ఒకపెట్టెలో భద్రముగా దాఁచి యుంచెను. చదువవలె నని కోరిక యుండియును జదువలేదు. ఆమె తనచిత్తమునకుం జాంచల్యము కలిగింప నట్లు ప్రతిజ్ఞ చేసికొని హారానునిశాసనాధీనముగాఁ జేయవలయు నని మఱియొకసారి తన్నుఁ దానే హెచ్చరించుకొనియెను!

## ౨౪

ఆదివార ముదయమున నానందమయి తేనీరు సిద్ధము చేయుచుండెను. ఆమె చెంతఁ గూర్చుండి శశిముఖి తాంబూలములకు వక్కలను గత్తిరించి పోగుచేయుచు

ఇంతలో వినయుఁడు వచ్చుటచేఁ దనయొడిలోనున్న తమలపాకుల నటు జారవిడిచి యొక్కపరుగున గదిలోనుండి యవ్వలకుఁ బోయెను.

వినయున కందఱియందును సమభావమే. ఇంతవఱకును శశిముఖి యాతనికడ నెంతయో చనువు కలిగి యుండెడిది; ఆయుభయులకు నెన్నియో వాదములు జరుగుచుండెడివి. శశిముఖి వినయుని జోళ్ళను దాఁచి యాతనితో వాదము పెట్టుకొనుచుండెడిది. వినయుఁ డామె చిన్నతనపుఁబనులను గొన్నింటిని మెఱుఁగులు పెట్టి వర్ణించి పరిహసించుచుండెడివాఁడు. అవియన్నియు నసత్యములని యామె మొదటినుండియు వాదించుచుండెడిది. తుద కట్లు నిరూపింపఁజాలక యచటనుండి పాఱిపోవుచుండెడిది. ఆమెయును వినయు నేదోవిధముగాఁ బరిహసింపవలయునని ప్రయత్నించుచుండెడిది. కాని రచనాశక్తియందు వినయునితోఁ జాలలేకపోవుచుండెడిది. ఎట్లయినను వినయుఁ డింటికి వచ్చినదిమొదలు శశిముఖి యాతనితో నల్లరిచేయుచునే యుండెడిది. ఒక్కొక్కదినమున నాయిరువురియల్లరిం గాంచి యానందమయి శశిముఖింగూర్చి కోపముకూడఁ జూపుచుండెడిది. కాని దోసము శశిముఖిది కాదు. వినయుఁ డామె కట్టియుద్రేకముం గూర్చుచుండెడివాఁడు. అందుచే నామె యుత్సాహము నడఁచుకొనఁజాలకపోయెడిది.

అట్టిశశిముఖి యిప్పుడు వినయునిఁ జూచినంతనే పరుగెత్తిపోయెను! అది చూచి యానందమయి నవ్వెను. ఆనవ్వు సుఖమైననవ్వు కాదు. ఈయల్పసంఘటనము వినయునకు దారుణాఘాత మగుటచేఁ గొంతసేపటివఱకు నాతఁడు మాటాడఁజాలకపోయెను. శశిముఖీవినయుల వివాహ మసంగత మైనను జిన్నచిన్నమాటలచే నది యెట్లో స్థిరపడిపోయినది. వినయుఁడు గోరామిత్రత్వము నాలోచించియే సమ్మతించెను; అంతే కాని బాగుగ నాలోచించుకొనలేదు. ఇంతేకాక వినయుఁడు మనదేశమున వివాహము వ్యక్తిగతము కాదనియు, నది పారివారిక మనియు వ్యాసములనుగూడ వ్రాసియుండెను! అతఁడు కూడ నీవిషయమున నెట్టియాలోచనమునకును నెడ మీయలేదు. ఇప్పుడు శశిముఖి తన్నుం జూచి సిగ్గుపడిపోవుటం గాంచుటచే వినయున కప్పు డామెకును దనకును గలభావిసంబంధము స్పష్టపడియెను. తనస్వభావమునకు విరుద్ధముగాఁ దన్నెంతవఱకు గోరా యీడ్చుకొనిపోయెనో తెలిసికొని వినయుఁడు కోపముతోఁ దన్నుఁదాను నిందించుకొనియెను; మొదటినుండియు నీవిషయమునఁ దన్ను నిషేధించుచున్న యానందమయి దూరదృష్టింగూర్చి ప్రశంసించుచు వినయుఁ డామెయెడల భక్తిపూర్ణుఁడయ్యెను.

ఆనందమయి వినయునిమనోభావము నెఱిఁగి యాతనిహృదయమును మఱియొక వైపునకుఁ ద్రిప్పనెంచి "బాబూ! నిన్నటిదినమున గోరాయుత్తరము వచ్చినది సుమీ!"

అనియెను. వినయుఁడు పరాకుగనే "ఏమని వ్రాసినాఁడు?" అనియెను. "తనసంగతు లేమియును లేవు. దేశమునందలి నిమ్నజాతులవారి దుర్దశలను గాంచి దుఃఖపడుచు వ్రాసినాఁడు. కలెక్టరుచేయు నన్యాయములకు ఘోషపురమువారు పడుబాధలనుగూర్చి వర్ణించి వ్రాసినాఁడు." అని యానందమయి చెప్పెను.

వినయుఁ డప్పుడు గోరాయెడలం గలిగినవిరుద్ధభావోద్రేకముచే నసహిష్ణుఁడై "గోరాదృష్టి యెప్పుడు నితరులమీఁదనే— మనసమాజమునందలి దురాచారములను మనము తొలగింపఁగలిగినప్పుడు మనకీపని చాల నుత్తమ మైనదని చెప్పుకొనుట బాగుగ నుండును!" అనియెను. అకస్మికముగ నిట్లు గోరాపై దోషారోపణము చేసి వినయుఁడు దాను ప్రత్యేకముగ నిలిచినందుల కానందమయి చిఱునవ్వు నవ్వెను.

విన—అమ్మా! నీవు నవ్వుచున్నావు. వినయున కాకస్మికముగ నింతకోపమేల కలిగిన దనుకొనుచున్నావు కాఁబోలును! చెప్పెదను వినుము! సుధీరుఁ డొకనాఁడు నన్ను హైవాట్ స్టేషనునొద్దనున్న తనమిత్రునిబంగళాకుఁ దీసికొనిపోయెను. మేము సేయాలస్టేషను విడిచినప్పటినుండియే వర్ష మారంభ మైనది. శోదపురపుస్టేషనునొద్ద బండి యాఁగినప్పు డొకవిశేషమును జూచితిమి. దొరదుస్తులను దాల్చియున్న బంగాళి యొకఁడు తననెత్తిపై మంచిగొడుగు వైచుకొని తనభార్యను బండినుండి దింపెను. ఆమె చంటిబిడ్డ నెత్తికొని యొకముదుకగుడ్డ నాబిడ్డపైఁగప్పి యావానలోఁ దడియుచు నొకప్రక్కను నిలువఁబడియుండెను. చలిచేతను, సిగ్గుచేతను నామె వడఁకిపోవుచుండెను. అతఁడుమాత్రము నెత్తిపై గొడుగు వైచుకొని హాయిగా మాటాడక చూచుచుండెను. అనిమిషమునందే నాకు "అయ్యో! ఈమనదేశములో నెండలోనైనను, వానలోనైనను, గొప్పవారికైనను, గోలఁడివారికైనను నాఁడువాండ్రకు నెత్తిపై గొడుగక్కఱలేదా?" అని విచారము కలిగినది. అతఁ డట్లే సిగ్గులేక గొడుగు వైచుకొని చూచుచునే యుండెను. పాప మామె యట్లే మాటాడక తడిసిపోవుచుండెను. ఇంతకంటె లజ్జాకర మగువ్యాపార మేమైననున్నదా? ఈసంగతి స్టేషనులోనున్న యొక్కనికైనను దప్పుగాఁ దోచినదా? స్త్రీల నెల్లవిధముల వట్టిమాటలతోఁ గాకుండ హృదయపూర్వకముగ నాదరింపవలయునని నేనప్పుడే ప్రతిజ్ఞచేసికొంటిని.

అని చెప్పుచు వినయుఁడు తనధోరణికి లజ్జితుఁడై "అమ్మా! వినయుఁ డప్పు డప్పు డీవిధముగా నుపన్యసించియుండె ననియు, నిదియు నొకయుపన్యాసమే యనియును నీవు భావింపవలదు. అభ్యాసవశమున నామాటలే యుపన్యాసములవలె నుండును, ఇందిప్పుడు వక్తృతాపేక్ష మేదియును లేదు. దేశమునం దాఁడువాం డ్రెంత భాగ్యహీనలైయున్నారని నేనిదివఱకు భావింపలేదు. ఎన్నఁడు నాలోచించియు నుండలేదు. అమ్మా! నేనింక విశేషించి మాటలాడను. అట్లు మాటలాడినచో మనఃపూర్వకముగఁ

జెప్పినవి కావని యితరులు విశ్వసింపకపోవచ్చును. అందుచే నిక వక్తృత్వమును దగ్గించెదను." అనిచెప్పి తోడనే యుత్సాహదీప్తహృదయముతో సెలవుగైకొనిపోయెను.

అప్పు డానందమయి మహిమునిం బిలిపించి "బాబూ! మన శశిముఖితో వినయునకుఁ బెండ్లి కుదురదు." అనియెను.

మహి—ఏమి? నీకిష్టము లేదా?

ఆనం—ఇది తుదకు జరుగదు గావున నాకిష్టము లేదు. జరిగినచో నిష్టము గాకేమి?

మహి—గోరా యిష్టపడియెను. వినయుఁ డంగీకరించెను. ఇంకను సంశయమేమున్నది? ఇఁక నీకిష్టము లేకున్నచో వినయుఁడు మానుకొనవచ్చును. ఈసంగతి నాకు బాగుగఁ దెలియును.

ఆనంద—వినయునిగూర్చి నాకు నీకంటె బాగుగఁ దెలియును!

మహి—గోరాకంటెనా?

ఆనం—ఆ—అందుచేతనే యెల్లవిధముల నాలోచించి నాయభిప్రాయమును జెప్పితిని.

మహి—మంచిది. గోరా వచ్చునుగాదా?

ఆనం—మహిమా! నామాట వినుము! దీనినిగూర్చి బలవంతముగఁ బ్రయత్నించినచోఁ దుదకు గందరగోళము పుట్టును. గోరా మరల నీవిషయమున వినయునితో మాటాడుట నాకిష్టము లేదు!

"అట్లే చూచుకొందము" అని తములపాకులు నములుచు మహిముఁడు కోపముతో వెడలిపోయెను.

## ౨౬

గోరా బయలుదేఱినప్పు డాతనితో, అవినాశుఁడు, మతిలాలు, వసంతుఁడు, రమాపతియు నలుగురును గలసి పోయిరి. కాని, గోరా నిర్దయోత్సాహవేగమునకు వారు తాళమును వేయఁజాలకపోయిరి. అందవినాశవసంతులు జబ్బు చేయుటచే నాలుగైదుదినములలోనే కలకత్తాకుఁ దిరిగి వచ్చిరి. గోరాయందలి భక్తిచే రమాపతియు మతిలాలునుమాత్ర మాతని నొంటిగా విడిచి పోఁజాలకపోయిరి. కాని వారాతనితోఁ బడుకష్టములకుఁ బరిమితి లేదు. గోరా పోయినచో నొక్కటే పోక—నిలిచినచో నొక్కచోటనే నిలుకడ! విధివిరామము లేదు! గోరా బ్రాహ్మణుఁ డనిచెప్పి యేగృహస్థుఁడైన నాతిథ్యమునకుఁ బిలిచినచో నాయింట నెట్టియసదుపాయములున్నను నాతఁ డచ్చటనే దినములకొలఁది నిలిచిపోవుచుండెను. అతనియుపన్యాసముల నాలకించు కుతూహలముతో గ్రామస్థులందఱు నాతని విడువఁజాలకుండిరి.

కలకత్తాకు వెలుపలనున్న గొప్పకుటుంబములవారును, చదువుకొన్నవారును నెట్లుండిరో తెలిసికొనఁగలుగుటకు గోరా కిదియే మొదటిసారి. ఈప్రకాండగ్రామ్య భారతవర్ష మెంతవఱకు విచ్ఛిన్నమై, సంకీర్ణమై దుర్బలమై యుండెనో, ఆత్మశక్తి నెఱుంగక యాత్మమంగళము నాలోచింపక యెంతవఱ కుదాసీన మైయుండెనో, కొలఁదిదూరమునందలి గ్రామములలోనే యెంతటిపరస్పరవ్యత్యాసము కలిగియుండెనో, ఈవిశాలకర్మక్షేత్రమునఁ బ్రయాణముచేయుట కాత్మకల్పితము లగు నెన్నెన్ని యడ్డంకులు ప్రతిహతము లై యుండెనో, నీచత్వమే యెంతవఱకు గౌరవముగఁ జూడఁబడుచుండెనో, దానియెదుట సంస్కారమున కెంతమాత్రము నెట్లు నిలువనీడ లేకుండఁ బోవుచుండెనో, దానిహృదయ మెట్లు నిద్రించుచుండెనో, ప్రాణ మెట్లు కడలఁటి యుండెనో, చైతన్య మెట్లుక్షీణమైయుండెనో యివి యంతయును గ్రామ్యజనులనడుమ మెలఁగకున్నచో గోరాకు దెలియకపోయియే యుండును. గోరా యొక గ్రామమునం దుండఁగా నందొకయి ల్లంటుకొనియెను. ఊరివారందఱును గోలపెట్టుచుఁ బరుగులెత్తుచు నేడ్చుచుండుటయే కాని ప్రతీకారమును జేయఁజాలకపోయిరి. విపత్ప్రతీకారమునెడల గ్రామ్యజను లెంత యసమర్థు లైయుండిరో గోరా యప్పుడు తెలిసికొనియెను. ఆయూరికి సమీపమునఁ జెఱువైనను లేదు. ఆఁడువాండ్రు దూరమునుండి నీరుతెచ్చుకొనుచుందురు. ఇట్లున్నను ధనవంతులకువారికైనను దమయింట నొకనూయి త్రవ్వించుకొనవలయు ననునూహ తోఁచలేదు. ఇదివఱకుఁగూడ నా యూరు చాలసారులు కాలిపోయినది. అది దైవదుర్విపాక మనియెంచి నిరుపాయు లై యుండిరే గాని యూరివారెవ్వరును సమీపమునందొక చెఱువైనను ద్రవ్వించుకొనలేదు. ఒక్కయూరునుగూర్చియే యిట్లుండఁగా దేశమునంతనుగూర్చి యాలోచించుట గోరా కప్పు డెంతయో కష్టముగాఁ దోఁచెను. ఈవిషయమున మతిలాలుగాని, రమాపతిగాని యేమియు నాలోచింపకుండుట గోరా కన్నిటికంటెను నాశ్చర్యముగా నుండెను. అంతేకాక గోరా సంక్షోభపడుచుండఁగా వా రిది యసంగత మనికూడ ననియుండిరి. "సామాన్యులందఱు నిట్లేయుందురు; ఇట్లే భావించుచుందురు; ఈకష్టములు వారికిఁ గష్టములుగాఁ దోఁపవు; ఇంతకంటె నెక్కుడుగా మెలఁగుట వారికి డంబముగాఁ దోఁచును! ఈయజ్ఞానము, ఈమాంద్యము, ఈదుఃఖానుభవము — ఇది యంతయును జేరి యెంతటిభయంకరదుస్సహాభార మైయున్నది! మనదేశమునందలి శిక్షితులు, నశిక్షితులు ధనికులు దరిద్రులు మొదలగు నందఱితలలమీఁదను నీభారము పడియే యున్నది! అది యెవ్వరినిగూడ ముందటికిఁ గదలనిచ్చుటలేదు!" అని గోరా యప్పుడు స్పష్టముగాఁ దెలిసికొనియెను. అందుచే రేయుంబవళు లాతనిహృదయము ఖిన్నమైపోవుచుండెను.

ఇంటికడనుండి జాబు వచ్చిన దని మతిలాలు వెడలిపోయెను. ఇఁక గోరాతో రమాపతియొక్కఁడుమాత్రమే యుండెను. ఆయిరువురును క్రమముగాఁ బోయి యొక యేటియొడ్డున నున్నముసల్మానుపల్లెయందుఁ బ్రవేశించిరి అందు బసకొఱకు హిందూ గృహములను వెదుకఁగాఁ దుదకొకమంగలివానియి ల్లగపడియెను. ఆమంగలియు నాతని భార్యయునొకతురకపిల్లవానిని బెంచుకొనుచుండిరి. నిష్ఠాపరుడగు రమాపతి కది కేవలమును నికృష్టముగాఁ దోఁచెను. ఆమంగలి యనాచారమునుగూర్చి గోరా నిందించుచు "అయ్యా! మనము హరీ యందుము; వారు అల్లా యందురు. దీనిలో నేమియు భేదమఁగపడుటలేదా?" అనియెను.

అప్పటి కప్పుడే యెండ తీవ్రమైపోయెను; ఏరు దూరము; నడుమ నిసుక కాలి యున్నది. రమాపతి దాహతాపముతో "హిందువులకుఁ బానయోగ్యమగుజల మెచ్చటదొరకును?" అని ప్రశ్నించెను. ఆమంగలియింట నొకనూయి యున్నది; కాని యాచారము లోపించు నని రమాపతి యానీటిని ద్రాగుటకు విరక్తుఁడయ్యెను. అప్పుడు గోరా "ఈబాలునకుఁ దల్లిదండ్రు లున్నారా?" అని ప్రశ్నించెను "ఇరువురు నున్నారు; కాని లేనట్లే!" అని మంగలి బదులు చెప్పెను. "అదియేమి?" అని గోరా యడిగెను. మంగలి యాకథ యంతయును జెప్పెను—

వారు నివసించుజమీందారీ యంతయును నీలిపంట పండించుదొరలయిజారా క్రిందనుండెను. ఏటియొడ్డునఁ బండించునీలిపంటనుగూర్చి రయితులకును దొరలకును దీరనివివాదము కలిగెను. అందఱు సంగీకరించిరి. కాని ఘోషపురపు రయితులుమాత్రి మేటివాడవను దొరలకు వశపఱచుట కంగీకరింపలేదు. ఆయూరివా రందఱును దురకలే. వారి నాయకుఁడగు ఫరూసర్దారు దేవునికైనను భయపడువాఁడుగాఁడు. ఆసంక్షోభములో నతఁడు పోలీసువారి నెదిరించి జైలునకుఁ బోయి వచ్చెను. అతని కింట నన్నము లేకుండఁ బోయెను. అయిన నాతఁ డట్లే యుండెను. మేనేజరుదొరగారు పోలీసులతో స్వయముగ వచ్చి యాయూరిరయితులపంట లన్నియును బలవంతముగఁ దీసికొనిపోయిరి. ఆకలహములో ఫరూసర్దారుకుడిచేయి విరిగిపోయెను. ఆ తరువాతఁగూడ గ్రామమునఁ బోలీసుగందరగోళము హెచ్చి ప్రజల బాధల కంతము లేకపోయెను. ప్రజలసొత్తులకుఁ గాని, స్త్రీలగౌరవములకుఁ గాని, రక్షణ లేకుండఁ బోయెను. అందుచే నూరిలోనివారు చాలమంది లేచిపోయిరి. ఫరూకుటుంబమునకు గతి లేదు. కట్టుబట్టలు తప్ప వారి కేమియును లేదు. వారట్టియవస్థలో బయటికిరాఁజాలకుండిరి. వారి కొక కుమారుఁ డుండెను. వాఁ డామంగలిభార్యను "పిన్ని" అని పిలుచుచుండును. అందుచే నామె యాబిడ్డను దనయింటికిఁ దెచ్చి పెంచుచుండెను. ఆయూరిలోని కల్లోలమింకను నడఁగలేదు. పోలీసువారిసేన యింకను నిలిచి యున్నది. వారిప్పుడు

వచ్చి యేమి చేసినను నూరివారికి దిక్కు లేదు. పోలీసువారు మంచిచెడ్డలఁ జూడకుండ ననుదినము నందఱను బాధించుచుండిరి. ఇదివఱ కెన్నఁడును పోలీసువారి గ్రామమునకు వచ్చి యింతదౌర్జన్యము చేయుట లేదు. ఈయూరిలో నొక్క యువకుఁడు మాత్రము దొరకకుండఁ బాఱిపోయెను. అతని యనుసంధానముకొఱకు పోలీసువా రింకను నిచ్చట నున్నారు. ఇదివఱ కిచ్చటివారిని జాలమందిని వారు జైలునకుఁ బంపి యున్నారు. ఈగ్రహచార మెప్పటికి వదలునో తెలియదు—ఇది కథ !

గోరా యాకథవినుచు నింకను లేవఁదలఁచుకొనలేదు. రమాపతిప్రాణములు పోవుచుండుటచే "ఇచ్చటికి హిందూగృహ మేదైన సమీపమున నున్నదా?" అని ప్రశ్నించెను.

మంగ—ఇక్కడకు మూఁడుమైళ్ళదూరమున నీలిఫ్యాక్టరీ యున్నది. దానికిఁ దహశ్శీల్దారు బ్రాహ్మణుఁడే. అతనిపేరు మాధవచటర్జీ.

గోరా—మంచివాఁడేనా ?

మంగ—యమదూతవంటివాఁడు ! అంతనిర్దయుఁడు, నంతటి చమత్కారియు నెచ్చటను లేఁడు. అతఁడే యీపోలీసువారికర్చు లన్నియును మామీఁదఁగట్టినవాఁడు! అం దాతనికిఁ గూడఁ గొంతలాభముండి యుండును.

ఆమంగలిభార్య యాతురకపిల్లవానికిఁ దల యంటి స్నానము చేయించుచుండుటఁ గాంచి రమాపతి యసహ్యించుకొని యింక నచ్చట నిలువఁజాలక "గోరాబాబూ! పోవుదము రమ్ము" అనియెను. గోరా బయలుదేఱునప్పుడు మంగలిం బిలిచి "ఈబాధలు పడుటకంటె నెక్కడకైనను బోఁగూడదా ? నీకచ్చటను జుట్టములు లేరా" అని ప్రశ్నించెను.

మంగ—చాలదినములనుండి వీరితోఁ గలసి యున్నాను. నేను హిందువును; నాకు భూమితోఁ బనిలేకుండుటచే ఫ్యాక్టరీవారు నన్ను బాధించుట లేదు ఇప్పుడీయూరిలోఁ దగినమగవాఁడే లేఁడు. నేనుకూడఁ బోయినచో నిచ్చటియాఁడువాండ్రందఱును బెంగపెట్టుకొని చచ్చిపోవుదురు.

గోరా—మంచిది. భోజనమైనతరువాత మరల వచ్చి నిన్నుఁ గలిసికొందును.

ఆఁకలివేఁడిచే రమాపతి కీయూరివారిమీఁదఁగూడఁ గోపము కలిగెను. ఇంతటి బలవద్విరోధమునకుఁ దల యొగ్గుట వారిబుద్ధిహీనతయే యని యాతనికిఁ దోఁచెను. వీరికిఁ దగినశాస్తియే యైనదని యాతఁ డనుకొనియెను. ఇట్టిదరిద్రులను పోలీసునిర్బంధమునఁ దుంచవలసినదేయనియు, గొప్పవారితోఁ గలసి యుండవలయును గాని విరోధము తెచ్చుకొని పౌరుషము చూపుట తగదనియు, ఫ్యాక్టరీదొర-లీవిషయము బాగుగనే చేసి రనియు నాతఁడు భావించెను.

అరయెండలో నిముకలో గోరా యేమియు మాటాడక రమాపతితో నడచిపోయి ఫ్యాక్టరీసమీపమందున్న చెట్లగుంపునఁ బ్రవేశించి "రమాపతీ! నీవు భోజనమునకుఁ బొమ్ము! నే నామంగలియింటికిఁ బోయెదను" అనియెను.

రమా—అది యేమి? నీవు! భోజనము చేయవా! చటర్జీయింట భుజించి మఱి పోవుదము.

గోరా—నాకర్తవ్యమును నేను చేసికొందును. నీవు భోజనముచేసి తిన్నఁగా కలకత్తాకుఁ బొమ్ము! నాకింకను ఘోషపురములోఁ గొన్నిదినము లుండవలసివచ్చునని తోఁచుచున్నది—నీ వట్లుండఁజాలవు.

గోరావంటిమతాచారి మ్లేచ్ఛునింట నుండెద నని చెప్పుటచే రమాపతిసర్వాంగకములును గంటకితము లై పోయెను. గోరా యిప్పు డన్నపానములను త్యజించి ప్రాయోపవేశము చేయఁదలంచెనా యని యాతఁడు భావించెను ఆఁకలిచే నాతనికి నిమిషమొక యుగముగా నుండెను. ఆలోచించుట కవకాశము లేదు. ఎట్లయినఁ దప్పించుకొని పోవలయు నని యెంచి రమాపతి గోరాను బలవంతపెట్టలేదు. చూచుచుండఁగనే గోరా దీర్ఘశరీరము, దీర్ఘచ్ఛాయతోఁగూడ నెండలోఁబడి నిర్జనతప్తవాలుకామధ్యమునుండి యొంటిగాఁ దిరిగిపోయెను.

మంగలి యొంటిగావచ్చినగోరాను జూచి యాశ్చర్యపడియెను. గోరా యామంగలిచేఁదతోనే యానూతినీళ్ళు తోడికొని త్రాగెను. తరువాత గోరా యాతని యింట వంట చేసికొని భుజించి "నేను నీయింట నాలుగుదినము లుండెదను" అనియెను. ఆమంగలి భయభక్తులతోఁ జేతులు జోడించుకొని "ఈయల్పునియింట మీవంటివా రుండఁగోరుటకన్నను గావలసిన దేమి? కాని మీరిచ్చట నుండుట పోలీసువారి కనుమానముగ నుండునేమో యని భయముగా నున్నది" అనియెను.

గోరా—నేనుండఁగాఁ బోలీసువారు నిన్నేమిచేయుటకును సాహసింపఁజాలరు. అట్లు జరిగినచో నేను నిన్ను రక్షింతును.

మంగ—అయ్యా! మీరు రక్షించినను నాకు రక్షణ ముండదు. నే నేదియో మోసము చేయుటకై మిమ్ముఁ దీసికొని వచ్చితి నని పోలీసువారు తప్పుసాక్ష్యమును సిద్ధము చేసి నన్ను దండింతు రేమో? ఇంతవఱకు నేనీగ్రామములోఁ జిక్కుకొనకుండఁ దప్పించుకొని యుంటిని. నేనుగూడ నీయూరు విడిచి పోవలసివచ్చినచో నిచ్చటివారందఱును జచ్చిపోవుదురు.

గోరా పట్టణమునందే పెరిగినవాఁ డగుటచే మంగలిభయమునకుఁ గారణమును దెలిసికొనఁజాలకపోయెను. న్యాయపక్షమున సుస్థిరముగ నిలుచుటయే యన్యాయపక్షమునకుఁ బ్రతీకార మని గోరా యుద్దేశము! ఈవిపన్నగ్రామమును నిస్సహాయస్థితి

లో విడిచి పోవుట యాతని కిష్టము లేకుండెను. అప్పుడు మంగలి యాతని పాదములపైఁ బడి "బాబూ! మీరు బ్రాహ్మణులు. మీరు మాయింటి కతిథులై వచ్చి యుండఁగాఁ బొమ్మనుటకంటె నపచారములేదు. కాని, మీరు మాయింట నున్నచోఁ బోలీసువారివలన భయము కలుగు నని నాయందు దయఁగలవారు కావుననే మీతో మనవి చేసికొనుచున్నాను." అనియెను.

మంగలి బుద్ధిలేక యకారణముగ భయపడుచుండె నని విరక్తుఁడై గోరా యపరాహ్ణసమయముననే యాయిల్లు విడచి పోయెను. ఆమ్లేచ్ఛాచారునియింట భోజనము చేసినందుల కాతనికిఁ గష్టముకూడఁ గలిగెను. అతఁ డాయానముతో సాయంకాలమునకు నీలిఫ్యాక్టరీ కచేరీకిఁ బోయెను. రమాపతి భోజనము చేసిచేయకుండఁగనే కలకత్తాకుఁ బోయి యుండుటచేఁ గోరా కగపడలేదు. మాధవచటర్జీ గౌరవముతో గోరా నాతిథ్యమునకుఁ బిలిచెను. గోరా యగ్నిజ్వాలవలె మండుచు "మీయింట నేను మంచినీళ్లయినను ద్రాగను" అనియెను. మాధవుఁడు విస్మితుఁడై కారణ మడిగెను. గోరా యాతని నత్యాచారి యనియు, నన్యాయపరితప్తుఁ డనియుఁ దూలనాడి చటాలున లేచెను. అప్పుడు కుర్చీపైఁ గూర్చుండి హుక్కాను సేవించుచున్న పోలీసు ఇనస్పెక్టరు గంభీరముగఁ గూర్చుండి కఠినస్వరముతో "ఎవరు నీవు? ఏయూరు?" అని ప్రశ్నించెను.

గోరా యామాటకు బదులు చెప్పక "నీ వినస్పెక్టరని యెఱుఁగుదును. నీవు ఘోషపురమునఁ జేసినచర్య లన్నియును విన్నాను. ఇంకను నిట్లే చేయుచున్నచో-" అనియెను.

ఇన—ఈరీతియుంచెదవు కాఁబోలు నేమి? అట్లే యగపడుచున్నావు. కడుపుఁ గూటికి వచ్చి కన్నులెఱ్ఱచేయుటయా? ఎవ రక్కడ?—

మాధవుఁడు తత్తరముతోఁ బోయి యాతనిచేయి పట్టుకొని "అంతపని యెందులకు? పెద్దమనుష్యు నవమానింపఁగూడదు!" అని వేఁడుకొనియెను.

ఇన—ఎంతువంటి పెద్దమనుష్యుఁడు? ఈతఁ డిట్లు మాటాడుట మిమ్మవమానించుట కాదా?

మాధ—అతఁ డన్నమాటలోఁ దప్పులేదు. కోపపడిన నేమిలాభము? మన మీఫ్యాక్టరీదొరలయన్నము తినుచున్నాము. ఇంతకంటె నింకఁ జెప్పవక్కఱ లేదు. కోప మెందులకు బాబూ! నీవు పోలీసుఇనస్పెక్టరువు; నిన్ను యమభటుఁ డనినఁ దిట్టగునా? పెద్దపులి మనుష్యునిఁ జంపి తినును. అది సాధుత్వము కాదని దానికే తెలిసియుండవచ్చును. కాని యేమిచేయును? దానికట్లే తిని జీవింపవలసి యున్నది.

మాధవుఁడు నిష్ప్రయోజనముగఁ గోపమును బ్రదర్శించుస్వభావము గలవాఁడు కాఁడు. ఎవ్వనివలన నెప్పు డపకార మగునో, యెప్పు డుపకార మగునో ముందుగాఁ దెలిసి యెవ్వరు చెప్పఁగలరు? మాధవుఁ డెప్పుడు నెవ్వరికైన నవమానము గాని యనిష్టముగాని బాగుగ సూచించియే చేయుచుండును; కాని యూరక వృథాకోపముచే నితరులను నొప్పించి తనసామర్థ్యమును దుర్వినియోగము చేయువాఁడు కాఁడు.

అప్పు డినస్పెక్టరు గోరాను జూచి "బాబూ! మేము సర్కారు పనివాండ్రమై వచ్చి యున్నాము. ఈవిషయమునుగూర్చి యేమి చెప్పినను గందరగోళము పుట్టి మాకొంపలు మునిఁగిపోవును." అనియెను.

గోరా యేమియు మాటాడక వెడలిపోవుచుండెను. మాధవుఁ డాతని వెంబడించి "అయ్యా! నీమాటలోఁ దప్పులేదు. మేము కసాయిపని చేసితిమి. ఆ యినస్పెక్టరును జూచితివా? అతనిపక్కను గూర్చుండుట కూడఁ బాపము! అతనిచే నోటితోఁ జెప్పఁజాలనంతటి దుష్కార్మల నెన్నిటినో చేయించితిని. ఇఁక నెంతయో కాల ముండను. నాబిడ్డపెండ్లికిఁ దగినడబ్బు రెండుమూఁడేండ్లలో సంపాదించుకొని కుటుంబముతోఁ గాశికిఁ బోయెదను. ఒక్కొక్కప్పు డురిపెట్టుకొని చావవలయు నని తోఁచుచుండెను. బాబూ ఈరాత్రి యెక్కడకుఁబోయెదరు? ఇక్కడనే భుజించి పరుండుఁడు. ఆ యినస్పెక్టరు మీసమీపమునకైన రాకుండునట్టి యేర్పాటుచేయుదును." అని వేఁడికొనియెను.

అంతటికంటెను గోరా కాఁకలి యెక్కువ! నేఁటిమధ్యాహ్నభోజన మాతనికి సరిపడలేదు. కాని యిప్పు డాతనియొడలు మండిపోవుచున్నది; ఇక్కడ నుండుట కిష్టములేక తుద కాతఁడు "నాకుఁ జాలఁ బనియున్నది!" అని చెప్పివైచెను.

మాధ—అట్లయినచో నాగుఁడు. మీకు లాంతరు నిచ్చెదను.

ఆమాటకు బదులుచెప్పక గోరా వెడలిపోయెను. మాధవుఁ డింటికివచ్చి యినస్పెక్టరును జూచి "ఈతఁడు కలెక్టరునొద్దకుఁ బోవును. నీవుకూడ నేఁడొక మనుష్యుని బంపుము!" అనియెను.

ఇన—ఎందుకొఱకు?

మాధ—మతియేమియునులేదు. ఈపెద్దమనుష్యుఁ డెక్కడనుంచివచ్చి యిక్కడిసంగతులను దెలిసికొనఁబ్రయత్నించుచుండెనో తెలిసికొనివచ్చుటకు మాత్రమే.

## ౨౭

కలెక్టరు బ్రౌన్‌దొర సాయంకాలమున నేటియొడ్డున షికారు తిరుగుచుండెను. అతనితో హారానబాబుకూడ నుండెను. కొంతదూరమున దొరసాని పరేశునితనయలను

వెంటఁబెట్టుకొని బండిపై గాలిసికారుచేయుచుండెను. తాస్రినుదొర తఱచుగాఁ బెద్ద మనుష్యులకుఁ దోఁటవిందులు చేయుచుండెను; శుభకార్యములకుఁ బిలిచినచో గొప్ప వారియిండ్లకు బోవుచుండెను. పాఠశాలలయందలి బహుమతులపరీక్షలకు సభాపతిత్వము గాంచుచుండెను. ఉత్సవములు గానసభలకును బోవుచు నందఱితోడను గలసి మెలసి యుండును.

అతనిభార్య మిషనరీకన్యయగుటచే వారియింటఁ దఱచుగా మిషనరీస్త్రీలకు టీపార్టీ జరుగుచుండును. అతఁడు జిల్లాలో నొకబాలికాపాఠశాలను స్థాపించి జాగ్రత్తగాఁ బరిపాలించుచుండెను. పరేశునితనయలు బాగుగఁ జదువుకొన్నవారగుటచే సాదొర వారిని గౌరవించుచుఁ దఱచుగా జాబులు వ్రాయుచు క్రిస్టమసులో వారికి మతగ్రంథములను బహుమానముల నిచ్చుచు నుండెను.

కృషిపరిదర్శనసమావేశ మారంభ మగుటచే హారానుఁడు, సుధీరుఁడు, వినయుఁడు, వరదాసుందరి, యామెబిడ్డలునుగూడ వచ్చియుండిరి. పరేశుఁ డీసమ్మర్దమున నుండఁజాలక యొంటిగా నింటనే యుండిపోయెను. అతనిసంరక్షణకు సుచరిత యుండఁదలఁచెను గాని పరేశుఁడు మరియాదకాదని చెప్పి యామెనుగూడఁ బంపివైచెను. వారందఱు నిప్పుడు సర్కారుబంగాళాలో నుండిరి. కమీషనరుదొరగారు సస్త్రీకులై వచ్చిననాఁటిసాయంకాలమే నాటకాభినయమున కేర్పాటు జరిగెను. అందుకొఱకు కలెక్టరు తనజిల్లాలోని దొరలనెల్ల నాహ్వానించెను. కొందఱు బంగాళీ బాబులుకూడ నాహ్వానింపఁబడి వచ్చియుండిరి. వారికి వంటలకొఱకు బ్రాహ్మణుఁడు కూడ నియమింపఁబడియెను.

హారానబాబు విశేషముగాఁ గ్రీస్తుమతమునుగూర్చి కలెక్టరుతో మాటాడుచుండెను. అతనిమతజ్ఞానమునకు కలెక్టరు మిగుల నాశ్చర్యపడి యింకను నీవీమతము నేల స్వీకరింపలేదనికూడ నడిగియుండెను. ఈసాయంకాలము దొరగారు హారానబాబుతో బ్రహ్మసమాజమును గూర్చియు, హిందూసమాజమును గూర్చియు నాలోచించుచుఁ దిరుగుచుండఁగా గోరా యచ్చటికి వచ్చి “గుడ్ ఈవినింగ్ సార్” అని యెదుట నిలువఁబడియెను. గోరా కచేరీసమయమునందు దొరను జూడవలసినదే కాని డఫేదారునకు లంచమియ్యనిచో దర్శనము దొరకదు. అట్లు చేయుట యవమానముగా భావించి యాతఁ డీసికారుసమయమునఁ జూడవచ్చెను. అప్పుడు హారానుఁడుగాని, గోరాగాని యొక్కరి నొకరెఱిఁగియున్నట్లెట్టిభావమును ప్రకటింపలేదు.

గోరాయొడ్డుపొడుగురంగులను గాంచి బంగాళీలలో నిట్టివారిని జూడలేదని కలెక్టరు విస్మితుఁ డయ్యెను. అతనిదుస్తులన్నియును మాసియుండెను. ఒకరుమాలును తలకుఁజుట్టుకొని చేతికఱ్ఱను బట్టుకొని గోరా నిలువఁబడి “నేను ఘోషపురమునుండి

వచ్చితిని" అని చెప్పెను. కలెక్టరు విస్మితుఁడయ్యెను. ఘోషపురవ్యవహారములను గురించి యెవ్వఁడో వచ్చి యాక్షేపించె నని దొర నిన్ననే వినియుండెను. అతఁడే యీతఁడై యుండునని యనుకొని కలెక్టరు నతని యాపాదమస్తకమును దీవ్రదృష్టితోఁ జూచి "నీ వేజాతివాఁడవు?" అని ప్రశ్నించెను.

గోరా— బంగాళీబ్రాహ్మణుఁడను.

దొర—అలాగా! పత్రికలతో నీకు సంబంధ మున్నదనుకొనియెదను.

గోరా—లేదు.

దొర—అట్లయినచో నీవు ఘోషపుర మెందులకు వచ్చితివి?

గోరా—ప్రయాణము చేయుచు మార్గవశమున వచ్చితిని. పోలీసువారి దౌర్జన్యములచే నా గ్రామ మంతయు దుర్గతిపాలై యున్నది. ఇంకను నుపద్రవములు కలుగునని తోఁచి ప్రతీకారము గోరి మీయొద్దకు వచ్చితిని.

దొర—ఆ గ్రామస్థు లందఱును జాలదుర్మార్గులు.

గోరా—కారు! నిర్భయులు; స్వతంత్రులు! వా రన్యాయములను, నత్యాచారములను నిశ్శబ్దముగ సహించి యుండఁజాలరు!

దొర—(కోపముతో) ఇక్కడివారిసంగతులు నీకు బాగుగాఁ దెలియవు.

"ఇక్కడిసంగతులు నాకంటెను మీ కెక్కువ తెలిసియుండవు?" అని గోరా మేఘగంభీరస్వరముతో బదులు చెప్పెను.

దొర—నీవీఘోషపురవ్యాపారమునఁ గలుగఁజేసికొన్నచోఁ జిక్కులలోఁ బడి పోవుదువు! జాగ్రత్త!

గోరా—మీ రీ యిట్టిదౌర్జన్యముల నడఁగింపనప్పుడు, గ్రామస్థుల నింకను బాధింపవలయు నని మీకే పట్టుదల యున్నప్పుడు నాఁకిక నుపాయ మేమున్నది? పోలీసువారి నెదిరింపవలయు నని నేను గ్రామస్థుల నందఱను బ్రోత్సహించుటకై ప్రయత్నింపవలసియున్నను.

పచారుచేయుచున్న దొర యాకస్మికముగ నాఁగి గోరాను దీవ్రదృష్టితోఁ జూచి గర్జించుచు "అబ్బా! అంతపంతమా?" అనియెను.

గోరా మఱి యేమియు మాటాడక ధీరగంభీరగమనముతో వెడలిపోయెను.

దొర—హరానబాబూ! ఇప్పుడు మీ దేశస్థు లందఱిలోనను నిట్టి దుర్లక్షణము లగపడుచున్న వేమి?

హరా—చదువులో నంతగంభీరభావము లేదు! ఆధ్యాత్మిక చారిత్రక నైతిక జ్ఞాన మసలే లేదు! అందుచేత నే యిట్లున్నారు! ఇంగ్లీషు చదివెదరే గాని యందలి మంచిని గ్రహించుట వీరికిఁ జేతగాదు. భారతవర్షము నింగ్లీషువారు పాలించుట

భగవదుద్దేశమని యావిశ్వాసహీను లంగీకరింపరు! ఎంత చదివినను వీరి కనుభవజ్ఞానము లేదు. అదియే దీనికంతకును గారణము.

దొర — క్రీస్తు నంగీకరింపకున్నచో నీభారతవర్షమున కెన్నఁటికిని సంపూర్ణధర్మబోధము కలుగదు.

హారా — ఇదియు నొకవిధముగా సత్యమే!

అని హారానుఁడు తనక్రీస్తుమతజ్ఞానమునుగూర్చియు, నందలి యభిమానమును గూర్చియు విశేషించి మాటలాడుచుండెను. ఇంతలో దొరసాని యింటికిఁ బోవుచున్నామని కేక వైచుటచే దొర యదరిపడిపోయి తనబండి నెక్కి హారానునితో మనము రాత్రిమాటాడుద మని చెప్పి వెడలిపోయెను.

హారానుఁడు బంగాళాకుఁ బోయి యారాత్రి కలెక్టరుతోఁ గ్రీస్తుమతమును గూర్చియే విశేషముగ మాటలాడెను. కానియప్పు డగపడినగోరాప్రశంసయే యెత్తలేదు.

౨౮

ఏదో యొకవిధముగా నేరమును విచారింపకుండఁగనే గ్రామస్థులకు భయము పుట్టించుటకై నలుబదియేడుగురుపౌరులు కైదునం దుంపఁబడిరి. కలెక్టరును జూచిన తరువాత గోరా వకీలకొఱకుఁ బ్రయత్నించుచుఁ దనసహపాఠియగు సాతకడీహాల్దారచ్చట వకీలుగా నుండెనని తెలిసికొని యాతనియొద్దకుఁ బోయెను. సాతకడీ యాతనిం గాంచి "ఓహో! గౌరమోహనుఁడా? ఇచ్చటికేల వచ్చితివి?" అనియెను.

గోరా — ఘోషపురపౌరులను జామీనుమీఁద విడుదలచేయించుటకై వచ్చితిని.

సాతి — ఎవ్వరు జామీనుందురు?

గోరా — నేనే.

సాత — నలుబదియేడ్గురకు జామీ నుండుట నీకు సాధ్యమగునా?

గోరా — సొమ్ము జామీనుమీఁద విడుదల యిచ్చినచో నేనుచెల్లించెదను.

సాత — తక్కువసొ మ్మగుననుకొంటివా యేమి?

మఱుఁనాఁడు కలెక్టరుగారియొద్ద జామీనుకొఱకు దరఖాస్తు చేయఁబడెను. నిన్నటి మలినవస్త్రధారి యగువీరమూర్తిని గాంచి కలెక్టరాదరఖాస్తును త్రోసివైచెను. పదునాలుగేండ్లబాలుఁడు మొదలు, పండ్లూడినవృద్ధునివఱకును గలవారందఱును కైదులోఁ బడి కష్టపడవలసి వచ్చెను.

గోరా యీయభియోగమును నడిపింపవలయు నని సాతకడీని గోరెను. అతఁడు గోరాను గాంచి "సాక్షులెక్కడ దొరకుదురు? సాక్షులందఱు నపరాధులే. మఱియు నిది దొరలతోడికలహము కావున నియమపూర్వకముగా సాక్షులవా రందఱును విచారిం

పంబడిరి. ఇందుఁ జదువుకొన్న గొప్పవారిప్రోత్సాహ ముండునని కలెక్ట రనుమాన పడుచున్నాఁడు. నన్నుఁగూడ ననుమానించు నేమో? ఇట్టియల్లరులకుఁ బ్రతీకారము చేయకున్నచో దొరలు గ్రామములో నుండుటకే యిబ్బంది కలుగునని యింగ్లీషుపత్రి కలు వ్రాయుచున్నవి. ఇట్టిస్థితిలో దేశస్థులే దేశమునందు సుఖముగా నుండుట కవకా శము లేదు. దౌర్జన్యములు జరుగుచుండెనని తెలిసియు నూరకుండవలసివచ్చుచున్నది.” అనిచెప్పెను.

గోరా—(తీవ్రస్వరముతో) ఎల యూరకుండవలయును ?

సాత—నీవింకను స్కూలులో నున్నరీతినే యగపడుచున్నావు. ఎందుల కం దువా! నాయింట భార్యాపుత్రు లున్నారు. డబ్బు సంపాదింపకున్నచో దినము గడ వక యుపవాసము చేయవలసివచ్చును. ఇతరులబాధలు నెత్తిపైఁ బెట్టుకొనుటకును, సంసారమునకును చాలదూరము. ఇంతేకాక యీదేశమున నొక్కనిపైఁబదిమందికుటుం బమాధారపడి యుండును. అట్టిచో మతిపదిమందిని భరించుట కవకాశ ముండదు.” అనియెను.

గోరా—అట్లయినచో నీవేమియును జేయవా? హైకోర్టునకు—

సాత—ఇది యింగ్లీషువారిని బాధించిననేర మని నీకుఁ దెలియలేదా? ప్రతి దొరయును రాజే—ఒక చిన్నదొరను బాధించినను నది రాజద్రోహమే. ఉపయోగ ము లేనివిషయమునఁ బనిచేసి కలెక్టరునకుఁ గోపము కలిగించుట నాకిష్టము లేదు.

అప్పుడు గోరా రేపటిపదిగంటలబండిలోఁ గలకత్తాకుఁ బోయి యొకవకీలును దీసికొనిరావలయు నని నిశ్చయించుకొనియెను. మరునాఁడాతఁడు స్టేషనునకుఁ బోవు చుండగాఁ ద్రోవలో నే ప్రయాణమున కాతంకము కలిగెను.

ఆప్రదర్శనసమాజేకసమయమున నాయూరివిద్యార్థులును గలకత్తావిద్యార్థులు ను రెండుపక్షములుగాఁ జేరి పోటీగా క్రికెట్టు నాడుచుండిరి. అప్పుడు పొరపాటున బంతిచెదరి యొకనికాలికిఁ దగిలి గాయమయ్యెను. ఇరువురువిద్యార్థు లాతనిఁదీసికొని పుష్కరిణియొద్దకుఁబోయి యొకగుడ్డను దడిపి యాతనిగాయమునకుఁ గట్టు కట్టుచుం డిరి. అప్పుడు చెరువుకావలివాఁడు వచ్చి వారినిఁగొట్టుచుఁ దిట్ట నారంభించెను. త్రా గుటకొరకు నియమింపఁబడిన యాపుష్కరిణిలో నెవ్వరును దిగఁగూడదు. ఆసంగతి విద్యార్థులకుఁ దెలియదు. తెలిసినను నొకసామాన్యుఁడగు పారావానియాజ్ఞను బా లించునంతటి సహనభావము విద్యార్థుల కుండదు. అందుచే వారందఱు నేకమై యాపారావానిని బాదఁగొట్ట నారంభించిరి. ఇంతలో మఱికొందఱు పోలీసువారు వచ్చి తిట్టుచు విద్యార్థులను లాఠీలతోఁ గొట్టుచుండిరి. ఆసమయమునకు సరిగా గోరా యచ్చటికి వచ్చెను. ఆవిద్యార్థు లందఱు నాకుఁ దెలిసినవారే. వారి కిట్టి

యవమానము కలుగుట గోరా సహింపక పోలీసువారిని డీకొనియెను. ఇంతలోఁ జాల మంది విద్యార్థులు వచ్చి పోలీసువారిని జెకుఁగొట్టి పంపివైచిరి. దారినే పోవువా రందఱును గుంపులుగా వచ్చి యిది యంతయును జూచి యానందించిరి. కాని యీ తమాషా యంతయును దమాషాగాఁ బోలేదు.

మూఁడు నాలుగు గంటలవేళ దాక బంగాళాలో వినయుఁడు, హారానుఁడు, లలిత మొదలగువా రందఱు నభినయప్రదర్శనమును సరిచూచుకొనుటకుఁ బ్రవృత్తులై యుండిరి. అప్పుడు వినయుఁ డెఱింగిన యిరువురు విద్యార్థులు వచ్చి గోరాను మఱి కొందఱు విద్యార్థులను పోలీసువారు తీసికొనిపోయి చెఱయం దుంచి రనియు రేపు కలెక్టరునొద్ద విచారణ జరుగు ననియుఁ జెప్పిరి. 'గోరా చెఱయం దున్నాఁడు!' అను నీమాటకు హారానుఁడు తప్ప నందఱు నదరిపడిరి. వినయుఁడు తత్క్షణమే లేచి తనసహపాఠి యగు సాతకడీ యొద్దకుఁ బోయి సర్వమును దెలిపి యాతని వెంటఁబెట్టుకొని కారాగృహమునొద్దకుఁ బోయి గోరాను జూచి "ఈసాతకడీ నీపక్షమున వకీలుగా నుండి నిన్ను జామీనుపై విడుదల చేయించును!" అని చెప్పెను. గోరా "నాకు వకీలును వలదు; నావిడుదలకొఱకుఁ బ్రయత్నమును వలదు!" అని చెప్పెను.

సాతకడీ వినయునివంకఁ జూచి "ఇది యేమిమాట! చూచితివా? గోరా యింకను బడిపిల్లవానివలెనే మాటలాడుచున్నాఁడు. ఈతనితీవ్రస్వభావ మిప్పటికి నట్లే యున్నది!" అనియెను.

గోరా—అదృష్టవశమున నాకుఁ గావలసినంత ధనమును, మిత్త్రులు నున్నారని యెంచి యామూలమున జైలునుండి విడుదల నందవలయు నని నే నూహించుట లేదు. మన దేశమునందును నీతిధర్మము లున్నవని రాజు గ్రహించునట్లు చేయవలయును. ప్రజలయెడల నవిచారుఁడై యుండుట రాజునకు ధర్మము గాదు. కాని, యీదేశమున వకీళ్ళకు డబ్బు నిచ్చుకొనలేనివారు జైళ్ళలోఁ బడి చావవలసి వచ్చుచున్నది. కోర్టులలో న్యాయము కొల్లకొలది వెచ్చించుకొనవలసి వచ్చుచున్నది. వచ్చినను సరియే గాని నేనీవిచారణమునం దొకదమ్మిడియైనను వెచ్చింపఁదలఁచుకొనలేదు.

సాత—కాజీపరిపాలన మైనచో లంచములకుఁ దలకే యమ్ముకొనవలసి యుండును.

గోరా—లంచములఁదీసికొనవలయునని రాజశాసనము లేదు. అది యధికారుల చేతులలోనున్నది. ఇప్పటిన్యాయసభలలో నిలువఁబడి వాదియైనను, ప్రతివాదియైనను, దోషియైనను నిర్దోషియైనను గన్నీరు విడువవలసినదే గదా! మఱియు నిర్ధనుఁ డగువానికి వ్యవహారమున జయముగాని, గౌరవముగాని లేదు. ఇఁక దొరతనమువారే వాదులగు రాజ్యవ్యవహారము లంటివానిలో వకీళ్ళును బ్యారిష్టరులును వారిపక్షమే. నాకు న్యాయము

లభించినచో మంచిదే. లేకున్న నాయద్భుతము! విచారణయందు వకీలుతోఁ బ్రయోజనమే లేనప్పుడు సర్కారు పక్షమున వకీలేల? ప్రయోజనమున్నచో గవర్నమెంటునకు విరుద్ధపక్షమునఁగూడ నొకవకీ లుండవలసిన యావశ్యక మేమున్నది? ఇది ప్రజల యెడల శత్రుత్వము కాదా? ఎట్టి రాజధర్మము!

పాత—సోదరా! కోపపడియెద వేమి? సివిలుసేవను చౌకసరుకు కాదు. సూక్ష్మవిచారణ కావలసియున్నచో సూక్ష్మశాసనములఁ జేయవలయును. అట్లు చేసినచో శాసనవ్యవసాయకులు లేక పను లాగిపోవును. వ్యవసాయము ఉన్నప్పుడే క్రయవిక్రయములు ఉండును. అందుచేతనే కోర్టులు న్యాయసంపాదనము చేయు క్రయవిక్రయ వ్యాపారులచే నిండవలసివచ్చెను—ఇచ్చట ధనములేనివాని కపజయమే—కాని, నీవు రాజవైనచో నేమిచేసెదవో చెప్పుము.

గోరా—వేలకొలఁదిజీతములు తీసుకొనుచున్న యధికారులకే యోగముకాని చట్టము ఉన్నప్పుడు నిర్భాగ్యులగు వాదిప్రతివాదుల పక్షపు వకీళ్లఖర్చులు దొరతనవారు భరించిన బాగుగా నుండును. న్యాయమగుతీర్పు జరిగినతరువాత ఖర్చులు ప్రజలపైఁ గట్టవచ్చును.

పాత—మంచిది. ఆదినము లింకను రాలేదు. నీప్రభుత్వమురాలేదు. నీవిప్పుడు ఈభవ్యప్రభుత్వమువారికోర్టునందుఁ బ్రతివాదివై యుంటివి. నీవు ధనమును వెచ్చింపవలయును. లేదా వకీళ్ల నాశ్రయింపవలయును. ఇంతకంటె నీకిప్పుడు మఱియొకగతిలేదు.

గోరా—ఏప్రయత్నమును జేయకున్నచో నేమగునో యాగతియే నాకుఁ గలుగనిమ్ము. ఈరాజ్యమునఁ గేవలము నిరుపాయుఁడగువాని కేగతిపోగా నాకు నదియే—

వినయుఁ డెన్నోవిధముల ననునయించెను. కాని గోరా వానిని వినిపెట్టక "అకస్మికముగా నీ విచ్చటికేలవచ్చితివి?" అనియెను. వినయుని మొగము ఎఱ్ఱనయ్యెను. గోరా జైలునం దుండెను గాని లేకున్నచో వినయుఁ డాతనికిఁ దీవ్రముగానే బదులుచెప్పి యుండును. ఆతఁడు "నామాటకేమి?—ఇప్పుడు నీవు"— అనియెను.

గోరా—నేను రాజుగారి యతిథిని. నన్నాయన గౌరవించుచున్నారు. నిన్నెవ్వరు నిటకుఁ బిలువలేదే!

వినయుఁడు గోరాను విడుదలయగుట యసంభవమని యెంచి వకీలు నేర్పఱచుటమాని "నీవిక్కడ భుజింపఁజాలవు. నీకు భోజనము పంపుట కేర్పాటు చేయుదును" అనియెను. "నీవేల వృథాశ్రమపడెదవు? జైలులో నందఱివలెనే నేనును భుజింతును. నాకుమాత్రము ఇతరభోజన మేల?" అని గోరా బదులుచెప్పెను.

వినయుఁడు మనఃకష్టముతో బంగాళాకుఁ బోయెను. సుచరిత యొకగదిలోఁ దలుపులు మూసికొని యుండి కిటికీనుండి వినయునిరాక కెదురుచూచుచుండెను.

అంజలితోడను గలసియుండుట యామెకు దుస్సహముగ నుండెను. దీనవదనముతో వచ్చుచున్న వినయునిం గాంచి యామెహృదయమున భయసంశయములు కలిగెను. ఆమె యెట్లో మనసు కుదుటపఱచుకొనుటకుఁ బ్రయత్నించి పుస్తకమును జూచుకొనుచుఁ గూర్చుండెను. లలిత యిష్టములేకపోయినను నొకగదిలోఁ గూర్చుండి కుట్టుపని చేసికొనుచుండెను. లావణ్య సుధీరునితో నాడుకొనుచుండెను. లలిత వారిని జూచుచుండెను. హారానుఁడు కాఁబోవుప్రదర్శనమునుగూర్చి వరదాసుందరితో నాలోచించుచుండెను. వినయుఁడు వచ్చి సుచరితతో గోరావృత్తాంతముఁ జెప్పెను. సుచరిత కొయ్యబడిపోయెను. లలిత కుట్టుపని మానివైచి కందినమొగముతో వెలుపలకు వచ్చెను.

వర—వినయబాబూ! నీవు మఱియొకలా గుండవలదు. గోరాబాబునుగూర్చి నేను దొరసానిని వేఁడుకొందును.

విన—వలదు. మీరట్లుచేయవలదు. ఇది గోరాకుఁ దెలిసినచో జీవితమున్నంతవఱకు నన్నాతఁడు క్షమింపఁడు.

సుధీ—అతనిపక్షమున సమర్థించుటకుఁ దగినయేర్పాటు చేయఁగలయును.

జామీనునకుఁగాని, వకీలును బెట్టుటకుఁగాని గోరా యిష్టపడుట లేదని వినయుఁడు చెప్పెను. హారానుఁ డసహ్యభావముతో "పోనిమ్ము! ఎందుకీ వట్టిగొడవ?" అనియెను. లలితకు హారానునియం దెట్టిభావ మున్నను నింతవఱ కామె యాతని నెదురించుట లేదు. ఇప్పు డామె తీవ్రభావముతోఁ దలయూపుచు "ఇది వట్టిగొడవ కాదు! గోరాబాబు మంచిపనియే చేసెను. కలెక్టరు మనపై నేరము మోపినప్పుడు మనలను మనమే కాపాడుకొనవలయును. వారిపెద్దజీతములకొఱకు మనము పన్నుల నిచ్చుకొనుచునే యున్నాము. ఇంకను వారిబాధలనుండి తప్పించుకొనుటకు వకీళ్ళకు ఫీజులు కూడ నిచ్చుకొనవలయునా? ఇట్లు న్యాయమును సంపాదించుటకంటె జైలునకుఁ బోవుట మంచిది!" అనియెను.

లలిత యిట్లు తన్నెదిరించునని యాతఁ డెన్నఁడు ననుకొనలేదు. ఇప్పు డామె యింతతీవ్రముగ భాషించుట యాతని కాశ్చర్యముగా నుండెను. హారానుఁ డప్పుడు లలితను దర్శించుచు "ఈసంగతులన్నియు నీకేమి తెలియును? వట్టిచదువులను మాత్రము చదివి యెట్టియనుభవజ్ఞానమును లేక, యెట్టిబాధ్యతయును లేక తిరుగుచుండు నాతతాయులయున్మత్తప్రలాపములను విని నీతల తిరిగిపోయినట్లున్నది" అని మందలించి నిన్న గోరాకును, కలెక్టరునకును జరిగిన సంవాదమంతయును దెలిపెను. ఘోషపుర వ్యాపార మిదివఱకు వినయునకుఁ దెలియదు. అదివిని వినయుఁ డిఁక గోరాను కలెక్టరు క్షమించుట యసంభవమని యనుకొనియెను.

హారానుఁడే యుద్దేశముతో నీసంగతి యంతయును దెలిపెనో యాయుద్దేశము నిష్ఫలమైపోయెను. ఇంతకుముందు హారానుఁడు గోరాను జూచినట్లే చెప్పక యూరకుండెను. ఇప్పుడు గోరాయెడల నసూయను బ్రకటించుచు మాటాడెను. ఇందువలన నాతని నీచత్వము వెల్లడియగుటచే సుచరితకు హారానునియెడలఁ గోపము కలిగెను. ఎదిరించి మాటాడవలయునని యుద్రేకము కలిగెను గాని యామె యెట్లో మనసు దిద్దుకొని పుస్తకము విప్పి కంపితకరములతోఁ బత్రములను దిరుగవైచుచుండెను. అప్పుడు లలిత యుద్ధతభావముతో "హారానబాబు దోషాభిప్రాయముతో నీకీర్తనమించుఁగాక! ఎట్లయినను ఘోషపురవ్యాపారమున గౌరమోహనబాబు గొప్పతనమే స్పష్టపడుచున్నది!" అనియెను.

౨౬

నేఁడు లెఫ్టినెంటుగవర్నరు వచ్చుటచే కలెక్టరు పదిగాఁబదిగంటలకుఁ గచేరికివచ్చి విచారణలన్నియును త్వరగా ముగించుటకుఁ బ్రయత్నించుచుండెను. సాతకడీబాబు విద్యార్థులపక్షమున నిలిచి యామూలముగాఁ దనమిత్రున కుపకారము చేయఁదలఁచెను. కాని విచారణపద్ధతులనట్టి నేరము నంగీకరించి వేఁడుకొనుటయే మంచిదని యెంచి విద్యార్థులు బాధ్యత లెఱుఁగనివారనియు, వ్యవహారజ్ఞానము లేనివారనియు నెన్నియో చెప్పి క్షమింపవలయునని కలెక్టరును వేఁడుకొనియెను. కలెక్టరు విద్యార్థులవయస్సును, నేరస్వభావమును ననుసరించి యెనుమొదలిరువదియైదుగురును వారికి బెత్తపుదెబ్బలశిక్షను విధించెను. గోరాకు వకీలు లేఁడు. గోరా స్వయముగనే పోలీసువారిదౌర్జన్యమును గుఱించి చెప్పఁదలఁచెను గాని కలెక్టరాతనిఁ దీవ్రముగఁ దిరస్కరించి మాటాడనీయక పోలీసువారి నడ్డగించిన నేరమునకై యాతని కొకనెల కఠినశిక్షను విధించి దయయుంచి నీకీస్వల్పశిక్ష వైచితినని చెప్పి తన్నుఁదాను గీర్తించుకొనియెను. అప్పుడు సుధీరుఁడును వినయుఁడును గోర్టునందే యుండిరి. వినయుఁ డిఁక గోరా మొగము చూడఁజాలకపోయెను. అతనియూపిరి యాఁగిపోయినట్లయ్యెను; ఇఁక నట నిలువఁజాలక వినయుఁడు చటాలున వెలుపలికిఁ బోయెను. అప్పుడు సుధీరుఁడు బంగాళావ స్నానభోజనములకై పోవుదము రమ్మని వినయుని వేఁడుకొనియెను. వినయుఁ డొక చెట్టునీడను గూలఁబడి "సుధీరా! నీవు పొమ్ము! నేను కొంచెముసేపాఁగి వచ్చెదను!" అని చెప్పెను. సుధీరుఁడు వెడలిపోయెను.

ఎంతసేపట్లు కూర్చుండెనో వినయునకుఁ దెలియుటయే లేదు. సూర్యుఁడు తలమీఁదినుండి పడమటి కొరగిపోయినతరువాత నప్పుడొకబండి వచ్చి యాతనిసమీపమునందాఁగెను. వినయుఁడు తలయెత్తిచూచునప్పటికి సుచరితాసుధీరులు బండినుండి దిగి యాతనియొద్దకు వచ్చుచుండిరి. అప్పుడు తత్తరపడి వినయుఁడు లేచి నిలువఁబడె

రెను. సుచరిత యాతని సమీపించి ప్రేమార్ద్రస్వరముతో "వినయబాబూ! రమ్ము!" అనియెను. వినయున కాకస్మికముగాఁ జైతన్యము కలిగెను. అప్పుడు వీథిలోనివా రందఱును దన్ను వింతగాఁ జూచుచున్నట్లు తోఁచుటచే వినయుఁడు తత్తరముతో బండి నెక్కెను. త్రోవలో నెవ్వరు నెట్టిమాటయు నాడఁజాలకపోయిరి.

అందఱును బంగాళాకుఁ బోయిరి. అప్పటి కొకకలహ మారంభమయ్యెను. నేను కలెక్టరుదొరయింటికి రానని లలిత పట్టుపట్టి కూర్చుండెను. వరదాసుందరి విషమసంకటమునఁ బడిపోయెను. లలిత యసంగతవిద్రోహమునకు హారానుఁడు క్రోధవివశుఁ డైపోయెను. ఇప్పటిబాలికాబాలకు లందఱును గ్రీమోపదేశము నంగీకరింపక చెడిపోవుచుండిరనియు, మంచిచెడ్డల నెఱుంగక యెల్లవారితోడఁ గలసిమెలసి యుండుటచేతనే యిట్లు తటస్థించుచుండె ననియును, హారానుఁడు తఱచుగాఁ జెప్పుచుండును.

వినయుఁడు వచ్చినతోడనే లలిత "వినయబాబూ! నన్ను క్షమింపుము! నేను మీవిషయమున గొప్పయపరాధము చేసితిని. మీరప్పుడు చెప్పినమాట నే నెంతమాత్రమును గ్రహింపఁజాలనైతిని. ప్రపంచజ్ఞానము లేనందుచేత నే నాకట్టిపొరపాటు కలిగినది! ఈభారతవర్షమునకు దొరగారిశాసనమె యీశ్వరవిధాన మని పానూబాబు చెప్పుచున్నాఁడు! అట్లయినచో నీశాసనమును మనోవాక్కర్మములచే నిందింపవలయు ననునిచ్ఛ కలుగుటయును విధాతృవిధానమే" అనియెను. హారానుఁడు క్రుద్ధుఁడై "లలితా! నీవు—" అనియెను.

లలిత హారానునివంకకైనఁ జూడక "ఊరకుండుఁడు! నేను మీతో మాటాడుట లేదు!—వినయబాబూ! మీ రెవ్వరికొఱకును క్షమింపవక్కఱలేదు. నేఁ డెట్లును నభినయము జరుగదు!—" అనియెను. వరదాసుందరి సంభ్రమముతో నామాటను ద్రోసివైచి "లలితా! మంచిదానవే! వినయబాబునకు స్నానభోజనములమాట యూహింపవక్కఱలేదా! ఒంటిగంట దాటిపోయినది చూచితివా? చూడుము! చూడుము! వినయబాబుమొగ మెట్లు వాడిపోయినదో!" అనియెను.

విన—మన మందఱమును దొరగారియతిథులము! నేనీయింట స్నానభోజనములు చేయఁజాలను.

వరదాసుందరి వినయుని బ్రతిమాలుకొని యొప్పగించుచు సుచరిత మొదలగువా రందఱు నూరకుండుటం గాంచి కోపించి "మీరందఱు నేమి చేయుచున్నారు? సుచరితా! వినయబాబునకు నీవైనను బోధింపవక్కఱలేదా? మనము మాట యిచ్చితిమి; అందఱకు నాహ్వానములు జరగినవి; ఏలాగో మర్యాదగా మన మీదినము గడపుకొనవలయును; లేకున్నచో వారేమనుకొందురో! చూడుము! ఇఁక మనము వారియెదుటఁ దల యెత్తుకొనఁగలమా?" అనియెను.

సుచరిత మాటాడక తల వంచుకొని కూర్చుండెను. వినయుఁడు సమీపముననే యున్న నదియొద్దకుఁ బోయి స్టీమరుపై నెక్కిపోయెను. ఆస్టీమరు రెండుగంటలకు లోపలనే యచ్చటనుండి బయలుదేఱి కలకత్తాకుఁ బోయి రేపెనిమిదిగంటలకు మరల నిచ్చటికివచ్చును—హారానబాబు క్రోధముతో గోరావినయులను నిందించుట కారంభించెను. సుచరిత చటాలునఁ గుర్చీనుండి లేచి గదిలోనికిఁ బోయి తలుపు మూసికొని కూర్చుండెను. కొంతసేపటిలోనే లలిత యాగదిలోఁ బ్రవేశించెను. అప్పటికి సుచరిత రెండు చేతులతోడను కన్నులు మూసికొని పఱుపుపై బోరగిలఁ బడియుండెను. లలిత లోపలినుండి తలుపు గొళ్లెము వైచి మెల్లమెల్లగఁ బోయి సుచరితప్రక్కను కూర్చుండి యామె నీలశిరోజములను కరాంగుళులతో సంస్కరింప నారంభించెను. చాలసేపటికి సుచరిత శాంతయైనప్పుడు లలిత బలవంతముగ నామెను వెలికిలఁ ద్రిప్పి ఱొమ్మునొద్ద మొగముచేర్చి చెవిలో "అక్కా! నాకుఁ గలకత్తాకుఁ బోవలెనని యున్నది. నేడు గోరయింటికిఁ బోవలెను!" అనియెను.

సుచరిత చాలసేపటివఱకును బదులు చెప్పలేదు. లలిత మాటిమాటికి నట్లే చెప్పుచుండుటచే సుచరిత లేచి కూర్చుండి "సోదరీ! అది యెట్లు? నాకుమాత్ర మిష్టమున్నదా? తండ్రిగారియాజ్ఞ యగుటచే వచ్చితివి! ఆయాజ్ఞ చెల్లింపకుండ మనము పోవుట యెట్లు?" అనియెను.

లలి—తండ్రిగారి కిచ్చట నిట్లు జరుగు నని తెలియదు. తెలిసినచోఁ బంపకయే యుందురు.

సుచ—సోదరీ! అసంగతి మన కెట్లు తెలియును?

లలి—అక్కా! నీవుండఁగలవా! ఆ గోరయింటికిఁ బోఁగలవా? వేషము వేసికొని నాటక మాడఁగలవా? నానాలుక కోసినను రక్తమైన వెలువడును గాని యొక్కమాటయైన వెలువడదు!

సుచ—ఆసంగతి నాకును దెలియును తల్లీ! కాని యీనరకబాధను సహింపవలయును. ఇఁక గత్యంతరము లేదు! ఈదినము జీవితమునం దెన్నఁడును మఱపురానిదినము!

సుచరిత యిట్లు చెప్పుటయు లలిత కోపముతో నాయిల్లు విడిచి తల్లియొద్దకుఁ బోయి "అమ్మా! మీరు బయలుదేఱరా?" అనియెను.

వరదా—నీకు మతిపోయినదా? రాత్రి నాటక మైనతరువాతఁ బోవచ్చును.

లలి—నాకిప్పుడు కలకత్తాకుఁ బోవలసి యున్నది.

వర—అదియేమ ట్లనుచున్నావు?

లలి—సుధీరా! నీ విక్కడనే యుందువా!

గోరాకు శిక్ష యగుట సుచరితకును కష్టముగనే యుండెను. కాని పెద్దదొరల యెదుట దానికై క్షమను బ్రతిమాలుటయే యను కోరిక వాఁడు త్యజింపలేక యస్పష్టస్వరములో విడిచివచ్చుట కిష్టము లేనట్లు సూచించెను.

అప్పుడు వరదాసుందరి "ఈగొడవలలోనే పొద్దు పోవుచున్నది! అయిదుగంటలకు నెవ్వరును బక్కలనుండి లేవలేదు. కొంచెము విశ్రమింపకున్నచో రాత్రి యభినయసమయమున మొగములు వాడి వికారముగా నుండును" అనిచెప్పి బలవంతముగా నందఱను నిదురింపఁజేసెను. సుచరితకు నిద్రపట్టలేదు. లలిత పఱుపుపైఁ గూర్చుండియే యుండెను— ఇంతలో స్టీమరు కూసెను. కదలుటకు సిద్ధముగా నుండెను. వినయుఁడు డెక్కుమీఁదనుండి చూచెను. ఒక స్త్రీ యతివేగముగ స్టీమరునొద్దకు వచ్చుచున్నట్లాతనికగపడియెను. వేషభూషణములనుబట్టి యామె లలితయై యుండునని యనుకొనెను గాని నమ్మకము లేకపోయెను. సమీపించినప్పటి కామె లలితయే! వినయుఁ డప్పు డామె తన్నుఁ దీసికొనిపోవుటకై వచ్చుచుండె నని భావించెను. ఆమెకుఁ గూడ నీయభినయ మిష్టము లేదు గదా యని మరల ననుకొనియెను. అంతలో లలిత వచ్చి స్టీమరునెక్కెను. డెక్కునుండి దిగి వినయుఁ డామెయొద్దకు వచ్చుటయు లలిత "నన్నుఁ బైకిఁ దీసికొనిపొమ్ము" అనియెను.

విన—స్టీమరు కదలిపోవుచున్నది.

"ఆసంగతి నే నెఱుఁగుదును" అని చెప్పుచు లలిత మెట్లపైనుండి పైకెక్కిపోయెను. స్టీమరు కూయుచుఁ గదలిపోయెను. వినయుఁడు లలితను మొదటితరగతి డెక్కుపైఁ గూర్చుండఁజేసి యామె మొగమువంకఁ దిలకించి నిశ్శబ్దప్రశ్నముం గావించెను.

లలి—నే నిక్కడ నుండఁజాలక కలకత్తాకు వచ్చుచున్నాను.

విన—వారందఱు నెఱుఁగుదురా?

లలి—ఇంతవఱ కెఱుఁగరు. చీటివ్రాసిపెట్టితిని- చూచినచోఁ దెలిసికొందురు.

ఆమె దుస్సాహసకార్యమునకు వినయుఁడు స్తంభితుఁడై సంకోచముతో "కాని-"

లలిత యింక మాటాడనీయక "స్టీమరు కదలిపోవుచుండగా నింకను కాని యేమి? ఆఁడువాండ్రై పుట్టుటచేతనే సర్వమును సహించి యుండవలసినదా? మా పక్షమునఁగూడ న్యాయాన్యాయములును, సంభవాసంభవములు నున్నవి! నేఁటి యాహ్వానమును గౌరవించి పోయి యచ్చట నభినయించుటకంటె నాత్మహత్య చేసికొనుటయే మేలని తోఁచినది!" అనియెను. ఇఁక నీవిషయమున మంచిచెడ్డ లాలోచించి మనసు బాధ చేసికొన నెందుల కనియు జరుగవలసిన దేదియో జరిగిపోయె ననియు వినయుఁడు భావించి యూరకుండెను. కొంతసేపైనతరువాత లలిత "నేను

మీ గోరాబాబు నొకమాదిరిగా భావించి యుంటిని. ఎందుచేతనో గాని మొదటినుండియు నాతనిఁ జూచుట, యాతనిమాటలు వినుట నాకసహ్యముగా నుండెను. అతని తీవ్రభాషణములను విని మీరందఱును దలలూఁచుచుండుట నాకుఁ గోపముగా నుండెను. నాస్వభావమే యట్టిది. పనులయందును, మాటలయందును దీవ్రభావము గల వారిని నేను గహింపలేను. కాని గోరాబాబు నితరులవిషయమునందే గాక స్వవిషయమునఁగూడ నట్లే యుండెను. అతనిస్వభావమే యట్టిది. అట్టివానిని నేను చూడలేదు."

లలిత యీవిధముగా విడువకుండ మాటాడుచుండెను. ఇది కేవలము గోరాయెడల ననుతాపముచేతనే కాదు—తా నిప్పటి కన్నియు సద్యజించి తప్పు చేసివచ్చితి ననుసంకోచ మామెహృదయమున దలసూపుచుండెను. చేసినపని మంచిదగునా కాదా యనుసంగతి తేల్చుకొనవలసియున్నది. ఇంతేకాక వినయునితో నొంటిగా స్టీమరుపై నుండుట—ఇది యింతటిసాహసకృత్యమని యామె మొదట భావింపలేదు. కాని సిగ్గుపడినచోఁ జేసినపనియంతయు లజ్జాకరమైపోవునని యామెహృదయము గట్టుకొనిపోవుచుండెను. అందుచేతనే యామె యిట్లు విడువకుండ మాటలాడుచుండెను. వినయుఁడు మాటాడఁజాలకుండెను. ఒకవంక గోరాయవమానము, ఒకవంక దొరయింటికి వినోదమునకు వచ్చితి ననుసిగ్గు, ఒకవంక లలితసంబంధమగు నాశ్చర్యకారణము—ఇన్నియును గలసి వినయుని వాక్యహీనునిగాఁ జేసివైచెను.

పూర్వమైనచో లలితసాహసమును వినయుఁడు తిరస్కరించియే యుండును. ఇప్పు డట్లు తోఁచుట లేదు. అతనికి విస్మయముతోఁగూడ నానందముగూడఁ గలిగియుండెను. అందఱిలోనను దానును లలితయు మాత్రమే గోరాయవమానమునకు సాహాయ్య ప్రతీకారమును జేయఁగలిగితి మను నానందముకూడ వినయునకుఁ గలిగియుండెను. ఈ విషయమున వినయున కెంతమాత్రమును గష్టము లేదు. కాని లలితమాత్రము తనకర్మఫలమునఁ జాలదినములవఱకును బాధపడవలసియుండును. లలితకు గోరాయెడల నసూయాభావ ముండెనని వినయుఁ డనుకొనియుండెను. ఆలోచించినకొలఁది నామె యద్భుతపరిణామమును, సాహసమును, సత్యమునందలి నిరపేక్షభావమును వినయునకుఁ బ్రశంసనీయములగుచుండెను. ఆసమయమునఁ దనకుఁగలిగినభక్తిభావము నెట్లు ప్రకటింపవలయునో వినయునకుఁ దోఁచకుండెను. లలిత యిదివఱకు వినయుని బరతంత్రుఁడనియు సాహసహీనుఁడనియు నిందించియుండెను. వినయుఁ డెప్పుడు దన యిచ్ఛయమే యనుకొనియెను అతఁ డెన్నఁడును దనబంధుమిత్రుల నుపేక్షించి యొక్కఁడు సాహసించి తన యుద్దేశమును నిలుపుకొనలేదు అనేకసమయములయందు వినయుఁడు గోరాకు గష్టముగా నుండునని తన స్వభావమును మార్చుకొని యుండెను. అనేకసమయములందు

గోరామతమునే తనమతముగాఁ జిన్నచిన్నయుక్తులతోఁ దన్ను దానే సమర్థించుకొనియెను. వినయుఁ డంతయు నాలోచించుకొని లలితయే తనకంటె స్వతంత్రహృదయ యని నిశ్చయించుకొనియెను. తానిదివఱకు లలితను మనసులో నిందించినందుకు తలఁచుకొని వినయుఁడు లజ్జితుఁ డయ్యెను. అప్పు డాతఁడు లలితను జేరి క్షమాప్రార్థనము గావింపఁదలఁచెను. కాని యెట్లు గావింపవలయునో యాతనికిఁ దోఁచలేదు. లలిత కమనీయమూర్తి. వినయునిమనోనయనములను మహిమామయములుగఁ జేసివైచెను. ఆరమణీయమూర్తి యపూర్వపరిచయముచేఁ దనజీవితము సార్థక మయ్యెనని వినయుఁ డప్పుడు భావించుకొనియెను.

## 30

లలితను వెంటఁబెట్టుకొని వినయుఁడు పరేశునింటఁ బ్రవేశించెను. స్టీమరు నుండి దిగువఱకును వినయుఁడు లలితయందలి తనమనోభావమును గ్రహించుకొని యుండలేదు. అతనిమన సెప్పుడును లలితకు విరోధముగనే యుండెను. ఆమెను శాంతింపఁజేయవలయునను నాలోచనతోనే యాతనిదినము గడచిపోవుచుండెను. వినయుని జీవితమున స్త్రీమాధుర్యనిర్మలతేజముతో సుచరితయే ముందుగ సంధ్యాతారకవలె నుదయించినది. ఆనందర్శనానందమే వినయుని ప్రకృతికిఁ బరిపూర్ణత్వము ప్రసాదించినది. కాని యింతలో నింకొకనక్షత్రము జ్యోతిర్మయమూర్తిలో నుదయించుటయు, మొదటినక్షత్రము దిగంతరాళమున కొరఁగుచుండుటయు వినయునకు స్పష్టముగా ననుభవ మగుచుండెను.

అందఱిని విడిచివచ్చి లలిత స్టీమరెక్కిననాఁడే యామెయు నేను నేకపక్షమై యుందఱకును ప్రతికూలముగనుంటి మని వినయుఁడనుకొనియెను. ఇందు లలిత యందఱను బరిత్యజించి తనపక్షమునకు వచ్చియుండె ననుసంగతి నాతఁడు మఱవఁజాలకుండెను. ఏకారణముచే నేమి లలిత కిప్పుడు వినయుఁ డందఱిలో నొక్కనివంటివాఁడు మాత్రము కాదు. లలితపార్శ్వమునం దాతఁ డొక్కఁడే—ఒక్కఁడుమాత్రమే. ఆమె బంధుమిత్రులందఱును దూరమున—అతఁ డొక్కఁడే సమీపమున! ఈసామీప్యసంబంధ మగుపులకపూర్ణస్పందనము విద్యుద్గర్భాంబుదముఁబోలి యాతని హృదయాంతరాళమున విజృంభించుచుండెను. అప్పు డా డెక్కుపైఁ బరుండి లలిత నిద్రించుచున్నప్పుడు వినయుఁడు తానుగూడఁ దనకాపున నిద్రింపఁజాలక కోట్లను విడిచి వెలుపల నిశ్శబ్దముగఁ బచారుచేయుచు నామె కెట్టియపాయమును గలుగకుండునట్లు చూచుకొనుచుండెను.

రాత్రి గంభీరాంధకారము— మేఘశూన్యమగునంతరాళము తారకాచ్ఛన్నమై యుండెను. తీరములందలి తరుశ్రేణి నీలభిత్తికవలె నిబిడమై నిస్తబ్ధమై యుండెను. క్రింద నదీజలము నిశ్శబ్దముగఁ బ్రవహించిపోవుచుండెను. లలిత నిద్రించుచుండెను! మఱియేమియును లేదు— సుందరమును విశ్వాసపూర్ణము నగునీనిద్రనుమాత్రమే లలిత వినయుని హస్తములయం దర్పించుకొనియెను. ఈనిద్రనే మహామూల్యమగు రత్నముగా భావించి వినయుఁడు దీనిని రక్షించు భారమును వహించి యుండెను. తల్లిదండ్రులు, సోదరీసోదరులు నెవ్వరును లేరు. ఒకయపరిచితశయ్యయం దప్పుడు తన సుందరదేహమును వాల్చి లలిత నిశ్చింతతో నిదురించుచుండెను! అనిద్రాకావ్యమునందలి ఛందఃపరిమాణముల నిరూపించుచు నిశ్వాసప్రశ్వాసములు శాంతభావముతో యాతాయాతము లగుచుండెను. అగమణీహృదయమునందలి మధురకోమలత్వముచే మండితములగు కరపల్లవములు శయ్యపై సంపూర్ణవిశ్రాంతిఁ గాంచియుండెను. ఆసుందరీమణి నిపుణకబరీభరమునం దొక్కవేణియును చెదరియుండలేదు. ఘుమఘుమారంబులగు నామె పాదములు తమ మధురగతిచేష్టల నృత్యావసానసంగీతములవలెం బోలె స్వస్తి చెప్పి శయ్యపై సమ్మిళితములై యుండెను. ఆయేకాంతసమయమున నా మధురమూర్తి వినయుని హృదయమును గల్పనలతో నింపివైచెను. శుక్తిమధ్యమున ముక్తామణియుం బోలి గ్రహతారాలంకృతనిశ్శబ్దతిమిరావృతాకాశమండలమధ్యమునందు లలితాసుందరి యీనిద్ర— ఈడోలాసుందరసంపూర్ణ విశ్రామము— ప్రపంచమున కేకమాత్రైశ్వర్యమువలె వినయునియెదుటఁ బ్రతిభాసితమగుచుండెను. "నేను మేల్కాంచియున్నాను! నేను మేల్కాంచియున్నాను—"అను నీవాక్యము వినయుని విస్ఫారితచక్షుఃపుటములనుండి యభయశంఖధ్వనిం బోలి బయలువెడలి మహాకాశమునందలి యనిమేషజాగ్రత్పురుషుని నిశ్శబ్దనిస్వనముతో సమ్మిళితమై పోయెను.

అకృష్ణపక్షరాత్రియం దింకొకమాటకూడ వినయునిహృదయమును బాధించుచుండెను— నేటిరాత్రి గోరా జైలులో నున్నాఁడు! ఇప్పటివఱకును వినయుఁడు గోరా సుఖదుఃఖములకు సమభాగియై యుండెను; నేఁగుట కిదియే ప్రథమము! జైలులో నుండుటకు గోరా భయపడువాఁడు కాఁడని వినయుఁడెఱుంగును. కాని మొదటినుండియు నీవ్యాపారమున వినయునకు సంబంధము లేకపోవుటయు, గోరా కొక్కనికే మాత్రమే యీశిక్ష జరుగుటయుఁ దటస్థించినది! ఈమిత్రులజీవితప్రవాహము లీస్థలమునసే విచ్ఛిన్నములై పోయెను. మరలఁ గలియుట తటస్థించినచో నప్పుడీలోపము తీరునా? ఇప్పటి బంధుత్వమునందలి సంపూర్ణత్వమునకు భంగము కలుగలేదా? జీవితమునం దింతటి దుర్లభమును నింతటియఖండము నగుబంధుత్వము! ఒక్కరాత్రియందే;

వినయున కొకవంక శూన్యత్వమును, మఱియొకవంకఁ బూర్ణత్వమును నొక్కసారిగా ననుభవము నొందుచుండెను—జీవితసంబంధము లగుసృష్టిప్రళయములు సంధ్యా కాలమున నభమువలె యంధకారమువంక నిరీక్షించుచుండెను!

బండి పరేశునింటియొద్దకు వచ్చెను. దిగునప్పుడు లలితపాదము లెట్లు వడఁకెనో, లోపలఁ బ్రవేశించుట కామె యెట్లు బెదరుచుండెనో, వినయుఁడు స్పష్టముగా గ్రహించెను! క్రోధావేశముచేఁ దాను చేసిన యపరాధ మింత యని లలిత నిశ్చయించుకొనఁజాలకయుండెను. పరేశబాబు తనతో నెట్టిసంభాషణమును జేయఁడని లలిత భావించెను. మాటాడకుండుటయే గొప్పశిక్ష! ఆశిక్షయే యన్నిటికంటె నధికముగా భావించి లలిత భయపడుచుండెను. లలిత సంకోచమును భావించి వినయుఁడిక నేఁ బోయెదననియెను. లలితకుఁ దనయునికి యిష్టమున్నదో లేదో తెలిసికొనవలయు ననియే యాతఁడిట్లు చెప్పెను. అప్పుడు లలిత "రమ్ము! తండ్రిగారియొద్దకు రమ్ము!" అనియెను.

లలిత యీ శీఘ్రానురోధమునకు వినయుఁ డానందితుఁ డయ్యెను. ఆమెను లోపలఁ బ్రవేశపెట్టినంతమాత్రముననే యాతనిపని తీరిపోదు! ఈవ్యాపారమునందు లలితతో నాతనికి జీవితమున కొకవిశేషబంధము కలిగినది. అందుచేతనే యాతఁడు లలిత పార్శ్వమునఁ ధైర్యముతో నిలువఁబడి యుండెను. లలితభార మంతయుఁ దనపైనున్న దను భావము వినయున కొకమధురస్పర్శమువలె సకలాంగములను విద్యుత్సంచారము చేయుచుండెను. లలిత దనదక్షిణహస్తమును గ్రహించియున్నట్లాతని కనుభవ మయ్యెను. అందుచే నాతనిపురుషహృదయము పూర్ణానందపూరిత మైపోయెను. లలితపైఁ బరేశుఁడు కోపించినచోఁ దప్పంతయుఁ దనపైఁ బెట్టుకొనవలయు ననియును, ఆమె యవమానమును దాను భరింపవలయు ననియు, ధర్మకవచమువలె నామె కెట్టియాఘాతమును గలుగకుండఁ దాను గాపాడవలయు ననియు వినయుఁడు నిశ్చయించుకొనియెను. కాని లలిత నిశ్చయాభిప్రాయమును వినయుఁడు గ్రహింపఁజాలకపోయెను. ఆమె తప్పంతయు వినయునిపైఁ బెట్టఁదలఁచుకొనలేదు సర్వమును దండ్రితో స్పష్టముగాఁ జెప్పఁదలఁచుకొనియెను! దానివలనఁ గలుగుఫల మంతయుఁ దానే గ్రహింపఁదలఁచుకొనియెను! అంతేకాని యేవిషయమును గప్పిపుచ్చుట యామె కిష్టము లేదు.

నేఁటియుదయమునుండియు లలిత వినయునిపై మనసులో నేమో కోపగించి యుండెను. అదియసంగతి మేయని యామె తెలిసికొనియెను. అందుచే నామెకోపము తగ్గుటకు బదులుగా హెచ్చిపోయెను.

స్టీమరులో నున్నంతసేపును నామె మనోభావ మన్యవిధముగానుండెను. లలిత చిన్నప్పటినుండియుఁ గోపముచేతను, బట్టుదలచేతను నసంభావ్యములగు ననేక కార్యములను జేసియుండెను. కాని యీపనిమాత్రము దుస్సాహసమైనది! ఇందు వినయుఁడు

గూడఁ గలసియుండుట యొకవంకఁ సంకోచముగను, మఱియొకవంక సంతోషముగను నామెకుఁ దోఁచెను. ఈహర్షసంకోచములచే నామెమనసు మథితమై పోవుచుండెను. ఆమె యిప్పు డితరపురుషు నాశ్రయించియున్నది; అతనితో వచ్చియున్నది; చెంత నెవ్వరును బంధువులు లేరు—ఇవియే యామె సంకోచకారణములు! సంశయజనకంబగు నిట్టి యవస్థలో వినయుఁడు గౌరవముగాఁ బ్రవర్తించిన తన సుకుమారశీలమును బ్రదర్శించుటచే లలితకుఁ బరమానందముగా నుండెను. ఇప్పుడు వినయుఁడు తమతో విలాసముగాఁ గాలక్షేపము చేయుచుఁ దమ సేవకులయెడలఁ గూడ నాత్మీయతను బ్రదర్శించుచు మెలఁగు వినయుఁడుమాత్రమే కాఁడు! అతఁడు లలితభద్రతాభారమును సంపూర్ణముగ వహించియుండియు, గౌరవముతోఁ దనదూరత్వమును రక్షించుకొనుచు లలితహృదయమునకు మఱింతదగ్గఱివాఁడైపోయెను. ఈయూహలతో లలితకు రాత్రి సరిగా నిద్రపట్టలేదు. ఆమె కతిశీఘ్రముగఁ దెల్లవారినట్లు తోఁచెను. ఆమె మెల్లగా క్యాబినుతలుపు తెఱచి చూచెను. శేషరాత్రియందలి శిశిరార్ద్రమగునంధకారమింకను నాకాశనదీతీరవనశ్రేణుల నాక్రమించి యుండెను. శీతవాతములుమాత్రము నదీజలములఁ గల స్వనమును జాగరితముగఁ జేయుచుండెను. కళాసులు పనులు చేసికొనుచుండుసవ్వడి వినవచ్చుచుండెను. లలిత వెలుపలకు వచ్చి చూచెను. అనతిదూరమున బెత్తపుఁగుర్చిపై దుప్పటము గప్పుకొని వినయుఁడు నిద్రించుచుండెను. రాత్రి యంతయు వినయుఁ డిచ్చటనే కావలి కాచి యుండెనని గ్రహించి లలితహృదయము కొట్టుకొనిపోయెను. ఇంతసమీపమునం దుండియు నింతదూరము లలిత ద్వారముకడ నిలిచియా హేమంతప్రత్యూషాంధకారమున నపరిచితనదీదృశ్యమధ్యమున నొంటిగ నిద్రించియున్న వినయునివంకఁ జూచుచుండెను. ఎదుట దిగంతములందు దోఁచు తారకలు నిద్రించుచున్న వినయుని బరివేష్టించి యున్నవియుంబోలె నగపడుచుండెను. లలితహృదయ మప్పుడు గాంభీర్యమాధుర్యములచేఁ బరిప్లావిత మైపోయెను. చూచుచుఁ జూచుచుండఁగనే లలితకన్నులశ్రుపూర్ణములై పోయెను. ఆసంగతి యామెకుఁ దెలియనే తెలియదు! తనతండ్రితో గలసి తా నుపాసించుచున్న దేవత యిప్పుడు సాక్షాత్కరించి చేయి పట్టుకొన్నట్లు లలితకుఁ దోఁచెను. మఱియుఁ దరుపల్లవనిబిడంబును నిద్రితంబును నగు నదీతీరమున,—నంధకారమునకును నవీనాలోకమునకును బ్రథమనిగూఢసమాగమస్థానమునఁ, బవిత్రసంధిక్షణమునఁ—బరిపూర్ణనక్షత్రసభామధ్యమున, ననాహతవీణానిర్గత మగుదివ్యసంగీతము దుస్పృహానందవేదనము గూర్చుచు మ్రోఁగని పోవుచుండెను.

ఆసమయమున నిద్రించుచున్న వినయుని చేయి యొకటి కదలినంతనే లలిత చటాలున దలుపు మూసికొని పర్యంకమునఁ బడియుండెను. ఆమె సకలాంగకము

లును జల్లనైపోయెను; గుండెలు కొట్టుకొనిపోవుచుండెను. అంధకారము దూరమయ్యెను. అప్పుడు లలిత మొగము కడిగికొని వెలుపలకు మరల వచ్చెను. అంతకు ముందే వినయుఁడు లేచి పూర్వతీరమునందలి ప్రథమప్రభాతాభ్యుదయముం గాంచుచుండెను. అతఁడు లలిత వచ్చుటం గాంచి దూరముగాఁ దప్పుకొనుట కుద్యమించుచుండెను. అప్పుడు లలిత "వినయబాబూ!" అని పిలిచి వినయుఁడు సమీపించినంతనే "రాత్రి నీకు బాగుగ నిద్రపట్టలేదనుకొనియెదను!" అనియెను. "పట్టకపోలేదు!" అని వినయుఁడు బదులుచెప్పెను.

తరువాత నెవ్వరును మాటాడలేదు. అవ్వలియొడ్డున శిశిరసిక్తమగు నాకాశవనము సమాసన్న సూర్యోదయస్వర్ణకాంతిని సముజ్జ్వలముగఁ జేయుచుండెను. ఆయిరువురు నుగూడఁ దమజీవితమునం దట్టిప్రభాతమును గాంచియుండలేదు! ప్రభాతాలోక మీవిధముగా వారి నెన్నడును స్పృజించియుండలేదు—ఆకాశము శూన్యము కాక, యొకవిధమగు విస్మయనిశ్శబ్దానందసృష్టివంక కనిమేషదృష్టితోఁ జూచుచున్నట్లు గ్రహింపగలుగుట వారి కిదియే ప్రథమపర్యాయము!

స్టీమరు కలకత్తాకు వచ్చిన తరువాత వినయుఁడొకబండిని గుదిర్చి లలితను దానిపై నెక్కించి తాను బండివానిప్రక్కను గూర్చుండెను. ఆసమయమునఁ గలకత్తా వీథులఁ బడి బండి పోవుచున్నప్పుడు చటాలున లలితహృదయభావము మారిపోయెను. ఈప్రతికూలసమయమున రాత్రి వినయునితో స్టీమరునందుండుట, వినయు నాశ్రయించి యుండుట, సంరక్షకునిబోలి వినయుఁడు తన్ను బండిపై నెక్కించి తీసికొనిపోవుట—ఇది యంతయు నామెకు బాధాకరముగఁ దోఁచెను. ఘటనావశమున దనకర్తృత్వభారము వినయునిపైఁ బడుట యామెకసహ్యముగా నుండెను. ఇట్లగుటకుఁ గారణమేమి? రాత్రిసంబంధమగు నామధురసంగీతము దినసంబంధమగు కర్మక్షేత్రమునకు వచ్చి యాకస్మికముగ నింతకఠోర మైపోయినదేమి?

అందుచేతనే ద్వారమువఱకును వచ్చి వినయుఁడు పోయెద ననుటచే లలితకు మఱింతకోపము కలిగెను. తాను వినయునితోఁగూడి తండ్రియొద్దకుఁ బోవుటకు సంశయించుచున్నట్లు వినయుఁ డనుకొనెనని లలిత భావించెను. అట్టిసంశయ మెంతమాత్రమును లేదని నిరూపించుటకును, తండ్రితో నన్నిసంగతులును దెలుపుటకును నిశ్చయించుకొనుటచేతనే లలిత యపరాధినివలె వినయునిబోనిచ్చినది కాదు. వినయునితోడిసంబంధము పూర్వమువలెనే నిర్మలముగాఁ జేయవలయు ననియే యామెయుద్దేశము! అంతేకాని నడుమనడుమ సంశయములు లోపములు గల్పించి తన్ను వినయునకు భారముగాఁ జేయవలయు నని యామె భావింపలేదు!

# ౩౧

వినయుని, లలితను జూచినంతనే సతీశుఁడు పరుగెత్తుకొనివచ్చి యిరువురినడుమను నిలచి యిరువురిచేతులను బట్టుకొని "పెద్దక్క రాలేదా?" అని ప్రశ్నించెను. వినయుఁ డిటునటు నలుదెసలఁ బరికించి "సుచరితయా? ఏమైనది? తప్పిపోయినది!" అనియెను! సతీశుఁడు వినయుని ద్రోసివైచి "వట్టిమాట! సోదరీ! లలితా! నీవు చెప్పుము!" అనియెను. అప్పుడు లలిత "పెద్దక్క రేపువచ్చును" అనిచెప్పి పరేశబాబు గదివైపునకుఁ బోవుచుండెను.

సతీశుఁ డాయిరువురి చేతులను బట్టుకొని "ఇప్పుడు మనయింటికెవ్వరు వచ్చిరో చూపించెదను రండు!" అనియెను. లలిత యాతనిని బొమ్మని త్రోసివైచుచు "ఎవ్వరు వచ్చిననేమి? నాకుఁ జిరాకు కల్గింపకుము! ఇప్పుడు నేను తండ్రిగారి యొద్దకుఁ బోవలయును!" అనియెను. అప్పుడు సతీశుఁడు "ఆయన షికారు పోయినారు. ఇంతలో రారు" అనియెను.

ఆమాట లలితావినయుల కిరువురకును గష్టముగనే యుండెను. అప్పుడు లలిత "వచ్చినవా రెవ్వరు?" అనియెను. సతీశుఁడు "చెప్పను! వినయబాబూ! నీవు చెప్పుకో" అనియెను. వినయుఁ డేవ్వియో పేళ్ళు చెప్పి తుదకు మీయక్క లలిత చూచి వచ్చినతరువాత నేనుగూడ వారిని జూడవచ్చెద ననియెను.

సతీ—మీరిరువురును రావలయును.

లలి—ఏగదిలో నున్నారు?

సతీ—మూడవయంతస్తుగదిలో నున్నారు.

అందరును మూడవయంతస్తునకుఁ బోయిరి! అచ్చట నొకచోఁ బ్రౌఢవయస్కయగు నొకస్త్రీ కుర్చీపైఁ గూర్చుండి సులోచనములను దాల్చి కృత్తివాసరామాయణమును జదువుకొనుచుండెను. ఆమె కేఁబదియైదేఁడ్లవయసుండును; మొగమునెదుట కుంతలములు విరళములైయుండెను; కాని మొగ మింకను బరిపక్వఫలముంబోలి పుష్టిగనే ఉండెను. ఆమెభ్రూమధ్యమున బచ్చబొట్టుండెను. శరీరమునం దలంకారములు లేవు. విధవవలె నగపడుచుండెను. ఆమె వారిని జూచినతోడనే చటాలున లేచి మేలిముసుఁగు సవరించుకొని లోనికిఁబోవుట కుద్యమించెను. అంతలో సతీశుఁ డామెచేయి పట్టుకొని "దొడ్డమ్మా! పారిపోయెద వేమి? ఈమె మాసోదరి లలిత! ఈయన వినయబాబు! పెద్దక్క రేపు వచ్చును" అని చెప్పెను. లలిత యామె నెఱుంగదు కావున మాటాడక నిలువఁబడిపోయెను. వినయుఁ డామెకు నమస్కరించుటయు లలితకూడ నాతని ననుకరించెను. అప్పు డామె తత్తరముతో లోపలికిఁ బోయి చాపఁదెచ్చి వైచి "బాబూ! అమ్మా! కూరుచుండుఁడు!" అనియెను.

లలితావినయులు కూర్చున్న తరువాత యామెయును గుడిచేతితో సతీశుని కౌఁగిలించుకొని కూర్చుండి "మీరు నన్నెఱుఁగరు! ఈ సతీశునితల్లి మా చెల్లెలు" అనియెను. ఆమె విశేషముగ మాటాడలేదు గాని యామెజీవితమునందలి గభీరశోకాశ్రుసంసిక్తమగు నొక పవిత్రతేజ మామెముఖమునందును, కంఠస్వరమునందును స్పష్టముగఁ గానవచ్చుచుండెను. సతీశునిఁ బ్రేమతోఁ గౌఁగిలించుకొన్న యాదొడ్డమ్మం గాంచినంతనే యింతవఱకును రమణీజీవితచరిత్ర మించుకంతయు నెఱుంగని వినయునిహృదయము కరుణరసపూరిత మైపోయెను. అప్పుడు వినయుఁడు "సతీశుఁ డింతవఱకును నన్ను దాదా యని పిలువక వినయబాబూ యని పిలుచుట తనదొడ్డమ్మ నాకును దొడ్డమ్మయే యగునని కాఁబోలును! ఇఁక నట్లు పిలిచినచో నేను జగడము చేయక మానను." అనియెను.

అప్పు డాదొడ్డమ్మగారు మనసు వికళ మైపోయెను. ప్రియదర్శనుఁడును, ప్రియభాషియు నగువినయుని సతీశునిగనే భావించి యామె "బాబూ! మీయమ్మ యెచ్చటనున్నది?" అనియెను. వినయుఁడు "మాయమ్మ చాలకాలముక్రిందటనే లేదు! కాని లేదని నేను నానోటితోఁ జెప్పఁజాలను" అని చెప్పి యార్ద్రనయనములతో సానందముగ నొక్కసారి భావించుకొనియెను. తరువాత వారిరువురకును గ్రొత్తలేకుండఁ జాలవఱకు సంభాషణ జరిగెను. లలిత మాటాడక కూర్చుండి యుండెను.

లలిత లేచి పోఁదలఁచెను గాని పోఁజాల దయ్యెను. ప్రథమదర్శనమునఁ జాల సేపు! అంతే కాక యామెమనసు బాగుగలేదు. అపరిచితయగు నామెతో వినయుఁ డనాయాసముగా సంభాషించుచుండుట యామె కంతయిష్టముగా లేకుండెను. అందుచే వినయుఁడు లఘుచిత్తుఁ డని తనమనసులో లలిత నిందించుచుండెను అతఁడు విచారముతో నూరక కూరుచున్నచో నప్పుడుమాత్రము లలిత సంతోషించునా? తండ్రిగారియెదుటఁబడి భాషించుభార మంతయుఁ దననెత్తిమీఁదనే పడినట్లు వినయుఁ డిట్లున్నాఁ డేమని యప్పుడు నిందించును! ఇంతకును గారణము నిన్నటిరాత్రి మధుర సంగీత మీపగటివేళ బాధాకర మైపోయినది! ఏమియు సుఖకరముగ లేదు. అందుచేతనే నేఁడు లలిత మనసులోఁ బ్రతివిషయమునందును వినయునితోఁ గలహించుచుండెను. ఇప్పటివినయుని యేవ్యాపారమును లలితమనసులోనిపోరాటము నడిగింపఁజాలకుండెను. ఇది యెట్లు సంశోధిత మగునో యంతర్యామి కొక్కనికే యెఱుక!

ఆలస్య మైపోవుచుండెను. పరేశబా బింకను రాలేదు. లేచిపోవలయునను నుద్దేశము ప్రబల మగుచుండెను. వినయుఁడింకను దొడ్డమ్మతో మాటాడుచునే కూరుచుండెను. లలిత యిఁక నధీరయై వినయునిమాటల కడ్డము వచ్చి "మీ రెవ్వరికొఱకుఁ గాలక్షేపము చేయుచున్నారు? తండ్రిగా రెప్పుడు వత్తురో తెలియుట లేదు. ఒక

సారి గోరాబాబుతల్లియొద్దకుఁ బోఁగూడదా?" అనియెను. వినయుఁ డదరిపడియెను. లలితపరోక్షస్వరమాతఁ డెఱుఁగనిదే. అతఁ డప్పుడు లలితమొగమువంకఁ జూచి చటాలున లేచెను. అతఁ డెవ్వరికొఱకు కాలక్షేపము చేయుచున్నాఁడు? ఇక్కడ నేమియును బనిలేకపోవుటచేతనే యాతఁడు వెడలిపోయెద నని ద్వారమునొద్దనే చెప్పియుండెను. లలిత యాతనిఁ బోవద్దని చెప్పి మరల నిట్లు ప్రశ్నించుటా?

వినయుఁ డదరిపడి లేచుటం గాంచి లలిత విస్మితయైపోయెను. వినయునిముఖమునందలి సహజమందహాస మొక్కఫూత్కారముతో దీపాలోకమువలె నంతరించి పోయెను. వినయునివ్యథితవదనమునుగాని, యాతనియాకస్మికభావపరివర్తనమునుగాని లలిత యెన్నఁడును జూచియుండలేదు. అప్పటియాతనిమొగము చూచినంతనే లలిత హృదయమునఁ దీవ్రపశ్చాత్తాపకశాఘాత మీవైపునుండి యావైపునకు మరలమరల శబ్దాయమానము కాఁజొచ్చెను. అప్పుడు సతీశుఁ డాత్రముతో లేచి వినయునిచేయి పట్టుకొని బ్రతిమాలుచు "వినయబాబూ! కూరుచుండుము; పోవలదు! దొడ్డమ్మా! వినయబాబునకు భోజనము పెట్టుము! అక్కా! లలితా! ఈయన నేల పొమ్మనియెదవు?" అనియెను.

విన—సతీశా! ఇప్పుడు కాదు. మఱియొకప్పుడు వచ్చెదను. ఆలస్యమైపోయినది!

మాటలు స్వల్పమే కాని కంఠస్వర మశ్రురుద్ధమైనట్లుండెను. ఆకరుణస్వరము సతీశుని దొడ్డమ్మ చెవులకుఁ గూడఁ దోఁచెను. ఆమె యొకసారి వినయునివంకను నొకసారి లలితవంకను జూచి యిరువురినడుమను నేదియో యదృష్టలీల ఖేలనము చేయుచున్నదని భావించెను.

తోడనే లలిత యేదియో సాకు చెప్పి లేచి తనగదిలోనికిఁ బోయెను. ఆమె తనకుఁ దానే యీవిధముగా దుఃఖము దెచ్చుకొనుట యిదివఱ కెన్నిసారులో యైనది!

## ౩౨

వినయుఁ డప్పుడు లజ్జావేదనలచే హృదయము పరితపించుచుండ నానందమయి యింటివైపునకుఁ బోయెను. అతఁ డింతసేపటివఱకును దల్లియొద్ద కేలపోలేదు. మఱచి పోయెను! లలితతోడనే విశేషప్రయోజన మున్నట్లాతఁడు భావించెను! అతఁడు కలకత్తాకు వచ్చినతోడనే యానందమయిని దర్శింపలేదని యీశ్వరుఁ డాతని ప్రయోజనమును భగ్నముచేసి తగినశాస్తి గాంచెను. తుదకు లలితనోటినుండి "గోరాబాబు తల్లియొద్దకైనఁ బోఁగూడదా!" అనుమాట వెలువడియెను. గోరాబాబుతల్లిమాట వినయునికంటె నధికముగా లలితహృదయమునఁ దోఁచుట యెన్నఁడైన జరుగునా?

లలిత యామెను గోరాబాబు తల్లియని మాత్రమే యెఱుంగును. కాని వినయున కామె జగన్మాతృసంబంధ మగు నేకమాతృప్రత్యక్షప్రతిమ!

ఆనందమయి స్నానముచేసి మేజాపైఁ గూర్చుండి మంత్రపఠనము చేసికొను చుండఁగా వినయుఁడు తత్తరముతోఁ బోయి యామె పాదములపైఁ బడి పొరలుచు "అమ్మా!" అనియెను. ఆనందమయి యాతనితలపైధూళిని దులుపుచు "బాబూ! వినయా!" అనియెను. ఆతల్లివంటిమధురకంఠస్వర మెవ్వరి కున్నది? వినయుని సమస్తశరీరమునను కరుణరసము ప్రవహించెను. అతఁ డశ్రుజలమును గంతమునం దడంచుకొని మృదుకంఠముతో "అమ్మా! నే నాలస్యము చేసితిని!" అనియెను. ఆనందమయి నా కంతయుఁ దెలిసినదని చెప్పి గోరా శశిమఁ బూర్వమే వ్రాసినయుత్తరమును వినయునకుఁ జూపెను. అం దిట్లున్నది :—

"అమ్మా! నీగోరాకుఁ గారాగృహ మనినఁ గష్టములేదు. కాని నీమనసు కష్టపడుట యాతఁడు సహింపఁజాలఁడు! నీదుఃఖమే నాకు శిక్ష యగును; కాని కలెక్టరు నన్ను శిక్షింపఁజాలఁడు! నీబిడ్డ కొక్కనికే యిట్టిగతి గలుగుట లేదుతల్లీ! ఎందఱో తల్లులబిడ్డ లెట్టితప్పులులేకుండ జైలులోఁ బడియున్నారు. నేనును వారితో సమసుఖదుఃఖముల ననుభవింపఁగోరుచున్నాను. నాకోరిక ఫలించునప్పుడు నీవు సంక్షోభింపవలదు అమ్మా! ఒకప్పుడు కలువుదినములలో నారూపాయలసంచి పోయినసంగతి నీకు జ్ఞప్తియున్నదా! అయిదునిమిషములలోఁ దిరిగివచ్చి చూచునప్పటి కేఁబదిరూపాయలసంచియును బోయినది. వానితో మఱికొన్నిరూపాయలను జేర్చి నీపాదజలమునకుఁ గలశమును జేయింపవలయు ననుకొంటిని! అప్పుడు నాకాదొంగపై క్రుధాకోపావేశము కలిగినది! అంతలో నాకస్మికముగ దేవుఁడు నాకు మంచిబుద్ధిని బ్రసాదించుటచే ఈ దుర్భిక్షదినములలో నాతఁడీసొమ్ముతో సుఖముగా బ్రదుకును!" అని తోఁచినది. అంతలో నే నాహృదయక్షోభ మంతయు శాంతించినది. ఇప్పుడు నట్లె నేను కోరుకొని జైలునకుఁ బోవుచుంటి నని భావించుచున్నాను. అందుచే నా కెట్టికష్టమును దోఁచుటలేదు. ఎవ్వరిమీఁదను గోపములేదు. ఆహారవిహారకష్టములుగల జైలునందే నేనాతిథ్యమును గ్రహించితిని. ఇప్పటినాసంచారమునందు దొరకినచోఁ దిని దొరకనిచోఁ బస్తుపడి కష్టసుఖముల ననుభవించితిని. కష్టముల కలవాటుపడితిని. అందుచే జైలునందు నా కెట్టి కష్టానుభవముండదని నీవు నమ్మియుండుము! నే నింటియొద్ద సుఖముగా నున్నప్పుడు నాకు వెలుపలనున్నకష్టములను దెలిసికొనుట కవకాశము లేకపోయినది. ఈప్రపంచమునందలి యపరాధులును నిరపరాధులును గూడ ననేకప్రజ లీశ్వరదత్తమగువిశ్వాధికారమునుండి వంచితులై బంధనావమానములపాలగుచుంటి రనుసంగతి నాకింతవఱకును దెలియనేలేదు. ఇప్పుడు నేనట్టివారి కష్టసుఖములకు భాగహారినై యుండఁదలఁచితిని.

ఈప్రపంచమునందుఁ జాలమంది కృత్రిములైయుండియుఁ బెద్దమనుష్యులుగా గౌరవింపఁబడుచున్నారు. అట్టివారితోఁ జేరి గౌరవమును వృద్ధిఁజేసికొనుట నాకిష్టములేదు. అమ్మా! నేనీసారి ప్రపంచముతోఁ బరిచయముచేసికొని యనేకశిక్షల ననుభవించితిని. ఈజగమునందు విచారభారమును వహించువారే కృపాపాత్రులు! తాము శిక్షల ననుభవించుచు, నొరులను శిక్షింపక జైలునం దుండువారికే పాపశాంతి కాఁగలదు! వారే పాపములను, వానికిఁ దగినప్రాయశ్చిత్తములను నిరూపించు పెద్దలు! జైలునకు వెలుపల నుండి సుఖసన్మానముల ననుభవించువారి కెన్నటికిని యేవిధముగను పాపశాంతిలేదు. నేఁటిసుఖసన్మానములను ధిక్కరించి మానవకళంకమను చిహ్నమును వక్షమునం దాల్చి వెలువడితిని! అమ్మా! నీవు కన్నీరుపెట్టుకొనకుండ నన్నాశీర్వదింపుముతల్లీ! భృగుమహర్షి పదాఘాతముచేఁ గలిగినమచ్చను శ్రీమహావిష్ణువు చిరకాలమునుండియు వక్షమున ధరించియుండెను. ప్రపంచమునందలి యౌద్ధత్య మెచ్చట నన్యాయముగఁ బదాఘాతముచేయునో యాచిహ్నము నే పరమేశ్వరుఁడు తనవక్షముపై గాఢతరముగఁ జేసికొనుచుండును! ఆచిహ్నమే యాపరాత్పరున కలంకారమైనచో నప్పుడిఁక నాకొరకు మనస్తాప మెందులకు? నీవు నాకొఱకు దుఃఖించుట యెందులకు?—"

ఈయుత్తరమువచ్చినతోడనే యానందమయి మహిముని గోరాయొద్దకుఁబంపఁ బ్రయత్నించెను గాని మహిముఁడు దొరతనకు సెలవీయఁడనిచెప్పి గోరాతొందరను గూర్చి నిందించుచు నీవ్యవహారమునఁ దాను గలుగఁజేసికొన్నచోఁ దనయుద్యోగము కూడఁ బోవునని చెప్పెను. ఈసంగతి భర్తకుగుకృష్ణదయాళునకుఁ దెలుపుట యనావశ్యకమని యానందమయి భావించెను. గోరానుగూర్చి యామె భర్తయెడల మర్మాంతికాభిమానముకలిగియుండెను. కృష్ణదయాళుఁడుగోరానుబుత్రునిగ నేభావింపకవిరుద్ధభావముతోనుండెను. ఆనందమయీకృష్ణదయాళులదాంపత్యమధ్యమునగోరావింధ్యపర్వతమువలె నడ్డముగానుండి యాదాంపత్యమును విభజించివైచెను. అందొకవంకఁగేవలశుద్ధాచారి యగుకృష్ణదయాళుఁడు; మఱియొకవంక మ్లేచ్ఛ గోరాసహితయగునానందమయి! గోరాజీవితచరిత్రము నతింగియున్న యాయిరువురినడుమను గలత్రోవ కట్టుపడియుండెను. ఈకారణములచే గోరాప్రేమబాధ్యత లన్నియు నొక్క యానందమయిమీఁదనే పడియుండెను. గోరాయభ్యుదయమున కామెయే యెల్లవిధములఁ బ్రయత్నించుచుండెను. గోరామంచిచెడ్డల కన్నిటికి నామెయే యుత్తరవాదిని యైయుండెను. గోరాదుష్కృవనములనుగూర్చి యనేకు లనేకవిధములుగా నామెకుఁ జెప్పుచుండిరి. ఆమె యందఱకును దగిన సమాధానములు చెప్పుకొనుచుండెను. గోరా సామాన్యుఁడా? అతని మందలించుట కెవ్వరికైన సాధ్యమా? అయినను నానందమయి యాతని కట్టికష్టమును గలుగకుండఁ బెంచి పెద్దవానిని జేసెను! పదరాని మా

టులఁ బడినది, ఎవ్వరి కేమియు ననలేదు. పడరానికష్టములఁ బడినది; ఎవ్వరికి నెట్టి కష్టమును గల్గింపలేదు !

కృష్ణదయాళుఁడు గంగాస్నానము చేసి శుచివేషముతో మంత్రజపము చేసికొనుచు లోపలికివచ్చుచుండఁగా నానందమయి కిటికిలోనుండి చూచెను; కాని యాతని దర్శింపఁజాలకపోయెను; నిషేధము; నిషేధము; సర్వత్రనిషేధమే! తుద కొక నిట్టూర్పు విడచి యానందమయి మహిమునియింటికిఁ బోయెను. మహిముఁ డప్పుడు పీటపైఁ గూర్చుండి పత్రికను జదువుకొనుచుండెను. భృత్యుఁ డాతనిశరీరమునఁ దైలమర్దనము గావించుచుండెను. ఆనందమయి యాతనిం గాంచి "మహిమా! నీవొకమనుష్యుని దోడిచ్చినచో నేనైనను బోయి గోరాను జూచివచ్చెదను. అతఁడు జైలునకుఁ బోయినచో నింక నాకుఁ జూచుట కవకాశమే యుండదేమో!" అనియెను.

మహిముఁడు పైకెట్లున్నను గోరాయం దాతనికిఁ బ్రేమ యున్నది. "ఆనిర్భాగ్యుని జైలునకుఁ బోనిమ్ము! ఆవేడుకకూడఁ దీరనిమ్ము!" అని వెంటనే మహిముఁ డొకగొల్లవానిఁ బిలిచి వకీలుకర్చున కాతనిచేతికిఁ గొంతసొమ్మిచ్చి గోరాకడకుఁ బంపించి సెలవు దొరకినచోఁ దాను గూడఁ బోవుటకు సిద్ధపఱచుకొనియెను. మహిముఁ డెన్నఁడును గోరాపైఁ గోపము వహింపఁజాలఁ డని యానందమయి యెఱుంగును. అతఁడు కావలసినపని చేయుటం గాంచి విని యామె తనగదిలోనికిఁ బోయెను. గోరా యిప్పుడున్న యపరిచితస్థానమున నాతని కిష్టమగుపరివారము గాని, లోకసంబంధములగు వేడుకలు గాని యుండ వని యానందమయి స్పష్టముగా గ్రహించియుండెను. ఆమె యప్పుడు తన చూపులయందలి నిశ్శబ్దవేదనచ్ఛాయ లోష్ఠాధరములు ముద్రితము లగుచుండ నూరక కూర్చుండి యుండెను; ఇంతలో లక్ష్మిదాని యేడ్చుచు రాఁగా నామెను మఱియొకగదిలోనికిఁ బంపివైచెను. సమస్తోద్వేగమును నిస్తబ్ధభావమునందే పరిపాకము గావించుట యామెకుఁ జిరకాలాభ్యాసము! సుఖదుఃఖముల నామె యెంతశాంతభావముతో గ్రహించుచుండునో యామెహృదయముకంటె హృదయాంతర్యామికే గోచరించుచుండును!

ఆనందమయి కేమిచెప్పవలయునో వినయునకు బోధపడలేదు. కాని యామె యెవ్వరిసాంత్వనవాక్యములకును నిరీక్షించియుండలేదు. ప్రతీకారములేని దుఃఖము కలిగియున్నతనయొద్దకువచ్చి యితరులూఱడిల్లఁజేయుట యామెస్వభావమునకు సంకోచముగాఁదోఁచుచుండెను. ఆమె యప్పుడేమియు మాటాడఁజాలకున్న వినయుని గాంచి "బాబూ! నీకింకను స్నానము లేనట్లున్నది! పొమ్ము! స్నానమునకుఁ బొమ్ము! ప్రొద్దుపోయినది!" అనియెను. వినయుఁడు స్నానముచేసివచ్చి భుజించుచుండఁగా నాతనిప్రక్కను గోరా లేకుండుటఁ గాంచి యానందమయి హృదయమునందు శూన్యమహాహాకారము

కలిగెను. "గోరా యిప్పుడు జైలులోనియున్నను తినుచున్నాఁడు! ఆయన్నము నిర్దయ శాసనముచేఁ గట్టుబడినది. దానిలోఁ దల్లిచేతులయందలి మాధుర్యము లేదు!" అని తలంచుకొని యానందమయియును సహింపఁజాలక యాటనుండి వెడలిపోయెను.

# 33

పరేశుఁ డింటికి వచ్చినతోడనె యసమయమున వచ్చిన లలితం గాంచి యీ కొంటెబిడ్డ యేదియో కొంటెపని చేసినదని గ్రహించి జిజ్ఞాసుదృష్టితో నామె మొగమువంకఁ గాంచుటయు లలిత "బాబా! నేను వచ్చివేసితిని; అచ్చట నుండలేకపోయితిని!" అనియెను. పరేశుఁడు 'కారణ మేమమ్మా" యనియెను. గోరాబాబును గలెక్టరు జైలునఁ బెట్టినాఁడని లలిత చెప్పెను. ఈసందర్భమున గోరా యెట్లు వచ్చెనని ప్రశ్నించి పరేశుఁడు లలితవలన నంతయును దెలిసికొనియెను. తోడనే యాతనికి గోరాతల్లిమాట తలంపునకు వచ్చుటయు నాతఁడు మిగుల విచారించెను. ఒకదొంగవలెనే గోరాకును శిక్ష విధించుట కలెక్టరునకు సులభసాధ్య మయ్యెను. ఇది కేవల మనాగరికత యనియు, నధర్మమనియుఁ బరేశుఁడు భావించెను. మానవుని యెడల మానవునిదౌరాత్మ్యము ప్రపంచమునందలి యన్నిహింసలకంటెను భయంకరమైనది! దానిపై సమాజశక్తియు రాజశక్తియును గలసి యెట్లు ప్రచండప్రకాండమును గావించుచుండెనో, గోరాశిక్ష వినుటవలనఁ బరేశున కది యంతయును గన్నులఁ గట్టినట్లగపడుచుండెను. పరేశుఁ డూరక యాలోచించుచుండుటం గాంచి లలిత యుత్సాహముతో "బాబా! ఇది దారుణ మగు నన్యాయము కాదా!" అనియెను.

పరేశుఁడు సహజశాంతస్వరముతో "గోరా యేమిచేసెనో నాకు సరిగాఁ దెలియలేదు. కాని యాతఁడు తన కర్తవ్యబుద్ధియందలి ప్రబలోద్రేకముచే నధికారోల్లంఘనము గావించి యుండు ననుకొందును. అది గోరాపక్షమునఁ దప్పని చెప్పుట ప్రకృతివిరుద్ధము సందేహములేదు! కాని అమ్మా! ఏమిచేయము! ప్రకృతకాలమున న్యాయబుద్ధి యింకను నంతటివివేకలాభమును గాంచియుండలేదు. ఇప్పటికిని బొరపాటునకును, నపరాధమునకును నొక్కటే శిక్ష జరుగుచున్నది. దీనిం గూర్చి యొక మానవునిపై దోషారోపణము చేయుటకు నవకాశములేదు. ఈపాప మందఱిమీఁదను బడియున్నది" అని యాకస్మికముగాఁ బరేశుఁ డాప్రస్తావమును మార్చి "అమ్మా! నీ వెవ్వరితో వచ్చితివి?" అనియెను.

లలిత బలవంతముగా ధైర్యము తెచ్చుకొని "వినయబాబుతో వచ్చితి" నని యెను. ఆమె పైకెంతధైర్యముతో నున్నను లోపలిదుర్బలత్వ మగపడుచునే యుండెను. ఆమె యామాట సహజస్వరముతోఁ జెప్పఁజాలకపోయెను. ఎచ్చటనుండియో

సిగ్గు వచ్చిపడియెను. ఆసిగ్గును మొగమునం దగపడకుండ బ్రయత్నించినకొలఁదియు నది వెల్లిపోవుచుండెను.

చంచలయు దుర్జయయునగు లలితను బరేశుఁడు తనయు లందఱికంటె నధికముగఁ బ్రేమించుచుండెను. ఆమెపను లందఱును వెగటుగనే దోఁచునుగాని యామె నడవడిలో సత్యపరత్వ మున్నది. పరేశుఁడు దానినే గౌరవించుచుండును. ఆమె లోపమే యందఱికన్నుఁ బడుచుండును గాని యలోక సామాన్యమగు వామె గుణము నెవ్వరును గ్రహింప యాదరింప రని కూడ నాతఁ డెఱుంగును. పరేశుఁడా గుణముఁనే యత్నపూర్వకముగఁ బరిశీలించుచుండెను. ఆమె తీవ్రస్వభావము నడ్డగించి యామెహృదయమునందలి మహత్త్వమునకు భంగము కల్గించుట పరేశున కిష్టము లేకుండెను. అతని తక్కినయిరువురుతనయలును జక్కనవారనియే చెప్పవచ్చును. వారి శరీరచ్ఛాయయు ముఖలక్షణమునుగూడ సుందరముగా నుండును గాని, లలిత వారికంటెనలుపు. ముఖసౌందర్యవిషయమునఁగూడ మతభేద మున్నది! అందుచేతనే లలితకుఁ ద్వరగాఁ బెండ్లి చేయవలయు నని వరదాసుందరి తొందరపడుచుండెను. పరేశుఁడు లలితముఖమునందలి వర్ణసౌందర్యమును గాని, యామెశరీరమునందలి యవయవసౌందర్యమును గాని చూడలేదు! ఆమె యంతరంగమునందలి గంభీరసౌందర్యమునే చూచుచుండెను ఆసౌందర్యమునఁ గేవలలాలిత్యమే కాదు—స్వాతంత్ర్యమును దార్ఢ్యమునుగూడ నుండెను. ఆదార్ఢ్యముమాత్రము మందఱకును మనోహరముగా నుండదు! అది లోపల నాకర్షించును, కాని చాలమందిని దూరమునకుఁ దోసివైచును. ఆమె యం దింటిలో నెవ్వరికి నిష్టముండదని యెంచి పరేశుఁడు తఱచుగా లలితను దనయొద్దనే యుంచుకొనును—ఆమె నెవ్వరును క్షమింపరని చెప్పి తానే యామెను గౌరవించుచుండును.

లలిత వినయునితో నొంటిగ వచ్చితి నని చెప్పినతోడనే పరేశుఁ డామె యీ విషయమునఁ జాలదినములనుండి కష్టమును సహించి యుండెనని తెలిసికొనియెను. ఆమె చేసినతప్పు చిన్నదైనను లోకు లామెకుఁ బెద్దశిక్ష చేయుదురు. ఈవిషయమై పరేశుఁ డాలోచించుచుండఁగా లలిత "బాబా! దొరగారియాతిథ్యమునందు మన దేశస్థు లెంచుకంతయును గౌరవములేదు. కేవల మనుగ్రహముమాత్రమే. ఇది చూచి సహించి నే నచ్చట నుండుటయే యుచితమా?" అనియెను.

పరేశున కీప్రశ్న సామాన్యమైనదిగాఁ దోఁచలేదు. అతఁడు దానికి బదులు చెప్పక నవ్వుచుఁ గుడిచేతితో నామెశిరస్సై మెల్లగఁ గొట్టి "వెఱ్ఱిదానా!" అనియెను.

ఆపరాహ్ణసమయమున నీసంఘటనముంగూర్చి యాలోచించుకొనుచు నింటివెలుపలఁ బరేశుఁ పచారు చేయుచుండఁగా వినయుఁడు వచ్చి యాతనికి నమస్కరించెను.

పరేశుఁడు వానితో గోరావిషయమునఁ జాలవఱకుఁ బ్రస్తావించెను కాని లలితను దీసికొనివచ్చినసంగతి యెత్తనే లేదు. తరువాతఁ జీఁకటిపడుచుండుటం గాంచి పరేశుఁడు "వినయబాబూ! ప్రొద్దుపోయినది! లోపలికిఁ బోవుదము రమ్ము!" అనియెను. వినయుఁడు నేను మాయింటికిఁ బోయెద ననియెను. పరేశుఁడు రెండవసారి బలవంతము చేయలేదు. అప్పుడు వినయుఁడు బెదరిబెదరి రెండవయంతస్తువంకఁ జూచుచు మెల్లమెల్లగా వెడలిపోయెను.

లలిత పైనుండి వినయుని జూచుచునే యున్నది. పరేశునితో మాటలాడినతరువాతఁ బైకి వచ్చునని యామె యనుకొనియెను. ఇంతలోఁ బరేశుఁ డొక్కఁడే పైకి వచ్చెను. వినయుఁడు రాలేదు. లలిత బల్లపై నున్న పుస్తకములను, గాగితములను బెందరవందరగఁ బారవైచి లేచి గదినుండి వెడలిపోవుచుండెను. "అప్పుడు పరేశుఁ డామెం బిలిచి యామె విషణ్ణవదనమునఁ బ్రేమపూర్ణదృష్టిని స్థాపించి "లలితా! ఒక బ్రహ్మసంగీతమును బాడుము!" అని దీపమును వెలిఁగించెను.

## ౩౮

మఱునాఁడు వరదాసుందరియుఁ దక్కినవా రందఱును వచ్చిరి. హారానుఁడు లలితపైఁ గోపము నడఁగించుకొనఁజాలక యింటికైనఁబోకుండఁ బరేశునొద్దకుఁ బోయెను. వరదాసుందరి లలితవంకఁ జూడనైనఁ జూడక కోపముతో మాటాడక సంభ్రమముతోఁ దనగదిలోనికిఁ బోయెను. లీలాలావణ్యలకును లలితపైఁ గోపము కలిగెను. లలితావినయులు లేక వారినాటకాభినయమున కెల్లవిధముల లోపముకలిగెను! సుచరిత హారానుని క్రోధావేశముతోఁగాని, వరదాసుందరి యశ్రుపూర్ణాక్షేపవాక్యములతోఁగాని, లావణ్యలజ్జానిరుత్సాహముతోఁగాని కలియక కేవలము నిశ్శబ్దయై యుండెను. ఎట్లో యామెపని యామె చేసివైచినది. ఇప్పుడును నామె యంత్రపుబొమ్మవలె నందఱివెనుకను నిలిచి లోపలఁ బ్రవేశించెను. సుధీరుఁడు లజ్జానుతాపసంకుచితుఁడై వీథిగుమ్మమునొద్దనుండియే తనయింటికిఁ బోయెను. లావణ్య యాతనిఁ బిలిచినది గాని లాభము లేకపోయెను. హారానుఁడు పరేశునిగదిలోఁ బ్రవేశించినతోడనే "చాల నన్యాయము జరిగిపోయినది!" అనియెను.

లలిత పరేశునిగదియందే యుండెను ఆమాట వినఁబడినతోడనే యామె తండ్రి కుర్చీవెనుకకుఁ జేరి నిలువఁబడి హారానునివంకఁ దదేకదృష్టిం గాంచుచుండెను. అప్పుడు పరేశుఁడు "హారానబాబూ! లలితవలన నన్నిసంగతులును దెలిసినవి. జరిగినదానిని గూర్చి యిప్పు డాలోచించుటవలన లాభములేదు అనియెను. హారానుఁడు పరేశుని శాంతసంయతభావమును దుర్బలస్వభావముగాఁ దలంచుచుండును. అందుచేతనే

యాతఁ డిప్పు డవజ్ఞాసూచకస్వరముతో "కార్యమేమో జరిగిపోయినది. కాని చరిత్ర మున్నదికదా. అందుచేతనే యది యేమైపోవునో యని మన మాలోచింపవలసి యున్నది! మీ రింత చనవిచ్చుచున్నచో లలిత యింతపని చేయఁగలదా? ఈవ్యాపార మంతయు విన్నచోఁ జనవిచ్చి లలితను బాడుచేసితి ననుసంగతి మీరే తెలిసికొనఁ గలరు!" అనియెను.

పరేశుఁడు వెనుకకుఁ దిరిగి లలితను దక్షపార్శ్వమునకుఁ దీసికొని నవ్వుచు హారానునిం గాంచి "బాబూ! బిడ్డలను పెద్దలం జేయుటకుఁ బ్రేమయే ప్రధాన మైనదని సమయము వచ్చినప్పుడు నీవే తెలిసికొనఁగలవు!" అనియెను. లలిత యప్పుడు తండ్రిని కౌఁగిలించుకొని "బాబా! మీరు స్నానమునకు వేళయైనది! లెండు!" అనియెను. పరేశుఁడు హారానునివంకఁ జూచుచు మృదుస్వరముతో "కొంచెము నే పోఁగలను! వేళ మించిపోలేదు!" అనియెను. లలిత స్నిగ్ధస్వరముతో "కాదు బాబా! మీరు స్నానమునకుఁ బొండు! మీరు వచ్చువఱకును నేను పానూబాబునొద్ద నుండెదను" అనియెను.

పరేశుఁడు వెడలిపోయెను. లలిత కుర్చీపై గంభీరముగఁ గూర్చుండి హారానుని వంక స్థిరదృష్టిం గాంచుచు "మీరు మీయిష్టము వచ్చిన ట్లందఱితోడను మాటలాడుట కధికారము కలదనుకొనుచున్నారు కాఁబోలును!" అనియెను.

సుచరిత లలితను బాగుగ నెఱుంగును. ఇప్పటిలలితస్థితిం గాంచి సుచరితహృదయము మఱియొకప్పు డైనచో నుద్విగ్నమై పోయియుండును. ఇప్పుడు సుచరిత కిటికీ యొద్దఁ గుర్చీపైఁ గూర్చుండి పుస్తకమునఁ బత్రములను దిరుగవైచుచుండెను. హృదయభావముల నడంచుకొనుటకు సుచరిత చిరకాలమునుండి యలవాటు పడియుండెను. కొలఁదిదినములనుండి యనేకాఘాతముల వేదనలు చేరి యామెహృదయము నెంతగా బాధించుచున్నను నామె యంతకంతకును నిశ్శబ్దముగా నోర్చుకొనియుండెను. ఇప్పు డా నిశ్శబ్దతాభారము దుస్సహమైయుండెను. అందుచేతనే లలిత తన యభిప్రాయమును హారానునకుఁ దెలుపుటకు సిద్ధమై కూర్చున్నప్పుడు సుచరితరుద్ధహృదయమునకు ముక్తిలాభమును బడయుట కవకాశము దొరకెను.

లలి—మాయెడల మాతండ్రిగారి కర్తవ్యము మాతండ్రిగారికంటె మీకే యెక్కుడ తెలియు ననుకొనుచున్నారా? ఈసమస్తబ్రాహ్మసమాజమునకును మీరే ప్రధానాచార్య లనుకొనుచున్నారు కాఁబోలును!

లలిత యింతటియౌద్ధత్యమునుం గాంచి హారానుఁడు ప్రప్రథమముననే హతబుద్ధియై పోయెను. కొంతసేపటి కాతఁడు సరిగా నుత్తరము చెప్పఁబోవుచుండఁగా లలిత వారించి "ఇంతకాలమువఱకును మేము మీ శ్రేష్ఠత్వమును సహించియుంటిమి. కాని యిప్పుడు మీరు తండ్రిగారికంటెను గొప్పవారుగఁ జూచుచున్నారు. ఇట్లయినచో నీయింటివా రెవ్వరు నిఁక సహింపఁజాలరు—మా సేవకులపర్యంతము—" అనియెను.

హారా—లలితా ! నీవు—

లలిత యామాట కడ్డము వచ్చి తీవ్రస్వరముతో "ఊరకుండుఁడు! మీ మాటలను చాలగా వింటిమి! ఇప్పుడు నామాట వినుఁడు; మీకు విశ్వాసము లేకున్నచో సోదరి సుచరిత నడుగుఁడు!— మీరెంత గొప్పవారు కాఁదలచియుంటిరో మాతండ్రిగా రంతకంటె వేయిరెట్లు గొప్పవారు. మీరు మాకుపదేశింపవలసిన దేమైన నున్నయెడల మీకే యుపదేశించుకొనుఁడు !" అనియెను. హారానుని మొగము నల్లబడిపోయెను ! అతఁడు చటాలున లేచి "సుచరితా!" అనియెను. సుచరిత పుస్తకమునుండి మొగ మెత్తి చూచెను. అప్పుడు హారానుఁడు "నీయెదుటనే లలిత నన్నవమానించినది !" అనియెను.

సుచరిత మృదులస్వరముతో "మిమ్మవమానించుట లలితయుద్దేశము కాదు. తండ్రిగారిని మీరు గౌరవింపవలయు నని చెప్పినది. ఆయనవంటి సన్మానయోగ్యులు మన కింక నెవ్వ రున్నారు?" అనియెను. హారానబాబు లేచిపోవలయు ననుకొనెను గాని పోలేకపోయెను. అతఁడు గంభీరముగఁ గూర్చుండెను. ఆయింటియం దాతనికి గౌరవము తగ్గుచున్నకొలఁదియును దానిని నిలుపుకొనవలయునని యాతఁ డధికప్రయత్నమును గావించుచుండెను. ఆశ్రయించినశాఖ శిథిలమగుచున్నప్పుడు దానిని బలవంతముగ నూదిపట్టుటవలన భగ్నమైపోవు ననుసంగతి యాతఁడు తెలిసికొనఁజాలకపోయెను. హారానుఁ డట్లే రోషగాంభీర్యముతోఁ గూర్చుండి యుండెను. లలిత సుచరిత ప్రక్కను గూర్చుండి మెల్లమెల్లగ నేమేమో మాటాడుచుండెను. ఇంతలో సతీశుఁ డచ్చటికి వచ్చి సుచరిత చేయి పట్టుకొని "అక్కా! రమ్ము" అనియెను.

సుచ—ఎక్కడకు ?

సతీ—రమ్ము! నీకొకటి త్రిప్పిచూపించెదను. సోదరి!లలితా! నీవు చెప్పలేదా?

లలి—లేదు.

దొడ్డమ్మసంగతి సుచరితకు సతీశుఁడు చెప్పకూడదనియు లలిత చెప్పకుండుట కంగీకరించియుండెను. అందుచేఁ జెప్పలేదు ఇప్పుడు సతీశుడే చెప్పెను. అతిథినివిడచి సుచరిత పోఁజాలక "తండ్రిగారు స్నానము చేసి రానిమ్ము! నేను తరువాత వచ్చెదను!" అనియెను.

పరేశుఁడు వచ్చినతోడనే సతీశుఁ డిరువురక్కలను వెంటఁబెట్టుకొని లోనికిఁ బోయెను. హారానుఁడు పరేశునిం గాంచి "సుచరితసంబంధవివాహమును మన మనుకొన్నట్లు గావించుటకిఁక నాలస్యము చేయరాదు. ఈ యాదివారమే జరిగించిన బాగుగా నుండును" అనియెను.

పరే—ఆవిషయమున నాయభ్యంతర మేమియును లేదు. సుచరిత యిష్టపడినచో నట్లే చేయవచ్చును.

## ౩౮

ఆనాఁడు లలితకడనుండి వచ్చినతరువాత మరల వచ్చుటకుఁ బోవుటకు వినయుఁడు కష్టముగా నుండెను; తనశూన్యమందిరము కూడ నాతని కసహ్యముగనే యుండెను. మఱునాఁటియుదయముననే యాతఁ డానందమయియొద్దకుఁ బోయి "అమ్మా! నేను కొన్నాళ్ళు నీయొద్ద నుండెదను!" అనియెను. గోరాకొఱకు దుఃఖించుచున్న తన కూఱట కలిగించుటకు వినయుఁ డిట్లనియెనని గ్రహించి యానందమయి పరితాపపడుచు నేమియు ననక ప్రేమతో వినయుని దరికిఁ జేర్చుకొని యొడలు నిమురుచుండెను.

వినయుఁ డాయింటనే యాహారవిహారములఁ గావించుచు నుండెను. అప్పుడప్పుడు మానుపటివలెఁ దనకు సరిగా జరుగుట లేదని పట్టుపట్టుచుండెను. ఎప్పుడు నేదియో మాటాడుచు నానందమయిని మఱపింపఁ జూచుచుండెను. అతనిమనసు కూడ బాగుగలేని సంధ్యాసమయములం దామె నింటిపనులు చేసికొననీయక యొకచో గూర్చుండఁజేసి తనచిన్ననాఁటికథలను ముచ్చటించుచుఁ గాలక్షేపము చేయుచుండెను. ఆనందమయి తనకుటుంబజీవితవృత్తాంతమును జెప్పుచుండెను. అప్పుడు వినయుఁడు "అమ్మా! ఎప్పుడు నీవు మాయమ్మవు కాకుండఁబోవుదువో యని నేను నిరంతరమును భయపడుచుండును." అనియెను.

ఒకనాఁటిసాయంకాలమునఁ జాఁపపైఁ గూర్చున్న యానందమయిపాదములపై వినయుఁడు తనతల నుంచి "అమ్మా! నాసమస్త విద్యాబుద్ధులను మరల దేవుని కిచ్చివైచి బాలుఁడనై నీయొడిలో నాడుకొనవలయు నని యున్నది. కేవల మీప్రపంచమున నీకంటె నిఁక నాకేమున్నది తల్లీ!" అనియెను. వినయునికంఠస్వరమున హృదయభారాక్రాంత మగునాయాసము ప్రకటిత మగుచుండుటం గాంచి యానందమయి హృదయము విస్మయవ్యథాకులమై పోయెను. ఆమె వినయుని దరిజేర్చుకొని యాదల నల్లనఁ దడవుచు గొంతసేపూరకుండి "బాబూ! పరేశబాబునింట నందఱును క్షేమముగ నున్నారా?" అనియెను.

ఈప్రశ్నకు వినయుఁ డదరిపడి లజ్జితుఁడై "అమ్మయొద్ద నేమియును దాఁచుట కవకాశములేదు అమ్మ నాయంతర్యామి." అని యనుకొని కుంఠితస్వరముతో "ఆ! అందఱును బాగుగనే యున్నారు!" అనియెను. అప్పు డానందమయి "నాకాయింటి కాంతలతోఁ బరిచయము చేసికొనవలసి యున్నది. మొదట గోరాకు వారనిన నిష్టము లేకుండెడిది. అట్టివాని యసహ్యభావమునుగూడఁ దొలఁగించినవారు సాధారణులై యుండరు!" అనియెను. వినయుఁ డుత్సాహముతో "నీకు వారిపరిచయము కలిగింప

వలయునని నాకును గోరిక యున్నది. గోరా కిష్టముండదని నేను మాటాడలేదు" అనియెను. ఆనందమయి యూరకుండి "అందుఁ బెద్దపిల్ల పేరేమి?'' అని ప్రశ్నించెను.

ఈవిధముగా మాటలు జరుగుచుండఁగా లలితప్రసంగము వచ్చెను. వినయుఁడావిషయమును సంక్షేపముగాఁ దోసివైచుటకుఁ బ్రయత్నించెను. ఆనందమయి యట్లు విడువక మనసులో నవ్వుకొనుచు "లలిత బుద్ధిమతి యని వినియుంటిని!'' అనియెను.

విన—ఎవ్వరు చెప్పిరి ?

ఆనం—నీవే చెప్పితివి కాదా ?

ఇదివఱకు వినయుఁడు లలితయెడల నెట్టిసంకోచభావములులేక యున్నప్పుడు మోహముక్తావస్థయం దానందమయితో లలిత బుద్ధిమతియని చెప్పియుండెను. ఇప్పుడాతఁడామాట మఱచిపోయెను. ఆనందమయి యతినిపుణముగఁ బ్రశ్నించుచు లలితయెడలం గలవినయుని హృదయభావముతోఁగూడ నాయిరువురిచరిత్రమునందలిప్రధానాంశములను సంపూర్ణముగ గ్రహింపఁగలిగెను. గోరాశిక్షను విచారించి లలిత యేకాకినియై తనతోఁగూడ స్టీమరుపై వచ్చియున్న సంగతి గూడ వినయుఁడు చెప్పివైచెను. మాటలాడుచున్నకొలఁదియు నాతనియుత్సాహ మతిశయించిపోవుచుండెను. అప్రసంగమున నెక్కడ నడ్డము కలుగునో యనుభయముతో నాతఁడు విడువకుండ మాటాడుచుండెను. అప్పుడు వినయునకు లలితమూలముననే తనకింతటి స్వతంత్రశక్తి కలిగినదనికూడ భావించుకొనియెను. ఇంతలో రాత్రిభోజనమునకుఁ బిలుపు వచ్చెను. అప్పుడు వినయుఁ డాకస్మికముగఁ గలనుండి మేల్కాన్నవాఁడునుం బోలి తనమనసులోమాట లన్నియు దల్లికిఁ జెప్పివైచితినిగదా యని సంతోషించెను. ఆతఁడెన్నఁడును దల్లియొద్దఁ దనమనసు దాఁచుకొనలేదు. ఆనందమయి యంతయును విని, యంతయును గ్రహించి వినయుఁడు సిగ్గుపడకుండఁగనే సర్వమును జెప్పివైచె నని యనుకొనియెను. వినయున కింతవఱకును దనతల్లియెదుటఁ దనజీవితచరిత్రమును దాఁచుకొనకుండఁ దెలిపి పవిత్రము చేసికొనలేదుగదా యనువిచారము హృదయమధ్యమున మచ్చవలె నుండెను. ఇప్పు డామచ్చ మాసిపోయినది !

రాత్రి యానందమయి యాప్రసంగమునుగూర్చి చాలసేపు యోచించుకొనియెను. గోరాజీవితసమస్య యుత్తరోత్తరజటిలమై తోఁచుచుండెను. పరేశబాబు గృహమునందే యేదో మీమాంస తేలవలయు నని యనుకొని యామె యేవిధముగనైన నాయింటి యాడువాండ్రను జూడవలయు నని నిశ్చయించుకొనియెను.

## ౩౬

మహిమునియింటిలోని వారందఱును వినయునితో శశిముఖికిఁ బెండ్లి స్థిరపడినట్లే భావించి యుండిరి. శశిముఖి వినయునకగపడుటకే సిగ్గుపడుచుండెను. శశిముఖితల్లితో

వినయునకుఁ బరిచయము లేదనియే చెప్పవచ్చును. ఆమె చాల గుట్టయినది. ఆమె యింటిపనులు చేయుచును మాటుఁబడియే యుండును. ఆమె సంగతి యేదియును భర్తకుఁ దక్క నితరుల కెంతమాత్రమును దెలియదు. ఆమెయందు భర్తకైనను స్వాతంత్ర్యము లేదు. ఆమె గీచినగీత దాఁటుట కాతనికి సాహసము లేదు! ఈవిధముగా మహిముని రాణియగు లక్ష్మీమణి కామె ప్రపంచ మంతయు సంపూర్ణముగ స్వాధీనమై యుండెను. అచ్చట లోపలివారు వెలుపలకును, వెలుపలివారు లోపలకును బ్రవేశించు మార్గము నిరాబాధకముగ లేదు. గోరా యధికారముకూడ లక్ష్మీమణి మహలునందుఁ బనిచేయదు. ఆ రాజ్యనిధానమున ద్వైధభావము లేదు. విధానాధీశ్వరి లక్ష్మీమణియే. క్రిందికోర్టు మొదలు హైకోర్టువఱకు సమస్తమును లక్ష్మీమణియే—ఎగ్జిక్యూటివ్, జ్యుడీషియల్ భేదము లేదు. ఇతర ప్రపంచమునందు మహిముఁడు స్వతంత్రుఁడే కాని లక్ష్మీమణి యధికారమునందు మాత్రము కేవల మస్వతంత్రుఁడై యుండెను.

లక్ష్మీమణి వినయుని దెరచాటునుండియే చూచియుండెను. వినయుఁడు గోరాకు బాల్యమిత్రుఁడను కారణముచేతనే యామె తనకుమార్తె నాతని కీయఁదలఁచి యుండలేదు. అతఁడు తమయొద్దఁ గట్నమును వాంఛింపఁడను కారణముచేతనే శశిముఖి నాతని కిచ్చుట కంగీకరించి మహిమునిగూడ బలవంతపెట్టెను—వినయుఁ డిప్పుడు తఱచుగా నింటికి వచ్చుచునే యున్నను గోరానుగూర్చిన విచారముచే మహిముఁ డాతనియొద్దఁ బెండ్లిమాట తలపెట్టుటలేదు.

నేఁ డాదివారము. లక్ష్మీమణి మహిముని సప్తాహికదివానిద్రకు భంగము కలిగించుటచే వినయుఁ డానందమయియొద్ద బంకించంద్రుని రంగదర్శనమును జదువుచుండఁగా నచ్చటికిఁ బోయి కూర్చుండెను. అతఁడు ముందుగా వినయునకుఁ దాంబూల మిచ్చి గోరామూర్ఖత్వమును నిందించుచుఁ గ్రమముగా నాతని కిప్పుడు విడుదల యగుటకు దినములను లెక్కింప నారంభించెను. అప్పు డాతని కాకస్మికముగా మార్గశిరమాసము సగము గడచిపోయినట్లు తలఁపునకు వచ్చెను. తోడనే యాతఁడు వినయునిం గాంచి "వినయా! మార్గశిరమాసము మీకుటుంబమునకు మంచిదికాదని చెప్పుట యుక్తియుక్తముగ లేదు. పంచాంగములలోని నిషేధములే కాక, కుటుంబ నిషేధములనుగూడ మన్నించుచున్నచో నిఁక శుభకార్యములు జరగుట యెట్లు?" అనియెను.

వినయుఁడు సంశయించుచుండుటం గాంచి యప్పు డానందమయి మహిమునిం గాంచి "వినయుఁడు చిన్ననాఁటినుండి శశిముఖిని జూచుచున్నాఁడు. ఈతని కామెను బెండ్లియాడవలయు నని లేకయే మార్గశిరమాసమును మినహ పెట్టినాఁడు!" అనియెను.

మహి—ఈమాట మొదటనే చెప్పవలసినది!

ఆనం—స్వతముగా గ్రహించుకొందు రనియే యాతని యుద్దేశము! మహిమా! పెండ్లికొడుకులే దొరకరా? గోరాను రానిమ్ము! వాఁడు చాలమందినెఱుంగును. ఏసంబంధమైన నొకటి చూచుకొనవచ్చును!

మహిముని మొగము నల్లబడిపోయెను. అతఁడు కొంతసేపూరకుండి "అమ్మా! నీవు వినయునిమనసు పాడుచేయకున్నచో నాతఁడీవిషయమున నభ్యంతరము చెప్పఁడు!" అనియెను. వినయుఁడు వ్యస్తహృదయముతో నేమో చెప్పఁబోవుచుండఁగా నానందమయి వారించి "మహిమా! నీవు నిజముచెప్పితివి! నేనీతని బ్రోత్సహింపఁజాలను. వినయుఁడు కుఱ్ఱవాఁడు; తెలియక యేపనియైనఁ జేసినచోఁ దుదకుఁ జిక్కులు కలుగును!" అని యానందమయి వినయునకు బాసటయై నింద యంతయుఁ దనమీఁద నే పెట్టుకొనియెను. అది తెలిసికొని వినయుఁడు తన దుర్బలత్వమునకు లజ్జితుఁ డయ్యెను. మహిముఁ డిఁక వినయుని బ్రశ్నింపక "సవతితల్లి యెప్పటికిని సవతితల్లియే" అని యనుకొనుచు వెడలిపోయెను.

మహిముఁ డిట్లు తన్ను లోకములోని సవతితల్లులవలెనే భావించియుండె నని యానందమయి గ్రహించెను. కాని యీవిషయమునఁ దన్ను లోకు లేమనుకొందురో యను సంశయాభాసమైన నామెకుఁ గలుగలేదు. ఆమె యెప్పుడు గోరా నొడియందుఁ జేర్చుకొనియెనో యాదినమునుండియే లోకులయాడికల నన్నిటిని దృణీకరించి వైచుచుండెను. ఒక్కసత్యమును మాత్రము దాఁచి యుంచితి నని యామె నిరంతరమును బాధపడుచుండెను. లోకనింద లాబాధను జాలవఱకుఁ దగ్గించివైచుచుండెను. లోకనిందలనుండి తనపనులను వేఱుచేసికొనుట మొదటినుండియు నామె కభ్యాసమై యుండెను. అప్పుడానందమయి వినయుని గాంచి "బాబూ! నీవు చాలదినములనుండి పరేశునింటికిఁ బోవుట లేదు కాఁబోలును!" అనియెను.

వినయ—ఔను.

ఆనం—నీవు స్టీమరునుండి వచ్చినతరువాత నొక్కసారియును బోలేదు.

అదియైనను జాలనాళ్ళు కాలేదు కాని వినయుఁ డిదివఱ కానందమయికిఁగూడ దర్శనము దుర్లభ మగునట్లు తఱచుగాఁ బరేశునింటికిఁ బోవుచుండెను. ఆలెక్కనుబట్టి చూడఁగా నివి చాలదినము లనియే చెప్పవచ్చును. వినయుఁడు తనయుత్తరీయమునందలి నూలుపోగులను లాగి యూరక నులివెట్టుచుఁ గూరుచుండెను. ఇంతలో సేవకుఁడు వచ్చి "అమ్మా! ఎవ్వరో స్త్రీలు వచ్చియున్నారు?" అనియెను. వినయుఁడు తత్తరముతో లేచి నిలువఁబడియెను. "ఎవ్వరు? ఎక్కడనుండి వచ్చిరి." అనిప్రశ్నించుచుండఁగనే లలితాసుచరితలు లోపలఁ బ్రవేశించిరి. వినయుఁడు గదినుండి వెడలఁజాలక స్తంభితుఁడై నిలువఁబడిపోయెను. ఆయిరువురు యువతులు నానందమయికిఁ బ్రణామము చేసిరి. లలిత

వినయుని విశేషముగ లక్షింపలేదు. సుచరిత యాతనికి నమస్కరించి "క్షేమమా?" అని ప్రశ్నించి యానందమయిం గాంచి "అమ్మా! మేము పరేశబాబుగృహమునుండి వచ్చితిమి!" అని చెప్పెను.

ఆనందమయి వారి నాదరముతోఁ గూర్చుండఁజేసి "అమ్మా! మాకు మీపరిచయము తెలుపనక్కఱలేదు. నేను మిమ్ములను జూచలేదుగాని మాయింటిలోనివారి వలెనే మిమ్ములను బాగుగా నెఱుంగుదును!" అనియెను. క్రమముగా సంభాషణ పెరిగిపోయెను. వినయుఁడు మాటాడకూరకుండుటం గాంచి సుచరిత యాతని మాటాడింపఁదలఁచి "మీరు చాలదినములనుండి మాయింటికి వచ్చుటలేదు" అనియెను.

వినయుఁడు లలితవంక నొక్కసారి చూచి సుచరిత నుద్దేశించి "తఱచుగా వచ్చి విరక్తి కలిగించుటచే స్నేహమునకే భంగము కలుగునేమో యని భయపడితిని!" అనియెను. సుచరిత నవ్వుచు "స్నేహము తఱచుగా వచ్చి విరక్తిని కలిగించుటనే కోరుచుండు నని మీ రెఱుఁగరు కాఁబోలును?" అనియెను. ఆనందమయి నవ్వుచు "అమ్మా! అతనికిఁ దెలియుకేమి? మీ కేమని చెప్పుదును? దినమంతయును నాతో నుండి పని తోఁచనియపుడెల్ల నాతో మాటాడుచు నేయుండును. స్నేహమునకు నిరంతరసాన్నిధ్యమెట్టిసుఖకరమైనదో యీతనికిఁ బూర్తిగఁ దెలియును." అని ప్రేమమయదృష్టితో వినయునివంకఁ జూచెను.

వి॥—అమ్మా! పరమేశ్వరుఁడు నీశాంతస్వభావమును నామూలముగాఁ బరీక్షించుచున్నాఁడు.

సుచరిత లలితకు సంజ్ఞచేసి "సోదరీ! వింటివా? మనపరీక్ష ముగిసినట్లున్నది. ప్యాసైనట్లు తోఁచుటలేదా?" అనియెను. లలిత యేమియుమాటాడలేదు. ఆనందమయి నవ్వుచు "మావినయుఁ డిప్పుడు తనధైర్యమును బరీక్షించుకొనుచున్నాఁడు. ఈతని హృదయము మీకింకను దెలియుటలేదు. సాయంకాలము మొదలు మీమాటకంటె వేఱొకమాటలేదు. పరేశబాబుమాటవచ్చినంతనే యొక్కసారి పొంగిపోవుచుండును." అని చెప్పి యామె లలితమొగమువంకఁ దిలకించుచుండెను. లలిత బలవంతముగాఁ గన్నులెత్తెను గాని యేమిలాభము? అవి రక్తవర్ణములైపోయెను.

"అమ్మా! లలితా! మీతండ్రిగారినిమిత్తము మావినయుఁ డెందఱితోడనో కలహము తెచ్చుకొనియెను. వారితని జాతిభ్రష్టుఁ డనికూడ బహిష్కరింపఁదలఁచిరి— వినయబాబూ! అట్లు చూచెదవేమి? నేను సత్యము చెప్పుచున్నాను. ఇందు సిగ్గుపడవలసినదేమున్నది లలితా?"

ఈసారి యానందమయి లలితమొగమువంకఁ జూచినంతనే లలితకన్నులు వాలిపోయెను. అప్పుడు సుచరిత "వినయబాబు మమ్ములఁ నాత్మీయులుగనే చూచుకొను

చున్నాఁడని మేమెఱుంగుదుము. దానికిగారణము మాయందలి గుణముకాదు. అతనియందలి ప్రేమస్వభావమే!'' అనియెను. ఆమాటకు సంతోషించి యానందమయి ''అమ్మా! అంతేకాదు. నేను వీనిని జిన్నప్పటినుండి చూచుచున్నాను. అతనికి మా గోరా యొక్కఁడే మిత్రుఁడు. తమ సంఘమువారిలో నెవ్వరితోడను వీఁడు కలిసి యెఱుంగఁడు! కాని మిమ్ములను జూచినప్పటినుండియు నాకే వీని దర్శనము దుర్లభమైనది. అందుచే నాకు మీమీఁదఁ గోపముగ నుండెను. కాని యిప్పుడు మిమ్ములను జూచి నేనును మీపక్షముననే చేరితిని. అమ్మా! మీవంటివారి నెవ్వరు గౌరవింపరు!'' అని చెప్పుచు నామె లలితాసుచరితలను స్పృశించి కరాంగుళులచేతనే ముద్దుపెట్టుకొనియెను.

సుచరిత వినయుని కష్టముం గాంచి దయార్ద్రచిత్తముతో "వినయబాబూ! తండ్రిగారు వచ్చి కృష్ణదయాళుబాబుతో మాటాడుచున్నారు!" అనియెను. వినయుఁడు తత్తరపాటుతో వెలుపలకుఁ బోయెను. అప్పు డానందమయి గోరావినయుల ప్రాణమిత్రత్వముంగూర్చి ముచ్చటించెను. లలితాసుచరితల కాసంగతి యిదివఱకే తెలియును. ఆనందమయి తనజీవితమునం దీయిరువురిపై తన మాతృప్రేమసర్వస్వముచే వర్షించుచుండెను. ఈప్రపంచమునం దామెకు వీరికంటెఁ బ్రియవస్తు వేదియును లేదు. ఒక బాలిక శివునిఁ బూజించినట్లుగా వీరి నామె స్వహస్తములతోఁ బూజించినది. వీరు నామె యారాధనమును సర్వమును గ్రహించిరి. ఆనందమయి తనక్రీడదేవత లగు గోరావినయుల చరిత్రమును బ్రేమరస ముట్టిపడునట్లు మధురముగ, సముజ్జ్వలముగ వారికిఁ దెలుపుచుండెను. లలితాసుచరితలు తనివితీరక వినుచుండిరి. వారి కిదివఱకే గోరావినయులయెడల గౌరవముండెను. ఈతల్లి ప్రేమమూలమున నది యిప్పుడు ద్విగుణీకృత మయ్యెను.

అప్పుడు లలిత గోరాను శిక్షించినకలెక్టరునందుఁ దనకుఁగల కోపమును బ్రకటించెను. ఆనందమయి నవ్వుచు ''అమ్మా! గోరానుగూర్చి నేను పడుచున్నదుఃఖ మాయంతర్యామికే తెలియును! కాని, యాదొరపై నాకుఁ గోపము లేదు. నాకు గోరా సంగతి బాగుగాఁ దెలియును. వాఁడు తనకు మంచిదని తోఁచినపని చేసితీరును. శాసనమును లక్ష్యము చేయఁడు! ఇప్పుడు గోరాయును, దొరయునుగూడఁ దమకర్తవ్యములను జేసియున్నారు. ఇందువలన దుఃఖపడవలసినవారికే దుఃఖము కలిగినది. గోరా యిందుకొఱ కెంతమాత్రమును విచారించుటలేదు. అతనియుత్తరమును జూడుఁడు!' అని యానందమయి గోరా యుత్తరమును వారి కిచ్చెను.

ఉత్తరము చదివినతరువాతఁ గొంతసేపటివఱకు ముగ్ధులును నిస్తబ్ధులై కూర్చుండియుండిరి. ఆనందమయి చీరచెఱఁగుతోఁ గన్నుల నొత్తుకొనియెను. ఆకన్నీటియందుఁ గేవలమాతృస్నేహదుఃఖమే కాదు—ఆనందమును, గౌరవమునుగూడ సమ్మిళితములై

యుండెను. ఆమె "గోరా సాధారణుఁడా! కలెక్టరును గూడ క్షమించుమనిగాని, దయఁజూపుమనిగాని ప్రార్థింపని గోరా! అతఁడు తప్పు నొప్పుకొని కారావాసకష్టభారమును గోరి నెత్తిపైఁ బెట్టుకొనియెను. గోరా నిర్భయముగా నాకష్టమును సహింపఁగలిగెను. గోరాతల్లిమాత్రము సహింపలేదా?" అనుకొనియెను.

లలిత యాశ్చర్యముతో నానందమయి మొగమువంకఁ జూచుచుండెను. లలిత హృదయమునందు బ్రాహ్మసంస్కారములే దృఢపడియుండెను. ఆధునికజ్ఞానము లేని హిందూయువతులయెడల నామెకు గౌరవము లేదు. హిందూయువతుల మూఢత్వములగూర్చియే యామెకుఁ జిన్నతనమునుండియు వరదాసుందరి బోధించియుండెను. అందుచే నిప్పటి యానందమయి సంభాషణవిన్యాసములు లలితకద్భుతములుగాఁ దోఁచెను. అట్టిసామర్థ్యము, అట్టిశాంతి, అట్టినైపుణ్యము, అట్టివివేచనము—అది యంతయుం గాంచి లలిత యాతేజోమూర్తియెదుటఁ దన్నొక యల్పకణముగా భావించుకొనియెను. ఆమెహృదయము సంక్షుభితమై పోవుచుండుటచే వినయునివంకఁ జూచుటకుఁ గాని యాతనితో మాటాడుటకుఁగాని సమర్థురాలు కాకపోయెను. కాని, శాంతస్నేహకరుణాపూర్ణ మగు నానందమయి మొగము చూచినంతనే లలితమనస్తాపము చల్లాఱిపోయెను. అప్పుడు లలిత యానందమయిం గాంచి "అమ్మా! మిమ్ముఁ జూచినంతనే గోరాబాబున కంతశక్తి యెట్లు కలిగెనో మేము తెలిసికొనఁగలిగితిమి!" అనియెను.

ఆనం—అది సరికాదు తల్లీ! గోరా సాధారణతనయుఁడే యైనచో నాకింతటి శక్తి యెట్లు లభించును? ఇంతటిధైర్యముతో నింతటి దుఃఖమును సహింపఁగలశక్తి నాకాతనిమూలముననే కలిగినది!

## ౩౨

లలితహృదయ మిప్పుడింతగా నేల సంక్షోభించుచుండెనో దానినిగూర్చి యొకసంగతి చెప్పవలసియున్నది.

కొలఁదికాలమునుండి ప్రతిదినమును దెల్లవారి లేచినతోడనే లలితహృదయమున "నేఁడు వినయబాబు రాలేదు" అని తోఁచుచుండెను. దిన మంతయు నామె ప్రతి నిమిషమును వినయునిరాకకే నిరీక్షించుచుండెను. వినయుఁడు వచ్చి క్రిందిగదిలోఁ బరేశబాబుతో మాటలాడుచుండెనేమో యని యామె ప్రతిక్షణమును శంకించుచుండెను. అందుచే నామె దినమంతయు వెఱ్ఱిదానివలె నటునిటుఁ దిరుగుచు రాత్రిపరుండి యేమేమో భావించుకొనుచుఁ గాలక్షేపము చేయుచుండెను. ఆమె కేమియును స్థిమితముగ లేదు. అప్పుడప్పు డేడ్చుచుండెను—ఒకప్పుడు కోపముకూడఁ దెచ్చుకొనుచుండెను. ఎవ్వరిపైఁ గోపమో తెలియదు! తనపైనే యని తోఁచుచున్నది! "ఇదియేమి! నేను బ్రతుకుట యెట్లు?" అని భావించుకొనుచుండెను. ఏవైపుచూచినను నామెకుఁ ద్రోవ యగపడుట లేదు. ఈవిధముగా నెన్నాళ్ళు గడచును?

వినయుఁడు హిందు వనియు, వానితోఁ దనకుఁ బెండ్లి జరుగదనియు లలిత యెఱుంగును. అయినను నామె తనమనసును మరల్చుకొనఁజాలక లజ్జాభయములచేఁ గృశించి పోవుచుండెను. వినయుఁడు తనయెడల విముఖుఁడు కాఁడని లలిత యెఱుంగును. అందుచేతనే మనసు త్రిప్పుకొనుట యామెకుఁ గష్ట మగుచుండెను. ఆమె మేడపైనుండి వినయుని యాశాపథమును నిరీక్షించుచుండియు నాతఁ డెక్కడవచ్చునో యని భయముకూడ పడుచుండెను. ఇట్లామె బాధపడుచు నేఁటియుదయమున ధైర్యము నిలుపుకొనఁజాలక వినయుఁడు రాకుండుటచేతనే తనకింతదుఃఖముగా నుండెననియు, నొక్కసారి యాతనిఁ జూచినచో శాంతి కలుగు ననియు భావించుకొనియెను.

అప్పుడామె సతీశుని దనగదిలోనికిఁ బిలిచెను. సతీశుఁ డిప్పుడు దొడ్డమ్మ మాటలలోఁ బడి సర్వమును మఱచి యుండెను. లలిత యాతనిం గాంచి "వినయ బాబుతో నీకు విరోధము వచ్చినదనుకొందును! ఎప్పుడును నీకాతనిమాటయే కాని యాతఁడు తిరిగి చూడనైనఁ జూచుటలేదు!" అనియెను. సతీశుఁ డంగీకరింపక "ఆలాగా? అల్లెన్నఁటికిని జరుగదు!" అనియెను.

కుటుంబమునఁ జిన్నవాఁడగుసతీశుఁడు తనగౌరవమును సప్రమాణముగ నిరూపించుకొనుటకై యెప్పుడు నిట్టే దృఢముగ మాటాడుచుండును. తోడనే యాతఁడు పరుగెత్తుకొని వినయునింటికిఁ బోయి తిరిగి వచ్చి "అక్కా! ఆతఁ డింటియొద్ద లేఁడు! మనయింటికే వచ్చుననుకొనియెదను" అని చెప్పెను.

లలి—ఇన్నాళ్ళవఱకును రాలేదేమి ?

సతీ—ఎన్నాళ్ళయినది ?

అప్పుడు లలిత సుచరితకడకుం బోయి "అక్కా! మనమొకసారి గోరాబాబు తల్లిని జూచివచ్చిన బాగుగనుండును." అనియెను. వారితో మనకుఁ బరిచయము లేదుగదా యని సుచరిత సంశయించెను. గోరాబాబు తండ్రికిని దమతండ్రికిని బాల్యమిత్రత్వమునుగూర్చి లలిత జ్ఞప్తికిఁ దెచ్చెను. అప్పుడు సుచరిత యుత్సాహితయై "సోదరీ! నీవుపోయి తండ్రిగారిని సెలవడుగుము!" అనియెను. నీవేపోయి యడుగవలయు నని లలిత బలవంతపెట్టెను.

తుదకు సుచరితయే పరేశుని సెలవడిగెను. పరేశబాబు నేనుకూడ వచ్చెద ననియెను. ప్రయాణము సిద్ధపడినతోడనే లలితమనసు మారిపోయెను. ఎక్కడనుండిరో, యభిమానమును, సంశయమును వచ్చి యామెను వెనుకకు లాగుచుండెను. ఆమె సుచరితం గాంచి "అక్కా! తండ్రిగారితో నీవు పొమ్ము! నేను రాను!" అనియెను. సుచరిత లలిత చేయి పట్టుకొని "ఇదియేమి! నీవు లేక నేనొంటిగాఁ బోవుదునా! అమ్మవు గాదా! సోదరివి గాదా! రా తల్లీ! గోలపెట్టకుము!" అనియెను.

లలిత బలవంతముచే బయలుదేరెను. కాని యామె వినయునిచే విజితయైనది! వినయుఁ డామెయింటికి వచ్చుట లేదు! అట్టివినయుని జూడఁ బోవుచుంటి ననుపరాభ

వాభిమాన మామెహృదయమును బాధించుచుండెను. వినయునిఁ జూచుటకే యానందమయియింటికిఁ దాను వచ్చినట్లు వినయుఁడు భావింపకుండుటకై లలిత యెట్లోకష్టపడి ధైర్యము వహించి వినయునివంకఁ జూడనైనఁ జూడలేదు ! అతనికి నమస్కారమైనఁ జేయలేదు ! అతనితో నొక్కమాటయైన నాడలేదు. వినయుఁడు తనమనోభావ మానందమయిముఖమున బయల్పడుటచే లలిత యిట్లు లజ్జ చేయుచున్నదని భావించుకొనియెను. లలితకూడఁ దన్నుఁ బ్రేమించియే యుండునని భావించుకొనుటకుఁ గూడఁ దగిన యాత్మాభిమానము వినయునకు లేదు—

తరువాత వినయుఁడు పరేశునికడనుండి వచ్చి లలిత కగపడకుండఁ దలుపుచాఁటున నిలిచి " పరేశబాబు బయలుదేఱినారు ! మిమ్ములను రమ్మనుచున్నారు ! అని చెప్పెను. అప్పు డానందమయి "అదియెట్లు ? ఫలాహారమైనఁ జేయకుండఁగనే! అలస్యము కాదు ! బాబూ ! నీవిక్కడఁ గూర్చుండుము ! నేనిప్పుడే వచ్చెదను! వెలుపల నిలువఁబడియెద వేమి? లోపలికి రమ్ము!" అనియెను. వినయుఁడు లోనికి వచ్చి దూరముగాఁ గూర్చుండెను. అప్పుడు లలిత సహజభావముతో "వినయబాబూ ! మీరు మామిత్రుఁ డగుసతీశుని మిత్రత్వమును బూర్తిగా వదలుకొంటిరో లేదో తెలిసికొనుటకై వాఁడు నేఁటియుదయమున మీయింటికిఁ బోయినాఁడు!" అనియెను.

ఆకస్మికముగ దైవవాణి నాలకించినమానవునిం బోలి వినయుఁడు విస్మితుఁడై యదరిపడియెను. ఆభావ మందఱకు స్పష్టపడుటచే నాతఁడు లజ్జితుఁ డయ్యెను. స్వభావసిద్ధ మగునైపుణ్యముతో నాతఁడు బదులు చెప్పలేకపోయెను. అతఁడు తన ముఖంబునను, కర్ణమూలములను గెంపు గదుర "సతీశుఁడు మాయింటికిఁ బోయెనా? నేనింట నుండుటలేదు !" అనియెను.

లలిత యీచిన్నిమాటకే వినయునిహృదయ మపరిమితానందభరిత మయ్యెను. ఒక్కనిమిషములో నిశ్వాసనిరోధక మగుదుస్స్వప్నముంబోలియున్న యాతని ప్రబల సంశయ మంతయును దూరమైపోయెను. ఇంతకంటె నాతని కీప్రపంచమునఁ గోరఁ దగినదేమియు లేదు. అతఁ డప్పుడు తనలో "బ్రదికితిని ! లలితకుఁ గోపము లేదు ! నాయందెట్టిసందేహమును లేదు !!" అని యనుకొనియెను. క్రమముగా సమస్తనిర్బంధములును వదలిపోయెను. సుచరిత నవ్వుచు "వినయబాబూ ! నీవు మమ్ములను భీకర నఖదంతశృంగములుగల క్రూరజంతువులుగను, నాయుధపాణులగు దస్యులుగను సంశయించు చున్నట్లున్నావే!" అనియెను.

వినయుఁడు "ఈప్రపంచమున బూతరించి మాటాడఁజాలక యూరకుండువారే యపరాధు లగుచుందురు ! సోదరీ ! నీమాట బాగుగ లేదు. నీవు దూరముగఁ బోయి దూరమైతి రని యితరులపై నేర మారోపించుచున్నావు" అనియెను. వినయుఁడు సుచరితను సోదరీయని పిలుచుట యిదే మొదటిసారి. అపిలుపు సుచరితచెవుల కమృతమువలెనుండెను. ప్రథమదర్శనమునందే యామె కాతనిపై సౌహృద్యము కలిగెను. అది యిప్పుడు సంపూర్ణ మయ్యెను.

ఆసాయంకాలమునఁ బరేశుఁడు లలితాసుచరితలను దీసికొని యింటికిఁ బోయెను. వినయుఁడప్పు డానందమయికడకుఁ బోయి "అమ్మా! నిన్నిప్పుడు పనిచేసికొననీయను. మేడమీఁదికి రమ్ము!" అనియెను. వినయుఁడు హృదయోద్రేకము నాఁచికొనఁజాలకుండెను. ఆనందమయి మేడమీఁదికిఁ బోయి కూర్చుండి వినయునిం గాంచి "బాబూ! ఏమి చెప్పెదవో చెప్పుము!" అనియెను. వినయుఁడు "నేను చెప్పున దేదియును లేదు! నీవు చెప్పుము!" అనియెను లలితాసుచరితలంగూర్చి యామె యభిప్రాయము తెలిసికొనవలయునని వినయుని యూహ. అప్పు డానందమయి "నన్నిందులకేనా తీసికొని వచ్చితివి? నాకేమియును మాటలు లేవు!" అనియెను.

వినయుఁడు "అమ్మా! నిన్నిచ్చటికిఁ దీసికొని రాకున్నచో నీసూర్యాస్తమయ సౌందర్యము నీకన్నులఁ బడునా?" అనియెను. ఆదినమునఁ గలకత్తాకాశమున మార్గశిర సూర్యుఁడు మలినభావముతోనే యస్తంగతుఁ డగుచుండెను. వర్ణవైచిత్ర్య మేమియును లేదు. ఆధూమబాష్పమధ్యమున స్వర్ణకిరణము లస్పష్టములుగనే యుండెను. కాని యామ్లానసంధ్యాధూసరత్వముకూడ వినయున కందముగనే యుండెను. నలుదెసలు నాతని దట్టముగ నావరించి యున్నట్లును నాకాశ మాతని స్పృశించుచున్నట్లును దోఁచుచుండెను.

ఆనం—లలితాసుచరితలు చాలమంచివారు!

వినయుఁ డామాటతో నాఁగనీయలేదు. ఆతఁ డిన్నాళ్ళనుండియుఁ దనకును వారికిని గలపరిచయమునుగూర్చి యెల్లసంగతులను విశేషముగఁ దెలియఁజేసెను. అప్పు డానందమయి యాకస్మికముగ నొక్కనిట్టూర్పు విడిచి "మనగోరా సుచరితను బెండ్లియాడినచో బాగుగనుండును" అనియెను. వినయుఁ డొక్కగంతువైచి "అమ్మా! ఈమాటయే నాకన్నిసారులు తోఁచినది. సుచరిత గోరాకుఁ దగినది!" అనియెను.

ఆనం—కాని, పెండ్లి యగుటెట్లు?

విన—కాకేమి? గోరా సుచరిత నంగీకరింపకపోఁడని నాయుద్దేశము!

గోరామన సెవ్వరిచేతనో యాకర్షింపబడియె నని యానందమయి యిదివఱకే గ్రహించి యుండెను. ఇప్పటి వినయునిమాటలవలన నామె సుచరితయే యైయుండునని భావించుకొనియెను. ఆనందమయి కొంతసే పాలోచించి "కాని సుచరిత హిందువును బెండ్లియాడునా?" అనియెను.

విన—అమ్మా! గోరాయే బ్రాహ్మయువతిని బెండ్లియాడఁడేమో! నీకిష్టమున్నదా?

ఆనం—నాకిష్టమున్నది. లేకేమి బాబు! స్త్రీపురుషులహృదయసమ్మేళనమే వివాహము! దానికి మంత్రములతోఁ బని లేదు. ఎట్లయినను నీశ్వరప్రార్థనముతో స్థిరపడవలసినదే!

వినయునిహృదయభారము దిగిపోయెను. అతఁడుత్సాహముతో "అమ్మా! నీవిట్లు చెప్పుట నాకద్భుతముగా నున్నది; ఇంతటియౌదార్యము నీవెవ్వరివలన సంపాదించితివి?" అనియెను. ఆనందమయి నవ్వుచు గోరామూలముననే అనియెను.

విన — గోరా యిట్లేల చెప్పును ?

ఆనం — చెప్పకేమి ? నాజ్ఞానమంతయును గోరావలనఁ గలిగినదే. ఈశ్వరుఁడు నాకు గోరాను బ్రసాదించినప్పుడే మానవత్వమెంతకఱకు సత్యమైనదియో, మానవుఁడు మానవునితో భేదముకల్పించుకొని పోరాడుట యెంతవఱకధర్మమైనదియో యంతయును నేను గ్రహింపగలిగితిని! బాబూ! బ్రాహ్మసామాజికు లన నేమి? హిందువు లన నేమి ? మానవహృదయమున నెట్టిజాతిభేదమును లేదు ! అచ్చటనే పరమేశ్వరుఁడందఱను గూర్చి తానుగూడ నచ్చటనే కూడియుండును ! దానిని విడిచి మంత్రముల చేతను, మతముచేతను సమ్మేళనము చేయఁజూచుట యేమిలాభము !

వినయుఁడానందకుఁడయిపాదములపైఁ బ్రణమిల్లి "అమ్మా! నీయుపదేశము నాకమృతమైనది. నాదినమిప్పుడు సార్థకమైనది." అనియెను.

## 35

సుచరిత పెద్దతల్లియగు హరిమోహినిమూలమునఁ బరేశునికుటుంబమునందశాంతి కలిగెను. ఆకారణము తెలుపుటకుఁ బూర్వమే హరిమోహిని సుచరితకుఁ జెప్పిన యామె జీవితచరిత్రమును సంక్షేపముగ నీక్రిందఁ బొందుపఱచుచున్నాము !—

"నేను మీతల్లికంటె రెండేండ్లుపెద్దదానను. ఇంటియందు మేమిరువురమే బిడ్డలముగుటచే గారాబమునఁ బెరుగుచుంటిమి ! పినతండ్రులు క్రిందఁ గాలుంచనీయకుండ మమ్ములను బెంచుచుండిరి. నేను నాయెనిమిదవయేటనే పాలసాయందలి విఖ్యాతవంశజులగు రాయచౌధురులయింటికోడల నైతిని. వారు కులవంతులే కాక భాగ్యవంతులుగూడ నైయుండిరి. కాని నాకుమాత్రము సుఖపడునదృష్టము లేకపోయినది. మా పుట్టింటివారికిన్ని తింటివారికిని గలహములు కలిగెను. వారు మరలఁ బెండ్లిచేసికొన వలయు ననికూడ భయపెట్టిరి. నాతండ్రి యిది యంతయు ననుభవించి భాగ్యవంతుల కాఁడుబిడ్డ నీయఁగూడదని యొట్టుపెట్టుకొనియెను.

నేను చిన్నతనమునుండియు నత్తవారింటనే యుండి యందఱకును వంట చేసి పెట్టుచుండెడిదానను. అత్తవారింట నేఁబదిమందికఱకుఁ దినువా రుండిరి. ఎప్పుడును నాకు వేళకుఁ దిండి లేదు! శయనించుటకు నిర్దిష్టస్థలమును లేదు. అంతఃపురకాంతలలో నెవ్వరియొద్దనో పరుండి నిద్రించెడిదానను. ఇంటివా రందఱకును నాయందసహ్యభావమే ! నాభర్తగారికిఁగూడ నట్లే యుండెను. చాలకాలముకఱకును వారు నన్ను దూరముననే యుంచిరి.

"నాకుఁ బదునేడవయేఁట మనోరమ యను నొకతనయ కలిగినది. ఆఁడుబిడ్డను గన్నందుల కింటివారు నన్ను మఱింత బాధింపనారంభించిరి. ఆకష్టములనడుమ నాయేక పుత్రికయే యించుకయూరటయు నానందమును గల్పించుచుండెను. ఆబిడ్డను దండ్రి గాని యింటిలో నెవ్వరుగాని యాదరింపకుండుటచే నేనే ప్రాణపదముగఁ జూచుకొని పెంచుకొనుచుంటిని. మఱి మూడేండ్లకు నాకొక మగశిశువు కలిగెను. అప్పటికి నాకు గృహిణిగా నుండుటకుఁ దగిన యోగ్యతకూడఁ గలిగెను. అత్తగారు నాకు లేనే లేదు—మనోరమపుట్టిన రెండేండ్లకు మామగారుకూడ మరణించిరి. తరువాత నాభర్తగారు నామఱఁదులను వేఱుపడిరి.

మనోరమకుఁ బెండ్లియీఁడు వచ్చినతోడనే పాల్నాకుఁ బదిమైళ్ళదూరమందలి సిమూలాగ్రామమునం దామెకు సంబంధము చేసితిమి. వరుఁడు కుమారస్వామి వలెఁ జక్కనివాఁడై యుండెను. నేనెంతకష్టపడితినో యీశ్వరుఁ డప్పుడు నాకంతటి సుఖమును బ్రసాదించెను. తుట్టతుదకు నాస్వామికి నామీఁ దధికాదరము కలిగెను. ఆయన నాతోఁ జెప్పకుండ నేపనియుఁ జేయుటలేదు. ఇంతసౌభాగ్యము నేను సహింపఁగలనా? ఇంతలోఁ గలరావలన నాభర్తయును బుత్త్రుఁడునుగూడ, నాలుగుదినములు హెచ్చుతగ్గుగా మరణించిరి. భావించుటకుఁగూడ దుస్సహము లగుదుఃఖములను మానవులు సహింపఁగల రని దృష్టాంతము చూపుటకుఁ గాఁబోలును, పరమేశ్వరుఁడు నన్నింకను బ్రదికించి యున్నాఁడు!

క్రమముగా నాయల్లునిసంగతి తెలియవచ్చెను. కమనీయకుసుమములచాటునఁ గాలసర్ప ముండు నని యెవ్వ రనుకొందురు? వాఁడు దుస్సహపానముచేఁ జెడిపోవుచున్నట్లెప్పుడును నాబిడ్డయైనఁ జెప్పియుండలేదు! అల్లుఁ డప్పుడప్పుడు నాయొద్ద సొమ్ము తీసికొనిపోవుచుండెను. ఈప్రపంచమం దిఁక నాకెవ్వ రున్నారు! నాసొమ్మంతయు నిఁక నెవ్వరికి? అందుచేత నేకొంచె మడిగినను నెక్కువగా నిచ్చుచుంటిని. నేను సొమ్మిచ్చి తనభర్తను బాడుచేయుచుంటి నని నాబిడ్డ నాపైఁ గోపపడుచు నేయుండెడిది. నాయల్లుఁడు త్రాగుఁబోతై చెడిపోయెను. నేనే సొమ్మిచ్చి యాతని బాడుచేసితి నని తెలిసికొని విచారించితిని.

అంతటినుండి నేను సొమ్మీయకుండుటచే మనోరమ నాచే మాన్పించినదని నాయల్లుఁడు గ్రహించి నాబిడ్డను బాధింపఁదొడంగెను. బిడ్డబాధ మానఁజాలక చాటుగా నేనాతనికి మరల సొమ్మీయ నారంభించితిని. కాని, యాతఁడు మామనోరమను బాధించుట మానలేదు. ఇట్లుండఁగా నొకనాఁ డాకస్మికముగా మామనోరమ పల్లకి నెక్కి మాయింటికి వచ్చెను. ఏమమ్మా! కబురుపంపకుండ నిట్లువచ్చితివని నేనడిగితిని. కబురు పంపకుండ నాఁడుబిడ్డ పుట్టింటికి రాఁగూడదా యనినవ్వుచు నామె బదులు చెప్పినది.

మావియ్యపురాలు చాల నుత్తమురాలు! మామనోరమ యప్పుడు గర్భవతిగానుండుటచే నామెయే మాయింటికిఁ బంపినది. తనకొడుకుబాధ తప్పించుటకై కోడలి నిట్లామె పుట్టింటికిఁ బంపినదని నేనప్పు డూహింపలేదు.

మనోరమ, మాయింటనుండుటచే నల్లునకు నాయొద్దసొమ్ము తీసికొనుట కవకాశములేకుండెను. అందుచే నాతఁడు తనభార్యను బంపవలయు నని నన్ను నిర్బంధింపసాగెను. క్రమముగా మనోరమయెదుటనే నన్ను సొమ్మడుగ నారంభించెను. అప్పుడు మనోరమ నాపెట్టెతాళములను దీసికొని తనయొద్దనే యుంచుకొనియెను. ఇఁక లాభములేక నాయల్లుఁ డొకనాఁడు వచ్చి బలవంతముగా మామనోరమను దీసికొని పోయెను.

అమ్మా! ఏమని చెప్పఁగలను! ఆరాత్రియే గర్భపాతమై మనోరమ మరణించినట్లును, రహస్యముగ దహనసంస్కారము జరిగినట్లును నాకుఁ గబురు వచ్చెను! అప్పుడు నేను పడినదుఃఖమును గూర్చి చెప్పుటవలన నేమిలాభము? నాసర్వమును బోయినను నాకుఁ గష్టములుమాత్రము పోలేదు. నాభర్తయును, బుత్రుఁడును బోయినప్పటినుండియు నామఱఁదులు నాయాస్తికొఱ కాశపడుచుండిరి. నాయనంతరమున వారికే చెందును గాని యంతవఱకును వారు సహింపఁజాలకుండిరి. అది వారితప్పు కాదు నావంటి నిర్భాగ్యురాలు బ్రతికి యుండుటయే తప్పు! నాసొమ్ములో నొక్క దమ్మిడియైన నామఱఁదులకుఁ దక్కకుండ నాభర్తమిత్రుఁ డగునీలకాంతుఁడు నా పక్షమునఁ బనిచేయుచుండెను. మనోరమ మరణించినతరువాత నామఱఁదులు నన్నాడించువారివలె వచ్చి "నీవీయవస్థలో సంసారమునం దుండుట మంచిదికాదు. తీర్థయాత్రలు చేసికొనుట మంచిది. నీకర్చులకు మేము తగినయేర్పాటు చేసెద"మని బోధించిరి.

తరువాత నేను మాగురువుగారినిఁ బిలిపించి "మహాత్మా! నేనీదుఃఖము నుండి తప్పించుకొనుట కుపాయ మేమి? నేనగ్నిహోత్రమధ్యమునం దున్నాను. నాకెచ్చటను శాంతి లేదు. నాయీపరితాపాగ్నిజ్వాలలు చల్లారునుపాయమును నాకు బోధింపుఁడు." అని ప్రార్థించితిని. ఆయన నన్నుఁ బూజామందిరమునకుఁ దీసికొని పోయి యొకగోపాలవిగ్రహము నిచ్చి "దీనినిఁ బూజించుకొనుచుండు" మని బోధించెను. నేను సర్వాంతఃకరణములచేతను దేవుని రేయుంబవలు పూజించుచుంటిని. కాని, యాతఁడు నాపూజలను గ్రహింపకున్నచో నేను పూజించుట యెట్లు? ఆతఁ డెట్లు నాపూజలను గ్రహించునో నేనెఱుంగను!

తరువాత నేను నీలకాంతునిఁ బిలిచి యేమియుం దోఁచక "నాయాస్తి యంతయును మఱఁదులకు వ్రాసి యిచ్చివైచెద"నని చెప్పితిని. ఆశ లన్నియు నడిఁగి

పోయిన నా కాస్తి యెందులకు నీలకాంతుఁ డంగీకరింపలేదు. అయినను నేనాతనికిఁ దెలియకుండ సర్వస్వమును మఱఁదులకు వ్రాసి యిచ్చితిని. నీలకాంతున కైదువందల నీయఁబోయితిని. కాని యాతఁడు తీసికొనక కోపగించి వెడలిపోయెను. నేను పూజా మందిరముననే యుండి పూజ చేసికొనుచు నుంటిని. నామఱఁదులు మరల నన్నుఁ తీర్థయాత్రలకుఁ బొమ్మనిరి. ఆఁడువాండ్ర కత్తవారింటికంటెను నధికము లగుపుణ్య తీర్థము లెక్కడ నుండు నని నేను చెప్పితిని.

కాని నేనాయింటిలో నుండుట కూడ వారి కిష్టము లేకపోయెను. నీదేవునిఁ దీసికొని నీవు పోవలయు నని నన్ను నామఱఁదులు నిర్బంధించిరి. నాజీవితమునకే మైన నిచ్చుటకుఁగూడ వారంగీకరింపలేదు. ఇఁక గత్యంతరము లేక నాదేవునిఁ దీసికొని నాపెండ్లియైన ముప్పదినాలుగేండ్ల కొక్కసారిగా నత్తవారిల్లు విడిచి నీలకాంతుని కడకుఁ బోఁదలఁచితిని గాని యాతఁ డప్పుడే నాకంటె ముందుగా సంసారమును విడిచి బృందావనమునకుఁ బోయియుండెను. అప్పుడు కొందరు తీర్థయాత్రికులతోఁ గలసి కాశికి బయలుదేఱిపోయితిని. కాని యీ పాపహృదయమున కెక్కడను శాంతి లేకయుండెను. నేను ప్రతిదినమును నాదేవునుద్దేశించి "దేవా! నేను నిన్ను నా స్వామితోడను సంతానముతోడను సమానముగ భావించి నమ్ముకొని యున్నాను." అని ప్రార్థించుచుంటిని. కాని యాతఁడు నాప్రార్థనము నాలకించుటలేదు. నాసమస్తాంగకములను దుఃఖజ్వాల లావరించుకొన్నను నాగుండెలు పగిలిపోవుటలేదు. అహా! మనుష్యప్రాణ మెంతకఠిన మైనది?

నే నెనిమిదవయేట నత్తవారింటికిఁ బోవుటయే కాని మరల నెన్నఁడును బుట్టింటికి రాలేదు. మీయమ్మపెండ్లికి రావలె నని యెంతో ప్రయత్నించితిని గాని, లాభము లేకపోయెను. తరువాతఁ దండ్రిగారిజాబులవలన మీపుట్టుకయును, మీయమ్మ మరణమును వినియుంటిని. తల్లియొద్దని విడిచినతరువాత మిమ్ములను నాయొడిని జేర్చుకొనుటకు దేవుఁ డింతవఱకును నవకాశము కల్పింపలేదు! ఎన్నితీర్థయాత్రలు చేసినను మామరత్వ మింకను వదలుటలేదు. ప్రియవస్తువును బడయవలయు ననుహృదయతృష్ణ యింకను జావలేదు! అప్పుడు మీసంగతి తెలిసికొనవలయు నని ప్రయత్నించితిని. మీతండ్రి మతభ్రష్టుఁ డయ్యె నని వింటిని ఏమి చేయుదును? మీయమ్మయును నేను నొక్క తల్లిబిడ్డలము.

కాశిలో నొక పెద్దమనుష్యునివలన మీసంగతి తెలిసికొని యిచ్చటికి వచ్చితిని. పరేశబాబు దేవతాపూజను గౌరవింపఁ డని యెఱుఁగుదును. కాని దేవుఁ డాతని యెడలఁ బ్రసన్నుఁడై యున్నట్లాతనిమొగము చూచినంతనే తోఁచుచున్నది! పూజ నందినచో దేవుడు మఱచిపోఁడని నే నెఱుంగుదును. పరేశబా బెట్టిపూజ చేసి

దేవుని బ్రిగన్నునిం జేసికొనెనో నేనును దెలిసికొనవలయును. ఏమైనను సరియే! తల్లీ! ఇఁక నే నొంటిగా నుండఁజాలను! దేవునిదయ యెట్లున్నదో యట్లగును. కాని నాబిడ్డలగు మిమ్ములను విడిచి యిఁక నేనొక్క నిమిషమైనను జీవింపఁజాలను!—"

## రెండవ భాగము.

## 38

పరేశుఁడు వరదాసుందరి యింట లేనప్పుడు హరిమోహినికిఁ దనయింట నాశ్రయమొసంగి యామెయాచారమున కెట్టివిఘ్నమును గలుగకుండునట్టి యేర్పాటులను గావించియుండెను. వరదాసుందరి వచ్చినతోడనే తనయింట నీయసంభావనీయప్రాదుర్భావమును గూర్చి మండిపడిపోయెను. ఆమె భర్తం గాంచి తీవ్రస్వరముతో "నేనిది సహింపఁజాలను" అనియెను. పరేశుఁడు శాంతముతో "మమ్మందఱను సహింపఁజాలిన నీవు దిక్కుమాలినయొకవిధవను సహింపఁజాలవా?" అనియెను.

"ఈయనకు వ్యవహారజ్ఞానము లేదు. సంసారమునందలికష్టసుఖములనుగూర్చి యాలోచనయే లేదు! ఆకస్మికముగఁ దోఁచినపని చేయుచుండును! ఎంత చెప్పినను ఎంత కోపగించినను, ఎంతయేడిచినను, పాషాణమూర్తివలె సుస్థిరుఁడై యుండును! ఇట్టివారితో నెవ్వరోపఁగలరు? ఏమి చేసిన నేమియు ననఁగూడదు! ఇట్టియవస్థలో నేయువతి కాఁపురము చేయఁగలదు!" అని వరదాసుందరి యనుకొనుచుండెను.

హరిమోహినికి సుచరితను జూచినప్పటినుండియుఁ దినమనోరమను జూచినట్లే యుండెను. ఆయిరువురిదియు నొక్కటేయీడు; రూపగుణస్వభావములు నొక్కటే విధముగా నుండెను హరిమోహిని యాకస్మికముగ సుచరితను వెనుకనుండి చూచి మనోరమయనుకొని యదరిపడుచుండును. ఆమె యొక్కొక్కప్పుడు సంధ్యాంధకారమున నొంటిగాఁ గూర్చుండి యేడ్చుచుండును. అప్పుడు సుచరిత వచ్చినంతనే యామెను గౌఁగిలించుకొని "ఆహా! నాకు మనోరమను గౌఁగిలించుకొన్నట్లే యున్నది! అది యిఁక రాఁదలఁచుకొనలేదు. బలవంతముగ నేనే దానికి సెలవిచ్చి పంపివైచితిని. ఈప్రపంచమునందెప్పటికి నేవిధముగను నాశిక్ష కవసానము లేదు. నాకుఁ గావలసిన శిక్షయైనది—ఈసారి యదియే వచ్చినది! ఆరూపుతోనే, యానగుమొగముతోనే మరల వచ్చినది! ఇదిగో! నాబంగారుతల్లి! నారత్నాలరాశి! నావరాలమూట!" అని సుచరితనెమ్మొగము నిమురుచు ముద్దు పెట్టుకొని కన్నీరు విడుచుచుండును. సుచరితయు నశ్రుపూరితనయనయై దొడ్డమ్మను గౌఁగిలించుకొని "అమ్మా! తల్లియాదరము నాకెంతయోకాలము లభింపలేదు. ఇప్పుడు మాయమ్మ మరల వచ్చినట్లున్నది! తీవ్రదుఃఖవేదనచే దేవునిఁగూడఁ బ్రార్థింపఁజాలనప్పు డతిదారుణపరితాపముచే నంతరంగము శుష్కమైపోయినప్పుడు—ఎన్నియో సమయములయం దెన్నియోసారులు నే

నమ్మాయని పిలిచితిని. ఆపిలుపుల నాలకించి మాయమ్మయే యిప్పు డిట్లు వచ్చినది!’’ అని చెప్పుచుండును!

హరిమో—అమ్మా! యిట్లనవలదు. నీమాటలు నాకానందమునే కాక భయమును గూడఁ గల్పించుచున్నవి!—ఓగోపీవల్లభా! మరలఁ నాకీదృష్టి కల్పింపకుము! నాకుఁ బ్రేమింపవలయు నని లేదు! మనసు రాయిచేసికొనఁదలఁచితిని! కాని సాధ్యపడుట లేదు! స్వామీ! దుర్బలహృదయ నగుచున్న దయఁజూడుము! నన్నిఁక బాధింపవలదు! అమ్మా! పొమ్మ పొమ్మ! నాయెదుట నిలువకుము! అమ్మా! నాకుఁ భ్రాంతినిఁ గల్పింపకుము!—గోపాలకృష్ణా! జీవితేశ్వరా! గోపాలా! నానీలమణీ! నన్ను మరల విపత్తునఁ బడద్రోయకుము!—

సుచ—అమ్మా! నీవు నన్ను బలవంతముగా విడిపించుకొనఁ జాలవు! నేను నిన్నెన్నఁటికిని విడువను. నేనెప్పుడును నీయొద్దనే యుండెదను.

అని చెప్పి యామె వక్షమునఁ దల నుంచి బాలికవలె నూరకుండెను. రెండుదినములలోనే యీతల్లిబిడ్డల యిరువురిసంబంధము కాలముచేఁ బరిగణింపరానంతటి ఘీరతమ మైపోయెను. అందుచే వరదాసుందరి విరక్తయై “ఏమి! సుచరిత యేనాఁడును మాయాదరము నెఱుఁగనట్లేయున్నది! ఈదొడ్డమ్మ యిన్నాళ్ళు నెక్కడ నున్నది? చిన్నతనము నుండియుఁ బెంచినది మేము! ఇప్పటికి దొడ్డమ్మ యిలువేల్పయినది! ఎంత పెంచినను పైమెప్పులే కాని దీనిగుణము మంచిది కాదని నేనిదివఱకే నానాథునకుఁ జెప్పి యుంటిని. మేము దీనికిఁ జేసిన దంతయును బూడిదలోఁ బోసినపన్నీ రైపోయినది!” అని యనుకొనుచుండెను.

తననాథుఁడు తనయిష్టమును జెల్లసీయఁడనియు, హరిమోహినింగూర్చి యేమి తప్పుగఁ జెప్పినను నాతనికిఁ గటువుగనే తోఁచు ననియును వరదాసుందరి యెఱుంగును. అందుచేతనే యామెకుఁ గోపము హెచ్చిపోవుచుండెను. పరేశుఁ డేమనుకొనినను సమాజములోని పెద్దమనుష్యులచే నాతనికిఁ జెప్పింపవలయునని యామె ప్రయత్నించుచుండెను; సమాజమువారి నందఱను బిలిపించి వారియెదుట హరిమోహిని సంగతులను దెలిపి యాక్షేపించుచుండెను; ఆమెహిందూత్వము, ఆమెపూజలు, ఆమె యాచారములు ఇవి యన్నియు నింటిలోబిడ్డలకుఁ గుసంస్కారబోధకములై బాధించునని యామె నిరంతరమును వాదించుచుండెను.

ఇంతే కాక యామె యెల్లవిషయములందును హరిమోహినికిఁ బ్రతికూల్యములను ఘటింపఁజేయుచుండెను; ఆమెకు నీళ్ళు తెచ్చు గొల్లవానికి సమయమునకు మఱియొకపని చెప్పుచుండెను; ఇది యేమని యడిగినచో రామదీనునిచేఁ దెప్పించుకొనఁ గూడదా యనుచుండెను; రామదీనుఁడు హీనకులుఁ డగుటచే హరిమోహిని

యాతనినీళ్ళు త్రాగదని వరదాసుందరి యెఱుఁగును "అంతయాచారము కలది మా యింట నేల యుండవలయును ? ఇక్కడ జాతిభేదము పెట్టుకొనుటకు వీలు లేదు." అని యీవిధముగాఁ జెప్పుచు నామె ప్రతిఘటించుచుండెను "బ్రహ్మసమాజ మిదివఱకే క్రమముగా శిథిలమై పోవుచున్నది! క్రమముగాఁ బనిచేయుట లేదు. నాసాధ్యమైనంతవఱకు నేనట్లు కాకుండఁ జూచుకొందును! ఇతరులు నన్ను నిందించినను సరియే! నాబంధువులు నాతో విరోధించినను సరియే! నేనన్నిటికిని దలయొగ్గి యుండెదను. ఈప్రపంచమున సత్కార్యములు చేయుమహాపురుషు లందఱును నిందావిరోధములను సహింపవలసియే యుండును!" అని వరదాసుందరి యందఱితోడను జెప్పుచుండెను.

హరిమోహిని నావిఘ్నము లేవియును జయింపఁ జాలకపోయెను. ఆమె కష్టసాధన సీమాంతముం గాంచవలయు నని పంతము పెట్టినా యున్నట్లుండెను. ఆమె తనయంతరమునందలి దుస్సహదుఃఖముతో సమానముగ బాహ్యమునఁ గూడఁ గఠోరాచారములచే దినదినమునుఁ గష్టములను సృష్టించుకొనుచుండెను. ఈవిధముగాఁ గష్టముల నలవాటు చేసికొనుటయే యామె సాధన!—జలము దొరకుట కష్టముగఁ దోఁచినంతనే యామె వంటయే మానివైచి దేవునకు నివేదించినపండ్లను, పాలను మాత్రమే యాహారముగఁ గైకొని కాలము గడపుకొనఁదొడంగెను. అది సుచరితకుఁ గష్టముగా నుండుటం గాంచి హరిమోహిని "అమ్మా! ఇదియే నాకు సుఖముగా నున్నది! నాకిందువలన లాభ మున్నది. ఈయాహారము నాకానందముగనే యున్నది" అనియెను. సుచరిత కష్టముతో "అమ్మా! నేనిఁక నేయితరుల జలాహారములను దీసికొనకొన్నచో నీసేవకుఁ బనికివత్తునా?" అనియెను.

హరి—అది యేమి తల్లీ! నీవు నచ్చినమతమునందే నీవుండుము! నాకొఱకు నీవు మాఱుత్రోవఁ దొక్కవలదు. నిన్ను దరికిఁజేర్చుకొని, కౌఁగిలించుకొని ప్రతిదినమును జూచుకొనుభాగ్యము నాకు లభించినది. ఇదియే నాకానందము. పరేశబాబు నీకు గురువు; తండ్రివంటివాఁడు; నీవాయనయుపదేశమునే గౌరవించి మెలంగినచో నీశ్వరుఁడు నీకు శుభ మొసంగును!

వరదాసుందరి కల్పించుకష్టముల నన్నిటిని గొంచెమైన నెఱుంగనట్లే హరిమోహిని సహించి యుండెను. పరేశుఁడు ప్రతిదినము వచ్చి "మీకేటిలోపమును లేదు గద ?" అని యడుగుచుండెను. ఏమియు లోపము లేదని యామె చెప్పుచుండెను. వరదాసుందరి యన్యాయములకు సుచరిత మండిపడిపోవుచుండెను. కాని యామె తృణీకర్షించు స్వభావముకలది కాదు. ఆవిషయమునుగూర్చి యామె యెన్నఁడును బరేశునితో నెట్టిమాటయుఁ జెప్పలేదు. ఇది వెల్లడించుట మర్యాదకాదని యామె

లోలోపలనే సహించియుండెను. ఈకారణముచే సుచరిత కెల్లప్పుడును దొడ్డమ్మయొద్దనే యుండవలసివచ్చెను. సుచరితకుఁ గష్టముగా నుండుటఁ గాంచి క్రమముగా మరల హరిమోహిని వంటచేసికొనఁ దలంచెను. అప్పుడు సుచరిత "అమ్మా! నన్ను నీవెట్లుండుమన్న నట్లే యుండెదను. నేనే స్వయముగా నీకు జలము తెచ్చునట్లను గ్రహింపుము!" అనియెను.

హరి—అమ్మా! నీవు తెచ్చెదవు. కాని నీనీళ్ళు నాదేవున కుపయోగించునా? నీవు మఱియొకలా గనుకొనకుము!

సుచ—అమ్మా! నీదేవునకు జాతిభేద మున్నదా? అతనికి పాప మున్నదా? ఆయనకును సమాజమున్నది కాఁబోలు నేమి?

తుదకు హరిమోహిని, సుచరిత నిష్ఠతోఁ దన కుపచారములుచేయుట కంగీకరించెను. సతీశుఁడుకూడ నామెయొద్దనే భుజించుచుండెద నని పట్టుపట్టెను. ఈవిధముగా నాముగ్గురును గలసి పరేశునింటియందు మఱియొకచిన్నసంసార మయ్యెను. లలిత యీరెండుసంసారములకును నడుమ సేతువువలె నుండెను. వరదాసుందరి తన తక్కినబిడ్డల నావంకకుఁ బోనిచ్చుట లేదు. కాని లలితనుమాత్ర మామె యడ్డగింపఁ జాలకపోయెను.

## ౪౦

వరదాసుందరి తమసమాజమువారిని దఱచుగాఁ బిలిపించి తమమేడమీఁదనే సభలు చేయుచుండెను. హరిమోహినియును సహజగ్రామ్యసరళభావముతో నందఱి నాదరించుటకుఁ బ్రయత్నించుచుండెనే గాని వారు తన్నవమానింతు రని సంశయించుటయైనలేదు. ఏదో యొకవిధముగా హిందూసమాజాచారములనుగూర్చి వరదాసుందరి వారియెదుట నాక్షేపించుచుండెను. చాలమంది స్త్రీలు వింతగా హరిమోహినిం గాంచుచు వరదాసుందరిమాటల నామోదించుచుండిరి. సుచరిత తల్లిచెంతనే కూర్చుండి యిది యంతయును సహించి చూచుచుండెను; నేనును నాతల్లిపక్షమే యని వారికిఁ దోఁచునట్లు ప్రయత్నించి ప్రవర్తించుచుండెను. ఒకరోజున విందు జరిగినప్పుడందఱును సుచరితను భోజనమునకు రమ్మని పిలిచిరి. సుచరిత రాననియెను. అప్పుడు వరదాసుందరి "కేవలమిప్పుడు సుచరిత హిందువైపోయినసంగతి మీకుఁ దెలియదా? ఈమె యిప్పుడు మనతేనీరు త్రాగదు." అనియెను. "సుచరిత హిందువైనదా? ఏకాలమునకేమి జరగునో యెవ్వరు చెప్పఁగలరు!" అని యొక రనిరి. అప్పుడు హరిమోహిని వ్యస్తహృదయముతో "రాధా! వెళ్లుమమ్మా!" అనియెను. సమాజమువారందఱును సుచరిత నిట్లు దెప్పుచుండుట హరిమోహినికిఁ గష్టముగానుండెను. కాని సుచరితమాత్ర మంగీకరింపవయ్యెను.

ఒకనాఁ డొకబ్రాహ్మయువతి వేడుకకొఱకు పాదరక్షలతో హరిమోహిని యింటఁ బ్రవేశింపఁ జూచుటయు సుచరిత యామె నడ్డగించి "లోపలికి రావలదు" అనియెను.

యువ—ఏమి ?

సుచ—లోపల నామె దేవుఁ డున్నాఁడు.

యువ—దేవుఁడున్నాఁడా ? ఆమె ప్రతిదినము దేవునిఁ బూజించునా ?

హరి—ఔను. పూజింపకేమి ?

యువ—ఆ దేవునియం దామెకు భక్తియున్నదా ?

హరి—భక్తి సామాన్యముగ లభించునా తల్లీ! భక్తి దొరకినచో బ్రతికియేపోవుదును! నేను దురదృష్టవంతురాలను!

అప్పుడు లలితకూడ వచ్చియుండెను. ఆమె మొగ మెఱ్ఱఁజేసికొని యాయువతి నుద్దేశించి "నీ వుపాసించుదేవునియందు నీకు భక్తియున్నదా?" అని ప్రశ్నించెను.

యువ—సరిసరి! భక్తిలేకున్నచో నెట్లు ?

లలిత తీవ్రముగఁ దల నూఁచుచు "నీకు భక్తి లేనే లేదు, సరిగదా; అది యెట్లు లభించునో కూడ నీకుఁ దెలియదు!" అనియెను. సుచరిత సమాజమునుండి వేఱుపడకుండుటకై హరిమోహిని యెంతయో ప్రయత్నించెను గాని లాభము లేకపోయెను.

ఇదివఱకు వరదాసుందరీహారానులకుఁ బరస్పరము మనోభావములు చెదరియుండెను. ఈవ్యాపారమువలన నిప్పుడు మరల వారికి సమభావము కలిగెను. బ్రహ్మసమాజాదర్శములకు భంగము కలుగకుండ వేయికన్నులతోఁ జూచుచుండువాఁ డొక్క హారానబాబే యని వరదాసుందరియు, బ్రాహ్మకుటుంబములు నిష్కలంకములుగా నుండుటకై కష్టపడి పనిచేయుగృహిణి యొక్క వరదాసుందరియే యని హారానుఁడును నందఱియొద్దఁ బొగడుకొనుచుండిరి. వారిపొగడ్తలలో ఛాయామాత్రముగఁ బరేశబాబును గూర్చి నిందకూడ నుండెను. హారానబాబొకనాఁడు పరేశునియొద్ద నున్న సుచరితం గాంచి "నీవిప్పుడు విష్ణుప్రసాదమును భుజించుట కారంభించితివఁట! నిజమేనా ?" అని ప్రశ్నించెను.

సుచరిత మొగ మెఱ్ఱఁచేసికొని యామాట వినిపించుకొనకుండఁగనే బల్లపై నున్న కలందానుపైఁ గలములను సవరించుచుండెను. పరేశుఁడు కరుణార్ద్రదృష్టితో నొకసారి సుచరితం దిలకించి "హారానబాబూ! మనము భుజించుచున్నదిమాత్ర మీశ్వరప్రసాదము కాదా ?" అనియెను.

హారా—కాని, సుచరిత మనయీశ్వరునిఁ ద్యజింపఁజూచుచున్నది!

పరే—అట్లయినచో నందుకొఱకు విచారించుటవలన లాభమేమున్నది ?

హారా — ఏటినిబడి కొట్టుకొనిపోవుచుండఁగా నెట్లో యొడ్డుఁజేర్పఁ బ్రయత్నించుట మంచిది కాదా?

పరే — కాని యందఱును గలసి తలపై రాళ్లను విసరుటమాత్రము తీరమునకుఁ జేర్చుప్రయత్నము కానేరదు. పానూబాబూ! నీవు నిశ్చింతుఁడవై యుండుము. నేను సుచరితను జిన్నప్పటినుండి యెఱుఁగుదును. ఈమె మునిఁగిపోవుచున్నచో నాకు మీయందఱికంటెను ముందుగనే తెలియును. నేనట్టిస్థితిలో నూరకుండఁగలనా?

హారా — సుచరిత యిచ్చటనే యున్నది. మీరడుగఁగూడదా? ఈమె మన యందఱితో తేనీరును ద్రాగుటలేదఁట! అది యసత్యమా?

అప్పుడు సుచరిత మౌనమును విడిచి "నేను తేనీరు త్రాగుటలేదని తండ్రిగారెఱుఁగుదురు. ఆయన సహించియుండుటచేతనే నేనట్లు చేయుచుంటిని. మీ కిష్టము లేకున్నచో మీరందఱును మీయిష్టము వచ్చినట్లు నన్ను నిందింపుఁడు. తండ్రిగారిని బాధించెద రేల? మీవిషయమున నెన్నియోవిధముల శాంతి వహించియున్నందుల కాయన కిదియా ప్రతిఫలము?" అనియెను. హారానబాబాశ్చర్యముతో "ఇప్పుడు సుచరిత తనపక్షమును సమర్థించుకొనుమాటలను నేర్చియున్నది!" అని భావించుకొనుచుండెను.

పరేశుఁడు శాంతిప్రియుఁడు; తనవిషయమునఁగాని యితరులవిషయమునఁగాని విశేషముగఁ దర్కించుస్వభావము కలవాఁడు కాఁడు. తానెవ్వరికిని లక్ష్యము కాకుండ నిగూఢముగ జీవయాత్ర చేయుచుండెను. పరేశునియీభావమును హారానుఁడు నిరుత్సాహమనియు, నౌదాసీన్యమనియు భావించియుండెను. హారానుఁడు తఱచుగాఁ బరేశుని యీస్థితింగూర్చి యధిక్షేపించుచుండెను. పరేశుఁ డట్టిసమయములందు "ఈశ్వరుఁడు సచలాచలములను నిరుదెఱఁగుల వస్తుజాలమును సృజించియుండెను. నేనందుఁ గేవల మచలవస్తువును. నావంటివానివలనఁ గాఁదగినపనుల నే దేవుఁడు చేయించుచుండును. తీరనికోరికలఁ గోరుటవలన లాభ మేమున్నది? నావయసు చెల్లిపోయినది. నా కేశక్తి యున్నదో యేది లేదో యాసంగతి తేలియేపోయినది. ఇప్పుడు నాకుఁ దొందరకలిగించుటవలన లాభములేదు." అని చెప్పుచుండెను.

ఉదాసీనహృదయములకుఁగూడ నుత్సాహమును బుట్టింపవచ్చునని హారానుని యుద్దేశము! జడచిత్తములను గర్తవ్యపథమునకు మరలించుటయందును స్ఖలితజీవితమును బశ్చాత్తాపముచేఁ దేర్చుటయందును దనకు సహజసామర్థ్యమున్నదని యాతనినమ్మకము. ఏకాగ్రమును బలిష్ఠమునగు తనశుభాకాంక్ష నెవ్వరును జాలకాలము ప్రతిఘటింపఁజాలరని యాతనివిశ్వాసము. తనసమాజమునందలి వ్యక్తిగతదోషములను సవరించుభారమంతయుఁ దనమీఁదనే యున్నట్లాతఁడు స్థిరనిశ్చయుఁడై యుండెను. తన

యలక్ష్యప్రభావమే లోలోపలనుండి పని చేయించుచున్నదని యాతనినిశ్చయము. సుచరితజీవితచరిత్ర మంతటిప్రశంసాపాత్ర మగుటకుఁ దానే కారణమని యాతఁడు పొంగిపోవుచుండెను. ఆమెజీవితమూలముననే తనయద్భుతప్రభావము ప్రకటిత మగునని యాతఁడాశపడుచుండెను. ఇప్పుడు సుచరిత యిట్లు మాఱిపోవుట తన సామర్థ్యలోపమని యాతఁడనుకొనలేదు. ఆతప్పంతయు నాతఁడు పరేశునిపైఁ బెట్టెను. పరేశుబాబు నందఱును ప్రశంసించునప్పుడు హారానుఁడు వారితోఁ గలయుటలేదు. తానట్లు పొగడకుండుటచేతనే తనప్రాశస్త్యము వెల్లడి యగునని యాతని యూహ. హారానబాబు అన్నియు సహింపఁగలఁడు గాని తనసమాజహితమునకై తాను బోధించుపద్ధతులను విడిచి స్వబుద్ధిచే స్వతంత్రమార్గముల నవలంబించువారియపరాధములనుమాత్రము సహింపఁజాలఁడు. తనయుపదేశమును తిరస్కరించువఱకును వారి కాతఁడు బోధించుచునే యుండును; మాటిమాటికిని వారి నాకర్షించుచునేయుండును. ఇంజను పనిచేయుచుండఁగా మిషను నాఁగఁజాలనట్లే యుత్సాహము పనిచేయుచుండఁగా నాతఁడాత్మసంవరణము చేసికొనఁజాలఁడు. విముఖకర్ణములకు వేయిమాటలు వినుపించుటకైనను నాతఁడు వెనుదీయఁడు.

ఇది సుచరితకుఁ జాలకష్టముగా నుండెను. తనకొఱకుఁగాదు. పరేశబాబుకొఱకు. పరేశునిగూర్చి సమాజమువారందఱును చెప్పుకొనుచుండిరి. ఈ యశాంతికి నివారణోపాయ మేమున్నది! హరిమోహిని నమ్రస్వభావముతో నెంతజాగ్రత్తగ మసలుకొనుచున్నను నింటిలో నందఱకు నసహ్యముగనే యుండెను. ఆమెయవమానమును, సంకోచమును గలసి సుచరితను బ్రతిదినమును దహించివైచుచుండెను. ఈ యాపత్తునుండి విడివడు నుపాయము సుచరిత కేవిధమునను నగపడుటలేదు. ఇట్లుండఁగా వరదాసుందరి సుచరితకుఁ ద్వరగాఁ బెండ్లిచేయవలయు నని పరేశునిఁ బీడించుచు “ఇఁక సుచరితభారము మనపై నుండవలసినపనిలేదు. అది యిప్పుడు తనమనసు వచ్చినట్లు పోవుచున్నది. దాని పెండ్లి యాఁగిపోయినచో నేను నాబిడ్డలతో మఱియొకచోటికిఁ బోయియుండెదను. దానివడవడి బిడ్డలకందఱకు ననిష్టకారణ మగుచున్నది. మీరును దరువాత ననుతాపపడకమానరులెండు! లలిత మునుపిట్లున్నదా? అదియు నిప్పుడు తనయిచ్చవచ్చినట్లు మసలుచున్నది. దీనికంతకును గారణ మేమందురు? సిగ్గుసిగ్గు! ఆనాఁడదిచేసినపని! అందులో సుచరితచేయి లేదందురా? మీకు మీ బిడ్డలకంటెను సుచరితయనినఁ బ్రేమ! అందుచేతనే నేనేమియునుఁ జెప్పుట లేదు, కాని యెన్నాళ్ళు చెప్పక యూరకుండఁగలను.” అనియెను.

పరేశుఁడు సుచరితకై విచారింపలేదు గాని, కుటుంబమునందలి యశాంతికై చింతితుఁడయ్యెను. వరదాసుందరి చిన్నచిన్న కారణములను గల్పించుకొని చేయుచున్న

యాందోళనమంతయు నిరర్థకమైనను నది దుర్వారమైనదని పరేశుఁడు తెలిసికొనియెను. వివాహము సంభవమగునేని వర్తమానావస్థయందు సుచరితకు శాంతికరముగనే యుండునని భావించి పరేశుఁడు "పానూబాబు సుచరితను సమ్మతింపఁజేసినచోఁ బెండ్లి జరుగుట కట్టియభ్యంతరమును లేదు." అనియెను. వరదాసుందరి విసుఁగుతో "ఇంకను నెన్నిసారులు కావలయును మీరు మాటాడ కూరకుండుఁడు. ఇంతగందరగోళ మెందులకు! పానూబాబువంటివరుఁడు దొరకునా? మీకుఁ గోపమైనను నిజము చెప్పుచున్నాను. సుచరితయే యాతనికిఁ దగినది కాదు." అనియెను.

పరే—ఆతనియెడల సుచరిత కట్టిభావ మున్నదో నాకింకను స్పష్టముగాఁ దెలియలేదు. అందుచేతనే యామె యిపుడు నంగీకరించువఱకును నే నీవిషయమునఁ జేయిచేసికొనఁజాలను.

వర—ఇన్నాళ్లకుఁ దరువాత మరల నంగీకారమున నేమో నాకు బోధపడుట లేదు. దానికి బోధించుట నాచేఁతఁగాదు. లోపల నొకలాగు, పైకొకలాగు.

అని యామె హారానబాబునకుఁ గబురుపంపెను. నాఁటి వార్తాపత్రికలో వర్తమానబ్రహ్మసమాజదుర్గతింగూర్చి వ్రాయఁబడియుండెను. అందుఁ బరేశునికుటుంబమునుగూర్చి యన్యాపదేశముగా వ్రాసినసంగతు లందఱకును స్పష్టము లగుచుండెను. వ్రాసినలేఖకుఁ డెవ్వఁడో కూడ వ్రాఁతలనుబట్టి స్పష్టముగాఁ దెలియవచ్చుచుండెను. సుచరిత యాపత్రికను జూచి చించివైచుచుండెను. ఆమెకు దానిని బరమాణువులుగాఁ జేసి పారవేయవలయు ననునంతటికోపము కలిగెను. ఇంతలో హారానుఁడువచ్చి యామెప్రక్క నొకకుర్చీపైఁ గూర్చుండెను. ఆమె యొకసారియైన మొగమెత్తి యాతనివంకఁ జూడక కాగితమును జించివైచుచుండెను. అప్పుడు హారానుఁడు "సుచరితా! నీతో నిప్పుడొకముఖ్యవిషయమునుగూర్చి మాటాడవలసియున్నది." అనియెను. సుచరిత యట్లే కాగితమును జించుచు గోళ్ళకిఁక స్వాధీనముకాకుండుటచే గత్తితోఁ గోసివైచుచుండెను.

ఇంతలో వచ్చుటికి లలిత వచ్చుటయు హారానుఁడు "లలితా! నేనిప్పుడు సుచరితతో మాటాడవలసియున్నది." అనియెను. లలిత వెడలిపోవఁ జూచుచుండఁగా సుచరిత యామెచెఱఁగు పట్టుకొని యాపెను. అప్పుడు లలిత "అక్కా! పానూబాబు నీతో మాటాడునఁటగాదా?" అనియెను సుచరిత బదులుచెప్పక యామెచెఱఁగు వదలకయే యుండెను. అందుచే లలిత సుచరితకుర్చీమీఁదనే యొకప్రక్కను గూర్చుండెను. హారానుఁ డంతరాయములకు లొంగువాఁడు కాఁడు. ఆతఁ డిఁక నుపోద్ఘాతము లేకుండఁగనే మాటాడుట కారంభించి "సుచరితా! నీకు సమ్మతియైనచోఁ దన కభ్యం

తరము లేదని పరేశబాబు చెప్పినాఁడు. అందుచే నేనిట్లు సిద్ధపఱచుకొంటిని. రేపటి యాదివారము కాక పైవారము నాఁడు.”

ఆమాట ముగింపనీయకుండఁగనే సుచరిత “కాదు.” అనియెను. సుచరితనోటి వెంట సముద్ధతముగను, సంతృప్తముగను, స్పష్టముగను వెలువడిన “కాదు.” అను నీమాట విని హారాను డదరిపడియెను. సుచరిత “కాదు” అను నీవాఁడిబాణముతోఁ దన మాటల నన్నిటిని మార్గమధ్యమునందే ఖండించివైచునని హారానుఁడు భావించియైన నుండలేదు. అతఁడు తెల్లపోయి “కాదా ? కాదనుట కర్థమేమి ? ఇంకను గొంతకాల మాఁగవలయుననియా ?” అనియెను.

సుచ—కాదు.

హారా—ఐనచో నీయభిప్రాయమేమి ?

సుచ—(తలవంచుకొని) పెండ్లి నాకిష్టములేదు.

హారా—(హతాశుఁడై) ఇష్టములేదనిన నర్థమేమి ?

లలిత యప్పుడు దృఢస్వరముతో “పానుబాబూ ! మీకిప్పుడు దేశభాషా జ్ఞానము కూడ లేకుండఁబోయినదా ?” అనియెను.

హారానుఁడు లలితవంకఁ గఠోరముగఁ జూచుచు “నేను మాతృభాషను మఱచిపోయితి ననుటకైనను నంగీకరింతును గాని యింతకాలమునుండి నమ్మియున్న యీ మానవభావణములను బొరపాటుగ గ్రహించితి ననుట కెంతమాత్రము నంగీకరింపఁ జాలను” అనియెను.

లలి—మానవస్వభావము గ్రహించుటకుఁ గొంతకాలము పట్టును. ఈధర్మము మీ యెడలను వర్తించును !

హారా—నామనసునఁ గాని మాటలోఁ గాని యింతవఱ కెట్టివ్యత్యమును గలుగలేదు. నాపైఁ దప్పు పెట్టుటకు నే నివ్వరికి నవకాశమీయలేదని దృఢముగాఁ జెప్పఁగలను! ఇది నిజమో కాదో సుచరితనే చెప్పుమనుము !

లలిత మఱల నేమో చెప్పబోవుచుండఁగా సుచరిత వారించి “మీరు చెప్పిన మాట సత్యమే! మీతప్పేదియును లేదు!” అనియెను.

హారా—తప్పు లేకున్నచో నీవు నాయెడల నీయన్యాయ మేలచేసితివి ?

సుచ—(దృఢస్వరముతో) దీనిని మీ రన్యాయమే యన్నచో నే నీయన్యాయమునే చేయుదును! కాని—

ఇంతలో వెలుపలనుండి “సోదరీ !” అనుపిలుపు వినఁబడియెను. సుచరిత యానందముతో “వినయబాబూ! దయచేయుము!” అనియెను. అంతలో వినయుఁడు వచ్చి “సోదరీ! పొరపాటున నీవు వినయబాబు వచ్చె ననుకొంటివి! లేదు. నేను వినయుఁ

డను మాత్రమే!" అని చెప్పుచు హారానుని యప్రసన్నవదనముం గాంచి "హారాన బాబూ! చాల దినములనుండి యగపడుట లేదని మీరుఁ గోపముగ నున్నదా యేమి!" అనియెను. హారానుఁడు పరిహాసమున కన్నట్లుగా "కోపపడవలసియే యున్నది కాని మీరిప్పు డసమయమున వచ్చితిరి. నేను సుచరితతో మాటాడవలసి యున్నాను" అనియెను. వినయుఁడు సంశయముతో "నేను వచ్చుట కిప్పుడు మంచిసమయమో నాకిఁతవఱకు బోధపడలేదు. అందుచేతనే వచ్చుటకు సాహసింపఁ జాలకుంటిని." అని చెప్పి పోవుట కుద్యమించుచుండెను.

సుచరిత తత్తరముతో "వినయబాబూ! పోవలదు! మామాటలైపోయినవి. కూర్చుండుము!" అనియెను. తాను వచ్చుటచేతనే సుచరిత కష్టమునుండి విడివడియె నని గ్రహించి వినయుఁడు కుర్చీపై గూర్చుండి "ఆశ్రయ మిచ్చినచో నేను విడువఁ జాలను కూర్చుండు మని చెప్పినచోఁ గూర్చుండుటయే నాస్వభావము! సోదరీ! నాసంగతి తెలిసికొనియే నన్నుండుమనవలయును. లేదేని మనకిరువురకును గష్టములు కలుగును!" అనియెను. హారానుఁడు మౌనముతోని స్తబ్ధుఁడై కూర్చుండి "నేను చెప్పవలసిన మాటలు చెప్పువఱకు నిట్లే వేచియుండెదను." అని మౌనముచేతనే తెలియఁజేసెను. వెలుపలనుండి వినయునికంఠస్వరము వినవచ్చినతోడనే లలితహృదయరక్తము పొంగి పోయెను. ఆమె యతికష్టముతో భావగోపనము చేసికొనఁ బ్రయత్నించెను గాని సాధ్యము కాకపోయెను. వినయుఁడు లోనికి వచ్చినతరువాత లలిత యాతనితో నెప్పటివలె మాటాడఁజాలకపోయెను. ఆమె దిక్కులు చూచుచుఁ దోఁచనిపనులు చేయుచుండెను; ఒకసారి లేచిపోవలె ననికూడఁ బ్రయత్నించెను గాని, సుచరిత చెఱఁగు వదలినది కాదు!

వినయుఁడు సుచరితతోడనే మాటాడుచుండెను. అంతటివాక్పటుత్వము గల యాతఁడు కూడ లలితతో నొక్కమాటయైన నాడఁజాలకపోయెను. అందుచేతనే ద్విగుణవేగముతో నాతఁడు సుచరితతో మాటాడుచుండెను. కాని లలితావినయుల యీనూతనసంకోచము హారానునకు గోచరము కాకపోలేదు! తనతో నింతప్రగల్భయై భాషించిన లలిత యిప్పుడు వినయునియొద్ద సంకోచపడుచుండుటకు హారానుఁడు మండిపడుచు సమాజమునకు భిన్నులగువారితోఁ దనపుత్రికలకు నిరాఘాటపరిచయావకాశముఁ గల్పించి దురాచారములకుఁ బ్రోత్సాహము చూపుచున్న పరేశుని మనసులో నిందించుచు దీనికిఁ దగినఫల మాతఁ డెప్పటికైన ననుభవించు నని శపించుచుండెను.

చాలసేపు గడచెను. హారానుఁడు లేచిపోఁడని తేలిపోయెను. అప్పుడు సుచరిత "వినయబాబూ! దొడ్డమ్మ నిన్నుఁ జూచి చాలనాళ్లయినది. ఆమె తఱచుగా నీమాట యనుచుండును. ఒకసారి యామెను జూడవలదా?" అనియెను. వినయుఁడు

చటాలున లేచి "దొడ్డమ్మను నేను మఱచిపోయితి నని నన్ను నిందింపవలదు!" అనియెను. సుచరిత వినయుని హరిమోహినియొద్దకుఁ దీసికొనిపోయెను. అప్పుడు లలితయును లేచి "పానుబాబూ! మీరు నాతో మాటాడవలసినపని యేమియు లేదనుకొనియెదను!" అనియెను.

హారా — లేదు. నీవు మఱియొకచోటఁ బని యున్నదని తోఁచుచున్నది! నీవును బోయెదవు కాఁబోలును !

లలిత యామాటలోనిభావమును గ్రహించెను. ఆమె యుద్ధతభావముతోఁ దలయూఁచుచు నాభావమును స్పష్టముగఁ జేసి "ఔను. వినయబాబు చాలదినములకు వచ్చెను. అతనితో మాటాడవలదా? అంతవఱకును మీరొంటిగఁ గూర్చుండి యేమి చేయుదురు? మీరు వ్రాసినవ్యాసమునైనఁ జదువుకొనకుండ సోదరి సుచరిత యా కాగితమును దునకలుచేసి తుక్కులోఁ బాఱవైచినది. ఇతరులవ్యాసములు మీరు సహ్యములైనచో నీకాగితములను జదువుకొనుఁడు!" అని చెప్పుచు డ్రాయరులో దాఁచియుంచిన గోరావ్యాసములను దీసి యాతనిచేతి కిచ్చి చటాలున వెడలిపోయెను.

హరిమోహిని వినయునిం గాంచి పరమానందభరిత యయ్యెను. కేవలము వినయుఁడు ప్రియదర్శనుఁ డనిమాత్రమే కాదు — ఈయింటికి వచ్చువారందఱును హరిమోహినిని వెరసుగాఁ జూచుచుందురు. అందఱును గలకత్తావారే. అందఱును బాగుగఁ జదువుకొన్నవారే — కాని వారిభేదభావమును, తిరస్కారావమానములును నామెహృదయమునకు బాధాకరములై యుండెను. వినయుఁడు వారికంటెఁ దక్కువ చదివినవాఁడు కాఁడు. అతఁడును గలకత్తావాఁడే. అయినను వినయుఁ డామె నెంతమాత్రము నగౌరవించుటలేదు. ఆత్మీయురాలినిగా భావించి గౌరవించుచుండెను. అందుచేఁ గొలఁదిపరిచయముచేతనే వినయుఁడు హరిమోహిని కాత్మీయుఁడైపోయెను.

వినయుఁడు హరిమోహినియొద్ద నున్నప్పుడు లలిత యచ్చటికి సహజముగాఁ బోఁజాలకుండెడిది. కాని యిప్పుడు హారానుని యెత్తిపొడుపుమాటచే నామెసంకోచమంతయును బోవుటవలన లలిత యుత్సాహముతో మేడమీఁదికి హరిమోహినియొద్దకుఁ బోయి యెడతెగకుండ వినయునితోడనే సంభాషించుట కారంభించెను. నిమిషములో నదియొకసభ యైపోయెను. నడుమనడుమ వారినవ్వులు క్రిందిగదిలో నొంటిగఁ గూర్చుండియున్న హారానునకుఁ గర్ణశూలములై వినవచ్చుచుండెను. అతఁ డిఁక నొంటిగాఁ గూర్చుండఁజాలక వరదాసుందరితో మాటాడి తనహృదయతాపమును శమింపఁ జేసికొనఁదలంచెను. సుచరిత హారానునిఁ బెండ్లియాడుట కంగీకరింపవే దనుసంగతి వరదాసుందరి విని యిఁక ధైర్యమును నిలుపుకొనఁజాలక "పానూబాబూ! నీవిప్పుడు

చల్లగా నూరకున్నచో లాభములేదు, ఆమె సంపూర్ణముగా సమాజమువారందఱియె దుటను నంగీకరించినది. అందఱు నీపెండ్లికై యెదురుచూచుచున్నారు. ఇటిస్థితిలో నవి కలదని చెప్పినంతమాత్రమున నంతయు వదలుకొనఁగూడదు. నీయవకాశమును నీవెంత మాత్రమును విడువవలదు. తరువాత నది యేమిచేయునో చూతము!" అనియెను.

ఈవిషయమున హారానున కుత్సాహము కల్పింపవక్కఱయే లేదు. అతఁడు దృఢచిత్తుఁడై కూర్చుండి తనలో "అకారణముగా బాధ్యత నేలవదలుకొనవలయును! సుచరితను వదలుకొనుట నాకొకగొప్పపని కాదు. కాని సమాజమునఁ దలవంపులకు సహింపఁజాలను." అని యనుకొనియెను.

వినయుఁడు తనయాత్మీయతను బలపఱచుకొనుటకై హరిమోహినినేమైనఁ బెట్టుమని యడిగెను. హరిమోహిని తొందరతో నొకపళ్లెమునఁ గొన్ని నానఁబోసిన సెనగలు మీఁగడ వెన్న, పంచదార, అరఁటిపండ్లును జేర్చి యొకకంచుచెంబుతోఁ బాలనుగూడఁ దెచ్చి యాతనియెదుటఁ బెట్టెను. వినయుఁడు నవ్వుచు "ఆసమయమున నాఁకలి యని చెప్పి దొడ్డమ్మకుఁ దొందర కలిగింపఁదలఁచితిని; కాని నాకే పరాభవ మైనది!" అని యాడంబరములో వానిని భుజించుటకుఁ గూర్చుండెను. ఇంతలో నటకు వరదాసుందరి వచ్చుటయు వినయుఁ డామెకు నమస్కరించి "నేను క్రిందఁ జాలసేపుంటిని. మీ దర్శనము కాలేదు." అనియెను. వరదాసుందరి యామాట కెట్టియుత్తరమును జెప్పక సుచరిత నుపలక్షించి "ఇదిగో! ఇక్కడనే యున్నది! నేననుకొన్నట్లే యైనది! సభ చేసినారు! సరసాహ్లాదములలో నున్నారు! ప్రొద్దుటినుండి పానూబాబు వీరితోఁట మాలీవలె వీరికొఱకుఁ గాచుకొని యున్నాఁడు! చిన్ననాఁటినుండి వీరినిఁ బెంచితిని. ఎన్నఁడు నిట్లు లేదు! యిప్పుడు వీరి కీబుద్ధు లెట్లు పుట్టుచున్నవో తెలియుట లేదు! మాయింట నెన్నఁడు లేనిపద్ధతి యిప్పుడారంభమైనది. సాటివారియెదుటఁ దల యెత్తుకొనుటకు సిగ్గుగా నున్నది. ఇన్నాళ్ళనుండి నేర్పినవిద్యాబుద్ధులు తుద కీరీతిగాఁ బరిణమించినవి! ఏమిది" అనియెను.

హరిమోహిని వ్యస్తహృదయముతో సుచరితం గాంచి "క్రింద నెవ్వరో వేచి యున్నారని నేనెఱుంగను. ఎంతతప్పు! అమ్మా హమ్మా! శీఘ్రముగఁ బొమ్మా! నేనప రాధము చేసివైచితిని!" అనియెను. ఇందు లేశమాత్రమైనను హరిమోహినితప్పు లేదని లలిత చెప్పఁజూచెను, కాని సుచరిత యామె నడ్డగించి మారుమాట చెప్పక క్రిందికి దిగిపోయెను.

వరదాసుందరికి వినయునియం దిష్టము కలిగియుండెనని యిదివఱకే చెప్పియుంటిమి. వినయుఁడు తమకుటుంబగౌరవమునంబట్టి క్రమముగా బ్రాహ్మసమాజికుఁ డగునని కూడ నామె నిశ్చయించి యుండెను. అతనిని దానే యింతవానిగాఁ జేసితి నని

యామె గర్వపడుచుండెను; ఒకరిద్దఱితోఁగూడ నట్లు చెప్పియుండెను. అట్టివినయుఁ డిప్పుడు శత్రుశిబిరమునం దుండుటం గాంచియామె హృదయము జ్వాలామయ మైపోయెను. మఱీఁ దనతనయ లలితయే యాతనిపక్షమునకు సహకారిణి యగుటంగాంచి యాజ్వాలలు ద్విగుణీకృతము లైపోయెను. అప్పుడామె రూక్షస్వరముతో "లలితా! ఇక్కడ నీకేమైనఁ బని యున్నదా?" అనియెను.

లలి—ఉన్నది. వినయబాబు వచ్చియున్నాఁడు—అందుచేత

వర—వినయబాబు వచ్చుటకు వచ్చినచో నచ్చుటనే యాతిథ్యమును గైకొనును! నీవు క్రిందికి రమ్ము! పని యున్నది!

తన్నుఁగూర్చియు, వినయుంగూర్చియు, హారానుఁడు తల్లితో నేమియో చెప్పియుండు నని లలిత నిశ్చయించుకొనియెను. అట్లు చెప్పుట కాతఁ డెవ్వఁడని యామె కోపముతో "అమ్మా! వినయబాబు చాలనాళ్ళకు వచ్చినాఁడు; అతనితోఁ గొంచెము సేపు మాటాడివచ్చెదను" అనియెను. వరదాసుందరి లలితకంఠస్వరమును గ్రహించి మఱి బలవంతము చేయలేదు. లలిత యవిధేయత జూపినచో హరిమోహిని యెదుటఁ దనకుఁ బరాభవ మగునేమో యని వరదాసుందరి సంశయించి వినయునితో నింక మాటాడకుండఁగనే వెడలిపోయెను. లలిత వినయునితో మాటాడివచ్చెదనని తల్లితోఁ జెప్పినదికాని, వరదాసుందరి వెడలిపోయినతరువాత నచ్చట నెవరికి నుత్సాహము లేకపోయెను. మువ్వురు నొక్కటేరీతిని గుంఠితులై యుండిరి. కొలఁదిసేపటిలోనే లలిత తనగదిలోనికిఁ బోయి తలుపు మూసికొనియెను.

హరిమోహిని యీయింటియం దెట్టియవస్థలోనున్నదో వినయునకు బాగుగఁ దెలిసిపోయెను. ప్రసంగవశమున నామె చరిత్రముకూడ నాతఁడు గ్రహించెను. అన్నిమాటలు నైనతరువాత హరిమోహిని "బాబు! నావంటి యనాథల కీలోకమునఁ జోటు లేదు. ఏతీర్థమునకైనఁ బోయి యీశ్వరసేవానిమగ్నయై యుండుట నాకుచిత మైనపని. నాయొద్ద నిప్పటికి మిగిలియున్న స్వల్పధనముతో నాకింకను గొన్నిదినములు గడచును. ఇంకను జీవించియున్నచో నెవ్వరియింటనైనఁ వంటచేసిపెట్టి కాలము గడపవచ్చును. కాశిలో నెందఱిట్లు జీవించుటలేదు! కాని పాపాత్మురాల నగు నేనట్లు చేయఁ జాలకున్నాను. ఒంటిగఁ గూర్చున్నచో నాసమస్తదుఃఖములు స్మృతికివచ్చుచుండును. నాగోపాలమూర్తి నాకడ నెవ్వరి నుండనిచ్చుటలేదు. ఒక్కొక్కప్పుడు మతి పోవునేమో యని భయముకూడ నగుచున్నది. ఈరాధారాణీసతీశులు నాచావున కభ్యంతరముగా నున్నారు. వీరియెడఁబాటు తలఁచుకొన్నంతనే నాప్రాణము లెగిరి పోవుచుండును! అందుచేతనే వీరినెక్కడ విడువవలసివచ్చునో యని రేయింబవలు భయపడుచుండును. కాకున్నచో సర్వమును బోఁగొట్టుకొన్న నేను కొలఁదిదినముల

లోనే వీరి నింతగా నేల ప్రేమింపవలయును! బాబూ! నీకొక్కటేమాట చెప్పుచున్నాను. ఈబిడ్డలను జూడఁగలిగినప్పటినుండియే మనఃపూర్వకముగ నాదేవపూజ సాగుచున్నది. వీరి నింక విడుచుటయే తటసించినచో నాడెందము నల్లరాయియైపోవును!" అని చెప్పుచు నామె వస్త్రాంచలముచేఁ గన్నుల నీరొత్తుకొనియెను.

## ౪౧

సుచరిత క్రిందిగదిలోనున్న హారానునొద్దకుఁ బోయి "మీరు మాట్లాడఁగలసిన దేమిటో చెప్పుఁడు" అనియెను. హారానుఁడు కూర్చుండుమనియెను. సుచరిత కూర్చుండలేదు. అట్లే నిలువఁబడి యుండెను. అప్పుడు హారానుఁడు "సుచరితా! నీవు నాయెడల నన్యాయము చేసితివి" అనియెను. "మీరును నాయెడల నన్యాయము చేసితిరి." అని సుచరిత బదులు చెప్పెను. హారానుఁడు "ఏమి! నేను నీతో నేమని చెప్పి యెట్లుచేసితిని!" అనియెను. సుచరిత వెంటనే మాటతో మాట గలిపి "న్యాయాన్యాయములు మాటలలో నేనా? మాటలపై నాధారపడి మీరు నాయెడల నక్రమముగఁ బ్రవర్తింప దలంచితిరా? ఒక్కసత్యము వేయుసత్యములకంటెను గొప్పదికాదా? నేను పొరపాటుపడి యుండవచ్చును. మీరు పొరపాటునే నిలువఁబెట్టఁదలంచుట న్యాయమా! నేను పొరపాటు పడితినని యిప్పటికిఁ దెలిసికొన్నాను. కావుననే వెనుకటిమాట లేనియు నంగీకరించుట లేదు. తెలిసినవెనుకఁ గూడ నంగీకరించుట యన్యాయము గాదా!" అనియెను.

హారానుఁ డెంత యోచించినను సుచరిత యిట్లు మాఱుటకుఁ గారణ మూహింపఁజాలఁ డయ్యెను. ఆమె సమాజసంబంధమును నమ్రత్వమును నిప్పు డెట్లు పరిణమించిపోయినవో తెలిసికొనుశక్తి కూడ నాతనికి లేకపోయెను. అతఁ డప్పుడు సుచరితనూతనపరిచితులను గూర్చి మనసులోనే నిందించుచు "సుచరితా! నీవు పొరపాటు పడితివా" అనియెను.

సుచ—ఆప్రశ్నలన్నియు నేల? మునుపు నాకిష్టమున్నది. ఇప్పుడు లేదు. ఇది చాలదా?

హారా—మనము సమాజమువారియెదుటఁ బ్రత్యుత్తరము చెప్పవలయును గాదా! అప్పుడు నీవు మాత్ర మేమి చెప్పగలవు! నేనైన నేమి చెప్పఁగలను?

సుచ—నే నేమియుఁ జెప్పను. మీరుఁ జెప్పవలసియున్నచో సుచరిత యల్పవయస్క యనియు, బుద్ధిమాలిన దనియు మతిలేని దనియు మీయిష్టము వచ్చినట్లు చెప్పుఁడు! కాని యీవిషయమున నిదియే నాతుదిమాట!

హారా—ఇదియే తుదిమాట కానేరదు. పరేశబాబు—

అనుచుండఁగనే పరేశుఁడు వచ్చి "పానూబాబు! నామాట వచ్చినదేమి?" అని ప్రశ్నించెను. అప్పుడు సుచరిత గదిలోనుండి వెడలిపోవుచుండఁగా హారానుఁడు "సుచరితా! నీవు పోవలదు! పరేశబాబునొద్ద నంతయుఁ దేలిపోవలయును" అనియెను. సుచరిత వెనుకకుఁ దిరిగెను. హారానుఁడు పరేశుం గాంచి "ఇన్నాళ్లైనతరువాత నిప్పుడు సుచరిత పెండ్లి కంగీకరించుట లేదు. ఇంతటిఘనవిషయమునం దిన్నాళ్ళకటను నీమె యీవిధముగా నటించుట యుచితముగా నున్నదా! ఇది మీకుఁగూడ నగౌరవము కాదా!" అనియెను.

పరేశుఁడు సుచరితయొడలఁ దడవుచు "అమ్మా! నీవిచ్చటనుండనక్కఱలేదు పొమ్మ!" అనియెను. ఆచిన్నమాట కొక్కనిమిషములో సుచరితకన్నుల నీరు నిండిపోయెను. తోడనే యామె యటనుండి వెడలిపోయెను.

పరే—సుచరిత తనమనసు తాను బాగుగఁ దెలిసికొనకుండఁగనే యీపెండ్లికి సమ్మతించినదను సంశయము నాకుఁ జాలకాలమునుండి యున్నది. అందుచేతనే నే నింతవఱకును సమాజము నెదుట సంబంధనిశ్చయము చేసికొనవలయు ననునీకోరికను నెఱవేర్పఁజాలకపోయితిని.

హారా—సుచరిత యప్పుడు తెలిసియే యంగీకరించినదనియు నిప్పుడు తెలియకయే నిషేధించుచున్నదనియు మీకు సంశయము కలుగుట లేదా?

పరే—ఎట్లయినను గావచ్చును కాని యిట్టిసంశయావస్థలో వివాహము కాఁజాలదు.

హారా—మీరు సుచరితకు సద్బోధ చేయఁగూడదా!

పరే—నేను నాసాధ్యమైనంతవఱ కెన్నఁడు నామెకు దుర్బోధచేయుట లేదని నిశ్చయముగా నెఱుంగుము.

హారా—మీరిట్లే చేసినచో సుచరిత యీవిధముగా మారుట యెన్నఁటికిని సంభవింపదు. మీకుటుంబమునందు నేఁడు జరిగిన యీవ్యాపార మంతయును మీ యవివేచనాఫలమే యని నేను మీ మొగము నెదుటనే చెప్పుచున్నాను.

పరే—(చిఱునగవుతో) నీవన్నమాట నిజమే—నాకుటుంబమునందలి మంచి చెడ్డలన్నియు నావిగాక మఱి యెవ్వరివి?

హారా—మీ రీవిషయమున నెప్పటికైనఁ బశ్చాత్తాపపడకమానరు.

పరే—పానుబాబూ! పశ్చాత్తాపము భగవత్కృపవలనఁ గలుగును! నేను పాపమునకు వెఱచినట్లు పశ్చాత్తాపమునకు వెఱవను.

ఇంతలో సుచరిత గదిలోనికి వచ్చి పరేశునిచేయి పట్టుకొని "బాబా! మీ యుపాసనకు వేళయైనది!" అనియెను. పరేశుఁడు పానూబాబును జూచి "ఇప్పుడే

వచ్చెదనుండుము!" అనియెను. "ఉండను." అని చెప్పి హారానుఁ డతిత్వరితముగ వెడలిపోయెను.

## ౪౨

ఒక్కసారిగా బహిరంతరములఁ దుములసంగ్రామము సంఘటిల్లి సుచరితను భీతురాలినిగాఁ జేసివైచెను. గోరా యెడల నామెకుఁగల మనోభావ మిన్నాళ్ళవఱకు ను దెలియకుండఁగనే బలపడి గోరా జైలునకుఁ బోయినప్పటినుండి సంపూర్ణముగ విస్పష్టమై దుర్నివారముగఁ గానవచ్చుచుండెను. దానికై యేమి చేయవలయునో యది తుద కేవిధముగఁ బరిణమించునో యామె యించుకంతయు నూహించుకొనుట లేదు. ఆమె యాసంగతి యెవ్వరికినిఁ జెప్పక తనలోఁ దానే కుంఠిత యైపోవుచుండెను. ఈనిగూఢపరితాపముచే రహస్యముగ నొక్కచోఁ గూర్చుండి తనలోఁ దానే యాలోచించుకొని కార్యనిశ్చయము చేసికొనుటకైనను నామె కవకాశము దొరకుట లేదు. హారానుబాబు సమాజమునం దంతటను నల్లరిచేయుట నారంభించుచుండెను. ఈ సంగతులు వార్తాపత్రికలకెక్కను వచ్చునట్టిలక్షణములు గానవచ్చుచుండెను. ఇన్నిటి కంటెను నామె పెద్దతల్లివిషయము మఱింత బాధాకరముగా నుండెను. శీఘ్రముగ నామె కేదియో యేర్పాటు చేయకున్నచో మాటుదక్కదు. సుచరిత యప్పుడు తన జీవితమునం దిదియొకసంధిక్షణ మనియుఁ, జిరపరిచిత మగుమార్గమునఁ జిరాభ్యస్త మగుభావముతోఁ బ్రయాణముచేయుదిన మింక లేదనియు స్పష్టముగాఁ దెలిసికొనియెను.

ఆట్టికష్టసమయమునం దామెకుఁ బరేశుఁ డొక్కఁడే శరణ్యుఁడై యుండెను. ఆమె యిప్పు డాతనియాదరమును గోరుట లేదు. ఆతనియుపదేశమును వాంఛించుట లేదు. ఆతని మొగము నెదుటఁ జెప్పఁగూడనిమాట లెన్నియో యున్నవి. లజ్జాకరం బగుహీనతావశంబున నాతని చెంత వెల్లడించుటకు నయోగ్యములు కాని మాటలెన్నియో యున్నవి. కాని కేవలమును బరేశబాబుజీవితమును, నాతని స్నేహమునుమాత్రమే సుచరితకు జనకోత్సంగమునందలి వాత్సల్యమును, జననీవక్షమునందలి ప్రేమమును బ్రసాదించుచుండెను.

ఇది శీతకాలమగుటచేఁ బరేశుఁడు సాయంకాలముల నుద్యానమునకుఁ బోవుట లేదు. ఇంటికిఁ బడమట నున్న యొకచిన్నగది గుమ్మమునొద్ద నొకయాసనముపైఁ గూర్చుండి యాతఁ డుపాసన చేయుచుండెను. శుక్లకుంతలాలంకృత మగునాతని శాంతవదనముపై నస్తంగతసూర్యకాంతి ప్రసరించుచుండెను. ఆసమయమున సుచరిత నిశ్శబ్దముగ వచ్చి మౌనముతో నాతనిచెంతఁ గూర్చుండి తనయశాంతక్లిష్టహృదయము నాతని యుపాసనాగభీరతాంతరమున నిమజ్జితముఁ గావించి యుండెను.

నేఁటి యుపాసనాంతమునందుఁ బరేశబాబు తనచెంతఁ గూర్చుండియున్న ప్రియతనయయుఁ బ్రియశిష్యురాలు నగుసుచరితం గాంచి యనిర్వచనీయంబు లగుతన యాధ్యాత్మికమధురాలోకనంబులచే నాబాలికను బరివేష్టించి సమస్తాంతఃకరణంబులచేతను నిశ్శబ్దముగ నామె నాశీర్వదింపఁగలఁడు !

ప్రధానవస్తువుతో నైక్యము చేయుటయే తనజీవితమున కేకమాత్రలక్ష్యముగాఁ జేసికొని పరేశుఁ డెప్పుడును దనచిత్తమును శ్రేయోమయంబును సత్యతమంబును నగువస్తువునకే యభిముఖముగఁ జేసికొని యుండెను. అందుచే సంసార మాతని కంత భారము కాకుండెను. ఈవిధముగా నాతఁడు తనలోనుండియే తానొకవిధమగు స్వాతంత్ర్యలాభముం గాంచియుండెను. అందుచేతనే యాతఁడు మతాచారములనుగూర్చి యితరులతో నెట్టివివాదములను బెట్టుకొనుట లేదు. సౌభాగ్యముంగూర్చి నిబ్బరమును, సంసారమునుగూర్చి ధైర్యమును నాతనికి సహజమై పోయెను. ఈవిధముగా నాతఁ డెంతయున్నతుఁడైనను సమాజమువారియెదుట నిందితుఁడే యగుచుండెను. కాని యాతఁ డానింద తన్ను బాధించు ననిగాని, ఖేదించు ననిగాని యెంతమాత్రమును లక్ష్యముచేయుట లేదు. ఆతఁడు నిరంతరమును దనలో "నాకిఁక నెవ్వరియొద్దను గోరఁదగిన దేదియును లేదు—సమస్తమును నేనాతనియొద్దనుండియే గైకొందును" అని మాటిమాటికిని స్మరించి మననము చేసికొనుచుండును.

పరేశుని గభీరనిస్తబ్ధజీవితశాంతిస్పర్శలాభమును గోరియే సుచరిత యెంతయో యాశతో వచ్చి యాతనిచెంతఁ గూర్చుండెను. పాప మిప్పు డాయమాయుకబాలిక విరుద్ధహృదయమును విరుద్ధసంసారమును దనొక్కసారిగా విశ్రాంతిలో ముంచి వైచుటచే నొక్కసారి తండ్రిగారిపాదములపైఁబడి కొంతసేపు పాదధూళిం బొందినచో దనకించుక ప్రశాంతి కలుగునని భావించుకొనియెను. మనశ్శక్తినంతను జాగరితముగఁ జేసి నిశ్చలధైర్యముతో సమస్తాఘాతములను నెదిరింపఁగలిగినచో సకలప్రాతికూల్యములును దమంతదామే పరాస్తంబు లగునని యామె భావించుకొనుచుండెను.

సుచరితపైఁ గోపించుటకుఁ గాని, యామెను శిక్షించుటకుఁ గాని, వీలుపడకుండుటచేతను, బరేశుని స్వాధీనునిఁగఁ జేసికొనుట కెట్టియాశయును లేకుండుటచేతను వరదాసుందరికోపము హరిమోహినియెడల నత్యంతదుర్దాంతమై పోయెను. హరిమోహిని తనయింట నుండుట వరదాసుందరి కెల్లవిధముల యాతనగా నుండెను. నేఁ డామెతండ్రి మృతదినమగుటచే నుపాసనకొఱ కామె వినయునిఁ బిలువనంపెను. సాయంకాల ముపాసన యగును. అంతకుముందే సుచరిత మొదలగువారి సాహాయ్యముచే నామె సభాగృహము నలంకరించి యుంచెను. ఇంతలో వినయుఁడు వచ్చి ప్రక్కనున్న సోపానములనుండి హరిమోహినియొద్దకు మేడమీఁదికి బోవుచుండెను. మనస్సునను

భారముగ నున్నప్పుడు స్వల్పవిషయములుకూడ గొప్పవిగనే తోఁచుచుండును. వరదాసుందరి వినయుని రాకం గాంచినంతనే యసహ్యమగు క్రోధముతో గృహాలంకారమును విడచి తత్క్షణమే హరిమోహినియొద్దకుఁబోయెను. వినయుఁ డప్పుడు చాపపైఁ గూర్చుండి యాత్మీయునివలె హరిమోహినితో మాటలాడుచుండెను. అప్పుడు వరదాసుందరి హరిమోహినిం గాంచి "నీయిష్టమున్నంతకాలము నీవు మాయింట గౌరవముగా నుండవచ్చును. కాని, నీ దేవునిమాత్ర మిచ్చట నుంచినచో బాగుగ జరుగదు" అనియెను.

హరిమోహిని చిరకాలము పల్లెటూరియందే యున్నదగుటచే నామె బ్రాహ్మసామాజికులను గొంచె మించుమించుగాఁ గ్రిష్టియనులవంటివారినిగా భావించుచుండెను. వారితోఁ గలసియుండుట యామెకు విచారముగనేయుండెను. వారుకూడ నట్టి సంబంధమునకు సంకోచించుచున్నట్లామెయును గ్రమముగా గ్రహించెను. ఏమి చేయుటకును దోఁచక యాలోచించుకొనుచుండఁగా నిప్పుడు వరదాసుందరి వచ్చి స్పష్టముగాఁ జెప్పివైచినది. ఇఁక నాలోచించుట కవకాశము లేదనియు నేదియో యొకపద్ధతి స్థిరపఱచుకొనవలయుననియు నామె నిశ్చయించుకొనియెను. కలకత్తాయం దెచ్చటనైన నున్నచో నప్పుడప్పుడు సుచరితాసతీశులను జూచుచుండవచ్చునని యామె మొదట ననుకొనియెను గాని పట్టణములో నుండఁగలుగునంతటిశక్తి యామెకు లేదు.

వరదాసుందరి తుపానువలె వచ్చి పోయినతరువాత వినయుఁడు కొంతసేపటివఱకును తల వంచుకొని కూర్చుండెను. అప్పుడు హరిమోహిని "నేను తీర్థయాత్రకుఁ బోయెదను. మీరెవ్వరైన నన్నుఁ దీసికొనిపోఁగలరా?" అనియెను.

విన—అలాగే. కాని నాలుగైదుదినము లోపిక పట్టవలయును. అంతవఱకును మీరు మాయమ్మయొద్ద నుండవచ్చును.

హరి—బాబూ! నాభారము నతిదుస్సహమైనది. పరమేశ్వరుఁడు నాతలపై నెట్టి బరువు పెట్టెనో తెలియుటలేదు. నన్నెవ్వరును భరింపఁజాలరు. నాభారము నాయత్తవారికే దుస్సహమైనప్పుడు నాబ్రదుకు కెంతహీనమైనదో చెప్పఁగలయునా? కాని బాబూ! నేనేమి చేయఁగలదానను! నాహృదయము శూన్యమైపోయినప్పుడు దాని నెట్లయిన బూర్తిపఱచఁ జేసికొనుటయే యని తిరిగితిరిగి చచ్చుచుందును. కాని నాదురదృష్టము నన్ను వెంబడించియే వచ్చుచుండును. ఇఁకవలదు బాబూ! ఇఁక నెవ్వరియింటికిఁ బోయినను లాభములేదు. ఈవిశ్వభారమునంతను వహించువిశ్వేశ్వరునిపాదపద్మములనే యాశ్రయించెదను. కాని నాకాయుపాయము లభింపకున్నది.

అని యామె కన్నులనీరొత్తుకొనఁదొడంగెను. అప్పుడు వినయుఁడు "దొడ్డమ్మా! నీవట్లనుకొనవలదు. మాయమ్మ నందతితోఁ బాటుగఁ జూడవలదు. ఆమె తనజీవితభార మంతయు నీశ్వరునకు సమర్పించినదగుటచే నితరులభార మామెకంతకష్టముగా నుండదు. నీవిచ్చటఁ బరేశబాబును జూచితివి గదా! మాయమ్మయునట్టిదే. నీవిఁక మారుమాట చెప్పవలదు. ఒకసారి నిన్ను నాతీర్థమునఁ దీసికొనిపోయి విడిచెదను. తరువాత నీతీర్థమును జూడవచ్చును'' అనియెను.

హరి—అట్లయినచో నామెకు ముందుగాఁ గబురు—

విన—మనము పోవుటయే యామెకుఁ గబురు—

హరి—సరే. రేపటియుదయమున—

విన—ఈరాత్రి యేల పోగూడదు?

ఇంతలో సాయంకాల మయ్యెను. సుచరిత వచ్చి "వినయబాబూ! అమ్మ మిమ్ముఁ బిలుచుచున్నది. ఉపాసనాసమయ మైనది'' అని చెప్పెను.

విన—దొడ్డమ్మతో మాటాడుచున్నాను. నేను రాఁజాలను.

నేఁడు వరదాసుందరి యుపాసనకుఁ బిలుచుట వినయున కెంతమాత్రము నిష్టము లేదు. ఇది యంతయు విడంబనామాత్రమని యాతనికిఁ దోఁచెను. అప్పుడు హరిమోహిని వ్యస్తహృదయముతో "బాబూ! నీవు పొమ్ము! నాతో మాటాడుచుండుట యామె సహింపజాలదు. నీపని తీర్చుకొని తరువాత నిటకు రావచ్చును'' అనియెను. "నీవు వచ్చుటయే బాగుగ నుండును'' అని సుచరితయును జెప్పెను.

తాను సభకుఁ బోకున్నచోఁ గుటుంబకలహము కలుగుననియు నీని కంతకును దానే కారణ మగుననియు వినయుఁ డెప్పు డూహించుకొని యుపాసనకై వెడలిపోయెను. కాని సంపూర్ణఫలముమాత్రము కలుగలేదు. ఉపాసనానంతరమున భోజనము చేయవలసియుండెను. అప్పుడు వినయుఁడు నా కాకలి లేదనియెను. వరదాసుందరి యాతనిం గాంచి "ఇది యాఁకలికప్పు కాదు. నీవు మేడమీఁద నేదియో యారగించియే వచ్చియుందువు'' అనియెను. వినయుఁడు నవ్వుచుఁ "ఔను, లోభులగతి యంతయు నిట్లేయుండును. ఉన్నదానియందలిలోభముచే వారు రానున్న దానినిఁ బోఁగొట్టుకొనుచుందురు'' అని యాతఁడు లేచిపోవుచుండెను. వరదాసుందరి "మేడమీఁదకే పోయెదవా?'' అనియెను. వినయుఁడు సంక్షేపముగా నౌనని చెప్పి వెడలిపోవుచు ద్వారముకడనున్న సుచరితం గాంచి మృదుస్వరముతో "సోదరీ! ఒకసారి దొడ్డమ్మకడకుఁ బోయెదవు. మాటాడవలసినపని యున్నది'' అని చెప్పి వెడలిపోయెను.

ఆనాఁడు లలిత యాతిథ్యమునకు నియుక్తయయ్యెను. ఆమె యప్పుడు హారానునికడకుఁ బోయి వడ్డించుచుండఁగా నాకేఁడకారణముగా "వినయబాబిచ్చటలేఁడు;

మేడమీఁదికిఁ బోయినాఁడు" అనియెను. ఆమాట విని లలిత యచ్చట నేనిలిచి యాతని వంకమూవంకఁ జూచి నిస్సంకోచముగా "నేనెఱుంగుదును. అతఁడు నాతో మాటాడకుండఁ బోలేఁడు! ఈపని ముగించుకొని నేనును మేడమీఁదికే పోయెదను!" అనియెను.

లలిత నించుకంతయును జంకింపఁ జాలకుండుటచే హారానునిహృదయజ్వాల మఱింత రగుల్లఁదొడంగెను. వినయుఁడు సుచరితతో నాకస్మికముగ మాటాడి పోవుటయు, నావెనుక నే సుచరితయును పోవుటయు హారానుఁడు చూడకపుండలేదు. నేఁడాతఁడు సుచరితతో మాటాడఁ బ్రయత్నించి మాటిమాటికి నష్ఫలుఁడయ్యెను. ఒకటిరెండుసారు లాతనివిస్పష్టాహ్వానములనుగూడ సుచరిత తృణీకరించి పోయినది. అందుచే సభలోఁ దన కగౌరవము కలిగినట్లు భావించుకొని యాతనిహృదయము పరితపించి పోవుచుండెను.

సుచరిత మేడమీఁదికిఁ బోవునప్పటికి హరిమోహిని తనసామానంతయును మూటఁ గట్టుకొని యెచ్చటికో వెడలిపోవుదానివలె నుండెను. అది చూచి సుచరిత "దొడ్డమ్మా! ఇది యంతయు నేమి?" అని ప్రశ్నించెను. హరిమోహిని ప్రత్యుత్తరము చెప్పఁజాలక యేడ్చుచు "అమ్మా సతీశుఁ డెక్కడ నున్నాఁడు! ఒకసారి పిలువుము! తల్లీ!" అనియెను. సుచరిత వినయునివంకఁ జూచెను. అప్పుడు వినయుఁడు "దొడ్డమ్మ యిట నుండుట యందఱకును కష్టముగ నున్నది. నే నీమెను మాయమ్మయొద్దకుఁ దీసికొనిపోయెదను" అనియెను.

హరి—అమ్మా! నేఁటినుండి తీర్థమునకుఁ బోవఁదలఁచితిని. నావంటివి యీవిధముగా నెవ్వరియింటను నుండుట మంచిది కాదు. చిరకాలమువఱకు నన్ను భరించుటకు సహించువా రెవ్వ రున్నారు?

సుచరిత యీసంగతి యిదివఱకే యూహించుకొన్నది. హరిమోహిని యీయింట నుండుట యగౌరవమే యని గ్రహించిన దగుటచే నామె మాఱుమాట చెప్పఁజాలక మౌనముతో దొడ్డమ్మచెంతకుఁబోయి కూర్చుండెను. రాత్రియైపోయెను. ఇంట నింకను దీపము వెలిఁగింపలేదు. ఆహేమంతాస్వచ్ఛాకాశమునఁ దారకలు బాష్పాచ్ఛన్నములై యుండెను. అప్పు డెవ్వరికన్నులు బాష్పాచ్ఛన్నములై యుండెనో యాయంధకారమునం దగపడుటలేదు. మెట్లమీఁదనుండి సతీశుఁడు "దొడ్డమ్మా!" యని బిగ్గఱగఁ బిలుచుచుండెను. "ఏమి బాబూ!" అని హరిమోహిని తత్తరముతో లేచి నిలువఁబడియెను. అప్పుడు సుచరిత "దొడ్డమ్మా! ఈరాత్రి నీ వెక్కడకును బోవలదు. రేపటియుదయమునఁ బోవచ్చును. తండ్రిగారితోఁ జెప్పకుండ నెట్లు పోయెదవో చెప్పుము! అది యపచారము గాదా?" అనియెను.

వరదాసుందరి హరిమోహిని నవమానించిన దని క్రోధముచే మండిపడుచున్న వినయుఁడీసంగతి యూహింపలేదు. ఒక్క రాత్రియైన హరిమోహిని యట నుండుట వినయున కిష్టములేకపోయెను. హరిమోహిని దిక్కులేక సర్వమును సహించి తనయింటఁ బడియుండెనని వరదాసుందరి యనుకొనుచుండెను. ఆమె నీచోద్దేశమునకుఁ బ్రతిక్రియ చేయవలయునని వినయుఁడు హరిమోహిని నటనుండి తీసికొనిపోవుట కించుకంతయు విలంబము నోర్వఁజాలకుండెను. కాని హరిమోహిని యాయింట వరదాసుందరియొక్కతెతో మాత్రమే సర్వప్రధానసంబంధము కలది కాదని యప్పటి సుచరితమాటల వలన వినయున కాకస్మికముగాఁ దలఁపునకు వచ్చెను. ఆగ్రహించి యవమానించిన యామెను ద్రుణీకరించి పోయినచో నాదరించి యాశ్రయ మొసంగిన యాతనిని మఱచిపోయి నట్లగును! అది కేవల మన్యాయమని తెలిసికొని వినయుఁడు "మంచిది. పరేశబాబునకుఁ దెలుపకుండ నింతమాత్రమును బోఁగూడదు!" అనియెను.

ఇంతలో సతీశుఁడు పైకివచ్చి "దొడ్డమ్మా! రష్యావారు భారతవర్షము నాక్రమింప వచ్చుచున్నారఁట! మంచి బాగుగ నున్నది!" అనియెను.

వినయ—నీ వెవ్వరిపక్షము ?

సతీ—నేను రష్యావారిపక్షము.

వినయ—సరే. అట్లయినచో నిఁక రష్యావారికి విచార మక్కఱలేదు.

ఈవిధముగా దొడ్డమ్మసభ నిండిపోయెను. పిమ్మట మెల్లమెల్లగాఁ లేచి సుచరిత వెడలిపోయెను. పరేశబాబు తలఁచుగాఁ బరుండుటకుముందేదియో చదువుకొనుచుండునని సుచరిత యెఱుంగును. చాలదినములనుండి సుచరిత యట్టివేళకే యాతనియొద్దకుం బోయి ప్రార్థించుచుండుటచే నాతఁ డామెకుఁ జదివి బోధించుచుండెను. నేఁడును బరేశుఁడు తననిర్జనమందిరమున దీపమునొద్దఁ గూర్చుండి యెమర్షను (Emerson) కవి సంపుటమును జదువుచుండెను. సుచరిత మెల్లగా నతనికిఁ బోయి కుర్చీపైఁ గూర్చుండెను. పరేశుఁడు గ్రంథమును గ్రిందనుంచి యామె మొంగమువంకఁ జూచెను. తోడనే యామెకు సంకల్పభంగమయ్యెను. ఇఁక నామె యెట్టిసంసారపుగొడవయు నాతనితోఁ జెప్పఁజాలకపోయెను. "బాబూ! నాకుఁ జదివి బోధింపుము!" అని ప్రార్థించెను. పరేశుఁడు చదివి వినిపించుచుండెను. రాత్రి పదిగంటలకుఁ జదువు పూర్తియయ్యెను. పరేశబాబునిద్ర కట్టియాటంకము కలుగునో యని సుచరిత యిఁక నేమియు మాటాడక లేచి మెల్లమెల్లగా నవ్వలికిఁ బోవుచుండెను. అప్పుడు పరేశుఁడు ప్రేమస్వరముతో "రాధా!" అని పిలిచెను. సుచరిత మరల లోనికివచ్చెను. పరేశుఁడు మృదుస్వరముతో "నీవు మీదొడ్డమ్మనుగూర్చి మాటాడవలయునని వచ్చితివి గాదా?" అనియెను.

పరేశబాబు తనమనసులోనిమాట నెఱింగినందులకు సుచరిత విస్మితయై "ఔను బాబా! కాని యిప్పుడు వలదు. రేపు మాటాడుకొందము." అనియెను. పరేశుఁ డామెను గూర్చుండు మనిచెప్పి "అమ్మా! మీదొడ్డమ్మ యిచ్చట కష్టపడుచుండుట నాకు విచారముగా నున్నది. ఆమెమతవిశ్వాసమును, నాచారమును లావణ్యతల్లికి వెగటుగా నుండునని మొట్టమొదట నే నెఱుంగనైతిని. ఆమెకు బాధగా నుండెనని తెలిసినతరువాత మీదొడ్డమ్మ నీయింట నుంచుటకు సంకోచముగానే యున్నది!" అని చెప్పెను.

సుచ—మాదొడ్డమ్మ యిటనుండి పోవలయు ననియే సిద్ధముగా నున్నది.

పరే—ఆమె పోవు నని నే నెఱుంగుదును. మీయిరువురుమాత్రమే యామెకాశ్రయులై యున్నారు. మీ రామెను దిక్కుమాలినదానిఁగాఁ బంపివేయఁజాలరనియు నే నెఱుంగుదును. అందుచేత నే నీవిషయమై కొన్నాళ్ళనుండి యాలోచించుచున్నాను.

తనదొడ్డమ్మ కష్టపడుచుండె నని పరేశుఁడు గ్రహించినట్లుగాని, యాతఁ డావిషయమై యాలోచించుచున్నట్లుగాని సుచరిత యిదివఱ కనుమానించియైన నుండలేదు. అంతేకాక యీసంగతి తెలిసినచో నాతనికిఁ గష్టముగా నుండు నని యామె జాగ్రత్తగా మసలుకొనుచుండెను. ఇప్పటిపరేశునిమాటలు విని యామె యాశ్చర్యపడియెను. మఱియు నామెనయనపక్ష్ము లశ్రుజలములచే మెఱసిపోవుచుండెను.

పరే—నేను మీదొడ్డమ్మ కొకయిల్లు సిద్ధము చేసితిని.

సుచ—కాని యామెకంతశక్తి—

పరే—అద్దె యిచ్చుకొనసక్కఱ లేదు. ఆమె యిచ్చుకొను టేల? నీ వీయవలయును.

సుచరిత నోట మాటలేకుండఁ బరేశునివంకఁ జూచుచుండెను. పరేశుఁడు నవ్వుచు "అమ్మా! నీయిల్లే యున్నది. అద్దె నిచ్చుకొనసక్కఱలేదు." అనియెను. సుచరిత మఱియును విస్మిత యయ్యెను. అప్పుడు పరేశుఁడు "అమ్మా! కలకత్తాలో మీకు రెండిండ్లుండె ననుసంగతి నీ వెఱుంగవు! అందొకటి నీది; ఇంకొకటి సతీశునిది. మరణకాలమున మీతండ్రి కొంతసొమ్ము నాచేతి కిచ్చెను. నేను దానిని వృద్ధిచేసి కలకత్తాలో రెండిండ్లను గొంటిని. ఇప్పటివఱకు వానియద్దెవలనఁ గొంతసొమ్ముచేరినది. కొలఁదిదినములక్రిందటనే నీయిల్లు ఖాళీయైనది. అచ్చట మీదొడ్డమ్మ యుండుటకు కట్టి యాతంకమును లేదు" అనియెను.

సుచ—అచ్చట నామె యొంటిగా నుండఁగలదా?

పరే—మీరును నావారును నుండఁగా నామె యొంటిగా నేల యుండవలయును?

సుచ — మీ కీమాట చెప్పుటకే నేనిప్పుడు వచ్చియుంటిని. ఆమె యిప్పుడు పోవుటకు సిద్ధముగా నున్నది. ఒంటిగాఁ బంపివైచుట యెట్లని నేను సంశయించితిని. అందుచేతనే మీయాజ్ఞను గోరి వచ్చితిని. మీ రెట్లు చెప్పిన నట్లు చేసెదను.

పరే — మనయింటిప్రక్క నున్న సందెఱుఁగుదువా? ఆసందులో మూఁడిండ్లు దాఁటినతరువాతనే నీయిల్లు. ఈవరాండాలో నిలుచున్నచో నీయిల్లు కనఁబడును. అచ్చట మీరున్నచో భయములేదు. నేను తఱచుగ వచ్చి మిమ్ముఁ జూచి మీ క్షేమము తెలిసికొనుచుందును.

సుచరిత గుండెలలోనిబరువు దిగిపోయెను. తండ్రిని వదలిపోవుట యెట్లని విచారపడుటకుఁ గూడ నవకాశము లేకపోయెను. కాని పోవుటయే యామెకు నిశ్చయమై యుండెను. సుచరిత యావేగపూర్ణహృదయముతో మౌనమునువహించి పరేశుని చెంతఁ గూర్చుండెను. పరేశుఁడు స్తబ్ధభావముతోఁ దనయంతఃకరణమధ్యమునఁ దన్నుఁ జేర్చుకొని కూర్చుండియుండెను. సుచరిత యాతనిప్రియశిష్యురాలు — ప్రియపుత్రిక — ప్రియసుహృత్తు! ప్రాణప్రియకగు నాతనియీశ్వరోపాసనతో నామెయొక్క తెయే యేకీభావము గాంచియుండెను. ఆమె నిశ్శబ్దముగఁ జెంతఁ గూర్చున్నయప్పుడే యాతనియుపాసన పరిపూర్ణతం గాంచుచుండెను. ఆతఁడు ప్రతిదినమును సుచరితజీవితమును సౌభాగ్యశ్రేష్ఠామూలమున వర్ధిల్లఁజేయుచుఁ దనజీవితమునకు విశేషపరిణామమును గల్పించుకొనుచుండెను. సుచరితవలె నంతటి భక్తితోడను నంతటి నమ్రభావముతోడను నాతనిచెంత కెవ్వరును జేరఁజాలరు! వికచకుసుమము మాకసమువంకనే తిలకించుచున్నట్లామె తనసమస్తప్రకృతి నాతనివంకకే యున్ముఖముం గావించి, యుద్ఘాటితముం గావించుచుండును. ఇంతటి యేకాగ్రభావముతో నెవ్వరైన సమీపించినచో మానవునకుఁ ద్యాగశక్తి తనంతనే వర్ధిల్లిపోవుచుండును; అంతఃకరణము జలభారవినమ్రజలదముఁ బోలి పరిపూర్ణమై వినతమైపోవును! తనయెడల సత్యంబును, శ్రేష్ఠంబును, ననుకూలంబు నగుహృదయమునకుఁ బ్రతిదినము నాత్మప్రదానముం గావించు భాగ్యముకంటె మానవున కింకఁ గోరఁదగిన దేమున్నది? అట్టిదుర్లభ మగుసుయోగమును సుచరిత పరేశునకుఁ గల్పించినది. అందుచే సుచరితతో నాతనిసంబంధ మతిగభీరమయ్యెను. ఇప్పుడట్టిసుచరితతోడి బాహ్యసంపర్కము విచ్ఛిన్న మగుసమయము వచ్చినది! జీవనరస మిచ్చి పండించినఫలమును వృక్షమున విడువవలసివచ్చినది! అందువలన నాతనికిం గలుగుచున్ననిగూఢవేదన నాతఁ డంతర్యామికే నివేదించుచుండెను. సుచరితకుఁ బాథేయము సమకూరిన దనియు, నిప్పు డామెకు స్వశక్తిచేఁ బ్రశస్తపదమున సుఖదుఃఖములయందును, నాఘాతప్రతిఘాతములయందును నూతనవిజ్ఞానలాభముం గాంచుట కాహ్వానము వచ్చిన దనియు: బరేశుఁడు కొలఁదిదినములనుండి

ఱక్ష్యము సేయుచుండెను. అతఁడు తనమనసులోనే "అమ్మా! నీజీవితయాత్రను సుఖముగ సాగించుకొనుము! నీచిరజీవితమును కేవలము నాబుద్ధిచేతను, నాయాజ్ఞయను చేతనుమాత్రమే యాచ్ఛన్నముగఁ జేయుట యెన్నటికిని బొసఁగదు! ఈశ్వరుఁడు నిన్ను నన్నుండి విడిపించి యొకవిచిత్రాంతరమున నీకుఁ జరమపరిణామముం గూర్చుటకై యాకర్షించుచున్నాఁడు! అవిచిత్రమధ్యమున నీజీవనము సార్థకమగుఁగాక!" అని యనుకొనుచు నాతఁడు చిన్నతనమునుండియుఁ బ్రేమతోఁ బెంచినసుచరితను బవిత్రోత్సర్గసామగ్రింబోలి తనదెసనుండి పరమేశ్వరునిదెసకు మరలించి విడుచుటకు సంసిద్ధుఁడై యుండెను. పరేశునకుఁ వరదాసుందరిపైఁ గోపము లేదు. సంసారవిరుద్ధానుభవముల కాతఁడు మనమునం దెడమిచ్చుట లేదు. సంకీర్ణోపహాలమధ్యమునం దాకస్మికముగఁ గొత్తవరద వచ్చినచో నొకవిధమగుసంక్షోభము కలుగు ననియు, నావరదను, ప్రశస్తక్షేత్రమునకు మరలించుటయే దానికిఁ బ్రతీకార మనియు నాతఁ డెఱుంగును. కొలఁదిదినములనుండి తనకుటుంబమునకును సుచరితవిషయమున నెన్నఁడును భావించియైన నెఱుంగనికృత్యములు జరుగుచున్న వనియుఁ, బ్రస్తుతసంస్కారనిర్బంధములచే నామె బాధింపఁబడుచున్న దనియు, నింకను నామె నట్లు బంధించి యుంచుట తగదనియు, ముక్తిదానముం గావించినచో నామె యిచ్ఛవచ్చినరీతిని మెలంగుచు శాంతిలాభముం గాంచు ననియుఁగూడ నాతఁ డెఱుంగును. అందుచేతనే యాతఁ డట్టిశాంతిసామంజస్యమును సంఘటింపఁజేయుటకు నిర్బద్ధముగ నాయోజనముం గావించుచుండెను.

ఇరువురు నట్లు మౌనముతోఁ గూర్చుండి యుండఁగనే గడియారము పదునొకండుగంటలఁ గొట్టెను. పరేశుఁడు లేచి సుచరిత చేయిపట్టుకొని వరాండాలోనికామెను దీసికొనిపోయెను. అప్పుడు సంధ్యాకాలమునందలి యావిరి వదలిపోవుటచే నిర్మలమైయున్న యాకసమున నంధకారములోఁ దారకలు దీప్తిమంతములై యుండెను. పరేశుఁడు సుచరితను దనచెంత నుంచుకొని యాని స్తబ్ధరాత్రియం దీవిధముగా నీశ్వరప్రార్థనముం గావించెను—"ఈప్రపంచమందలి యసత్యమంతయును మాయమైపోయి పరిపూర్ణమగుసత్య మొక్కటియే నాజీవితమధ్యమున నిర్మలమూర్తిం దాల్చి యుద్భాసితం బగుఁగాక—"

## ౮౩

మఱునాఁటియుదయమున హరిమోహిని వచ్చి పరేశునకు సాష్టాంగప్రణామముం గావించుటయు నాతఁ డదరిపడి యించుక జరిగి వలదు వల దనియెను. హరిమోహిని కన్నీరు నించుచు "నేను మీ ఋణము నెన్నిజన్మములకైనను దీర్చుకొనఁజాలను. నావంటి నిరాధారురాలి కాధారముం గల్పించితిరి. ఇది మీరు గాక యెవ్వరు

చేయఁగలరు? ఎంత యిష్టమున్నను నాకెవ్వరు నుపకారము చేయఁజాల రనుకొంటిని — మీ యెడల నీశ్వరునకుఁ బరమానుగ్రహ మున్నది. అందుచేతనే మీరు మావంటివారియం దనుగ్రహము కలిగియున్నారు" అని విన్నవించెను. పరేశుఁడు సంకుచితుఁడై లేచి "ఇందు నేను చేసినదేదియును లేదు. అంతయును రాధారాణియే చేసినది!" అనియెను. హరిమోహిని యామాట కడ్డమువచ్చి "తెలిసినది. తెలిసినది. కాని రాధారాణి మీబిడ్డకాదా? ఆమె చేసినది మీరు చేసినట్లే! చిన్నతనమునఁ దల్లిదండ్రులు పోవుటచే నామె నిర్భాగ్యురా లనుకొంటిని. అట్టిదీనురాలిని భగవంతుఁ డిట్టి ధన్యురాలినిగా జేయు నని నే నెట్లెఱుంగఁగలను? దేశదేశములు తిరిగితిరిగి వచ్చి మిమ్ముఁ దర్శించినప్పుడే యీశ్వరుఁడు నాయందుఁగూడ దయగలిగియుండె నని గ్రహించితిని" అనియెను.

ఇంతలో వినయుఁడు వచ్చి "దొడ్డమ్మా! నిన్నుఁ దీసికొనిపోవుటకై యమ్మ వచ్చినది" అనియెను. సుచరిత చటాలున లేచి "ఆమె యెచ్చటనున్నది?" అని యడిగెను. "క్రింద మాయమ్మయొద్ద నున్నది!" అని వినయుఁడు చెప్పెను. సుచరిత యాత్రముతోఁ గ్రిందికి దిగిపోయెను. అప్పుడు పరేశుఁడు హరిమోహినిం గాంచి "నేను ముందుగఁ బోయి మీయింటియం దన్నియు సమకూర్చి వచ్చెదను." అని చెప్పి వెడలిపోయెను. ఆమాటకు వినయుఁడు విస్మితుఁడై "దొడ్డమ్మా! మీకిచ్చట నొకయిల్లున్నట్లే నాకుఁ దెలియదు!" అనియెను. "నాకును దెలియదు బాబూ! పరేశబాబున కొక్కనికే తెలియును. అది మారాధారాణి యిల్లట" అని హరిమోహిని చెప్పెను.

వినయుఁడు సర్వము నామెవలన విని "అమ్మా! నే నీప్రపంచమునం దెవ్వరో యొక్కరికైన నుపయోగపడవలయునని యనుకొనుచుందును. ఎన్నటికి నాకట్లు ప్రాప్తించుటలేదు. ఇంతవఱకు మాయమ్మకు నేనేమియుఁ జేయఁజాలకపోయితిని. చేయఁదగిన దంతయు నామెయే నాకుఁ జేయుచున్నది. నీకును నే నట్టియుపకారమును జేయలేకపోయితిని. నీవలన నెన్నియోవిధముల నాదరమును గాంచితిని. నిర్భాగ్యుఁ డగువినయున కిఁకఁ బ్రతిగ్రహించుటయే కాని ప్రతిదానము చేయునదృష్టము లేదు కాఁబోలును!" అనియెను.

కొలఁదిసేపటిలో లలితాసుచరితలతోఁ గలసి యానందమయి యచ్చటికిఁ వచ్చెను. హరిమోహిని యామె కెదురుపోయి "సోదరీ ఈశ్వరానుగ్రహము కలిగినప్పుడు లోపమేమియు నుండదు. నే నిప్పుడు నిన్నే పొందఁగలిగితిని" అని పలుకుచు నామెచేయి పట్టుకొని చాఁపపై గూర్చుండఁజేసి "సోదరీ! ఈవినయునకు నిరంతరము నీమాట తప్ప వేఱుమాట లేనేలేదు!" అనియెను.

ఆనందమయి నవ్వుచు "చిన్నతనమునుండియు వీని కిదియే రీతి. ఏమాట పుట్టిన నామాటయే! దొడ్డమ్మను దనయింటికిఁ దీసికొనిపోవలయు నని యిప్పు డీతనిపట్టు!" అనియెను.

వినయ — ఔను. నే నామాట మొదటినుండియుఁ జెప్పుచున్నాను. ఇంతవయసు వచ్చినతరువాత నాకు దొడ్డమ్మ దొరకినది. నేనే సంపాదించుకొంటిని. ఇంతకాలము కలిగిన దొడ్డమ్మ లేనిలోపము నిప్పుడు నేను కష్టపడి తీర్చికొంటిని.

ఆనందమయి లలితవంకఁ జూచి నవ్వుచు "లేనిదానిని సంపాదించుటయును సంపాదించినదానిని ప్రాణమువలె నాదరించుటయును మా వినయునకు బాగుగఁ దెలియును. మీరందఱు నీతని కెట్లాదరించుచుంటిరో నేనెఱుంగుదును. భావించియైన నెఱుంగని యట్టియాదరము నీతఁ డాకస్మికముగఁ బొందఁగలిగెను. మీతో నీతఁడు కలసిమెలసి యున్నందులకు నాకుఁగలయానంద మేమని చెప్పుదును తల్లీ! మీయింటిపై మనసు నిలుపుటవలన మావినయునకు మహోపకారము కలిగింది. ఈసంగతి యాతనికి బాగుగఁ దెలియును!'' అనియెను. లలిత యేమియో బదులుచెప్పుటకుఁ బ్రయత్నించెను గాని యామెకు మాటలు దొరకలేదు. ఆమె మొగ మెఱ్ఱపడి పోయెను. సుచరిత లలిత యసమర్థతఁ గాంచి "అమ్మా! మావినయబాబు సకల జనులయందును గల యాంతరిక తేజమునే లక్ష్యముచేయుచుండును. అందుచే నాతనికిఁ బ్రతిజనునియందును గలగుణము మాత్రమే కానఁబడుచుండును. ఇదియే గుణగ్రహణ పారీణుఁ డగునీతనియందుఁగల విశేషము!'' అనియెను.

వినయ — అమ్మా! నీవు నీవినయు నెంతగొప్పవానిగాఁ దలంచుకొనుచుంటివో, నిజముగాఁ బ్రపంచమునం దాతని కంతగా గౌరవయోగ్యత లేదు. ఈసంగతి నీవు స్పష్టపఱుపవలయు నని తలంచుచుందును గాని యహంకారవశమున నట్లు సేయఁజాలకుంటిని. కాని యిఁకఁ జెప్పక తప్పదు. అమ్మా! ఇఁకవలదు. వినయునిమాట యిప్పు డింతవఱకే చాలును!

ఇంతలో సతీశుఁడు చిరపరిచిత మగుతనకుక్కనెత్తికొని గంతులు వైచుచు నచ్చటికి వచ్చెను. హరిమోహిని తత్తరముతోఁ జటాలున లేచి "నాతండ్రీ! సతీశా! కుక్క నిటునుండి తీసికొనిపొమ్ము!'' అనియెను.

సతీ — దొడ్డా! ఇది యేమియును జేయదు. నీయింటిలో దూరదు లెమ్ము! నీవు దీని నించుక యాదరించినచో నిది నిన్నేమియు ననదు!

హరిమోహిని యించుక యోసరిల్లి "వలదు బాబూ! దీనిని తీసికొనిపొమ్ము!'' అనియెను. అప్పు డానందమయి కుక్కతోఁగూడ సతీశుని దరిఁజేర్చుకొని యొడిలోఁ గూర్చుండఁజేసికొని "బాబూ! నీవేనా సతీశుఁడవు! నీవు మావినయుని మిత్రుఁడ

వా" అనియెను. వినయుని మిత్రుఁడుగాఁ బరిచితుఁ డగుట సతీశున కంతయసంగతముగాఁ దోఁచలేదు. అతఁడు నిస్సంశయముగా "జ్ఞాన!" అని చెప్పి యానందమయి మొగమువంకఁ జూచుచుఁ గూర్చుండెను. అప్పు డానందమయి "బాబూ! నేను వినయునితల్లిని!" అనియెను. అప్పుడు సుచరిత సతీశునితో నానందమయికి వందనము చేయుమని చెప్పెను. సతీశుఁడు సిగ్గుతో నట్లో ప్రణామముం గావించెను. ఇంతలో వరదాసుందరి పైకి వచ్చి హరిమోహినివంకఁ జూడకయే యానందమయింగూర్చి "మీరు మాయింట నేమైన ఫలాహారము చేయరా!" అనియెను.

ఆనం—ఆహారపానీయములకు నా కట్టియభ్యంతరమును లేదు. కాని నేఁడు మాత్రము వలదు. గోరా తిరిగి వచ్చినతరువాత నేను మీయింట భుజింతును.

గోరా చెంత లేకుండిన యీసమయమున నానందమయి యాతని కప్రియమగు నట్టిపనియును జేయుటకు మానివైచెను! అప్పుడు వరదాసుందరి వినయునివంకఁ జూచి "వినయబా బిచ్చటనే యున్నట్లున్నది! నీవు రావనుకొంటినే!" అనియెను.

విన—నేను వచ్చినట్లు మీకుఁ దెలుపకుండఁగనే పోయెద ననుకొంటిరా?

వర—నిన్న నేను పిలిచినప్పుడే నీవు భోజనము చేయవైతివి. నేఁడు పిలువకుండ వచ్చి భుజింతువా?

విన—అట్లు చేయుటయందే నాయాశ మెండు! జీతముకంటె లంచము ప్రియమైనది గాదా?

వినయుఁ డీయింటఁ దఱచుగా భుజించుచుండుననియు, నానందమయికూడ దాని కభ్యంతరము చెప్పలేదనియుఁ దెలిసికొని హరిమోహిని మనసులోనే విస్మితయైపోయెను. అందుచే నామె మనసు తేరుకొనకుండెను. వరదాసుందరి పోయినతరువాత నామె యానందమయింగాంచి నిస్సంశయముగా "సోదరీ! నీభర్త యెవ్వరు?" అని ప్రశ్నించెను.

ఆనం—నానాథుఁడు కేవలము హిందువు!

హరిమోహిని మఱి మాటాడఁజాలకపోయెను. ఆనందమయి యామెహృదయభావమును గ్రహించి "సోదరీ! సమాజ మన్నిటికంటెను బ్రధానమై యున్నంతవఱకు సమాజనియమములనే గౌరవించితిని. కాని యొక్కనాఁ డాకస్మికముగ నాయింటఁ బరమేశ్వరుఁడు సాక్షాత్కరించెను. అప్పటినుండియు నేను సమాజమును లెక్కచేయుటలేదు. సర్వేశ్వరుఁడే స్వయముగ వచ్చి నాజాతినపహరించికొనిపోయెను. ఇఁక నెవ్వరిని గూర్చి భయపడవలయును?" అనియెను. హరిమోహిని కామాటలయర్థము బోధపడలేదు. ఆమె మరల "సోదరీ! ఇది నీభర్త కిష్టమేనా?" అనియెను.

ఆనం—ఇష్టము లేదు. ఆయనకుఁ గోపమే—

హరి—బిడ్డలకో ?

ఆనం—వారికి నిష్టము లేదు. కాని, వారిసంతోషముకొఱకే నా బ్రదుకు? సోదరీ! ఈనామాట యితరులకు బోధపడునదికాదు! సర్వజ్ఞుఁడగు నీశ్వరుని కొక్కనికే తెలియును !

అని చెప్పుచు నానందమయి చేతులు జోడించి వందనముం గావించెను. ఏ మిషనరీయువతియో వచ్చి బోధించి యామెను క్రిష్టియనుగాఁ జేసివైచియుండు నని హరిమోహిని భావించుకొనియెను. అప్పుడామెమనోమధ్యమునం దంత్యమునొకవిధ మగుసంశయ ముదయించెను !

లావణ్యయు లలితయు లీలయు సుచరితవెంటనే తిరుగుచుండిరి. వారత్యుత్సాహముతో సుచరితనూతనమందిరము నలంకరించుచుండిరి. కాని యాయుత్సాహములో నవ్యక్తవేదనామయం బగునశ్రుజలము ప్రచ్ఛన్నమై యుండెను.

ఇన్నాళ్ళవఱకును సుచరిత యెన్నియోవిధములఁ బ్రార్థించి పరేశబాబున కుపచారములు చేయుచుండెను. పూలసజ్జలోఁ బుష్పములను నింపుట, బల్లపైఁ బుస్తకములను సవరించుట, స్వయముగాఁ బర్యంకము నెండలోవైచుట స్నానాహారసమయములను జ్ఞప్తికిఁ దెచ్చుట—అప్పుడీపనులలో విశేష మెవ్వరికిని గనఁబడలేదు. సామాన్యములుగనే తోఁచెను. కాని సామాన్యములైన యాపనులే—ఒకరుగాకున్న మఱియొకరైకరైనఁ జేయుట కనువుపడియున్న యాయుపచారములే—చేయకున్నను నంతగానిబ్బంది లేనియాసేవలే—ఇప్పుడిరువురిహృదయములను మథించివైచుచుండెను. ఇప్పుడు సుచరిత పరేశునంటి కేచిన్నపని చేయుటకై వచ్చినను పరేశున కదిపెద్దపనిగా నగపడుచుండుటచే నామెకుఁ గష్టముగా నుండెను. ఇఁక నీసేవ నేఁడుగాకున్న రేపైనఁ మఱియొకటిచేతికి లభించునుగదా యని తలంపునకు వచ్చినంతనే సుచరిత కన్నుల నీరు నిండిపోవుచుండెను.

సుచరిత నూతనగృహంబునకుఁ బోవునాఁటిప్రాతఃకాలమునఁ బరేశుఁడు తన యుపాసనాగృహంబునకుఁ బోయి తనపీఠముచెంత సర్వసన్నద్ధమైయున్న పూలసజ్జను, సమీపమున పరీక్షించుచుఁ గూర్చుండియున్న సుచరితను గాంచెను. అతఁడు లీలాలావణ్యలకుగూడ నుపాసనకు రావలయు నని పిలిచెను. గాని లలిత వారి నచ్చటికిఁ బోనీయలేదు. పరేశుఁడు నిర్జనముగ నిర్మలముగ నుపాసనఁ గావించినచో సుచరిత కాతని యానందమయాశీర్వాదము లభించు నని లలిత యాశ! నేఁటిప్రభాతమునం దట్టియాశీర్వాదమును బడయుట సుచరిత కావశ్యకమని భావించి లలిత తండ్రిగారిప్రార్థనకు శాంతిభంగము కాకుండఁ జూచుకొనియెను.

పరేశుఁ డుపాసనాంతరమునఁ గన్నుల నీరు నించుచున్న సుచరితం గాంచి "అమ్మా! వెనుకకుఁ దిరిగి చూడకుము! ఏది ప్రాప్తించినను, ఏది నిశ్చయించుకొనినను దానియందు సంపూర్ణముగ స్వశక్తిచే మంచినే గ్రహించెద నని శపథము చేసికొని పరమానందముతోఁ బ్రవర్తింపుము! ఈశ్వరునకే సంపూర్ణముగ నాత్మసమర్పణముం గావించుకొని యాతనినే యేకమాత్రసహాయునిగాఁ జేసికొనుము! అట్లయినచో మ అప్పు, తప్పు లోపము మొదలగువానిలోఁ గూడ నీకు లాభకర మగుమార్గము దొరకఁ గలదు. నిన్ను నీవు విభాగించుకొని నీలోఁ గొంత దేవునియెడలను, మఱికొంత మఱి యొకచోటను వినియోగించినచో సమస్తమును దుస్సహమైపోవును! అత్యల్ప మగు మాయాశ్రయము నీ కింక నంత యావశ్యకము కాకుండునట్లు దేవుఁ డనుగ్రహించుఁ గాక!" అని బోధించెను.

అనంతరము వారిరువురును బయటికి వచ్చునప్పటికిఁ గచేరిగదిలో హారానబాబు కూర్చుండి యుండెను. ఇఁక నెవ్వరియందు నెట్టివిరోధభావము నుంచుకొనన నని ప్రతినఁబూనియున్న సుచరిత యాతనిం గాంచి వినమ్రయై నమస్కరించెను. తత్క్షణమే హారానుఁడు కుర్చీపై నిలువ్వనఁ గూర్చుండి గంభీరస్వరముతో "సుచరితా! నీ విన్నిదినములనుండియు నాశ్రయించిన సత్యమునుండి వెనుకకు మరలుటచే నాకీదినము దుఃఖదినముగా నున్నది!" అనియెను. సుచరిత యెట్టిప్రత్యుత్తరము నీయలేదు. కాని యామెహృదయాంతరమున శాంతకరుణాస్వరసమ్మేళనమున మొరసిపోవుచున్న సంగీతమునం దప్పుడొకయపస్వరము ప్రవేశించిన నట్లయ్యెను. అప్పుడు పరేశుఁడు "పానూబాబూ! ఎవ్వరు ముందఱికిఁ బోవుచుండిరో, యెవ్వరు వెనుకకు మరలుచుండిరో యాసంగతి యాయంతర్యామికే తెలియును. ఆవిషయమై మనము వెలుపలనుండి విచారించుట వృథాయాసమే యగును!" అనియెను.

హారా — అట్లయినచో మీహృదయమున నెట్టియాశంకయును లేదా? పశ్చాత్తాపపడుట కెట్టికారణమును లేదా?

పరే — కాల్పనికంబు లగుసంశయములను నేను మనమునకుఁ దెచ్చికొనను! పశ్చాత్తాపకారణము ఘటిల్లకపోయినను బశ్చాత్తాప మెప్పుడు కలుగునో నే నెఱుంగుదును.

హారా — నీతనయ లలిత యొంటిగా వినయునితో స్టీమరుపై నెక్కి వచ్చిన సంగతికూడఁ గాల్పనికమేనా?

సుచరిత మొగ మెఱ్ఱనయ్యెను. పరేశుఁడు మృదుస్వరముతో "పానూబాబూ! ఇప్పుడు నీహృదయ మేమోగాని తీవ్రముగా నున్నది. ఇప్పుడు నీతో నీవిషయమున మాటాడుట నిన్నగౌరవించిన ట్లగును!" అనియెను.

హారా—నామాటలయందుఁ దీవ్రభావ మేమియును లేదు. ఈవిషయమున నడుఁగవలసినబాధ్యత చాలవఱకు నాయందున్నది. దీనికొఱకు మీరు విచారింపవలదు. నే నిప్పుడు ప్రత్యేకవ్యక్తిగా మిమ్మడుగుట లేదు. సమాజపక్షమున మాటాడుచున్నాను. మీరు గుడ్డివారు కాకయున్నచో మీఁలలిత వినయునితో నొంటిగాఁ దిరుగుటనుబట్టి మీకుటుంబము సమాజధర్మములను త్యజించుట కుపక్రమించుచున్న దని తెలిసికొనియుందురు. ఇది కేవలము మీకుఁ బశ్చాత్తాపకారణముమాత్రమే కాదు. సమాజమునకుఁ గూడ నగౌరవమే!

పరే—నిందింపఁదలచినచో వెలుపలనుండియే నిందింపవచ్చును. కాని, విచారణ సేయఁదలచినచో లోపలఁ బ్రవేశింపవలసి యుండును. కేవలసంఘటనమునుబట్టి మానవునిపై దోషారోపణము చేయరాదు.

హారా—ఇది రిక్తసంఘటనము కాదు. దీనిని మీరు లోపలనుండియే ఘటిల్లఁ జేసితిరి. మీ రెల్లవారిని నాత్మీయులుగా మీకుటుంబమునఁజేర్చి మీకుటుంబమువారిని సమాజమునకు దూరము చేయఁజూచుచున్నారు. ఎంతవఱకుఁ దెచ్చితిరో మీకుఁ బోధపడుటలేదా ?

పరేశుఁ డించుక విరక్తుఁడై 'నాకు నీతో ముఖాముఖిసంభాషణము కుదురదు' అనియెను.

హారా—కుదురకపోవచ్చును! కాని నే నీసుచరిత నే సాక్షిగా నెంచితిని. ఈమెయే సత్యమును చెప్పును గాక! లలితతో వినయుని సంబంధము వట్టిబాహ్యసంబంధమా ? అది వారియంతరంగముల నెంతమాత్రమును స్పృశించుట లేదా? సుచరితా! నీవూరక తప్పించుకొని పోవుటకు వలనుపడదు. ఈప్రశ్నకుఁ బ్రత్యుత్తర మీయవలయును. ఇది ప్రధానవిషయము!

సుచ—ఎట్టిప్రధానవిషయమైనను నిట్లు ప్రశ్నించుటకు మీ కధికార మెంతమాత్రమును లేదు!

హారా—అధికారము లేకున్నచో నేను కేవల మూరకుండుటయే కాక యీవిషయమున నాలోచనయే చేయకుందును. మీరు సమాజమును లక్ష్యముచేయకున్నను సమాజమునం దున్నంతవఱకు మిమ్ములను సమాజము విచారింపక మానదు!

ఇంతలోఁ దుఫానువలె లలిత యచ్చటికి వచ్చి "సమాజము నిన్నే విచారకునిగా నియోగించినచో నట్టిసమాజమును త్యజించుటయే మాకు సర్వశ్రేయము !"అనియెను. హారానుఁడు చటాలున లేచి "లలితా! నీవునువచ్చితివి సంతోషముగానున్నది! నీతప్పు నీయెదుటనే విచారించుట యుచితము!" అనియెను. సుచరిత క్రోధప్రదీప్తనయనయై "పానుబాబూ! మీరు మీయింటికిఁబోయి మీవిచారణాలయమునందు మమ్ము

బిలిపించుకొనుఁడు! గృహస్థుల గృహమధ్యమున నవమానకరముగ మీ యధికారమును జూపుట తగదు!— సోదరీ! లలితా! రమ్ము పోవుదము!" అనియెను.

లలిత యొక్కయడుగైనఁ గదపక "వలదు సోదరీ! నేను భయపడిపోవుదానను గాను! పానూబాబు చెప్పఁదలఁచిన దంతయు వినియే వచ్చెదను. చెప్పనిమ్ము! ఏమి చెప్పునో చూతము!" అనియెను. హారానుఁడు నిర్విణ్ణుఁడైపోయెను. అప్పుడు పరేశుఁడు "లలితా! వలదు! నేఁడు సుచరిత మనయింటినుండి తనయింటికిఁ బోవును. ఈ ప్రాతఃకాలమున నెట్టియశాంతికిని నేను సహింపఁజాలను! హారానబాబూ! మాతప్పెంతటిదైన నగుఁగాక! దయయుంచి క్షమింపుము!" అనియెను. హారానుఁడు మాటాడక గంభీరముగఁ గూర్చుండి యుండెను. సుచరిత యాతని వర్జించుచున్న కొలఁదియు నామెను దక్కించుకొనవలయునను కోరిక యాతనికి వృద్ధియగుచునే యుండెను. అసామాన్య నైతిక బలముచే విజయమును బొందవలెనని హారానుఁడు దృఢనిశ్చయుఁడై యుండెను.

ఇంకను నాతని యాశ వదలలేదు. ఇప్పుడు సుచరిత తన పెద్దతల్లితో నిఁకొక యింటికిఁ బోవనున్నది. అచ్చటికిఁ బోయినచో నిఁక నామె తనకు దక్కుట దుర్లభమని యాతనికి భీతి కలుగుచుండెను. అందుచేతనే యాతఁ డిప్పుడు తన బ్రహ్మాస్త్రములను బదను పెట్టుకొని తెచ్చియుండెను. ఏదో యొకసంగతి నేఁడే తేలిపోవలయునని యాతని యుద్దేశము. అతఁడు సమప్రసంగోచములను మననము చేసికొని వచ్చియుండెను. కాని నెదుటిపక్షమున లలితా సుచరితలుకూడ నిస్సంకోచముగాఁ దూణములనుండి బాణములను వెలువరచి యాకస్మికముగా నెదిరింతురని యాతఁడనుకొనలేదు. నైతికసంబంధమగు తనయాగ్నేయాస్త్రము మహాతేజముతోఁ బరపక్షము నాక్రమించునని యాతఁడు నిశ్చయించుకొనియెను. కాని, యట్లు జరిగినది కాదు— సమయము మించిపోవుచున్నది! అయినను హారానుఁడు నిరాశపడలేదు. అతఁడు తనలో "సత్యమే జయమైనచో హారానునకే జయమగును! కాని విజయ మూరక లభించునది కాదు. పోరాడవలయును.!" అని భావించుకొని హారానుఁడు సన్నద్ధుఁడై రణరంగమునఁ బ్రవేశించెను.

సుచరిత హరిమోహినికడకుఁ బోయి "పెద్దమ్మా! నేఁడు నేనందఱితోడను గలసిభుజించెదను. నీవు మఱియొకలాగనుకొనవలదు!" అనియెను. హరిమోహిని మాటాడలేదు. సుచరిత సంపూర్ణముగఁ దనయధీనయైపోయినదని హరిమోహిని మనసులో స్థిరపఱచుకొనియెను. ఇప్పుడు తనసంపత్తితోఁగూడ బ్రత్యేకగృహమున సుచరిత యుండుట కవకాశము కలిగెను. ఆకారణముచే సుచరిత తనదే యయ్యెననుటకు హరిమోహిని కెట్టిసంశయమునులేదు. అందుచేతనే యిప్పుడు సుచరిత యాచారమును

ద్వేషించి యెల్లవారితోడను భుజించెననుట హరిమోహినికిష్టము లేకుండుటచే నామె యెట్టియంగీకారమును బ్రకటింపలేదు. సుచరిత యప్పుడు దొడ్డమ్మ మనోభావమును గ్రహించి "అమ్మా! నేను నిశ్చయముగఁ జెప్పుచున్నాను. దేవుఁడింతులను సంతోషింపఁగలఁడు! నాయంతర్యామి యగు నీశ్వరుఁడు నన్నందఱితోడను గలసి భుజింపుమని ప్రబోధించుచున్నాఁడు! ఆమాట వినకున్నచో నాతని కాగ్రహము కలుగును! ఆతని కోపమునకు నేను నీకోపము కంటెను మిగుల భయపడుచుందును!" అనియెను.

వరదాసుందరి హరిమోహిని నవమానించుచున్నంత కాలమును నాకష్టమును బంచుకొనుటకై సుచరిత యామె కిష్టమగు నాచారమును బాలించినది. ఆయవమానమునకు నివృత్తి కలిగినప్పుడుకూడ సుచరిత తనస్వాతంత్ర్యము నేల చంపుకొనవలయును? సుచరిత స్వభావమును హరిమోహిని సంపూర్ణముగ గ్రహింపలేదు. గ్రహించుటకామెకు శక్తియును లేదు. హరిమోహిని సుచరితకోరికను స్పష్టముగా నిషేధింపలేదు గాని మనములోఁ గోపగించుకొని "అయ్యో తల్లీ! మానవుల కిట్టి దుస్సంకల్పము లెట్లుపుట్టునో నాకు బోధపడుటలేదు. ఎత్తినది బ్రాహ్మణజన్మముగదా!" అని యనుకొని కొంచెసేపూరకుండి "తల్లీ! నేనొక్కమాట చెప్పెదను నీవేమిచేసినను సరియే కాని రాముదీనునినీళ్ళనుమాత్రము త్రాగఁగలదు!" అనియెను.

సుచ — ఏమమ్మా! ఆతఁడు తనయావుపాలను బిదికి నీకిచ్చుటలేదా! నీ వుపయోగించుకొనుటలేదా?

హరిమోహిని విస్ఫారితనయనయై "చాలు నూరకుండుము! పాలును నీళ్ళును నొక్కటియేనా!" అనియెను.

సుచ — (నవ్వుచు) మంచిదమ్మా! నేను రాముదీనునినీళ్ళను ద్రాగను. కాని సతీశునిమాత్రము నీవు జాగ్రత్తపెట్టుకొనుము! ఆతఁ డెట్టి తప్పుచేయునో?

హరి — సరే. వానిమాట కేమి?

మగవాండ్రి యాచార లోపముల కంతగాఁ దప్పు లేదని హరిమోహిని యుద్దేశము.

## ౭౫

హారానుఁడు రణక్షేత్రమునఁ బ్రవేశించెను. లలిత వినయునితోఁ గలసి స్టీమరునుండి వచ్చి నేఁటికిఁ బదునేనుదినము లయ్యెను. క్రమముగా నీమాట యీచెవినుండి యాచెవికి మెల్లగా వ్యాపించుచుండెను. కాని యీరెండుదినములలోనను నావార్త జీర్ణారణ్యమున దావానలముంబోలి యొక్కసారిగా నంతట నలముకొనుచుండెను. బ్రాహ్మసమాజనీతిధర్మములను బాలించువారెల్లరు నిట్టిదురాచారములను నిర్మూలింప

వలయు నని హారానుఁ డందఱకును బోధించుచుండెను. ఈపని చేయుటయం దాతని కంతకష్టము లేకపోయెను. సత్యము ననుసరించి కర్తవ్యము ననుసరించి యితరుల యపరాధములను దిరస్కరించి శాసించుట కుద్యమించినప్పుడు సత్యకర్తవ్యనియమ రక్షణముం గావించుట మన కంతకష్టముగా నుండదు. ఈవిషయమున బ్రహ్మసమాజమునందు హారానబా బప్రియసత్యఘోషణమును, గఠోరకర్తవ్యసాధనమును గావించుట కుద్యమించినంతనే యప్రియతాకఠోరతలయందలి భయముచే నాతని కుత్సాహముతో సాహాయ్యము చేయుటకుఁ జాలమంది పరాఙ్ముఖులు గాఁజాలకపోయిరి. సమాజహితార్థులగువారందఱును బండ్లమీఁదను, బల్లకులమీఁదను నొండొరయిండ్లకుఁ బోయి యిట్టి దురాచారముల నడఁగింపకున్నచో సమాజ మిఁకముం దంధకారావృతమై పోవునని చెప్పుకొనఁదొడంగిరి. ఇంతేకాక సుచరిత హైందవి యైనదనియు నామె యిఁక యజ్ఞయాగములతోడను, జపతపములతోడను, దేవపూజలతోడను గాలక్షేపము చేయఁగలదని కూడ నామాటతోఁ గలిపి చెప్పుకొనుచుండిరి. చాలదినముల నుండి లలితమనస్సులో మహారణము జరుగుచుండెను. ఆమె ప్రతిరాత్రియు శయనించుటకు ముందుగను, ప్రతిప్రభాతమున నిదురనుండి లేచినవెనుకను, “నే నెన్నటికిని విజితను గాఁజాలను!” అని శపథము చేసికొనుచుండెను. ఈవిధముగా వినయుని చింతయే యామెహృదయమంతట నధికారము చేయుచుండెను. వినయుఁడు క్రిందిగదిలోనికి వచ్చి మాటాడుచున్నట్లు తెలిసినంతనే యామెగుండెలు కొట్టుకొనిపోవుచుండెను. అతఁ డొకటిరెండుదినములు రాకున్నచో నామెహృదయ మభిమానముచే నిండిపోవుచుండెను. ఆమె తఱచుగా సతీశుని వినయునింటికిఁ బోవుటకుఁ బ్రోత్సహించుచుండెను. అతనివలన వినయుని సర్వవిషయములను దెలిసికొనుచుండెను. అట్లు చేయుట మానలేకున్నకొలఁదియు నామె పరాభవచింత మఱింతవర్ధిల్లి యామెనధీరురాలింజేసివైచుచుండెను. గోరావినయులతోఁ బరిచయము కలుగుట కవకాశమిచ్చిన పరేశబాబుపైఁ గూడ నామె కొకప్పుడు కోపము కలుగుచుండెను. ఏమైనను దుదివరకు బోరాడెద ననియు విజితను గాననియు నామె ప్రతిజ్ఞచేసికొనియెను. జీవయాత్రవిషయమై యామెహృదయమున నెన్నియో సంకల్పములు యాతాయాతము లగుచుండెను. ఐరోపానారీమణుల కీర్తిచరిత్రముల నన్నిటి నామె చదివియుండెను. అట్లు చరించుట యసాధ్యము కాదని యామెకుఁ దోఁచుచుండెను. ఒకనాఁ డామె తండ్రికడకుఁ బోయి “బాబూ! నేనేదే నొక మహిళాకళాశాలకుఁ జదువుకొనఁబోవుట మంచిది కాదా?” అని ప్రశ్నించెను. లలితముధాతురహృదయవేదనచే సకరుణంబులగు విలోకనంబులతో నిట్లడుగుచున్నదని యామె మొగమువంకఁ జూచినంతనే పరేశుఁడు గ్రహించి స్నిగ్ధస్వరతో “అమ్మా! చదువుకొనకేమి? కాని యంతటికళాశాల

యెక్కడ నున్నది? అనియెను. ఆదినములలో బాలికాకళాశాలలు విశేషించి లేవు—గొప్ప యింటియువతు లుపాధ్యాయినులుగా నుండుట కింకను ముందంజ వైచుట లేదు. అప్పుడు లలిత వ్యాకులహృదయముతో బాబా! కళాశాలయే లేదా?" అనియెను.

పరే—లేదమ్మా!

లలి—బాబా! అట్టికళాశాల నొకదానిని స్థాపింపఁగూడదా?

పరే—అందులకెంతయో ధనము కావలయును! ఎంతయో జనసాహాయ్యము కావలయును!

లలిత, సత్కార్యమునందు సంకల్పమును స్థిరముగ నిలుపుటయే కఠిన మని యెఱుంగును గాని దానిని సాధించుమార్గమునం దెన్నికష్టములున్నవో ముందుగ నూహించుకొనలేదు. ఆమె కొంతసేపటివరకు మాటాడకూరక కూరుచుండి తరువాత మెల్లగా లేచిపోయెను. తనప్రియపుత్రికహృదయకష్ట మెంతతీవ్రముగ నున్నదో పరేశుఁ డట్లే కూర్చుండి భావించుకొనుచుండెను. హారానుఁడు నాఁడు వినయునింగూర్చి సూచించిన విషయ మిప్పుడు పరేశునకు స్మృతికివచ్చెను నిట్టూర్పు విడిచి యాతఁడు తనలోనే "నేననాలోచితముగఁ బనిచేసితినా?" అని ప్రశ్నించుకొనియెను. అతనికి దక్కినబిడ్డలం గూర్చి యంతయాలోచనయే లేదు—కాని లలితసత్యజీవనము వినిర్మలమైనది! ఆమె దేనినిగూడ నసంపూర్ణముగఁ దెలిసికొనునది కాదు. ఆమె సుఖదుఃఖములయందుఁ గొంతసత్యమును, గొంతసంశయము ననుమాటలేదు.

నాఁటిమధ్యాహ్నమే లలిత సుచరితయింటికిఁ బోయెను. ఆయింట విశేషాలంకారము లేవియును లేవు. ఒకగదిలో రెండుకంబళములు పఱుపఁబడి యుండెను. ఆదొకవైపున సుచరితపర్యంకమును, మఱియొకవైపున హరిమోహినిశయ్యయు నుండెను. హరిమోహిని మంచముపైఁ బరుండదు గావున సుచరితయు గ్రిందనే శయనించుచుండెను. ఒకవంకగోడపైఁ బరేశునిచిత్రపటము వ్రేలాడుచుండెను. ప్రక్కనున్న చిన్నగదిలో సతీశునిమంచమును, దానిప్రక్క నొకచిన్నబల్లయు, దానిపైఁ గలందాను పుస్తకములు, పలకలు చిందరవందరగా నుండెను. సతీశుఁడు బడికిఁ బోవుటచే నిల్లంతయు నిశ్శబ్దమై యుండెను.

హరిమోహిని భోజనము చేసి చాఁపపైఁ బరుండుట కుద్యుక్తయగుచుండెను. సుచరితవిశీర్ణకుంతలములు వెన్నునఁ జీరాడుచుండఁ గంబళముపైఁ గూర్చుండి శాలీసు నొడిలో నుంచికొని యేకాగ్రచిత్తముతో నేమియో చదువుకొనుచుండెను. లలిత యాకస్మికముగ వచ్చుటచే సుచరిత లజ్జితయై ముందుగఁ బుస్తకమును మూసివైచి తనసిగ్గుచేతనే సిగ్గు నడంచుకొని పుస్తకము నప్పటివలెనే యుంచెను. అది గోరా యుపన్యాసముల సంపుటము!

హారిమోహిని చటాలునలేచి "అమ్మా! లలితా! రమ్ము! మీయిల్లు విడిచివచ్చి నదిమొదలేమోకాని సుచరితమనసు బాగుగలేదు. అందుచేతనే యీమె యేదియో చదువుకొనుచుఁ గూరుచుండును! నేనిప్పుడు కబురంపఁదలఁచి మీరెవ్వరైన వచ్చిన బాగుగ నుండునని యనుకొనుచున్నాను. ఇంతలో నీవు వచ్చితివి! అమ్మా! నీకు దీర్ఘాయుష్యమున్నది!" అనియెను.

లలిత తనమనసులో నీమాటను వెలువరించుట కారంభించి "సోదరీ! సుచరితా! మనసమీపమున స్త్రీలకొఱకొక కళాశాలను నిర్మించుట యెట్లు?" అని ప్రశ్నించెను. ఆమాటకు హారిమోహిని తెల్లపోయి "మీరు విద్యాశాల స్థాపించి యేమిచేయుదురు?" అనియెను.

సుచ—సోదరీ! అంతపని మన మెట్లు చేయఁగలము? మనకు సాయము చేయువారెవ్వరు? నాయనగారి నడిగితివా ?

లలి—మనమిరువురము నుపాధ్యాయినులుగా నుండి పనిచేయఁగలము! పెద్దక్క కూడ దీని నంగీకరించు ననుకొనియెదను!

సుచ—ఒక్క చదువుచెప్పుటతోనే తీరదు. పాఠశాలను క్రమముగ నడపు పద్ధతుల నెఱుంగవలయును. తగినగృహమును సంపాదింపవలయును. చదువుకొనుబిడ్డలను సంగ్రహింపవలయును. మూలధనమును జేర్చవలయును. ఇది యంతయు నాఁడువాండ్రమగు మనము చేయఁగలమా ?

లలి—అక్కా! ఇట్లు చెప్పినచో జరుగదు! ఆఁడువాండ్రమని చెప్పి మనను బిగియఁబట్టుకొని మందిరమధ్యమున మడఁగి యుండవలసినదా? జగదుపకారక మగు పని యేమియుఁ జేయనక్కఱలేదా ?

లలిత మాటలలోనివేదన సుచరితహృదయమధ్యమున ధ్వనించుచుండెను. ఆమె యేమియు బదులుచెప్పక యోచించుచుండెను. అప్పుడు లలిత "మనయిరుగు పొరుగుల పేటలో బాలిక లున్నారు. వారికి మనము చదువు చెప్పెద మన్నచో వారితల్లిదండ్రులు లానందించెదరు. అట్టిబిడ్డలను జేర్చుకొని మనయింటనే చదివింపవచ్చును! దీనికి ధనసహాయమేల?" అనియెను.

ఎవ్వరో యెఱుఁగనిపిల్లలను దెచ్చి యీయింటియందుఁ జదివింతురనుమాట విని హారిమోహిని యుద్విగ్నయైపోయెను. ఆమె యీయింటఁ బరిశుద్ధాచారముతో గోపాలదేవార్చనను చేసికొనఁదలఁచి యుండెను. దానికి విఘాతము కలుగునని యామె వారికోరికను నిరాకరింపఁదొడంగెను. అందుపై సుచరిత "దొడ్డమ్మా! భయములేదు మేము పిల్లలను క్రిందిగదిలో నుంచి చదివించుకొనుచుందుము. నీమేడమీదిగది కట్టియుత్పాతమును గలుగదు—సోదరీ! లలితా! ఎవ్వరైనఁ బిల్లలు చదువుకొనుటకు లభించినచో నట్లే చేయుదుము!" అనియెను.

లలి—మంచిది. ప్రయత్నించి చూతము !

వారి—అమ్మా ! మీ రెల్లవిషయములందును గిరస్తానీలవలెఁ బ్రవర్తించెద రేమి? గృహస్థరమణులు బడిచదువు చెప్పుట నాతండ్రితాతలనాఁ డెన్నఁడును నేను విని యుండలేదు !

పరేశునిమేడమీఁది యాఁడువాండ్రకును, నిరుగుపొరుగు మేడలమీఁది యాఁడువాండ్రకును బరస్పరసంభాషణ పరిచయమున్నది. కాని పరేశునియింటి యాఁడుబిడ్డలకు వయసువచ్చినను బెండ్లికాకుండుటంగూర్చి పొరుగువారందఱును వింతగాఁ జెప్పుకొనుచుండిరి. అందుచే లలిత వారితో నంతగా మాటాడుట మానివైచెను. లావణ్యయొక్కతె మాత్రమే తఱచుగా మాటాడుచుండును. ఇరుగు పొరుగు సంగతులం దెలిసికొనుట యందామె కెక్కుఁ గుతూహలము మెండు! పొరుగిండ్లయందలి ప్రధానాప్రధానవిషయము లన్నియు నిట్లోవచ్చి యామె చెవులఁ బడుచుండును. ఆమె దువ్వెనతోఁ దల దువ్వుకొనుచు సాయంకాలమున మేడమీఁద సభ సాగించుచుండును.

బడిపిల్లలను సమకూర్చుభారము లలిత, లావణ్యపైఁ బెట్టెను. లావణ్య మేడమీఁదనుండియే యందఱను బిలిచెను. చాలమంది పిల్లలనుత్సాహముతోఁ జేర్చుట కనుమతించిరి. లలిత సంతోషముతో సుచరితయింటియం దొకగదిని బాగుచేయించి సిద్ధముగా నుంచెను. కాని యాగది శూన్యముగనే యుండెను. తమపిల్లలను బ్రాహ్మగృహంబులకుఁ బంపుటకు గృహయజమాను లంగీకరింపరైరి. ఇంతేకాక వారు తమ యాఁడువాండ్రను బరేశునింటియాఁడువాండ్రతో సంభాషింపకుండ నిర్బంధించివైచిరి. అంతేకాని వారిసత్సంకల్పములను మన్నింపరైరి. లావణ్య కిఁక మేడమీఁది కెక్కి పొరుగువారితో ముచ్చటలాడుట కవకాశము తప్పిపోయెను.

అట్లయినను లలిత తనపట్టు వదలక "చాలమంది పేదలగుబ్రాహ్మబాలికలకు దొరతనమువారి బాలికాపాఠశాలలోఁ జదువుట యసాధ్యముగా నున్నది. వారికిఁ జదువుచెప్పుభారము వహించినచో నుపకారముగా నుండును." అని యావిషయమునం దామె స్వయముగాఁ బ్రయత్నించుటయే కాక సుధీరునిఁగూడ నియోగించెను.

ఆకాలమునఁ బరేశునిబిడ్డలపై దువ్యము చాలవఱకుఁ బ్రసిద్ధమై యుండెను. ఆకీర్తి సత్యలోకమునుగూడ దాఁటిపోయెను. అట్టివారు జీతము గైకొనకుండ జదువుఁ జెప్పెదరని విని చాలమంది తల్లిదండ్రులు సంతోషించిరి. మొదట రెండుమూఁడు దినములలోనే యైదారుగురుపిల్లలు చేరిరి. పరేశునితోఁగలసి పాఠశాలనుగూర్చి యాలోచించుటతోడను, దీనికి నియమముల నేర్పఱచుటతోడను, నిది వృద్ధియగుమార్గము లరయుటతోడను లలిత కొకనిమిషమైనఁ దెరపి లేకుండెను. పాఠశాల క్రమముగా వర్ధిల్లుచుండెను. సంవత్సర మయ్యెను. పరీక్షాంతమునఁ బిల్లల కిచ్చుబహుమానవిషయ

మున లలితాలావణ్యములకు వాదము జరిగెను. ఆమె చెప్పినపుస్తకము లీమెకు నచ్చలేదు; ఈమె యుద్దేశించిన పుస్తకముల నామె యంగీకరింపలేదు. పరీక్షకులను నిర్ణయించుటలోఁ గూడ వాదము జరిగెను. లావణ్యకు హారానుని యందంతగా నిష్టము లేకున్నను నాతని పాండిత్యమునందు గౌరవ మున్నది. అట్టివాఁడు తమపాఠశాలకుఁ బరీక్షకుఁ డైనచో గౌరవముగా నుండునని యామె యుద్దేశము. కాని లలిత హారానునకీవిద్యాలయముతో నెట్టిసంబంధముం గల్పించుటకు నిష్టపడలేదు.

రెండుమూఁడుదినములలోనే బడిపిల్లలరాక తగ్గిపోయెను. లలిత కట్టిబడిలోఁ గూర్చుండి యనుగుచప్పు డైనప్పు డెల్ల నదరిపడి చూచుచుండెను. రెండుజాములైనను నెవ్వరును రాలేదు. ఏదో గోల పుట్టిన దని యామె యనుకొని సమీపమందున్న యొకబడిపిల్లయింటికిఁ బోయెను. ఆమె యేడ్చుచు "అమ్మా! నన్ను బడికి రానిచ్చుట లేదు. అచ్చటికిఁ బోఁగూడ దని మాయమ్మ చెప్పినది. కారణము చెప్పలేదు!" అనియెను. లలిత యభిమానవతి. ఒరులకుఁ గష్టముగా నున్నట్లు గ్రహించినచో దానికిఁ గారణ మరయఁజాలదు! ఆమె యాబాలికం గాంచి "అమ్మా! పోఁగూడ దని చెప్పినప్పుడు నీవేమి చేయుదువు?" అని చెప్పి మఱియొకయింటికిఁ బోయెను. అప్పుడాయింటివారు "సుచరిత హిందువై జాతిభేదమును పాటించుచున్నది! ఆయింట విగ్రహారాధనముకూడ జరుగుచున్నది!" అని చెప్పిరి. "అది మీకిష్టములేకున్నచో బడి మాయింటికి మార్చెదను!" అని లలిత చెప్పెను. కాని యంతమాత్రముచే నంగీకారము కుదురలేదు. ఇంకను సంశయముగనే యుండెను. లలిత మఱియొకగృహమునకేఁగి సుధీరునిం బిలిచి "సుధీరా! దీనికిఁ గారణమేమో సత్యముగఁ జెప్పెదవా?" అని యడిగెను.

సుధీ—పానూబాబు మీకు విరుద్ధముగ నున్నాఁడు!

లలి—సుచరితయింట దేవపూజ యగుచున్నదనియేనా?

సుధీ—అంతే కాదు!

లలి—ఇంక నేమున్నదో చెప్పఁగూడదా?

సుధీ—చాలసంగతు లున్నవి.

లలి—నన్నుఁగూర్చికూడ నేమైన సంశయ మున్నదా?

సుధీరుఁ డూరకుండెను. లలిత మొగమెఱ్ఱచేసికొని "నా స్టీమరు ప్రయాణమున కిది శాస్తియా? తప్పుపని చేసియేయున్నచో మంచిపనిచేసి ప్రాయశ్చిత్తమును గూర్చుపద్ధతి మనసమాజ మెంతమాత్రము నెఱుఁగదు. నేను చేయుసత్కర్మములుకూడ నీసమాజమునకు నిషిద్ధములేనా? నాకును, సమాజమునకును నాధ్యాత్మికోన్నతికై మీరొనరించుపద్ధతు లివియేనా?" అనియెను.

సుధీ—అందుకో అట్లు గాదు. వినయబాబున కీవిద్యాలయముతో సంబంధము కలుగునేమో యని వారిభయము!

లలిత నిలువున మండిపడుచు "అది భయము కాదు! భాగ్యమే! యోగ్యతచే వినయబాబుతో సమానులగువారీసమాజమునం దెందఱున్నారు?" అనియెను. సుధీరుఁడు లలితకోపముం గాంచి సంకుచితుఁడై "ఆమాటనిజమే—కాని వినయబాబు—" అనియెను.

లలి—అతఁడు బ్రహ్మసామాజికుఁడు గాఁడు. అందుచే బ్రహ్మసమాజమాతని శిక్షించుచున్నదా? ఇట్టిసమాజమునందు నాకించుకంతయు గౌరవ మగపడుటలేదు.

సుచరిత బడిపిల్లలు రాకుండుటకుఁ గారణమును దెలిసికొని యేమియు నావిషయమున మాటాడక మేడమీఁదఁ గూర్చుండి సతీశునకు రాఁబోవుపరీక్షాపాఠములను బోధించుచుండెను. లలిత సుచరితయొద్దకుఁ బోయి "అక్కా! అంతయును వింటివా?" అనియెను. సుచరిత చిఱునవ్వుతో "వినలేదుగాని యంతయుఁ దెలిసినది!'' అనియెను.

లలి—ఇది యంతయు మనము సహింపవలసినదేనా?

సుచ—సహించినచో నవమాన మేమియు లేదు. తండ్రిగారన్నిటికి నెట్లు సహించియుందురో నీవు చూచుటలేదా?

లలి—సహించియూరకున్నచో నన్యాయము నంగీకరించినట్లగునని నాయుద్దేశము. అన్యాయమును సహింపకుండుటయే యుచితకృత్యమని నేననుకొనియెదను!

సుచ—అయినచో నీవిప్పుడేమి చేయఁదలఁచితివో చెప్పుము!

లలి—ఆవిషయమున నింకను నేనించుకంతయు నాలోచించుకొనలేదు. ఏమి చేయఁజాలుదునో నేనెఱుంగను. కాని, యేదో ప్రతీకారము చేసితీరవలయును. మనవంటియాఁడువాండ్రయెడల నీచోద్దేశములు కలవారు తామెంతగొప్పవారనుకొనుచున్నను నయోగ్యులే. వారిని నేనెంతమాత్రమును లక్ష్యముచేయను! వారేమిచేయఁగలరో చూతము!

అని లలిత భూభాగమునఁ బదాఘాతముం గావించెను. సుచరిత యేమియు మాటాడక లలితచేతులను బట్టుకొని కొంతసేపైనతరువాత "లలితా! ఒకసారి తండ్రిగారితో మాటాడి చూడుము!" అనియెను. లలిత చటాలునలేచి "నేనిప్పుడే యాయనకడకుఁ బోయెదను.'' అని బయలుదేఱెను. ఆమె ద్వారమునొద్దకుఁ బోవునప్పటికి వినయుఁడు తలవంచుకొని వీధినుండివచ్చుచు లలితం గాంచి యదరిపడినిలిచిపోయెను. లలితతో నెట్లు మాటాడవలయునో యాతనికిఁ దోఁచుటలేదు. కాని యాతఁడు మనసు దిటువుపఱచుకొని యామె ముఖమువంకఁ జూడకుండ నొకనమస్కారముం గావించి పెడముఖము పెట్టుకొని వెడలిపోయెను. లలిత కది తప్తలోహశలాకతోఁ గాల్చినట్లుండెను. ఆమె యతివేగముతో నింటికిఁబోయెను.

అప్పుడు వరదాసుందరి జమాఖర్చులెక్కలను జూచుకొనుచుండెను. ఆమె లలితమొగము గాంచి నివ్వెఱపడియెను గాని లెక్కపుస్తకములనుండి దృష్టిని మరలించుట యామెకుఁ గష్టముగానుండెను. ఒక్కయంకె తప్పినచోఁ గొంపమునిఁగిపోవునని యామెభయము! లలిత యొకకుర్చీనిలాగికొని యామెపల్లచెంతఁ గూర్చుండెను. అప్పటికిని వరదాసుందరి మొగమెత్తకుండుటచే లలిత 'అమ్మా!' అని పిలిచెను.

వర—చూచుచుండు మమ్మా! నేను పనిలో నున్నాను.

లలి—అమ్మా! నేను నీకాలమును వ్యర్థము చేయను. ఒక్కమాట యడిగెదను. వినయబాబిచ్చటికి వచ్చినాఁడా?

వరదాసుందరి లెక్కలనుండి దృష్టి మరలింపకయే 'వచ్చినాఁడు!' అనియెను.

లలి—అతనితో నీవు మాటాడితివా?

వర—చాలసంగతులు మాటాడితిని.

లలి—నామాట యేమైన వచ్చినదా?

వరదాసుందరి యిఁక మాటాడక తప్పదని యెంచి "అమ్మా! నీమాటయును వచ్చినది. క్రమముగా నందరగోళమగుచుండుటయు, సమాజమునందపకీర్తికలుగుటయు నాలోచించి యందులకుఁ దగిన యేర్పాటు చేయవలసివచ్చినది!" అనియెను. లజ్జచే లలిత మొగమెఱ్ఱనయ్యెను. ఆమెతల తిరిగిపోవుచుండెను. అప్పుడు లలిత "అమ్మా! తండ్రిగారు వినయబాబు నిచ్చటికి రావలదనిరా?" అని ప్రశ్నించెను.

వర—ఆయన కీగొడవ యంతయుఁ గానవలెనా? అట్లయినచో మొదటనుండియు బాగుగనే యుండును!

లలి—పానూబాబు మనయింటికి వచ్చుచుండునా?

వర—(ఆశ్చర్యముతో) అదియేమే! పానూబాబు రాకేమి?

లలి—వినయబాబు మాత్రమేల రాఁగూడదు?

వరదాసుందరి మరల లెక్కలఁ జూచుకొన నారంభించి "లలితా! నేను నీతో జాలలేనే! నాయొడలు మండింపకుము! నాకుఁ జాలఁగఁ బనియున్నది!" అనియెను.

లలిత సుచరితయింటికిఁ బోయినప్పుడు వరదాసుందరి వినయునిఁ బిలిపించి యాతనితోఁ జెప్పవలసినదంతయుఁ జెప్పివైచెను. లలిత కీసంగతి తెలియదనియే యామె యనుకొనియెను. కాని యాకస్మికముగ నింతలోనే తెలిసిపోవుట యామెకుఁ గష్టముగా నుండెను. ఇది చల్లగాఁ బరిణమించదనియు, దీనికి సామాన్యముగా నిష్కృతి లేదనియు నామె యనుకొనియెను. అప్పుడామెకోపమంతయు నవివేచకుఁ డగు మగనిపై బడియెను. ఇంతటియజ్ఞానితోఁ గాఁపురము చేయుట యాఁడుదానికిఁ గష్టమని యామెకుఁ దోఁచెను. లలిత హృదయమున ప్రపూర్ణమగు ప్రళయఝంఝూమారుతమును వహిం

చుకొని క్రిందిగదిలో నుత్తరము వ్రాసికొనుచున్న తండ్రియొద్దకుఁ బోయి "బాబా ! వినయబాబు మనతోఁ గలిసి యుండుటకుఁ దగినంతయోగ్యుఁడు కాఁడా ?" అని ప్రశ్నించెను.

ఆప్రశ్ననుబట్టి పరేశుఁడు సర్వమును గ్రహించెను. తన కుటుంబమునుగూర్చి సమాజమునం గలుగుచున్న యాందోళన మాతనికిఁ దెలియకపోలేదు ! ఈవిషయమై యాతఁడు చాలవఱ కాలోచించుచునే యుండెను ! వినయునియెడల లలిత మనోభావముఁగూర్చి తనకు సంశయము కలుగకున్నచో నాతఁడితరులమాటలను జెవిని బెట్టువాఁడు కాఁడు కాని లలితకు వినయునియం దనురాగమే కలిగినచో నప్పుడేమి చేయవలసి యుండునని పరేశుఁడు మాటిమాటికిని బ్రశ్నించుకొనుచుండెను. ప్రత్యక్షముగ బ్రాహ్మధర్మదీక్షం గైకొన్నవెనుక నిన్నాళ్ళ కాతనికుటుంబమునం దిట్టిచిక్కు తటస్థించెను. అందుచే నొకవంక నాతనిహృదయమున భయమును, గష్టమును బాధించుచుండెను. మఱియొకవంక నాతఁడు తనమనశ్శక్తి నంతను జాగరితముగఁ జేసికొని "నేను ధర్మదీక్ష గైకొనుసమయమున నొక్కదేవునియందే దృష్టి నుంచి కఠినపరీక్షయం దుత్తీర్ణుఁడ నైతిని. సుఖము, సంపత్తి, సమాజము మొదలగువానికంటె సత్యమే ప్రధానమైనదని యెంచి నాజీవితమును ధన్యముగఁ జేసికొంటిని. అట్టి పరీక్షాసమయమగు నిప్పుడుకూడ, నేనాయీశ్వరునియందే లక్ష్యముంచి యుత్తీర్ణుఁడనయ్యెదను" అని నిశ్చయించుకొనుచుండెను. అప్పుడాతఁడు లలితప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగా "అమ్మా! వినయుఁడు చాల మంచివాఁడనియే నాయుద్దేశము ! అతఁ డెంతటిబుద్ధిమంతుఁడో యంతటి విమలచరిత్రుఁడు !" అనియెను.

లలిత యించుకసేపూరకుండి "బాబా! గోరాబాబుతల్లి మొన్న మనయింటికి వచ్చినది. సోదరిసుచరితతోఁ గలసి నేనొకసారి యామెయొద్దకుఁ బోవుదునా ?" అని యడిగెను.

పరేశుఁ డొక్కింతసేపటివఱకును బదులు చెప్పఁజాలకపోయెను. ప్రస్తుత మిట్టి రాకపోకలవలన నపవాదములు ప్రబలిపోవు నని యాతఁ డూహించెను. కాని యీ పని యన్యాయము కానప్పుడు నిషేధించుట యేటికని యాతని యంతరాత్మ బోధించుచుండెను. అందుచే నాతఁడు "అమ్మా ! మంచిది. పోవచ్చును. నాకుఁ బనియున్నది కాని లేకున్నచో నేనుకూడ మీతో వచ్చియే యుందును !" అనియెను.

## ౬౮

వినయుఁ డిన్నాళ్ళనుండియు నలక్షితలెను, నాత్మీయునివలెను నిశ్చింతగా వచ్చుచుఁ బోవుచున్నస్థలమునందు సమాజసంబంధ మగునగ్నిపర్వతము పగిలి మండునని కలలోనైన ననుకొనలేదు. పరేశుని కుటుంబముతోఁ గలియుట యాతనికి మొట్

మొదట సంకోచముగనే యుండెను. అటు నెంతకాలమునకుఁ జనవు చూపవచ్చునో తెలియక యాతఁ డెప్పుడును భయపడుచుండెడివాఁడు! క్రమముగా నాసంశయము వదలుటే కాక యెట్టి భయాశంకయు లేకుండఁ బోయెను. ఇప్పు డాకస్మికముగాఁ దన మూలమున లలితకు నింద కలుగుచున్న దని విని యాతనితలపైఁ బిడుగు పడినట్లుండెను. లలితయెడల నాతని హృదయసంబంధము సాధారణస్నేహభావమును మించి యుండెను. తామిరువురు నొక్కసమాజమువారు కానప్పుడు తన కట్టికోరిక యుండుట తప్పే యని వినయుఁ డెఱుంగును. అందుచేతనే యీవిషయమున నందరికంటెను వినయునిహృదయము క్షోభించుచుండెను. తా నాయింటియందు విశ్వాసము గలయతిథివలెనే యుచితముగ వర్తించుట లేదనియు నొక్కవిషయమునఁ గపటముగా నుంటి ననియు, నెప్పటికైనఁ దనమనోభావము వెల్లడియైనచో లజ్జాకరముగా నుండు ననియు నాతఁ డెన్నియోసారులు భావించుకొనుచుండెను.

ఇట్లుండ నొకనాఁటిమధ్యాహ్నమున వరదాసుందరి వినయునిం బిలిపించి "వినయబాబూ! నీది హిందూమతముకాదా?" అనియెను.

విన—ఔను.

వర—నీవామతమును విడువఁజాలవుకాదా?

విన—అసంభవము!

వర—అట్లయినచో—యెందుచేత—

ఆమాటకు వినయునకుఁ బ్రత్యుత్తరము తోఁచలేదు. ఆతఁ డొక్కసారిగఁ దలవంచుకొని కూర్చుండెను. తాను దొరికిపోయితి ననియు, సూర్యచంద్రవాయువులకడఁ గూడ రహస్యముగ నుంచిన తనహృదయము బయలుపడిపోయిన దనియు గ్రహించెను. పరేశబాబు లేమనుకొనునో, లలిత యేమని భావించునో, సుచరిత యేమని తలంచునో యని యాతనికి మనోవేదన కలిగెను. స్వర్గమునుండి వచ్చినదేవదూతగా నాతఁ డింతవఱకును గౌరవింపఁబడుచుండెను. అట్టి యధికారపరివేశమువలన లజ్జితుఁడై యాతఁ డప్పు డటునుండి తొలఁగిపోవలసిన వాఁ డయ్యెను.

అట్లు పోవుచున్నప్పుడే ప్రప్రథమమున సుచరితయింటియొద్ద లలిత యాతనిఁ గంటఁ బడియెను. అప్పు డాతఁడు లలితయెదుటఁ దనయుపచారము నంగీకరించి తన పూర్వపరిచయమునకుఁ బ్రతిగ సమాధానముం గావించి కడపటిసెలవు గైకొనవలయు నని తలంచెను. కాని యందుల కేమిచేయవలయునో యాతనికిఁ దోఁచలేదు. అందుచేతనే లలిత మొగమువంక నెనంజూడక యొకనమస్కారముం గావించి యాతఁడు వెడలిపోయెను.

ఆతఁ డిదివఱకును బరేశునికుటుంబమునకు వేఱుగనే యుండెను. ఇప్పుడు నట్లే యుండెను. కాని యింతభేదమేమి? ఈ యేర్పాటిప్పు డింతశూన్యముగ నున్నదేమి? ఆతనిపూర్వజీవితమున కెట్టిలోపమును గలుగలేదు! ఆతనిగోరా యున్నాఁడు! ఆనందమయి యున్నది! కాని యాతఁడిప్పుడు నీటినుండి వెలువడినచేఁపవలెనుండెను. ఎవరిఁ జూచిన నెచ్చటను జీవితావలంబనము దొరకుటలేదు. సౌధసంకులములును, జనాకీర్ణములునగు నానగరరాజవీధుల నంతటను వినయుఁడు తనజీవితసంబంధ మగుపాండుచ్ఛాయామయవినాశనచిహ్నముగనే తిలకించుచుండెను. విశ్వవ్యాప్తమగునట్టి శుష్కత్వమును శూన్యత్వమును నాతని కాశ్చర్యము గల్పించుచుండెను. ఎందులకిట్లయ్యెనో యెప్పు డిట్లయ్యెనో, యేమిచేయుటచే నిట్లయ్యెనో యని యాతఁడు హృదయహీనంబును, నిరుత్తరంబు నగుశూన్యము నెదుట మాటిమాటికిని బ్రశ్నింపఁదొడంగెను.

"వినయబాబూ! వినయబాబూ!"

వినయుఁడు వెనుదిరిగి చూచెను. ఎదుట సతీశుఁడు! వినయుఁ డాతనిఁ గౌఁగిలించుకొని "ఏమిసోదరా! ఏమిమిత్రమా!" అనియెను. వినయునికంఠస్వర మశ్రుపూర్ణమైనట్లుండెను. పరేశునింటియం దీబాలకుఁ డెట్టియానందమాధుర్యముం గూర్చెనో వినయుఁ డిప్పు డనుభవించిన ట్లెప్పుడు ననుభవింపలేదు.

సతీ—నీవు మా క్రొత్తయింటికి వచ్చుటలేదేమి? అక్క లావణ్యయు లలితయు నేఁడిక్కడ భుజింతురు. దొడ్డమ్మ నిన్నుఁ గూడ బిలుచుకొని రమ్మన్నది!

విన—బాబూ దొడ్డమ్మకు వందనము నిచెప్పుము! కాని నేనచ్చటికి రాఁజాలను.

సతీశుఁడు సానునయంబుగ వినయునిచేయి పట్టుకొని "ఏల రావు! తప్పక రావలయును నిన్ను విడువను" అనియెను.

సతీశుఁ డింతపట్టుపట్టుటకుఁ గారణము లేకపోలేదు. బడిలో వావును గూర్చి యాతనిచే నొకవ్యాసమును వ్రాయించిరి. అరవయం దేఁబదింటికి నలుబదిమార్కు లాతనికి వచ్చెను. దానిని వినయునకుఁ జూపవలయునని యాతని కోరిక! వినయుఁడు విద్వాంసుఁడనియు నాతనివంటి రసజ్ఞుఁ డొక్కఁడే తనలేఖకు మూల్యమును గట్టఁగలఁ డనియు నాతని యభిప్రాయము. ఆతఁడు దానిని మెచ్చుకొనునప్పుడు లీల కూడ నుండును గావున నామె యిఁక నెన్నఁడును దన్నుఁ దిరస్కరింపదని సతీశుని యుద్దేశము! అందుచే సతీశుఁడే దొడ్డమ్మకు వినయుని భోజనమునకుఁ బిలుచునట్లు చేసెను. వినయుఁడు తనలేఖను బ్రశంసించుట తనయక్కలుకూడ వినుదురుగదా యని సతీశుని యభిలాష! వినయుఁ డెంతపిలిచినను రాననుటతో సతీశుఁడు బలవంతపెట్టెను. వినయుఁ డాతనిం గౌఁగిలించుకొని "బాబూ! నీవు మాయింటికి రమ్ము" అనియెను. తాను వ్రాసినకాగితము తనజేబులోనే యుండుటచే సతీశుఁడు వినయుని యాహ్వానమును

దోసివేయలేదు. క్రీగంటఁ దగునా బాలుఁ డాసన్నపరీక్షాసమయమునకైన లక్ష్యము చేయక వినయునియింటికిఁ బోయెను.

వినయుఁడు సతీశునిలేఖ నంతయుఁ జదివి మిగులఁ బ్రశంసించుటయే కాక బజారులో నాతనికి భక్ష్యములను గొనిపెట్టి యాతనియింటివఱకును దీసికొనిపోయి యనావశ్యకంబగువ్యాకులస్వరముతో "సతీశబాబూ! ఇఁక నేను పోయెదను" అనియెను. సతీశుఁ డాతనిచేయి పట్టుకొని లోనికి రమ్మని బలవంతము చేసెను. కాని వినయుఁడు పోలేదు.

స్వప్నవిష్టునింబోలి తూలుచు నాతఁ డానందమయియింటికిం బోయెను గాని, యామెను దర్శింపఁజాలక మేడమీఁద నిర్జనం బగుగోరాపడకగదిలోఁ బ్రవేశించెను. ఆగదియం దాతనిబాల్యబంధుత్వముం గాంచిన సుఖమయంబులగు రేయింబవళ్ళెన్నియో గడచినవి! ఎన్నియో యానందాలాపములు; ఎన్నియో సంకల్పములు; ఎన్నియో గభీరాలోచనములు; ఎన్నియో ప్రణయకలహములు; ఎన్నియో ప్రణయకలహప్రశమనసుధాపూర్ణావసానములు!—అట్టి పూర్వజీవితమధ్యమున నట్లే తన్నుఁదాను మఱచి యుండవలయునని వినయునివాంఛ! కాని మధ్యస్థలమునఁ గొన్నాళ్లనుండి యీనూతనపరిచయము మార్గనిరోధముం గావించెను. జీవితకేంద్ర మెప్పుడు చెదరిపోయెనో, సంకీర్ణపథమునం దెప్పుడు పరివర్తనము సంఘటిల్లెనో వినయుఁ డిన్నాళ్లవఱకును స్పష్టముగా గ్రహింపలేదు. ఎట్టిసంశయమును లేనియీసమయమునం దాతఁడు భయపడి పోవుచుండెను.

ఆరవైచినవస్త్రమును దీసికొనుటకై యానందమయి మేడమీఁదికివచ్చి గోరా గదిలో నున్నవినయునిం గాంచి యాశ్చర్యముతో "ఏమిబాబూ! ఇట్లున్నావేమి?! మొగమిట్లు వాఁడిపోయిన దేమి?" అనియెను. వినయుఁడు లేచి కూర్చుండి "అమ్మా నేను మొట్టమొదటఁ బరేశునింటికిఁ బోవుచున్నప్పుడు గోరా కోపపడుచుండెను. నే నాకోపము నన్యాయముగా భావించితిని. కాని యన్యాయ మాతనిది కాదు నా మందమతిదే!" అనియెను. ఆనందమయి నవ్వుచు "నీవు మహాబుద్ధిమంతుఁడ వైనవాఁడ వని నే ననుటలేదు. కాని యిప్పుడు నీబుద్ధిదోష మెట్లు బయలుపడినది?" అనియెను.

విన—అమ్మా! నేను నాసమాజమును ద్యజించితి నని యొక్కసారియైనను భావించుకొనలేదు. వారిస్నేహము వారితోడికలయికయును నాకానందముగను, నుపకారముగను భావించి వారిచే నాకర్షింపఁబడిపోయితిని. నాకితర చింతయే లేకుండఁబోయినది.

ఆనం—నీకే కాదు. నీమాట వినుచున్న నాకును నేరుండఁ బోయినది!

విన—నామూలమున వారిసమాజమునం దొకవిధమగు నశాంతి కలిగినది. లోకు లందఱు నెట్లు నిందించుచుండిరనగా నేనిఁక నటకుఁ బోవుటకైన—

ఆసం—గోరా యొకప్పుడు చెప్పినమాట నాకు సత్యముగఁ దోఁచుచున్నది. లోపల నన్యాయముండి పైకి న్యాయముగాఁ గనఁబడునది యన్నిటికంటె నపాయకరమైన దని గోరా చెప్పియుండెను. బాబూ! వారిసమాజమునం దశాంతికలిగిన దని నీ వేల పరితపింపవలయును? నీవు నీవ్యవహారమున సత్యముగా నుండినం జాలును.

ఇచ్చటనే వినయునకు సందిగ్ధముగా నుండెను. తన ప్రవర్తన మభినందనీయమగునో కాదో యాతఁడు నిశ్చయించుకొనఁజాలకుండెను. పరమతస్థురా లగులలితను పెండ్లియాడుటకు నవకాశములేనప్పుడా మెయెడల ననురాగము కలిగియుండుట గూఢపాపమని యాతఁడు ఖేదపడుచుండెను. ఆపాపమునకు దారుణప్రాయశ్చిత్తసమయమాసన్నమైనట్లు గ్రహించి యాతఁడు క్షోభపడుచుండెను. అప్పుడు వినయుఁ డాకస్మికముగా "అమ్మా! శశిముఖిని నాకుఁ బెండ్లిచేయుట కేర్పాటైనదిగదా! అదిత్వరలో జరిగిన బాగుగా నుండును! నాకుచితమగుత్రోవన నేను బద్ధుఁడనైయుండి యెట్లును విడివడుట కవకాశము లేనివాఁడనై యుండుటే మంచిది" అనియెను. ఆనందమయి నవ్వుచు "అవుగా శశిముఖిని సహధర్మిణిఁగాఁ జేసికొనకపోయినను సంకెలగాఁ జేసికొందువు కాఁబోలును! ఆహా! శశిముఖి కెంతయదృష్టము." అనియెను.

ఇంతలో సేవకుఁడువచ్చి "పరేశునింటినుండి యిరువురుస్త్రీలు వచ్చినారు" అని చెప్పెను. ఆమాటవిని వినయునిగుండె గుభిల్లుమనియెను. వినయుని జాగ్రత్తగ నుంచుమని చెప్పుటకై వారానందమయియొద్దకు వచ్చియుందు రని యాతనికిఁ దోఁచెను. ఆతఁడు చటాలునలేచి "అమ్మా! నేను పోయెదను!" అనియెను. ఆనందమయి లేచి యాతనిచేయి పట్టుకొని "ఇల్లు విడిచి పోవలదు! క్రిందిగదిలో వేచియుండుము!" అనియెను.

వినయుఁడు క్రిందికిఁ బోవుచు "వీరితో నేకఁబనిలేదు. అయిన నేమో యైనది. ఇక వచ్చినను నేనచ్చటికిఁ బోఁజాలను. అపరాధమునకు శాస్తి యగ్నిజ్వాలవలెఁ బ్రజ్వరిల్లినప్పుడది యపరాధి దగ్ధుఁడైపోయినను జల్లారదు!" అని యనుకొనియెను. వినయుఁడు గోరావీధిగదిలోఁ బ్రవేశించునప్పటికి మహిముఁడు తనపెద్దపొట్టమీఁది కోటుబొత్తములను సడలించుకొనుచుఁ గచేరినుండి యింటికి వచ్చుచు వినయునిచేయి పట్టుకొని "ఇదిగో! వినయబాబు! మంచిది! నేను నీకొఱకే చూచుచున్నాను!" అని చెప్పి యాతని గదిలోనికిఁ గొనిపోయి కుర్చీపైఁ గూర్చుండఁజేసి జేబులోనిడబ్బీనుండి తాంబూలమును దీసి యాతనికిచ్చి తాను హుక్కానుదెప్పించుకొని పీల్చుచు "వినయబాబూ! ఆవిషయమై యేమాలోచించితివి? ఇంకను—" అనియెను.

వినయునిభావము మనుపటికంటె సుముఖముగా నున్నట్లు మహిముఁడు గ్రహించెను. వినయుఁడుత్సాహములో నుండుటే కాక మిషపెట్టి తప్పించుకొనిపోవునట్లుగపడ

లేదు. మహిముఁ డప్పుడే స్థిరపఱచుకొనవలయునని నిశ్చయించెను. అప్పుడు వినయుఁడు "గోరా యింకను రాలేదుగదా!" అనియెను. మహిముఁ డించుక యూఱట నంది "అతడు త్వరలో నేవచ్చును! వినయబాబూ! ఫలహార మేమైనఁ దెప్పింతునా? అది యేమి నీమొగ మంతగా వాఁడిపోయినది? అసౌఖ్యముగ లేదుగదా!" అనియెను.

వినయుఁడు ఫలహార మక్కఱ లేదనుటచే మహిముఁడు తన క్షున్నివారణము చేసికొనుటకై లోనికిఁ బోయెను. వినయుఁ డప్పుడు గోరాబల్లపై నున్నయొకపుస్తకమును దీసి పుటలను దిరుగవైచుచుండెను. పిమ్మట నాతఁ డాపుస్తకము నెప్పటివలె నుంచి గదిలో నిటునటుఁ బ్రచారము చేయుచుండెను. ఇంతలో సేవకుఁడు వచ్చి "వినయబాబూ! అమ్మగారు పిలుచుచున్నారు!" అని చెప్పెను.

విన—ఎవ్వరినిఁ బిలుచుచున్నారు?

సేవ—మిమ్ములనే.

విన—వారందఱు నున్నారా?

సేవ—ఉన్నారు.

బడికిఁ బోవుపిల్లవానివలె వినయుఁడు మేడమీఁదికిఁ బోయి గదిగుమ్మముకడ నిలిచి సంశయించుచుండగా సుచరిత యెప్పటి సహజసౌహార్దమధురకంఠస్వరముతో "వినయబాబూ! రమ్మ!" అనియెను. వినయున కామాట యవాంఛాలబ్ధమధురతాన్నలె మూజివలెనుండెను. లోపలఁ బ్రవేశించినంతనే వినయుని మొగమువంకఁ జూచి లలితాసుచరిత లాశ్చర్యపడిపోయిరి. ఆకస్మికకఠినాఘాతము ననుభవించుచున్న గ్లానతని ముఖలక్షణములలో గానవచ్చుచుండెను. అతని సహాస్యవదనమండల మాకస్మికముగ మిడుతలగుంపుపడిన సరసశ్యామలసస్యక్షేత్రమువలెనగపడుచుండెను. అప్పుడు లలిత హృదయమునఁ గరుణావేదనలతోఁగూడ నొక్కించుకయానందరేఖకూడఁ బొడకట్టుచుండెను. మఱియొకప్పుడైనచో లలిత శీఘ్రముగా వినయునితో మాటలాడఁజాలక యేయుండును. కాని యిప్పు డామె వినయుఁడు గదిలోఁ బ్రవేశించినంతనే "వినయబాబూ! నీతో మాటాడుటకే మేము వచ్చియుంటిమి!" అనియెను.

వినయునిహృదయమునం దాకస్మికముగ నొకశబ్దభేది యగు నానందబాణము గ్రుచ్చుకొన్నట్లయ్యెను! అతఁ డుల్లాసచకితుఁడైపోయెను. అతనివివర్ణమ్లానవదన మా నిమిషమునందే ప్రదీప్తమైపోయెను.

లలి—వినయబాబూ! మేము కొందఱము కలసి యొకచిన్న బాలికాపాఠశాలను స్థాపింపఁదలచితిమి!

విన—(ఉత్సాహముతో) చాలదినములనుండి నాకును నిట్టియూహయున్నది!

లలి—నీ వీ విషయమున మాకుఁ దోడ్పడవలయును!

విన—నాచేతనైనంతవఱకుఁ జేసెదను. నేనేమి చేయవలయునో చెప్పుము!

లలి—మేము బ్రహ్మసమాజపువార మని హిందువులు మమ్ము విశ్వసించుట లేదు. నీవీ విషయమునఁ బ్రయత్నింపవలయును!

విన—మీరీవిషయమున భయపడవలదు. నే నున్నాను!

ఆనం—అమ్మా! ఆపని యీతఁడు చేయఁగలఁడు! మాటలచే నితరులను వశపఱచుకొనుటలో నీతనితో సమానులు లేరు.

లలి—విద్యాలయకార్యనియమముల నేర్పఱుపవలయును. సమయవిభాగము, తరతమ విభాగము పాఠపుస్తకనిర్ణయము సమస్తమును నీవు చేయవలయును.

వినయున కీపని లెక్కలోనిది కాదు. కాని యాతనికిఁ గలవరముగా నుండెను. వినయునిఁ దనబిడ్డలతోఁ జేరవల దని వరదాసుందరి నిషేధించినట్లు గాని, యీవిషయమున సమాజమునం దపవాదములు బయలుదేఱుచున్నట్లు గాని లలితకుఁ దెలియదా? ఇప్పట్టునఁ దాను లలితకోరిక నంగీకరించినచో నది యామె కనిష్టకారణ మగునేమో యని వినయునిహృదయము బాధపడుచుండెను. లలిత సత్కార్యము చేయుచుఁ దన సాయమును గోరినప్పు డాపని చేయకుండుటయు నాతనికిఁ గష్టముగా నుండెను.

ఈవిషయమున సుచరితకుఁగూడ నాశ్చర్యముగ నుండెను. బాలికాపాఠశాలకు లలిత వినయునిసాయమును గోరు నని యామె కలలోనైన ననుకొనలేదు. వినయునింగూర్చి యిన్ని యపవాదములు పుట్టుచున్న యీసమయమున మరల నీపని యేమి! లలిత యెఱింగియు, వినియుండియు మనఃపూర్వకముగ నిట్లు చేయఁదలంచుటను సుచరిత భయపడియెను. లలితహృదయమున సమాజమునెడల విద్రోహభావముండును గాక! పరాయియగు నీవినయుని నిట్టిచిక్కులలోఁ బెట్టుట యుచితమా? అందుచేత నే సుచరిత యుత్కంఠితయై "ఈవిషయమునఁ దండ్రిగారితో నాలోచింపవలయును. బాలికాపాఠశాలకుఁ బరీక్షాధికారపదమునకై వినయబాబిప్పు డాశపడి యుండలేదు!" అనియెను.

సుచరిత నేర్పుగాఁ బ్రస్తావమును మార్చిన దని వినయుఁడు గ్రహించెను. అందుచే నాతనిహృదయమున మఱియొకయాఘాత మయ్యెను. "ఈపనివలన నెట్టిచిక్కులు కలుగునో సుచరితకుఁ దెలిసినట్లు లలితకును దెలిసియుండవలయును కాని లలిత యాభావము నేల ప్రకటించుటలేదు?" అని వినయుఁ డాలోచించుకొను చుండెను.

లలి—తండ్రిగారితో నాలోచింపవలసినదే. కాని వినయబాబు సమ్మతించినపో నాయనతో మాటాడవచ్చును, ఆయనయెన్నటికి నడ్డముచెప్పరు. ఆయనయును

మన పాఠశాలయం దుండవలయును. (ఆనందమయిం గాంచి) అమ్మా! మీరును మమ్ములను వదలఁగూడదు!

ఆనం—(నవ్వుచు నేను మీపాఠశాలను దుడిచి శుభ్రపఱుపఁగలను! అంతకంటె నేనేమిచేయఁగలను?

విన—అమ్మా! అంతే చాలును! అందుచేఁ బాఠశాల పరమపవిత్రము కాఁగలదు!

లలితాసుచరితలు వెడలిపోయినతరువాత వినయుఁడు కాలినడకతో నుద్యానమునకుఁ బోయెను. అప్పుడు మహిముఁ డానందమయి చెంతకు వచ్చి "అమ్మా! వినయుఁడు చాలవఱకు సమ్మతించిన ట్లున్నాఁడు! కార్యము త్వరలోఁ దీర్చుకొనుట మంచిది. తరువాత బుద్ధి యెట్లు మారునో!" అనియెను. ఆనందమయి విస్మితయై "ఏమనియెదవు? వినయుఁడు వరల సమ్మతించెనా? నాతోఁ జెప్పలేదే" అనియెను.

మహి—ఇప్పుడే నేనాతనితో మాటాడితిని. గోరా వచ్చినంతనే స్థిరపఱచుకొందమని చెప్పినాఁడు!

ఆనం—మహిమా! నీకు లోకజ్ఞానము లేదు.

మహి—నేనెంతమందమతి నైనను స్పష్టవచనములనుగూడఁ దెలిసికొనఁజాలనంతటి పిల్లవాఁడను గాను!

ఆనం—బాబూ! నీకు నామీఁదఁ గోపము కలుగు నని యెఱుఁగుదును. కాని యీమూలమున గోల పుట్టునేమో యని యనుకొనుచున్నాను.

మహి—పుట్టినఁ బుట్టనిమ్మా!

ఆనం—నేను నీతల్లి నగుటచే నంతయు సహించెదను. కాని యశాంతిని సహింపఁజాలను! అట్లుండుట మీబాగుకొఱకే!

మహి—(నిష్ఠురముగా) మాబాగు చూచుకొనుభారము మామీఁదనే యుండనిమ్మా! అట్లయినచో నీవేమాటయు విననక్కఱలేదు! అది మాకును సుఖముగనే యుండును. శశిముఖి పెండ్లి యెట్లో జరగిపోయినచోఁ దరువాత మాబాగు చూచుకొనవచ్చును. ఏమనియెదవు?

ఆనందమయి మారుమాట చెప్పక యొక్కనిట్టూర్పు విడిచెను. మహిముఁడు జేబులోని తములపాకులను దీసికొని నములుచు వెడలిపోయెను.

## ౪౨

లలిత పరేశునిచెంతకుఁ బోయి "బాబా! మేము బ్రహ్మసమాజపువారమని హిందువు లెవ్వరును దమబిడ్డలను మాకడకుఁ జదువఁ బంపుట లేదు. ఈపనిలో హిం

డువులెవ్వరైన నన్నుతో బాగుగ నుందు రని యనుకొనుచున్నాను! మీయభిప్రాయ మేమి ?" అని యడిగెను.

పరే—మనకు సాయపడుహిందువు లెవ్వరున్నారు ?

లలిత స్థిరపఱచుకొనియే వచ్చెనుగాని యాకస్మికముగ వినయునిపేరు చెప్పుట కామె సంశయించెను. ఎట్లో బలవంతముగా నామెసంకోచమును ద్యజించుకొని "లేకేమి ? వినయబాబున్నాఁడు కాడా ? కాని—" అనియెను. ఈ "కాని" యను పదము కేవలము వ్యర్థప్రయోగమే—ఈయవ్యయపద మపవ్యయమాత్రమే. దానితోనే సమాప్తమైపోయెను.

పరే—వినయుఁడా ? వినయుఁ డంగీకరించునా ?

లలిత యభిమానమున కీమాట యాఘాత మయ్యెను. వినయుఁ డంగీకరింపఁడా? ఆతని సమ్మతింపఁజేయుట యసాధ్యము కాదని లలిత యెఱుంగును. కావుననే లలిత "బాబా ! ఆతఁ డంగీకరించును !" అనియెను. పరేశుఁడు సుస్థిరుఁడై కూర్చుండి "బాగుగ నాలోచించుకొన్నచో నాతఁ డెన్నటికిని సమ్మతింపఁడు !" అనియెను.

లలిత కర్ణమూలములు రక్తరంజితము లైపోయెను. ఆమె తన చీరచెఱఁగునం గట్టిన తాళపుగుత్తి గదలించుచు నూరకుండెను. పీడితహృదయయగు తనయమొగమువంకఁ జూచి పరేశునిహృదయము సంక్షుభిత మైపోయెను. కాని యాతని కట్టి సాంత్వనవచనము తోఁచుటలేదు. లలిత కొంతసేపటికి మెల్లగ మొగమెత్తి "బాబా ! అట్లయినచో మాపాఠశాల యేవిధముగను జరుగదా ?" అని యడిగెను.

పరే—ఇప్పుడు చాల యంతరాయము లున్నవి. ప్రయత్నించినచో నెన్నియో యప్రియములకుఁ దల యొగ్గవలసి యుండును !

పానూబాబుపంతము నెగ్గెను! అన్యాయమునకు నిర్బద్ధముగా నంగీకారము కలుగును. ఇది లలితకు దురంతదుఃఖకరముగనే యుండెను. ఇది తండ్రిగారి శాసనమైనదిగాని మఱియొకరిమాట యైనచో నామె యప్పుడే తృణీకరించివైచును ! ఎట్టి యప్రియమునకైనను భయపడనియామె యన్యాయము నెట్లు సహింపఁగలదు? ఆమె మెల్లమెల్లగాఁ దండ్రికడనుండి లేచి తనగదిలోనికిఁ బోయెను. అప్పటి కామె కొక యుత్తరము వచ్చియుండెను. హస్తాక్షరములను బట్టి చూడఁగా నది యామె బాల్యసఖి సుశైలబాల వ్రాసినలేఖయై యుండెను. ఆమె కిఁ బెండ్లియైనది. ఆమె యిప్పుడు భర్తయొద్ద బాంకీపురమునం దుండెను. ఆయుత్తరమునం దిట్లున్నవి—"చెలీ ! నీ సంగతులు చాలగ విని నామనసు చెడిపోవుచున్నది ! చాలదినములనుండి నీకు జాబు వ్రాయవలయుననుకొనుచుంటినిగాని, సమయము దొరకలేదు. నిన్నుఁగూర్చి యొకరివలన నొకసంగతి విని నాతలపైఁ బిడుగుపడినట్లయితిని. వారిచే రిందువ్రాయలేదు.

కాని యావ్రాసినవారు నమ్మఁదగినవారు కారు. ఇట్లు జరుగునని నేనెన్నఁడు ననుకొనలేదు. నీవొక హిందూయువకుని బెండ్లియాడఁ దలఁచితివట! ఈమాట నిజమైనచో—"

క్రోధముచే లలితసర్వాంగకములును బ్రజ్వలించిపోయెను. ఆమె యొక్కనిమిషమైన నోర్వక తత్క్షణమే యిట్లు ప్రత్యుత్తరము వ్రాసెను—"సఖీ! ఈమాట నిజమో కాదో తెలిసికొనఁగోరి నీవు జాబు వ్రాయుట నా కాశ్చర్యముగా నున్నది; ఈమాట బ్రహ్మసమాజమువారే చెప్పినప్పుడికను సత్యము కాదేమో యని నీకేల సంశయము కలుగవలయును? తరువాత—నేను హిందూయువకుని బెండ్లియాడెదననువార్త నీతలపైఁ బిడుగుపడినట్లుండెనని వ్రాసితివి! ఎట్టివానితో వివాహమగుట పాతకముకంటె నతిదారుణముగ నుండునో యట్టి సుప్రఖ్యాతసాధుయువకులు బ్రహ్మసమాజమునం దున్నారనియు నెట్టియుత్తమబ్రాహ్మకన్యకయైనను వరింపఁదగినప్రఖ్యాతయువకులు హిందూసమాజమునఁగూడ లేకపోలేదనియు నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. నేనింతకంటె నీకు విశేషముగ వ్రాయఁదలఁచుకొనలేదు—"

ఈ దినమునఁ బరేశుఁడేపనియును జేయుట లేదు; ఊరక కూర్చుండి యాలోచించుచుండెను. తరువాత నాతఁడు సుచరితయింటికిఁ బోయెను. పరేశునివిచారవదనముం గాంచి సుచరితహృదయము కలఁగిపోయెను! అతనికి విచారము కలుగకుండఁ జేయవలయుననియే యామె చాలదినములనుండి జాగ్రత్తగ మసలుకొనుచుండెను. అప్పుడు పరేశుఁడు సుచరితను గదిలోనికిఁ దీసికొనిపోయి రహస్యముగా "అమ్మా! లలితవిషయమై యాలోచింపవలసినసమయము వచ్చినది!" అనియెను. సుచరిత కరుణామయువిలోకనములతోఁ బరేశుం గాంచి "బాబా! తెలిసినది!" అనియెను.

పరే—నేను సామాజికనిందను లెక్కించుటలేదు—లలిత యెట్లు—

పరేశునిసంశయముం గాంచి సుచరిత స్పష్టముగాఁ జెప్పఁదలచి "బాబా! లలిత యేసంగతియు నాకడ దాఁచెడిదికాదు. కాని కొన్నాళ్ళనుండి యామె నాయొద్ద నట్లుండుట లేదు."

పరే—లలితయభిప్రాయమును నేనామె నడిగికూడఁ దెలిసికొనఁ దలఁపలేదు. ఆమెవిషయమున నేమిచేసిన బాగుగ నుండునో నాకుఁ దోఁచుట లేదు. నేను వినయునిఁ దఱచుగా నింటికి రానిచ్చుట యామె కనిష్టముం గూర్చినట్లయినదా యేమి?

సుచ—వినయబాబునం దెట్టిదోషమును లేదని మీరే యెఱుఁగుదురు. అతఁడు నిర్మలస్వభావుఁడు. అట్టిసాధుపురుషులు లోకమున స్వల్పముగా నుందురు.

పరేశబాబు క్రొత్తసంగతిని గ్రహించినట్లు "రాధా! నీవు సరిగాఁ జెప్పితివి. వినయుఁడు మంచివాఁడగునో కాఁడో యంతర్యామియగు నీశ్వరుఁడే యెఱుంగును.

అతఁడు మంచివాఁడే! సంశయము లేదు. ఈవిషయమున నేనాతనికి మాటిమాటికి వందనము చేసెదను'' అనియెను.

ఒక్క చిక్కు వదలిపోయెను. పరేశున కూపిరి తిరిగెను. పరేశుఁడు దేవుని యెదుట నన్యాయముగ మసలినవాఁడు కాఁడు. ఈశ్వరుఁడు మానవుని దూచుటకై కూర్చిన త్రాసునందుఁ బరేశుఁడు సత్యధర్మము వంకకే మ్రొగ్గుచూపియుండెను. సమాజ సంబంధమగు కపటగౌరవము లభించుట లేదని యాతని కించిన్మాత్రమును విచారము లేదు. ఇట్టిస్వల్పవిషయము నిప్పటివఱకును గ్రహింపఁజాలక యీవిధముగాఁ బరితపించుట యాతని కాశ్చర్యముగఁ దోఁచెను. అప్పుడాతఁడు సుచరిత యుత్తమాంగమున దక్షిణహస్తమునుంచి "అమ్మా! ఇప్పుడు నీవు నాకుఁ బ్రబోధమును గల్పించితివి!" అనియెను. సుచరిత తత్క్షణమే యాతనిపాదధూళిని శిరమునం దాల్చి "కాదు కాదు! బాబా! అట్లనియెదరేమి?'' అనియెను.

పరే—సంప్రదాయ మెట్టిదనఁగా తాను మానవుఁడనను సామాన్యజ్ఞానమును గూడ నది మఱపించివైచును; సమాజము కల్పించిన బ్రాహ్మహిందూవిభేదమే విశ్వసత్యముకంటెను ప్రధానముగాఁ దోపఁజేయును. ఇంతవఱకు నట్టియసత్యమార్గమునందే తిరిగి తిరిగి చచ్చుచున్నాను—లలిత బాలికా పాఠశాలను స్థాపించు నుద్దేశమును మాన్పు కొనలేదు. ఈవిషయమున వినయుని సహాయునిగాఁ జేసికొందు నని యామె నన్నుఁ గోరినది!

సుచ—బాబా! ఇప్పుడు వలదు. కొన్నాళ్ళు పోనిండు!

తాను నిషేధించినచో లలితయుత్సాహమునకు భంగము కలిగించినట్లగునేమో యని పరేశుని కరుణార్ద్రహృదయమునకుఁ గష్టముతోఁచుచుండెను. తేజస్విని యగు లలిత సమాజనిందలను లక్ష్యము చేయక యన్యాయమునకు విరుద్ధముగఁ బోరాడుటకు సిద్ధముగ నుండెననియు, నొక్క తండ్రి శాసనమునకుమాత్రమే తలయొగ్గియుండెననియుఁ బరేశుఁడు స్పష్టముగ గ్రహించియుండెను. అందుచేఁ బరేశుఁడు "రాధా! ఇప్పుడేల యూరకుండవలయును?" అనియెను.

సుచ—అమ్మకుఁ గోపముగా నుండునేమో?

ఆమాట సత్యమే యని పరేశునకుఁ దోఁచెను—ఇంతలో సతీశుఁడు వచ్చి సుచరిత చెవిలో నేమియో చెప్పెను. సుచరిత "వలదు బాబూ! ఇప్పుడు కాదు; రేపు!" అనియెను. సతీశుఁడు విమర్షహృదయముతో "రేపు మాకు బడియున్నది!" అనియెను. పరేశుఁడు ప్రేమహాసముతో "బాబూ! సతీశా! ఏమి కావలయును?" అనియెను.

సుచ—వాఁడు—ఒక—

సతీశుఁడు వ్యస్తహృదయుఁడై సుచరిత నోటికిఁ జేయడ్డము చేసి "వలదు! చెప్ప వలదు!" అనియెను.

పరే—బాబూ! అది రహస్యమైనచో సుచరితకేల చెప్పితివి!

సుచ—బాబా! ఈరహస్య మెట్లయిన మీచెవినిఁ బడవలయుననియే వీని ముఖ్యోద్దేశము!

సతీశుఁడు బిగ్గఱగా "కాదు! నిశ్చయముగాఁ గాదు!" అని చెప్పుచు నొక్క-పరుగున వెడలిపోయెను. వినయుఁడు తనవ్యాసమును జదివి వ్రాసియిచ్చినప్రశంసాపత్రమును సుచరితకుఁ జూపవలయు నని సతీశుని యుద్దేశము. ఆసంగతి పరేశుని యెదుట రహస్యముగాఁ జెప్పుటలో సతీశునియభిప్రాయమేమో సుచరిత వెల్లడించి వైచినది. ఇంతసులభముగాఁ దనయూహ బయల్పడిపోవునని పాపము సతీశుఁ డెఱుఁగకపోయెను!

## ౪౭

నాలుగుదినము లైనతరువాత నొకయుత్తరమును బట్టుకొని హారానుఁడు వరదాసుందరిచెంతకు వచ్చెను. ఇప్పు డీక నాతఁడు పరేశునియెడల నాశ వదలుకొనియుండెను. హారానుఁ డాయుత్తరమును వరదాసుందరిచేతి కిచ్చుచు "నేను మొదటనుండియు మిమ్ములను హెచ్చరించుచు నేయున్నాను. కాని యది మీకుఁ వ్యర్థముగా నుండెను. లోలోపల నెట్టిసంగతులు జరుగుచున్నవో యీచీటి చూచినచో మీకే తెలియును!" అనియెను.

అది లలిత శైలబాలకు వ్రాసినయుత్తరము! వరదాసుందరి దానిని జదివి "ఏమని చెప్పుదును! ఇట్లు జరుగునని నే నెన్నఁడు ననుకొనలేదు! ఇది నాతప్పు కాదని చెప్పుచున్నాను. మీరందఱును విశేషముగఁ బొగడుచు నామెకన్నులను గలకెక్కించితిరి. బ్రహ్మసమాజమునం దట్టికన్యక లేదంటిరి—ఆయాదర్శకన్యకచర్యలకీర్తి మీకనులయెదుటనే యున్నదిగదా! గోరావినయుల నామెయే యింటికిఁ దెచ్చినది! అయినను నేనెట్లో వినయుని నామార్గమునకుఁ ద్రిప్పుకొంటిని. దానిపై నెక్కడనుండియో హరిమోహినివచ్చి నాయింట విగ్రహారాధనమును దెచ్చిపెట్టినది; వినయుని నాకంటి కగపడకుండఁ జేసివైచినది! ఇవి యన్నియును మీసుచరిత చేసినపనులే. ఆమె యెంతటియాఁడుదియో నాకు సంపూర్ణముగఁ దెలిసిపోయినది. కాని నేనెన్నఁడు నేమియు ననలేదు. ఆమెను బెంచి పెద్దదానిఁజేయుటయే కాని, నాబిడ్డయనుకొనుట కవకాశము లేకుండఁబోయినది. నాకుఁ దగినప్రతిఫలము కలిగినది! ఇప్పుడు నాకీయుత్తరము చూపు టెందులకు? మీయిష్టమువచ్చినట్లు చేసికొనుఁడు!" అనియెను.

హారానుఁడు తనతప్పు నంగీకరించి వరదాసుందరిని క్షమింపవేఁడుకొనియెను. అనంతర మామె పరేశు నటకుఁ బిలిచి "ఇదిగోఁ చూచుకొనుఁడు!" అని యాయుత్తరము నాతనియెదుట బల్లపైఁ బడవైచెను. పరేశుఁడు రెండుమూడుసారు లాయుత్తర

మును జదివి "ఇప్పుడేమైనది ?" అనియెను. వరదాసుందరి యుత్తేజితస్వరముతో "ఏమైనదా? ఇంకేమి కావలయును? ఇంకను మిగిలియున్నదా? దేవపూజ, జాతిభేదము సర్వము సంప్రాప్తమైనవి! ఇఁక హిందూయువకునితో బ్రాహ్మవివాహముకూడ నగును. తరువాతఁ బ్రాయశ్చిత్తము చేసికొని హిందూమతప్రవేశము! ఇఁకఁ జెప్పవలసిన దేమున్నది?" అనియెను.

పరేశుఁడు మందహాసముతో "నీ వేమియుఁజెప్పనక్కఱలేదు. ఇదిచెప్పవలసిన సమయమునుగాదు. లలిత హిందూవివాహముచేసికొన నిశ్చయించుకొనె నని నీ వెట్లు సిగపఱచుకొంటివి? ఈయుత్తరమునందట్టిభావమేమియు నగపడుటలేదే!" అనియెను.

వర — మీ కట్లు కనఁబడుట కింకను నేమి యుండవలయునో బోధపడుటలేదు. మీకుఁ దెలివి యున్నచో నింతవఱకేల వచ్చును? ఉత్తరమునం దింత కంటె స్పష్టముగా నెవ్వరు వ్రాయుదురో చెప్పుడు!

హార — ఈచీటి లలితకే చూపించి యామెయుద్దేశము నడుగుట మంచిదని తోఁచుచున్నది. మీకిష్టమున్నచో నేనే యామె నడిగెదను!

ఇంతలో లలిత తుపానువలె నటకు వచ్చి "బాబూ! బ్రహ్మసమాజమునుండి యొకయనామలేఖ వచ్చినది. చూడుడు!" అని యొకచీటీని తండ్రి కిచ్చెను. పరేశుఁడు చదివెను. లలితావినయులకు వివాహము రహస్యముగ స్థిరపడుటంగూర్చి నిందలతోడను, నుపదేశములతోడను నాయుత్తరము నిండియుండెను. మఱియు వినయుఁడు మంచివాఁడు కాఁడనియు కొన్నాళ్ళకు బ్రాహ్మస్త్రీని త్యజించి హిందూయువతిని బెండ్లియాడుటకును సంశయింపఁడనియు నందు సూచితమైయుండెను. పరేశుఁడు చదివినతరువాత హారానుఁడుకూడ దానినిఁ జదివి "లలితా! ఈయుత్తరము చదివి నీవు కోపపడియెదవుగాని, యిట్టితరుణము వ్రాయుటకుఁ గారణము నీవు కల్పించినదే కాదా? దానికేమి! ఇది చూడుము! ఈచీటి స్వయముగ నీ వేల వ్రాసితివి?" అనియెను.

లలిత స్తబ్ధయై కొంతసేపూరకుండి "శైలబాలకును నాకును నుత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నట్లు నీకుఁ దెలియునా?" అనియెను. హారానుఁడామాటకు బదులు చెప్పక "ఆమె సమాజకర్తృత్వమునుబట్టి నీకీయుత్తరము వ్రాయుటకు బాధ్యయయ్యెను!" అనియెను. లలిత సుస్థిరయై నిలిచి "ఇప్పుడు సమాజ మేమనఁ దలఁచియున్నదో చెప్పుము!" అనియెను.

హారా — వినయునితోడి నీసంబంధమునుగూర్చి సమాజమువారనుకొనుమాటల నన్నిటిని నేను విశ్వసించుటలేదు. కాని నీవలన సర్వమును వినఁదలఁచియున్నాను!

లలితకన్నులనుండి నిప్పులొలుకుచుండఁ గుర్చీపైకిఁ గంపితకరమును జాచి "సమాజమువారిమాటలే నీకు విశ్వసనీయములుగ లేవా?" అనియెను. పరేశుఁడు లలిత

చెన్నున జేయుంచి దువ్వుచు "అమ్మా! ఇప్పుడు నీమనసు బాగుగ లేదు. తరువాత మాటడవచ్చును. ఇప్పుడు వలదు!" అనియెను.

హారా—పరేశబాబూ! మీరు ప్రస్తావమును మార్పబ్రయత్నింపవలదు!

లలిత యంతట మండిపడి "తండ్రిగారు మాట మరలింప జూచుచుండిరా? ఆయన నీవలెసత్యమునకు భయపడువారుకారు. సత్యము సమాజముకంటెను బ్రధానమైనదని నాయనగా రెఱుఁగుదురు! వినయుని పెండ్లియాడుట యసంభవమని గాని, యన్యాయమనిగాని నేనెంతమాత్రమును భావించుట లేదని నీవు నిశ్చయముగాఁ జెప్పుచున్నాను!" అనియెను.

హారా—కాని యాతఁడు బ్రాహ్మధర్మమును గ్రహించుటకు స్థిరపడియెనా?

లలి—ఎంతమాత్రము స్థిరపడలేదు. దీక్షాగ్రహణము చేయవలయు ననునిర్బంధమేమున్నది?

వరదాసుందరి యింతవఱకును మాటాడుట లేదు. హారానుఁడు విజితుఁడై యిఁక దనతప్పును బరేశునియెదుట నొప్పుకొని క్షమింపగోరునని యామెకుఁ దోచెను. ఇఁక నామె సహింపఁజాలక "లలితా! నీవు పిచ్చిదాన వైతివా? అట్లనియెద వేమి?" అనియెను.

లలి—అమ్మా! ఇవి పిచ్చిమాటలు కావు! నే నాలోచించియే మాట లాడుచున్నాను. నన్నీవిధముగా నలుదెసలనుండియు బంధించుటను నేను సహింపజాలను—నే నీహారానబాబు సమాజమునుండి ముక్తి నందెదను!

హారా—ఉచ్ఛృంఖలత్వమే ముక్తి యనుకొంటివా?

లలి—కాదు! నీచాక్రమణమునుండి—యసత్యదాసత్వమునుండి విడివడుటయే ముక్తి యని చెప్పుచున్నాను! ఎట్టియన్యాయమును, నెట్టియధర్మమును లేనిస్థానమగు బ్రహ్మసమాజము నన్నెట్లు బంధింపఁగలదు. ఎట్లు స్పృశింపఁ గలదు?

హారా—పరేశబాబూ! చూచితిరా! ఇదకట్లగునని నే నెఱుంగుదును! సాధ్యమైనంతవఱకు మిమ్ములను హెచ్చరించుచునే యున్నాను! లాభము లేకపోయినది!

లలి—పానూబాబూ! చూడుము! నీవు బోధింపవలసినవినయ మొకటి యున్నది! నీకంటె నెల్లవిధముల నుత్తము లగువారినిగూడ మందలింపవలయు ననునహంకారము నీమనసు నందుంచుకొనవలదు!

అని చెప్పి లలిత యటనుండి వెడలిపోయెను.

వర—ఎంతపని జరిగినది! పరే—ఇఁక నేమి చేయవలయునో యాలోచింపుఁడు!

పరే—ఏది కర్తవ్యమో దానినే చేయవలయును. కాని యింతతొందరగ నాలోచించి కర్తవ్యనిశ్చయము చేయరాదు. నన్ను క్షమించి యిప్పుడు నాకీవిషయమున నేమియుఁ జెప్పవలదు. నే నేకాంతత నభిలషించుచున్నాను.

## ౪౯

“ఎంతపని జరిగినది ?” అని భావించుకొనుచు సుచరిత యొక్కింత సేపుండి లలితను కౌఁగలించికొని “సోదరీ ! నాకేమో భయముగా నున్నది” అనియెను.

లలి—భయ మేమి ?

సుచ—సమాజమం దంతటను గగ్గోలు పుట్టినది. కాని తుదకు వినయబా బంగీకరింపకున్నచో—

లలి—అతఁ డంగీకరించి తీరును !

సుచ—నీ వట్లనుకొనుచున్నావు. కాని వినయుఁడు తనమతమును త్యజించి యీపెండ్లి కిష్టపడఁడని పానూబాబు మనయమ్మకు ధైర్యము చెప్పి పోయినాఁడు ! సోదరీ ! నీవు బాగుగ నాలోచింపకుండఁ బానూబాబుతో నట్లేల మాటాడితివి ?

లలి—అట్లు చెప్పితి నని నాకిప్పటికిని విచారము కలుగుట లేదు! పానూబాబును, నాతనిసమాజమువారును నన్నొక వేఁటజంతువుగా సముద్రపర్యంతమును దరుముకొని వచ్చితిమనియు, నిచ్చట నేను నొంకిపోవుదు ననియు భావించుకొనుచున్నారు. వారి వేఁటకుక్కల భయముచే వారి పంజరమధ్యమున నిరికికొనియుండుటకు నేను భయపడుదును గాని, యీసముద్రమును లంఘించుటకుఁ గూడ భయపడననిమాత్రము వా రెఱుంగరు !

సుచ—ఒకసారి తండ్రిగారితో నాలోచించి చూడవలయును.

లలి—నాయనగా రట్టిక్రూరులతో సంబంధము పెట్టుకొనరని నిశ్చయముగఁ జెప్పుచున్నాను! ఆయన మనల నెన్నఁటికిని సంకెలలతో బంధింపఁజూచుట లేదు. ఆయనతో నభిప్రాయభేదము కలిగినప్పుడు కూడ నాయన మనయెడలఁ గోపించుట లేదు. అట్టిచో సమాజచ్ఛలంబున మనల నదలించి మననోళ్ళను మూయించుటకుఁ బ్రయత్నించునా? ఇట్టివిషయములం దమ్మకుఁ గోపము కలుగును గాని, తండ్రిగారు మన స్వతంత్రోద్దేశముల కెక్కడ భంగము కలుగునో యని భయపడుచుందురు. ఆయన యీవిధముగా మనలను పెంచి యింతవారినిజేసి తుదకు పానూనివంటి సామాజిక కారాగారభటునిచేతులలో నొప్పగించునా ?

సుచ—మంచిది. ఇందుఁ దండ్రిగారియభ్యంతర మేమియు లేదు; ఇఁకఁ జేయవలసిన దేమో చెప్పుము !

లలి—మీ రేమియును జేయకున్నచో స్వయముగ నేనే—

సుచరిత తత్తరముతో లేచి "అక్కఱలేదమ్మా! నీవేమియుఁ జేయనక్కఱలేదు! నేనొకయుపాయము చేసెదను" అనియెను.

ఆసాయంకాలమున సుచరిత పరేశునికడకుఁ బోవఁజూచుచుండఁగాఁ బరేశుఁడే యచ్చోటికి వచ్చెను. ఈనడుమఁ బ్రతిదినమును సంధ్యాసమయములందుఁ బరేశుఁ డొంటిగ నుద్యానమునఁ దలవంచుకొని పచారుచేయుచు నేమేమో యాలోచించుకొనుచునుండెను—సంధ్యాసమయపవిత్రాంధకారము మెల్లగ వానిహృదయమును సవరించుచుఁ గర్మమయదినసంబంధము లైన కళంకములను గప్పివైచి యంతరంగమధ్యమున నిర్మలకాంతిం గల్పించి రాత్రివిశ్రమమునకై యాయత్తపఱచుచుండెను. నేఁడు పరేశుఁ డట్టిసాయంకాలనిభృతధ్యానశాంతిసంభోగమును ద్యజించి చింతితవదనముతో సుచరిత యింటికి వచ్చెను. ఆఁడుకొనఁదగినబిడ్డ జబ్బుచే నూరక పడియున్నప్పుడు తల్లి హృదయ మెట్లుండునో యట్లే సుచరిత ప్రేమపూర్ణహృదయము పరేశుని మ్లానవదనముం గాంచి పరితప్తమైపోయెను. అప్పుడు పరేశుఁడు మృదుస్వరముతో "రాధా! అంతయు వింటివా?" అనియెను.

సుచ—వింటిని బాబా! కాని మీకంతయాలోచన యేల?

పరే—మఱేమియును లేదు! స్వయముగఁ దెచ్చికొన్న యీతుపాను దెబ్బను లలిత సహింపఁగలదా యనియే నాయాలోచన! ఉద్రేకముచే వదనములనుండి హృదయములనుండి తీవ్రభాషణములును, దీవ్రభావములును వెలువడుచుండును. కాని యవి క్రియముగా ఫలించుట కారంభించినప్పుడు వానిని సహించుశక్తి సన్నమైపోవుచుండును. లలిత యిట్టి సమస్తఫలాఫలములను బాగుగ నాలోచించుకొనియే తన కర్తవ్యమును నిశ్చయించుకొన్నదా?

సుచ—సమాజమునుండి కలుగు నిట్టియుత్పీడనమునకును లలిత లొంగునది కాదని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను.

పరే—లలిత కేవలమును గ్రోధవశ చేతనే యౌద్ధత్యముం జూపుట లేదని స్పష్టముగఁ దెలిసికొనవలయు ననియే నాకోరిక.

సుచ—లేదుబాబా! అట్లయినచో నేనామాట కొంతమాత్రమును జెవి యొగ్గియే యుండను. ఆమె మనసులోని యెంతటిగభీరభావ మైనను గదపినంతనే బయల్పడిపోవుచుండును. లలిత యట్టిస్వభావము కలది. బాబా! వినయబాబు చాలమంచి వాఁడుసుమా!

పరే—అతఁడు బ్రహ్మసామాజికుఁ డగునా?

సుచ—నేను సరిగాఁ జెప్పఁజాలను. ఒకసారి గోరాబాబు తల్లియొద్దకుఁ బోయివత్తునా?

పరే—నీవొకసారి పోవుట మంచిదనియే నేనును భావించుచున్నాను!

## ౫౧

వినయుఁడు ప్రతిదినము నుదయమునం దొకసారి యానందమయియింటినుండి తన యింటికి వచ్చుచుండెను. నేఁడాతఁ డింటికి చనునప్పటి కొక యుత్తరము వచ్చి యుండెను. అందు వ్రాసినవారిపేరు లేదు. లలితను బెండ్లియాడినచో నీ కట్టిసుఖమును లేదనియు, నామెమూలమున నీ కమంగళ మగుననియు నిట్టియుపదేశములతో నాలేఖ నిండియుండెను. అందుఁ జిట్టచివర "నీ వామెను బెండ్లియాడఁ దలఁచినచో నొకసంగతి యాలోచించుకొనుము! ఆమెకుఁ గాసరోగ మున్నది-అది క్రమముగా క్షయక్రింద మారునని డాక్టరు లనుమానించుచున్నారు!" అని కూడ వ్రాయఁబడి యుండెను.

వినయుఁ డాయుత్తరమును జూచి హతబుద్ధి యైపోయెను.

ఇట్టిమాట లూరక సృష్టింపఁబడునని యాతఁ డెన్నఁడు ననుకొనలేదు. సమాజ నియమములనుబట్టి తాను లలితను బెండ్లియాడుట యసంభవమని యందఱును దెలిసిన విషయమే. అందుచేతనే వినయుఁడు లలితను బ్రేమించుట తనయపరాధముగా భావించుకొనుచుండెను. ఈసంగతి సమాజ మంతటను వ్యాపించిపోయిన దని వినయుఁ డాయుత్తరమునుబట్టి నిశ్చయించుకొనియెను. ఇది కారణముగా లలితకు సమాజమునం దవమానము కలుగుచున్న దనువిచారముచే వినయునిహృదయము సంక్షుభితమైపోవుచుండెను. తన నామముతో లలితనామము కలసి ప్రజలనోళ్లనుండి వెలువడుట యాతనికి మిగుల లజ్జాకరముగ నుండెను. తనపరిచయమునుగూర్చి లలిత తిట్టుకొనుచు, నిందించుకొనుచు నుండుననియు, నిఁక నామె తన్నుఁ గన్నెత్తి చూచుటకైన నిష్టపడ దనియు వినయునిహృదయము కేవలమును బాధపడుచుండెను.

ఆహా! ఏమి మానవహృదయము! ఈయవస్థలోఁ గూడ వినయునిహృదయమధ్యమున నిబిడంబును, గభీరంబును, సూక్ష్మంబును, దీవ్రంబును నగు నొకయానంద రేఖ యీవైపునుండి యావైపునకు సంచారము సేయుచు నాతని సమస్తసంకోచములను సమస్తావమానములను దూరము చేసివైచుచుండెను! వానికి జరల నాశ్రయ మీయకుండవలయు నని వినయుఁడుఁ వరండాలో నటునిటుఁ బచారు చేయుచుండెను. కాని యాప్రభాతతేజమునుండి యొకవిధమగు నుద్రేకభావమాతనిమనమున నుదయమగుచుండెను వీధులవెంట వస్తువుల నమ్ముకొనువారికేక లాతనికి మనశ్చాంచల్యమును గలిగించుచుండెను. బాహిర మగులోకనిందయే గిరినిర్ఝరిణింబోలి లలితను దేర్చికొనివచ్చి వినయునిహృదయతీరమున విడిచివైచెను. సమాజమునుండి కొట్టుకొనివచ్చిన యాలలితమూర్తి నాతఁడు త్యజింపఁజాలకుండెను. "ఈలలిత నాది! నాయొక్కనిదే!" అని యాతనిమనము బోధించుచుండెను. ఇంతదృఢముగా నాతనిమన మెన్నఁడును బోధిం

చుటకు సాహసింపలేదు. ఆకస్మికముగ బహిర్లోకమునం దిట్టిగోల వెలువడుటచే నింక నాతఁడు తనహృదయమును మూసి యుంచుకొనఁజాలకపోయెను.

వినయుఁ డట్లు చంచలుఁడై తిరుగుచు వీథిని వచ్చుచున్న హారానునిఁ జూచెను. అతఁడు దనయొద్దకే వచ్చుచుండెననియు నీయనామధేయలేఖ వెంటనే మఱియొకగందరగోళము పుట్టనున్నదనియు వినయుఁ డాక్షణమునందే నిశ్చయించుకొనియెను—ఇఁక వినయుఁడు మునుపటివలెఁ బ్రాగల్భ్యమును జూపఁజాలక హారాను నొకకుర్చీపైఁ గూర్చుండఁ జేసి మౌనముతో నాతనిమాటకొఱ కెదురుచూచుచుండెను.

హారా—వినయబాబూ! నీది హిందూమతమా?

విన—ఔను, కాకేమి?

హారా—నాయీప్రశ్నకుఁ గోపింపవలదు. అనేకసమయములందు మనము మన చుట్టుప్రక్కలనున్నయవస్థల నాలోచింపక యంధులమై చరించుచుఁ గష్టములను సృష్టించుకొనుచుందుము. అట్టిసమయములందు "మన మెవ్వరము? మనహద్దెక్కడ నున్నది? మనకార్యము లెంతదూరమువఱకును బరిణమించినవి?" అని యెవ్వరైనఁ బ్రశ్నించినచో నది యప్రియముగ నున్నను వారిని మిత్రులుగనే భావింపవలయును!

విన—ఇంతయుపోద్ఘాత మెందులకు? అప్రియమగుప్రశ్నకై కోపించి నేనట్టియత్యాచారమునైనను జేయుస్వభావము కలవాఁడను గాను! మీరు నిర్భయముగా నన్నెల్లవిషయములను బ్రశ్నింపవచ్చును!

హారా—నేను నీపై నిచ్ఛాకృత మగు నెట్టియపరాధమును గూర్చియు దోషారోపణము చేయఁదలఁచుకొనలేదు. కాని వివేచనాలోపమువలనం గలుగుఫలము విషమయ మగుననుసంగతి నీకు వేఱుగఁ జెప్పనక్కఱ లేదు.

విన—(విరక్తభావముతో) అక్కఱలేనిమాట చెప్పనేవలదు. అసలుసంగతి యేమో చెప్పుఁడు!

హారా—నీవు హైందవుఁడవై హిందూసమాజమును విడువఁజాలనప్పుడు, పరేశునిబిడ్డలకు వారిసమాజమునం దపవాదము కలుగకుండునట్లు నీవాయింటను మితముగా మెలఁగవలసినది!

వినయుఁడు గంభీరభావముతో నించుకసేపూరకుండి "పానూబాబూ! సమాజమువారు నేనినుండి యెట్టిమాటలను సృష్టించుచుందురో, యని యన్నియు వారివారి స్వభావముల ననుసరించి యుండును; అట్టివాని కన్నిటికిని నేను బాధ్యుఁడను గాను! పరేశునిబిడ్డలతోడిసంబంధమును గూర్చి నాసమాజము వారేమైన నిందించినచో నది నాసమాజముతప్పే గాని పరేశునితనయలది యెట్లగును?" అనియెను.

హారా — ఒకకన్యక తల్లిని విడిచి పరపురుషునితో నొంటిగా నౌకాయాత్ర చేసినప్పు డావిషయముంగూర్చి యోచించుటకు సమాజమున కధికారమే లేదనియా నీయభిప్రాయము!

విన — బహిస్సంఘటనమునకు, నాంతరంగికాపరాధమునకును మీరుగూడ నొక్కటే స్థానమును బ్రసాదించుచున్నచో నిఁక హిందూమతమును విడిచి మీమతమునఁ జేరవలసినయావశ్యక మేమున్నది? ఏమైన నేమి! పానూబాబూ! ఇట్టి తర్కవితర్కములతో నెట్టియుపయోగమును లేదు! నాకర్తవ్యము నాలోచించి నేనే నిశ్చయించుకొందును! మీ రిందు నాకెట్టిసాయమును జేయఁజాలరు!

హారా — నీతో నేను విశేషముగా మాటాడఁదలఁచుకొనలేదు. నే నొక్కటే మాట చెప్పుచున్నాను. నీ విఁక దూరముగ నుండకున్నచోఁ గేవల మకృత్యముగా నుండును. పరేశునియింటఁ బ్రవేశించి, కేవలము నొకవిధమగు నశాంతిని గల్పించి వారి కెట్టియనిష్టమును వర్ధిల్లఁజేసితివో నీ వింకను గ్రహింపఁజాలకున్నావు.

అని చెప్పి హారానుఁడు వెడలిపోయెను. వినయునిహృదయమున శూలాఘాత మైనట్లుండెను. సరళహృదయుఁడు, నుదారచిత్తుఁడు నగు పరేశుఁ డత్యాదరముతో గోరా వినయులను దనకుటుంబమధ్యమునఁ జేర్చుకొనియెను. వినయుఁడు తెలియక యాబ్రహ్మకుటుంబమధ్యమున మాటిమాటికిని దనహద్దును మీరిపోవుచున్నను నొక్క నాఁడైనఁ బరేశుని స్నేహగౌరవములనుండి వంచితుఁడు కాలేదు. ఈపరివారమధ్యమున వినయునిప్రకృతికి లభించినగంభీరతమాశ్రయము మఱి యెచ్చటను లభింపలేదు! వారిపరిచయమైన వెనుకనే వినయున కొకవిధమగువిశేషసత్యము లభించెను. ఇట్టి యాదరము — ఇట్టియానందము ఇట్టి యాశ్రయము నొసంగినపరివారమునందు చిరకాలముకలుగు వినయునిప్రశంసయే శ్రవణకంటక మైయుండెను! పరేశునితనయల కాతని మూలమున నపవాదకళంకము కలిగినది. లలితభవిష్యజ్జీవితమున కంతయు నాతఁ డొక పెద్దమచ్చను దెచ్చిపెట్టెను! దీనికి బ్రతీకారమేమైన యున్నదా? అహా! సమాజమనువస్తువు సత్యమధ్యమున నెన్ని సంశయములను గల్పించుచున్నది! లలితావినయుల సమ్మేళన మెట్టిసత్యవిరుద్ధమైనదియును నాగును. లలిత సుఖసౌభాగ్యములకై వినయుఁడు తనసమస్తజీవితమును నర్పించుటకు సంసిద్ధుఁడై యుండునో లలితావినయుల యంతర్యామి యగుపరమేశ్వరున కొక్కనికే తెలియును! అతఁడే శ్రీమాకర్షణముచే వినయుని లలిత కింతటిసమీపమునకుఁ దీసికొనివచ్చెను — అతని శాశ్వతధర్మవిధానమున కెచ్చటను నడ్డము లేదుగదా! ఈశ్వరుఁడు బ్రహ్మసమాజమునందు పానూబాబు వంటివా రుపాసించునట్టి దేవుఁడుగాక మఱియొకఁడా యేమి? అతఁడు మానవహృదయాంతర్యామియగు విధాత కాఁడా? అట్లయినచో లలితావినయుల సమ్మేళనమధ్య

స్థానమున దంష్ట్రాకరాళవదనమును దెఱచుకొని నిలిచి కేవలసమాజమును మాత్రమే పాటించుచు, సర్వమానవశ్రేష్ఠుఁ డగునీశ్వరునిగూడ లెక్కింపని యానిషేధము పాపనిషేధముకాదా ?

## ౫౧

వినయునికడకు హారానుఁడు వచ్చినసమయమునందే యవినాశుఁ డానందమయి చెంతకుఁ బోయి లలితావినయులకుఁ బెండ్లి స్థిరపడె నని చెప్పెను.

ఆనం—ఈమాట యెన్నఁటికిని సత్యము కాదు !

అవి—ఏమి ? వినయుఁ డంగీకరింపఁ డనియా ?

ఆనం—నాకాసంగతి తెలియదు గాని, యింతటిముఖ్యవిషయము వాఁ డెన్నఁడును నాకుఁ దెలుపకుండ నుండఁడు !

అవి—ఈమాట నేను బ్రహ్మసమాజమువారివలననే వింటిని. కావున నిది యసత్యము కాదు. వినయునియం దిట్టి శోచనీయపరిణామము కలుగు నని నేనిదివఱకే యనుకొంటిని. ఈవిషయమున గోరానుగూడ హెచ్చరించితిని !

అని చెప్పి యాతఁడు క్రిందికిఁ బోయి మహిమునకుఁ గూడ నీవార్తను జెప్పి వైచెను.

అనంతరము వినయుఁ డానందమయికడకు వచ్చెను. ఆతనివదనముం గాంచి నంతనే సంక్షుభితం బగు నాతనియంతఃకరణము విస్పష్ట మగుచుండెను. ఆనందమయి యాతనికి భోజనము పెట్టి తనగదిలోనికిఁ దీసికొనిపోయి కూర్చుండఁజేసి "బాబూ! నీవిట్లుంటి వేమి!" అనియెను. వినయుఁ డామె కాయుత్తరము నిచ్చెను. ఆనందమయి దానిం జదివిన తరువాత "అమ్మా! హారానుబాబు నేఁటియుదయమున మాయింటికి వచ్చి నన్నెన్నియోవిధముల నిందించి పోయెను!" అని చెప్పెను.

ఆనం—ఎందుచేత ?

విన—నాప్రవర్తనము తమసమాజమునందలి పరేశునితనయల కపవాదకారణ మయ్యె నని యాతఁడు నన్ను మందలించెను !

ఆనం—నీవును లలితయును వివాహము స్థిరపడె నని లోకు లనుకొనుచున్నారు. ఇందు నిందాకారణ మేమియు నా కగపడుట లేదు.

విన—వివాహమున కవకాశమే యున్నచో నిందకుఁ గారణమే లేదు. కాని యట్టి సంభావనమైన లేనిచోట నిట్టిమాటలు పుట్టుట యెంతయన్యాయము! విశేషించి లలితవంటికన్యకయెడల నిట్టినింద కేవలము గాపురుషతయే !

ఆనం—నీకుఁ బౌరుషమే యున్నచో నాతనిహస్తములనుండి నీవు లలిత ననాయాసముగ రక్షింపఁగలవు !

విన—అమ్మా! అది యెట్లు ?

ఆనం—ఎట్లా నీవు లలితను బెండ్లియాడుము !

విన—అమ్మా! ఏమనుచున్నావు! నీవు నీవినయుని నెట్టివానిగాఁ దలఁచుచున్నావు ?—వినయుఁడు కేవలము నేనొక్క మాట చెప్పినచోఁ బెండ్లియాడుట కంగీకరించు ననియు, నిఁక నెట్టిలోకనిందయు లేకుండఁ బోవు ననియు నాయంగీకారముకొఱకే యీతఁడు వేచి యుండె ననియు నీవనుకొనుచున్నట్లున్నది.

ఆనం—నీకిన్నిమాటలను గూర్చి యాలోచింపవలసినపని యేమున్నది ? నీవు చేయవలసినపని చేసినచోఁ జాలును ! నేను బెండ్లియాడుటకు సంసిద్ధుఁడనై యుంటి నని చెప్పుము !

విన—నేనింతయసంగతముగఁ జెప్పినచో లలిత కవమానము కాదా ?

ఆనం—అసంగత మనియెద వేమి ? మీవివాహమునుగూర్చి ప్రవాద మెప్పుడు పుట్టెనో యప్పుడే యది నిశ్చయముగ సంగత మైపోయినది ! నీ వెంతమాత్రమును సంశయింపనక్కఱలేదు.

విన—కాని, అమ్మా! ఈవిషయమున గోరామాటనుగూడ భావింపవలదా ?

ఆనం—(దృఢస్వరముతో) వలదు బాబూ! ఇందాతనిమాటతోఁ బనిలేదు. అతఁడు కోపపడు నని నేనెఱుంగుదును. అతనికి నీపైఁగోపము కల్గింపవలయు నని నాయుద్దేశము కాదు. కాని యేమిచేయుదును! నీకు లలితయందు గౌరవమే యున్నచో నామెకు సమాజమునం దవమానము కలుగకుండునట్లు చేయవలదా ?

కాని, యీమాటలు సామాన్యము లైనవా ? వినయుఁ డిట్లు చేయఁగలఁడా ? కారాబద్ధుఁ డగుగోరాయెడల వినయుని ప్రేమ ద్విగుణీకృత మైయుండెను. అట్టిచో వినయుఁడు గోరాకు హృదయాఘాతముం గల్పింపఁగలఁడా ? ఇంతేకాక సంస్కారము !-సమాజమును మనసుచే లంఘింపవచ్చును గాని, కార్యరూపమునఁ ద్యజించునప్పు డనేకస్థలములయందుఁ గొలఁదిగనో గొప్పగనో యనేకాకర్షణములు బాధించుచుండును; అపరిచితంబు లగు నాశంకములను, ననభ్యస్తంబు లగుప్రతివాదములను గారణ మరయకుండ ననుసరించి పోవలసి యుండును !

విన—అమ్మా! నిన్నుఁ జూచినకొలఁది నాకాశ్చర్యముగా నున్నది ! నీమనస్సొక్కసారిగా నెట్లింత నిర్మలమైనది ? నీవు పదపరిచారము చేయుటలేదు! ఈశ్వరుఁడు నీకు రెక్కల నిచ్చెనా యేమి ? నీగమనమున కచ్చోటను నించుకంతయైన నిరోధమే లేదు !

ఆనం—బాబూ! ఈశ్వరుఁడు నాకట్టినిరోధమును లేకుండ నామార్గమంతయును బరిష్కృతముగఁ జేసివైచినాఁడు.

విన—కాని, అమ్మా! నేను నోటితో నేమి చెప్పినను, మనసుచే నిర్బంధింపఁబడుచునే యుందును. ఇంత చదువులు, నింత బుద్ధియును బాగుగ నాలోచింపఁగఁ గేవలము మూర్ఖత్వముగనే యాకస్మికముగ నామనసునకుఁ దోఁచుచుండును.

ఇంతలో మహిముఁ డచ్చటికివచ్చి లలితతోడి వివాహసంబంధము స్థిరపడిన సంగతిం గూర్చి వినయుని దృఢముగఁ బ్రశ్నించెను. అందుచే వినయునిహృదయము సంక్షుభితమైపోయెను. అతఁ డెట్లో మనసు చిక్కఁబట్టుకొని మౌనముతోఁ దలవంచుకొని కూర్చుండెను. అప్పుడు మహిముఁ డన్నిపక్షములవారినిఁగూడ నతితీవ్రభాషణములచే నిందించుచు నటనుండి వెడలిపోయెను. వినయునివలలోఁ జిక్కించుకొని సర్వనాశనముం గావించుటకే పరేశునియింట సిగ్గులేనిప్రయత్నములు జరుగుచుండెననియు, బుద్ధిహీనుఁ డగువినయుఁ డావలలోఁ దగుల్కొనిపోయెననియునుగూడ మహిముఁడు నిందించియే పోయెను.

వినయుఁడు నలుదెసల నావరించియున్న యిట్టియుపవాదమూర్తిం గాంచి స్తబ్ధుఁడైపోయెను. అప్పు డానందమయి "వినయబాబూ! నీకర్తవ్య మేమో తెలిసినదా?" అని ప్రశ్నించెను. వినయుఁ డామెవంక మొగమెత్తి చూచెను. ఆమె మృదుస్వరముతో "బాబూ! నీవొకసారి పరేశునిచెంతకుఁ బోవుట మంచిది. అతనితో మాటాడినచో సమస్తమును బరిష్కారమైపోవును!" అనియెను.

౫౨

ఆనందమయి యాకస్మికముగ వచ్చుటం గాంచి సుచరిత యాశ్చర్యముతో "అమ్మా! నే నిప్పుడే మీయింటికి రావలెననుకొనుచున్నాను!" అనియెను. ఆనందమయి నవ్వుచు "నీవు వత్తువనుసంగతి నే నెఱుఁగను గాని, యెందుకొఱకు రాఁదలఁచితివో యాసంగతి నాకుఁ దెలియుటచే నిలువఁజాలక నేనే వచ్చితిని!" అనియెను. ఆనందమయికీసంగతి తెలిసిన దని విని సుచరిత యాశ్చర్యపడియెను. ఆనందమయి మృదుస్వరముతో "అమ్మా! నేను వినయుని నాబిడ్డగనే చూచికొనుచున్నాను. అతనిని బట్టియే, మీసంగతి యెఱుఁగనప్పుడుకూడ నేను మిమ్ములను మనఃపూర్వకముగ నాశీర్వదించుచుంటిని. అట్టి నేను మీ కేదియో యన్యాయము జరిగిన దని విని సహించియుండఁగలనా? నావలన మీ కట్టియుపకార మైన నగునో కాదో యెఱుంగను, కాని మనసు నిలుపుకొనఁజాలక తత్తరముతో మీచెంతకు వచ్చితిని. అమ్మా! వినయునివలన నేమైన నన్యాయము జరిగినదా?" అని ప్రశ్నించెను.

సుచ—ఎంతమాత్రమును జరుగలేదు. ఈగొడవ కంతకును లలితయే బాధ్యురాలు. లలిత యెవ్వరికిని జెప్పకుండ స్టీమరుపైఁ దనతోఁ బ్రయాణము చేయునని వినయబాబెన్నఁడు నూహించియైన నుండలేదు. కాని యాయిరువురకును రహస్యాలోచన

జరిగియుండునని లోకు లనుకొనుచున్నారు. మఱియును లలిత తీవ్రస్వభావ! ఇందలి సత్యము నడిగి తెలిసికొనుట కామె యెంతమాత్రము నవకాశ మొసంగునది కాదు.

అనం—దీనికేదైన నుపాయ మాలోచింపవలయును. ఈసంగతి విన్నది మొదలు వినయునిహృదయమున కించుకంతయును శాంతి లేదు. అతఁడు తానే యపరాధి ననుకొనుచున్నాఁడు!

సుచరిత యారక్తవదనమండలము నించుక వంచి "అమ్మా! మీయుద్దేశము వినయబాబు—" అని సంకోచపీడితయై పలుకుచుండఁగా నానందమయి యామాట కడ్డము వచ్చి "అమ్మా! లలితకొఱ కేమి చేయుమన్నను వినయుఁడు చేయఁగలఁడు! అతని చిన్నతనమునుండియు నేను చూచుచున్నాను. వినయుఁ డొకసారి యాత్మసమర్పణము గావించినచో నిఁక నేదియుఁ దనకొఱ కుంచుకొనువాఁడు కాఁడు! అందుచేతనే నాతనిహృదయము మరలించుకొనుటకవకాశము లేకుండ నెట్టితావున లగ్నమైపోవునోయని నేను చాలభయపడుచుందును." అనియెను. సుచరితహృదయమునందలి యొకబరువు దిగిపోయెను. ఆమె యించుకధైర్యముతో "అమ్మా! లలితసమ్మతికొఱకు మీ రాలోచింప నక్కఱలేదు. ఆమె మనసు నే నెఱుఁగుదును. కాని వినయబాబు తనసమాజమును త్యజించుట కొప్పుకొనునా?" అనియెను.

అనం—అమ్మా! సమాజ మాతని విడువవచ్చును. కాని ముందుగా నాతఁడు సమాజము నేల పరిత్యజింపవలయును? ప్రయోజన మేమైన నున్నదా?

సుచ—అట్లనియెద వేమి తల్లీ! వినయబాబు హిందువుగ నేయుండి బ్రాహ్మకన్యను పెండ్లియాడునా?

అనం—అతని కట్టితలంపున్నచో మీ కేమైన నభ్యంతరమున్నదా?

సుచ—అది యెట్లు సంభవమగునో నాకు బోధపడుటలేదు.

అనం—అమ్మా! నాకుమాత్ర మిది సులభముగ నే తోఁచుచున్నది. మా యింటిపద్ధతి చూడుము. నేను నాకులాచారములను గణించుట లేదు. అందుచే లోకులు నన్ను క్రిస్టియనుగా భావించుచుందురు. కొన్నికొన్ని కర్మసమయములందు నే నిచ్ఛాపూర్వకముగ మాఱిపోవుచుందును. నీవు వినిన నవ్వెదవు! గోరా నాయింట నీరైన ద్రాగఁడు! అంతమాత్రముచే నీయిల్లు నాది కాదనియు, నీసమాజము నాది కాదనియు నేల చెప్పవలయును? అట్లనుటకుఁగూడ నాకిష్టము లేదు. మంచిచెడ్డలన్నిటిని భరించియే నేనీగృహమును, సమాజమును స్వీకరించితిని. అందుచేతనే యవి నన్నించుకంతయును బాధించుటలేదు. ఒకవేళ భరింపరానిబాధ కలిగినచో నప్పుడీశ్వరుఁడు తోపించినత్రోవనుబట్టి పోవుదును. కాని తుదివఱకును నాగృహసమాజము

లను నావియనియే చెప్పుకొనుచుందును. సమాజమువారు నన్ను స్వీకరింపకున్నఁ బోఁబోనిమ్ము! అది వారియిష్టము!

సుచరిత కింకను సంశయము తీరక “అమ్మా! సరే కాని బ్రాహ్మపద్ధతులను మాత్రము వినయుబాబు—” అని మాట ముగింపకుండఁగనే యానందమయి “వాని మతముకూడ నటువంటిదే నమ్మా! బ్రాహ్మమత మనిన సృష్టిలో లేనిమతము కాదు మీపత్రికలలోని యుపదేశములను నేను తఱచుగఁ జదువుచునే యుందును నాకెచ్చటను భేద మగపడుట లేదు!” అనియెను.

ఇంతలో “సోదరీ!” అని పిలుచుచు లలిత యాగదిలోనికి వచ్చి యానందమయిం గాంచి సిగ్గుపడిపోయెను. ఇంతవఱకును దనమాటలే జరుగుచున్న వని యామె సుచరిత మొగము చూచినంతనే తెలిసికొనియెను. లలిత యటనుండి పాఱిపోఁదలఁచెను గాని, యామె కట్టియవకాశము దొరకినది కాదు. ఆనందమయి యామెం గాంచి “అమ్మా! లలితా! రమ్ము!” అని చేయి పట్టుకొని లలిత తనదే యైపోయినట్లుగా నామెను దగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొని సుచరితం గాంచి పూర్వప్రస్తావము నందుకొని “అమ్మా! చూడుము! మంచితోఁ జెడ్డ కలియుట యన్నిటికంటెను గఠినమే—కాని ప్రపంచమునం దట్టికలయికయును జరగుచునేయున్నది—అందువలన సుఖమును దుఃఖమును గలుగుచునేయున్నది. అందువలన నెల్లప్పుడును జెడ్డయే కలుగుటలేదు. మంచియును గలుగుటలేదు. అట్టిసమ్మేళనమే సంభవమైనప్పుడు కేవలమతభేద మున్నంతమాత్రమున నిరువురు మానవులసమ్మేళనమున కెట్టియభ్యంతరము కలుగునో నాకు బోధపడుటలేదు. మానవుల సమ్మేళనమునకుఁ గారణ మొక్కమతమేనా?—మీ సమాజమునందును మానవులలోఁ బరస్పరసమ్మేళన మగుట లేదా! లోపలనుండి యీశ్వరుఁ డైక్యము చేసినవారిని వెలుపలనుండి మీ సమాజము వేఱుచేయునా! అమ్మా! అల్పభేదములను బాటింపక యైకమత్యముచే సర్వసమ్మేళనముం గావించుసమాజ మెచ్చటను లేనేలేదా? ఈశ్వరునితో మానవుఁడు కేవలము నిట్లు పోరాడుచుండవలసినదేనా? సమాజ మనునది కేవలము నిందుకొఱకేనా!” అనియెను.

ఆనందమయి యీవిషయమున నింతతీవ్రముగ నుపన్యసించుట లలితావినయుల వివాహమునకుఁ గలయభ్యంతరమును దూరముచేయుటకేనా? సుచరిత మనస్సులోని సంశయమును దీర్చుటకై యానందమయి తనసర్వశక్తిని వినియోగించుటయందు మఱి యొక యుద్దేశమేమైన నున్నదా? సుచరిత యిట్టిసంస్కారములలోఁ జిక్కుకొని యుండుట యానందమయి కింతమాత్రము నిష్టములేదు. వినయుఁడు బ్రాహ్మమతమునఁ జేరకున్నచో వివాహము కాఁగూడదని సిద్ధాంతమైనయెడల, దుస్సహదుఃఖమయములగు నీదినములలోఁగూడ నానందమయి హృదయమున వర్ధిల్లుచున్న యాశ

యంతయును నిర్మూలమైపోవును. నేఁటిదినమున వినయుఁ డామెచెంతకు వచ్చి “బ్రహ్మసమాజపట్టికయందు నా పేరు చేరవలసినదేనా!” అని యడిగినప్పు డామె యావశ్యకము లేదని చెప్పివైచినది.

సుచరిత యానందమయితో నెట్టివాదమును జేయక మౌనముతోఁ గూర్చుండి యుండెను. సుచరితయుద్దేశ మింకను మాఱలేదని నిశ్చయించుకొని యానందమయి తనలో “నేను కేవలమును గోరాయందలి ప్రేమచేతనే నాసమాజధర్మముల నన్నిటిని వదలుకొంటిని—కాని, సుచరితహృదయ మింకను గోరాయందుఁ బూర్తిగ లగ్నము కాలేదా? అయినచో నీచిన్నవిషయ మింతగొప్పవిషయము కాఁజాలదు!” అని భావించుకొనియెను. అందుచే నానందమయిహృదయము కొందలపడుచుండెను. ఇఁక రెండుదినములలో గోరా జైలునుండి వచ్చును. అతని లోకసుఖక్షేత్రము సిద్ధమై యున్నదనియు నీసారి యాతని నెట్లయిన బంధింపకున్నచో నెచ్చట నెట్టికష్టము కలిగినను నాతని కాధారము లేకుండు ననియు నామె భావించుకొనుచుండెను. కాని గోరాను బంధించుట స్త్రీజనసామాన్య మగుపనియా? విహైందవకన్యనైన గోరాకుఁ బెండ్లిచేయుట యన్యాయమని యెంచి యనేకు లిచ్చెదమని చెప్పవచ్చినను నానందమయి యింతవఱకు నంగీకరింపలేదు. గోరా నాకుఁ బెండ్లియే యక్కఱ లే దనుచుండెను. తల్లియై యుండియు నానందమయి యావిషయమునగోరాకు మారాడకుండుట లోకుల కాశ్చర్యకరముగా నుండెను. ఈనడుమ గోరాహృదయమునం దోఁచిన యొకటి రెండులక్షణములం గాంచి యానందమయి కానందముగా నుండెను. అందుచేతనే యిప్పటికిసుచరితనిశ్చబ్దనిరుద్ధభావ మామెకు బాధాకరముగ నుండెను. కాని యామె సామాన్యముగఁ బట్టు వదలునదికాదు. ఆనందమయి తనలో “సఖీ! చూతము!” అని యనుకొనియెను.

## ౫౩

పరేశుఁడు వినయునిం గాంచి “బాబూ! నీవు లలితను విపత్తునుండి యుద్ధరించుటకై దుస్సాహసకార్యముం గావించుట నాకిష్టములేదు. సామాజికపరివాద మొకలెక్కలోనిది కాదు. నేఁడు దీనిని గూర్చి యింతగోడవ పుట్టినదో, కొన్నాళ్లయినతరువాత దాని నందఱును మఱచిపోవుదురు” అనియెను.

లలితకొఱకుఁ దనకర్తవ్యమును నిర్వహింపవలె నని వినయుఁడు నిస్సంశయముగ సంసిద్ధుడై వచ్చియుండెను. ఈవివాహము సమాజమునకు విరుద్ధమనియు నన్నిటికంటెను గోరాకుఁ గ్రోధకారణమనియు వినయుఁ డెఱుంగును. కాని కర్తవ్యనిర్వాహణమునకై యాతడు సమస్తాప్రియకల్పనలను మనసునుండి త్రోసివైచుకొనియెను. అట్టిస్థితిలోఁ బరేశుఁ డాకస్మికముగ నాతనికర్తవ్యనిశ్చయమును త్రోసివేయఁ దలఁచెను.

వినయుఁడు దానిని వినవఁజాలక "నేను మీప్రేమఋణము నెట్లును దీర్చికొనఁజాలను. నామూలమున మీకుటుంబమున లేశమాత్రమైన నశాంతి గలుగుటకు నేను సహింపఁజాలను!" అనియెను.

పరే—వినయా! నీవు నాయుద్దేశమును సరిగా గ్రహింపఁజాలకుంటివి. నీకు నాయెడల గౌరవ మున్నందులకు నేనానందించుచున్నాను. కాని, నాయందలిగౌరవమును బట్టి నీవు నాతనయను బెండ్లియాడఁదలంచుట నాతనయకు గౌరవము కాదా? అందుచేతనే యీకష్టము నీవించుకంతయైనను త్యాగము జూపవలసినంతటి గొప్ప కష్టము కాదని చెప్పుచున్నాను.

ఎట్లయిననేమి. వినయుఁడు కర్తవ్య బాధ్యతనుండి విముక్తుఁ డయ్యెను. కాని, పంజరద్వారము తెఱవఁబడినంతనే పక్షి యెగిరిపోవునట్లతని హృదయము నిష్కృతి సంబంధమగు నిరాతంకపథమున విహరింపఁ జాలకుండెను; ఇప్పటికిని నాతఁడు కదలఁదలఁచుకొనలేదు! కర్తవ్యమును గావించుటకై యాతఁడు చిరకాలబంధముల నన్నిటిని ద్రెంచుకొని సిద్ధపడి యుండెను. ఆతనిహృదయము పూర్వ మెచ్చట నడుగుపెట్టుటకైనను భయపడుచు నపరాధివలె మరలి పోవుచుండెనో యాస్థానమునందే యిప్పుడు స్థిరముగ నిలిచి లంకాకాండమును సాధింపఁజూచుచున్నది! ఇఁక దానిని మరలించు టెంతకష్టము! ఆతనిచేయి పట్టుకొని యంతవఱకును దీసికొనివచ్చిన కర్తవ్యబుద్ధి యిప్పుడు 'ఇచ్చట నేమియును బనిలేదు. పోవుదము రమ్ము!'' అని బోధించుచుండెను. కాని యాతనిహృదయము మాత్రము "మీకుఁ బనిలేకున్నచో మీరు పొండు! నేనిచ్చటనే యుండిపోయెదను!" అనుచుండెను.

పరేశుఁడెచ్చటను నెట్టియడ్డమును లేకుండఁజేయుటచే వినయుఁడు "నేను కర్తవ్యనిరోధముచే నిట్లు చేయుచుంటి నని మీరనుకొనవలదు. మీసమ్మతి కావలయును. నాకంతకంటెను సౌభాగ్యము వేఱొదియును లేదు. కాని కేవలము నాభయ మేమనిన ఒకవేళ—" అనునంతనే సత్యప్రియుఁ డగు పరేశుఁడు "నీవు భయపడవలసినపని లేదు. లలిత నీకుఁ బ్రతికూలముగ లేదని నేను సుచరితవలన వింటిని!" అనియెను.

వినయుని మనోమధ్యమున నానందవిద్యుల్లేఖ నృత్యము సేయఁదొడంగెను. లలిత మనసులోని గూఢోద్దేశము సుచరితకుఁ దెలిసినది. ఎప్పుడు తెలిసినది? ఎట్లు తెలిసినది? ఆభాసముగనో యనుమానముగనో యీసంగతి యాసఖీమణుల కిరువురకును దెలిసిపోయిన దని యెఱుంగుటచే సుతీవ్రంబును, రహస్యమయంబును నగు సుఖము వినయుని భేదింపఁదొడంగెను. అప్పుడు వినయుఁడు "మీరు నన్ను యోగ్యునిగాఁ దలంచుటకంటె నాకానందము మఱే యేమున్నది?" అనియెను.

పరే—నీవిట నొక్కించుకసేపు వేచియుండుము. నేను మేడమీఁదికిఁ బోయి వచ్చెదను.

అని యాతఁడు వరదాసుందరికడకుఁ బోయి యామెయుద్దేశము నడిగెను. అందుపై నామె "వినయుఁడు బ్రాహ్మమతదీక్షితుఁడు కావలయును!" అనియెను.

పరే—అట్లే కావచ్చును!

వర—ముందా సంగతి తేలవలయును. అతనిని పైకిఁ బిలువుఁడు!

వినయుఁడు మేడమీఁదికి వచ్చినంతనే వరదాసుందరి "అట్లయినచో దీక్షాదినము స్థిరపఱుపవలయును!" అనియెను.

విన—దీక్షగ్రహణ మంతయావశ్యకమా?

వర—కాదా? కాకున్నచో బ్రహ్మసమాజమున నీకుఁ బెండ్లి యెట్లగును!

వినయుఁడు మౌనముతోఁ దలవంచుకొని కూర్చుండెను. వినయుఁడు తమతోడి సంబంధమునకు సమ్మతించుటచేతనే తమసమాజమునఁ జేరుట కొప్పుకొని యుండెనని పరేశుఁ డనుకొనియెను. అప్పుడు వినయుఁడు "బ్రాహ్మమతధర్మములందు నాకు శ్రద్ధయున్నది. నాయాచరణముకూడ దానికి వ్యతిరేకము కాదు. ఇట్టిచో విధాయకముగ దీక్షయే గైకొనవలసినపని యేమున్నది?" అనియెను.

వర—మతమునఁ గలియఁదలఁచినప్పుడు దీక్ష గైకొన్నచో దోష మేమి?

విన—హిందూసమాజముతో నాకిట్టిసంబంధమును లేదని నేను చెప్పఁజాలను.

వర—అట్లయినచో నీవిషయమునఁ బ్రయత్నించుట నీదే తప్పు! మాయందలి దయచే మాకుపకారము చేయుటకై మాబిడ్డను పెండ్లియాడుట కంగీకరించితివా?

తనప్రస్తావము వారికిఁ గేవల మవమానజనకమైపోయె నని వినయునిహృదయము పరితపించి పోవుచుండెను. ఈనడుమ వెలువడిన సివిల్ వివాహశాసనమును ఖండించుచు, గోరావినయులు పత్రికలలోఁ దీవ్రముగఁ జర్చించియుండిరి. వినయుఁ డిప్పు డట్టిపెండ్లికి సమ్మతించి తాను హిందువునుగానని చెప్పుకొనుట యెంతకష్టము! వినయుఁడు హిందువుగనే యుండి లలితను బెండ్లియాడఁ దలఁచె నని పరేశుఁడనుకొనలేదు అప్పుడు వినయుఁడొక్కనిట్టూర్పు విడిచి లేచి వరదాసుందరిపరేశులకు నమస్కరించి "నన్ను క్షమింపుఁడు! ఇక నేనెన్నఁడు నట్టితప్పు చేయను!" అని చెప్పి యాగదినుండి వెడలిపోయెను.

అతఁడు మెట్లకడకు వచ్చి యొకమూల బల్లపై నొంటిగఁ గూర్చుండి యుత్తరము వ్రాసికొనుచున్నలలితం గాంచెను. అడుగులచప్పుడు విని లలిత మొగమెత్తి వినయుని మొగమువంకఁ దిలకించెను. ఆకటాక్షరేఖ యొక్కనిమిషములో వినయుని హృదయమునంతను మథించివైచెను. వినయునకు లలిత నూతనపరిచిత కాదు! ఆమె యిదివఱ కెన్నియోసారు లాతనిం జూచినది. కాని యిప్పు డామెదృష్టిమధ్యమునం దేదియో రహస్యము బయల్పడినది కాఁబోలును? సుచరిత లలితమనసులోనియుద్దేశ

మును గ్రహించినది. అవనోభావ మప్పుడు లలితవినీలనయనపల్లవచ్ఛాయను గరుణాపరిపూర్ణమైనజలస్నిగ్ధమేఘమునుంబోలి వినయునికన్నులం బడియెను. ఆక్షణదృష్టిమాత్రముననే వినయునిహృదయవేదన మెఱపుమెఱసినట్లయిపోయెను. వినయుఁడేమియు మాటాడకుండ లలితకు నమస్కరించి మెట్లనుండి దిగిపోయెను.

## ౫౪

గోరా జైలునుండి వెలువడినతోడనే ద్వారమునొద్ద వేచియున్న పరేశబాబును, వినయునిం గనుఁగొనియెను. ఒకమాస మనిన దీర్ఘకాలము కాదు! అతఁ డంతకంటె నెక్కువకాలమే యాత్మీయులను విడిచి ప్రచారము చేసియుండెను. కాని యిప్పు డొక నెలవఱకును జైలునం దుండి వెడలుటచే నాతనికిఁ బరేశవినయులను గాంచినంతనే పురాతనబంధుపరిచిత మగుసంసారమునఁ బునర్జన్మముం గాంచిన ట్లయ్యెను. ఆరాజమార్గమున, నావివృతాకాశాంతరమున, నాప్రభాతాలోకమధ్యమున కాంతంబును, స్నేహపూర్ణంబును, సహజసౌమ్యంబును నగుపరేశునివదనమండలముం గాంచి గోరా భక్త్యానందములచే నాతని పాదధూళిని శిరంబునం దాల్చెను. అతఁ డిదివఱకెన్నఁడు నట్లు చేయలేదు! పరేశుఁ డాతనిం గౌఁగిలించుకొనియెను.

గోరా వినయునిచేయి పట్టుకొని నవ్వుచు "వినయా! బడినిఁ బ్రవేశించినది మొదలొక్కవిధముగా నీతోఁ గలసి సమస్తశిక్షాలాభముం గాంచితిని కాని యీవిద్యాలయమునకుమాత్రము నిన్ను మోసముచేసి నేనొక్కఁడనే పోయితిని" అనియెను. వినయుఁడు నవ్వుటకుఁగాని మాటాడుటకుఁగాని శక్తుఁడు కాఁజాలకపోయెను. కారాగృహదుఃఖరహస్యమధ్యమునుండి యాతనిమిత్రుఁడు—మఱియును ప్రాణబంధుఁడు విడివడి వచ్చియుండెను! ఆగంభీరసంభ్రమముచే నాతనికి నోటమాట వెలువడకుండెను! అప్పుడు గోరా "అమ్మ యెట్లున్నది?" అని ప్రశ్నించెను.

విన—అమ్మ సుఖముగనే యున్నది!

పరే—బాబూ! రమ్ము! బండి సిద్ధముగా నున్నది!

ఆముువ్వురును బండి నెక్కఁబోవుచుండఁగా నంతలో నవినాశుఁడు వగర్చుకొనుచుఁ బాలకదళముతో నటకువచ్చుచుండెను. గోరా యాతనిం గాంచి శీఘ్రముగ బండి నెక్కఁదలంచెను గాని యంతకు ముందే యవినాశుఁడు వచ్చి "గౌరమోహన బాబూ! కొంచెము మాఁగుము!" అనియెను. ఇంతలో బాలకు లుచ్చస్వరముతో నిట్లు పాడ నారంభించిరి;—

"తేరి దుఃఖనిశిధి ౹ తెల్లవారె"
పారతంత్ర్యపాశమునకుఁ ౹ బట్టు జారె"

గోరా కొంత మెత్తబడిపోయెను. అతఁడు తనవజ్రగ్రాంస్వరముతో "ఆఁగుఁడు!" అనియెను. బాలకులు విస్మితులై యూరకుండిరి. అప్పుడు గోరా "అవినాశా! ఈవ్యాపార మంతయు నేమి?" అని ప్రశ్నించెను. అవినాశుఁడు తనజాలువనుండి యరఁటి యాకున ముడిచి తెచ్చిన కుందకుసుమమాలికనుఁ బైకి దీఁసెను. తోడనే యొకబాలకుఁడు స్వర్ణజలముద్రిత మగునొక కాగితమును దీసి యందలి కారాగృహవిమోచనాభినందనమునుఁ దనవీణాస్వరముతోఁ జదువ నారంభించెను. గోరా యవినాశుని పుష్పహారమును గ్రహింపక క్రోధరుద్ధకంఠస్వరముతో "మీనాటక మారంభమైనట్లున్నదే? ఇప్పుడీనడివీధిలో నన్నుఁగూర్చి మీసమాజమున హాస్యనాటక మాడఁదలంచితిరా! ఈ నెలదినములనుండియు మీరుచేసినప్రయత్నమిదియేనా!" అనియెను.

అవినాశున కీయూహ చాలదినములనుండియే యుండెను. ఇదిచాల నద్భుతముగా నుండు నని యాతఁ డనుకొనియెను. ఆదినములలో నిట్టియభ్యంతరములు లేవు. అవినాశుఁడు వినయునితో నైన నాలోచింపక యీగొప్పతన మంతయుఁ దానేవహింపవలయు నని లోభించెను. పత్రికలకు వ్రాయవలసిన సంగతులనుగూడ వ్రాసియుంచుకొనియెను. ఇటనుండి యింటికిఁ బోయినతరువాత వానినిఁ బూర్తిచేసి పంపుటకు స్థిరపఱచుకొనియెను. గోరా యిట్లు తిరస్కరించుటచే నవినాశుఁడు సంక్షుబ్ధుఁడై "నీవన్యాయము చేసితివి. నీవు కారాగృహమునఁ బడినబాధకంటె మాబాధ తక్కువ కాదు. ఈనెల దినములు ప్రతినిమిషమును మాహృదయములు దుఃఖానలములచే మండిపోవుచున్నవి!" అనియెను.

గోరా—అవినాశబాబూ! నీవు పొరఁబడుచున్నావు. ఇంచుక స్థిరహృదయముతోఁ బరీక్షించినచో నిట్టియగ్నిజ్వాలలును నీహృదయమును బాధింపజాల వని బోధపడియుండును!

అవి—సరే దానిమాటకేమి! అధికారులు నిన్నవమానించినను నీవు భారతవర్షమున కంతకును ముఖ్యుఁడవైతివి. ఇట్టిచో మాసన్మానహారమును—

గోరా—ఇఁక నాప్రశంస యెత్తవలదు.

అని యవినాశుని, నాతనిదళమును నొకప్రక్కకుఁ దొలఁగించి "పరేశబాబూ! బండిపై నెక్కుఁడు!" అనియెను. పరేశుఁడు బ్రతికితి ననుకొని బండి నెక్కెను. గోరా వినయులును నాతని ననుసరించిరి.

స్టీమరుపైఁ బ్రయాణముచేసి మరునాఁటియుదయమునకు గోరా తనయింటికి వచ్చెను. అతఁడు వచ్చునప్పటికి సమాజమువా రందఱును ద్వారముకడ మూఁగియుండిరి. వారి నెట్లో తప్పించుకొని గోరా యానందమయి యంతఃపురమునకుఁ బోయెను. ఆమె ప్రాతఃకాలముననే స్నానముచేసి సుసిద్ధయై యుండెను. గోరా

యామెపాదములకు సాష్టాంగప్రణామమును గావించుటయు సానందమయి నయనద్వయమునుండియు నశ్రుజలము ప్రవహింపఁ దొడంగెను. ఇంతకాలమునుండియు విరుద్ధమైయున్న యాయశ్రుజలమిప్పు డానిరోధమును సహింపఁజాలకపోయెను.

కృష్ణదయాళుఁడు స్నానము చేసి వచ్చినంతనే గోరా యాతనిఁ దర్శించి యాతని పాదస్పర్శనము చేయకుండఁగనే దూరమునందుండి ప్రణామమును గావించెను. కృష్ణదయాళుఁడును సంకోచముతో దూరముగ జరిగి కూర్చుండెను. అప్పుడు గోరా "బాబా! నేను ప్రాయశ్చిత్తము చేయించుకొనఁ దలచుచున్నాను," అనియెను.

కృష్ణ—అది యంత యావశ్యకముగా దోఁచుట లేదు.

గోరా—నేను జైలునందలి కష్టమును లక్ష్యము చేయలేదు. కేవలము నేనశుచి నైపోయితినిగదా యనిమాత్రమే విచారముగ నుండెను. ఆవిచార మింకను దీరుట లేదు. ప్రాయశ్చిత్తము చేసికొనియే తీరవలెను!

కృష్ణ—వలదు వలదు. అంతగొడవతో నిమిత్తము లేదు. అది నాకిష్టములేదు.

గోరా—సరే! పండితులతోఁగూడ నాలోచించెదను!

కృష్ణ—ఇందెట్టిపండితాలోచనయు నక్కఱలేదు. నీకు ప్రాయశ్చిత్తముతోఁ బ్రయోజనము లేదని నేను నియమించుచున్నాను!

కృష్ణదయాళునివంటియాచారపరుఁడు గోరాయాచారముల నంగీకరింపకుండుటయే కాక దానికి విరుద్ధముగా నేల యుపదేశించుచుండెనో గోరా యింతవఱకును గ్రహింపఁజాలకయే యుండెను. నేఁడానందమయి భోజనగృహమున గోరా ప్రక్కనే వినయునకును వడ్డించుటం గాంచి గోరా "అమ్మా! వినయునకు నాపంక్తిని వడ్డింపవలదు" అనెను.

ఆనం—ఏమి బాబూ! వినయుఁడేమితప్పు చేసినాఁడు?

గోరా—తప్పు వినయునిది కాదు. నాది! నేనిప్పు డశుచినై యున్నాను.

ఆనం—ఉండవచ్చునుగాని, వినయున కట్టిసంశయము లేదుగదా!

గోరా—అతనికి లేకపోవచ్చును. కాని నాకుమాత్ర మున్నది!

భోజన మైనతరువాత గోరావినయులు మేడమీఁదిగదిలోనికిఁ బోయి కూర్చుండిరి. కాని యెవరినోటను మాట లేదు. ఈమాసముదినములనుండియు నన్నిటికంటెను మించియున్న తనమనసులోని విషయము నిప్పుడు గోరా కెట్లు దెలుపవలయునో వినయున కామార్గము బోధపడకుండెను. పరేశునికుటుంబమువారింగూర్చి తెలిసికొనవలయు ననుకుతూహలము గోరామనసునందుఁగూడ నున్నది. కాని యాతఁడు వెల్లడించుట లేదు. అప్రశంస వచ్చుటకొఱకే వినయుఁడు ప్రతీక్షించుచుండెను. "బిడ్డలందఱును క్షేమముగ నున్నారా?" అని గోరా యిదివఱకే పరేశునిఁ బ్రశ్నించి

యుండెను. కాని యది కేవలము గౌరవప్రశ్నమాత్రమే—క్షేమమును తెలిసికొనుట యే కాక యింకను విశేషముల నెఱుంగవలయు ననుకోరిక యాతనిమనసులో లేక పోలేదు.

ఇంతలో మహిముఁడు గదిలోనికి వచ్చి కూర్చుండి కొంతసేపటివఱకు మెట్లు ఎక్కి వచ్చిన యాయాసముచే వగర్చుచు, నించుక శాంతించినతరువాత "వినయ బాబూ ఇన్నాళ్లును గోరాకొఱకు వేచియుంటిమి. ఇఁక నెట్టియభ్యంతరమును లేదు. ఈసారి మనము స్థిరపఱచుకొనవలయును. గోరా! నీ వేమనియెదవు? జరగిన సంగతు లన్నియు నెఱుంగుదువుగదా" అనియెను. గోరా యేమియు మాటాడక మందహాసముచేసెను.

మహి—అట్లు నవ్వెద వేమి? అన్న యీమాట నింకను మఱచిపోలేదనియా? పెండ్లి కదిగియున్నది. బిడ్డగాని పీడకల గాదుగదా! ఇది స్పష్టముగా నగపడుచున్న సత్యపదార్థము!—మఱచిపోవుట కవకాశమే మున్నది! నవ్వవలదు! గోరా! ఈసారి స్థిరపడి తీరవలయును!

గోరా—స్థిరపఱచుకర్త చెంతనే యుండెనుగాదా!

మహి—ఎంతమాట! స్థిరపఱచుట కాతనికే స్థిరత్వము లేదు! నీవు వచ్చితివి. ఇప్పు డీభార మంతయు నీదే!

వినయుఁ డిప్పుడు గంభీరముగ మౌనమును వహించి యుండెను. పరిహాసముగ నైన నాతఁ డెట్టిమాటయు ననలేదు. అప్పుడు గోరా "దాదా! ఆహ్వానించుభారము, నాహారపదార్థములను సమకూర్చుభారము నాతిథ్యమును నెఱవేర్చుభారముఁగూడ నేనే వహింపఁగలను. కాని, వినయుఁడు నీతనయను పెండ్లియాడునట్లు చేయుభారమును మాత్రము మా నాపైఁ బెట్టుకొనఁజాలను. ఏప్రేమనిర్బంధముచే సంసారమున సమస్తకార్యములును జరుగుచుండునో యాప్రేమతత్త్వములఁగూర్చి నాకువిశేషపరిచయములేదు. నేను దానికి దూరముననే యుండి సర్వదా నమస్కరించుచుందును!" అనియెను.

మహి—నీవు దూరముననున్నంతమాత్రమున నది దూరమగునని తలంపకుము. అది యాకస్మికముగ నెప్పు డాక్రమించునో చెప్పఁజాలము! అది నీయెడల నెట్లు పనిచేయుచున్నదో చెప్పఁజాలనుగాని యీవినయునిమాత్రము చాలవఱకుఁ గలఁచివైచినది. ఈవిషయమున నంతయును వినయునిమీఁదనే పెట్టి నీవెంతమాత్రమును గల్పించుకొనకున్నచోఁ దుదకుఁ బశ్చాత్తాపపడవలసివచ్చును.

గోరా—ఇతరులభారమును వహించుటకంటె. బశ్చాత్తాపమైనను నాకిష్టమే. అట్లువహించియును బశ్చాత్తాపపడుట కష్టముగదా! అది లేకుండుటకే నేను కోరుకొనుచున్నాను!

మహి—ఒక బ్రాహ్మణకుమారుని కులగౌరవములన్నియును ధ్వంసమై పోవుచుండఁగా నీవూరక చూచుచుఁ గూరుచుండెదవా? దేశప్రజలహిందూత్వమును రక్షించుటకై నిద్రాహారములను త్యజించుచున్న నీవు నీమిత్రుఁడే జాతిభ్రష్టుఁడై బ్రాహ్మమతమునఁ గలిసిపోవుచుండఁగాఁ జూచి లోకులయెదుట నెట్లు తలయెత్తుకొని తిరుగఁగలవు?—వినయబాబూ! ఇది నీకుఁ గోపముగా నుండు ననుకొనియెదను! తెలిసినవారు నీవు లేనప్పుడైన నీసంగతులను గోరాకుఁ జెప్పకపోరు. నేను నీయెదుటనే చెప్పివైచితిని. ఇది యుభయపక్షములకును మంచిది కాదా? నీవిషయమునం గలిగినప్రవాదము మిథ్యయైనచో నీమాటతోఁ దీరిపోవును; సత్యమైనచో నీకించుక బోధింపఁగలదా?

వినయుఁ డప్పటికిని మాటాడలేదు. మహిముఁడు చటాలున లేచిపోయెను. అప్పుడు గోరా "వినయా! ఇది యంతయు నేమి?" అనియెను.

విన—ఒకటిరెండుమాటలతో సర్వమును దెలుపుట కష్టము! అందుచేతనే క్రమక్రమముగా నీకంతయు నెఱిఁగింపఁ దలఁచితిని. కాని యీప్రపంచమునం దెట్టిసంఘటనలును మన కనుకూలము లగునట్లు శాంతముగను, స్వస్థముగను ఘటిల్లవు. అవి క్రూరమృగములవలెఁ జాటున దాఁగియుండి యాకస్మికముగఁ బైఁబడుచుండును. కానివార్త మొట్టమొదట నివురుగప్పిననిప్పువలె నుండి క్రమముగా జాజ్వల్యమానమై దుర్నిరీక్ష్యముగా నుండును! అందుచేతనే కర్మమాత్రము త్యజించి స్థాణువువలె నుండుటయే మానవునకు ముక్తియైయుండు నని నేనొక్కొక్కప్పు డనుకొనుచుందును!

గోరా—నీవొక్కఁడవును స్థాణువువలె నున్నంతమాత్రమున ముక్తి యెక్కడిది! నీతోఁగూడ జగత్తంతయును స్థాణుత్వము గాంచకున్నచో నందు నీకు స్థిరత్వ మెక్కడిది! అది మఱియు నుపద్రవముగా నుండును. జగత్తంతయును బనిచేయుచున్నప్పుడు నీవును జేయకున్నచో నది మోసమగును. కావున సంఘటనములు నీజాగ్రత్తకు భంగము కలిగించిపోకుండునట్లు చూచుకొనుచుండవలయును. ఇట్లు చేయకున్నచో నీవు సంసిద్ధుఁడవు కాకుండఁగనే సమస్తమును బోవును.

విన—ఈమాట నిజమే—నేనే సిద్ధముగ లేను! ఇప్పుడుకూడ నేను జాగ్రతపడి యుండలేను. ఏవైపునుండి యేమి వచ్చునో నాకుఁ దెలియనే తెలియదు. కాని యెప్పు డేమి ఘటిల్లినను నేను దానికి బాధ్యుఁడను కావలసి వచ్చుచున్నది! ఏది మొదట సంఘటిల్లకపోవుటయే బాగుగ నుండెనో, యది యిప్పు డప్రియమైనను విడువరానిదై పోయినది!

గోరా—ఆఘటన యేమో తెలియకుండఁ దత్త్వాలోచనము చేయుట యెట్లు?

అనుటయు వినయుఁడు చటాలున "లలితకును నాకును గలిగిన సంబంధ మనివార్యఘటనాక్రమముచే నిప్పుడు నే నామెను బెండ్లియాడకున్నచో సమాజమునం దామె బ్రతికియున్నంతవరకు నకారణాపవాదమునకు లోఁబడవలయునంతటి స్థితికి వచ్చినది!" అని చెప్పివైచెను.

గోరా—ఆస్థితి యెట్టిదో చెప్పుము!

విన—చాలసంగతు లున్నవి. క్రమముగాఁ జెప్పెదను. కాని నీవంగీకరింపవేమో!

గోరా—మంచిది. అట్లే యంగీకరింతును. కాని, ఘటన యనివార్యమైనప్పుడు దానివలనం గలుగుదుఃఖముకూడ ననివార్యమే యని చెప్పుచున్నాను. లలితకు సమాజమునం దవమానపడవలసియే యున్నచో నిఁక దాని కుపాయములేదు!

విన—కాని యట్లు కాకుండఁ జేయునుపాయము నాచేతిలో నున్నది.

గోరా—ఉన్నచో మంచిదే. కాని సాహసించి యట్లు చెప్పినచో లాభము లేదు. అభావమున దొంగతనము చేయుట, హత్యచేయుటయును, మానవుని చేతిలోని పనులే! కాని యవి ధర్మములా? లలితగౌరవరక్షణమునకొఱ కామెను బెండ్లియాడుటయేనా నీవిధాయకకృత్యము? సమాజముతో నీకుఁ బని లేదా?

వినయుఁడు తాను తనసమాజనియమము ననుసరించి బ్రాహ్మవివాహము నంగీకరింపలే దనుసంగతి చెప్పకుండఁగనే వాదించుట కారంభించి "గోరా! నేనివిషయమున నీతో నేకీభవింపఁ జాలను. నేనొక్క వ్యక్తివంకనే చూచుచు సమాజమునకు విరుద్ధముగ మాటాడుటలేదు. వ్యక్తి, సమాజము ననునీరెంటిమీఁదనుగూడ ధర్మమొకటి యున్నది. ఆధర్మముమీఁదనే దృష్టి నుంచవలయును. ఒక్కవ్యక్తినిగాని, యొక్కసమాజమునుగాని వర్ధిల్లజేయుటయే మనప్రధానకృత్యము కాదు. కేవల మేకమాత్రమగుధర్మమును వర్ధిల్లఁజేయుటయే మనకుఁ బరమకర్తవ్యము!" అనియెను.

గోరా—వ్యక్తిసమాజములతో సంబంధములేనిధర్మమును నేనంగీకరింపను.

విన—నేనంగీకరింతును. ధర్మ మనునది వ్యక్తిసమాజభిత్తిపై నాధారపడి యుండలేదు. ధర్మభిత్తిమీఁదనే వ్యక్తిసమాజములు నిలిచియున్నవి. సమాజవాంఛితము లన్నియు ధర్మములే యనుట యవివేకము! న్యాయసంగతమును ధర్మబద్ధము నగు స్వాతంత్ర్యమును సమాజము నిరోధించినచో నట్టివిరోధము నుల్లంఘించుటయే కర్తవ్యము! నేను లలితను బెండ్లియాడుట యధర్మము కానప్పుడు—ఉచితమైనప్పుడు—అది సమాజమునకుఁ బ్రతికూలమని యెంచి యాకార్యమును త్యజించినచో నేనధర్మము చేసినట్లే యగును.

గోరా — ధర్మాధర్మములు నీయొక్క నియందే యిమిడి యున్నవా ? ఈవివాహమువలన నీకుఁ గలుగఁబోవు సంతానమునకుఁ దిక్కెచ్చట నుండునో యాసంగతి నాలోచింపవలదా ?

వినయ — ఇట్టి యూహలచేతనే మానవులు సామాజిక మగునధర్మమునకు శాశ్వతత్వమును గూర్చుచున్నారు. అట్లయినచోఁ బ్రతిదినమును బెద్దదొరగారితన్నులను దినుచు సహించుచున్న పేదయుద్యోగిని మనల మేల నిందింపవలయును ? అతఁ డట్లు సహించుట తనబిడ్డలకొఱకే గాదా ?

పూర్వము వినయుఁడు గోరాతో నింతవఱకు వచ్చి వాదించుట లేదు. కొలఁది దినములనుండి యాతనిహృదయము సమాజవిచ్ఛేదమును గూర్చి శంకించుచు సంకుచితమై పోవుచుండెను. ఈవిషయమున నాతఁ డింతవఱ కేమియును వితర్కించుకొనలేదు. ఇప్పుడు గోరాతో వాదముకలుగఁగనున్నచో వినయునిహృదయము తనచిరసంస్కారానుసారం బగు ప్రవృత్తికి భిన్నముగనే పోయి యుండును కాని తర్కించినకొలఁదియు నాతనిప్రవృత్తి కర్తవ్యబుద్ధిని దోడుచేసికొని ప్రబలముకాఁజొచ్చెను — క్రమముగా వాదము ప్రబలిపోయెను. ఇట్టివిషయములందు గోరా యుక్తులకొఱకుఁ జూచువాఁడు కాఁడు. అతఁడు బలవంతముగఁ దనయుద్దేశమునే చెప్పుచుండును ఆబలముచేతనే గోరా యిప్పుడు వినయునియుద్దేశముల నన్నిటిని ఖండింపఁజూచెను గాని సాగలేదు. ఒకవంక గోరాయును, మఱియొకవంక వినయుని మతము మాత్రమును నిలిచి పోరాడినంతకాలము వినయుఁడే యోడిపోవుచుండెను. కాని యిప్పుడు రెండుపక్షములందును వాస్తవముగా మానవులే యుండిరి- గోరా యిప్పుడు వాయుబాణముచే వాయుబాణమును నిరోధింపఁజాలకుండెను. ఇప్పుడు వాఁడిబాణము వచ్చిపడుచోటున వేదనాపూర్ణమగు మానవహృదయమున్నది !— తుట్టతుదకు గోరా "వినయా ! నేను నీతో విశేషముగ వాదింపఁ దలఁచుకొనలేదు. ఇది మనసుచేఁ దెలిసికొనఁదగినదే గాని వాదింపఁదగినది కాదు. నీవు బ్రాహ్మకన్యకను బెండ్లియాడి నీదేశీయులతో వేఱుపడఁదలంచుట నాకు మిగులఁ గష్టముగా నున్నది. ఈపని నీవు చేయఁగలవు. నేనంత మాత్రము చేయఁజాలను. ఇచ్చటనే నీకును నాకును భేద మున్నది. జ్ఞానమునందు గాఁని బుద్ధియందుఁ గాని మనకు భేదము లేదు. నేను ప్రేమించుచోట నీప్రేమ లేదు. నీవు నీముక్తికొఱకు దేనిని నిర్భయముగా ఖండింపఁదలఁచితివో యది నాకు నాడీస్థానము ! నేను నాభారతవర్షమునే వాంఛింతును. దానిని నీవెంతదూషించినను, యెంతతిట్టినను నేను దానినే కోరెదను. నాకంతకంటెఁ బ్రియమైన దేవియును లేదు. దానికి లేశమాత్రమైనను నష్టము కలుగుపని యేదియును నేను చేయఁజాలను!" అనియెను.

వినయుఁ డేదియో ప్రత్యుత్తరము చెప్పఁబోవుచుండఁగా గోరా మరల నందుకొని "వలదు వినయా! నీవు నాతో వృథావాదము చేయవలదు! ఈప్రపంచ మంతయును భారతవర్షమును ద్యజించి యవమానించుచున్నను నేనాయవమానపీఠమున భారతవర్షముతోఁ గలసి యాసీనుఁడ నయ్యెదను! జాతిభేదములును, కుసంస్కారములును, విగ్రహారాధనములును గలభారతవర్షమే నాకుఁ బ్రియమైనది! నీవు దీనికి భిన్నుఁడవు కాఁదలఁచినచో నాకును భిన్నుఁడవే!" అనిచెప్పి గదినుండి వెలుపలికి వచ్చి పచారు చేయుచుండెను.

వినయుఁడు మౌనముతోఁ గూర్చుండి యుండెను. ఇంతలో సేవకుఁడు వచ్చి చాలమంది పెద్దమనుష్యులు నీకొఱకు వేచియున్నారని గోరాకుఁ జెప్పెను. తప్పించుకొనిపోవుట కుపాయము దొరకిన దని యెంచి గోరా యటనుండి వెడలిపోయెను. అందఱిలోఁ గూడ గోరాను దర్శించుట కవినాశుఁడును వచ్చి యుండెను అవినాశునకుఁ గోపము వచ్చియుండు నని గోరా యనుకొనెను గాని యాతనియందుఁ గోపలక్షణము లేవియు నగపడలేదు. అంతేకాక యుత్సాహముతో నవినాశుఁ డందఱియెదుటను గోరాను బ్రశంసించుచు "ఈగౌరమోహనబాబునందు నాభక్తిభావము ద్విగుణీకృతమై పోయినది. ఇంతకాలమువఱకు నేనీతని సామాన్యునిగాఁ దలంచితిని. కాని నిన్నటిదినమున నీతఁడు మహాపురుషుఁడని తెలిసికొంటిని. మేమీతని సన్మానింపఁబోయినప్పు డీతఁడు స్పష్టముగా వలదని వారించెను. ఈకాలమునం దట్లు చేయువా రెందఱున్నారు? ఇది సాధారణకృత్యమా?" అనియెను.

గోరామనస్సీవిషయమునకే వికలమై యుండెను. దానిపై నవినాశుని యుత్సాహవాక్యములచే నాతని యొడలు మండిపోవుటయు, గోరా యసహిష్ణుఁడై "మీరు భక్తిరూపమున నన్నవమానింపఁదలఁచితిరి! యిట్టి లజ్జాకర మగుదానిని నేను నిషేధింతు ననియైన మీరెఱుంగకపోయితిరి. ఇంతేకాక యానిషేధమునే మహాపురుషలక్షణముగా నిరూపించుచుంటిరి. మీరందఱును మనయీదేశమును వేషధారిసమాజముగా భావింతురా? ఇందందఱును బొట్టకొరకు నటించుచున్నవారేనా? సత్యముగఁ బనిచేయువా రొక్కరును లేరా?—మీరు నాతోఁ జెలిమిచేసినను సరే—జగడమాడినను సరే—కాని నన్నుఁ గూర్చి యెంతమాత్రమును స్తుతిచేయవలదు!" అనియెను.

అవినాశునిభక్తి మఱియును గడలిపోయెను! ఆతఁ డప్పుడు గోరావాక్యములయందలి చమత్కారము నచ్చట నున్నయందఱిహృదయముల నాకర్షించునట్లు భావప్రదర్శనము చేయుచు "మహాపురుషా! మేమందఱమును నీవలెనే నిష్కాములమై భారతవర్షసనాతనగౌరవరక్షణమునకై యాత్మసమర్పణము గావింపఁగలునట్లు మమ్ముల నాశీర్వదింపుము!" అని పలుకుచు గోరాపాదధూళిని గైకొనఁబోవుటయు

నాతఁ డించుక యోచనరిల్లెను అప్పు డవినాశుఁడు "బాబూ! నీవు మావలన నిట్టి సన్మానమును గైకొనలేదు! కాని మాయానందమునకుఁగూడ విముఖుఁడవగుట యుచితమా? మేమందఱమును నీతోఁ గలసి భుజింపవలయునని నిశ్చయించుకొంటిమి. దీనికి నీవు సమ్మతింపవలయును!" అనియెను.

గోరా — నేను ప్రాయశ్చిత్తము చేసికొనకుండ మీతోఁగలసి భుజింపఁజాలను.

ప్రాయశ్చిత్తమా! అవినాశుని నయనద్వయము ప్రదీప్తమై పోయెను. అప్పు డాతఁడు "ఈసంగతి మాకెవ్వరికిని దోఁచనే లేదు! కాని గౌరమోహనబాబు పాటించని హిందూమతవిధాన మొక్కటియును లేదే!" అనియెను. "అది బాగుగనున్నది! ప్రాయశ్చిత్తదినముననే యాతనితోఁ గలసి భుజింపవచ్చును! ఆదినముననే దేశమునందలి పెద్దపెద్దపండితుల నందఱను బిలువవచ్చును. హిందూధర్మ మింకను సజీవమై యున్నదని గోరాబాబుప్రాయశ్చిత్తనిమంత్రణములననే ప్రచారము కాఁగలదు!" అని యందఱును నిశ్చయించుకొనిరి.

ప్రాయశ్చిత్త మెప్పు డెక్కడఁ జేయవలయు ననుప్రశ్న కలిగెను. అప్పుడుగోరా "ఒకమిత్రుఁడు గంగాతీరోద్యానమున నీకార్యముం దీర్చుటకుఁ బ్రస్తావించెను. దీని కగువ్యయమంతయు సమాజమువారే భరించునట్లు స్థిరమయ్యెను!" అనియెను. అందఱును వెడలిపోవునప్పు డవినాశుఁడు వారి నొక్కించుక యాఁపి "గౌరమోహనబాబునకుఁ గోపము వచ్చినను బొంగిపోవుచున్నయానందముచే నే నొక్కమాట చెప్పక యుండఁజాలను! పరమేశ్వరుఁడు వేదోద్ధరణమునకై పుణ్యభూమి యగునీభారతవర్షమున జన్మించెను; అట్లే మతోద్ధరణమునకై యీవిధముగా నవతరించెను. ఈప్రపంచమున మనభారతదేశమునందే యాఱుఋతువులును సమముగఁ దిరుగుచున్నవి. ఇచ్చటనే కాలానుసారముగ నీశ్వరుఁ డవతరించుచున్నాఁడు! ఇంకను నవతరింపఁగలఁడు! ఈసత్య మిప్పుడు ముసరుస్పష్టపడుటచే మనము ధన్యులము! సోదరులారా! కీర్తింపుఁడు! గౌరమోహనునకు జయ! — అనియెను. అవినాశునియుపన్యాసమువలన నుత్సాహముతో నందఱును జయధ్వనులం గావించిరి. గోరా పీడితహృదయముతో నటనుండి వెడలిపోయెను.

జైలునుండి విడివడినమొదటిదినమునందే గోరాహృదయమును బ్రబలవిచారమాక్రమించుకొనియెను. అతఁడు జైలులో నున్నప్పుడు కూడ నూతనోత్సాహముతో దేశమునుగూర్చి పనిచేయవలయునని చాలసారులు సంకల్పించుకొనియుండెను. ఇప్పు డాతఁడు తనలో "అయ్యో! నాదేశ మెక్కడనున్నది? అది కేవలమును నాయొక్కని చింతనే యున్నదా? నాజీవితసంకల్పము లన్నిటినిగూర్చి యాలోచించు నాబాల్యమిత్రుఁ డగువినయుఁ డిప్పుడొకయువతిని బెండ్లియాడుటకై తనదేశసంబంధము లగు

భూతభవిష్యములను దనవిగానట్లుగా వేఱుచేయుటకు సిద్ధపడియున్నాఁడు! తమసమాజములోనివాఁడ వగునన్నింతకాలమునుండి వీరందఱు నెఱింగియుండియును ధర్మోద్ధరణమునకై జనించినయవతారముగా భావించుచున్నారు! నేను కేవలమును శాస్త్రమూర్తినేనా? భారతవర్షమున కిఁక నెచ్చటను స్థానమే లేదా? షడృతువులు! భారతవర్షమున షడృతువులున్నవి. ఆషడృతుషడ్యంత్రమునందే యవినాశుఁడు చెప్పిన ఫలము లభించినచో నందొకటి రెండుబుతువులు తప్పిపోయినను నష్టములేదు!' అని భావించుకొనుచుండెను.

ఇంతలో సేవకుఁడు వచ్చి యమ్మగారు రమ్మనుచున్నారని చెప్పెను. గోరా యదరిపడి తనలోఁదానే 'అమ్మ రమ్మనుచున్నది' అని యనుకొనియెను. ఆపిలుపులో నాతని కొకనూతనార్థము వినఁబడియెను. అతఁడు తనలో 'ఏది యెట్లయినను నాకు మాయమ్మ యున్నది! ఆమెయే నన్నుఁ బిలుచుచున్నది. ఆమెయే నన్నందఱితోడను గలుపుచున్నది! నావారందఱు నామెయింటనే నాకొఱకు వేచియుందురు. జైలునందున్నప్పుడుకూడ నేను మాయమ్మపిలుపును వింటిని; ఆప్రేమమూర్తిని దర్శించితిని! జైలువెలుపలఁగూడ మాయమ్మ నన్నుఁ బిలుచుచున్నది. ఆమెదర్శనమునకై పోవుచున్నాను!' అని యనుకొనుచు గోరా యాశీతకాలమధ్యాహ్నాకాశమువంకఁ బరిశీలించి చూచెను. ఒకవిధముగా వినయునియందును, మఱియొకవిధముగా నవినాశునియందును గోరాకుఁ గలవిరుద్ధభావము నిమిషములో మాయమైపోయెను. ఆమధ్యాహ్నసూర్యాలోకమున భారతవర్షము చేయెత్తిపిలుచుచున్నట్లుండెను. ఆసముద్రవిస్తృతంబు లగు నదీపర్వతజనపదంబు లప్పుడు గోరాకుఁ బ్రత్యక్షంబులయ్యెను. అనంతము లగుదిగంతములనుండి యొకవినిర్మలతేజము వెలువడి యాభారతవర్షమును జ్యోతిర్మయముగఁ జేసివైచుచుండెను. గోరాహృదయ మానందపూర్ణమైపోయెను. ఆతనికన్నులు మెఱిసిపోవుచుండెను. ఆతనిహృదయమునం దెట్టినిరాశయును లేకుండఁబోయెను. భారతవర్షముం గూర్చిన దూరఫలదాయకంబగునంతప్రయత్నమునకై యాతనిప్రకృతి యానందముతో సంసిద్ధమైయుండెను. ధ్యానముచేఁ గాంచుచున్న భారతమహిమను బ్రత్యక్షముగఁ గాంచఁజాలనైతినని యనువిచార మాతనికి లేశమాత్రమును లేకుండెను. అప్పు డాతఁడు మాటిమాటికిని దనలో 'అమ్మ నన్నుఁ బిలుచుచున్నది! ఆయన్నపూర్ణ—ఆజగద్ధాత్రి వసించియున్న చోటికే—చాలకాలమునకైనను నిమిషములోనైనను, మరణాంతరమునైనను, జీవితమధ్యమునందైనను నేను పోయెదను. మహామహిమాన్వితమగుభవిష్యమిప్పుడు దీనంబును, హీనంబును నగు నాకాతరమానసమును సంపూర్ణసార్థకముగను, సముజ్జ్వలముగను జేసియున్నది. నేనచ్చటికే పోయెదను. ఆయతిదూరమునుండి ఆయతి సమీపమునుండి మాయమ్మ నన్నుఁ బిలుచుచున్నది!' అని యనుకొనుచుండెను. ఈయానంద

మధ్యమున గోరా వినయావినాశుల సంయోగముం గాంచినట్లుండెను; వారతనికిఁ బరులుగాఁ దోఁచుటలేదు. ఇప్పటి స్వల్పము లగు సకలవిరుద్ధభావములును ననంత మగు చరితార్థతయం దెచ్చటనో విలీనములైపోయెను!

గోరా యానందమయిమందిరమునఁ బ్రవేశించెను. అప్పు డాతనివదన మానందోజ్జ్వలమై యుండెను. ఆతనిదృష్టి యెదుటనున్న సమస్తవస్తువులను దాఁటి యొకదివ్యమూర్తియందు లగ్నమై యుండెను! అందుచేతనే గోరా తనతల్లిచెంత నింకొకరు కూర్చుండియున్న సంగతి మొట్టమొదట నాకస్మికముగఁ దెలిసికొనఁజాలకపోయెను!

సుచరిత చటాలున లేచి గోరాకు నమస్కరించెను. గోరా విస్మితుఁడై "ఇదిగో నీవెప్పుడు వచ్చితివి? కూర్చుండుము!" అనియెను. సుచరిత రాకకు విశేష కారణ ముండు నని గోరా నిశ్చయించుకొనియెను. ఒకప్పుడు గోరా సుచరితకు విముఖుఁడు గనే యుండెను. అతడు కష్టపడి పనిచేయుచుఁ దిరుగుచున్నంతకాలము సుచరితమాట తన మనసులోఁ బడకుండఁ జేసికొనియెను. కాని జైలునందున్నప్పుడు మాత్రము గోరా సుచరితను స్మృతిపథమునకు దూరముగఁ జేయఁజాలకపోయెను! ఆతఁడు భారతవర్షమున స్త్రీలుకూడ నున్నారనుమాటయే భావించియెఱుంగనిదినములుగూడ నున్నవి! ఈ సత్య మింతకాలమునకు సుచరితయందే నూతనముగ నుదయించెను. ఒక్క నిమిషములో నింతటి పురాతనప్రబలసత్యము నాకస్మికముగ గ్రహించి దాని యాఘాతముచే గోరా బలిష్ఠప్రకృతియంతయును గంపితమైపోయెను. ఆతఁడు జైలునందుండి వెలుపలనున్న సూర్యాలోకమును, నిరాతంకవాయుప్రచారమును గాంచుచున్నప్పుడు జగమంతయును దనకర్మక్షేత్రముమాత్రమే కాదనియు, నది కేవలమును బురుషసమాజభూషితమే కాదనియుఁ దెలిసికొనియెను. అప్పు డాతఁ డెట్లో ప్రయత్నించి సుందర మగు నీబహిస్సంసారమునం దధిష్ఠించియున్న యిరువురు దేవతల ముఖమండలములనుమాత్రమే భావించి ధ్యానించుచుండెను! సూర్యచంద్రనక్షత్రకాంతు లావదనములపైఁ బ్రసరించుచుండెను! సుస్నిగ్ధసుందరనీలాకాశ మాముఖములనే పరివేష్టించి యుండెను! అందొకటి యాతని కాజన్మపరిచితమగుమాతృవదనమండలము! మఱియొకటి నూతనపరిచితంబును, విజ్ఞానవిలసితంబును నగువినమ్రసుందరవదనమండలము!

జైలునందలి యానిరానందసంకీర్ణతామధ్యమునందుఁగూడ గోరా యీముఖస్మృతిని నిరోధింపఁజాలకుండెను. ఈధ్యానమువలనం గలిగినపులకతే యాతనికిఁ గారాగృహమును ముక్తిక్షేత్రముగఁ జేసివైచుచుండెను; కారాగృహకఠినబంధన మాతనికి ఛాయామయమిథ్యాస్వప్నతుల్య మైపోవుచుండెను; ఆతనిస్పందితహృదయమునందలి యతీంద్రియతరంగములు కారాగృహప్రాచీరములను భేదించుకొనిపోయి యాకాశమున విలీనములై యచ్చటి కల్పకుసుమపల్లవములం దూఁగుచు మరలఁ బ్రాపంచికకర్మక్షేత్ర

మున విలాసవిహారంబు గావించుచుండెను!—ఇట్టికల్పనామూర్తికై భయపడవలసిన పని లేదని గోరా యనుకొనియెను. అందుచేతనే యాతఁ డీకొలదిదినములు నాస్మృతిని నిషేధింపకుండెను. వాస్తవపదార్థమునకుమాత్రమే భయపడవలయునని గోరాయూహ!

గోరా జైలు విడిచి వచ్చినంతనే పరేశునిం గాంచెను. తోడనే యాతనిహృదయ మానందోచ్ఛ్వసిత మయ్యెను. ఆయానందము పరేశునిం గాంచుటచేతనే కలిగినది కాదు!—దానితోఁ గొలఁదిదినములనుండి యాతనిమనమునం దున్నస్మృతియును, నాకర్షణమును సమ్మిళితములై యుండెను! ఈసంగతి యాతనికి మొట్టమొదటఁ దెలియలేదు; కాని క్రమముగా బోధపడియెను. ఆతఁడు స్టీమరునుండివచ్చుచున్నప్పుడే పరేశబాబు కేవలము తనగుణములచేమాత్రమే నన్నాకర్షించుట లేదని స్పష్టముగాఁ దెలిసికొనియెను.

ఇన్నాళ్లకు గోరా మరల నడుము కట్టుకొన నిలిచెను. ఆతఁడు స్టీమరుపైఁ గూర్చున్నప్పుడే "ఇఁక నేనెవ్వరికిని లొంగను! నాహృదయమున కేవిధమగునాత్మని రోధమునుగూడ లేనంతదూరమువఱకును బోయెదను" అని నిశ్చయించుకొనియెను.

ఇట్టిస్థితిలోనే గోరాకు వినయునితో వాదము కలిగెను. వియోగాంతమునఁ గలసికొన్నమిత్రులలో నింతటి ప్రబలవితర్కము కలుగుట యసంభవము! కాని ఇప్పుడా తర్కమధ్యమునం దాతఁడు తన్నుఁగూడ దర్కించుకొనుచుండెను. ఆతర్కమాలముననే గోరా తనప్రతిష్ఠాస్థానమును దనలోనుండి స్పష్టముగాఁ గైకొనియెను. అందుచేతనే గోరాయప్పు డంత తీవ్రముగా మాటలాడెను. అట్టితీవ్రభావముం జూపుట యాతని కావశ్యకమయ్యెను. ఆతీవ్రభావము వినయునిహృదయమున విరోధభావమును విజృంభింపఁజేసినప్పుడు—గోరాయుద్దేశముల నన్నింటిని వినయుఁడు ఖండింపఁదలఁచియున్నప్పుడు-గోరానిర్బంధము క్రమముగ నెచ్చి వినయునిహృదయమంతయును విద్రోహముపూరితమై పోవునప్పుడు—గోరాతన్నుఁ గొట్టుకొని తనయాఘాతమునకుఁ బ్రాబల్యముం గల్పించెను! ఇట్లు జరుగునని వినయుఁ డనుమానించియైన నుండలేదు!

వినయునితో వాదించుటయైనతరువాత గోరా తనలో "నేనీరణక్షేత్రమునుండు నొసరిల్లినచో లాభములేదు! నాప్రాణభయముచే నేను వినయుని విడిచినచో నిఁక నాతనికి రక్షణము లేదు!" అని నిశ్చయించుకొనెను.

౫౫

గోరామనసిప్పుడు భావావిష్టమైయుండెను. ఇప్పు డాతఁడు సుచరిత నొక వ్యక్తిగాఁ జూచుటలేదు; భావమూర్తిగాఁ జూచుచుండెను. భారతనారీప్రకృతి యంతయును సుచరితయందు మూర్తీభవించి యాతనికిఁ బ్రత్యక్ష మయ్యెను. భారతగృహమునఁ బుణ్యమును, సౌందర్యమును, ప్రేమను, మాధుర్యమును, పవిత్రతను

వర్ధిల్లఁజేయుటకే యీయావిర్భావము! ఏలక్ష్మీదేవి భారతవర్షమునఁ బిల్లలను బెద్దవారిగాఁ జేయుచుండెనో, రోగుల కుపచారములు చేయుచుండెనో, ఆర్తుల నూఱడించుచుండెనో, నీచులకుఁగూడఁ బ్రేమగౌరవస్థానములను బ్రసాదించుచుండెనో, ఏదేవి దుఃఖదుర్గతులయందుఁగూడ దీనతమైనను ద్యజించి యవమానింపకుండెనో, ఏదివ్యమూర్తి మనకుఁ బూజార్హయయ్యును మనలో నయోగ్యునిగూడఁ బూజించుచుండెనో, ఏదేవీమూర్తి తననిపుణసుందరహస్తద్వయమును గేవలమును మనకార్యములకొఱకే వినియోగించుచుండెనో, చిరసహనశీలంబగు నేరాజ్యేశ్వరి శాంతపరిపూర్ణప్రేమామృతమును బరమేశ్వరుఁడు మనకక్షయదానరూపమునఁ బ్రసాదించియుండెనో యట్టిలక్ష్మీసంబంధమగు నొకతేజమే యిప్పు డానందమయిపార్శ్వమున మూర్తీభవించి యున్నట్లు గోరా కనుంగొని యానందనిమగ్నహృదయుఁడైపోయెను. "మన మీమెనింకఁ జూచుటయే లేదు! ఈమె నన్నిటికంటెను వెనుకకుఁ ద్రోసివైచితిమి! ఇంతకంటెను మనకు దుర్గతి యేమైన నున్నదా? దేశమాత యనిన నీమెయే! సమస్తభారతనిగూఢస్థానమున, బ్రాణనికేతనమున, శతదళపద్మాసనాసీనయై యున్న దేవి యీమెయే! మనమే యీమెకు సేవకులము! దేశమున కీదుర్గతి యీమె నవమానించుటచేతనే! ఈయవమానముగూర్చి యుదాసీనుల మగుటచేతనే మనపౌరుషమిప్పుడు లజ్జితమైపోయినది!'' అని భావించుకొనఁదొడంగెను.

గోరా తనలోఁదానే యాశ్చర్యపడియెను. స్త్రీలతో సంబంధములేని యసంపూర్ణమగుభారతవర్షమునే తానుభావించుచున్నట్లు గోరా కింతవఱకుఁ దెలియదు. నారీమూర్తి కేవలము ఛాయామయ మనియే భావించి యాతఁడు దేశసంబంధమునం గావించు కర్తవ్యములం దన్నిటియందును నేదియో యొకవిధమగు నభావమే యుండెను. అందు శక్తియున్నది గాని ప్రాణము లేదు! అందు మాంస మున్నది గాని, నరము లేదు. స్త్రీజనమును దృణీకరించి మన మెంతవఱకు దూరము చేయుచుందుమో మన పౌరుషముకూడ నంతవఱకు విశీర్ణమై వినష్టమైపోవు నని గోరా యిప్పు డొక్కనిమిషములో గ్రహింపఁ గలిగెను! అందుచేతనే గోరా సుచరిత నిప్పుడు వచ్చితి వని పరామర్శించెను. అది కేవలము గౌరవపరామర్శయే కాదు! అతనిజీవితమున నూతనలబ్ధమగు నొకయానంద మందుసంపూర్ణముగ నిండి యున్నది!

కారాగృహకష్టచిహ్నములు గోరాశరీరమున నగపడుచుండెను. అతఁడు మునుపటికంటెఁ జిక్కియుండెను. జైలుభోజన మాతనికి సరిపడక యీనెల యంతయు నుపవాసప్రాయముగనే యుండెను. అతని దేహమున సముజ్జ్వలశ్వేతకాంతి యించుక మ్లానమైయుండెను. పొట్టిగఁ గత్తిరింపఁబడిన శిరోజములమూలమున నాతనిముఖకార్శ్యము మఱింత యధికముగఁ గానఁబడుచుండెను. గోరా శరీరకృశత్వము సుచరితహృద

యమునందు ఖేదనం గల్పించెను. గోరాపాదములకుఁ బ్రణమిల్లి యాతనిపాదధూళిని గైకొనవలయునని యామెకుఁ దోఁచెను. ధూమమును సమిధలనుగూడ నెంతమాత్రమును గానరాకుండ బ్రజ్వరిల్లుచున్న పవిత్రాగ్నిజ్వాలవలె గోరా యామెకన్నుల కగపడుచుండెను. కరుణా మిళిత మగుభక్త్యావేశముచే సుచరితహృదయము కంపించి పోవుచుండెను. అందుచే నామె యేమియు మాటాడఁజాల కుండెను.

అప్పు డానందమయి "గోరా! ఒకయాఁడుబిడ్డ యున్నచో నెంతసుఖమో నేనీసారి బాగుగఁ దెలిసికొంటిని! నీవు లేనిదినములలో నీమె నాకెన్నివిధముల నూఱట కలిగించిన దనుకొన్నావు! నాకిదివఱకీమె పరిచయమే లేదు! కాని—దుఃఖసమయము లీప్రపంచమున గొప్పవారితోడను, మంచివారితోడను బరిచయము గల్పించును. దుఃఖమునకుఁ గూడ నిట్టిగౌరవ మొకటి యున్నట్లు నేనిప్పుడు తెలిసికొనఁగలిగితిని! దుఃఖమునకు శాంతిని బరమేశ్వరుఁ డెచ్చట దాఁచియుంచెనో యెల్లసమయములయందును దెలిసికొనజాలకపోవుటచేతనే మనము దుఃఖము ననుభవించుచుందుము!— అమ్మా! నీవట్లు సిగ్గుపడియెదవుగాని, దుఃఖసమయమున నీవు నాకుఁ గల్పించినసుఖమును గూర్చి నీయెదుట నేచెప్పకుండ నెట్లుండఁగలను?—" అనియెను. గోరా గభీర కృతజ్ఞతాదృష్టితో సుచరితలజ్జితవదనమువంక నొకసారివీక్షించి యానందమయి నుద్దేశించి "అమ్మా! ఈమె నీదుఃఖసమయమున నీదుఃఖమును బంచుకొనుటకై వచ్చినది! మరల నీసుఖదినమున నీసుఖమును వర్ధిల్లఁజేయుటకై వచ్చినది! ఉదారహృదయుల యకారణసుహృద్భావము లిట్టివే కావా!" అనియెను.

వినయుఁ డప్పుడు సుచరితసంకోచభావముం గాంచి "సోదరీ! దొంగ దొరకినప్పుడు శిక్ష తప్పునా? ఇప్పుడు నీవిందఱి యెదుటను బట్టుబడితివి! దానిఫలము ననుభవింపక యెట్లుతప్పించుకొనిపోయెదవు? నాకు నీసంగతి యిదివఱకే తెలియును. కాని వెల్లడింపక యూరకుంటిని. ఇది యెంతయో కాలము దాఁగదని నేనెఱుంగుదును!" అనియెను.

ఆనం—(నవ్వుచు) నీవెట్లూరకుందువు? ఊరకుండుస్వభావమా నీది!—అమ్మా! సుచరితా! వీనికి మీపరిచయ మైనది మొదలు మీగుణకీర్తనముం గావించుట యందలి యాశయింకను దీఱుటయే లేదు!

విన—సోదరీ! వింటివా! నేనెంతటిగుణగ్రాహినో, యెంతటి కృతజ్ఞుఁడనో యిప్పుడు సాక్ష్యము లభించుచున్నది!

సుచ—అందువలనఁ గేవలము నీగుణపరిచయమే యగుచున్నది!

విన—నాగుణపరిచయము నామూలమున నెంతమాత్రమును గానేరదు. నా గుణములను దెలిసికొనఁదలఁచినచో మాయమ్మయొద్దకుఁ బోవలయును. ఆమె యా

విషయమున నేనుగూడ నాశ్చర్యముచే స్తంభించిపోవునట్లుగాఁ జెప్పుచుండును. అమ్మరో నాజీవితచరిత్రమును వ్రాయఁదలంచినచో నేనతిశీఘ్రముగనే మరణించుటకు సిద్ధపడియున్నాను.

ఆనం—వింటివా వీనిమాటలు !

గోరా—వినయా! నీతల్లిదండ్రులు నీకు సార్థకనామకరణముం గావించియున్నారు !

విన—వారు నావలన నెట్టిగుణమును వాంఛించి యుండలేదు కాఁబోలును ! కేవలము వినయగుణమునుమాత్రమే కోరియుందురు.

ఈవిధముగాఁ బ్రథమసంభాషణమునకు సంశయము వదలిపోయెను. వెడలిపోవునప్పుడు సుచరిత వినయునిం గాంచి "మీరొకసారి మాయింటికి రాఁగూడదా?" అనియెను. సుచరిత వినయుని రమ్మనినట్లు గోరాను రమ్మనజాలకపోయెను! గోరా యాభావమును గ్రహింపఁజాలకపోయెను. అది యాతనికి హృదయాఘాతమువలె నుండెను. వినయుఁ డందఱితోడను జనవుగ నుండును. కాని గోరా యట్లు మెలంగఁజాలఁడు! అందుకొఱకు గోరా యిదివఱ కెన్నఁడును విచారింపలేదు. ఇప్పు డాతని స్వభావమునం దట్టిసౌకర్య మభావమైయుండెనని గోరా తెలిసికొనియెను.

౫౬

లలితవివాహముంగూర్చి యాలోచించుటకే సుచరిత తన్నుఁబిలిచిన దని వినయుఁడు తెలిసికొనియెను. ఈప్రస్తావమును ముగించినంతమాత్రమున నీవ్యాపారము ముగియలేదు. ఇది మిగిలియున్నంతకాల మేపక్షమువారికిని నివృత్తిలేదు. ఇన్నాళ్ళవఱకును వినయుఁ డన్నిటికంటె నెక్కువగా గోరా నొప్పించుట యెట్లనుసంగతినే యాలోచించుకొనుచుండెను. గోరాయనిన గోరామానవత్వము గాదు! అతని సమస్తజీవితము నాశ్రయించియున్న దృఢవిశ్వాసము! దృఢభావము! దానితోఁ బూర్తిగాఁ గలసిపోవుటయే వినయున కభ్యాసము. అదియే యాతని కానందము. వానితో నెట్టివిరోధమైనను నది వినయునకుఁ దనతోడి విరోధమే !

కాని యావిషయమునఁ బ్రథమసంశయము వదలిపోయెను. వినయుఁడు లలితనుగూర్చి యొకవిషయమున గోరాతోఁ దీవ్రముగ వాదించియుండెను. శస్త్రచికిత్స చేయుటకుఁ బూర్వము రోగిభయమునకును, భయంకరసంభావనలకును నవధియుండదు. కాని శస్త్రముచేయుట కారంభమైనప్పుడు బాధ యగపడుచున్నను నారోగ్యసుఖముండుటచే నిదివఱకు కనుగొనుచున్నంతభయము లేకుండబోవును—ఇన్నాళ్ళవఱకును దనమనసులో నైనను దర్కించుకొనఁజాలని వినయుఁ డిప్పుడు తర్కద్వారమున

పెఱచివైచెను. ఇప్పు డాతని మనసులో గోరాతో నుత్తరప్రత్యుత్తరములు జరుగుచుండెను. ఇప్పు డాతఁడు గోరాయుక్తులను మనసులోఁ గల్పించుకొని వాని నెల్లవిధముల ఖండించివైచుచుండెను. గోరాతో ముఖాముఖిని వాదించుట కలిగినచో నెంత యుద్రేకము కలుగునో యంతశాంతి కలుగును. కాని గోరా యీవిషయమునఁ దుది వఱకును వాదించుట లేదు. అందుచే వినయుని హృదయము పరితపించుచుండెను. గోరా తానొప్పుకొనక యొప్పింపక కేవలమును దీవ్రభావమును జూపుచుండెను. అతిప్రిత్వమునకు వినయుఁడు వినతుఁడు గాఁజాలకుండెను! వినయుఁడు నే నెట్లయినను సత్యపక్షమున నుండెదననుకొని రెండుచేతులతోడను సత్యశబ్దమును దనహృదయమధ్యమునం దిముడ్చుకొని యుండెను. గోరాకుఁ బ్రతికూలముగు నొకప్రబలపక్షమును స్థాపించుట యావశ్యకము! అందుచేతనే వినయుఁ డిప్పుడు సత్యమునే చరమావలంబనముగాఁ జేసికొనియెను. అట్టిసత్యము నాశ్రయింపఁ గలిగితిని గదా యనియే వినయునకు విశేషమగు నాత్మగౌరవము కలిగెను. అందుచేతనే వినయుఁ డపరాహ్ణసమయమున సుచరితయింటికి నిస్సంశయముగాఁ దలయెత్తుకొని పోయెను. వినయుఁడు తానునిలిచినది సత్యపక్షమో, మఱియేపక్షమో నిశ్చయించుకొనుటకుఁ దగిన యవస్థలో లేఁడు!

హరిమోహిని వంటచేసికొనుచుండెను. వినయుఁడు వంటయింటిగుమ్మముకడకుఁ బోయి బ్రాహ్మణకుమారుఁ డగుతనకు మధ్యాహ్నభోజనము పెట్టవలసినబాధ్యతను సూచించి మేడమీదికిఁ బోయెను. సుచరిత యప్పుడు కుట్టుపని చేసికొనుచుఁ గన్నులను వంచి కరాంగుళులఁ గదలించుచునే యోచించి "వినయబాబూ! అంతరంగికబాధ లేనప్పుడు బహిఃప్రాతికూల్యము నేల లక్ష్యము చేయవలయును?" అనియెను.

గోరాతో వాదించునప్పుడు వినయుఁ డీవిషయమున విరుద్ధయుక్తిప్రయోగముం గావించెను. ఇప్పుడు సుచరితతోఁ గూడ నట్లే మాటలాడెను. ఇట్టిచో గోరాతో వినయునకభిప్రాయభేద మున్న దని యెవ్వ రనుకొనగలరు? వినయుఁడు సుచరితం గాంచి "సోదరీ! బహిరంతరాయము లంతబాధాకరములు కావని నీకును దోఁచుచున్నదా?" అని ప్రశ్నించెను.

సుచ—దానికి గారణ మున్నది! మాయాతంకములు కేవలమును బాహ్యములే కావు. మాసమాజము మాధర్మవిశ్వాసముపై నిలిచియున్నది. కాని మీసమాజమున మీబంధము కేవలము సాంఘికనియమము ననుసరించి యుండును! అందుచేతనే లలిత తనసమాజమును త్యజించుటచే నామె కెంతకష్టము కలుగునో మీకు మీసమాజమును విడుచుటచే నంతకష్టము కలుగదు!

మత మనునది మానవవ్యక్తిగతసాధనీయ మనియు, దానిని సమాజముతో సమ్మే ళనము చేయుట యుచితము కాదనియు వినయుఁడు వాదింపఁదొడంగెను. ఇంతలో సతీశుఁ డొకయుత్తరమును, నొకవార్తాపత్రికను దీసికొని యచ్చటికివచ్చి వినయునిం గాంచి యుత్సాహముతో నాకు శుక్రవారము నెట్లయిన నాదివారముగాఁ జేసికొనవల యునని కుతూహలపడుచుండెను. చూచుచుండఁగనే సతీశునకును వినయునకును సం భాషణము ముదిరిపోయెను. ఈయవకాశమునందు సుచరిత లలిత పంపినచీటిని, బత్రి కను జదువఁదొడంగెను.

ఆవార్తాపత్రికయందు "ఒక ప్రసిద్ధబ్రాహ్మకుటుంబము హిందూకుటుంబ ముతో వివాహసంబంధముం గావించుకొనఁ దలఁచియుండఁగా హిందూయువకుని యసమ్మతిచే నావ్యాపారము చెడిపోయినది!" అనువిషయముంగూర్చి హిందూయువ కునినిష్ఠతో బ్రాహ్మకుటుంబశోచనీయదౌర్బల్యమును బోల్చి యాక్షేపోక్తులు ప్రక టింపఁబడియుండెను.

సుచరిత యెట్లయిన నీవివాహమును సంఘటింపవలయు నని నిశ్చయించుకొని యుండెను. కాని యది యీయువకునితో వాదించినంతమాత్రమున జరుగునది కాదు. అందుచేతనే యామె లలిత నొకసారి రమ్మని చీటివ్రాసెను. వినయుఁ డిచ్చటనే యుండె నని యందు వ్రాయలేదు!—ఏపంచాంగమును, నేగ్రహనక్షత్రసమ్మేళన మును శుక్రవారము నాదివారముగాఁ జేయఁజాలకుండుటచే సతీశుఁడు తప్పక బడికిఁ బోవలసినవాఁ డయ్యెను. సుచరితయును "వినయబాబూ! స్నానము చేసి వచ్చెదను! ఇంచుకసేపాఁగుము." అని చెప్పి వెడలిపోయెను.

వాదము చల్లారిపోయెను. అప్పుడు సుచరితగదిలో నొంటిగఁ గూర్చుండియున్న వినయునియంతరంగమున యౌవనపౌరుషము జాగరితమగుచుండెను. తొమ్మిదిగంట లయ్యెను. వీధిలో జనకోలాహలము లేదు. సుచరిత వ్రాఁతబల్లపై నున్న చిన్నగడియా రము టిక్కు టిక్కుమనుచుండెను. ఆగృహసంబంధమగు నొకప్రభావ మాతని నాక ర్షించుచుండెను. ఆగదియందలి ప్రతివస్తువుఁగూడ నాతనిఁ బలుకరించుచున్నట్లుం డెను. ఆచక్కనివ్రాఁతబల్ల, ఆకట్టుపనుచేసికొనుకుర్చీ, దానిక్రింద బరుపఁబడిన కృష్ణాజినము, గోడపై వ్రేలాడుచున్న యొకటి రెండు చిత్రపటములు, వెనుక నెఱ్ఱ శాలువుచే మూయఁబడినపుస్తకములబీరువా—యివి యన్నియును వినయునిహృదయ మధ్యమునం దొకవిధమగు వింతసంగీతమును ధ్వనింపజేయుచుండెను. ఆగదియం దం తటను నేదియో యగోచరమగు సౌందర్యరహస్యము నిండియున్నట్లుండెను. ఆగది యందు నిర్జనమధ్యాహ్నసమయములందు లలితాసుచరితల కెన్నియో యేకాంతాలో చనములు జరిగినవి. ఆయాలోచనలలజ్జాసుందరశక్తి యింకనుఁ బ్రచ్ఛన్నముగ నం

దందుఁ దోఁచుచున్నట్లే యుండెను. ఆయాలోచనలయందు వారిర్వు రచ్చట నెట్లు కూర్చుండి యుండిరో వినయుఁడు భావించుకొని చూచుకొనుచుండెను. "లలిత నీకుఁ బ్రతికూలముగ లేదని నేను సుచరితవలన వినియుంటిని" అని పరేశుఁడు చెప్పినమాటను వినయుఁ డప్పు డనేకభావములతో ననేకరూపములతో ననేకవిధములుగాఁ జూచుచుండెను. అప్పు డనిర్వచనీయం బగునొకయావేగ మాతనిమనోమధ్యమునఁ గరుణాసాంత్వనస్వరంబున గానము చేయుచున్నట్లుండెను. అందలి ప్రతివస్తువునందును నిబిడంబును గభీరతమంబు నగునొకరూప మాతనిని గూఢహృదయమధ్యమున ననిర్వచనీయం బగునాభాసముంబోలి తోఁచుచుండుటయు దాని నెట్లును బ్రత్యక్షముగ ననుభవింపఁజాలక, కవియైనను చిత్రకారుఁడైనను గాఁజాలకపోయితినిగదా యని వినయుఁడు సర్వాంతఃకరణములను జంచలుఁడైపోవుచుండెను. ఆచాంచల్యమును శాంతింపఁజేయుట కుపాయము లేనట్లాతనికిఁ దోఁచుచుండెను. ఆతనియెదుట నడ్డముగనుండి యతిసమీపమును గూడ నతిదూరముగఁ జేసివైచుచున్న తెర నానిమిషమునందే ధైర్యముతో నిలుఁబడి చించి పాఱవైచుటకు వినయునకుఁ దగినంతశక్తి లేదు!

ఇంతలో హరిమోహిని గదిలోనికి వచ్చి "కొంచెము ఫలహారము చేసెదవా!" అని యడిగెను. వినయుఁడు వలదనియెను. హరిమోహిని గదిలో నొకచోఁ గూర్చుండెను. ఆమె పరేశునియింటనున్నంతవఱకు వినయుని విశేషాదరముతోనే చూచెను. కాని సుచరితతోఁ గలసి ప్రత్యేకగృహమున స్వతంత్రముగ నున్నది మొదలు వినయుని రాకపోకలామె కత్యంతము ననిష్టములుగనే యుండెను. సుచరిత యిప్పుడు తనయాచారాదులను సంపూర్ణముగ మన్నింపకుండుట కిట్టివారిసహవాసదోషమే కారణ మని యామె నిశ్చయించుకొనియుండెను. వినయుఁడు కేవలము బ్రహ్మసమాజమువాఁడు కాకపోయినను వానికి హిందూసంస్కారసంబంధ మగుదృఢత్వము లేదని యామెకు స్పష్టముగాఁ దెలిసిపోయెను. అందుచేతనే యామె మునుపటివలె నీబ్రాహ్మణకుమారునికొఱకై నిష్టప్రసాదమును దుర్వ్యయముగఁ జేయఁజాలకుండెను. ఇప్పు డామె ప్రసంగవశమున వినయు నుద్దేశించి "బాబూ! నీవు బ్రాహ్మణకుమారుఁడవు కదా; నీవు సంధ్యార్చనము లేమియు నక్కఱలేదా?" అని ప్రశ్నించెను.

విన— దొడ్డమ్మా! రేయుంబవలు చదువులోనే మునిఁగి గాయత్రిని, సంధ్యను సమస్తమును గూడ మఱచిపోయితిని.

హరి— పరేశబాబుమాత్రము చదివినవాఁడు కాఁడా? అతఁడు తనధర్మానుసారముగా నేదో యొకవిధమున సంధ్యోపాసనము చేయుచునే యున్నాఁడు!

విన— అతఁడు మంత్రమును ముఖస్థము చేసికొని యుపాసించుట లేదు! అంతవాఁడనైనచో నేను నట్లే చేయుదును.

హరి—(తీవ్రస్వరముతో) అంతవాఁడవు కాఁజాలకున్న నీతండ్రి తాతలమత మునఁ బోఁగూడదా? దీనికిని దానికిని గూడఁ జెడియుండుట యేమిలాభము! మానవు డైనతరువాత నేదియో యొకమతపరిచయముండవలయును! రామం లేదు; గంగాలేదు; ఇట్లుండుట యెంతతప్పు!

ఇంతలో లలిత యచ్చటికి వచ్చి వినయునిం గాంచి యదరిపడి హరిమోహిని నుద్దేశించి "అక్క యెక్కడ నున్నది?" అని ప్రశ్నించెను.

హరి—రాధారాణి స్నానమునకుఁ బోయినది!

లలి—అక్క నన్ను రమ్మని కబురు పంపినది!

హరి—కూర్చుండుము! ఇప్పుడే వచ్చును.

హరిమోహినికి లలితయెడలఁగూడ ననుకూలభావము లేదు. సుచరితపూర్వబంధ ములనన్నిటిని వదల్చివైచి యామెను సంపూర్ణముగఁ దనదానిని జేసికొనవలయునని హరిమోహిని యిప్పు డూహించుకొనుచుండెను. పరేశబాబుబిడ్డ లెవ్వరు నిచ్చటికి మునుపటివలెవచ్చుట లేదు. ఒక్కలలితమాత్రమే యప్పుడప్పుడు వచ్చి సుచరితతో సంభాషించుచుండెను. అది హరిమోహిని కిష్టముగ లేదు. ఆమె తఱచుగా వారిసం భాషణమునకు భంగము కలిగించి సుచరిత నేదోపనికిఁ బిలుచుచుండెను. కాదేని మునుపటివలె నిప్పుడు సుచరితకు నిరాతంకముగఁ జదువు సాగుటలేదని యాక్షేపమైన జేయుచుండెను. మఱియు సుచరిత చదువుకొనునప్పు డాడువాండ్రు కంతచదువనా వశ్యకమనికూడఁ జెప్పుచుండెను. కాని యామె సుచరిత నెంతబలవంతముగాఁ దనవం కకుఁ ద్రిప్పుకొనఁదలంచియున్నను నామె కది యెంతమాత్రమును సాధ్యపడుటలేదు. అందుచేతనే యామె యొక్కొక్కప్పుడు సుచరితమిత్రులంగూర్చియు, నామె యభ్యాసములఁగూర్చియు దోషారోపణములం గావించుచుండెను!—లలిత వినయుని తోఁగలసి కూర్చుండుట హరిమోహిని కిష్టముగ లేకుండుటే కాక యాయిరువురిమీఁ దను నామెకు గోపముకూడఁ గలిగెను. లలితావినయులకేదియో యొకరహస్యసంబం ధమున్నదని యామె యనుమానించెను. అందుచేతనే యప్పుడామె తనలో 'మీసమా జవిధానము లెట్టివైనను మాయింటిలో నీసిగ్గులేనిసమావేశములును నీకిరస్తానీవ్యాపార ములును జరుగుట నాకిష్టము లేదు!' అని యనుకొనుచుండెను!

లలితహృదయముకూడ విరుద్ధభావముచేఁ గంటకితమైపోవుచుండెను. ఆమె నిన్న సుచరితతో నానందమయికడకుఁ బోఁదలంచెను గాని యెట్లునుఁ బోలేకపో యెను! ఆమెకు గోరాయెడల విశేషగౌరవభావమున్నను, విరోధభావముకూడఁ దీవ్ర ముగా నుండెను. అతఁ డెల్లవిధములఁ దనకుఁ బ్రతికూలుఁ డనుమాట యామె యేవిధ మునను మఱవఁజాలకుండెను. గోరా విడుదల యైనదిమొదలుగ లలితకు వినయునియె

దలఁగూడ సంశయము కలుగుచుండెను. కొన్నాళ్లనుండి వినయుఁడు జోరుగాఁ దనకు స్వాధీనుఁడగుచుండె నని యామె గర్వపడుచుండెను. కాని గోరాప్రభావము నాఁటి డెంతమాత్రమును దిరస్కరింపఁజాలఁడనుసంశయముచేతనే యామె వినయునకు విరుద్ధముగా సంసిద్ధయై నిలిచియుండెను.

లలితను జూచినమాత్రముననే వినయునిమనోమధ్యమున నాందోళనము ప్రబలమైపోయెను. లలితవిషయమున వినయుఁ డెంతమాత్రమును దనసహజస్వభావమును రక్షించుకొనఁజాలకుండెను. తమయిరువురి వివాహమునుగూర్చియు జనశ్రుతి సమాజమునఁ బుట్టినప్పటినుండియు, వినయునిమనసు లలితను జూచినంతనే వైద్యుతచంచలమగు చుంబకశలాకంబోలి స్పందితమైపోవుచుండెను—అయిఁట వినయునిఁ గాంచినంతనే లలితకు సుచరితపైఁ గోపము కలిగెను. ఈవినయుని ప్రతికూలభావము ననుకూలముగఁ జేయుటకే సుచరిత యాతని నిటఁకుఁ బిలిపించి బోధింపఁదలఁచె ననియు నీవంకరను సవరించుటకే నన్నుఁగూడఁ బిలిపించె ననియు లలిత యప్పు డూహించుకొని చటాలున లేచి హారిమోహినిం గాంచి "నాకాలస్య మగుచున్నది; మఱియొకప్పుడు వచ్చెదను. అక్కతో నీసంగతి చెప్పుము!" అని చెప్పి వినయునివంకఁ జూడకుండఁగనే యతివేగముగ వెడలిపోయెను. ఇఁక వినయునిచెంతఁ గూర్చుండవలసిన యావశ్యకము లేకపోవుటచే నింటిపనులనెపంబున హారిమోహినియును లేచిపోయెను.

ప్రచ్ఛన్నాగ్నిం బోలియుండు లలితముఖభావము వినయున కపరిచితము కాదు! కాని చాలదినములనుండి యీలక్షణ మగపడుటలేదు. లలిత తనపై నాగ్నేయాస్త్రప్రయోగము కావించుచుండుదినములు సంపూర్ణముగఁ దిరిగిపోయిన వనియే వినయుఁడు నిశ్చింతుఁడైయుండెను. అస్త్రశాలనుండి వెలుపరింపఁబడిన యాపురాతనాస్త్రమును మరల నిప్పు డాతఁడు కనుఁగొనియెను. తుప్పుపట్టినడా గొక్కటియు నగపడలేదు! కోపమును సహింపవచ్చును గాని యవమానమును సహించుట వినయునివంటి వానికి జాలకష్టము! గోరా కుపగ్రహమాత్రమే యని యెంచి లలిత యొకప్పుడు తన్నవమానించినసంగతి వినయున కప్పుడు స్మృతికివచ్చెను. ఇప్పుడును లలిత తన్ను సామాన్యునిగాఁ దృణీకరించి పోయె నని వినయుఁ డస్థిరుఁడైపోయెను. వినయునికర్తవ్యబుద్ధియందలిసంకోచమును లలిత పిఱికితనముగా భావించెను. ఈవిషయమున నొకటిరెండుమాటలాడుటకైన నవకాశ మీయక లలిత వెడలిపోవుట వినయునకసహ్యముగానుండెను. వాదమున కవకాశ మీయకుండుట వినయున కొకగొప్పశిక్షగా నుండును. ఏమనిన బాగుగ వాదించి యేపక్షమునైనను సమర్థించుశక్తి యాతనియొద్ద నున్నది. కాని జగడము పుట్టినప్పుడెల్ల లలిత వినయునకు వాదించుటకెట్టి యవకాశము నిచ్చుటలేదు. ఇప్పుడుకూడ నట్లే జరిగినది.

అప్పుడు వినయుఁడు బల్లపై నున్న వార్తాపత్రికఁ దీసి యందుఁ బెన్సిలుతో గుర్తుపెట్టఁబడినచోటఁ జదివి యందలినీత్యుపదేశము తమయిరువురినిగూర్చియే యని గ్రహించుకొనియెను. అందుచేత లలిత తనసమాజమువారిచేఁ బ్రతిదినము నెట్లవమానింపఁబడుచుండెనో వినయునకు స్పష్టముగాఁ దెలిసిపోయెను. మఱియు నిట్టియవమానమునుండి లలిత నుద్ధరించుటకై తా నెట్టి ప్రయత్నమును జేయక కేవలము సమాజతత్త్వముంగూర్చియే సూక్ష్మతర్కముం గావించుచుంటి ననియు, నందువలన లలితవంటి తేజస్విని యగు రమణీమణి తన్నవమానించుట తప్పు గాదనియుఁగూడ వినయునకు బోధపడియెను! అప్పుడు వినయుఁడు సంపూర్ణముగ సమాజము నుపేక్షించుచున్న లలితసాహసమును దలంచుకొని యాదృప్తయువతితోఁ దన్నుఁ బోల్చుకొని సిగ్గుపడిపోయెను.

సుచరిత స్నానము చేసి సతీశునకు భోజనము పెట్టి బడికిఁ బంపించి వచ్చి చూచునప్పటికి వినయుఁడు నిస్సబ్దుఁడై కూర్చుండి యుండెను. సుచరిత మరలఁ బూర్వప్రస్తావము నెత్తలేదు. భోజనసమయము వచ్చెను! వినయుఁడు గండూషమైనఁ జేసికొనకుండ భోజనమునకు సిద్ధమగుటం గాంచి హరిమోహిని "బాబూ! నీవు హిందూమతమున నెంతమాత్రమును గౌరవములేదు! ఇట్టిచో బ్రాహ్మమతమునఁ గలసిపోయినచో దోషమేమి?" అని ప్రశ్నించెను. వినయుఁ డామాటకు మనసులో నొచ్చుకొనుచు "తినుట, త్రాగుట మొదలగువానిం గూర్చిన నిరర్థకనియమమే హిందూమత మని నాకు బోధపడినప్పుడు నేను బ్రహ్మసామాజికుఁడనో, క్రిస్టియనునో, ముసల్మానునో, యెవ్వఁడనో యొకఁడనైపోవుదును. కాని హిందూమతమునం దింకను నాకంతటియశ్రద్ధ కలుగుట లేదు!" అనియెను.

అనంతరము వినయుఁడు సుచరితయింటినుండి వెడలిపోయెను. అప్పు డాతని హృదయ మత్యంతమును వికలమైపోయెను. అతని కప్పుడు నలుదెసలను బాధాకరముగ నున్న నిరాశ్రయమగుశూన్యస్థానమధ్యమునకు వచ్చి పడినట్లుండెను. ఇట్టి యస్వాభావికస్థితి కేల వచ్చితి నని యాలోచించుకొనుచు నాతఁడు మెల్లమెల్లగా నడచి పోవుచు నొక పుష్కరిణీతీరమునఁ జెట్టుక్రిందఁ గూలఁబడియెను. ఇంతకుమును వినయుఁడు తనజీవితమునం దోచు నల్పాధికసంఘటనముల నన్నిఁటినిఁగూర్చియుఁ దనమిత్రునితో నాలోచించుకొని సమర్థించుకొనుచుండెను. ఇప్పు డాతని కా త్రోవ మూసికొనిపోయెను! ఒక్కఁడే యాలోచించుకొనవలసివచ్చెను!

సూర్యగతిమూలమున నిదివఱకు నీడగనున్నచోట నెండ వ్యాపించెను. అప్పుడు వినయుఁ డాస్థానమును వదలి మరల వీథిత్రోవను బట్టెను. అట్లు కొంతదూరము

పోవునప్పటికి సతీశుఁడు "వినయబాబూ!" అని పిలుచుచు వచ్చి యాతనిచేయి పట్టుకొని "రమ్ము! మాయింటికి రమ్ము!" అనియెను.

విన—సతీశబాబూ! నేను వచ్చుట యెట్లు?

సతీ—ఏమి?

విన—నేను తఱచుగా వచ్చుట మీయింటివారికి విసుఁగుగా నుండదా?

సతీశుఁ డిప్పటియీవినయునియుక్తికి బదులు చెప్పుటకుఁ దా నసమర్థుఁడ నని తెలిసికొని కేవలము బలవంతముగా "ఏమియు నుండదు! రమ్ము!" అనియెను.

వినయునిసంబంధమువలనఁ దమకుటుంబమునం దెంతటి ఘనవిప్లవము తటస్థించినదో, పాపము బాలకుఁ డగుసతీశున కింతమాత్రమును దెలియదు! అతఁడు కేవలమును వినయునిఁ బ్రేమించి యుండెను. ఈసంగతి తలఁపునకు వచ్చినంతనే వినయుని హృదయము విచలిత మైపోయెను. పరేశునికుటుంబము వినయునియెదుటఁ గావించిన స్వర్గసృష్టియం దీబాలుఁ డొక్కఁడే యత్యున్నమగు నానందముచేఁ బరిపూర్ణుఁడై యుండెను. ఈప్రళయసమయమునందుఁ గూడ నీతనిచిత్తమునం దెట్టిసంశయము మేఘచ్ఛాయయును బడియుండలేదు! విపత్సమాజాఘాతము నీతని బాధించుట లేదు! అప్పుడు వినయుఁడు సతీశునిఁ గౌఁగిలించుకొని "తమ్ముఁడా! నడువుము! నేను నిన్ను మీయింటిగుమ్మమువఱకును బంపివచ్చెదను." అని చెప్పుచుఁ జిన్నతనమునుండియును లలితాసుచరితల ప్రేమవాత్సల్యములను సంపూర్ణముగ సంపాదించుకొనుచున్న యాసతీశునిఁ గౌఁగిలించుకొని యాప్రేమవాత్సల్యముల మధురస్పర్శలాభము ననుభవించినట్లు వినయుఁ డానందించెను. త్రోవ యంతటను సతీశుఁ డసంగతధోరణిలో నెన్నియో యప్రస్తుతవిషయములం గూర్చి భాషించుచు ప్రశ్నవర్షమును గురియించుచుండెను. ఆబాలకుని సరళహృదయసంయోగముకలన వినయుఁడు తనజీవితము నంతను గ్రమ్ముకొనియున్న జటిలసమస్య నొక్కనిమిషమాత్రము పూర్తిగా మఱచిపోయెను.

పరేశునియింటిసమ్ముఖముకడ నుండియే సుచరితయింటికిఁ బోవలసియుండెను. పరేశబాబు కూర్చుండుమేడగది వీధిలోనికి కగపడుచుండును. ఆయింటియెద్దకు వచ్చిన తరువాత వినయుఁ డొకసారి తలయెత్తి చూచుట మానఁజాలకపోయెను. చూచినంతనే బల్లచెంత నెదురుగఁ గూరుచున్నపరేశుఁ డాతనికంటఁ బడియెను. అతఁడు మాటాడుచుండెనో, లేదోమాత్రము తెలియుటలేదు. లలిత వీధివాక వెన్నుంచి పరేశున కెదురుగ నొకబెత్తపుకుర్చీపై బడిపిల్లవలె నిశ్చలయై కూర్చుండెను. ఆమె సుచరితయింటికడనుండి తిరిగి వచ్చి తనహృదయమునం దోచిన దుస్సహసంక్షోభము నడంచుకొనుట కెట్టియుపాయము నుంగానక మెల్లమెల్లగా దండ్రియొద్దకు వచ్చి కూర్చుండి యుండెను. అసహాయురాలగు లలిత తనహృదయచాంచల్యము నడఁగించుకొనుటకై

యెప్పు డప్పుడు శాంతిపరిపూర్ణుఁడగు తండ్రిచెంతకు వచ్చి మౌనముతోఁ గూర్చుండుచుండును! ఏల వచ్చితివని పరేశుఁ డడిగినచో "బాబూ! ఏమియును లేదు. మీగదిలో మిగులఁ జల్లగా నుండును! అని చెప్పుచుండును.

నేఁడు లలిత పీడితహృదయముతో వచ్చియుండెనని పరేశుఁడు స్పష్టముగాఁ దెలిసికొనియెను. ఆతనిహృదయమునందుఁగూడ నొకవిధ మగు వేదన ప్రచ్ఛన్నముగా నుండెను. అందుచేతనే పరేశుఁడు మెల్లమెల్లగా వ్యక్తిగతజీవితమునందలి తుచ్ఛసుఖదుఃఖభారముల నడఁగించుకొను పద్ధతులనుగూర్చి మాటలాడ నారంభించెను— ఆతండ్రిబిడ్డల యేకాంతాలోచనాదృశ్యముం గాంచినంతనే యొక్కింతసేపు వినయునకు గతినిరోధమయ్యెను— సతీశుని వాగ్ధోరణి యాతని చెవులఁ బడకుండెను. సతీశుఁ డప్పుడు యుద్ధపద్ధతులంగూర్చి ప్రసంగించుచు "చిన్నతనమునుండియుఁ బెద్దపులులను బెంచి యుద్ధవిద్య నేర్పి యొకగుంపుగా మనసేనాముఖమున నిలిపి పోరాడినచో నితరశత్రువు వారేమిచేయఁగలరు?" అని ప్రశ్నించెను. అనిప్రశ్నలకు నుత్తరము వచ్చి యీ ప్రశ్నకు రాకుండుటచే సతీశుఁడు వినయుని మొగమువంకఁ జూచెను. అప్పుడు వినయుఁడు పరేశునింటివంకఁ జూచుచుండుటచే నాతఁడును బైకి జూచి యుచ్ఛస్వరముతో "అక్కా! లలితా! ఇదిగో! చూడుము! నేనీవినయబాబును దోవలోఁ బట్టి దీసికొనివచ్చితిని!" అని కేకవైచెను.

వినయుఁడు లజ్జాస్తంభితుఁడై పోయెను. లలిత కుర్చీనుండి చటాలున లేచి నిలుచఁబడియెను. పరేశుఁడును మొగమెత్తి వీథివంకఁ దిలకించెను— ఇఁక నేమున్నది! వినయుఁ డప్పుడే సతీశునకు సెలవిచ్చి పరేశునింటికిఁ బోయెను. ఆతఁడు వచ్చుటం గాంచి లలిత వెడలిపోయెను. తన్నందఱు నశాంతికరుఁ డగుదస్యునివలెఁ జూచుచున్నారని యనుకొనుచు వినయుఁడు సంకోచముతోఁ గుర్చీపైఁ గూర్చుండెను— కుశలప్రశ్నానంతరమున వినయుఁడారంభించి "నేను హిందూసమాజాచారవిచారముల నెంతమాత్రమును మన్నింపక ప్రతిదినము నుల్లంఘించుచునే యున్నాను. ఇట్లైచో హిందూమతమును విడిచి బ్రహ్మసమాజము నాశ్రయించుటయే మంచి దని నాకుఁ దోఁచుచున్నది. అందుకొఱకు మీయొద్దనే దీక్ష గైకొనవలయు నని నాకోరిక!" అని స్పష్టముగాఁ జెప్పివైచెను. వినయుని హృదయమునం దీకోరిక— ఈసంకల్పము, అయిదు నిమిషములకిందట స్పష్టమగు రూపముం దాల్చియుండలేదు! పరేశుఁ డించుకసేపు స్తంభితుఁడై "బాబూ! నీవన్నిసంగతులను బాగుగ నాలోచించుకొంటివా?" అని ప్రశ్నించెను.

విన— ఇందంతగా నాలోచింపవలసినవిషయ మేమున్నది? అన్యాయమా, న్యాయమా యనుసంగతిమాత్రమే భావింపవలయును. అది స్పష్టముగనే తెలియుచు

న్నది! ఇంచుక జ్ఞానముకలవా రవలంభ్యము లగునాచారములే ధర్మము లని యెంత మాత్రమును నిష్కపటచిత్తముతో నంగీకరింపఁజాలరు. అట్టినడవడి గలనేను హిందూ మతమును శ్రద్ధతో నాశ్రయించినవారితోఁ గలసి యుండుట మాటిమాటికిని వారికి బాధను గల్పించినట్లే యగుచున్నది. ఇది యపచార మనుటకు నాకెట్టిసందేహమును లేదు. ఇట్టిచో నట్టియపచారమును లేకుండ నాతప్పును సవరించుకొనవలయు ననియే నేనుసిద్ధపడియుంటిని. కాకున్నచో నేను నాయాత్మగౌరవమును నిలుపుకొనఁజాలను!

పరేశునకు సంగతి బోధపడుట కిన్నిమాటలు చెప్పనక్కఱలేదు! కాని వినయుఁడు తన కుదేరికను కల్పించుకొనుటకే యింతవఱకుఁ జెప్పెను. వినయుఁ డిప్పుడు తాను న్యాయాన్యాయయుద్ధమధ్యమున జిక్కుకొంటి ననియు, నిందు సమస్తమును త్యజించి న్యాయపక్షమునే యవలంబించి విజయమును గాంచవలయు ననియుఁ దలంచి సుస్థిరుఁడై యెదిరించి నిలువఁబడి యుండెను. మానవత్వమునకుఁ గలమర్యాదను నిలుపుకొనవలయును!—

పరేశుడు వినయుని గాంచి "ధర్మవిశ్వాసవిషయమున బ్రహ్మసమాజముతో నీకు మతైక్యమున్నదా?" అని ప్రశ్నించెను. వినయుఁ డించుకసేపూరకుండి "పరేశ బాబూ! నేను సత్యము చెప్పుచున్నాను! పూర్వము నాకించుక ధర్మవిశ్వాస మున్నట్లు తోఁచుచుండెను. అందుచేతనే నేనావిషయమున ననేకులతో ననేకవాదములం గావించియుంటిని. కాని యిప్పుడు నాజీవితమునం దానిశ్వాస మెట్టిపరిణతిలాభమును గాంచియుండ లేదని నాకు నిశ్చయముగా బోధ యగుచున్నది. నాకు లభించిన యా స్వల్పజ్ఞానమైనను మీమూలమునఁ గలిగినదే మతమునందు నాజీవితమున కెట్టి సత్యప్రయోజనమును నగపడలేదు. అందుచే దానియందు నాకెట్టిసత్యవిశ్వాసమును గలుగ లేదు. కావుననే యుక్తికల్పనాకౌశలమున నేనిన్నాళ్ళును మాసమాజధర్మమునకు నానావిధసూక్ష్మవ్యాఖ్యానములచేతను కేవలతర్కనైపుణ్యముచేతను మాత్రమే పరిణతిలాభమును గూర్చుచుంటిని. ఏమతము సత్యమైనదో తెలిసికొనవలసిన యావశ్యకము నాకు లేకపోయెను. కాని నామతము సత్యమైనదని వాదించి నిరూపించి విజయమును గాంచుటకే నేను ప్రయత్నించితిని. అట్లు వాదించుచున్న కొలఁది నాకహంకారము బోధయగుచుండెను. నాహృదయమునం దెన్నఁడైన మతవిశ్వాసము సంపూర్ణసత్యముగను, సహజముగను దోఁచినదో లేదో నేనిప్పటికిని జెప్పజాలను గాని, తదనుకూలావస్థలంగూర్చియు, దృష్టాంతములంగూర్చియు నాయాలోచనలు పోవుచున్న మాటమాత్రము నిశ్చయము! అంతరాంతరమునుండి యేది నాబుద్ధిని బీడించుచుండెనో దానిజయపతాకనే బ్రదికినన్నాళ్ళును వహించి తిరుగుచుండెడిహైన్యమును నేనింక సహింపఁజాలను" అనియెను.

పరేశునితో నిట్లు మాటాడుచు వినయుఁడు తన వర్తమానావస్థ కనుకూలము లగు యుక్తుల కాకారముల నిచ్చి ప్రదర్శించుచుండెను. అయుత్సాహముతో నాతఁడు తన చిరకాలతర్క-వితర్కములవలనఁ దుద కిట్టిస్థిరసిద్ధాంతమునకు వచ్చియున్నట్లు నిరూపించుకొనుచుండెను. అప్పటికిని బరేశుఁ డింకను గొంత కాల మాలోచించుకొనుమని వినయుని బలవంతము చేసెను. అందువలనఁ దద్దృఢసంకల్పముంగూర్చి పరేశుఁడు శంకయించుచున్నట్లు గ్రహించుటచే వినయునకు మఱింత తొందర కలిగెను. అప్పు డాతఁడు తనహృదయము నిస్సందిగ్ధక్షేత్రమున సుస్థిరముగ నిలిచి యున్నదనియు, దాని కిఁక నెన్నఁటికి నెట్టిచలనమును గలుగ దనియు మాటిమాటికిని జెప్పఁదొడంగెను. అప్పు డాయుభయులలో నెవ్వరునుగూడ లలితావివాహప్రస్తావము నెత్తలేదు !

ఇంతలో గృహకృత్యమునకై వరదాసుందరి యటకు వచ్చి వినయునిఁ జూడనట్లుగనే తనపనినిఁ జేసికొని వెడలిపోవుట కుద్యుక్త యగుచుండెను. వినయుఁడు తన నూతనోద్దేశమునుగూర్చి యప్పుడు వరదాసుందరితోఁ బరేశుఁడు చెప్పు నని యూనుకొనెను గాని, పరేశుఁ డట్లు చేయలేదు. ఇది చెప్పవలసినసమయ మనియుఁ బరేశుఁడు భావింపలేదు. ఈసంగతి రహస్యముగ నుంచవలయు ననియే యాతని యుద్దేశము! కాని వరదాసుందరి తనయెడల విస్పష్టముగఁ దిరస్కారమునుఁ గ్రోధమును బ్రకటించి పోవుచుండుటను వినయుఁడు సహింపఁజాలక, పోవుచున్న యామెపాదములకు సాష్టాంగప్రణామముం గావించి "నేను బ్రహ్మసమాజదీక్షితుఁడ నయ్యెదనని చెప్పుటకే మీసన్నిధికి వచ్చితిని. నేనయోగ్యుఁడ నైనను మీరు నన్ను యోగ్యునిగాఁ జేయుదు రని ధైర్యముతో నున్నాను!" అనియెను.

వరదాసుందరి విస్మితయై వెనుకకుఁ దిరిగి మరల మెల్లగ గదిలోనికి వచ్చి కూర్చుండి జిజ్ఞాసుదృష్టితోఁ బరేశుని మోమువంకఁ దిలకించుచుండెను. అప్పుడు పరేశుఁడు "వినయబాబు దీక్షాగ్రహణమునకై తొందరపెట్టుచున్నాఁడు!" అని చెప్పెను. ఆమాటకు వరదాసుందరిహృదయమున నొకవిధమగు విజయశ్లాఘగర్వము కలిగినది గాని సంపూర్ణానందము కలిగినది కాదేమి ?—పరేశున కిప్పటికైనఁ దగినశిక్ష కావలయు నని యామె లోలోపల నెంతగా గోరిక కలిగి యుండెను. ఆమె తన భర్తనుద్దేశించి మీ రిప్పటికైన దుస్సాహసమునకు పశ్చాత్తాపము ననుభవింపక మానరని భవిష్యత్తంతయు ననేకపర్యాయములు ఘోషించియుండెను. అందుచేతనే సామాజికాందోళనమునకుఁ బరేశుఁడు చంచలుఁడు కాకుండుటం గాంచి వరదాసుందరి మనసునం దసహ్యపడుచుండెను. అందుచేతనే యిది తనసమాజమున సమస్తప్రాతికూల్యములకును ననుకూలవిధాన మేర్పడుట వరదాసుందరి కంతప్రీతికరముగా లేకపోయె

ను! అప్పు డామె గంభీరభావముతో "ఈపని కొలఁదిదినములకు ముందే జరిగినచో మన కింతటి యవమానమును, దుఃఖమునుగూడ లేకుండఁబోవునుగదా!" అనియెను.

పరే—మనదుఃఖావమానములనుగూర్చి యెట్టిప్రశంసయును లేకుండఁగనే వినయుఁడు దీక్షాగ్రహణమును వాంఛించుచున్నాఁడు!

వర—కేవలము దీక్షాగ్రహణమేనా?

విన—మీదుఃఖావమానములు సమస్తమును నాకుఁగనే భావించుకొనుచున్న సంగతి యంతర్యామి యొక్కనికే తెలియును!

పరే—నాయనా వినయా! ధర్మదీక్షను గైకొనఁదలఁచిననీవు దానియం దింకొకయవాంతరవిషయమును గల్పించుకొనవలదు! మేమేమియో యొక సామాజికవిపత్తున దాఁగియుంటిమను యుద్దేశముతో నీవెట్టిఘనవ్యాపారమునందును బ్రవృత్తుఁడవు కాఁదగదని నేనిదివఱకే నీకుఁ జెప్పియున్నాను!

వర—ఆమాట నిజమే—కాని మనలనందఱును జిక్కులలోఁ బడద్రోసి యూరక చూచుచు కూర్చుండుటమాత్ర మీతనికి న్యాయమా?

పరే—ఒకమారు మనగుండెకు చాంచల్యముం జూపినచో నాచిక్కు మఱింత బిగిసికొనిపోవును! ఏదియో యొకపని చేయుటయే ముఖ్యము కాదు—చాలసమయములం దేమియును చేయకుండుటయే ప్రధానకర్తవ్యమైయుండును.

వర—అట్లే కావచ్చును! మూర్ఖురాలనగు నేనన్నిసంగతులను బాగుగ గ్రహింపఁజాలను! సరే. ఇప్పు డేమి చేయుటకు నిశ్చయించితిరి? నేనాసంగతినిమాత్రమే తెలిసికొని పోయెదను. నాకుఁ జాలపను లున్నవి!

విన—నేను రేపాదివారమునాఁడే దీక్షను గైకొందును. నాకోరిక యేమనిన—పరేశ బాబు—

పరే—ఈదీక్షాసంబంధమున నేదియో యొకఫలమును నాకుటుంబమువా రాశించుచున్నప్పుడు నేను నీకీదీక్ష నొసంగఁజాలను. నీవు సమాజమునకు నివేదించుకొనుము!

అంతలోనే వినయునిహృదయము సంకుచితమైపోయెను. వినయుఁ డిప్పుడు బ్రహ్మసమాజవిధుల ననుసరించి దీక్ష గైకొనుటకై విన్నపము నంపుకొనునట్టియవస్థలో లేఁడు! విశేషించి లలితవివాహమున బ్రహ్మసమాజ మాతని ననేకవిధముల నిందించినది. ఇట్టిచో నేభావముతో నేమొగము పెట్టుకొని యాతఁ డాసమాజమునకు విన్నపము వ్రాయఁగలఁడు? ఆయుత్తరము బ్రహ్మపత్రికయందుఁ బ్రకటితమైనప్పు డాతఁ డెట్లు తల యెత్తుకొనఁగలఁడు? దానిని గోరా చదువును! ఆనందమయియును జదువును! అంతఁ బూర్వాపరచరిత్ర మేమియు నుండక కేవలమును వినయుఁడు

బ్రాహ్మధర్మదీక్షాగ్రహణమునకై యాకస్మికముగ వాంఛించు చున్నట్లుమాత్రమే ప్రకటింపఁబడి యుండును! కేవలమున దియే సత్యము కాదు! దానిలోఁ బూర్వాపరసందర్భములు కలసి యుండకున్నచో వినయుని మానరక్షణోపాయ మగుసావరణలేశము లేకుండఁబోవును! వినయుఁడు మాఱుమాటాడకుండుటం గాంచివరదాసుందరి భయపడి "నీవు బ్రహ్మసమాజమునం దెవ్వరినిగూడ నెఱుంగవు. కావున సమస్తమును నేనే యేర్పాటు చేసెదను. నేను నేఁడే పానూబాబును బిలిపించెదను. ఇఁక వ్యవధిలేదు-ఆదివారము రేపేగదా!" అనిచెప్పుచు నప్పుడేవచ్చి మేడమీఁదికిఁ బోవుచున్న సుధీరునిం గాంచి "సుధీరా! వినయబాబు రేపుమన సమాజదీక్షం గైకొనును!" అనియెను.

సుధీరుఁ డత్యుత్సాహి యయ్యెను. అతఁడు వినయుని కాంతరంగిక భక్తుఁడై యుండెను వినయుఁడు బ్రాహ్మమతమునఁ జేరు నని విని యాతఁ డానందపడియెను. అంతటి యాంగ్లేయభాషాభిజ్ఞుఁడు, అంతటి విజ్ఞాననిధి బ్రాహ్మమతము నవలంబింపకుండుట యసంగత మని సుధీరుఁ డనుకొనుచుండెను. వినియునివంటివాఁ డెట్లును బ్రాహ్మమతమునకు వెలుపల నండఁజాలఁడని దృష్టాంతము ను గ్రహించి సుధీరుఁడు పొంగిపోవుచు "రేపాదివారము నాఁడేనా? కాని యీసంగతి చాలమందికిఁ దెలియదు!" అనియెను. వినయుని దీక్షను దృష్టాంతముగ జనసామాన్యమునం దంతటను ఘోషింపవలయు నని యాతని యభిలాష!

వర— ఎట్లయినను రేపాదివారముననే జరుగవలయును! సుధీరా! నీవు పరుగెత్తుకొనిపోయి పానూబాబును శీఘ్రముగఁ దీసికొనిరమ్ము!

ఏనిరాభవ్యుని దృష్టాంతముగఁ జూపి సుధీరుఁడు బ్రహ్మసమాజ మజేయశక్తిమంతమైనదని లోకమునఁ బ్రచారము చేయఁదలంచి యుత్సాహితుఁడై యుండెనో, యాయధీరుఁ డగువినయుని హృదయ మప్పుడు సంకుచితమై యొక్కసారిగా బిందుమాత్రమై పోవుచుండెను. కేవలమును మానసికంబు లగు నాలోచనలచేతను, యుక్తులచేతను మాత్రమే కల్పింపఁబడి నిజముగా నెట్టియాకృతియును లేనివస్తుసంబంధమగు బాహ్యలీలను గాంచియే వినయుఁ డప్పుడు వ్యాకులపడిపోవుచుండెను. వరదాసుందరి పానూబాబును బిలువనంపుటం గాంచి వినయుఁడు చటాలున లేచెను.

వర— వినయబాబూ! కొంచె మాఁగుము! పానూబా బిప్పుడే రాఁగలఁడు!

విన— వలదు. నన్ను క్షమింపుము!

ఈయావరణమునుండి యెట్లో తప్పించుకొని దూరముగఁబోయి బహిరంగస్థాననము సమస్తవిషయములను బాగుగ నాలోచించుకొనుట కవకాశము దొరకినచో బ్రదుకుదు నని వినయుఁ డనుకొనియెను. వినయుఁడు లేచినంతనే పరేశుఁడును లేచి యాతనిభుజముపైఁ జేయివైచి "వినయా! నీవు తొందరపడి యేపనియును జేయవలదు.

కాంతముగ, స్థిరముగ సన్నివేశముల నాలోచించి చూచుకొనుము. నీహృదయమును నీవు బాగుగఁ దెలిసికొనకుండ జీవితసంబంధమగు నింతటిఘనకార్యమునఁ బ్రవేశింప వలదు." అనియెను.

వరదాసుందరి భర్తంగూర్చి మనములో ననుకొన్నదియై "మెంట్టమొదట నెవ్వరును బాగుగ నాలోచించి పనిచేయలేదు. అవసరములు తటస్థించినతరువాత మెల్లగ గూర్చుండి యాలోచింపుమనుచున్నారు! మీరు స్థిరముగ గూర్చుండి యాలోచింప గలరు. కాని, మా ప్రాణము లెగిరిపోవుచున్నవి." అనియెను.

అనంతరము వినయసుధీరు లిరువురు నొక్కసారిగనే వెడలిపోయిరి. యథోచితముగ భుజింపకపూర్వమే రుచులను జూచవలయునను కోరికగలవానివలె సుధీరుఁడు చంచలుఁడైపోయెను. వినయుఁ డెట్లయిన నప్పుడే తనమిత్రుల్ని దప్పించుకొని దీని కొనిపోయి యీనువార్తను దెల్పవలయు నని యాతఁడు తుత్తూహాలపడుచుండెను. కాని సుధీరుని యీ యుత్సాహతరంగాఘాతముచే వినయునిమనసు మరింత క్రుంగిపోవుచుండెను. అప్పుడు సుధీరుఁడు "వినయబాబూ! మన మిరువురమునుగూడఁ బానూబాబునొద్దకుఁ బోవుదము రమ్ము!" అనియెను. వినయుఁ డామాట చెవినిఁ బెట్టకయే యాతనిచేయి వదలించుకొని వెడలిపోయెను. కొంతదూరము పోవునప్పటికిఁ గొందఱితోఁ గలసి యుత్సాహముతోఁ బోవుచున్నయవినాశుఁ డాతనికి గనబడియెను. ఆతఁడు వినయునిం గాంచి "ఇదిగో! వినయబాబు! మంచిది. రమ్ము! మాతోఁగూడ రమ్ము!" అనియెను.

విన—ఎక్కడకు?

అవి—కాశీపురోద్యానమునకు—అక్కడ గౌరవమోహనబాబు ప్రాయశ్చిత్త సభ జరగును.

విన—వలదు. నాకిప్పుడు వచ్చుటకవకాశము లేదు.

అవి—అదియేమిమాట! ఇది యెంతటిగొప్పవిషయమో మీరు బోధపడుట లేదా? కానిచో గౌరమోహనబాబు కిటావశ్యకముగ నేల చేయును? ఈదినములలో హిందూ సమాజశక్తి బ్రదర్శింపవలసి యున్నది. ఈప్రాయశ్చిత్తముచే దేశమంతటను గొలఁదిగనో, గొప్పగనో యాందోళనము కలుగకమానదు. దేశదేశములందుఁ గలగొప్పగొప్పబ్రాహ్మణపండితుల నందఱ నాహ్వానించితిమి. ఇది హిందూసమాజమున కుపయోగకరమగు ఘనకార్యము! మనమింకను బ్రతికియుంటిమనియు, హిందూసమాజ మింకను జావలేదనియు లోకమునకుఁ దెలియవలయును!

వినయుఁ డెట్లో యవినాశునిబారినుండి తప్పించుకొని పోయెను.

## ౫౭

వరదాసుందరి హారానుబాబునకు సమస్తమును దెలిపెను. అప్పుడాతఁడించుక సేపు గంభీరుఁడై కూర్చుండి యనంతరము "ఈవిషయమున నొకసారి లలితతో నాలోచించి చూడవలయును!" అనియెను. ఇంతలో లలిత వచ్చుటయు, హారానుఁడు తనగభీరభావమును బాతాళమునకును సాగించి "లలితా! నీజీవితమున నొకగొప్ప బాధ్యతను గల్పించుసమయము వచ్చినది. నీమతమునకును, నీప్రవృత్తులకును నడుమనుండి యొకయనుకూలమగుమార్గమును నీవేర్పఱచుకొనవలసి యున్నది!" అని చెప్పి యించుక యాఁగి యాతఁడు లలిత మొగమువంకఁ దిలకించెను. హారానుఁడు తనవ్యాఖ్యానలపరిదీప్తం బగుదృష్టియొకటఁ బిఱికితనము కంపితమగు ననియు, గాపట్యము భస్మీభూతమగుననియుఁ, దేజోమయంబును, నాధ్యాత్మికంబును నగుతనదృష్టియే బ్రహ్మసమాజమున కమూల్యసంపత్తి యనియు ననుకొనుచుండెను—లలిత యేమియు మాటాడ కూరకుండెను.

అప్పుడు హారానుఁడు "లలితా! నీయవస్థఁ గాంచితివో, మఱియే కారణమువనో వినయుఁడు మనసమాజదీక్షఁ గైకొనుటకు సమ్మతించె ననుసంగతి నీకుఁ దెలిసియే యుండుననుకొనియెదను!" అనియెను. లలిత కీసంగతి యిదివఱకుఁ దెలియలేదు అకస్మికముగ వినుటచేఁ గలిగినతనహృదయభావమును గూడ నామె ప్రకటింపలేదు. ఆమె నయనద్వయము పరిదీప్తమైపోవుచుండెను. శిలాప్రతిమవలె నామె స్థిరభావముతోఁ గూర్చుండెను.

హారా—వినయునియుద్దేశమునకుఁ బరేశబాబు మిగుల సంతుష్టుఁడైయున్నాఁడు కాని యిది సంతోషవిషయ మగునో కాదో నీవే స్థిరపఱుపవలసి యుండెను. అందుచేతనే నేనిప్పుడు సమాజపక్షమున నిన్నడుగుచున్నాను. నీవు నీయున్మత్తప్రవృత్తుల నొకవంకకుఁ ద్రోసి కేవలమును ధర్మమువంక దృష్టినిలిపి "ఇందు సంతోషించుటకేదైన యథార్థకారణ మున్నదా లేదా?" అని నీహృదయమునఁ బ్రశ్నించుకొనుము!

లలిత యిప్పుడును మాటాడలేదు. హారానుఁడు తానేమో గొప్పపని చేయుచున్నట్లు భావించుకొని ద్విగుణీకృతోత్సాహముతో "దీక్ష! దీక్షయనునది జీవితమునందెంతటిపవిత్రమహత్తరమో నీవే చెప్పుము! అట్టిదీక్షను గలుషితముఁ జేయవచ్చునా? సుఖేప్సితములయందలి యాసక్తిచే నాకర్షింపఁబడి మనమే సమాజమునందసత్యమునకుఁ ద్రోవనిచ్చుచున్నాము. కాపట్యము నాదరించి యాహ్వానించుచున్నాము. లలితా! నీవే చెప్పుము! సమాజము నీజీవితముతోఁ గూడ చిరకాలమువఱకును గలంకచరిత్రవిశిష్టమై యుండవలసినదేనా?" అనియెను. ఈసారిగూడ లలిత యేమియు మాటాడక కుర్చీచేతులపై వ్రాలుకొని స్థిరముగాఁ గూర్చుండెను. హారానుఁడు మరల "లలితా!

ఆసక్తి యను ఛిద్రమూలమున దౌర్బల్యము దుర్నివార్యమై మానవు నెట్లాక్రమించుకొనునో తఱచుగఁ జూచుచునే యున్నాము! అట్టి మానవునిదౌర్బల్యము నేవిధముగా క్షమింపవలయునో కూడ నేనెఱుంగుదును. కాని యట్టిదౌర్బల్య మొక్కవ్యక్తికిఁ బరమునే కాక శతసహస్రజీవితముల కాశ్రయస్థానము నొక్కసారిగా బాధించుచున్నప్పుడు— నీవే చెప్పుము! ఆబాధ నొక్క నిమిషమైనను సహింపఁగలమా? అంతటిగహనశక్తిని మన కీశ్వరుఁడు ప్రసాదించి యుండెనా?" అనియెను.

లలిత కుర్చీనుండి చటాలున లేచి "వలదు! వలదు! పానూబాబూ! నీవు సహింపవలదు. నీక్రోధము యందఱకు నలవాటైపోయినది. నీసహనభావ మందఱకును గూడ నసహ్యముగనే యుండు నని తోఁచుచున్నది!" అని చెప్పి యాగదినుండి వెడలిపోయెను.

వరదాసుందరి హారానునిమాటల కుద్విగ్నయైపోయెను. ఆమె యిప్పుడెట్లును వినయుని విడువఁజాలకుండెను. ఆమె యెన్నియోవిధముల వ్యర్థాలాపములతో హారానున ననునయించుచుఁ దుదకుఁ గోపముతో నాతనిఁబంపివైచెను. పరేశునిగాని, హారానునిగాని, తనపక్షమున నిల్పుకొనఁజాలకుండుట యామెకుఁ గష్టముగా నుండెను. ఇట్టియుపద్రవ మెవ్వరు నెన్నఁడును భావించియైన నుండలేదు. ఆమె కిప్పుడు మరల హారానునివిషయమునఁ దనయుద్దేశము మార్చుకొనవలసినసమయము వచ్చెను.

దీక్షాగ్రహణవ్యాపారమును వినయుఁడు తనలో నస్పష్టముగ భావించుచున్నంతవఱకు మిగులజోరుగనే తనసంకల్పమును బ్రకటించుచుండెను. కాని యీవిషయమున సమాజమునకు విన్నప మంపవలయు ననియు, హారానునితో నాలోచింపవలయు ననియు స్పష్టపడి నంతనే యాతఁడు కుంఠితుఁడైపోయెను ఎక్కడకుఁ బోయి యెవ్వరితో నాలోచింపవలయునో యాతనికిఁ దోఁచుటలేదు ఆనందమయి చెంతకుఁ బోవుట కూడ నాతని కసంభవ మయ్యెను. వీధులవెంటఁ దిరుగుటకుఁగూడ నాతనికి శక్తిలేకుండెను. అందుచే నాతఁడు తననిర్జనగృహమధ్యమునకుఁ బోయి మేడమీఁదిగదిలో నొకమంచముపైఁ బరుండి నిద్రించెను.

సంధ్యాసమయ మయ్యెను. సేవకుఁడా చీఁకటిగదిలోనికి దీపమును దెచ్చుటయు వినయుఁడు వలదని వారింపఁదలఁచు చుండఁగా నింతలో "వినయబాబూ!" అను నొకపిలుపు వినఁబడియెను. వినయుఁడు బ్రతికితి ననుకొనియెను. ఆపిలుపాతని కెడారిలో దాహజలము లభించిన ట్లుండెను. ఇట్టిసమయమున సతీశుఁడు తప్ప మఱియెవ్వరు నాతనికి శాంతిని గూర్పఁజాలరు! వినయుని నిర్జీవత్వము తొలఁగిపోయెను. "ఏమిబాబూ! సతీశా!" అని పిలుచుచు వినయుఁడు చటాలున మంచముదిగి జోళ్లైనఁ దొడుగుకొనకుండ నతివేగముగ మేడమెట్లను దిగిపోయి సోపానముల కెదురుగ

నిలిచియున్న వరదాసుందరి సతీశు ను గనుఁగొనియెను — మరల నదియే వ్యాపారము ! అదియే యుద్ధము ! వినయుఁడు చంచలహృదయముతో వారిని మేడమీఁదికిఁ దీసికొనిపోయెను.

అప్పుడు వరదాసుందరి "సతీశా ! నీవించుకసే పు వరండాలోఁ గూర్చుండుము !" అనియెను. దూరముగా నుండవలయు నని సతీశునకు విధించినయీయప్రియశిక్షకు వినయుఁడు విచారించుచుఁ గొన్ని బొమ్మలపుస్తకములను సతీశున కిచ్చి పక్కగదిలో దీపము వెలిఁగించి యందాతని గూర్చుండఁజేసెను. అనంతరము వరదాసుందరి "వినయబాబూ ! నీవు సమాజమువారి కెవ్వరి కెఱుంగవు ! నీవు వారికి విన్నపమును వ్రాసి యిచ్చినచో నేను రేపటియుదయముననే పోయి సంపాదకునితో నాలోచించి యాదివారమునాఁడే నీదీక్ష జరగునట్టి యేర్పాటు చేసెదను. ఇందుకై యిఁక నీవేమియు నాలోచింప నక్కఱలేదు !" అనియెను. వినయుఁడును మారుమాటం జెప్పక యామె చెప్పినట్లుగనే యొక యుత్తరము వ్రాసి యామెచేతి కిచ్చివైచెను. ఎన్నఁటికిని దిరిగిపోవుటకుఁ గాని సంశయించుటకుఁగాని యెట్టియవకాశమును లేని యొకమార్గమున నేదో యొకవిధముగా బయల్వెడలుట యాతని కిప్పుడావశ్యకమై యుండెను !

వరదాసుందరి వెడలిపోవునప్పుడు లలితావినయులవివాహమునుగూర్చికూడఁ గొంతవఱకుఁ బ్రస్తావించియే పోయెను — అప్పుడు వినయునిహృదయమున విశేషము గావిసుఁగు దోఁచుచుండెను. లలిత సంబంధమగుస్మృతికూడ నప్పు డాతనిమనో మధ్యమున నపస్వరమును మోగించుచుండెను. వరదాసుందరి భావించు నీయమంగళ చంచలకార్యాచరణమునఁ గొంతవఱకు లలిత యేకీభావ ముండు నని యాతనికిఁ దోఁచుచుండెను. తనయందుఁ దనకే గౌరవము లేని వినయున కప్పు డెల్లవారియందును గౌరవలోపమే కనవచ్చుచుండెను.

వరదాసుందరి యింటికిఁ బోయినంతనే లలిత నిప్పుడు సంతోషపెట్టవలయు ననుకొనియెను. లలిత వినయుని ప్రేమించియున్న సంగతి యామె నిశ్చయముగా నెఱుంగును. ఆవివాహమునుగూర్చి సమాజమునందు గోలకూడ బయలుదేరెను. ఈవిషయమునఁ దానుతప్ప నందఱును తప్పు చేసినవారే యని యామె నిందించియుండెను. కొలఁదిదినములనుండి యామె లలితతో మాటాడుట మానివైచెను ! ఈ బిక్కును వదల్చుటకుఁ దగిన యవకాశము చాలవఱకు వరదాసుందరికే లభించెను. అందుచే నిట్టితనగౌరవమును లలితకుఁ బ్రదర్శించి యామెతో సంధి చేసికొనవలయు నని వరదాసుందరి తొందరపడుచుండెను. లలితతండ్రి సమస్తమును ధ్వంసము చేసెను. లలితయైనను వినయుని వశపఱచుకొనలేకపోయెను. పానూబాబు సాహాయ్యమైన లేకుండ

నిప్పుడు వరదాసుందరి యొక్క తెలియె సమస్తనిర్బంధములను దెబ్బ చిప్పెచెను. ఆయిదుగురుపురుషులు గలసి చేయఁజాలనిపని యొక్కయాఁడుది చేయఁగలిగెను!

లలిత యనారోగ్యముచేఁ బరుండి యున్నట్లు వరదాసుందరి తెలిసికొనియెను. ఆమె లోలోపల నవ్వుకొనుచు "నీ నారోగ్యము కలిగించెదను" అని యొక దీపమును జేతఁ బట్టుకొని శయనగృహమునఁ బ్రవేశించెను. లలిత యింకను బట్టలు మార్చక పడకకుర్చీపై నొఱిగియుండెను. ఆమె తల్లిం గాంచి చటాలున లేచి "అమ్మా! నీ వెక్కడకుఁబోయితివి?" అని ప్రశ్నించెను. ఆస్వరమునం దొకతీవ్రభావ మున్నది! తనతల్లి పరేశునితోఁ గలసి వినయునింటికిఁ బోయిన ట్లామెకుఁ దెలిసినది!

వర—నేను వినయునింటికిఁ బోయితిని.

లలి—ఎందుకొఱకు?

ఎందుకొఱకు!—వరదాసుందరి కించుక కోపము వచ్చెను. "నేను తనకుఁ గేవలము శత్రురాల ననుకొనుచున్నది కాఁబోలును! అకృతజ్ఞురాలు!—" అని!—వరదాసుందరి "లలితా! ఇదిగోఁ జూడఁగూడదా?" అని చెప్పుచు వినయునియుత్తరమును లలితకన్నులయెదుటఁ దెఱచి పట్టుకొనియెను. ఆచీటిని జదివి లలితమొగ మెఱ్ఱనైపోయెను. వరదాసుందరి తనసామర్థ్యమును బ్రకటించుకొనుటకై కొంచె మత్యుక్తులతో నాయుత్తరమును వినయునియొద్ద సంపాదించినసంగతియంతయును జెప్పెను. ఇంతపని తాను తప్ప మఱి యితరు లెవ్వరును జేయఁజాల రనుగూడ గొప్పగాఁ జెప్పుకొనియెను.

లలిత రెండుచేతులతోడను మొగమును గప్పుకొని కుర్చీపైఁ బొరగిలఁబడియెను. లలిత తనయెదుట నామెప్రబలవ్యధయావేగమును బ్రకటించుటకు సిగ్గుపడియె నని వరదాసుందరి యనుకొని యాగదినుండి వెడలిపోయెను.

మఱునాఁటియుదయమునం దామె సమాజమునకుఁ బోవఁ దలఁచి యుత్తరముకొఱకుఁ జూడఁగా నది యెవ్వరిచేతనో ముక్కలు ముక్కలుగాఁ జించివేయఁబడియుండెను!

## ౭౮

అపరాహ్ణసమయమున సుచరిత పరేశుని దర్శింపఁబోవుటకు సిద్ధపడుచుండఁగా సేవకుఁడు వచ్చి యెవ్వరో బాబు వచ్చియున్నాఁడని చెప్పెను. "వినయబాబా?" అని సుచరిత యడిగెను "కాదు తెల్లగా లావుగా నున్నాఁడు!" అని సేవకుఁడు చెప్పెను. సుచరిత యదరిపడి "మేడమీఁదికిఁ దీసికొని రమ్ము!" అని చెప్పెను అప్పుడు సుచరిత తాను గట్టుకొన్నచీర యెట్లున్నదో యింతవఱకును భావింపలేదు. అందులోఁ జూచుకొనఁగా నది యేమియు బాగుగ లేనట్లగపడియెను. కాని యప్పుడు మా

ర్చుకొనుటకు వకాశము లేదు! ఆమెయప్పుడు కంపితకరములతోఁ దనచీరముడుతలను, శీర్ణకుంతలములను నెట్లో సవరించుకొనుచు స్పందితహృదయముతో గదిలోపలఁ బ్రవేశించెను. తనవ్రాఁతబల్లపై గోరా యుపన్యాససంపుటములు పడియున్న సంగతి యామె మఱచిపోయెను. సరిగా గోరా వచ్చియాబల్లయెదుట నున్నకుర్చీమీఁద నే కూర్చుండి యుండెను. ఆపుస్తకములు సిగ్గు లేకుండ గోరాకన్నులయెదుటనే పడియుండెను. వానిని మూసియుంచుటకుఁ గాని తీసివైచుటకుఁగాని యెట్టియవకాశమును లేక పోయెను.

అప్పుడు సుచరిత "మాదొడ్డమ్మ మిమ్ములను జూడవలయునని చాలదినములనుండి. కుతూహలపడుచున్నది. ఆమెతోఁ జెప్పివచ్చెదను" అని సుచరిత గోరా గదిలోఁ బ్రవేశించినతోడనే వెడలిపోయెను. ఒంటిగా గోరాతో మాటాడఁగలధైర్యమామెకు లేక యుండెను—కొలఁదిసేపటిలోనే సుచరితాహారిమోహినులచటికి వచ్చిరి. గోరామతము విశ్వాసము, నిష్ఠ మొదలగువానింగూర్చి హరిమోహిని వినయునివలన విని యుండెను. తఱచుగా నప్పుడప్పుడు సుచరిత గోరాయుపన్యాసముల నామెకుఁ జదివి వినిపించుట కూడ నుండెను. ఆమె కందలివిషయము లన్నియును దెలియకపోయినను, నాచదువామెనిద్రాకర్షణమునకే యనుకూలముగా నుండినను, దానివలన నామె గోరా శాస్త్రాచారపక్షమునందుండి యీకాలపుదురాచారులతోఁ బోరాడుచుండె ననుసంగతిని మాత్రము తెలిసికొనియుండెను. అధునికాంగ్లభాషాభిజ్ఞులపక్షమున నింతకంటె నాశ్చర్యమును, నింతకంటె గణనీయమునగు విషయ మింకేమున్నది! బ్రాహ్మసమాజమధ్యమున మొట్టమొదట వినయునిం గాంచినప్పుడుకూడ నామె కానందముగా నుండెను. కాని క్రమముగా నభ్యాసవశమున నిప్పు డామె కాభావముపోయి వినయుని యనాచారములే యామెకుఁ గానవచ్చుచుండెను. మొట్టమొదట విశ్వాసము గల్గుటచేతనే యిప్పు డామెధిక్కారము లాతనియెడల వర్ధిల్లిపోవుచుండెను. ఆకారణమును బట్టియే యిప్పు డామె గోరాను జూచుటకుఁ గోరికపడుచుండెను.

గోరాను జూచినంతనే హరిమోహిని యాశ్చర్యపడిపోయెను. బ్రాహ్మణుఁడనిన నీతఁడే. ప్రజ్వలితహోమానలమువలె, సాక్షాత్కరించిన శుభ్రాంగుఁడగుమహాదేవునివలె నున్నాఁడు. అతనియందు భక్తికలుగుటచే నామె యాతనిప్రణామమును గ్రహింపఁజాలకపోయెను. అప్పుడు హరిమోహిని "బాబూ! నేను నీసంగతి చాల తఱచు వినియుంటిని. నీవును గౌరాంగుఁడవే! ఆగౌరాంగుఁడవే నీవు! నేనిదివఱ కొకభక్తునివలన—

"గౌరమోహనునితనువున మలయజ

గంధముఁ బూసినవా రెవరో

శారదరాకాచంద్రునిచలువకుఁ
జందన మేపాటి దని తలంపక"

అనుపాటను వినియుంటిని. ఇప్పుడు ప్రత్యక్షముగఁ జూచితిని! నిన్నాదొర యేగుండెతోఁ జైలునకుఁ బంపఁగలిగె నని నేను భావించుచున్నాను!" అనియెను.

గోరా—(నవ్వుచు) మీకు కలెక్టరుపని లభించినచో నప్పుడు చెఱసాల లన్నియును గబ్బిలములకు, నెలుకలకుమాత్రమే నివాసము లగుననుకొనియెదను.

హరి—కాదు బాబూ! ఈప్రపంచమున దొంగలకును హంతకులకు నభావ మున్నదా? నీవటువంటివాఁడవు కావే! నీమొగము చూచినమాత్రముననే నీవు దేవదూతవని తెలిసిపోవునే! చెఱసాల యున్నదని యిందఱను ద్రోసివైచుటయేనా? అయ్యో! యెంతయపచారము!

గోరా—మానవుని మొగము చూచినచో నీశ్వరాకారము కన్నులఁ బడునను భయముచేతనే దొరగారు కేవలము శిక్షాస్మృతిసంపుటమువంకనే కన్నుంచి పని చేసుకొనుచుందురు. అట్లు కాకున్నచో మానవుని గొరడాలతోఁ గొట్టించి, జైలునకుఁ ద్రోయించి, ప్రవాసమునకుఁ బంపించి, యురితీయించినందుల కాతనికన్నులకు నిద్ర పట్టునా? అతని నాలుక కన్నము రుచించునా?

హరి—నాకుఁ దెలిసియున్నప్పుడెల్ల రాధారాణిచే నీయుపన్యాసములను జదివించి వినుచుందును. ముఖస్థముగా నెప్పుడు నీవలన మంచిసంగతులను వినఁగలుగుదునో యని యిన్నాళ్ళకుఁ నాశతో నున్నాను. బాబూ! నేను మూర్ఖురాల నగు నాఁడుదానను! మఱియును దుఃఖాత్మురాలను! సమస్తవిషయములను గ్రహించుట గాని, మనసునఁ బట్టించుకొనుట గాని నాచేతఁగాదు! కాని నీవలన నించుక జ్ఞానము సంపాదింపఁగలుగుదునని నాసంపూర్ణవిశ్వాసమై యున్నది.

గోరా వినయముతో నేమియును బదులు చెప్పక యూరకుండెను. హరిమోహిని మరల "బాబూ! నీకించుక యాతిథ్య మీయదలంచితిని. చాలనాళ్ళనుండి నీవంటిబ్రాహ్మణకుమారులు లభించుటలేదు. ఇప్పుడు నీవు నాయింటఁ గలకొలంది భుజింపుము. తరువాత నొకప్పుడు నిన్ను విందునకుఁ బిలిచెదను." అని యామె భోజనము నేర్పాటుచేయుటకు వెడలుటయు నొంటిగ నున్నసుచరితహృదయ మొకవిధముగానగుచుండెను. అప్పుడు గోరా చటాలున "వినయుఁడిప్పుడిక్కడకువచ్చెనా." అని యడిగెను.

సుచ—వచ్చెను!

గోరా—ఈనడుమ నేను వినయునింజూచుట లేదు! కాని యాతఁ డిటకేల వచ్చెనో నెఱుంగుదును!

అని గోరా యించుక సేపు ఆగెను. సుచరిత మౌనముతో నుండెను. అప్పుడు మరల గోరా "మీరు వినయునకు బ్రాహ్మవివాహము చేయుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఇది మంచిపనియేనా ?" అనియెను. ఈయెత్తిపొడుపువలన సుచరిత మనసునందుగల లజ్జాసంకోచసంబంధమగుమాంద్య మొక్కసారిగా దూరమైపోయెను. ఆమె గోరా మొగమువంకఁ గన్నెత్తి చూచి "బ్రాహ్మవివాహము మంచిది కాదని నేను చెప్పుదునని యే మీరూహించుచున్నారా?" అనియెను.

గోరా—నీయభిప్రాయముకొఱకు నే నింతమాత్రమును వేచియుండుట లేదని నిశ్చయముగా నెఱుంగుము! సాధారణసామాజికులకంటె నీయందు విశేష మున్నదనియే నేను భావించుచున్నాను. ఏదోయొకవిధముగాఁ దమసమాజసంఖ్యను వృద్ధిఁ జేసికొనుట మతప్రచారకులపని యైయున్నది. నీవట్టిదానవు కావని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. నీవు స్వయముగా నీ యుచితమగు మతమును గ్రహింపవలయుననియే నా కోరిక! ఇతరుల మాటలవలనఁ బొరపాటుపడి నీవు నిన్ను లోకువ చేసికొనవలదు. నీవేదియో యొక మతమునకుఁ జేరిన వ్యక్తిమాత్రమే కాదనుసంగతి నీవు నీమనోమధ్యమునుండియే స్పష్టముగా గ్రహింపవలయును!

సుచరిత తనమనశ్శక్తినంతను స్థిరపఱచుకొని హెచ్చరికతో దృఢముగఁ గూర్చుండి "మీరుకూడ నేసమాజమునకును జేరినవారు కారా?" అని ప్రశ్నించెను.

గోరా—కాను. నేను హిందువును! హిందూత్వమెట్టిసమాజమును కాదు. అది యొకజాతి. ఆజాతి యెంతగొప్పదియో, దానికి జాతిత్వమెట్లు కలిగినదో, దానిపుట్టెప్పటనో యేసంజ్ఞచేతను నిరూపించి చెప్పఁజాలము! తరంగములు సముద్రములు కానట్లు సమాజములు హిందూమతము కానేరవు.

సుచ—సమాజమే కాని హిందువులకు మరల సమాజములతోఁ బోరాటమేల?

గోరా—మానవుఁడు తనకు బాధకలుగుచుండఁగా ప్రతీకారము చేయఁబూనుటెందులకా? అతనికి ప్రాణమున్నది కావున! బాధలన్నిటిని సహించి యూరకుండుటకాతఁడు ఱాతిబొమ్మ కాఁడుకదా!

సుచ—మాకు ధర్మముగాఁ దోఁచుచున్నవిషయము హిందువులకు బాధాకరముగఁ దోఁచుచున్నచో నప్పుడు మేమేమి చేయవలయునని మీయుద్దేశము?

గోరా—మీకుఁ గర్తవ్యమని తోఁచినది హిందూజాతి యనునొకవిశ్వశక్తికి వేదనాకరముగ నున్నప్పుడు మీలో నేదో పొరపాటుకలిగెనదియో, సకలవిషయములను సకలవిధముల నాలోచించుశక్తి శూన్యమైపోయెనదియో మీరు బాగుగ నాలోచించుకొని నిశ్చయించుకొనవలయును. సమాజమువారు చేసినసంస్కారములన్నీ కేవ

లము నభ్యాసము చేయుచు నవివేకముచే నవియె సత్యము లని చెప్పుచు నింతటిమహో త్పాతమును గల్పింపఁ బ్రయత్నించుట యుచితము కాదు. ఒకయెుంక యొక యోషను గోరికి దోలుచున్నప్పు డది తనకనుకూలమగుసంకల్పము ననుసరించియే పనిచేయును. అంతటి గొప్ప యాశ్రయమునకు రంధ్రము కల్పించుట దాని కనుకూలముగనే తోఁచి నను దానిమూలమున నెందఱి కెంతకష్టము కలుగునో నీకు బోధపడుటలేదా ? నేను కేవలమును నాసమాజమునుమాత్రమే చూచుకొనుచున్నానా ? సమస్తజనులనుగూర్చి యు నాలోచించుచున్నానా ?'' అని నీలో నీవే భావించుకొనవలయును ! సమస్త మానవు లనిన నేమో నీకు బోధపడినదా ? వారు వివిధప్రకృతులను వివిధప్రవృత్తు లను, వివిధప్రయోజనములను గలిగియుందురు ! వారి కొక్కటేమార్గము కాదు. ఒక్క చోటనే యునికి కాదు. కొందరియెదుటఁ గొండలు! కొందఱియెదుట సముద్రములు! కొందఱియెదుట సమప్రదేశములు మఱియు నందెవ్వరును గూర్చుండువారు కారు! అందఱును జరించువారే. నీవు కేవలమును నీసమాజశాసనము నందఱియెడలను విని యోగింపఁదలఁచెదవా ? మానవులయం దెట్టి వైచిత్ర్యమును లేదనియు, వారు కేవల మును బ్రహ్మసమాజపుస్తకమున నామలేఖనము చేయుటకే ప్రపంచమున జన్మించి యుండి రనియు స్థూలదృష్టిచేత నే నిశ్చయింపఁ దలఁచెదవా ? దస్యుజాతి యంత యును భూమియందలి సమస్తజాతులను జయించి తనయేకచ్ఛత్రాధిపత్యమును స్థాపిం చుటయే లోకకళ్యాణ మని భావించినచో, మన బలగౌరవములఁ బాటింపని పరజా తులయున్నతియే విశ్వహితంబునకుఁ గేవల మమూల్యవిధాన మని లోకమున దాసత్వ మును వర్ధిల్లఁజేయువారికిని మీకును భేద మెక్కడ నున్నది ?

సుచరిత యించుకసేపు యుక్తుల నన్నిటిని మఱచిపోయెను. గోరావజ్రగంభీర కంఠస్వర మద్భుతప్రాబల్యముచే నామె సమస్తాంతఃకరణములను నాందోళితములు గఁ జేసివైచెను. గోరా యేవిషయమునుగూర్చి మాటాడుచుండెనో యామెకు బోధ పడుటలేదు. గోరా మాటాడుచుండెననిమాత్రమే కేవలము నామెకుఁ దెలిసియుండెను.

గోరా — ఈభారతవర్షమునందలి త్రింశత్కోటిప్రజలను మీసమాజమే సృ ష్టించియుండలేదుగదా? అట్టిచో నేమార్గము వీరి కుపయుక్తమో యేయాచారవిశ్వా సము లీయందఱకును నాహారబలంబులఁ బ్రసాదించునో యట్టినియమములను విధించు భారము బలవంతముగఁ దనపైఁ బెట్టుకొని యీసమస్తభారతవర్షము నొక్కసారిగా నొక్కలాగున నొక్కతరగతికిఁ దేవలయు నని మీసమాజము తలంచుటకుఁ గారణ మేమి ? ఈయసాధ్యకార్యము సాధింపఁబడకుండకున్నకొలఁదిని మీకుఁ దేశముపైఁ గ్రోధము కలుగుచున్నది — అగౌరవము కలుగుచున్నకొలఁదిని హితము చెప్పెడివారి యెడల మీ కసహిష్ణుతయు భేదభావమునుఁ గలుగుచున్నది! మఱియు నేయాళ్వరుఁ

డు మానవులను వివిధప్రకృతులతో సృజించి యట్లే పాలించుచుండునో యట్టిపరమేశ్వరుని మేము పూజింతు మని మీరు చెప్పుచుందురు. అది సత్యమే యయినచో మీరాయీశ్వరుని విధానమును స్పష్టముగా నేల గ్రహించుటలేదు ? మీబుద్ధిశక్తి యందలి గర్వముచేతను, మీసమాజమునందలి యహంభావముచేతను మీ రాతనియుద్దేశము నంగీకరించుట లేదా యేమి ?

సుచరిత యేమియును బదులు చెప్పుటకుఁ బ్రయత్నింపక యూరక తనమాటలు వినుచుండుటం గాంచి గోరాకు దయకలిగెను. అతఁ డించుక యాఁగి మెల్లగా "నామాటలు నీకుఁ గఠోరములుగా నుండవచ్చును. కాని నేను ప్రతిపక్షి ననిమాత్రము నీమనసులో నెట్టివైరమును బెట్టుకొనకుండుము. నేను నిన్నట్లు భావించియున్నచో నీతో నొక్కమాటయైన నాడియుండను. నీహృదయమునం గలస్వాభావికౌదార్యశక్తి సమాజమర్యాదనం జిక్కి సంకుచితమైపోయినందులకు నాకుఁ గష్టముగా నున్నది." అనియెను. అప్పు డామె "వలదు! వలదు! నన్ను గూర్చి మీ రెంతమాత్రము నాలోచింప వలదు. మీరు చెప్పుచుండుఁడు! నేను బోధపఱచుకొనుటకుఁ బ్రయత్నించెదను.!" అనియెను.

గోరా — నే నింక జెప్పవలసిన దేదియును లేదు. నీవుప్రేమించుచున్న యీనీభారతవర్షమును నీసహజహృదయమునుండియే సహజజ్ఞానమునుండియే చూచుచుండుము! బ్రాహ్మసామాజికులు కొరినుద్దేశముతో నీవు భారతీయులను జూచినచో నవ్వారు నీదృష్టియందు వికారివలెనుండి రసాకారమునుఁ బూర్ణమైయుండరు. అందువలనఁ గేవలము నీకు వారిలోపమే యగపడుచుండును; ఏవిధముగఁ జూచిన వారిసంపూర్ణత్వము బోధపడునో యావిధముగఁ జూచినట్లు కానుండఁబోవును. వివిధభావములును, వివిధవ్యాపారములును, వివిధవిశ్వాసములును, వివిధసంస్కారములును గలవీరినందఱనుఁ బరమేశ్వరుఁడు మానవులుగనే సృజించెను. బాహ్యభేదము లెన్నియున్నను నందఱియందు నొక్కమానవత్వమే యున్నది. మనభారతవర్షమునందును, మనయందునుఁ గూడ నిమిడియున్న యొకవస్తువే వారియందును నిమిడియున్నది. వారివంక సత్యదృష్టినిఁ బరగించినచో నదివారితుచ్ఛత్వము, నసంపూర్ణత్వమునను బహిరావరణములను ఛేదించుకొని పోయి వారియందలి పరమాశ్చర్యకరమగు నొకమహత్తత్త్వమును గోచరింపఁజేయును. చిరకాలమునుండి సాధింపఁబడుచున్న సమస్తసాధనములును బ్రచ్ఛన్నముగా వారిలో నగపడును; చిరకాలమునాటిహోమానలము భస్మమధ్యమునందుండి యింకను జ్వలించుచు ఋషిప్రాంబులకు దేశకాలముల నతిక్రమించి భూగర్భమునం దింకను దన తీవ్రాగ్నిజ్వాలలనుఁ బ్రసరింపఁజేయుచున్నదనియే స్పష్టముగా బోధపడును! ఈ భారతవర్షమునందు మానవుడు చిరకాలమునుండి కాంక్షించుచున్న సద్బోధనములును,

సత్కార్యములును, సమస్తమునుగూడ మిథ్యలేయని సంశయించుట సత్యము నగౌరవించుటయే యగుచున్నది. అదియే నాస్తికత్వము !

ఇంతవఱకును దల వంచుకొనియున్న సుచరిత యప్పు డించుక మొగమెత్తి "అట్లయినచో మీరు నన్నిప్పు డేమిచేయుమని చెప్పెదరు ?" అనియెను.

గోరా—నేను చెప్పవలసినదేమియునులేదు. హిందూమతము తల్లివలె నానా భావములును నానామతములును గలమానవుల నందఱను దనయొడిని జేర్చుకొనుటకుం బ్రయత్నించుచున్నది. అదియే జగత్తునందలిమానవు లంతటియందును మానవత్వ మంగీకరించుచున్నది; అంతేకాని వారిని ప్రత్యేక సామాజికులుగాం జూచుటలేదు. అది జ్ఞానిని, మూఢునింగూడ మన్నించుచున్నది. అది యొకరకమగు జ్ఞానమును మాత్రమే గౌరవించుటలేదు; జ్ఞానసంబంధము లగుసమస్తవికాసములనుగూడ నంగీకరించుచున్నది. క్రిష్టియనులు భిన్నభావము నంగీకరింపరు. ఒకవంక క్రిష్టియనుమతమును, మఱియొక వంక ననంతవినాశమునుండె ననియు, నీరెంటికినినడుమ మఱి యెట్టిభిన్నత్వమును లేదనియు వారు చెప్పుచుందురు. మనము వారియొద్దం జదివినవారము కావుననే హిందూమతమునందలి భిన్నత్వముంగూర్చి సిగ్గుపడుచుందుము! హిందూమత మాభిన్నత్వము నుండియే యేకత్వము జూపుటకుం బ్రయత్నించుచున్నదని మనము తెలిసికొనంజాలకున్నాము! ఈక్రైస్తవాభ్యాసమునుండి మనహృదయము సంపూర్ణముగ విముక్తి నందకున్నచో మనహిందూమతమునందలి సత్యమును గ్రహించుగౌరవమునకు మన మధికారులము కాంజాలము!

సుచరిత యప్పుడు గోరామాటలను కేవలము వినుటయే కాదు; ఆమాటలరూపమును ప్రత్యక్షముగం గాంచుచున్నట్లుండెను. గోరాకన్నులలోని దూరదర్శనవ్యాప్తమగు నొకధ్యానదృష్టి యాతనివాక్యములతో నైక్యమై యున్నట్లు సుచరితకు గోచరించుచుండెను. అప్పు డామె సిగ్గు విడచి, తన్నుందానే మఱచి భావోత్సాహప్రదీప్తమగు గోరామొగమువంకం దదేకదృష్టిం గాంచుచుండెను. ప్రపంచమునందలి మహ సంకల్పములను [illegible] గలమునకే సత్యములుగాం జేయంజాలు దివ్యశక్తి గోరామొగమునం దామె కిప్పుడు కనంబడుచుండెను. ఆమె [illegible] సులభముగ [illegible] యొద్ద ననేక తత్త్వాలోచనములను [illegible] యుండెను. కాని యది తర్కమునందలి [illegible]; ఇది కేవలము గోరా స్వరూపము [illegible] సుచరిత యప్పుడు ప్రత్యక్ష[illegible]ం బరికించుచున్నట్లుండెను. వాక్యములు ప్రబలమందిరస్వరములతో నానావర్ణములం దాకి పవిత్రగానమును స్పందితముగం జేసి వైచుచుండెను. వానితోంగూడం దీప్తిప్రద్యన్మౌక్తిక లామెరకనాళములనునిమిషమును నృత్యము చేయుచుండెను.

గోరామతముతోఁ దనమత మెచ్చట నెంతవఱ కైక్యమయ్యెనో, యెంతవఱకుఁ గాలేదో స్పష్టముగా నాలోచించి చూచుకొనుశక్తి యామెకు లేకుండఁ బోయెను.

ఇంతలో సతీశుఁడచ్చటికి వచ్చి గోరా యునికి నాతనికి భయముకావున నించుక దూరవర్తియై సోదరిపార్శ్వమున నిలిచి మెల్లమెల్లగా "పానూబాబు వచ్చినాఁడు!" అనిచెప్పెను. సుచరిత యదరిపడియెను. ఆకస్మికముగ నామె కాఘాత మైనట్లయ్యెను. ఆమె యిప్పు డెట్లయినఁ బానూబాబుబారినుండి తప్పించుకొనవలసినయవస్థలో నుండెను. సతీశుని మెల్లనిమాట గోరాకు వినఁబడి యుండదని తలంచి యామె చటాలున లేచి త్వరముతో మేడనుండి క్రిందికి దిగి పానూబాబు చెంతకుఁ బోయి "క్షమింపుఁడు! నాకిప్పుడు మీతో మాటాడుటకు నవకాశము లేదు!" అనియెను. కారణమేమని హారానుఁడు ప్రశ్నించెను. సుచరిత యామాటకు బదులు చెప్పక "నేను రేపు ప్రాతఃకాలముననే తండ్రిగారియింటికి వచ్చెదను. అచ్చట మీరు నన్నుఁ జూడవచ్చును!" అనియెను.

హారా—ఇప్పుడు నీయింటి కెవ్వరైన నున్నారా యేమి?

సుచరిత యామాటకును బదులుచెప్పక "నాకిప్పుడు తీరికలేదు. దయయుంచి నన్ను క్షమింపవలయును!" అనియెను.

హారా—నాకు వీధిలో నుండఁగనే గోరాబాబుకంఠస్వరము వినవచ్చినది. అతఁ డిచ్చట నున్నాఁడా?

సుచరిత యీప్రశ్నను దప్పించుకొనఁజాలక మొగమెఱ్ఱఁజేసికొని "ఔను! వచ్చియున్నాఁడు." అనియెను.

హారా—మంచిది. నాకాతనితోఁగూడ మాటాడఁగలసినదని యున్నది. నీకేదియైనఁ బని యున్నచో నది ముగియువఱకు నేనాతనితో మాటాడుచుండెదను

అని చెప్పి యామెసమ్మతిని నిరీక్షింపకుండఁగనే మేడమెట్లు నెక్కఁదొడంగెను. తనవెంట నున్నహారానునివంకఁ జూడకుండఁగనే సుచరిత గదిలోనికిఁ బోయి గోరా నుద్దేశించి "దొడ్డమ్మ మీకొఱకు వంటచేయుటకై పోయినది. ఆమె యేమి చేయుచున్నదో యొకసారి చూచివచ్చెదను" అని చెప్పి చటాలున వెడలిపోయెను. హారానుఁడు గంభీరముగ నొకకుర్చీపైఁ దానే యధికారము వహించి కూర్చుండి "గోరాబాబూ! మీరు కొంచెము చిక్కినట్లగపడుచున్నారు!" అనియెను.

గోరా—చిత్తము! చిక్కుటకే కొన్నాళ్లనుండి చికిత్స జరగుచున్నది.

హారానుఁడు కంఠస్వరమును మృదులముఁజేసి "అట్లయినచో మీరు చాలఁ గష్టపడుచున్నా రనుకొనియెదను!" అనియెను.

గోరా—లేదు. అది నా కనుకొన్నంతకష్టముగా లేదు.

హారా—వినయబాబువిషయమున మీతో గొంత యాలోచింపవలసి యున్నది! రేపాదివారమున నాతఁడు మాసమాజమునఁ జేరుటకుఁ బ్రయత్నించుచున్నట్లు మీరు వినియే యుందురు.

గోరా—లేదు నేను వినలేదు.

హారా—మీ కది సమ్మతమేనా ?

గోరా—వినయుఁడు నాసమ్మతిని వాంఛించుట లేదు.

హారా—అతఁడు సత్యవిశ్వాసముతోనే యిట్లు చేయుట కంగీకరించి యుండెననియేనా మీయుద్దేశము ?

గోరా—అతఁడు దీక్ష గైకొనుటకు సిద్ధపడినప్పు డిప్పటిమీప్రశ్న కేవలము ననావశ్యకము !

హారా—సంకల్పము తీవ్రమైనప్పుడు మనకు విశ్వాస మున్నదో, లేదో యాలోచించుకొనుటకైన కవకాశ ముండదు. మానవచరిత్రము మీకుఁ దెలియదా ?

గోరా—తెలియదు. నేను మానవచరిత్రముంగూర్చి వృథాలోచనము చేయువాఁడను గాను !

హారా—మతవిషయమునఁ గాని, సమాజవిషయమునఁ గాని మీతో నాకట్టి సంబంధమును లేకపోయినను నాకు మీయందు గౌరవ మున్నది. మీవిశ్వాసము సత్యమే కానిండు; మిథ్యయే కానిండు. కాని యెవ్వరు నెట్టిప్రలోభనములచేతను మిమ్ములను మీవిశ్వాసమునుండి కదల్పఁజాల రని నేను నిశ్చయముగ నెఱుఁగుదును— కాని—

గోరా—మీకు నాయం దెట్టిగౌరవము కలదో యట్టిమీయమూల్యగౌరవమును బోఁగొట్టుకొనుట వినయున కొక గొప్పనష్టమే ! ఈప్రపంచమున మంచివస్తువులును, చెడ్డవస్తువులును గూడ నవశ్యముగా నుండును. మీరు వానికి మీగౌరవాగౌరవములను బట్టి మూల్యములను నిరూపింపవచ్చు. కాని లోకులందఱును మీనిర్ణయమునే గ్రహింపవలయు ననిమాత్రముఁ జెప్పవలదు !

హారా—మంచిది. ఇప్పు డామాట కేమి! కాని మీ కొక్కసంగతి యడుగుచున్నాను. పరేశునికుటుంబముతో వివాహసంబంధముం గావించుకొనఁదలఁచుచున్న వినయుని మీరు నిషేధింపలేదా ?

గోరా—హారానబాబూ ! వినయునిసంబంధము లనునీసమస్తవిషయములను నేను మీతో నాలోచింతు ననుకొంటిరా? అతఁడు నామిత్రుఁడుగాని మీమిత్రుఁడు కాఁడుగదా! నిరంతరమును మానవచరిత్రముంగూర్చియే యోచించుచుండు మీ కింత మాత్రము బోధపడలేదా ?

హారా — ఈవ్యాపారముతో మా సమాజమునకు సంబంధమున్నది. కావున నేనీ మాట చెప్పితిని. లేకున్నచో—

గోరా — కాని బ్రహ్మసమాజముతో నెట్టిసంబంధమును లేని నాచెంత మీ యీయనస్తాపము కేవలము నిరర్థకము కాదా ?

ఇంతలో సుచరిత వచ్చుటయు హారానుఁ డామెఁ గాంచి "నీతో నొకముఖ్య విషయమునుగూర్చి మాటాడవలసి యున్నది!" అనియెను. అతఁ డట్లనుట కెట్టియావశ్యకమును లేదు. తనకును సుచరితకును విశేషసంబంధ మున్నట్లు గోరాయెదుటఁ బ్రదర్శించుటకే హారానుఁ డట్లు చెప్పెను. సుచరిత దాని కెట్టిప్రత్యుత్తరము నీయలేదు. గోరాయును దనకుర్చీపై సుస్థిరముగఁ గూర్చుండెను; హారానుని రహస్యసంభాషణమునకవకాశముగ లేచిపోవులక్షణమును బ్రకటింపలేదు. అప్పుడు హారానుఁడు "సుచరితా! నీతో నొక్కమాట యున్నది. అగదిలోనికి వచ్చెదవా ?" అనియెను. సుచరిత యామాటకు బదులుచెప్పక గోరావంకఁ జూచి "మీయమ్మగారు క్షేమముగా నున్నారా?" అనియెను.

గోరా — అమ్మగా రనారోగ్యముగ నుండుట నేనెన్నఁడును జూడలేదు!

సుచ — ఆరోగ్యమును నిల్పుకొనుశక్తి యామెకడ నెంతసహజముగ నున్నదో నేనెఱుంగుదును!

అని చెప్పి గోరా జైలునం దున్నసమయమునఁ దానామె కోసనాగి చూచిన సంగతి నాతనికి స్మృతికిఁ దెచ్చెను. ఆసమయమున హారానుఁడు బల్లపై నున్నపుస్తకమును దీసి యందలిముఖపత్రికనుఁ గవిచ్చేసి చదివి పత్రములను తిరుగవైచి యందందుఁ జదువుచుండెను. సుచరిత మొగము వెల్లనైపోయెను. ఆ గ్రంథ మేమో తెలిసినవాఁడు కావున గోరా తనమనసులో నెంచుక నవ్వుకొనియెను. అప్పుడు హారానుఁడు "గౌర మోహనబాబూ! మీగ్రంథమును మీచిన్నతనమునందు వ్రాసితిరి కాఁబోలు నేమి?" అనియెను. గోరా నవ్వుచు "నాచిన్నతన మిప్పటికి గూడ నున్నది! కొందఱిచిన్నతనము కొలఁదికాలములోనే వదలిపోవును. కొందఱికిఁ జాలకాలమునకును స్థిరముగా నుండును!" అనియెను.

అప్పుడు సుచరిత లేచి "ఈపాటికి వంట యగును. మీ రాలోపలికిఁ బోండు! దొడ్డమ్మ హానూబాబున కగపడదు! ఆమె మీకొఱకు వేచియుండును!" అనియెను. హారానునకు మనఃకష్టము కలిగించుటకే యామె యట్లు చెప్పెను. గోరా లేచెను. పరాభవమున నెఱ్ఱనైపోయి హానూబాబు చప్పున "అట్లయినచో నేనింకను సేపు నిరీక్షించియుండెదను" అనియెను.

సుచ — ఊరక యేల కూర్చుండెదరు ? వేళమించిపోయినది కాదా ?

కాని హారానుఁడు లేవలేదు. సుచరితా గౌరమోహనులు వెడలిపోయిరి—ఆ యింటఁ గోరాను జూచి యాతనియెడల సుచరితప్రవర్తనముఁ జూచి హారానునిహృదయము శత్రుధారణముం గావించి నిలిచెను. "సుచరిత బ్రహ్మసమాజమునుండి యెట్లో విడిపడి పోవలసినదే నా? ఆమెను రక్షించువా రెవ్వరును లేరా! ఎట్లయినను దీనికిఁ బ్రతీకారము చేసితీరవలయును!" అని భావించి హారానుఁడొక కాగితమును దీసికొని సుచరితకుఁ లేఖవ్రాయుటకుఁ గూర్చుండెను. ఆతనికిఁ గొన్ని స్థిరవిశ్వాసము లున్నవి. సత్యము నవలంబించు తానితరుల నాజ్ఞాపించుటకుఁ దనతీవ్రవచనముల నిష్ఫలము లగుట లేదనునదియు మాతని విశ్వాసములలో నొకటి! కేవలము వాక్యమే యేకమాత్రవస్తువు కాదనియు, మానవహృదయ మను నొక పదార్థ మున్నదనియు నాతని కాలోచనయే లేదు!

భోజనానంతరమున హరిమోహినితోఁ జాలసేపు మాటాడి గోరా తనకఱ్ఱను దీసికొనుటకై సుచరితగదిలోనికి వచ్చెను. అప్పటికి సాయంకాలమయ్యెను. సుచరితబల్లపై దీపము వెలుగుచుండెను. హారానుఁడు వెడలిపోయెను. ఆబల్లపై సుచరితనామముతో నొకచీటి పడి యుండెను. అది గోరాకన్నులఁ బడియెను. ఆలేఖం జూచినంతనే యాతని హృదయమునకుఁ గష్టమయ్యెను. అది హారానుఁడు వ్రాసె ననుటకు గోరా కెట్టిసంశయమును గలుగలేదు. సుచరితయెడల నాతనికిఁ గలవిశేషాధికారమును గోరా యెఱుంగును. కాని యాయధికారమునకు వ్యత్యయము కలిగినసంగతిమాత్ర మాతనికిఁ దెలియదు. నేఁడు సతీశుఁడు వచ్చి హారానునిరాక రహస్యముగఁ దెల్పుటయు, సుచరిత యదరిపడి చటాలున వెడలిపోయి వెంటనే యాతని దీసికొనివచ్చుటయు గోరాహృదయమున విపస్వరముతో మ్రోగుచుండెను. తరువాత హారాను నొంటిగ విడిచి సుచరిత కావించిన వ్యాపారమంతయు వ్యతిరేకముగనే యుండెను! కాని దృఢతర మగు నాత్మీయత గలచోటఁ జనవుచే నిట్టిపనులు జరుగుచుండు నని గోరా స్థిరపఱచుకొనియెను. ఇప్పుడు గోరా యాచీటిం గాంచి యావంతు డైపోయెను. ఉత్తర మొకగొప్పరహస్యమయపదార్థము. పైకి పేరుమాత్రము చూపించి సమస్తమును లోపల దాఁచుకొనుటచేతనే యది మానవు నత్యంతముగ పీడించుచుండును! అప్పుడు గోరా సుచరితమొగముం దిలకించి "నేను రేపు వచ్చెదను!" అనియెను.

సుచరిత యవనతనయనములతో "మంచిది!" అనియెను. గోరా పోవుట కుద్యుక్తుఁడై యించుక యాఁగి "భారతవర్ష సౌరమండల మధ్యమునందే నీస్థానము—నా దేశమునరాల వగు నీవు నాదానవు—ఎట్టిధూమకేతు వైనను నిన్నుఁ దనపుచ్ఛముతో శూన్యపర్యమున కెంతమాత్రమును ద్రోసివైవఁజాలదు. నీ యుచిత మగుస్థానమున నిన్ను నేను సుస్థిరముగఁ బ్రతిష్ఠించువఱకును విడువను. ఆస్థానమున నీవు నీసత్య

ధర్మములను బరిత్యజింపవలసియుండు నని నీవారు బోధింతురు! నీసత్యమును, నీధర్మమును కేవలము నీయుద్దేశముమీఁదఁగాని నీవంటి నలుగురైదుగురి యుద్దేశములమీఁదఁగాని నిలిచియుండలేదు. అది యీప్రపంచమునం దంతటను గలయసంఖ్యాము లగుజీవసూత్రములతోఁ జిక్కుకొని యున్నది. నీవెంత ప్రయత్నించినను దాని నామహాభవమునుండి వెల్లగించి నీకుండీలోఁ బాతుకొనఁజాలవు— దానిని సముజ్జ్వలముగను సజీవముగను జేయఁదలఁచినచో— దానిసర్వాంగసౌందర్యమును సార్థకముగఁ జేయఁదలఁచినచో నీజీవితమునకు బహుపురాతనకాలమునందలి మానవసమాజహృదయమధ్యమున నీకు నిర్దిష్టమై యున్నస్థానమున నీవు స్థిరముగా నిలువఁబడవలయును. వారికిని నాకును నెట్టిసంబంధమును లేదని నీవెంతమాత్రమును జెప్పఁగూడదు! అట్లు భావించినచో నీసత్యమును, ధర్మమును శక్తియుఁగూడ నొక్కసారిగా మ్లానములై ఛాయామాత్రములై పోవును. పరమేశ్వరుఁడు నిలిపినస్థానమునుండి నీమతము నిన్నుఁ దొలగించినచో నట్టి నీమతమునకు విజయము కలుగదని నీవు నిశ్చయముగా దెలిసికొనుము! నేను రేపురచ్చెదను." అని చెప్పి యాతఁడు వెడలిపోయెను. ఆగృహాభ్యంతర మంతయుఁ జాలసేపటి వఱకును గంపించిపోవుచుండెను. సుచరిత చిత్రప్రతిమవలె నిస్తబ్ధయై కూర్చుండెను.

౫౬

వినయుఁ డానందమయిం గాంచి "అమ్మా! నేనెప్పుడు దేవతామూర్తికి వందనము చేసినను నామనసులో నేమో సిగ్గుగనే యుండెను. ఆసంశయమును మనసునందే యుంచుకొని విగ్రహారాధనమును గూర్చి యనేక ప్రబంధములను వ్రాసియుంటిని కాని నేను నిజము చెప్పుచున్నాను. అట్లు ప్రణమిల్లుట నాకు మనసులో నించుకంతయు నంగీకారము లేదు." అని చెప్పెను.

ఆనం— నాయనా! నీహృదయము సామాన్యమైనదా? నీవు దేనిని గూడ స్థూలదృష్టితోఁ జూడవు. అన్నిటిని సూక్ష్మదృష్టితో భావింతువు. అందుచేతనే సామాన్యముగ నీకు విశ్వాసము గలుగదు!

విన— ఔను. నాకువిశ్వాసములేనివిషయమునుగూడ సూక్ష్మబుద్ధిబలము వలన సూక్ష్మయుక్తులవలనఁ బ్రమాణీకరింపఁగలను. అట్టిసమయములందు నే నితరులను, నన్నునుగూడ మఱపించుచుందును. నే నిప్పాళ్ళనుండియుఁ గావించుచున్న మతతర్కమంతయును మతపక్షమునుండి చేయుట లేదు. కేవలసమాజపక్షమునుండియే చేయుచున్నాను.

ఆనం— మతమునందు సత్యవిశ్వాసము లేనప్పుడిట్లే యగుచుండును! ఇట్టిస్థితిలో మతము కేవలమును గులగౌరవభాగ్యములవలెనే యహంకారమును బుట్టించు వస్తువై పోవును.

విన—ఔను. నేను మతసత్యమునుగూర్చి భావింపక నామత మనుకారణము చేతనే పోరాడుచున్నాను. అయినను నాతప్పు నాకుఁ దెలియుచుండుట లేదు. విశ్వాసము లేనిచోట భక్తియున్నట్లు నటించుటచే నన్నుఁ జూచి నేనే సంపూర్ణముగ సిగ్గుపడిపోవుచున్నాను.

అనం—అది యేమో నాకు బోధపడుట లేదు. మీ రీవిషయమున నిరతులకం టెనధికముగఁ దీవ్రభావముతోఁ బనిచేయుటచేతనే మీలో నేదియో యించుక లోపమున్నట్లు బోధ యగుచున్నది. భక్తిసహజమై యున్నచో నంతతొందర యక్కఱ లేదు.

విన—అందుచేతనే నిన్నడుగుచున్నాను. విశ్వాసములేనిదానియందు విశ్వాసమున్నట్లు నటించుట యధర్మముకాదా ?

అనం—బాబూ! ఇప్పుడిట్లు ప్రశ్నించుట కంతయావశ్యక మేమున్నది ?

విన—అమ్మా! నేను రేపు బ్రహ్మసమాజదీక్షఁ గైకొనుచున్నాను.

అనం—(విస్మయముతో) అదేమిమాట వినయా! అట్లు చేయుటకుఁ గారణ మేమి ?

విన—అమ్మా! కారణ మిప్పుడు చెప్పితిని గాదా ?

అనం—నీవిశ్వాసము నీలో నుంచుకొనియైనను నీవు మనసమాజమునం దుండఁ జాలవా ?

విన—ఉన్నచో మోసము చేసిన ట్లగును.

అనం—మోసము చేయకుండ నుండుటకు ధైర్యము లేదా ? సమాజమునఁ గష్టముండవచ్చును. నీవు దానిని సహింపజాలవా ?

విన—నేను హిందూసమాజవిధులను బాటింపఁజాలనిచో నప్పుడు—

అనం—ముప్పదికోట్లమంది ప్రజలకు సరిపడియున్న యీమతము నీ కేల సరిపడలేదు ?

విన—అమ్మా! నాసమాజమువారే నన్ను హైందవునిగా నంగీకరింపకున్నప్పుడు నేను బలవంతముగా హిందువు నని చెప్పుకొనవలసి వచ్చుచున్నది !

అనం—మనవారు నన్నుఁ గ్రైస్తవునిగాఁ బరిగణించుచున్నారు. శుభాశుకర్మములయందు నేను వారితోఁ గలసి భుజించుటలేదు ! అయినను వారు నన్నుఁ గ్రైస్తవి యనుచుండఁగా నొప్పుకొనవలసినయావశ్యకము నా కగపడలేదు. వారిమాటలనుబట్టి నాసత్య విశ్వాసమును విడుచుట నాకిష్టము లేదు.

వినయుఁడు దానికిఁ బ్రత్యుత్తరము చెప్పబోవుచుండగా నానందమయి వారించి "వినయా! నేను నీకు వావకునకు కాకే మీ ప్పుటలేదు. ఇవి వాదింపవలసిన

విషయము కాదు. నీవు నాయొద్ద నేమైనను దాఁపఁగలవా ? అవకాశముండగా నీవి ప్పుడెట్లో బలవంతముగ వాదించి నన్ను భ్రమింపఁజేయఁ జూచుచున్నావు! కాని యిట్టి గురుతరవ్యాపారమునం దట్లు చేయవచ్చునా" అనియెను వినయుఁడు తల వంచుకొని "కాని అమ్మా! నేను రేపు దీక్ష గైకొందు నని యుత్తరమును బంపివైచితిని!" అనియెను.

ఆనం—ఐన నేమి ? పరేశునితో సంతయును స్పష్టముగఁ దెల్పినచో నాతఁ డెంతమాత్రమును బలవంతము సేయఁడు.

విన—ఇం దాయన ప్రోత్సాహ మేమియును లేదు. ఈయనుష్ఠానమునం దాతఁ డెట్టి సంబంధమును గల్పించుకొనలేదు.

ఆనం—సరే! అట్లయినచో నిబ్బందియే లేదు.

విన—అమ్మా! అట్లు కాదు. ఒకసారి మాట స్థిరమైనతరువాత నిఁకఁ జరిగి పోఁగూడదు!

ఆనం—గోరతోఁ జెప్పితివా ?

విన—అతఁడు నాకగపడలేదు.

ఆనం—ఏమి ! ఇంటిలో లేఁడా ?

విన—లేఁడు. సుచరితయింటికిఁ బోయెనని తెలిసినది.

ఆనం—(విస్మయముతో) అతఁడు నిన్నఁగూడ నటకే పోయినాఁడు!

విన—నేఁడును బోయినాఁడు!

ఇంతలోఁ బ్రాంగణమునుండి పల్లకిబోయీలకేకలు వినవచ్చెను. ఆనందబంధువులగు స్త్రీ లెవ్వరో వచ్చుచుండిరని యెంచి వినయుఁడు వెలుపలకుఁ బోయెను. ఇంతలో లలిత వచ్చి యానందమయికి నమస్కరించెను! ఇప్పు డామె వచ్చునని యానందమయి యూహించియైనను లేదు. కావున విస్మితయై యామె వినయముఖముఁ జూచి వినయుని దీక్షంగూర్చి చిక్కులు కలిగెననియు నందుకొరకే యామె వచ్చియుండు ననియు గ్రహించెను. అప్పు డానందమయి సంభాషణమున కవకాశము కల్పించుటకై "అమ్మా నీవిప్పుడు వచ్చుట చాలసంతోషముగా నున్నది. ఇంతవఱకును వినయుఁ డిచ్చట నే యుండెను. ఇంతవఱకును రేపటియాతనిదీక్షం గూర్చియే ప్రస్తావము జరిగినది" అనియెను.

లలి—అతఁడేల దీక్షను గ్రహింపవలయును ? ప్రయోజనమేమైన నున్నదా ?

ఆనం—(ఆశ్చర్యముతో) అమ్మా! ప్రయోజనమే లేదా ?

లలి—అస్సలు నాకగపడుట లేదు.

లలిత సిగ్గు నడంచుకొని "లేదు. కాని యాయన పుస్తకమును సరిగాఁ దెలిసికొనియుండు నని నే నెఱుంగుదును" అనియెను. అప్పు డానందమయి "నీతండ్రి యంతటివాఁడు కాకున్నచో నింతటిబుద్ధియు, నింతటిధైర్యమును నీ కెట్లు కలుగును ? అమ్మా ! నేను వినయునిఁ బిలిచెదను. నీవాతనితో ముఖస్థముగా మాటాడుట మంచిది. నీ కీసమయమున నొకమాట చెప్పవలసి యున్నది. వినయునిచిన్నతనమునుండియు నేనాతనిం జూచుచున్నాను. వాఁడు సామాన్యుఁడు కాఁడు. వానికొఱకు మీరు పడుచున్నకష్టముల నన్నిటిని వాఁడు సార్థకములుగాఁ జేయునని నేను రూఢిగాఁ జెప్పఁగలను. వినయునిం బడయఁజాలుభాగ్యవతి యెవ్వతె యుండు నని నేను చాలదినముల నుండి భావించుచుంటిని. అప్పు డప్పు డెన్ని సంబంధములు వచ్చినను నేనంగీకరింపలేదు. ఇప్పుడు మావినయుఁడు భాగ్యవంతుఁ డని నాకు నిశ్చయ మైనది." అని చెప్పి లలితను ముద్దుపెట్టుకొని వినయునిం బిలిచి యటఁ గూర్చుండ నియోగించి లలిత కాహారసంయోజనముం గావించు నెపంబున నానందమయి వెడలిపోయెను.

ఇప్పుడు లలితావినయులలో సంకోచమున కవకాశము లేకుండఁబోయెను. వారిజీవితములయందు దోఁచినకఠినసమస్యయే వారిసాహ్వానించి వారిపరస్పరసంబంధమును సహజముగను, సంపూర్ణముగను జేసి చూపించెను. ఆదృష్టిమధ్యమునందలి కాంత్యావరణము నట్టి యావేశబాష్పబిందువును మాయించుట లేదు. ఆయిరువురి హృదయములు నైక్యములై పోయెను. వారిజీవితప్రవాహములు గంగాయమునలంబోలి యొకపుణ్యతీర్థముగా నేక మగుటకు సంసిద్ధములై యుండెను. ఈసంబంధ మెట్టియాలోచనయు లేకుండఁగనే వారివినీతగంభీరభావమునందు నిశ్శబ్దముగా నిశ్చయముగా నంగీకృతమైపోయెను. ఏసమాజమును వారినిఁ బిలువలేదు. ఏమతమును వారిని మేళగింపలేదు. వారిబంధము కృత్రిమము గాదు. ఈసంగతిని గ్రహించియే వారు తమసమ్మేళనము కేవలధర్మసంగత మైనట్లనుభవమునకుఁ దెచ్చుకొనిరి. ఆధర్మ మత్యంతమును సరళమైనది. అది యల్పవచనములఁ గైకొని వివాదపడునది కాదు. ఎట్టిపంచాయతీపండితులును దాని నాతంకపఱుపఁజాలరు! అప్పుడు లలిత తనముఖనయనములఁ బ్రదీప్తములుగాఁ జేసి "నీవు నీయాత్మగౌరవమునువిడిచి నన్ను గ్రహింపఁదలఁచుచున్నావు. ఈయగౌరవమును నేను సహింపఁజాలను. నీస్థానమున నీవు సుస్థిరుఁడవై నిలిచి యుండవలయు ననియే నాకోరిక !" అనియెను.

విన—నీవుకూడ నట్లేయుండవలయును. మనప్రేమకు భిన్నభావమే లేనప్పుడు మన కీప్రపంచమునం బ్రభేద మెక్కడ నుండును ?

ఇరువదినిముషములవఱకును జరిగిన వారిసంభాషణమునందలి సారాంశమదియే. వారు హిందూబ్రాహ్మభేదమును మఱచిపోయిరి. ఇరువురము నేక మానవాత్ములమే యనుమాట వారిహృదయాంతరాళమున నిశ్చలప్రదీపశిఖంబోలి వెలుంగుచుండెను.

# ౬౦

పరేశుఁడు ఉపాసనానంతరము నింటియెదుటి వరాండాలో స్తబ్ధుఁడై కూర్చుండి యుండెను. అప్పుడే సూర్యాస్తమయ మగుచుండెను. ఇంతలో లలితాసహితుఁడై వినయుఁ డటకు వచ్చి నమస్కరించెను. ఆ యిరువురు నట్లు కలసి వచ్చుటం గాంచి పరేశుఁడు విస్మితుఁడై కూర్చుండుటకుఁ గుర్చీ లేకుండుటచే "లోపలికిఁబోవుదమురండు!" అనియెను. వినయుఁడు వలదని చెప్పి యచ్చటనే క్రిందఁ గూర్చుండెను. లలితయును దండ్రిపాదములచెంతఁ గూర్చుండెను. అప్పుడు వినయుఁడు "మే మిరువురము నొక్కసారిగా మీయాశీర్వాదముం గైకొనుటకు వచ్చితిమి. అదియే మాజీవితములకు సత్యదీక్ష కాఁగలదు!" అనియెను. పరేశుఁడు విస్మయముతో వినయుని మొగమువంకఁ జూచెను.

విన— నియమబంధములతో, నియమవచనములతో నేను సమాజమునఁ బ్రమాణము చేయఁజాలను. మాకు మీయాశీర్వాదమే మాజీవితములను వినతములుగను, సత్యబద్ధములుగను జేయఁజాలినదీక్ష యగుచున్నది. మాహృదయములు భక్తితో మీపాదములకుఁ బ్రణమిల్లి యున్నవి. ఈశ్వరుఁడు మాకు మీమూలముననే శుభములను బ్రసాదింపఁగలఁడు!

పరేశుఁడు కొంతసేపటివఱకు నూరకుండి "వినయా! నీవు బ్రాహ్మదీక్షను గ్రహింపవా?" అని ప్రశ్నించెను.

విన— గ్రహింపను. హిందూసమాజమునందే యుండెదను.

పరేశుఁడు లలితవంకఁ జూచుటయు నామె యాతని మనోభావము నుగ్రహించి 'బాబా! ప్రతికూలమైనను, పైపైన నేను సంపూర్ణముగ నా [illegible] నే యుండెదను. కాని వారిఁ బ్రతికూలము సదాచారము నవలంబించినను [illegible] నామనస్సునకు భంగము కలుగు ననుమాట నే నింతమాత్రమువంగీకరింపఁజాలను. నేను మొదటఁ గేవలము బ్రాహ్మసమాజమే లోకమనియు, దీనివెలుపల నంతయు [illegible] మాత్రమేయనియు, దీని త్యజించుట సత్యము నుల్లంఘించుటయే యనియు ననుకొంటి కాని కొన్నాళ్లనుండి నా కాయుద్దేశము మాఱిపోయినది" అనియెను.

పరేశుఁడు మ్లానభావముతో మందహాసము చేసెను. లలిత మరల "బాబా! నాయం దెట్టి ఘనపరివర్తనము కలిగినదో మీరుఁ దెలిసికొనుటలేదు. బ్రాహ్మసమాజికు లందఱితోడను నాకు మతమునం దైక్యము కలుగుచున్నది గాని, వారితో మాత్రము నా కెట్టి యైక్యమును లేదు. కేవలము బ్రాహ్మసమాజ మను నొకనామము ధరించినంతమాత్రమున బ్రాహ్మసమాజికులే నావారని, ప్రపంచమునందలి యితరులందఱును దూర

ముగఁ దోసిపైచుట యిప్పుడు నాకుచితముగాఁ దోఁచుట లేదు" అనియెను. పరేశుఁడు దిగ్భ్రాంతస్వభావ యగు లలిత కన్నులపైఁ జేతితో నిమురుచు "అమ్మా! స్వకీయ కారణమును బట్టి హృదయము తీవ్రమైపోయినప్పుడు సరిగా నీవు నాలోచించుచున్నావా? పూర్వపురుషులు మొదలు ప్రస్తుతసంతతివరకును కలయొక్క చే పారంపర్యమునకు శ్రేయముంగూర్చుటయే సమాజముగలన ప్రయోజనము. అది స్వప్రియమైనది కాదు. నీభావి వంశమునందలి యతిదూర యోజనవ్యాప్తముగు సర్వ ద్భాగ్యసంతతియును దేనిపై నాధారపడియుండునో యదియే నీసమాజము! ఈసంగతి నీవాలోచించుకొనవలదా?" అనియెను.

వినయ—హిందూసమాజ మున్నదికాదా?

పరే—అది మీభారమును వహించుట కంగీకరింపకున్నచో నేమి కావలయును?

వినయుఁ డానందమయి మాటలను స్మృతికిఁ దెచ్చుకొని "దాని నంగీకరింపఁజేయు భారము మేము వహించెదము. హిందూసమాజము సంపూర్ణముగ సకలమానవసంప్రదాయములకును నాశ్రయ మొసంగును. అది సకలమత సంప్రదాయములకును సమాజము కాఁగలదు!" అనియెను.

పరే—బాబూ! ఒకవస్తువును గూర్చి మాటలతో నొకయొక విధముగాఁ జెప్ప వచ్చును గాని, ప్రత్యక్షముగా నట్లు చూపఁజాలముగదా! కానిచో బుద్ధిపూర్వకముగాఁ బురాతనసమాజము నెవ్వరు కల్పించెదరు? నాఁడు బుద్ధధర్మబోధనను గేవల బాహ్యాచారములచే బంధించియుంచి నాశ్రయించుచోటనే యనిర్దిష్టముగ వదలించుచున్న సమాజమును వర్జించినచో మానవుఁడు కేవలము గోడలబోనులోఁ జిక్కుపడవలసినవాఁడు!

వినయ—హిందూసమాజమునట్టి సంకీర్ణతను నశింపఁజేయు భారము మనము వహింపవలయును. కొన్ని కిటికీలును, ద్వారములును గూర్చుచో వెలుఁగును గాలియుఁ గలుగుట కవకాశము కల్పించినచో నేలమట్టముఁ జేయుదుమని యెవ్వరును దలంపరుగదా!

లలి—బాబా! నాకీమాటలేవియును బోధపడుటలేదు. ఏసమాజమునైనను సంస్కరించు భారము వహింపవలయునని నాకట్టికోరికయును లేదు. కాని నలుదెసలనుండియు నాకుఁ గలుగుచున్న యన్యాయము నాప్రాణవాయువును బంధించివైచుచున్నది. ఏకారణముచేతనైనను దీనినంతను సహించియుండుట నాకుచితముగ లేదు. ఉచితానుచితములను గూడ నేను బాగుగ నెఱుంగను. కాని, బాబా! నేను సహింపఁజాలను!

పరే—(మృదులముగా) అమ్మా! ఇప్పుడు నీమనసు చెదరియున్నది! ఇంకను గొన్నాళ్ళు నిరీక్షించుట మంచిది కాదా?

లలి—అట్లు చేయుటకు నాయభ్యంతరము లేదు. కాని యసత్యమును న యమును, నత్యాచారమును క్రమముగా వదిలుచుందు ననియే నానిశ్చయము! అందుచేతనే యెప్పుడైన మీకుఁగూడ మనఃకష్టము గూర్చునని జేసితి నేమో యని నేను భయపడుచున్నాను. నేననాలోచితముగఁ బని చేయుచుంటి నని మీరెన్నఁడు ననుకొనవలదు. ఒకవిధమగు సంస్కారమును, నభ్యాసమును గలనేను బ్రహ్మసమాజమును విడిచినచో ననేకకష్టముల ననుభవింపవలసియుండునని బాగుగ నాలోచించి తెలిసికొనియే యున్నాను. కాని నేనందుకొఱకు కొంచెమాత్రమును జంకుట లేదు. మీయనుమతిలేని నాలో నొకవిధమగు ధైర్యమును నానందమునుగూడ వర్ధిల్లుచుండెను. ఏపని జేసి యెప్పుడు మీకెట్టికష్టము గూర్తునో యనిమాత్రమే నేను భయపడుచున్నాను.

అని లలిత మెల్లగా జనకునిపాదముల నొత్తుచుండెను. పరేశుఁడు చిఱునగవుతో "అమ్మా! నేను నాయొక్క బుద్ధియందుమాత్రమే యాధారపడి యున్నచో నాయిష్టమునుఁ దప్పు. మతమునకును విరుద్ధమగు నెట్టికార్యమునైనను సహింపఁజాలకయుందును. ఇప్పటి నీవ్యవహారము కేవలము మంగళకరమైనదని నేను రూఢిగా నిశ్చయించుట లేదు. నేను నొకప్పుడు మంచిచెడ్డల నాలోచింపక విరుద్ధభావముతో పిల్లచేసి వచ్చినవాఁడనే!—సమాజవిషయమున నిప్పుడు జరుగుచున్న ఘాతప్రతిఘాతములలో నమ్యాకర్షణ దివ్యశక్తియే పని చేయుచున్నట్లు బోధ యగుచున్నది. అతఁడు నలుదెసలనుండి గూర్చి, మార్చి, శోధించి యేవస్తువు నెట్లు చేయఁదలంచెనో యెవ్వరెఱుంగఁగలరు? అతనికి బ్రహ్మసమాజమన నేమి, హిందూసమాజమన నేమి? అతనికందఱు నొక్క మానవజాతియే!" అని చెప్పి పరేశుఁ డొక్కింతసేపు ముకుళితనయనుఁడై తనహృదాంతఃకరణమధ్యమునఁ దన్ను నిలుపుకొని స్తబ్ధభావముతో నుండి యనంతరము "వినయబాబూ మనదేశమునఁ బ్రతిసమాజమును సంపూర్ణముగ మతాచారములతో మిళితమై యున్నది. మతాచారములకు భిన్నులగు వారి నేసమాజమును దనలోనికిఁ జేర్చుకొనఁజాలదు. ఇట్టిచో సమాజమును విడిచి మీరెట్లుందురో నాకు బోధపడుట లేదు!" అనియెను.

లలిత కీమాట బాగుగ బోధపడలేదు. ఆమె యితరసమాజమునకును దనసమాజమునకును గలభేదము నెన్నఁడును బ్రత్యక్షముగఁ జూచియుండలేదు. హిందూసంఘమునకును దమకును నొక్క యాచారవిషయమునఁ దప్ప మఱి యెట్టిభేదమును లేదని యామె యుద్దేశము. అందుచే హిందూవివాహము చేసికొనుట కామె కెట్టి యాక్షేపమును దోఁచుటలేదు.

విన—మావివాహము సాలగ్రామసాక్షికముగా జరుగవలసియుండు ననియేనా మీయుద్దేశము ?

పరే—ఔను. లలిత యిందుల కంగీకరించునా?

వినయుఁడు లలిత మొగమువంకఁ జూచెను. ఆమె సర్వాంతఃకరణమును సంతుష్టమైపోయిన ట్లుండెను. లలిత హృదయవేగముచేఁ దనకు పరిచితంబును, గౌరవదాయకంబునగు స్థానమునకు వచ్చిపడియెను. అందువలన వినయుని హృదయము కరుణాపూర్ణమయ్యెను. "ఈమె కష్టమంతయును నేనే భరించెదను. ఇంతటి మహత్తర తేజము పరాభూతమై వెనుకకు మరలుట యెంత దుస్సహమో, దుర్దమవిజయోత్సాహముచే మృత్యుబాణమునకు వక్ష మొగ్గుట కూడ నంతటి దారుణము. నేనీమెకు విజయమును క్షేమమును గూడఁ గల్పించెదను!" అని వినయుఁడు నిశ్చయించుకొనియెను.

లలిత తలవంచుకొని కొంతసేపూరకుండి పిమ్మట వినయునివంకఁ జూచి "మీరు నిజముగా సాలగ్రామమును విశ్వసింతురా?" అనియెను. వినయుఁడు పరేశునివంకఁ జూచి "విశ్వసింపను! నా యుద్దేశమున సాలగ్రామము దేవుఁడు కాఁడు. అదియొక సామాజికచిహ్నము!" అనియెను.

లలి—మనసులోఁ జిహ్నమని యెంచి యుండియుఁ బైకి దేవతగా నంగీకరింపవలయునా?

వినయుఁడు పరేశు నుద్దేశించి "నేను సాలగ్రామము నుపయోగింపను!" అనియెను. పరేశుఁడు చటాలున లేచి 'వినయబాబు! నీవీసంగతి నంతను బాగుగ నాలోచించి చూచుట లేదు. ఇది నీయుద్దేశము నొట్టిగాని, మఱికొందఱి యుద్దేశమును బట్టిగాని జరుగుపని కాదు. వివాహము కేవలము వ్యక్తిగతమే కాదు. ఇది యొక సామాజిక కార్యము! ఈమాట మఱచినచో నెట్లు! మీరింకను గొంతకాల మాలోచించుకొని చూడుఁడు! ఇప్పుడే నిశ్చయపఱచుకొనవలదు!" అని చెప్పి యాతఁ డిల్లు విడిచి యుద్యానమునకుఁ బోయి యొంటిగాఁ బచారు చేయుచుండెను.

లలితయును వెడలుట కుద్యమించి యింకను నాఁగి వినయునివంకఁ జూచి మనకోరిక యన్యాయము కానప్పుడు—అది యేసమాజనియమునకును సంబంధించి యుండలేదను కారణముచేఁ దలవంచుకొని సిగ్గుపడవలసినయావశ్యము నాకంతమాత్రము నగపడుటలేదు. సమాజమున మిథ్యావ్యవహారమునకే గాని, న్యాయాచారణమునకుఁ దావు లేదా యేమి?" అనియెను. వినయుఁడు మెల్లమెల్లగా లలితచెంతకువచ్చి "నేను సమాజమునకును భయపడుటలేను. మనమిరువురమును గలసి సత్యము నాశ్రయించినచో మనతో సమానమగు గొప్పసమాజ మింక నెక్కడనైన నుండునా!" అనియెను.

ఇంతలో వరదాసుందరి తుపానువలె నటకు వచ్చి "వినయా! నీవు దీక్షను గ్రహింపవా?" అనియెను.

విన—ఏసమాజమువలనను గాక నేను తగినగురువువలన దీక్షగైకొందును.

వర—(క్రోధముతో) ఈతంత్రము-ఈమోసము—ఇంతయేల? దీక్షను గ్రహించునట్లు నటించుచు రెండుదినములనుండి నన్ను, సమాజమువారినిగూడ భ్రమపెట్టుట నీకు మంచిపనియా? లలిత సర్వనాశనమునకు నీవే కారణుఁడ వైయుంటి వనుసంగతి నీ వాలోచించుకొనుట లేదా?

లలి—ఈతనిదీక్ష మీసమాజమువా రందఱు నిష్టములేనట్లు పత్రికలోఁ జదివితిని. ఇట్టిదీక్ష యేల గైకొనవలయును?

వర—దీక్ష గైకొనకున్నచోఁ బెండ్లి యగుట యెట్లు?

లలి—ఏల కాఁగూడదు?

వర—అయినచో నది హిందూవివాహ మైపోదా?

విన—అట్లే కావచ్చును. స్వల్పవిరుద్ధపద్ధతు లున్నచో నేను వానిని లేకుండఁ జేసెదను.

వరదాసుందరికిఁ గొంతసేపటివఱకును నోట మాట లేకుండెను. పిమ్మట నామె రుద్ధకంఠముతో "వినయా! నీవు లేచి పొమ్ము! ఇఁక నెన్నఁడును మాయింటికి రావలదు!" అనియెను.

## ౬౧

గోరా నేఁడువచ్చునని తెల్లవారినప్పటినుండియు సుచరితహృదయము కంపించి పోవుచుండెను ఆమెహృదయమున నానందముతోఁగూడ భయము మిళితమైయుండెను. చిన్నతనమునుండియు నామెజీవిత మెచ్చట వేరు నాటుకొని బలపడి శాఖోపశాఖలచే వ్యాపించుచుండెనో యాస్థానమునుండి సుచరిత నిప్పుడు గోరా తనస్థానమున కాకర్షించుచుండె నని యామె యస్థిరయై యుండెను. అందుచేతనే నిన్న దొడ్డమ్మయింట గోరా గోపాలమూర్తికి నమస్కరించుట సుచరితకుఁ గత్తితోఁ బొడిచినట్లుండెను. "ఊరకయే నమస్కరించెనా? నిజముగనే విశ్వాస మున్నదా?" అను నాలోచనతో నామెకు శాంతిలేకుండెను. గోరాచేసినపని సుచరితధర్మవిశ్వాసమునకు విరుద్ధముగఁ దోఁచుటచే నామె హృదయము కంపించిపోవుచుండెను. ఈశ్వరుఁ డామె నిట్టిరణరంగమధ్యమునం ద్రోసివైచెను.

గోరా వచ్చెను. సత్యమతాభిమానిని యగుసుచరితకు దృష్టాంతము చూపుటకై హరిమోహిని గోరాను దనపూజామందిరమునకుఁ గొనిపోయెను; ఎప్పటివలె గోరా దేవునకుఁ బ్రణామముచేసెను. గోరా తనగదిలోనికి వచ్చినతరువాత సుచరిత యాతనిం గాంచి "మీ రీదేవునిఁగొల్చెదరా?" అని ప్రశ్నించెను. గోరా యించుక యస్వాభావిక సాహసముతో "ఔను కొల్చెదను!" అనియెను.

సుచరిత విని తల వంచుకొనియూరకుండెను. అనిర్వచనీయవేదన గోరాహృదయమున కాఘాతమువలె నుండెను. అతఁడు తొట్రుపాటుతో "సుచరితా చూడుమా! నేను నీకు సత్యము చెప్పుచున్నాను. నే నీశ్వరమూర్తిని సేవించుచుంటినో లేదో చెప్పఁజాలను గాని నా దేశభక్తిని భజించుచుంటి నని చెప్పఁగలను. సమస్తారాధనములును దేనికిఁ జెందుచున్నవో యదియే నాకుఁ బూజనీయమైనది. క్రైస్తవమతబోధకులవలె నేను దానివంక విమర్శదృష్టిని బరగింపఁజాలను!" అనియెను.

సుచరిత యేమేమో యాలోచించుకొనుచు గోరా మొగమువంకఁ జూచుచుండెను. అప్పుడు గోరా "నా మాటలు నీకు సరిగా బోధపడవని నే నెఱుంగుదును. ఒక్క సంప్రదాయమునుండియే పెరిగియున్న నీవు సర్వవిషయములను సహజముగా గ్రహించుకొనియుండవు. నీ దొడ్డమ్మయింట నున్న గోపాలమూర్తియందు నీకుఁ గేవలము శిలాస్వరూపమే యగపడును! నాకో! భక్తిపూర్ణంబును గరుణార్ద్రంబు నగు నామెహృదయమగపడును! ఆదృష్టియందు నాకుఁ గోపముగాని తిరస్కారముగాని యెట్లు కలుగును? ఆమెహృదయమునందలి దేవత కేవలము శిలామూర్తి యనియేనా నీయుద్దేశము?

సుచ—ఏదో యొకటి చేసినంతమాత్రమున భక్తి కలుగునా? దేనిని భజింపవలయునో యాలోచించుకొనవక్కఱలేదా?

గోరా యించుక యుత్తేజితహృదయముతో "సీమాబద్ధమగు నొకవస్తువు నీశ్వరునిగాఁ దలంచి పూజించుట భ్రాంతియని నీ వనుకొనుచున్నావు. కాని కేవలము దేశకాలములనుబట్టియే పరిమితిని నిర్ణయింపవలసినదా? ఈశ్వరసంబంధమగు నేదేనొక శాస్త్రవాక్యము స్మృతికి వచ్చినంతనే నీకు విశేషభక్తి కలుగుచున్నది. ఆవాక్యము వ్రాయఁబడిన పత్రమునుబట్టిగాని యందలి యక్షరములనుబట్టిగాని, నీవా వాక్యమహాత్త్వమును నిర్ణయింతువా? బాహ్యనిస్సీమతకంటె భావనిస్సీమత యధికమైనదిగాదా? చంద్రసూర్యతారాఖచిత మగు నవంతాకాశముకంటెను మీ దొడ్డమ్మగారి చిన్న గోపాలమూర్తి నిజముగ నసీమపదార్థమై యుండెను. పరిమాణగత మగునిస్సీమమునే నిస్సీమముగ నెంచి నీవు కన్నులు మూసికొని దానిని భావించుచున్నావు. ఇందువలన లాభమున్నదో లేదో నేను చెప్పఁజాలను. కాని హృదయమునందలి యపారతను జిన్న వస్తువునందుఁగూడఁ గన్నులఁ దెఱచియే చూడవచ్చును. అట్లే కాకున్నచో సంసారసుఖము లన్నియును స్పృశించియే చూడవచ్చును. అట్లే కాకున్నచో సంసారసుఖము లన్నియును నశించిపోయినను మీ దొడ్డమ్మ యిప్పుడుకూడ నీ గోపాలమూర్తి నొకింతయు నెట్లు పడఁగలిగియుండును?—ఒక్క చిన్న రాతిబొమ్మతో నాకుఁగొన్నంతమాత్రమున నామె హృదయమునందలి యంతటి శూన్యభావము వదలిపోవుట కవకాశ

మెట్లు కలుగును ? భావమున కనంతప్రకాశము లేకున్నచో నంధకారమయమగు మానవహృదయము తేజఃపూర్ణము కాజాలదు !" అనియెను.

ఇట్టిసూక్ష్మతర్కములకు సుచరిత ప్రత్యుత్తర మీయఁజాలదు. అయినను వానిని సత్యములుగా విశ్వసించుట యామె కసంభవముగానుండెను. అందుచేతనే కేవల భాషాహీనంబును, ప్రతీకారహీనంబును నగునొకవేదన యామెహృదయమును బాధించుచుండెను. ప్రతిపక్షులతో వాదించునప్పుడు గోరాహృదయమునం దెన్నఁడును దయగలుగుట లేదు ! కాఠిన్యమే విశేషించి యుండును. కాని నిరుత్తర యగు సుచరితపరాభవ మిప్పు డాతనికి విచారకరముగఁ దోఁచెను. అతఁడు కోమలకంఠస్వరముతో "నేను మీమతమునకు విరుద్ధముగ మాటాడఁ దలచుకొనలేదు. నీవు దేవుఁడు కాఁడని నిందించిన యాగోపాలవిగ్రహము కేవల బాహ్యదృష్టిచేమాత్రమే గ్రహింపఁబడునది కాదు ! దానియం దెవ్వరిమనసు స్థిరమగునో, యెవ్వరిహృదయము తృప్తిం జెందునో యెవ్వరిజీవిత మాశ్రయముం గాంచునో వారికొక్కరికిమాత్రమే దాని సంగతి తెలియును. అది మృణ్మయమో, చిన్మయమో, ససీమమో వారికే తెలియును. మనదేశమునం దేభక్తుఁడును సీమాబద్ధమగుపదార్థమును భజించుటలేదు. పరిమిత వస్తువునందలి పరిమాణభావన లేకుండుటయే భక్త్యానందము !" అనియెను.

సుచ—కాని, యందఱును భక్తులు కారు.

గోరా—భక్తిలేకుండఁ బూజించుటవలన నేమిలాభము; భక్తిహీనుఁడగువాఁడు బ్రహ్మసమాజమునమాత్ర మేమి చేయఁగలఁడు ! అతని పూజయంతయును శూన్యమధ్యమునఁ బడిపోవుచున్నది. అతనికిఁ బక్షపాతమే దేవత; అహంకారమే పురోహితుఁడు ! రక్తపాయియగు నిట్టిదేవతను బూజించుట మీసమాజమునం దెన్నఁడును జూడలేదా ?

సుచరిత యామాటకు బదులు చెప్పక "ఈధర్మబోధ యంతయును మీయనుభవమునుబట్టి చెప్పినదేనా ?" అనియెను. గోరా నవ్వుచు "నే నెన్నఁడైన దేవుని భావించితినో లేదో నీవెఱుంగఁదలఁచితిని కాఁబోలును ! లేదు ! నామన సెప్పుడు నాతనివంకకుఁ బోలేదు !" అనియెను. సుచరిత కామాట సంతోషజనకము కాకపోయినను నామెహృదయమునకుమాత్రము విశ్రాంతిని గల్పించెను. ఈవిషయమున నింత సాహసముతో మాటాడుటకు గోరా కధికారము లేదని యామె యొకవిధముగా నిశ్చయించుకొనియెను.

గోరా—ఎవ్వరికైనను ధర్మమును బోధింపవలసినబాధ్యత నాకు లేదు. కాని నాదేశీయులభక్తిని నిందించినచో నేను సహింపఁజాలను. నీవు నీదేశీయులను మూఢులగను, ప్రతిమామాత్రులుగను భావింతువు. నేను వారినందఱను జ్ఞానులుగను భక్తులు

గను భావింతును! మాధర్మతత్త్వమునం దెట్టిమహత్త్వ మున్నదో భక్తితత్త్వమునం దెట్టి గంభీరత్వమున్నదో యచ్చటనే నాదేశహృదయమును శ్రద్ధతో నిలుపవలయునని నేను కోరుచుందును. నాదేశసంపత్తి గలచోటనే నాదేశాభిమానమును వెల్లడింపవలయునని నేను తలంచుచుందును. నేను నాదేశమునకుఁ దలవంపుకలుగనీయను—నాదేశము తన్నుఁదాను నిందించుకొనుటకుఁగాని, తనసత్యమును గ్రహింపలేకుండుటకుఁగాని నేను సహింపఁజాలను. ఇదియే నాప్రతిజ్ఞ! నీయొద్దకుఁగూడ నేనిప్పు డందుకొఱకే వచ్చితిని. నిన్నుఁజూచినది మొదలు నాహృదయమునం దొకనూత్నభావము తోఁచుచున్నది. ఇంతకుముందు నే నాసంగతి తెలిసికొనలేదు. కేవల పురుషదృష్టియందే భారతవర్షము సంపూర్ణముగఁ బ్రత్యక్షమగుట లేదనియు స్త్రీదృష్టికూడఁ గలసినప్పుడే దానికి సంపూర్ణత్వ మగపడు ననియు నాకిప్పుడు తోఁచుచున్నది. అందుచేతనే నీచూపులోఁ జూపుఁగలిపి నాదేశమును సంపూర్ణముగఁ బ్రత్యక్షముగఁ జేసికొనవలయు ననుకోరిక నన్నిప్పుడు బాధించుచున్నది. నాభారతవర్షము గాంచుటకై కేవలపురుషుఁడ నగునేను పరితపించుచుంటిని. కాని నీవు లేకున్నచో దీపమును వెలిగించి దానిని వెదకి కనుఁగొనుటయెట్లు? నీవు దూరమునందే యున్నచో నా భారతవర్ష సేవ సర్వాంగసుందర కాఁజాలదు.

ఆహా! ఎక్కడిభారతవర్షము! ఎక్కడిసుచరిత!—ఈభారతవర్షసాధకుఁడు—ఈయాత్మవిస్మృతతపోధనుఁడు—ఎక్కడనుండి వచ్చెను? అందఱను త్యజించి యాతఁడామె పార్శ్వముననే నిలువఁబడియెను! అందఱను విడిచి యాతఁ డామెనే పిలిపించెను. ఎట్టిసంకోచమును లేదు! ఎట్టియడ్డమును లేదు! నీవు లేకున్నచో గతి లేదు—నిన్నుఁ గైకొనుటకే వచ్చితిని! నీవు పూనుకొనకున్నచో నీయజ్ఞము సంపూర్ణము కానేరదు! "ఇదియే గోరాప్రార్థన!—సుచరితకన్నుదమ్ము లవిరళాశ్రుధారాసంసిక్తము లైపోయెను. ఎందుచేతనో యామెకే బోధపడుట లేదు!

గోరా సుచరితమొగమువంకఁ జూచెను. ఆదృష్టియెదుట నామె యశ్రుసిక్తనయనద్వయము వినతము కాలేదు. విచారవిహీనంబు లగుశిశిరమండితకుసుమములంబోలి యాకన్ను లాత్మవిస్మృతభావముతో గోరా మొగమువంకనే వికసితములైయుండెను. నిస్సంకోచములును, నిస్సంశయములును, నశ్రుధారాప్లావితంబులు నగు సుచరిత యాకన్నుల యెదుట భూకంపముచేఁ జంద్రశిలామయరాజప్రాసాదమువలె గోరా సమస్తశరీరమును జలించిపోయెను. గోరా యతికష్టముతో నాత్మసంవరణము గావించుకొనుటకై మొగము మరల్చుకొని కిటికీవంకఁ జూచెను. అప్పటికి సంధ్యాసమయ మయ్యెను. దూరమునందలి విశాలాకాశమున నీలశిలాసన్నిభం బగునంధకారమునఁ జుక్కలు దోఁచుచుండెను. ఆయాకాశఖండమును, నందందుఁ దోఁచుచున్న

చుక్కలును గోరా నప్పు డాతనిసంసారబాధ్యతలకును, జిరాభ్యస్తదైనందిన నిర్దిష్ట కర్మములకును గూడఁ జాలదూరమునకుఁ బోయెను. ఆనీలాకాశమండలమునందలి యాచుక్కలు బహుదూరమునందుండి యనేక రాజసామ్రాజ్యముల యుత్థానపతనములను, ననేక యుగయుగాంతరకష్టసుఖములను, ననేక ప్రారబ్ధములను నిర్లిప్తభావముతో నిరీక్షించుచుండెను. మఱియు నతలస్పర్శంబగు గభీరతామధ్యమునుండి యొక హృదయము మఱియొక హృదయమును బిలుచుచున్న పిలుపునందలి వాగ్విహీనంబగు నిగూఢజగద్వ్యాకులత్వ మనంతదూరాకాశమునందలి దూరతారకలను గూడఁ గంపింపఁ జేయుచుండెను. కర్మరతంబులగు కలకత్తావీధులయందలి బండ్లును, గుఱ్ఱములును, బధికులును గోరా కానిమిషమున ఛాయాచిత్రములంబోలి వస్తువిహీనములై పోయెను. నగరకోలాహల మాతని చెవికడకు వచ్చుటయే లేదు. అతఁ డప్పుడు తనహృదయముననే పరిశీలించుకొనుచుండెను. అదియు నయ్యాకాశమునుం బోలి నిస్తబ్ధమును, నిభృతమును, నంధకారమయంబును నైయుండెను. అందుఁ బ్రసిక్తములగు నాసరశీకరు సాక్షి పద్మములమాత్రము నిర్నిమేషములై యనాదికాలమునుండి యనంతకాలమునకును బరిశీలించుచుండెను.

ఇంతలో హరిమోహిని వచ్చి "బాబా! కొంచెము తేనీరు త్రాగవా?" అనియెను. ఆకంఠస్వరము విని గోరా యదరిపడి "ఇప్పుడు వలదు! క్షమింపుము! నేను పోవలయును." అని చెప్పి ప్రత్యుత్తరమును నపేక్షింపకుండఁగనే యతివేగముగ వెడలిపోయెను. హరిమోహిని విస్మితయై సుచరితవంకఁ జూచెను. సుచరితయు నాగదినుండి లేచిపోయెను. హరిమోహిని తలయూఁచుచు "మరల నిదియేమి?" అని యాలోచింపఁదొడంగెను.

మఱి కొంతసేపటికిఁ బరేశుఁడు వచ్చి "రాధారాణి యెచ్చట నున్నది?" అని ప్రశ్నించెను. హరిమోహిని విరక్తకంఠస్వరముతో, "ఏమో! ఇంతవఱకును గౌరమోహనునితో మాటాడుచునే యున్నది. ఇప్పుడు డాబామీఁద నొంటిగాఁ బచారు చేయుచున్నది కాఁబోలును!" అనియెను. పరేశుఁ డాశ్చర్యముతో "ఈచలిలో నంధకారములో డాబామీఁదనా?" అనియెను. హరిమోహిని యాక్షేపముగా "ఇప్పటి యాఁడువాండ్రకు శీతబాధ యంతగా లేదు!" అనియెను. హరిమోహినిమనసు చెడిపోయినది. క్రోధముచే నామె సుచరితను భోజనమునకుఁ బిలువలేదు. పాపమా సుచరితకు వేళ తెలియుటలేదు!

ఆకస్మికముగఁ బరేశుఁడు డాబామీఁదికి వచ్చుటం గాంచి సుచరిత లజ్జితయై "బాబా! క్రిందికిఁ బోవుదము! మీకుఁ జలిగా నుండును!" అనియెను. పిదప నిరువురును గదిలోనికి వచ్చిరి. దీపపువెలుఁగునఁ బరేశునియుద్విగ్నవదనముం గాంచి సుచ

రిత తల్లడపడియెను. ఇంతకాలమువఱకును విశ్వసించి గురువనఁ దండ్రియు, గురువుండును నైయున్నయాతనిచెంతనుండి యాశైశవము సంబంధములను ద్రెంచుకొని సుచరిత యిప్పుడు దూరమై పోవనైయున్నది! ఆమె యెంతమాత్రమును దన్నుఁ దాను క్షమించుకొనఁజాలకుండెను. పరేశుఁడు స్తబ్ధుఁడై కుర్చీపైఁ గూర్చున్నతరువాత సుచరిత తనయశ్రుప్రవాహమును గానరాకుండునట్లు యాతని వెనుక నిలిచి మెల్లమెల్లగా నాతని పలిత కుంతలములను కోమలకరాంగుళులచే సవరించుచుండెను.

అప్పుడు పరేశుఁడు "వినయుఁడు దీక్ష సమ్మతింపలేదు," అనియెను. సుచరిత మాటాడలేదు. పరేశుఁడు మరల "ఆవిషయమున నాకిసుమంతైనను సంశయముగా నున్నది. అందుచే నాకిప్పుడది యుక్తముగాఁ దోఁపలేదు. కాని దీక్ష గైకొనకున్నను వినయునిఁ బెండ్లియాడుట లలిత కీవిషయమునఁ గష్టముగాఁ దోఁచుటలేదు" అనియెను! సుచరిత తక్షణమే యతితీవ్రస్వరముతో "బాబా! అది యెట్లు జరుగును? ఎంతమాత్రమును జరుగదు!" అనియెను. సుచరిత యెన్నఁడు నింత తొట్రుపాటుతో మాటాడియుండలేదు. ఆమె కంఠస్వరమునందలి యాకస్మికావేశవాక్ప్రావల్యమునకుఁ బరేశుఁ డాశ్చర్యపడి "అమ్మా! ఎందుకని జరుగఁగూడదు?" అని ప్రశ్నించెను.

సుచ—ఏమతానుసారముగా జరుగును?

పరే—హిందూమతానుసారముగనే—

సుచరిత సవేగముగఁ దలత్రిప్పుచు "కాదు కాదు! ఇది యేమి? ఇట్టిమాట మనసునందైనఁ దలంచుట యుచితము కాదు. తుదకు దేవతాపూజతో లలితకుఁ బెండ్లియా? ఇది యెంతమాత్రము నాచరణీయము కాదు!" అనియెను. గోరా సుచరిత హృదయమును నిప్పుడు బలవంతముగ నాకర్షించుచుండుటచేతనే యామె హిందూవివాహముంగూర్చి యిట్టి యసాధారణాక్షేపము గావించియుండెను. ఆయాక్షేపమధ్యమునందు "నేను నిన్ను విడువను. ఎప్పటికిని నీసమాజమునందే నీమతమునందే యుండెదను. ఎంతమాత్రమును నీ శిక్షానియమముల నతిక్రమించుదానను గాను!" అను సుచరిత మనసిరోద్దేశము గర్భీకృతమై యుండెను.

పరే—ఈవివాహమున సాలగ్రామపూజ లేకుండఁ జేయుటకై వినయుఁ డంగీకరించినాఁడు!

సుచరిత పరేశున కెదురుగ నొక్కకుర్చీపై గూర్చుండెను. పరేశుఁ డామెంగాంచి "ఈసందర్భమున నీ వేమి చెప్పెదవు?" అని ప్రశ్నించెను. సుచరిత యించుకసేపూరకుండి "అట్లయినచో మనసమాజమునుండి సుచరితను దొలఁగింపవలసి వచ్చునా!" అనియెను. పరేశుఁడు మృదుస్వరముతో "ఈవిషయమై నేను చాలకాల మాలోచించితిని. ఒకవ్యక్తికి సంఘముతో భిన్నాభిప్రాయము కలిగినప్పుడు "ఏపక్షమున న్యాయము

న్నది! ఏపక్షమున బల మున్నది?" అని రెండుసంగతుల నాలోచించుకొనవలయును. సంఘము బలవంతమైన దనుటనిశ్చయమే కదా! అందుచే దానికి విరుద్ధముగఁ జరించు వ్యక్తి కష్టముల పాలుగావలసియుండును కాని నేనీ మూలమున దుఃఖము ననుభవించుటకే సిద్ధపడుటలేదనియు, శాంతానందమే బోధ యగుచున్నదనియు లలిత మాటిమాటికిని జెప్పుచున్నది! ఇదియే సత్యమై, యిందెట్టియన్యాయమును లేనప్పుడు నేను లలితను నిషేధించుట యెట్లు?" అనియెను.

సుచ—కాని బాబా! ఇది యెంతకష్టము!

పరే—దీనివలన శోకకష్టము కలుగు నని నేనెఱుంగుదును కాని లలితకు వినయుని పెండ్లియాడు టెంతమాత్రమును దోషము కానప్పుడు—అది యుచితమే యైనప్పుడు కేవలసమాజనిర్బంధమునకు లోఁబడుట కర్తవ్యము కాదని నా యంతరాత్మ బోధించుచున్నది. మానవుఁడే సమాజాధికారమునకు లొంగియుండవలయు ననుట యెన్నటికిని న్యాయము కాదు—సమాజమే మానవాధికారమునకుఁ లోఁబడి తన్నుఁ దాను సుపరిశుద్ధముగాఁ జేసికొనవలయును. ఈవిషయమునఁ గష్టములకోర్చి పనిచేయువారిని నేను నిందింపఁజాలను!

సుచ—బాబా! ఇందువలన నందఱికంటె మీకే యెక్కువకష్టము కలుగును!

పరే—అది విచారణీయాంశము కాదు.

సుచ—బాబా! మీరంగీకరించితిరా?

పరే—ఇంకను లేదు. కాని యంగీకరింపవలసినదే! ఇట్టిస్థితిలో లలిత నాశీర్వదించువారు నాకంటె నొరు లెవ్వ రున్నారు? దేవునికంటె నామెకు సాయపడువా రెవ్వ రున్నారు?

అని చెప్పి పరేశుఁడు వెడలిపోయెను. సుచరిత స్తంభితయైపోయెను. పరేశుఁడు లలిత నెంతగాఁ బ్రేమించుచుండెనో, యామె యెఱుంగును. లలిత నియమబద్ధమగు మార్గము వదలి యనిర్దేశ్యపథమునఁ బ్రవేశించుట యాతని కెంతకష్టముగా నుండెనో యామె గ్రహించుకొనియెను. ఇట్టిస్థితిలో నీవయసునందీవిప్లవమున సాయంచేయఁ బూనుట యెంతకష్టము! పరేశుఁడు మాటలలోఁ దనదీక్షాశక్తి నెంతమాత్రమును బ్రకటింపకపోయినను నది యాతనిలో ననాయాసముగ నాత్మగోపనముం గావించుకొని యున్నట్లు గోచరించుచునే యుండెను.

పరేశునిప్రకృతియందలి వైచిత్ర్యముం గాంచుటకు సుచరిత కిదివఱకు నవకాశము లేదు. చిన్నతనమునుండియు నామె యాతనిం జూచుచునే యుండెను. కాని కొలఁది నిమిషములకుఁ బూర్వము గోరా యభిఘాతములకు సహించియున్న యామెహృదయ మిప్పు డాయిరువురిస్వభావభేదములను స్పష్టముగా ననుభవమునకుఁ దెచ్చుకొనకుండ

ను డజాలకపోయెను. గోరాకాంతి ప్రచండమైనది! అతఁడు తన విశ్వాసమును దీవ్రముగ నుపయోగించి యితరులను బరాజితులనుగాఁ జేయును. అతని సంబంధమును గోరువా రందఱు నాతనిమాటురఁ గల యొగ్గవలసినదే. సుచరితయు నిప్పుడట్లే య య్యెను. అది యామె కానందమునే కలిగించెను. ఆత్మసమర్పణము గావించుకొని యొకమహాద్వస్తువు బడసినట్లుగా నామె కనుభవమయ్యెను. కాని, యిప్పుడామె తన హృదయందలి దీపపు వెలుఁగునుండి చింతావనతవదనముతో వెలుపలి యంధకారమునం బడిపోవుచున్న పరేశుని, యౌవన తేజోదీప్తుఁడగు గోరాతోఁ బోల్చుకొనియును దా నంతరంగమునందలి భక్తిపుష్పాంజలిని విశేషించి పరేశుని పాదకమలములయందే సమర్పించెను. ఆమె యట్లే ముకుళితకరకమలముల నొడియం దుంచుకొని చాలసేపటివఱకును శాంతభావముతోఁ జిత్రప్రతిమవలెఁ గూర్చుండి యుండెను—

## ౬౨

గోరాయింట నేఁడుదయమునుండియు నాందోళనముగా నుండెను. ముందుగా మహిముఁడు హుక్కా త్రాగుచు వచ్చి గోరాను జూచి "ఇప్పుడైన మీ వినయునిసంగతులు వదలిన వదలుకొందును!" అనియెను. ఆమాట కర్థము బోధపడక గోరా యూరకే చూచుచుండుటయు మహిముఁడు మరల "నాయొద్దఁగూడ రహస్యమా? మీ మిత్రునిసంగతి దాఁగునది కాదు! దేశమంతటను మ్రోగిపోవుచున్నది. ఇదిగో! చూడుము" అని యొక వార్తాపత్రిక నాతనికిచ్చెను. అందు వినయుని బ్రహ్మసమాజదీక్షంగూర్చి వ్రాయబడియుండెను! "బ్రహ్మసమాజమునందలి యాఁడుబిడ్డల గాలముగల కొందఱుపెద్దమనుష్యులు గోరా జైలులోనున్న సమయమును జూచి చంచలహృదయుఁడును దరుణవయస్కుఁడు నగువినయు నాకర్షించి హిందూమతమునుండి తప్పించి యున్నారు" అనువిషయము నెవ్వరో యనేకకటుభాషణములతో వ్రాసియుండిరి. గోరా కీసంగతి తెలియదనుట యెందట మహిముఁడు నమ్మలేదు. తరువాత నింతరహస్యముగా వ్యవహరించినవినయునిగూర్చి యాశ్చర్యపడి "వినయుఁడు మనకిని చెంప్లియాడెద నని స్పష్టముగాఁ జెప్పియుండియు నామాట తప్పిపోవుటను బట్టియే యాతని సత్యనాశమునకు సూత్రపాత మైనట్లు మనము గ్రహింపవలసినది!" అనియెను.

ఇంతలో నవినాశుఁడు వగర్చుకొనుచు వచ్చి "బాబూ! ఏమని చెప్పుదును ? ఇట్లగునని కలలోనైన భావింపలేము. వినయుబాబు తుదకు——" అని యామాట ముగింపలేకపోయెను. వినయునకుఁ గలిగిన యీయపఖ్యాతిమూలమునఁ దనమనసునం దోఁచు నానందము నాతఁడు ప్రకటింపఁ జాలకపోయెను—క్రమక్రమముగా గోరాసమాజమునందలి ముఖ్యులగువా రందఱును వచ్చి వినయునిలోపముల ననేకవిధముల నుగ్గడించు

చు తతివిషయమున నింతపదనక్కఱలేదు. వినయుని హృదయమునకు సంశయమును, చాంచల్యమును గ్రొత్తగాఁ గలుగలేదు. అతఁడు తనసమాజమునం దెన్నఁడును త్రిక రణశుద్ధిగా నాత్మసమర్పణము చేసికొని యుండలేదు. అతఁడు పెద్దలనుండియు గౌరమోహనునితో సమానముగ నుండఁదలఁచుట మాకందఱకు నసహ్యముగనే యుండెను! ఏమైన నేమి? తుదకీవిధముగాఁ బరిణమించినది!" అని నిందింపఁదొడఁగిరి. తుదకు వారందఱును "బాబూ! మేము వినయునివలె విద్వాంసులము కాము. మాకంతటిబుద్ధియును లేదు; మేమొక్కటే పద్ధతి ననుసరించి పోవుదుము. మాకు మనసులో నొకటియు, మాటలో నింకొకటియు లేదు. మేము నేఁడెట్లుండుమో రేపుగూడ నట్లే యుందుము. ఇందులకు మీరు మమ్ములను మూర్ఖులనినను, నజ్ఞానులనినను మఱి యేమనినను సరియే!" అని చెప్పఁదొడఁగిరి. గోరా వారిమాటల కెట్టియుత్తరమును జెప్పక మన్నియుండి కూర్చుండెను!

కాళీ యాత్రియించుటచే నొక్కొక్కఁడు వెడలిపోవుచుండిరి. అప్పుడు వినయుఁడు వచ్చి మేడమీఁది కెక్కుచుండుటం గాంచి గోరా చటాలున లేచి వెలుపలికి వచ్చి "వినయా!" అని పిలిచెను. వినయుఁడు గదిలోనికి వచ్చెను. అప్పుడు గోరా "వినయా! నేను నీ కేటియపకారము చేసితిని! నీవు నన్నేల విడువఁదలంచితివి?" అని ప్రశ్నించెను. గోరాతో నేఁడు పోరాటము జరుగునని యెంచి వినయుఁడు ముందుగనే మనసును గట్టిగాఁ జేసికొని వచ్చియుండెను. కాని యిప్పుడు గోరా మొగమున విచారచిహ్నమును, కంఠస్వరమున విషాదవేదనయు గోచరించుటచే వినయుని మనస్స్థైర్యమంతయు విచ్ఛిన్నమైపోయెను. అప్పుడు వినయుఁడు "సోదరా! గోరా! నీవు నన్నుఁ బొరపాటుగ భావింపవలదు జీవితమునందనేక పరివర్తనములు ఘటిల్లును. అనేకవస్తువులను త్యజింపవలసివచ్చును! అంతమాత్రమున మిత్రత్వము నేల త్యజింపవలయును?" అనెను. గోరా యొక్కింతసేపూరకుండి "వినయా! నీవు బ్రాహ్మమతదీక్షను గ్రహించితివా?" అనియెను.

విన—లేదు గోరా! గ్రహింపలేదు! గ్రహింపను. కాని నేను దానిపై పట్టిభారము నుంచఁదలంచుకొనలేదు.

గోరా—అనఁగా నీయభిప్రాయ మేమి?

విన—బ్రాహ్మదీక్షను గ్రహించుటయా, గ్రహింపకుండుటయా యను నీవిషయమును విశేషముగఁ జర్చింపవలయు ననునుద్దేశము నాకిప్పుడులేదు.

గోరా—ఈభావము నీకుఁ బూర్వమునుండే యున్నదా, యిప్పుడు కలిగినదా యని యడుగుచున్నాను.

నను వారని వారనపాశమును గళబంధముగాఁ జేసికొని చరింపవలయును. ఇది నే నెంతమాత్రము నంగీకరింపఁ జాలను.

గోరా—మహాభారతమునందలి విప్రకుమారునివలె గడ్డిపోచతో నీవా బకాసురుని జంపఁదలఁచితివా యేమి ?

వినయ—నేనాతని జంపఁగలనో లేనో యెఱుంగను గాని నన్నుఁ జంపుకొని తినునధికార మాతని కున్నట్లు నేనంగీకరింపను.

గోరా—నీవు సమస్తమును రూపకాలంకారముతోనే మాటాడుచున్నావు. గ్రహించుట కష్టముగా నున్నది.

వినయ—నీకు గ్రహించుట కష్టము కాదు. సమ్మతించుట కష్టము! స్వభావముచేతను, ధర్మముచేతను స్వతంత్రుఁడగు మానవుని, మనసమాజము తినుట, నిద్రించుట కనిచుట మొదలగువానియందుఁగూడ నిరర్థకబంధములచే బంధించుచున్న సంగతి నీకు మాత్రము తెలియనిది కాదు. కాని యిట్టి నిర్బంధమును నిర్బంధముచేతనే నీవు గౌరవింపఁ జూచుచున్నావు. నేనిప్పు డెవ్వరినిర్బంధమును లక్ష్యము సేయఁ దలఁచుకొనలేదు. నాకుచితమగు బాధ్యతను రక్షించునంతవఱకు నేను సమాజమును మన్నింతును. అది నన్ను మానవునిగాఁ దలంపక యంత్రప్రతిమగాఁ జేయఁదలఁచినచో నేను దానిని పుష్పచందనములతోఁ బూజింతునా ?—లోహయంత్రముగాఁ బరిగణింతును !

గోరా—అనఁగా నీవు బ్రాహ్మదీక్ష గ్రహింతువా !

వినయ—గ్రహింపను !

గోరా—లలితను పెండ్లియాడెదవా !

వినయ—పెండ్లియాడెదను.

గోరా—హిందూవివాహమేనా !

వినయ—ఔను.

గోరా—పరేశున కిది యిష్టమేనా !

వినయ—ఇదిగో ! అతని యుత్తరము !

గోరా యాయుత్తరమును జదివెను. అందలి శేషాంశ మిట్లున్నది:—

"నాయిష్టానిష్టములం గూర్చిగాని, మీయనుకూలప్రతికూలగతులం గూర్చిగాని నేనేమియుఁ జెప్పఁదలఁచుకొనలేను. నామతమును, నాసమాజమును మీ రెఱింగినదే. ఏశిక్షాసంస్కారములమధ్యమునుండి లలిత పుట్టి పెరిగినదో యాసంగతియు మీ రెఱుంగనిది కాదు. అంతయు నెఱింగియుండియే మీరు మీమార్గమును నిశ్చయించుకొంటిరి. నేను చెప్పవలసినదేమియును లేదు. నేను బాగుగ నాలోచింపకుండఁ

మా కులమునకు సమ్మతించని నీ వివాహము నడ్డగించినచో ప్రత్యక్షదేవత నాహ్వానించిన ట్లగునని నేను నిశ్చయముగాఁ జెప్పఁగలను. అందుచేతనే మిమ్ముల ననివార్యవేగముతో సమాజమునుండి స్వచ్ఛందసుఖస్థానమున కాకర్షించుచున్న దివ్యశక్తికి నేను భక్తితోఁ బ్రణమిల్లి మీయిరువురినిఁగూడ నాతనిచేతులలో సమర్పించి వైచితిని. అతఁడే మీ యపవాదకంటకమును, మీబంధువిచ్ఛేదమును మఱపించి మీజీవనమును సార్థకముగాఁ జేయుఁగాక! ఇంతటి దుర్గమపథంబునకు మిమ్ముల నాహ్వానించినయాతఁడే మిమ్ములను గమ్యస్థానమునకుఁ గొనిపోవును!"

గోరా యుత్తరమును జదివి యూరకుండుటయు వినయుఁడు "గోరా! నీవును బరేశబాబువలెనే నీసిద్ధాంతానుసార మీవివాహము నంగీకరింపఁగలవునా!" అనెను. గోరా యాలోచించి 'వినయా! కూలములను భంగించు ప్రవాహమునందే యాతఁడుండెను గావునఁ బరేశుఁ డిందుల కంగీకరించెను. నాప్రవాహము కూలములను రక్షించునది కావున నేనట్లంగీకరింపఁజాలను. మాప్రవాహకూలములం దత్రిభేది యనుకీర్తి కలసహస్రవర్షములనుండి ప్రతిష్ఠింపఁబడి యున్నది. అచ్చట ప్రకృతియేమి పని చేయుచున్నదని నేనిప్పటికిఁ జెప్పఁజాలను. మాకూలములను మేము శిలాసంగతములుగఁ జేసి కాపాడుకొందుము. అందుకొఱకు మమ్ము నిందించినను, మఱియేమి చేసినను సరియే! అప్రదేశము మాకుఁ బురాతనపుణ్యక్షేత్రము. అందుఁ బ్రతివత్సరమును గ్రొత్తమట్టి పడఁగలయు నని గాని, వ్యవసాయకులు దున్ని కృషిచేయఁగలరని గాని మా యుద్దేశము కాదు. అది మాకు నష్టమైనను సరియే. అది మావాసస్థానము గాని వ్యవసాయక్షేత్రము కాదు. అందుచేత నీ మీవ్యవసాయకబాంధవులు మాతాతకట్టడములను గతించినవని నిందించినను మాకవమానముగఁ దోఁచుటలేదు!" అనెను.

విన—అనఁగా, నీ వీ వివాహమునకు సమ్మతింపవన్న మాటయేనా?

గోరా—ఔను! నిశ్చయముగా!

విన—తరువాత?

గోరా—తరువాత నిన్నుఁగూడఁ ద్యజించుటయే!

విన—నేను ముసల్మానుఁడ నైనను నీకు మిత్రుఁడను గాఁగూడదా?

గోరా—ఆమాట వేఱు. చెట్టునుండి కొమ్మ విరిగి వేఱైపోయినతరువాత చెట్టెయినను దానిని మరల నప్పటివలెఁ గైకొనఁగలదా? కాని వెలుపలనుండి తీఁగ యొకటి వచ్చినచోఁ జెట్టు దాని కాశ్రయమీయఁగలదు. అది యొకవేళ గాలివానకుఁ జెదరిపోయినను మరల నల్లుకొనుట కవకాశముండును. తనవాఁడు వెలివాఁడైనప్పుడు సంపూర్ణముగ వానినిఁ ద్యజింపవలసినదే గాని గత్యంతరములేదు. అందుచేతనే యిన్ని విధినిషేధములు ఇన్ని ప్రాయశ్చిత్తములు!

విన—అందుచేతనే త్యాగకారణమును, త్యాగవిధానమును నింతచులకనగా నెంచుట యుచితముకాదు. చేయి విరిగినచో మరల నతుకుకొనదుగావుననే యాదిమాటి మాటికని విరుగుటలేదు. దానియెముక చాల గట్టిదై యుండును. ఇంచుకత్యాగముతోఁ బినంతనే విచ్ఛేదముం గల్పించు సమాజము మానవుని స్వచ్ఛందకర్మములను, రాకపోకలనుగూడ నియమించుటయెంతకష్టముగనుండునో యాలోచించి చూచితివా?

గోరా—ఆ భారము నామీఁద లేదు. సమాజమే యాసకలవిషయములను సంపూర్ణముగ నాలోచించుచున్నది. అందుకొఱకు నేను సాక్ష్యమును వహించుట లేదు. వేలకొలఁది యేండ్లనుండి యదియే బాగుగ నాలోచించుచు సార్థకత్వము చేసికొనుచుండెనని నావిశ్వాసము. ఈభూమండలము సూర్యునిచుట్టు ననుకూలముగనే తిరుగుచున్నదో, ప్రతికూలముగనే తిరుగుచున్నదో యాలోచింపకుండఁగనే నేనిందు నిర్భయముగా నున్నాను. అట్లే సమాజమునందుఁగూడ నున్నాను.

విన—గోరా! ఇన్నాళ్ళకును నేనుగూడ నిట్టిమాటలు చెప్పినవాఁడనే. నేను మరల నీమాటలచేతనే బాధింపఁబడుదునని యెవ్వ రెఱుఁగుదురు! ఊరక వాగినందుకు నాకిప్పుడు తగినశాస్తి యైనదని తెలిసికొంటిని. కాని వాదముతోఁ బని లేదు. నాకిప్పుడొక సంగతి స్పష్టముగాఁ దెలియుచున్నది. అది నాకిదివఱకుఁ దెలియదు. మానవజీవితము మహానదివలె స్వవేగరూపముతోఁ దా నెన్నఁడును బ్రవహింపని నూతనమార్గముల ననుసరించి పోవుచుండు ననియు, దానిగతి వైచిత్ర్యమును, దాని యభావనీయపరిణామమునుగూడ భగవదుద్దేశములే యనియు, దానిని నిర్బంధింపఁ జూచుట యసంగతమనియు, నాకిప్పుడు బోధపడినది. నాకీసంగతి ప్రత్యక్షముగా ననుభవమైనప్పుడింక వాదముతోఁ బని యేమున్నది?

గోరా—పతంగమగ్నిముఖమునఁ బడఁబోవునప్పుడు సరిగ నిట్లే నీవలెనే వితర్కించుకొనును. కావు, నేనిఁక నీకు బోధించుటకు వృథాశ్రమ పడఁదలఁచుకొనలేదు!

వినయుఁడు చటాలునలేచి "మంచిది. ఇఁక నేను పోయెదను. ఒకసారి యమ్మను జూచివచ్చెదను!" అని వెడలిపోయెను. అప్పుడు మహిముఁడు మెల్లగా నాగదిలో బ్రవేశించి తాంబూలమును నములుచునే "అనుకూలపడినదా? పడదు! వ్యతిరేకలక్షణములు తోఁచుచున్నవని నే నిదివఱకే చెప్పితిని గాదా? నీవు వినిపించుకొనలేదు. అప్పుడట్లో శశిముఖి నాతనికిఁ బెండ్లిచేసినచో నింతగొడవ లేకపోవును. కాని యీ యాలోచన యెవ్వరికున్నది? ఇప్పుడు వినయుఁడు మీసమాజమునుండి విడిపోవుట సామాన్యలోపమా?" అనియెను. గోరా యేమియుం మాటాడకుండుటంగాంచి మహిముఁడు మరలఁ "వినయుని కిఁక మరలించుట కుపాయము లేదుగద! అతనితో శశి

మఖింద వివాహముంగూర్చి చాలగొడవ యైపోయినది. ఏమైన నేమి? ఇంక నీ పెండ్లి కాలస్యము చేయఁగూడదు మనసమాజమునకు దయలేదు. ఏమాత్రము తప్పుచేసినను మనల నది గంగలోనో, కన్నీటిలోనో ముంచివేయును. కావున నిప్పు డొకవరుని— నీవు భయపడనక్కఱలేదు. పెండ్లికూతుభారము నీపైఁ బెట్టలేదు! నేనే స్థిరపరచుకొన్నాను!" అనియెను.

గోరా—వరుఁ డెవ్వరు ?

మహి—మా యవినాశుఁడే.

గోరా—అతఁ డంగీకరించెనా ?

మహి—ఇంకనాతఁ- కాని యాతఁడు వినయునివంటివాఁడు కాఁడు. నీసంఘమునందు నీకు నిజముగా భక్తుఁడైనవాఁ డవినాశుఁ డొక్కఁడే. నీకుటుంబముతో సంబంధమను మాట వినినంతనే యాతఁ డది తనకెంతో గౌరవముగను, భాగ్యముగను దలంచి పొంగిపోయినాఁడు! కట్నముమాట యడుగఁగా నాతఁడు కర్ణములను మూసికొని యీమాట నాయొద్దఁ జెప్పఁగలదన్నాఁడు. నీతండ్రితో నాలోచించెద నని చెప్పి నేనింతకు ముద్దరఁగూడఁ బోయి యడిగితిని. ఆతండ్రికిని బిడ్డకు నెంతయో భేదమున్నది. కట్నముమాట నాతఁడు చెవులు మూసికొనలేదు. కాని యాతనిమాటలకు నేనే యుల్లు నే చురలవిచ్చెనే! ఎట్లయినను బిల్లవాఁడు పితృభక్తుఁడు. అతనికిఁ దండ్రియే దేవుఁడు! అట్టివాని మధ్యస్థముగా నుంచుట మంచిది కాదు. ఈసారి కంపెనీ కాగితముల నమ్ముకొనక తప్పదు. ఏమైనను నీవుకూడ నవినాశున కొకటిరెండుమాటలు చెప్పవలెను! నీ వుత్సాహపెట్టినచో—

గోరా—అంతమాత్రమునఁ గట్నము తగ్గదు.

మహి—అతఁడు తండ్రిమాట కడుగు దాటఁడని నే నెఱుఁగుదును!

గోరా—సంబంధము స్థిరపడినదా ?

మహి—ఆ !

గోరా—ప్రధానముహూర్త మెప్పుడు ?

మహి—మాఘపూర్ణిమనాఁడే! ఎన్నాళ్ళో లేదు. వరునితండ్రి రత్నభూషణములు వలదనియు, బంగారునగలే కావలయు ననియుఁ గోరినాఁడు. తక్కువమూల్యముతో నెక్కువతూనిక వచ్చునట్లుగా వస్తువులను జేయుటకై నే నిదివఱకే కంసాలితో నాలోచించి సిద్ధముచేసి యుంచితిని.

గోరా—కాని యింతతొందరపడు టేల? ఈలోపుగా నవినాశుఁడుకూడ బ్రహ్మసమాజమునఁ జేరునేమో యని భయమా ?

గోరామాటలలో హరిమోహినికిష్టమగు విషయము లేనియు లేకుండెను. ఆమెకు భక్తిం గూర్చినమాటలే కావలయును. గోరా మాటలలో భక్తిభావ మంతసరళముగను, స్వరసముగను గాన్పింపదు. ఎదుటనున్న ప్రతిపక్షపక్షమును ఖండించుచున్నట్లుగా నాతఁడెప్పుడును మాటాడును. తెలియనివారికిఁ దెలుపుటయే యాతనికోరిక. గోరా [illegible]కము కలుగు విషయమునందు హరిమోహినికింత యిష్టము లేదు. బ్రహ్మసమాజమువారు హిందూసమాజమునకు వేఱుపడియుండుటచే నామెకట్టిక్షోభమును లేదు. తనప్రియజనముతోఁ దనకు విచ్ఛేదము లేకుండుటయే చాలునని యామె నిశ్చింతయై యుండెను. అందుచే గోరామాటలామెకు రసవంతములుగాఁ దోఁచుటలేదు. గోరా సుచరితహృదయము నాకర్షించుచుండెనని సంశయము తోఁచినప్పటినుండియు నామె కాతనియందు మఱింత యసహ్యముగా నుండెను. సుచరిత యార్థికవిషయమునను, మతవిశ్వాసమునను స్వతంత్రయై యుండుటచే హరిమోహిని యామెను వశపఱచుకొనఁజాలకుండెను. ఈశేషకాలమునందామెకు సుచరితయే యేకమాత్రావలంబనమైయుండెను. అందుచే సుచరిత పరేశునకుఁ దక్క మఱియెవ్వరియధికారమునకైనను లోఁబడియుండుట హరిమోహినికిఁ గష్టముగాఁ దోఁచుచుండెను. గోరా కృత్రిమస్వభావుఁడనియు సుచరితహృదయము నెట్లయిన నాకర్షించుటయే యాతనిప్రధానోద్దేశమనియు నామె యనుకొనెను. సుచరిత యైశ్వర్యమునందుఁగూడ నాతఁడు లుబ్ధుడైయుండెనని హరిమోహిని యనుమానించెను. గోరా తనకుఁ బ్రధానశత్రుఁడని స్థిరపఱచుకొని యామె యాతని నెదిరింపవలయు నని సంసిద్ధమైయుండెను.

నేఁడు గోరా వచ్చెద నని చెప్పియుండలేదు. గోరాస్వభావమున సంశయమనునది చాలతక్కువ! ఆతఁడు పని చేయుటయే కాని యూరక యాలోచింపఁడు! హరిమోహిని పూజ చేసికొనుచుండఁగా గోరా వచ్చెను. అప్పటికి సుచరిత గదిలోని బల్లపైనున్న పుస్తకములను సవరించుచుండఁగా సతీశుఁడు వచ్చి గౌరమోహనబాబు వచ్చెనని చెప్పెను. ఇంతలో గోరాయును వచ్చెను. ఆతఁడు వచ్చునని స్థిరపఱచుకొన్నదానివలెనే సుచరిత యప్పుడెట్టియాశ్చర్యమునుఁ బ్రకటింపలేదు. గోరా కుర్చీపైఁ గూర్చుండి "తుదకు వినయుఁడు మమ్ములను విడిచి పోయినాఁడు!" అనియెను. సుచరిత మృదుస్వరముతో "విడుచుటయేమి? ఆతఁడు బ్రాహ్మదీక్షను గ్రహింపలేదే! అనియెను. గోరా తీవ్రముగా "ఆతఁడు బ్రహ్మసమాజమునుండి వేఱుపడినచో మాకింతకంటె దగ్గఱగనే యుండును. కాని యాతఁడింకను హిందూసమాజమును జంకఁబెట్టుకొనుట యన్నిటికంటెను గష్టముగా నున్నది. ఆతఁడు హిందూసమాజమును సంపూర్ణముగఁ ద్యజించినచోఁ జాల బాగుగ నుండును!" అనియెను. సుచరిత కామాటలు కష్టముగఁ దోఁచుటయు "సమాజమువీడి యింతస్పష్టముగఁ బ్రా

చెద కేమి? దానియందింతటివిశ్వాసమును స్థాపించుట మీస్వభావమేనా? కాక మీమనసునం దుత్సాహము కల్పించుకొనుటకై యిట్లు చేయుచున్నారా?" అని రెను.

గోరా—ఇట్టియవస్థలో నదియును స్వభావమే. కాలిక్రింది పట్టుజాఱుచున్నప్పు డడుగులను గట్టిగ నానుకొని నడువవలయును. అందుచేతనే నలువంకలఁ బ్రతికూలముగ నున్న యీసమయమున మాటలయందును, క్రియలయందునుఁ దీవ్రత్వము చూపవలసివచ్చుచున్నది. ఇది యస్వభావము కాదు.

సుచ—ఈవిరుద్ధభావ మంతయు నన్యాయమే యనియు, ననావశ్యకమే మనియు మీ రేల భావింపవలయును? సమాజము కాలగతిని నిరోధించినచోఁ దానే బాధపడవలసివచ్చును.

గోరా—జలతరంగములవంటి కాలతరంగములవలన సమాజకూలములకు భంగము కలుగవచ్చును. కాని యాభంగము నంగీకరించుటయే కూలములకుఁ గర్తవ్య మని మాత్రము నేనొప్పుకొనను. నేను సమాజశుభాశుభముల నెంతమాత్రమును యోచించుట లేదని నీవనుకొనవలదు. అది యిక్కాలపుబాలురకుఁ గూడ సులభమైనపనియే! కాని ప్రతివిషయమును శ్రద్ధతో సమగ్రముగ గ్రహించుటమాత్రము చాలఁగష్టము!

సుచ—శ్రద్ధవలన మనము కేవలమును సత్యమునే గ్రహింతుమా! దానివలన నవిచారముచే నసత్యమునుగూడ గ్రహింపవచ్చును. ఒక్కమాట యడుగుచున్నాను. మనము విగ్రహమును సత్యమని విశ్వసింపవచ్చునా? మీరట్లు విశ్వసింతురా?

గోరా—యించుక సేపూరకుండి "నేను నీకు నిజము చెప్పుచున్నాను నేను మొదటినుండియును హిందూసంస్కారములు సత్యములనియే విశ్వసించియున్నాను. వీనికి విరుద్ధములగు నైరోపీయసంస్కారముల ననుసరించి వాదించువాదములకు నేను బదులు చెప్పఁదలచుకొనలేదు. నాకు మతవిషయములం దంతగా ననుభవము లేకపోయినను, సాకారపూజయు విగ్రహారాధనము నొక్కటే యనియు, మూర్తిపూజవలన భక్తిభావమునకుఁ జరమపరిణామము కలుగదనియుఁ జెప్పుమాటల ననాలోచితముగ ననుకరింపఁజాలను. శిల్పసాహిత్యవిజ్ఞానేతిహాసములయందు మానవునికల్పనావృత్తికి స్థానమున్నప్పు డొక్కమతమునందుమాత్రము లేదనుట నాకు సమ్మతముకాదు. ధర్మమధ్యమునందే మానవుని సమస్తభావములును సంపూర్ణముగఁ బ్రకాశించుచున్నవి. మూర్తిపూజామూలమున భక్తిజ్ఞానములతో భావము నైక్యముగఁ జేయఁ బ్రయత్నించుటచేతనే మనదేశమునందలి మతము పరదేశమతములకంటె సంపూర్ణముగ సత్యమైనదని బోధపడుటలేదా?" అనియెను.

సుచ—రోమునందును, గ్రీసునందునుగూడ మూర్తిపూజ యున్నది!

గోరా — ఉన్నది. కాని యచ్చటి మూర్తిపూజయందు మానవభావము సౌందర్యబోధము నాశ్రయించినట్లు భక్తిజ్ఞానముల నాశ్రయించుట లేదు; మనదేశమునందో, భక్తిజ్ఞానములతో గభీరతరముగ మిశ్రితమై యుండును. మనరాధాకృష్ణులైనను, గౌరీశంకరులైనను, కేవల మైతిహాసికపూజావస్తువులే కాదు! అమూర్తులయందు మానవసంబంధమగు సనాతనతత్త్వజ్ఞానము నిబిడీకృతమై యున్నది. అందుచేతనే రామప్రసాదునిభక్తియుఁ జైతన్యునిభక్తియు నిట్టిమూర్తులనవలంబనముగఁ జేసికొనియే సంపూర్ణముగఁ బ్రకాశించెను. భక్తిసంబంధమగు నింతటిసంపూర్ణప్రకాశము గ్రీసురోమాచరిత్రములం దెచ్చట నున్నది ?

సుచ — కాలగతిని నిట్టి మతమును సమాజమునుగూడఁ బరివర్తనముం గాంచవలయు నని మీ రంగీకరింపరా ?

గోరా — అంగీకరింపకేమి ? కాని యట్టిపరివర్తనము పిచ్చితనముగా నుండఁగూడదు. మానవపరివర్తనము మానవపద్ధతి ననుసరించియే ఘటిల్లవలయును. పిల్లవాఁడు పెద్దవాఁడై క్రమముగ ముసలివాఁడు కావచ్చును గాని, యాకస్మికముగఁ బిల్లియోఁ గుక్కయోఁ గాఁగూడదు! భారతపరిణామము భారతపద్ధతినే యగుట నాయుద్దేశము. అంతేకాని యాకస్మికముగ నాంగ్లేయపద్ధతి ననుసరించినచో నంతయు నిరర్థకమై పోవును. ఏదేశమునందలిశక్తిసంపద లాదేశమధ్యమునందే యుండు నని నీకు బోధించుటకే నేను నాజీవితము నంతయు వినియోగించుచున్నాను. నామాట బోధపడినదా ?

సుచ — బోధపడినది. కాని యీసంగతు లన్నియు నేనిదివఱ కెన్నఁడును విని యుండలేదు; భావింపను లేదు. క్రొత్తచోటఁ బడినప్పుడు తెలిసినవస్తువునుగూడ గ్రహించుట కించుక యాలస్యము పట్టును! ఇప్పుడు నాయవస్థ యట్లున్నది. నేనాఁడుదానను గావున నాకంతటినూత్నగ్రహణశక్తి లేదనుకొనియెదను.

గోరా — ఎన్నఁటికి నట్లు కాదు. నేను జాలమందిపురుషులతో నీవిషయములను ప్రస్తావించితిని. తెలిసినట్లుగా నూరకుండుటయే కాని నీవలె ననుభవముచే గ్రహించినవా రందొక్కరును నాకగపడలేదు. అంతటిగంభీరగ్రహణశక్తి నీలో నున్నదని నిన్నుఁ జూచినప్పుడే నేను గ్రహించితిని. అందుచేతనే నేను నాచిరకాలోద్దేశము లన్నిటితోడను నీచెంతకు వచ్చితిని. నీయెదుట నాజీవితమును బ్రత్యక్షముగఁ జేయుటకు నాకెట్టిసంశయమును లేదు.

సుచ — మీ రిట్లు చెప్పుటచే నామనసు వ్యాకులపడుచున్నది. నేను మీ రనుకొన్నంతదాన నగుదునో కాదో, నాకెట్టిశక్తి యున్నదో, నాభావావేగమునం దెట్టి ప్రకాశమున్నదో నేనించుకంతయు నెఱుంగను. మీరు నాయందుఁగలగౌరవవిశ్వాస

ములు కేవలము భ్రాంతిమూలకము లని మీరు గ్రహింపఁగల దిన మెప్పుడైన వచ్చునేమో యని నేను భయపడుచున్నాను.

గోరా—ఇది యెన్నటికిని భ్రాంతి కాదు! నీలో నెట్టి శక్తి యున్నదో నేనే నీకుఁ జూపించెదను. నీ వెంతమాత్రమును సందేహపడవలదు. నీయోగ్యతను బ్రకటించుభారము నాపైనున్నది. నాయందే నీ వాధారపడి యుండుము!

సుచరిత యేమియు మాటాడలేదు. కాని యాధారపడుట కట్టి సంశయమును లేదని నిశ్శబ్దతచేతనే తెలిసిపోయెను. గోరాకూడ నూరకుండెను. అయింటఁ జాలసేపటివఱకు నిశ్శబ్దముగా నుండెను. వెలుపలవీథిలో జలతారుగిన్నె లమ్ముకొనువాఁడు కేకలువైచుచు ద్వారముచెంతనుండి పోవుచుండెను. హరిమోహిని పూజ ముగించుకొని వంటయింటికిఁ బోవుచు సుచరితగది నిశ్శబ్దముగా నుండుటచే నందెవ్వరును లేరనుకొనియెను. కాని యాకస్మికముగ నిటికంటఁ జూచినంతనే గోరాసుచరితలు మౌనముతోఁ గూర్చుండి యున్నట్లామెకగపడియెను. తోడనే యామెక్రోధానలము బ్రహ్మరంధ్రపర్యంతమును విద్యుద్వేగముతో జ్వలించిపోయెను. ఆమె యెట్లో దాని నడఁచుకొని ద్వారముకడ నిలిచి "రాధారాణీ!" అనిపిలిచెను.

సుచరిత లేచి తల్లిచెంతకు వచ్చెను. అప్పుడు హరిమోహిని మృదుస్వరముతో "నేఁడే కాదశి; నాయొడలు బాగుగ లేదు. నీవు పోయి వంటచేయుము! అంతవఱకు నేను గోరాబాబుచెంత నుండెదను!" అనియెను. సుచరిత యామెభావమును గ్రహించి యుద్విగ్నయై వంటయింటికిఁ బోయెను. హరిమోహిని గదిలోనికి వచ్చినంతనే గోరా యామెకు నమస్కరించెను. ఆమె కొంతసేపటివఱకు నేమియు మాటాడక కూర్చుండి పిమ్మట "బాబా! నీవు బ్రహ్మసామాజికుఁడవు కావు గదా!" అనియెను.

గోరా—కాను!

హరి—హిందూమతమును నీవు విశ్వసింతువా?

గోరా—విశ్వసింపకేమి?

హరి—అట్లయినచో నీవ్యాపార మంతయు నేమి?

హరిమోహిని యభియోగమును గోరా యించుకంతయు గ్రహింపఁజాలక యామె మొగమువంక నూరక చూచుచుఁ గూర్చుండెను. అప్పుడు హరిమోహిని "రాధారాణి వయోవతి; నీవామె కాత్మీయుఁడవు కావు. ఆమెతో నీకింతగొడవ యేల? ఆమె యాఁడుది; ఇంటిపనులను జేసికొనవలసినది; ఆమె కీమాటలతోఁ బ్రయోజన మేమున్నది! ఇవి యామెకుఁ బరధ్యానము కలిగించును. నీవు జ్ఞానవంతుఁడవు; లోకు లందఱును నిన్నుఁ బ్రశంసించుచున్నారు! ఇట్టివ్యాపారము నిన్నుఁ

దానికి గృహధర్మమే యావశ్యకమైనది!" అనియెను—సాధారణముగా గోరాయుద్దే శము స్త్రీవే కాని యాతఁడెన్నఁడును దనయుద్దేశమును సుచరితయొద్దఁ బ్రకటింపలేదు. సుచరిత గృహిణియై యంతఃపురమునందుండి గృహకార్యములు నిర్వహించు నను భావనయే యాతనికిఁ గలుగలేదు! ఆమె యెప్పుడును నిర్లిప్తయుండు నని యాతని యుద్దేశము.

గోరా—ఈమె పెండ్లిగూర్చి మీరేమైన నాలోచించుచున్నారా?

హరి—నేనాలోచింపకున్నచో నీమె కింకెవ్వ రున్నారు?

గోరా—ఈ పెండ్లి హిందూసమాజమునందే జరుగునా?

హరి—అదియే ప్రయత్నము! ఏమియు గొడవ పుట్టక సరిగా నున్నచో నీమె కన్నియును స్థిరపఱిచెదను. నేనంతయును నిశ్చయించుకొనియే యున్నాను. ఇంతవఱకు నీమె నడవడినిబట్టి యేమిచేయుటకును సాహసించుటలేదు. రెండుదినములనుండి యీమె మనసు స్థిరముగా నుండుటం గాంచి నేను ధైర్యముతో నున్నాను!

ఈవిషయమున నిఁకఁ బ్రశ్నించుట మంచిది కాదని యనుకొనియును గోరా యూరకుండఁజాలక "వరుఁడెవ్వరైన నాలోచనయందున్నాఁడా?" అని ప్రశ్నించెను. హరిమోహిని "ఆ! వరుఁడు చాలమంచివాఁడు! నాచిన్నమఱఁది కైలాసుఁడు. ఆతని ప్రథమభార్య మరణించినది తగినపెద్దపిల్ల దొరకక యింతవఱకు నున్నాఁడు. కాకున్నచో నట్టివరుఁడు దొరకునా? అతఁడు రాధారాణికిఁ దగినవాఁడు!" అని చెప్పెను.

మనసులో బాధ కలుగుచున్నకొలఁదియు గోరా కైలాసునిగూర్చి ప్రశ్నించుచుండెను—హరిమోహినిమఱఁదులలోఁ గైలాసుఁడొక్కఁడే బాగుగఁ జదివినవాఁడు ఎంతవఱకుఁ జదివెనో యామెయే చెప్పలేకపోయెను. కుటుంబములో నాతఁడే చదివినవాఁడని ప్రఖ్యాతియున్నది. ఆతఁడు గ్రామమునందలి పోస్టుమాస్టరుపై రిపోర్టు చేసెను. దానిపై నెవ్వఁడో గొప్పయధికారి స్వయముగా వచ్చి విచారించిపోయెను. ఇందువలన గ్రామస్థులందఱును గైలాసుని ప్రజ్ఞను మెచ్చుకొనిరి. ఇంతవాఁడైనను నాతఁడు హిందూమతాచారములందు నిష్ఠకలిగి యుండెను. కైలాసునిచరిత్ర మిది-గోరా యంతయును విని హరిమోహినికి నమస్కరించి మఱేమియు మాటాడకుండ బయలుదేఱెను. ఆతఁడు మేడమెట్లను దిగి వచ్చుచుండఁగా వంటయింటిలోఁ బని చేసికొనుచున్న సుచరిత యాతనిపదశబ్దమును విని ద్వారముచెంతకువచ్చి నిలువఁబడియెను. గోరా యేవంకను జూడక వెడలిపోయెను. సుచరిత యొక్కనిట్టూర్పు విడిచి మరలఁ దనపనిలోఁ బ్రవేశించెను.

గోరా సందుచివరకుఁ బోవునప్పటికి హారానుఁడాతని కగపడి నవ్వుచు "ఉదయముననే బయలుదేఱితి రే!" అనియెను. గోరా మాటాడలేదు. హారానుఁడు మరల నవ్వుచు "మీ రక్కడకే పోయితి రనుకొందును! సుచరిత యింట నున్నదా?"

అని యడిగెను. "ఉన్నది" అనిచెప్పి గోరా శీఘ్రముగ వెడలిపోయెను. హారానుఁడు సుచరితయింటికిఁ బోయి వంటయింటిలోనున్న సుచరితం గాంచెను. ఆమెకిఁక దప్పించుకొనుట కవకాశము లేకపోయెను; సమీపమున హరిమోహినియైనను లేదు!

హారా—గోరాబాబు నాకిప్పుడే యగపడినాఁడు. అతఁ డింతవఱకు నిచ్చటనే యుండె ననుకొందును!

సుచరిత బదులుచెప్పక పనిలోఁ బ్రవేశించి యూపిరితిరుగనంతపనియున్నట్లు నటించెను. కాని, హారానుఁడు విడువలేదు. అతఁడు వంటయింటికెదుట నున్నవసరలో నిలువఁబడి మాటలాడుట కారంభించెను. హరిమోహిని మెట్లపైనిలువఁబడి యొకటిరెండు పారులు దగ్గెను. ఏమియును లాభములేకపోయెను. హరిమోహిని హారానునియెదుటికే వచ్చియుండును. కాని యొకసారి యాతని యెదుటఁ బడినచో నాతనిదుర్దమోత్సాహకృత్యములనుండి తానుగాని సుచరితగాని యాత్మరక్షణము చేసికొనుట కవకాశము లేకుండఁబోయెను. అందుచేతనే హరిమోహిని హారానునినీడ చూచినంతమాత్రముననే మేలిముసుఁగు సవరించుకొని తప్పించుకొని పోవుచుండును. అట్లామె వధూవయసునందుఁగూడఁ జేసి యుండదు!

హారా—సుచరితా! మీ రేత్రోవపట్టితిరో, యెక్కడకుఁ జేరితిరో చెప్పఁగలవా? లలిత వినయునితో హిందూవివాహము చేసికొనునని నీవు వింటివనుకొందును! దీనికి బాధ్యులెవ్వరో నీవెఱుఁగుదువా?

సుచరిత మాటాడలేదు. హారానుఁడు నతస్వరముతో గంభీరముగా "నీవే బాధ్యురాలవు!" అనియెను—ఇంతటి ఘోరనిందారోపణము సుచరిత సహింపఁజాలదని యాతఁడనుకొనియెను. కాని నిర్లక్ష్యముగనుండి మాటాడకుండఁ దనపని చేసికొనుచుండుటయు నాతఁడు తర్జనితో నామెను బెదరించుచు "సుచరితా! నీవే బాధ్యరాలవని నేను మరలఁ జెప్పుచున్నాను. ఈవిషయమున నాయపరాధమేమియు లేదని నీవు గుండెలపైఁ జేయుంచి చెప్పఁగలవా?" అనియెను. సుచరిత నిశ్శబ్దముగనే కూరగిన్నెలోఁ దైలమును బోసెను. అది చిటచిట ధ్వనించుచుండెను. హారానుఁడు మరల 'నీవే గోరావినయులను నీయింటికిఁ దెచ్చి నీసమాజమిత్రులకంటె నధికముగ గౌరవించితివి. దాని ఫలమేమైనదో చూచితివా? నేను మొదటినుండియుఁ జెప్పుటలేదా? తుద కేమైనది? ఇప్పుడు లలిత నెవ్వరు దిద్దఁగలరు? యీయాపదయంతయు లలితతోఁ గొట్టుకొనిపోయినదని నీవూహించుకొనుచున్నావు అట్లు కాదు. నేను నిన్ను హెచ్చరించుటకే వచ్చితిని. ఇప్పు డిఁక నీవంతు వచ్చినది. నీవిప్పుడు లలితదుర్ఘటనమునుగూర్చి విచారించుచుంటివి గాని నీయధఃపతనమునకు సమయము సమీపించుచున్న దని యించుకమాత్రమును బరితపించుటలేదు. కాని సుచరితా! ఇప్పుడైననుఁ

దప్పించుకొనుట కవకాశ మున్నది. మన మొకప్పు డెంతటియాశలతో మనలను మేల గించుకొంటిమో, మనజీవితముల నెంతటి యుజ్జ్వలములుగాఁ జేసికొనఁదలంచితిమో మనయెదుట భవిష్యద్బ్రాహ్మసమాజ మెంతయుదారభావముతో నగపడియెనో, మన కెన్నెన్నిసంకల్పములు కలిగెనో, మన మెంతటిపాథేయమును బ్రతిదినమును సంగ్రహించితిమో యొక్కసారి భావించుకొనుము! అవియన్నియు నశించిపోయె ననుకొంటివా? లేదు. మనయాశాక్షేత్ర మింకను సిద్ధముగనే యున్నది. ఒకసారి తిరిగి చూడుము! ఒకసారి వెనుకకు రమ్ము!" అనియెను.

అప్పుడు సుచరిత తప్తతైలమునఁ గూరముక్కలను వైచి గణగణ గరిటెతోఁ దిప్పుచుండెను. హారానుఁడు ప్రత్యుత్తరమునకై నిశ్శబ్దముగ వేచియున్నప్పుడు సుచరిత పొయిమీఁదినుండి మూకుడు దింపి మొగము త్రిప్పి దృఢస్వరముతో "నేను హైందవిని!" అనియెను. హారానుఁ డాకస్మికముగ హతబుద్ధియై "నీవు హైందవివా!" అనియెను. సుచరిత యౌనని చెప్పి మఱల వంటపని చూచుకొనుచుండెను. హారానుఁడు కొంతసేపటికిఁ గుదురుపడి తీవ్రస్వరముతో "అట్లయినచో గౌరమోహనబాబు నీకుఁ బ్రాతస్సాయంకాలమందు మతబోధ చేయుచున్నాఁ డనుకొందును!" అనియెను. సుచరిత మొగము త్రిప్పకుండఁగనే "ఔను. నే నాతనియొద్ద దీక్ష గైకొంటిని. ఆతఁడు నాగురువు!" అనియెను. ఇన్నాళ్ళవఱకును హారానుఁడు తానే సుచరితగురువు ననుకొనుచుండెను. ఇప్పుడు సుచరిత గౌరాను బ్రేమించుట యాతని కంతకష్టముగా లేదు! కాని తనగురుత్వాధికారము గౌరాకిచ్చినట్లు సుచరిత చెప్పిన మాట యాతనికి శూలపుఁబోటువలె నాటెను.

హారా—మీ గురువెంతో గొప్పవాఁడు కావున్నచో నిన్ను హిందూసమాజమునఁ జేర్పఁగలఁడా?

సుచ—నాకు సమాజవిషయ మేమియుఁ దెలియదు. నాకుఁ దెలిసినది నేను హిందువు ననుమాత్రమే!

హారా—ఇంతకాలమువఱకును బొట్టు లేకుండుటచే హిందూసమాజమునందు జాతిభ్రష్టత కలుగు ననుమాట నీకుఁ దెలియదు!

సుచ—మీ రావిషయమున వృథావిచారము నందవలదు. ఎట్లయినను నేను హైందవినే!

హారా—నీపూర్వగురుఁ డగు పరేశునియుపదేశము లన్నియును నీనూతనగురుఁ డగు గౌరాపాదములచెంత విసర్జించితివా?

సుచ—నాధర్మ మేమో దేవుఁడే యెఱుఁగును. నే నావిషయమున నెవ్వరితోను నాలోచింపఁ దలఁచుకొనలేదు. కాని నేను హైందవి నని మీరు తెలిసికొనుఁడు.

హారా—నీవెంతటి హైందవివైనను నీకెట్టిలాభమును లేదని చెప్పుచున్నాను మాగోరాబాబు వినయునివంటివాఁడే యని తలంపకుము! నేను హైందవి నని నీవెంత గొంతుచించుకొనినను నాతఁడు నిన్ను గ్రహించు నని యాశ పెట్టుకొనవలదు! అతఁడు గురుత్వమును జూపవచ్చునుగాని నిన్నింటికిఁ గొనిపోయి గృహకృత్యములను జేయించు ననిమాత్రము నీవు కలనైన ననుకొనవలదు !

సుచరిత వంటపని మానివైచి విద్యుద్వేగముతోఁ దిరిగి నిలువఁబడి "ఈగొడవ యంతయు మీకేల?" అనియెను. అప్పుడు హారానుఁడు "గోరా నిన్నున్నటికిని పెండ్లి యాడఁడని చెప్పుచున్నాను !" అనియెను. సుచరిత కన్ను లెఱ్ఱఁజేసి "పెండ్లియా ? అతఁడు గురువని నేను మీతోఁ జెప్పలేదా?" అనియెను. హారానుఁడు "ఔను ! చెప్పితివి ! నీవు చెప్పనిమాటనుగూడ నేను గ్రహించితిని" అనియెను.

సుచ—మీరు నన్నవమానింపక యిటనుండి వెడలిపొండు! నే నిప్పుడే చెప్పుచున్నాను ! ఇఁక మీరు నాయెదుటఁ బడవలదు !

హారా—ఎదుటఁబడుట యెట్లు ? ఇప్పుడు నీవవరోధకన్యవు! హైందవరమణివి ! అసూర్యంపశ్యవు ! పరేశబాబుపాప మిప్పటికిఁ బండినది ! ఈముప్పు గాలమున నం దాతఁడు కర్మఫలము ననుభవించుఁగాక ! సెలవు !—

సుచరిత గుభాలున వంటయింటితలుపు మూసివైచి క్రిందఁగూర్చుండి పైటచెఱఁగు మొగమున కడ్డము చేసికొని పొంగిపొరలుచున్న దుఃఖావేగము నతికష్టముతో నడంచుకొనుచుండెను. హారానుఁడు మ్లానవదనముతో వెడలిపోయెను. హరిమోహిని వారిమాటల నన్నిటిని వినియే యుండెను. సుచరిత యిట్లు చెప్పు నని యామె యనుకొనలేదు. ఆమె యానందవిస్ఫారితనయనయై "కాదామరి ! నాగోపీవల్లభుని పూజాఫల మూరకపోవునా ?" అని భావించుకొని తత్క్షణమే పూజాగృహమునకుఁ బోయి గోపాలమూర్తికిఁ బ్రణామముచేసి నేఁటినుండి భోగము విశేషముగఁజేసి నివేదించెద నని మ్రొక్కుకొనియెను. ఇంతకాలమునుండి శోకసాంత్వనస్వరూపముతో నామె యారాధనము శాంతమై యుండెను. ఇప్పుడో స్వార్థసాధనరూపముండాల్చి యత్యుగ్రమును, నుత్తప్తమును, క్షుధాతురమునై పరిణమించెను.

## ౬౪

సుచరితతో మాటాడినవిధముగా గోరా యెవ్వరితోడను మాటాడియుండలేదు అతఁ డింతవఱకు నితరులచెంతఁ దనలోనున్న వాక్యములను, మతమును, నుపదేశములను మాత్రమే వెలువరించుచుండెను. ఇప్పుడు సుచరితయొద్ద నాతఁడు తనలో నుండి తన్నే బయటఁ బెట్టుకొనియెను. ఈయాత్మప్రకాశసంబంధ మగు నానందమున నాతనిమతసంకల్పములు కేవలశక్తిమంతము లగుటయే కాక రసపూర్ణములై పోయెను.

అతనిజీవితము నొక సౌందర్యశ్రీ యావరించినట్లును, నాతనితపస్సున దేవత లాకస్మికముగ నమృతవర్షమును గురియించినట్లు నుండెను.

ఈయానందోద్వేగముచేతనే గోరా గొన్నాళ్ళనుండి ప్రతిదినము నవాలోచితముగా సుచరితయింటికి వచ్చుచుండెను. కాని హరిమోహినిమాటవలనఁ దానొకప్పుడు వినయుని యనురూపముగ్ధత్వమునకై నిందించి పరిహసించినసంగతి యాకస్మికముగ గోరాకు స్మృతికివచ్చెను. ఇప్పుడు తెలియకుండఁ దనకే యట్టియవస్థ కలుగుటం గాంచి యాతఁ డదరిపడియెను. ఈప్రపంచమునందలి యెన్నియోగొప్పజాతులు నశించిపోయె ననియు, భారతజాతిమాత్రము కేవలసంయమముచే దృఢభావముతో నియమపాలము చేసికొనుచు వేలకొలఁదియేండ్లనుండి ప్రతికూలాఘాతముల కన్నిటికో సహించి యింతవఱకును దన్ను రక్షించుకొనుచున్న దనియు గోరా మాటిమాటికిని జెప్పుచుండును! ఆనియమము శిథిలము కాఁగూడ దని గోరాయుద్దేశము! భారతవర్షమునందలి సమస్తమును దారుమారై పోయినను నందలికఠిననియమసంయమాంతరమునఁ బ్రచ్ఛన్నముగా నున్నప్రాణపురుషుని శరీరమునమాత్ర మేయత్యాచారియు, నేరాజపురుషుఁడునుగూడ హస్తక్షేపము చేయఁజాలఁడని యాతఁడు చాటుచుండును. మనము పరజాతికి లొంగియున్నంతకాలము మననియమములను దృఢముగఁ గాపాడుకొనవలయు ననియు, వానిమంచిచెడ్డలను విమర్శించుసమయమిది కాదనియు నాతని యుద్దేశము! అట్టిగోరాకు హరిమోహిని తిరస్కారవచనము గజరాజున కంకుశపుఁ బోటువలె నుండెను.

గోరా యింటికిఁ బోవునప్పటికి మహిముఁడు వీథిగుమ్మమువెలుపల నొకబల్లపైఁ గూర్చుండి తంబాకు సేవించుచు, లోనికిఁ బోవుచున్నగోరాను బిలిచి గదిలోనికిఁ దీసికొనిపోయి "గోరా! కోపపడవలదని ముందే చెప్పుచున్నాను! నీవుఁగూడ వినయుని వెఱ్ఱియే పట్టినదా? ఆవైపునకుఁ దఱచుఁగ బోవుచున్నావు!" అనియెను. గోరా తెల్లవోయి "భయము లేదు" అనియెను.

మహి—ఈప్రగతి బాగుగలేదు. ఇది యూరక తిని ద్రాగి తిరిగివచ్చుట మాత్రమే యని నీవనుకొనుచున్నావు. దీనిలోపల నొకసంకెల యున్నట్లు నీమిత్రుని యవస్థంబట్టి తెలియుట లేదా?—పోయెద వేమి? ముఖ్యవిషయము చెప్పనే లేదు! వినయునకు బ్రహ్మసమాజముతో సంబంధము స్థిరపడినట్లు వినియుంటిని. ఇఁక మన కాతనితో నెట్టిసంబంధము నుండఁగూడదని ముందుగనే చెప్పుచున్నాను.

గోరా—అట్లే కావచ్చును.

మహి—కాని, అమ్మ దీనికి సమ్మతింపనిచో గందరగోళముగా నుండును. మనము గృహస్థులము; ఆఁడుబిడ్డకుఁ బెండ్లిచేయవలసియున్నది. ఇంటిలో బ్రహ్మసమాజమున్నచో నేనీయిల్లు విడిచిపోవలసివచ్చును.

గోరా — అక్కఱలేదు. అట్లు జరుగదు.

మహి — శశిపెండ్లి చాలవఱకు స్థిరపడినది. మాక్రొత్తవియ్యంకునకుఁ గోడలి కంటె బంగారమునందే యాశ యెక్కువ! మానవుఁడు నశ్వరపదార్థమనియు, బంగారమంతకంటె శాశ్వతవస్తువనియు నాతనియుద్దేశము! ఔషధముకంటె ననుపానమునే యాతఁ డధికముగ వాంఛించును. నేనాతనివలనఁ జాలసంగతులను నేర్చుకొంటిని. వానిని నాకుమారునివివాహసమయమున వినియోగింపవలయును. నేను మరల నొకసారి యీదినములలోఁ బురుషజన్మమెత్తి యీవిధముగాఁ బెండ్లి చేసికొనవలయునని వాంఛించుచున్నాను. ఈజన్మము కొంచెమైనను సార్థకము కాలేదు. ఇదియా పౌరుషము! కన్యాదాతను గట్టెలపైఁ బెట్టింపవలదా? బాబూ! నేను నీతోఁ గలసి రేయింబవలు గొంతుచించుకొని హిందూసమాజమునకు జయధ్వనులు చేయఁజాలను. నాకుమారున కిప్పుడు పదునాలుగుమాసములవయసు! అతని పెండ్లియగువఱకును నీవు నీమిత్రులతోఁ గలసి హిందూసమాజము నిట్టే నిలిపి యుంచుము! తరువాత నీరందఱును, గిరస్తానీలైనను సరియే! ముసల్మానులైనను సరియే! నాకేమియును విచారములేదు. అందుచేతనే శశిపెండ్లికి వినయుని బిలువవలదని చెప్పితిని. అప్పుడాలోచించుట మంచిదికాదు. ఇప్పటినుండియు నీమాట యమ్మతోఁ జెప్పవలయును!

గోరా యటనుండి తల్లికడకుఁ బోయెను. ఆనందమయి యాతనిం గాంచి "బాబూ! కూర్చుండుము! ఒకసంగతి యాలోచింపవలయును! వినయునిపెండ్లిమాటవిన్నావా?" అని ప్రశ్నించెను. గోరా మాటాడలేదు. ఆనందమయి మరల "వినయుని పినతండ్రికిఁ గోపము వచ్చినది. వారెవ్వరును రారు. ఈపెండ్లి పరేశునింట జరుగుటకూడ సంశయము. అన్నిపనులును వినయుఁడే చేసికొనవలసివచ్చినది. మనయింటి యుత్తరభాగమున నున్నమేడ రెండవయంతస్తుపై వినయునిపెండ్లి జరిగించిన బాగుగనుండును" అనియెను.

గోరా — అది యెట్లు?

ఆనం — నేను లేకున్నచో వివాహము జరిగించువా రెవ్వరు? ఇక్కడనే పెండ్లియైనచో నే నన్నిపనులను జూచుకొనుట కవకాశముండును. వినయున కంతకష్టము కలుగదు.

గోరా — అట్లు జరుగదమ్మా!

ఆనం — జరుగకేమి? మీతండ్రిని నేనొప్పింతును!

గోరా — వలదమ్మా! ఈపెండ్లి యిక్కడఁ జేయవలదు. నామాట వినుము!

ఆనం — ఏమి! వినయుఁడు వారిమతము ననుసరించి పెండ్లియాడుటలేదే!

గోరా — ఈవాద మంతయు నేల? వినయున కిష్టమగుఁగాక! ఈపెండ్లి మాకిష్టము లేదు. కలకత్తాలో నిండ్లే దొరకవా? అతనికిఁగూడ నొకయిల్లున్నది కాదా?

చాలయిం డ్లున్నవని యానందమయికిఁ దెలియకపోలేదు. కాని వినయుఁడు బంధువులచేఁ ద్యజింపఁబడి నిర్భాగ్యునివలె నేయింటనో పెండ్లిచేసికొనుట యామెకుఁ గష్టముగా నుండెను. అందుచేతనే యామె తనయింట నీవివాహము జరిగింప నిశ్చయించుకొని యుండెను. గోరా యంగీకరింపకుండుటంగాంచి యామె నిట్టూర్పువిడిచి "మీ రొప్పుకొనకున్నచో మఱియొక యిల్లుదెరుఁ దీసికొనవలసివచ్చును. కాని యందువలన నాకు శ్రమకలుగును ! కానిమ్ము! మీకిష్టములేనప్పుడు నేనేమిచేయుదును !" అనియెను.

గోరా—అమ్మా ! నీ వీపెండ్లిలోఁ జేరవలదు !

ఆనం—అదేమిమాట గోరా ? నావినయుని పెండ్లి నేనుగాక మఱి యెవ్వరు చేయుదురు ?

గోరా—అట్లు చేయఁగూడదమ్మా !

ఆనం—గోరా! వినయునితో నీమతము కలియకపోవచ్చును గాని నీకాతనిపై శత్రుత్వ మేల ?

గోరా యించుక యుత్తేజితుఁడై "అమ్మా! నీవన్యాయముగ మాటాడుచున్నావు! వినయుని పెండ్లితో సంబంధము లేకుండఁ జేసికొనుట నాకుమాత్రము సుఖముగా నుండె ననుకొంటివా? నాకు వినయునియం దెంత ప్రేమ యున్నదో నీకంటెను దెలిసినవా రెవ్వ రున్నారు? కాని యిది ప్రేమవిషయముకాదు. దీనియందు శత్రుమిత్రత్వము లెంతమాత్రమును లేవు. వినయుఁడు మంచిచెడ్డల నన్నిటి నెఱింగియుండియే యికార్యమునఁ బ్రవేశించెను. మే మాతనిఁ ద్యజింపలేదు. ఆతఁడే మమ్ములను ద్యజించెను. ఈవిచ్ఛేదమువలన నాతఁ డనుకొన్నదానికంటె నెక్కువకష్టము ననుభవించుట లేదు !" అనియెను.

ఆనం—గోరా! ఈపెండ్లిలో నీసహాయ ముండదని వినయుఁడు గ్రహించియుండును. ఈమాట నిజమే. కాని యీ శుభకార్యమునందు నేనాతని నెంతమాత్రమును ద్యజింపననికూడ నాతఁడు నిశ్చయించుకొనియుండును. వినయుని వధువును నేనాశీర్వదింపనని యాతనికి సంశయమే కలిగినచోఁ బ్రాణముపోయినను నాతఁ డీపెండ్లి చేసికొనజాలఁడు! బాబూ! నేనుమాత్రము వినయునిమనసు నెఱుంగనిదాననా?

అనుచుండఁగనే యానందమయి నయనాంచలములనుండి యొకటిరెం డశ్రుబిందువులు జాఱెను. గోరామనోమధ్యమున వినయునింగూర్చిన గభీరవేదన యాలోడితముకాఁజొచ్చెను. అయినను నాతఁడు "అమ్మా! నీవు సమాజమునం దుంటివి. దానికి ఋణపడియుంటివి! ఈమాట యాలోచించుకొనుము!" అనియెను.

ఆనం.—సమాజముతోడి సంబంధము నాకుఁ జాలదినములనుండి దూరమైయున్నట్లు మీకుఁ బలుమాఱు చెప్పియే యున్నాను. అందుచేతనే సమాజము నన్ను నిందించుచున్నది; నేనును దానికి దూరమై యున్నాను.

గోరా.—అమ్మా! నీయీమాట నాకన్నిటికంటెను బాధకరముగా నున్నది!

ఆనందమయి యశ్రుపూర్ణస్నిగ్ధావలోకములతో గోరాసర్వాంగములను స్పృశించుచు "బాబూ! నిన్నీబాధనుండి తప్పించుట నాకసాధ్య మనుసంగతి యీశ్వరునకుమాత్రమే తెలియును!" అనియెను. గోరా చటాలున లేచి "అమ్మా! నేనిప్పుడే వినయునిచెంతకుఁ బోయి నీవు సమాజమును వదలుకొంటివి గాన నీ పెండ్లిపనులను స్వయముగనే చేసికొను మనియు, మాసహాయమును గోరుట యధర్మమును, స్వార్థపరత్వము నగుననియు నాతనితోఁ జెప్పెదను!" అనియెను. ఆనందమయి నవ్వుచు "నీయిష్టమువచ్చినట్లు చేయుము! తరువాత నాసంగతి చూచుకొనియెదను." అనియెను.

గోరా వెడలిపోయినతరువాత నానందమయి చాలసేపటివఱకు నాలోచించి మెల్లమెల్లగా నాథునిమహాలునకుఁ బోయెను. నేఁ డేకాదశి కావునఁ గృష్ణదయాళుఁడు స్వయంపాకప్రయత్నములో లేఁడు. అతఁడు కృష్ణాజినముపైఁ గూర్చుండి మతగ్రంథమును జదువుకొనుచు నానందమయిం గాంచి యించుక వ్యస్తహృదయుఁ డయ్యెను. ఆనందమయి యాతని కించుక దూరముగ నొకచోఁ గూర్చుండి "చాల నన్యాయము గాఁ దోఁచుచున్నది." అనియెను. సాంసారికన్యాయాన్యాయములకు దూరమై యున్నకృష్ణదయాళుఁ డుదాసీనభావముతో "అన్యాయ మేమి?" అనియెను. ఆనందమయి మృదుస్వరముతో "ఇఁక గోరాసంగతి రహస్యముగ నుంచుట కవకాశము లేదు. స్థితిగతులు చాల చిక్కుగా నున్నవి!" అని చెప్పెను. గోరాప్రాయశ్చిత్తప్రస్తావనసమయమునందే కృష్ణదయాళున కీయూహ తోఁచెను. కాని యోగసాధనప్రక్రియలలో నాతఁ డీసంగతి మఱచిపోయెను.

ఆనం.—మనశశిపెండ్లి యీ నెలలో జరగును. నేనిదివఱకిట్టికార్యములు వచ్చినప్పుడేదో వంక పెట్టుకొని గోరాతో నెక్కడకో పోవుచుంటిని. ఇంతపెద్దశుభకార్యము లీనడుమ మన యింట జరుగుట లేదు. కాని శశిపెండ్లిలో గోరాను మనతో నుంచుకొనుట యెట్లో చెప్పుఁడు! నాకు శాంతి నొసంగు మనియు, నాయపచారమును క్షమింపుమనియు నేనీశ్వరునిఁ బ్రార్థించుచునే యున్నాను. ఇంకను దాఁచియుంచినచో గోరా వలనఁ జాలగొడవలు పుట్టును. అతనికి సర్వము నెల్లడించుటకు మీర లనుమతింపవలయును!

కృష్ణదయాళునితపస్సున కిందుచేఁ దంతరాయము గూర్చినట్లుండెను. అతఁడు వాయుసాధనము చేయుచుండెను; క్రమముగా నాహారము తగ్గించెను. పొట్ట వెన్ను

నందుకొనుటకు కిఁక నెంతయో కాలము విలంబము లేదు. ఇట్టిసమయములో నీయుత్సాహమా? — ఆతఁ డానందమయిం గాంచి "నీకు మతిపోయినది! ఇప్పు డాసంగతి వెల్లడించినచోఁ గొంప మునుఁగదా? జరుగవలసిన దేదో జరిగిపోవును. సాధ్య మైనంత వఱకు నీవు జాగ్రత్తగా నుండుము! ఉండకున్నను దోషములేదు!" అనియెను. తాను జీవించియున్నంతవఱకు కేమియు వెల్లడికాఁగూడదనియుఁ దరువాత నేమైనను మంచిదే యనియుఁ గృష్ణదయాళుఁ డనుకొనియెను. ఆనందమయి యేమి చేయుటకుం దోఁచక లేచి యించుకసేపు నిలిచి "మీశరీరస్థితి యెట్లున్నదో చూచుకొనుచున్నారా?" అని ప్రశ్నించెను. ఆనందమయి యీమూఢత్వమునకుఁ గృష్ణదయాళుఁడు పకాలున నవ్వి "శరీరమా?" అనియెను.

ఈవిషయమై యాలోచించు టంతముఖ్యము గాదని యెంచి యాతఁడు మరలఁ దనపుస్తకమును జదువుకొనఁదొడంగెను! ప్రక్క గదిలో సన్యాసిచెంత మహిముఁడు కూర్చుండి గృహస్థులకు ముక్తియున్నదా లేదా యనువిషయమును బ్రశ్నించి యాయతీంద్రునిప్రత్యుత్తరమునకు భక్తిభావముతో నెదురుచూచుచున్నవానివలె వినతుఁడై కూర్చుండియుండెను. గృహస్థులకు ముక్తి లేదనియు వారికి స్వర్గముండు ననియుఁజెప్పి యెట్లో మహిముని శాంతింపఁజేయవలె నని సన్యాసి ప్రయత్నించెను గాని మహిముఁ డంతమాత్రమున నూరకుండక "మహాత్మా! నాకు ముక్తియే కావలయును. స్వర్గముతోఁ బ్రయోజనము లేదు. ఏదోవిధముగా బిడ్డపెండ్లి చేసికొని మీపాదసన్నిధిని ముక్తిసాధనము చేసికొనఁదలంచి యున్నాను. కాని కన్యావివాహము సులభసాధ్యమా? దానికి మీదయ కావలయును!" అని విన్నవించుకొనఁదొడంగెను!

## ౬౫

నడుమనడుమ నాత్మవిస్మృతి కలుగుచుండె నని తెలిసికొని గోరా మునుపటికంటెను సాహసముతో మెలగుచుండెను. సమాజమును మఱచి మోహాభిభూతుఁడ నగుటచేతనే నియమశైథిల్యము కలుగుచున్న దని యాతఁడు స్థిరపఱచుకొనియెను. అతఁడు సంధ్యాకృత్యములను దీర్చికొని గదిలోనికిఁ బోవునప్పటికిఁ బరేశుఁ డటఁ గూర్చుండియుండుటచే గోరాగుండె గుభిల్లుమనియెను. పరేశునితోఁ దనజీవిత మేకసూత్రగ్రథితమగు నిగూఢాత్మీయతాసంబంధము కలిగియున్నట్లు గోరా సర్వాంతఃకరణముతోను విశ్వసించి యుండెను. అతఁడు పరేశునకు నమస్కరించుటయుఁ బరేశుఁ డాతనిం గాంచి "వినయుని పెండ్లిమాట నీవు వినియే యుందువు! అతఁడు బ్రాహ్మమతానుసారము పెండ్లిచేసికొనఁ దలఁపలేదు!" అనియెను. గోరా తక్షణమే "అయినచో నాతఁ డీపెండ్లి మానుకొనుటయే మంచిది!" అనియెను. పరేశుఁ డీవిషయమున వాదింపఁ దలఁపక నవ్వుచు "సమాజమువా రెవ్వరు నీపెండ్లికి రారు! వినయునియాత్మీయు

లను రారఁట! కన్యాదానము చేయుటకు నేనొక్కఁడనే యున్నాను. ఇఁక వినయునిపక్షమున నీకంటె నెవ్వరున్నారు? ఈవిషయమై నీతో నాలోచించుటకే వచ్చితిని." అనియెను. గోరా తలత్రిప్పుచు "ఈప్రయత్నమున నేను లేనప్పుడు మీకు నాయాలోచన యేల?" అనియెను.

పరేశుఁడు విస్మితుఁడై గోరావంక నించుకసేపు చూచి "నీవు లేవా?" అనియెను. పరేశునివిస్మయమునకు గోరా యొక్కింతసేపు సంకుచితుఁడై యంతలోనే ద్విగుణధైర్యమును వహించి "ఇఁదు నాసంబంధ మెట్లుండును?" అనియెను. పరేశుఁడు శాంతముగా "నీవాతని మిత్రుఁడవు! మిత్రప్రయోజన మన్నిటికంటె నధికమైనది గాదా?" అనియెను.

గోరా—నే నాతనిమిత్రుఁడనే కాని యీప్రపంచమునం దీసంబంధ మొక్కటియే యన్నిటికంటెను నాకు ఘనబంధము కాదు.

పరే—నీకు వినయునిప్రవర్తనమునం దేమైన నధర్మ మగపడినదా!

గోరా—నిత్య మనియు, లౌకిక మనియు ధర్మమిరుదెఱంగులైయుండును. అందు సమాజనియమములచేఁ బ్రకాశమాన మగుధర్మమును దిరస్కరించినచో సంసారము విధ్వస్తమైపోవును.

పరే—నియమము లసంఖ్యములై యుండును. సకలనియమములందును ధర్మము ప్రకాశించుచుండు నని నిశ్చయింపవచ్చునా?

ఈవిషయమునందే గోరాహృదయ మింతవఱకును మథింపఁబడి యొకసిద్ధాంతమును గ్రహించెను. అందుచేతనే గోరా యిప్పు డెంతమాత్రమును జలింపక తీవ్రభావముతో "నియమపూర్వకముగ మనము సమాజమునకు లోఁబడకున్నచో సమాజాంతరమునందలి గభీరతమోద్దేశమునకు భంగము కలుగును. ఆయుద్దేశము నిగూఢమైనది. దానిని స్పష్టముగా గ్రహించుట ప్రత్యేకవ్యక్తికి సాధ్యము కాదు. అందుచేతనే యాలోచన చేయకుండ సమాజమును విశ్వసించుటకుఁ దగినశక్తిని మనము సంపాదింపవలయును!" అనియెను.

పరేశుఁడు గోరామాటలను తుదివఱకును విని యాతఁడు తనప్రాగల్భ్యమున కించుక సిగ్గుపడినట్లు గ్రహించినతరువాత "గోరాబాబు! నేను నీ ప్రధానోద్దేశమును విశ్వసించెదను. ప్రతిసమాజమధ్యమునను బరమేశ్వరునివిశేషాభిప్రాయ మున్నదనుట సత్యమే! అది యెల్లరకును స్పష్టము కాదనుటయు నిజమే. కాని, దానిని స్పష్టముగఁ దెలిసికొనఁ బ్రయత్నించుటయే మానవకర్తవ్యము! చెట్లవలె నచేతనభావముతో నియమపాలనముం జేయుటమాత్రమే సార్థకత్వము కాదు!" అనియెను.

గోరా—సమాజనియమములను సంపూర్ణముగ నవలంబించినచో సమాజోద్దేశము స్పష్టముగా బోధపడు నని నాయుద్దేశము! దానితో విరోధించినచో దాని నాతంకపఱచుటయే కాక పొరపాటునకు గుఱిచేసినట్లుకూడ నగును.

పరే—ఆతంకములును, విరోధములును లేకుండ సత్యపరీక్ష కాఁజాలదు. ఆసత్యమేదో ప్రాచీనకాలమున నెవ్వరో కొందఱు జ్ఞానులచే గ్రహింపఁబడి యెప్పటికిని నొక్కతీరున నే యుండుట లేదు. ప్రత్యేక కాలములందు వివిధనిరోధాఘాతమధ్యమునం దుండి లోకులయెదుట నాసత్యము నూత్న నూత్నముగాఁ బ్రత్యక్ష మగుచుండును. ఏమైనను నేనీవిషయమున వాదింపఁ దలఁచుకొనలేదు. నేను మానవుని వ్యక్తిగత స్వాతంత్ర్యమును విశ్వసింతును. ఏది నిత్యసత్యమో, యేది యనిత్యకల్పనమో తెలిసికొనఁ గలిగినజ్ఞానమునందే సమాజోన్నతి యాధారపడి యుండును.

అని పరేశుఁడు లేచెను! గోరాయును లేచెను. అప్పుడు పరేశుఁడు "వినయునకు మిత్రుఁడవగు నీవి కార్యమును జరగింతు వని యెంచి సమాజనిరోధమువలన నేను తప్పుకొనఁదలంచితిని. ఇట్టిచో నాత్మీయులకంటె మిత్రులధికులుగదా! కాని వినయుని ద్వేషించుటయే నీకుఁ గర్తవ్యమని తోఁచినప్పు డీభారమంతయు నామీఁద నే పడినది! కావున నీకార్యము నేనొక్కఁడనే నిర్వహింపవలసివచ్చినది!" అనియెను. ఒక్కఁడనే యను పరేశునిమాటలో నెంతయర్థమున్నదో గోరా యప్పు డూహింపలేదు. వరదాసుందరి యాతనికి విరుద్ధముగా నుండెను! ఇంటిలోని బిడ్డల కిష్టము లేకుండెను! హరిమోహిని యొప్పుకొన దని పరేశుఁడు సుచరితను పెండ్లికిఁ బిలువలేదు. ఒకవంక సమాజమువా రందఱును ఖడ్గహస్తులై యుండిరి. వినయునిపినతండ్రియు, నాత్మీయులు నాతని ననేకవిధములఁ దిట్టుచు నుత్తరములను వ్రాసిరి!—

పరేశుఁడు వెడలిపోయినంతనే యవినాశుఁడును మఱికొందఱు సామాజికులును వచ్చి పరేశునుద్దేశించి యాక్షేపింప నారంభించుటయు గోరా "వలదు. ఆతఁడు పూజ్యుఁడు. ఆతని మీరు గౌరవింపఁజాలకున్నచో నాతని నిందింపవలయునను మీనీచోద్దేశము నైనను మార్చుకొనుఁడు" అనియెను. గోరాకు మరలఁ దనసంఘమువారితో నెప్పటివలె సమావేశము కలిగెను. కాని యభిరుచి లేదు! "ఇది యేమియును గాదు. ఇదియొక పని యని చెప్పుట కవకాశము లేదు. దీనియందు జీవము లేదు. ఇట్లే కేవలము వ్రాయుట, యుపన్యసించుట, గుంపుచేర్చుట మొదలగు వానివలన లాభము లేదు! నష్టమే!" అను నుద్దేశ మాతనిహృదయము నిదివఱకెన్నఁడును బాధింపలేదు. నూతనశక్తిచే విజృంభించు నాతనిజీవితము పూర్ణభావముతోఁ బ్రవహించుటకు సత్యపథమును నిరీక్షించుచుండెను. ఇది యేమియు నాతని బాగుగఁ దోఁచుట లేదు.

ఒకవంకఁ బ్రాయశ్చిత్త సభకుఁ బ్రయత్నము జరుగుచుండెను. ఇది గోరా కుత్సాహమే. ఇది కేవల మశుచిప్రాయశ్చిత్తమే కాదనియు, దీనివలన నొక్కసారిగా సంపూర్ణ నూతననిర్మలదేహముతోఁ గర్మక్షేత్రమున నవజన్మలాభము గాంచవలయు ననియు గోరాయుద్దేశము! దీనికి దిననిర్ణయ మయ్యెను! పూర్వపశ్చిమవంగ పండితుల కందఱకు నాహ్వానము లంపఁబడుచుండెను. ధనము సమకూర్పఁబడియెను. ఇది దేశోపయోగకరమగు కార్యమని సంఘమువా రందఱు ననుకొనుచుండిరి. అవినాశుఁ డందఱితోడను రహస్యముగ నాలోచించి పండితసభలో గోరాకు హిందూధర్మప్రదీపకుఁ డనుబిరుదము నిచ్చుట కేర్పఱచుకొనియెను. ఈవిషయమున సంస్కృతశ్లోకములతో స్వర్ణాక్షరములు ముద్రించినసన్మానపత్రమునుగూడ నర్పింపఁదలచెను. మాక్సుమ్యులరుదొరవారి ఋగ్వేదాంగ్లేయభాష్యగ్రంథమునుగూడ విలువగల మొరాకో బైండు చేయించి యాతనికి బహుమాన మిచ్చుట కేర్పఱచుకొనియెను. ఈవిధముగా సంఘములో ననేకవిధము లగునాలోచనలు జరుగుచుండెను.

## ౬౬

హరిమోహినికి మఱఁదియొద్దనుండి యుత్తరము వచ్చెను. అందు క్షేమసమాచారములకు, దరువాత నిట్లు వ్రాయఁబడి యుండెను. "అమ్మా! మీరు వ్రాసిన సంగతు లన్నియును బాగుగఁ దెలిసికొంటిని. 12,13 ఏండ్ల కన్య యున్నదనియు, ఎదిగినపిల్లవలె నగపడు ననియు, నైనను బాధకము లేదనియు వ్రాసితిరి. ఆమెకుఁ గలసంపత్తి జీవితస్వత్వమో చిరస్వత్వమో తెలిసికొని వ్రాసినచో నన్నగారితో మాటాడి యాయన యుద్దేశము తెలిసికొందును. ఆయనయును సమ్మతించు ననుకొందును. కన్యకు హిందూమతనిష్ఠ యున్నదని వ్రాయుటచే సంతోషముగా నున్నది. కాని యామె బ్రహ్మసమాజమునఁ బెరిగినసంగతిమాత్ర మెచ్చటను వెల్లడి కాకుండఁ జేయవలయును. రాఁబోవు చంద్రగ్రహణమునకు గంగాస్నానమునకు వచ్చెదను. వీలైనచో వచ్చి కన్యను జూచెదను."

మరల నెప్పటికైన నత్తవారిల్లు చూచుభాగ్యము కలుగునను నాశ హరిమోహిని కింతవఱకును లేకయే యుండెను. శ్వశురగృహత్యాగదినమప్పు డామెకు మృతదినము వలె నుండెను. ఇప్పు డెట్లయిన సుచరితమూలమునఁ దన కాభాగ్యము లభించు నని యామె యాశపడుచుండెను. అయినను దొందరపడుట కామెకు సాహసము లేకుండెను. ఎంతసమీపమునం దున్నను సుచరితహృదయోద్దేశమును హరిమోహిని గ్రహింపఁజాలకుండెను. ఆమె సమయమును నిరీక్షించుచు సుచరితను బాగుగఁ బరీక్షించుచుండెను. హరిమోహిని క్రమముగాఁ దనపూజను స్వల్పకాలములోనే ముగించుకొనుచు నెప్పుడును సుచరితను దనకంటియెదుటనే యుంచుకొనుచుండెను.

గోరారాక యాకస్మికముగ నాఁగిపోవుటచే దొడ్డమ్మ యాతని నేమైన నన్నదేమో యని సుచరిత యనుకొని "మంచిది అతఁడు రాకపోయినను, వాఁడే నాగురుఁడు! నాగురుఁడు!" అని నిశ్చయించుకొనియెను. ప్రత్యక్షగురునికంటె నప్రత్యక్షగురుని యాకర్షణమే తీవ్రమైనది. ఏమనిన—అప్పుడు గురుసందర్శనాభావము నెట్లయినఁ దీర్చుకొనవలయునని హృదయము ప్రయత్నించుచుండును. సుచరిత యిదివఱకు గోరాతోఁ దర్కించువిషయముల నిప్పు డాతనిగ్రంథములనుండి చదువుకొని ప్రతివాదము లేకుండఁగనే బోధపఱచుకొనుచుండెను. ఏదైనఁ దెలియనప్పు డాతఁడుండిన బోధించునుగదా యని యనుకొనుచుండెను. కాని యాతని తేజోమూర్తిం గాంచవలయుననియు, నాతని గంభీరభాషణముల నాలకింపవలయు ననియు నామెకుఁగల కోరిక యెట్లును దీరుటలేదు. ఇట్లనివర్తితంబగు నామె యాంతరికౌత్సుక్యము నిరంతరమును వర్ధిల్లుచు నామె శరీరమును శుష్కింపఁజేయుచుండెను. గోరాదర్శన మనేకుల కనాయాసముగ లభించుచున్న దనియు, వారికి దానిమూల్యమే తెలియ దనియుఁ దలఁచుకొని, తలఁచుకొని సుచరిత బాధపడుచుండెను. ఒకనాఁటియపరాహ్ణసమయమునలలిత వచ్చి యామెను గౌఁగిలించుకొని "అక్కా! సుచరితా!" అనియెను.

సుచ—ఏమే సోదరీ! లలితా!

లలి—అంతయు స్థిరమైనది.

సుచ—వివాహ మెప్పుడు?

లలి—సోమవారము.

సుచ—ఎక్కడ?

లలి—తండ్రిగారికే కాని నాకుఁ దెలియదు.

సుచరిత తనబాహువులతో నామెను బరివేష్టించి "సోదరీ! ఆనందముగా నున్నదా!" అనియెను. లలిత నవ్వుచు "ఆనందము కాకేమి?" అనియెను. సుచరిత నవ్వుచు "నీకోరిక తీరినది. నీ కిఁక నెవ్వరితోడను జగడ మాడుట కవకాశము లేదు. అందుచే నీయుత్సాహ మెక్కడఁ దగ్గిపోవునో యని నాకు భయముగా నున్నది" అనియెను. లలిత నవ్వుచు "జగడమాడుమనుష్యుల కభావ మేమున్నది. ఇప్పు డిఁక నట్టివారికొఱకు వెలుపల వెదకికొనవక్కఱలేదు!" అనియెను. సుచరిత తర్జనితో లలితబుగ్గపైఁ బొడుచుచు "అలాగా! ఇంతటితో నీవడి తగ్గు ననుకొంటిని. అట్లయినచో నమాయకుఁ డగు వినయునితో జాగ్రత్తగ నుండు మని చెప్పెదను!" అనియెను.

లలి—మీయమాయకున కింక జాగ్రత్తపడుట కవకాశములేదు! అతని కిఁక రక్షణము లేదు. అతనిజాతకఫలము సిద్ధించినది. ఇఁక నెంతవిచారించినను లాభము లేదు.

సుచ—సోదరీ! నేనెంతయానందపడుచుంటినో చెప్పఁజాలకున్నాను. వినయునివంటిస్వామికి నీవు తగినదానవు కావలయు ననియే నాప్రార్థనము!

లలి—సరే. కాని నావంటిభార్యకుఁ దగినవా రెవ్వరును గానరాలేదా? నీవీవిషయముంగూర్చి యాతనినొకసారి యడిగి యాతనియుద్దేశము వినుము! అట్లయినచో నట్టివిచిత్రపురుషునియాదరము నింత కాలమువఱకును గ్రహింపజాలనందులకు నీవు విచారపడక మానవు!

సుచ—ఎట్లయిన నేమి! ఇంతకాలమునకుఁ గొకరత్నవర్తకుఁడు లభించెను. రత్నమునకు నీకుఁ దగినమూల్యము నిచ్చుచున్నప్పుడిఁక విచారము లేదు. ఇఁక నీకు మావంటి సామాన్యులయాదరమును యాచింపవలసినపని లేదు.

లలి—అట్లు కాదు! తప్పక కావలయును. నీయాదర మంతయు నాయందే చూపవలయును! నాకన్నఁ గప్పి దానిని మఱి యెచ్చటను వినియోగింపఁగూడదు.

సుచరిత లలితకపోలమునఁ గపోలము నుంచి "సోదరీ! నాయాదరము నిఁక నెవ్వరికి నొసంగను!" అనియెను.

లలి—ఎవ్వరికి నీయవా? నిజముగా నెవ్వరికి నీయవా?

సుచరిత యూరక తలయూఁచెను. లలిత యించుక వెనుకకు జరిగి "అక్కా! నీవెవ్వరినైన నాదరించుట నేనెన్నఁడును సహింపఁజాల నని నీవే గొణుంగుదువు! నేనిన్నాళ్ళవఱకును జెప్పలేదు. ఇప్పుడు చెప్పుచున్నాను! గోపాలుఁ డింకను మన యింటికి వచ్చుచుండుట బాగుగ లేదు. ఏనాఁటయిన నీయొద్ద కాఁపఁజాలని నే నేమో కాని ఈసంగతి యింతవఱకును జెప్పలేకపోయితిని. అతఁడు క్రొత్తగా వచ్చినప్పుడే నాకుఁ గోపము కలిగినది. నాకుఁ దెలియదనుకొంటివా? నీవు నాయొద్ద నాతనిపేరైన నెత్తకుండుట నాకు మఱింతకోపముగా నుండెను. నీవు నాకంటెను నాతని నధికముగఁ బ్రేమించుట నాకసహ్యముగా నుండెను. అందుచే నేనెంతకష్టపడుచుంటినో నీకెట్లు చెప్పఁగలను? ఇప్పుడుగూడ నాయొద్ద నీవాతనిపేరెత్తుటలేదని నేననుకొనుచున్నాను. నీయుద్దేశ మది కాదని చెప్పినచో నాకిఁకఁ గోపము లేదు. ఎంతో సంతోషముగా నుందును. కాని సోదరీ! నీవొకవేళ—" అనుచుండఁగనే సుచరిత తత్తరముతో నామెనోటిని మూసి "సోదరీ! నీపాదములపైఁ బడియెదను! ఆమాటమాత్ర మనవలదు! ఆమాట విన్నచో నాకు భూగర్భమున మునిఁగిపోవలయు నని తోఁచును!" అనియెను.

లలి—ఏమిసోదరీ! అతఁడు—

సుచరిత వ్యాకులస్వరముతో "వలదు! వలదు. పిచ్చిమాట లాడకుము. లలితా! తలఁచుకొనుటకైనఁ గూడనిమాట నోటితోఁ బలుకవచ్చునా?" అనియెను. సుచరిత యాసంకోచమునకు లలిత విరక్తయై "సోదరీ! ఇదియంతయు నీనటనయే గాని నేనంత

యును గ్రహించియేయున్నాను. నేను నీకంతయు నిశ్చయముగాఁ జెప్పఁగలను—" అనుచుండఁగా సుచరిత లలితచేయి వదలించుకొని గదినుండి యవ్వలకుఁబోయెను. లలితయు వెనుకనే పోయి యామెను బట్టుకొని ''సరే! మంచిది! అక్కా! ఇఁక నేనేమియు మాటాడను" అనియెను.

సుచ—ఎన్నఁడు నీమాట యెత్తవుగద ?

లలి—అంతగొప్పప్రతిజ్ఞ చేయఁజాలను! ఆవశ్యకమైనసమయమైనచో నీమాట యెత్తెదను; లేనిచో లేదు! ఇట్లు ప్రమాణము చేయఁగలను.

కొన్నాళ్ళనుండి హరిమోహిని సుచరితను విడువక యామె వెనువెంటనే మసలుచుండెను. ఆమె యిట్లు సంశయముతోఁ బరిశీలించుచుండుట సుచరితహృదయము నకు భారముగానుండెను. కాని లోపల నెంతబాధగానున్నను నామె పైకేమియు ననఁజాలకుండెను. మఱియు నిప్పుడు లలిత వెడలిపోవుటచే నతిక్లాంతహృదయ యగు సుచరిత బల్లపై రెండుచేతులనడుమఁ దల నుంచుకొని యేడువఁదొడంగెను; దీపము వెలిఁగింపవచ్చిన సేవకుని వలదని వారించెను. అప్పుడు హరిమోహినికిఁ బూజాసమయ మైనను సుచరిత క్రిందికి దిగిపోవుటం గాంచి యామె సుచరితగదిలోనికిఁ బోయి "రాధారాణీ" అని పిలిచెను. సుచరిత తెలియకుండఁ గన్నీరు తుడుచుకొని చటాలున లేచి నిలువఁబడియెను. హరిమోహిని 'అదియేమి?' అని ప్రశ్నించెను. సుచరిత మాటాడలేదు. మరల హరిమోహిని కఠోరస్వరముతో 'ఇది యంతయు నేమో బోధపడుట లేదు!' అనియెను.

సుచ—దొడ్డమ్మా! నీవు రేయుంబవలు నన్నిట్లు పరీక్షించుచుంటి వేమి ?

హరి—కారణము నీకు బోధపడుటలేదా ? నీవు నిద్రాహారములు లేక విచారించుచుంటివి. ఈలక్షణము లన్నియు నేమి ? నేను చంటిబిడ్డనా ? ఈమాత్రము నాకుఁ దెలియదా !

సుచ—అమ్మా ! నీకేమియును దెలియదు. నాకుఁ బ్రతినిమిషమును నసహ్య మగునంతటియన్యాయ మగుదారుణసంశయము నీలోఁబుట్టినది !

హరి—నేను పొరపాటు పడినచో నీవు నాకు నిజము చెప్పరాదా !

సుచరిత ధైర్యముతో సంకోచ మంతయును విడిచి "అమ్మా! నేను నాగురుని చెంత నొకనూతనవిషయమును గ్రహించితిని. దానిని సంపూర్ణముగ గ్రహించుశక్తి లేకుండుటచే నేను దానికొఱకుఁ బ్రయత్నించుచుంటిని గాని కేవలము నీతో దగవు పెట్టుకొనఁదలఁచుటలేదు. కాని నీవు మాసంబంధమును వికృతముగఁ జూచి యాతని నవమానించి పంపివైచితివి ! నీవాతనితోఁ జెప్పిన దంతయుఁ బొరపాటే! నీవు నా యందుఁ గలసంశయమును మిథ్యయే! నీపని బాగుగ లేదు. నీవాతని నగౌరవింపఁ

జాలవు! నాయెడల నింతక్రూరముగ మెలఁగుటకు నేను నీకేమి చేసితిని ?" అని చెప్పుచు స్వరము రుద్ధమైపోవుచుండుటచే నామె మఱియొకగదిలోనికిఁ బోయెను. హరిమోహిని హతబుద్ధియై "అయ్యోబాబూ! ఇట్టివింతలు నేనెన్నఁడును వినలేదు!" అని యనుకొనియెను.

సుచరిత యించుక శాంతించినసమయము చూచి హరిమోహిని యామె నన్నమునకుఁ గూర్చుండఁబెట్టి "అమ్మా! నేను చిన్నదానను గాను. బాల్యమునుండియు హిందూధర్మములను జాలవఱకు వినియుంటిని. నీకేమియుఁ దెలియదుగావుననే గోరా నీకు గురువై నిన్ను భ్రమపెట్టుచున్నాఁడు! నేనాతనిమాటలను వింటిని. అందు విశేషమేమియు లేదు. ఆతనిశాస్త్రమంతయు నాతఁడు కల్పించుకొన్నదే. ఈసంగతి యంతయు నాకుఁ దెలిసిపోయినది. నేనును గురూపదేశముం గాంచితిని. నాగురువిట్టివాఁడు కాఁడు! సమయము వచ్చినప్పుడు నీకాతనిచే మంత్రోపదేశము చేయించెదను. నీకేమియు భయములేదు. నేను నిన్ను హిందూసమాజమునఁ జేర్చెదను. నీవు బ్రాహ్మగృహమునం దున్నను లేనట్లే! ఈసంగతి యెవ్వరికిఁ దెలియును? నీవు పెద్దదానివలె నగపడెద వనుమాట నిజమే. కాని నీ జాతకమును జూచినవారెవ్వరు? డబ్బున్నచో నంతే చాలును. అన్నియును ద్రోసికొనిపోవును! అది యున్నచోఁ గైవర్తకన్య కాయస్థకన్య యైపోవును. ఇట్టి వెన్నియో నేను నాకన్నులతోఁ జూచితిని. హిందూసమాజమున నిషేధమును గల్పించు సమాజకర్తలగు సద్బ్రాహ్మణులయింటనే నేను నీకు సంబంధముం గూర్చెదను. గురువుకొఱకింతగాఁ బరితపించుటయు నింతగా దుఃఖపడుటయు నీకక్కఱలేదు!" అని యీవిధముగా బోధించుచున్నకొలఁదియు సుచరిత కాహారమునం దరుచికలుగుచుండెను. ఆమెనోటికొకముద్దయైనను బోవుటలేదు కాని యామె మౌనముతో బలవంతముగా భోజనముచేయుచుండెను. అన్నముతినకున్నచో హరిమోహిని కింకను నెట్టి యనుమానము కలుగునో యని యామెకు భయము!

సుచరిత యేమియు మాటాడకుండుటం గాంచి హరిమోహిని తనలో "హిందువును గావలె నని యేడ్చుటయే కాని చెప్పినమాట వినిపించుకొనదు. ప్రాయశ్చిత్తమక్కఱలేదు. పరిదేవన మక్కఱలేదు. కొంచెముసొమ్ము ఖర్చుచేసి యనాయాసముగ సమాజమునఁ జేరవలయు ననుత్సాహమైన లేకుండ నేను హిందువును గావలయు ననుకొన్నంతమాత్రమున నేమి లాభము!" అని భావించుకొనుచుండెను. గోరా కపటి యనియు, నాతఁడిట్లు కపటనటనము చేయుటకు సుచరిత ధనరూపయౌవనములే కారణము లనియు నామె నిశ్చయించుకొనియెను. అతిశీఘ్రముగాఁ గంపెనీకాగితములతోఁగూడ సుచరితను దనయత్తవారింట బంధించుట మంచి దని యామెయుద్దేశము. సుచరితమనసు మెత్తఁబడినఁగాని యీపని సాగదు. అందుచేతనే యామె తనయత్తిం

47

టిగౌరవముంగూర్చి సుచరితకు రేయింబవలు బోధించుచుండెను; వారిసామర్థ్యముం గూర్చియు, సమాజమునందలి వారి పలుకుబడింగూర్చియు, వారికిఁ బ్రతికూలు రైనచో నిష్కాశితులైనను నిషేధింపఁబడుటంగూర్చియుఁ బలితులైనను వారి కనుకూలు రైనచో సమాజమున గౌరవింపఁబడుటం గూర్చియు నుదాహరణపూర్వకముగా నామెకు బోధించుచుండెను.

సుచరిత తనయింటికి రాకుండవలయు ననువరదాసుందరి యుద్దేశము రహస్యమై యుండలేదు. తనవ్యవహార మంతయు స్పష్టముగ నుండవలయు ననియే యామె యభిమానము. ఆమె యితరులను గఠినముగ మందలించునప్పుడు తనకిది స్వభావమని ముందుఁ జెప్పుచుండును. అందుచే సుచరితకు వరదాసుందరియింట నెట్టియాదరమును లేకుండఁ బోయెను. తాను తఱచుగ నటకుఁ బోవుచున్నచోఁ బరేశునకుఁ గూడ నశాంతి కలుగు నని సుచరిత భావించుకొనియెను. ఇందుచేతనే యెంతోపని యున్నప్పుడు గాని సుచరిత యటకుఁ బోవుట లేదు. ఇందుచేతనే పరేశుఁడు దినమున కొకటిరెండు సారులు సుచరిత యింటికే వచ్చి మాటాడి పోవుచుండెను.

కొన్నాళ్ళనుండి యాలోచనలచేతను, బనులచేతను బరేశుఁడు సుచరితయింటికి వచ్చుట లేదు. ప్రతిదినము నాతనిరాకకు నిరీక్షించుచుండుటచే సుచరితహృదయమున సంకోచమును గష్టమును దోఁచుచుండెను. పరేశునితోఁ దనకుఁగల గభీరతమశుభసంబంధ మెన్నఁటికిని విచ్ఛిన్నము కాఁజాల దని సుచరిత యెఱుంగును గాని, యొకటిరెండు బహిస్సూత్రము లామెను బలవంతముగ నాకర్షించుచుండుటచే నామెబాధకు విశ్రాంతి లేకుండెను. ఒకవంక హరిమోహిని తనజీవనము నసహ్యముగఁ జేసివైచుచుండెను. అందుచే సుచరిత వరదాసుందరిచేయు నగౌరవమునకైన నంగీకరించి పరేశునింటికిఁ బోయెను.

అపరాహ్ణవేళ సూర్యుఁడు పశ్చిమాకాశమునఁ గ్రిందికి దిగిపోయి యారెండంతస్తులమేడనీడ నతిదీర్ఘముగ విస్తరింపఁజేయుచుండెను. ఆమందిరోద్యానమునం దారీడను బరేశుఁడు తలవంచుకొని యొంటిఁగా బచారు చేయుచుండెను. సుచరిత యాతనిచెంతకుఁ బోయి "బాబా! క్షేమముగ నున్నారా?" అని ప్రశ్నించెను. పరేశుఁ డాకస్మికముగఁ దనయాలోచనను విడిచి సుచరితవంకఁ దిలకించి "అమ్మా! సుఖముగ నేయున్నాను!" అని "సోమవారము నాఁడే లలితవివాహము!" అనియెను.

తన్నుఁ బిలువకుండుటకును, దనతో నాలోచింపకుండుటకును గారణ మేమని సుచరిత యడుగఁదలఁచెను గాని తనయందుఁగూడ నొకలోప మగపడుచుండుటచేఁ గుంఠిత యైపోయెను. మునుపటివలె నున్నచో నామెకుఁ బిలువలే దనువిచారమే లేకయుండును. ఆమెమనసులోని విచారమునకుసరిగాఁ బరేశుఁ డప్పుడు "రాధా! నిన్ను

సారి పిలువఁజాలకపోయితిని" అనియెను. సుచరిత తెల్లపోయి "ఏమిబాబా?" అనియెను. ఆమాటకు బదులు చెప్పక పరేశుఁ డామెవంక నిరీక్షించుచుండెను. సుచరిత యిఁక సహింపఁజాలక తల వంచుకొని "నామనసులో నొకవిధమగు పరివర్తనము కలిగిన దని మీరు భావించి యుందురు!" అనియెను. పరేశుఁడు మృదులముగా "ఔను! అందుచేతనే నిన్ను నిరోధింపరాదని యనుకొంటిని!" అనియెను.

సుచ—బాబా! నేను మీకంతయుఁ జెప్పదలంచితిని. కాని మీదర్శనములభింప లేదు. అందుచేతనే నేనిట్లు వచ్చితిని నామనోభావము మీకు స్పష్టముగాఁ దెలుపఁ దగిన సామర్థ్యము నాకు లేదు. సరిగాఁ జెప్పలేనోమో యని భయపడుచున్నాను!

పరే—ఇది స్పష్టముగాఁ దెల్పుటకు సులభమైనవిషయము కాదని నేనెఱుఁగుదును. నీవు నీభావమధ్యమునం దొకవస్తువును గ్రహించి యనుభవించుచుంటివి. కాని దానియాకారప్రకారములు నీకుఁ బరిచితము లగుట లేదు.

సుచరిత యించుక విశ్రాంతి నంది "ఔను అది నిజమే. కాని నాయనుభవ మెంతప్రబలమైనదో యెట్లు చెప్పఁగలను? నూతనచైతన్యముతో నూతనజీవనము గాంచినట్లుంటిని. నన్ను నే నిట్లెన్నఁడును భావించుకొనలేదు. నాకిదివఱకు నాదేశ సంబంధ మగు నిట్టిభూతభవిష్యత్సంబంధము లేకయుండెను; కాని యిప్పు డాఘన సంబంధము ప్రబలసత్యమైనదనుజ్ఞానము నాహృదయాంతరమునం దద్భుతముగాఁ దోఁచుచున్నది. నేనిఁక దాని నెట్టును మఱవఁజాలకున్నాను. బాబా! నేను సత్యము చెప్పుచున్నాను. నేను హైందవి నని యిదివఱ కెట్లును నానోటితోఁ జెప్పఁజాలకుంటిని. కాని యిప్పుడు నాహృదయ ముత్సాహముతో నిస్సంశయముగా నట్లు చెప్పఁజూచుచున్నది! ఇందువలన నాకానందమే బోధ యగుచున్నది!" అనియెను.

పరేశుఁడు మెల్లగా "అమ్మా! ఇందలిప్రతిభాగమును, ప్రత్యంశమును నీవు బాగుగ భావించి గ్రహించితివా?" అనియెను. సుచరిత వినీతభావముతో "నాకంతగా భావించుటకు శక్తియున్నదా? కాని యెన్నిటినో గ్రహించితిని. ఎంతయో యాలోచించితిని! ఇది యింతటిదని నేను గ్రహింపఁజాలనప్పుడు హిందు వనినంతనే వారి యందలి స్వల్పలోపములనుమాత్రమే గొప్పగాఁ జేసి చూచుచు వారియెడలఁ దిరస్కారభావము కలిగియుంటిని!" అనియెను. పరేశుఁ డామాటలనువిని విస్మితుఁడై సుచరితహృదయమునం దొకప్రబోధము కలిగె ననియు, నామె యొకసత్యపదార్థమును గ్రహించి నిస్సంశయముగ ననుభవించుచున్న దనియు, ముగ్ధవలె నేమియుఁ దెలియకుండఁ గేవల మస్పష్టావేగముచేఁ దూలిపోవుట లేదనియు భావించుకొనెను.

సుచ—బాబా! నేను నాదేశమును, జాతిని ద్యజించినయొకనీచురాల నని యేల చెప్పుకొనవలయును? నేను హైందవినే యని యేల చెప్పుకొనఁగూడదు?

పరేశుఁడు నవ్వుచు "అమ్మా! అనఁగా— నేనట్లేల చెప్పుకొనుట లేదని నీవు నన్నుఁ బ్రశ్నించుట కాదా? బాగుగ నాలోచింపఁగా నట్లు చెప్పుకొనకుండుటకు విశేష కారణ మేమియును లేదు. దీనికి హిందువులు నన్ను హిందువుగా నంగీకరింపకుండుట యొక కారణము. నా సమాజమువారు నన్ను హైందవునిగాఁ బరిచితుని జేయకుండుట రెండవకారణము! ఇది యంతటి ప్రధాన కారణములు కావు; బాహ్యకారణములు మాత్రమే! వీనిని పాటింపకున్నను నష్టము లేదు. కాని లోలోపల నొక గంభీర కారణ మున్నది. హిందూసమాజమునఁ బ్రవేశించుట కెట్టిద్వారమును లేదు. విశేషించి ప్రధానద్వారము లేకున్నను గిటికీ గుమ్మములైన నుండవచ్చును! మఱియు నిది సకలమానవులకును సమాజము కాదు. ఇది, కేవలమును దైవవశమున హిందువులై పుట్టినవారి సమాజము మాత్రమే!" అని చెప్పెను.

సుచ— అన్ని సమాజములు నట్టివే కావా?

పరే— కావు. ముసల్మానుసమాజద్వార మెల్లమానవులకును దెఱవఁబడి యుండును. క్రైస్తవసమాజ మెల్లవారి నాహ్వానించుచుండును. క్రైస్తవసమాజాంతర్భాగము లన్నియు నట్టివే. నేనాంగ్లేయుఁడను గాఁదలంచినచో నది యసంభవము కాదు. ఇంగ్లాండున నివసించి యానియమముల ననుసరించినఁజాలును. అందుకొఱకు నేను క్రైస్తవుఁడను గూడఁ గానక్కఱలేదు. అభిమన్యుఁడు వ్యూహామునఁ బ్రవేశింపఁగలఁడు గాని, వెలుపలకు రాఁజాలఁడు. హిందూసమాజ మాపద్ధతికి వ్యతిరేకము!

సుచ— బాబా! అట్లయినచో నిన్నాళ్లయినను హిందువులు నశింపలేదే!

పరే— సమాజక్షయమునకుఁ జాలకాలము పట్టును. హిందూసమాజగవాక్షద్వారము లిదివఱకుఁ దెఱవఁబడి యుండెడివి. అప్పుడీదేశమునందలి యనార్యు లందుఁబ్రవేశించి యొకగౌరవమును బడసిరి. మొగలాయీప్రభుత్వమున దేశమునందలి హిందూరాజులును, జమీందారులును దమప్రభావముచే సమాజమునుండి యెవ్వరును జెదరకుండునట్లు శాసనములఁ జేసి యుండిరి. ఇప్పు డాంగ్లేయప్రభువు లెల్లర నేకశాసనమునఁ బాలించుటచే మనుపటివలెఁ గృత్రిమోపాయముతో సమాజద్వారమును రక్షించుకొనుటకు నవకాశము లేకున్నది. అందుచేతనే భారతవర్షమునఁ గొన్నాళ్లనుండి హిందూజనసంఖ్య తగ్గి ముసల్మానులసంఖ్య హెచ్చుచున్నది. ఈవిధముగ జరిగినచో నీదేశమున ముసల్మానులే ప్రధానులై పోవుదురు! అప్పుడు దీనిని హిందూస్థానమని చెప్పుటయే యన్యాయమగును!

సుచరిత వ్యథితహృదయముతో "బాబా! దీనిని నివారించుటే మన కందఱకును గర్తవ్యము కాదా? మనముకూడ హిందువులను బరిత్యజించి వారివినాశనమును వర్ధిల్లఁజేయుట న్యాయమా? ఇది హిందూసమాజమును బ్రాణములనైన నర్పించి నిలుప

వలసిన సమయముకాదా?" అనియెను. పరేశుఁడు సప్రేమముగ సుచరితవెన్నుపైఁ జేయుంచి దువ్వుచు "మనము తలఁచుకొన్నచో నెవ్వరినైనను రక్షింపఁగలము కాని రక్షింపఁబడుట కొక జగన్నియమ మున్నది! అస్వభావ నియమమును త్యజించువా రాత్మరక్షణమునుగూడఁ త్యజింపవలసినదే. హిందూసమాజము మానవు నవమానించి వర్జించుచుండుటచే నీదినములలో దాని కాత్మరక్షణము దుస్సాధ్యమగుచున్నది. ఇప్పు డదియే కాంతముగ నుండఁజాలకున్నది. నలుదెసలను విస్తృతమార్గములనుండి యాత్రికులు వచ్చి దానిపైఁ బడుచున్నారు. శాస్త్రసంహితలను ప్రాకారములను బదిల పఱచుకొని యెట్టిసంపర్కమును లేకుండఁ జేసికొనుటకు దాని కిప్పు డవకాశము లేదు. తనలోఁ దానిమిడి యుండుటకు శక్తి చాలక యిప్పు డది క్షయరోగము నాశ్రయించుటచే మానవుల యవిలంఘ్యసంపర్కము దానికి సాంఘాతికాఘాతముగాఁ బరిణమించుచున్నది!" అనియెను.

సుచరిత వేదనాపరిపూర్ణహృదయముతో "నేనీసంగతు లేమియు నెఱుంగ నను. కాని యిదియే సత్యమైన దీని నందఱుఁ ద్యజింపఁదలఁచియున్నచో నీదినములలో నేను దీనిని విడువఁజాలను. మన మందఱమును దీనిదుర్దినసంతానముల మని చెప్పుకొను చు నిప్పుడు దీనితలాఁపిదిక్కున నిలువఁబడవలయును" అనియెను. పరేశుఁడు మెల్లగా "అమ్మా! నేను నీభావమును నిరోధింపఁజాలను. నీవుపాసనచేసి స్థిరచిత్తమున నీలోని సత్యముతో, శుభాదర్శముతో నేకీభవించి సమస్తము నాలోచించుకొనుము. క్రమముగా నీకంతయు విస్పష్టమైపోవును సర్వశ్రేష్ఠ మగువస్తువు నేదేశముకంటెను, నేమానవునికంటెను దక్కువగాఁ జూడవలదు! అది నీకుఁగాని, దేశమునకుఁగాని శ్రేయము కాదు. నేనీయుద్దేశముచే నేకాగ్రచిత్తముతో నాపరమపదార్థమున కాత్మ సమర్పణము చేసికొనఁదలఁచినచో నప్పుడు నాకు దేశమునందును దేశీయులందును గలసంబంధము సత్యమైనది కాఁగలదు" అనియెను.

ఇంతలో నెవ్వడో వచ్చి పరేశున కొకయుత్తరము నిచ్చుటయు "అమ్మా! సులోచనములు లేవు. వెలుతురు తగ్గినది. దీనిని జదువుము!" అని సుచరిత కాచీటి నిచ్చెను. సుచరిత చదివి వినిపించెను. అది బ్రహ్మసమాజమునుండి వచ్చినది దాని క్రింద ననేకనామములతో సంతకము లున్నవి. అందలివిషయము లివి— "పరేశుఁ డబ్రాహ్మమతానుసారముగాఁ గన్యాదానము చేయుటకు సిద్ధపడియున్నాఁడు. సమాజమువారాతని నిఁక సభ్యునిగా నెంచఁజాలరు. అతఁ డేమైనఁ జెప్పుకొనవలసి యున్నచో నాదివారమునకు ముందే కమిటీవారి కందునట్లు విన్నప మంపుకొనవలయును. అదినమున నాలోచించి బహుజనాభిప్రాయమునుబట్టి తీర్పు చేయఁబడును!"

పరేశుఁ డాచీటిని గైకొని జేబులో నుంచుకొనియెను. సుచరిత తనకోమల కరముతో నాతని దక్షిణహస్తముం బట్టుకొని యాతనితోఁ బచారు చేయుచుండెను.

క్రమముగా సంధ్యాంధకారము ఘనీభూతమగుచుండెను. ఉద్యానదక్షిణభాగము నందలి సందులో నొకవీథిదీపము వెల్గింపఁబడియెను. అప్పుడు సుచరిత మృదుస్వరముతో "బాబా! మీయుపాసనాసమయ మైనది. నేను నేఁడు మీతోఁ గలసి యుపాసించెదను." అని యాతని నుపాసనాగృహమునకుఁ దీసికొనిపోయెను. పరేశుఁడు నేఁడు చాలసేపటివఱకును నిశ్శబ్దముగా నుపాసించెను. తుట్టతుద నొక చిన్న ప్రార్థనముం గావించి యాతఁడు లేచి ద్వారమువెలుపల లలితావినయులు నిశ్శబ్దముగాఁ గూర్చుండి యుండుటం గాంచెను. అతనిం గాంచి వారిరువురును నమస్కరించి పాదధూళిం గైకొనిరి. అతఁడును వారి మస్తకములందు హస్తము నుంచి మనములోనే యాశీర్వదించి సుచరితం గాంచి "అమ్మా! నేను రేపు మీయింటికి వచ్చెదను. నేఁడు నా కార్యమును నిశ్చయించుకొందును" అని చెప్పి తన గదిలోనికిఁ బోయెను.

అప్పుడు సుచరితకన్నుల నీరు నిండిపోయెను. ఆమె చిత్రప్రతిమవలె నిస్తబ్ధయై యంధకారమున వరాండాలో నిలువఁబడిపోయెను. లలితావినయులు చాలసేపటివఱకు నేమియు మాటాడలేదు. సుచరిత వెడలిపోఁజూచుటయు వినయుఁ డామె చెంతకుఁ బోయి మృదుస్వరముతో "అక్కా! నీవు మమ్మాశీర్వదింపవా?" అని లలితతోఁ గలసి యామెకుఁ బ్రణామము చేసెను. అప్పుడు సుచరిత యశ్రుబద్ధకంఠముతో నేమని యాశీర్వదించెనో యంతర్యామి యొక్కఁడే వినఁగలిగెను.

పరేశుఁడు తనగదిలోనికి వచ్చి బ్రహ్మసమాజమున కిట్లుత్తరము వ్రాసెను:—
లలితకుఁ బెండ్లి నేనే చేయవలసి యుండెను. ఇందుకొఱకు నన్నుఁ ద్యజించినచో నది మీకన్యాయము కాదు. నన్ను సమస్తసమాజాశ్రయమునుండియు వెలువరించి తనచరణసాన్నిధ్యమునందే యాశ్రయ మొసంగవలయు నని నేనిప్పు డీశ్వరునిగూర్చి యొక్కటే ప్రార్థనముం గావించుచున్నాను!—"

## ౬౭

సుచరిత పరేశునియొద్ద విన్నమాటలను గోరాకుఁ జెప్పవలయు నని యత్యంతమును వ్యాకులపడుచుండెను. తనయెదుట నిలచి తనదృష్టిని హృదయమును గూడఁ బ్రియచే నాకర్షించుచున్న భారతవర్ష మిన్నాళ్ళకుఁ గాలగళమున ధ్వంసోన్ముఖమై పోవుచున్నదను సంగతి గోరా యూహించుటయే లేదా? అది యింతవఱకును దన యాంతరికవ్యవస్థాబలముచే నాత్మరక్షణము చేసికొని యుండెను. అందుచే దేశీయులకు శ్రమపడనక్కఱ లేకపోయెను. ఇంకను నట్టినిశ్చింతతో రక్షించుకొనుట కవకాశమున్నదా? ఇప్పు డెప్పటివలెఁ గేవలపూర్వవ్యవస్థలనే యాశ్రయించి గృహమధ్యమునఁ గూర్చుండుట కుపాయ మున్నదా?—సుచరిత తనలో "దీనిలో నాకును నొక పనియున్నది. ఆపని యెట్టిది? గోరా యిప్పుడు నాయొద్దకువచ్చి బోధించి నాకు

మార్గమును జూపించుట యావశ్యకమైయున్నది. అతఁడు నన్ను సమస్తాంతకములనుండియు, నపవాదములనుండియు నుద్ధరించి యుచితస్థానమున నిలిపినంతమాత్రమున లాభమేమున్నది?" అని భావించుకొని యాత్మగౌరవపరిపూర్ణహృదయముతో "అతఁడు నన్నేల పరీక్షించుటలేదు? అసాధ్యసాధనమునకు నన్నేల నియోగించుటలేదు? అతఁడు తనసంఘమునందలి పురుషులందరికంటెను నేనే తగినదాన నని తనసమస్తమును నా యందే సమర్పించునా? ఈయాత్మత్యాగాకాంక్షవలన నేమైనఁ బ్రయోజనముండు ననియే యాతని యుద్దేశమా?—నన్ను లోకాపవాద మధ్యమునఁ, గర్మహీనతా మధ్యమునఁ ద్రోసివైచి పోయినచో దేశమున కేమియును నష్టములేదా?—ఇట్లు నన్నాతఁడు త్యజించుట యెన్నఁటికిని జరుగదు! అతఁడు వెదకుకొనుచు నాయొద్దకు వచ్చితీరును! అతఁడెంత శక్తిసంపన్నుఁడగుమహాపురుషుఁడైనను నావలన నాతనికిఁ బ్రయోజన మున్నది. ఈమాట యాతఁడే యొకప్పుడు చెప్పియున్నాఁడు. తుచ్ఛమగు దొడ్డమ్మతిరస్కారముచే నాతఁడీమాట నెట్లు మఱవఁగలఁడు!" అని యనుకొనుచుండెను. ఇంతలో సతీశుఁడు పరుగెత్తుకొనివచ్చి "అక్కా!" అని పిలిచెను. సుచరిత యాతనిఁగౌఁగిలించుకొని "ఏమిబాబా!" అనియెను.

సతీ—అక్కా లలితకు సోమవారమునఁ బెండ్లి! అంతవఱకు నేను వినయబాబు నింట నుండెదను. అతఁడు నన్నుఁ బిలిచినాఁడు.

సుచ—దొడ్డమ్మ నడిగితివా?

సతీ—అడిగితిని. నాకుఁ దెలియదు; మీయక్కనడిగి యామె చెప్పినట్లు చేయుమన్నది. అక్కా! నీవడ్డుపెట్టకుము! నాచదువునకక్కడ లోపము జరుగదు. ప్రతిదినమును వినయబాబునొద్దఁ జదువుకొందును.

సుచ—అక్కడఁ బెండ్లిపనులు గావలసియుండెను. నీవటనుండి యల్లరి చేయుచున్నచోఁ బనులు సాగవు.

సతీ—అక్కా! నేనేమియు నల్లరి చేయను!

సుచ—నీకుక్కనుగూడఁ దీసికొని పోయెదవా?

సతీ—ఆ. వినయబాబు దానినిఁగూడఁ దీసికొని రమ్మన్నాడు సపరివారముగ రావలయు నని దాని పేరుతో నొకయాహ్వానపత్రమునుగూడఁ బంపినాఁడు!

సుచ—దానికిఁ బరిజను లెవ్వరు?

సతీ—ఏమి! నేనే యని వినయబాబు చెప్పినాఁడు. సంగీతపుఁ బెట్టెనుగూడ దెమ్మని చెప్పినాఁడు. అక్కా! నాకది యొకసారియిమ్ము! దానిని బగులఁగొట్టనులే!

సుచ—పగులఁగొట్టినచో నేను బ్రదికియేపోవుదును. నాకింకను దెలియనే లేదు! పెండ్లిలో సంగీతము పాడుటకా వినయబాబు నిన్నుఁ బిలిచినది?

సతీ—కాదు! కాదు! వినయబాబు నన్నుఁ దోడుపెండ్లికొడుకును జేసెద ననాఁడు! అక్కా! తోడుపెండ్లికొడు కేమి చేయవలయును.

సుచ—దిన మంతయు నుపవాసము చేయవలయును.

సతీశుఁ డామాటను సంపూర్ణముగా నవిశ్వసించెను; సుచరిత యాతని నొడిం జేర్చుకొని "మంచిది! బాబూ! నీవు పెద్దవాఁడ వైనచో నేమి చేసెదవో చెప్పుము!" అనియెను. సతీశునకుఁ బ్రత్యుత్తరము సిద్ధముగాలేదు. అతనియుపాధ్యాయునియసాధారణపాండిత్యసామర్థ్యములే సతీశున కాదర్శము లైయుండెను. అందుచే వాఁడు మొదటినుండియు పెద్దవాఁడ నై యుపాధ్యాయుఁడను గావలయునని కోరుకొనుచుండెను. సుచరిత తమ్ముని గాంచి "బాబూ! చేయవలసినపను లెన్నియో యున్నవి. మనయిరువురిపనులను మనము కలసి చేసికొందము. ఏమనియెదవు? ప్రాణములనర్పించియైన మనదేశమును గొప్పదానిగాఁ జేయుదము. చేయుటయేమి? దీనికంటెనుశ్రేష్ఠమైనది మఱి యేమున్నది? దేశసేవవలన మనజీవితములను సార్థకములుగాఁ జేసికొనవలయును. తెలిసినదా?" అనియెను. సతీశుఁడు తెలియకుండ సమ్మతించువాఁడు కాఁడు. అతఁ డుత్సాహముతో "సరే!" అనియెను.

సుచ—మనదేశమును, జాతియు నెంతగొప్పవియో యెఱుఁగుదువా? ఏమని చెప్పుదును! ఇదియొక యద్భుతదేశము! వేలకొలఁదియేండ్లనుండి యీశ్వరుఁడీదేశమును సర్వశ్రేష్ఠముగఁ జేయుటకై ప్రయత్నించుచున్నాఁడు దేశదేశములనుండి యనేకులీపనికి సాయపడుచున్నారు. ఈదేశమం దెందఱో మహాపురుషులు జన్మించిరి; ఎన్నియో మహారణములు జరిగినవి; ఎన్నియో మహావాక్యములు వెలువడినవి; ఎందఱివో తపస్సులు ఫలించినవి; ఎన్నియోరీతుల ధర్మము పరిశీలింపఁబడియెను; ఎన్నియోవిధముల జీవితవిషయము సిద్ధాంతీకరింపఁబడియెను. మనభారతవర్ష మన నిట్టిది. సోదరా! ఇది మహత్తమమైనదని యెఱుంగుము! ఎన్నటికిని దీనిని మఱవవలదు! నిందింపవలదు! నేనిప్పుడు చెప్పినమాట క్రమముగా నెప్పటికైన నీకే తెలియును. ఇప్పుడైనను నీకుఁ దెలియలేదని నేననుకొనుట లేదు. నేను గొప్పదేశమున జనించితిననియు, నీదేశమును మనఃపూర్వకముగఁ బ్రేమింపవలయు ననియు, దేశారాధనమునకై సమస్తజీవితము నర్పింపవలయు ననియు నిశ్చయించుకొనవలయును.

సతీశుఁ డించుకసేపూరకుండి "అక్కా! నీవేమిచేయుదువు?" అనియెను.

సుచ—నేనుకూడ నీపనియే చేసెదను. నీవు నాకు సాయపడెదవా?

సతీశుఁ డానందోత్సాహముతో "సాయపడెదను." అనియెను. సుచరితహృదయమునిండి మాటలు పొంగిపోవుచుండెను. చెప్పుకొనుట కింకొకరెవ్వరునులేరు. అందుచేతనే చిన్నతమ్మునియెదుటఁ దనహృదయావేగ మంతయు నొక్కసారిగా వెలువరిం

చివైచెను. ఈమాటలు బాలునిచేతఁ జెప్పవలసినవికావు. కాని సుచరిత కట్టిశంకయు ము గలుగలేదు. మనసునందలి యుత్సాహముచేఁ గోఁచినసంగతులన్నియును సంపూర్ణముగ బోధించినచోఁ జిన్నవారును, పెద్దవారును దమతమ శక్త్యనుసారముగా గ్రహింపఁగల రనియు, నెదుటివారిబుద్ధిశక్తుల ననుసరించి యావిషయములను బోధించినచో సత్యము వికృతమైపోవుననియు నామె యనుకొనియెను—సతీశుఁడు భావోద్రేకముచే “అక్కా! నేను పెద్దవాఁడనైచాలధనము సంపాదించినతరువాత—” అనుచుండఁగ సుచరిత “వలదు. వలదు. డబ్బుమాట యెత్తవలదు. తమ్ముఁడా! మనయిరువురకును ధనముతో నిమిత్తములేదు. మనపనిలో భక్తికావలయును. ప్రాణము కావలయును.” అనియెను.

ఇంతలో గదిలోని కానందమయి వచ్చుటయు సుచరితహృదయరక్తము పొంగిపోవఁదొడంగెను. ఆమె యట్లే యానందమయికిఁ బ్రణామముచేసెను. ప్రణామము చేయుట సతీశునకుఁ జేఁతకాదు. అయినను నెట్లో యాతఁడును జేసివైచెను. ఆనందమయి సతీశు నొడిం జేర్చుకొని శిరంబున ముద్దుకొని సుచరితం గాంచి “నీతో నొక సంగతి యాలోచింపవలసియున్నది. నీకంటె నాకెవ్వరు నగపడలేదు. వినయుఁ డీ పెండ్లి తనయింట జరుగవలయునని చెప్పెను. నబాబువలె నీవు మాబిడ్డను నీయింటికిఁ గొనిపోయి పెండ్లి యాడెదవా యని నే నాతనివారించి నేనొకయిల్లు దెరుఁదీసికొంటిని. అది మీయింటికి కొంతయో దూరములేదు. నేనిప్పు డటనుండియే వచ్చితిని నీవు పరేశునితోఁ జెప్పి యొప్పింపవలయును” అనియెను.

సుచ—తండ్రిగా రంగీకరించెదరు.

ఆనం—తరువాత—అమ్మా! నీవును రావలయును. సోమవారమే పెండ్లి. ఈ లోపుగా నచ్చటనుండి యన్నిపనులను దీర్చుకొనవలయును. వ్యవధిలేదు. నేనొక్కతెనే యన్నిపనులను నిర్వహింపఁగలనుగాని నీవు రాకున్నచో వినయునకుఁ గష్టముగా నుండును. వెంగమోటముచే నాతఁడు నిన్ను బలవంతపెట్టఁజాలకున్నాఁడు. ఆతఁడు నాయొద్దఁగూడ నీపే రెత్తుటలేదు. అందుచేతనే యాతనికిఁ గష్టముగా నున్నట్లు నేను గ్రహించితిని. నీవు తప్పించుకొనుటకువీలులేదు. లలితకుఁగూడఁ గష్టముగా నుండును.

సుచ—(విస్మితయై) అమ్మా! నీవీ పెండ్లిలోఁ జేరుదువా ?

ఆనం—అదేమి సుచరితా! నేను చేరకుండు టెట్లు? నేను పరాయిదాననా? ఇది నావినయుని పెండ్లిగదా! అంతయు నేనే నిర్వహింపవలయును. నేను నీపక్షము కాదు; కన్యపక్షమునం దుందునని వినయునితో నప్పుడే చెప్పితిని! ఆతఁడు మాలలితను పెండ్లాడుటకై మాయింటికి వచ్చును.

తల్లి యుండియు నిట్టిశుభసమయమున లలితను త్యజించుటచే నానందమయికి జాలికలిగెను. అందుచేతనే యీపెండ్లిలో నెట్టిలోపమును లేకుండఁ జేయవలెననియామె పూనుకొనెను. తానే లలితకుఁ దల్లివలెనుండి యామె నలంకరించుటయును వరవరణవ్యాపనకుఁ దోడ్పడుటయును, పెండ్లికి వచ్చినబంధుమిత్రులను సత్కరించుటయును, లలితకుం గ్రొత్తయిల్లుగాఁ దోచకుండున ట్లద్దెయింటి నన్నివిధముల నలంకరించుటయును బూనికొని యుండెను.

సుచ—అమ్మా! నీవిందుఁ జేరినచో నీయింట గందరగోళము పుట్టదా?

ఆనం—పుట్టవచ్చును. అంతమాత్రమున భయ మేమి? మాటాడకూరకున్నచో గొన్నాళ్ళ కంతయును బోవును.

గోరా కీపెండ్లితో సంబంధ ముండదని సుచరిత యెఱుంగును. అతఁ డానందమయిని వారించెనో లేదో తెలిసికొనవలయునని కుతూహలపడుచుండెను గాని, స్పష్టముగా గ్రహింపజాలకపోయెను. ఆనందమయి గోరా పేరైన నెత్తలేదు—ఇంతలో హరిమోహిని మెల్లగా గదిలోనికివచ్చి యానందమయిం గాంచి "సోదరీ! క్షేమమా? దర్శనమే లేదు. కబురైనను లేదు" అనియెను. ఆనందమయి యీయభియోగమున కుత్తరము చెప్పక నేనిప్పుడు నీకుమార్తెను వెంటఁబెట్టుకొనిపోవుటకై వచ్చితిని." అనియెను.

హరిమోహిని యప్రసన్నయై కొంతసే పూరకుండి 'తరువాతఁ జెప్పెదను. నేనీవిషయమునఁ గలుగఁజేసికొనఁజాలను' అనియెను.

ఆనం—అట్లు కాదు సోదరీ! నేను నిన్ను రమ్మని కోరలేదు! సుచరితకొఱకు నీవు బెంగపెట్టుకొననక్కఱలేదు. నేనీమెను నాయొద్దనే యుంచుకొందును.

హరి—మంచిదే కాని యీమె యందఱియెదుటను హిందువునని చెప్పుకొనుచున్నది. ఈమెమతిగతు లిప్పుడుహిందూత్వమునను సరించుచున్నవి. ఇట్టిస్థితిలోజాగ్రత్తగనుంచుట మంచిది. నేనీమెను గొన్నాళ్ళు నాయెదుటనుంచుకొనఁదలఁచితిని. ఈపెను జూచినంతనే యింకను పెండ్లి కాలేదేమని లోకు లనుకొనక మానరు. అవాదు లేకుండ జేసికొన్నఁగాని మంచివరుఁడు లభించుట కష్టము. ఇంతేకాదు ఈమె వేయిత్రోవల బోవుచున్నచో నేనెన్నిటి నని చూచుకొనఁగలను? నీవు మాత్రము హిందూస్త్రీవి కావా? అన్నియును, దెలిసియుండియు నీ వెంగము పెట్టుకొని యిట్లడిగితివి? నీకన్నబిడ్డను నీవీపెండ్లికిఁ బంపఁగలవా? ఇట్లున్నచో సుచరితకుఁ బెండ్లి యగుట కష్టమని నీవు భావింపవలదా?

ఆనందమయి విస్మితయై సుచరితవంకఁ దిలకించెను. సుచరిత మొగ మెఱ్ఱనై పోయెను. అప్పు డానందమయి "నేను బలవంతము సేయఁదలఁచుకొనలేదు సుచరిత

రానన్నచో—" అనునంతనే హరిమోహిని "నీయుద్దేశ మేమో నాకు బోధపడుట లేదు. నీకొడుకే మెకు హిందూమతమును బోధించుచుండెను. నీవేమో క్రొత్తగ నాకాశమునుండి యూడిపడినట్లుగా మాట్లాడెద వేమి ?" అనియెను.

పరేశునింట నపరాధభీరురాలై యుండి యితరులగుణలేశములను మాత్రమే గ్రహించి యాదరించుచుండు నాహరిమోహినియేనా యీమె ?—తన యధికారమును నిలుపుకొనుటకై యామె యిప్పుడు పెద్దపులివలె నిలిచి యుండెను. నలుదెసలనుండియు సుచరితను దనయధీనమునుండి తొలగించుటకు బలవత్ప్రయత్నములు జరుగుచుండెనను సంశయ మామెను బాధించుచుండెను. హితు లెవ్వరో, యహితు లెవ్వరో తెలిసికొనఁజాలక యామె కొట్టుకొనిపోవుచుండెను. ఇదివఱకామె యెట్టికూరియును లేక వ్యాకులహృదయమునో దేవునాశ్రయించి యుండెను. ఇప్పుడామె కాదేవపూజయందును స్థిరబుద్ధి లేకుండెను. ఆమె యొకప్పుడు సంసారిణియై యుండెను. దారుణశోకముచే వైరాగ్యము కలిగినప్పుడు మరల నెప్పటికైన సంసారాసక్తి తన్ను బాధించు నని యామె యూహించుకొనియైన నుండలేదు. కాని యిప్పుడామె మనసులోని గాయముమానుటచే మరల సంసార మామెకుఁ బ్రత్యక్షమై యాకర్షించుచుండెను. మరల నాశాకాంక్షలు చిరపిపాసాపూర్ణములై విజృంభించుచుండెను. ఆమెకుఁ బూర్వముకూడ నింతసంసారావేగములేదు. కొలఁదికాలములోనే యామెముఖనయనభావభంగుల భావనీయపరిణామమునందుటంగాంచి యానందమయి యాశ్చర్యపడియెను. మఱియు సుచరితంగూర్చి యామె ప్రేమకోమలహృదయము పరితపించి పోవుచుండెను. ఇంతగొడవ యున్నదని యెఱింగినచో నామె సుచరితను విడిచియే యుండదు. సుచరిత కట్టికష్టమును గలిగింపకుండవలయు ననియే యానందమయి యుద్దేశము.

హరిమోహిని గోరాప్రశంస యెత్తినతోడనే సుచరిత లేచిపోయెను. అప్పుడానందమయి "అక్కా! నీకు భయము లేదు. నాకీసంగతి తెలియును. నేనీమెను బలవంతపెట్టను లెమ్ము! నీవును నేమియు ననవలదు. ఈమెకుఁ మొదటినుండియుఁ గలపదతి నిప్పుడొక్కసారిగా మార్చుటకు వీలులేదు." అనియెను హరిమోహిని తత్క్షణమే "ఆసంగతి నాకుఁ దెలియుదా ? నేనామె నెప్పుడైనఁ గష్టపెట్టితి నేమో నీయెఱుకనే చెప్పు మనుము! ఆమెయిష్టమునకు నే నెన్నడు నడ్డము చెప్పుటలేదు. ఈశ్వరు డామెను చిరంజీవినిం జేయవలయు ననిమాత్రమే నాకోరిక! నాబ్రదుకింకను నెట్లగునో యనియేభయముచే నాకు నిద్రయైనఁ బట్టుట లేదు!" అనియెను.

ఆనందమయి పోవుచుండఁగా సుచరిత వచ్చి యామెకుఁ బ్రణామము చేసెను. ఆనందమయి యామెను ప్రేమతో స్పృశించుచు తల్లీ! నేను మరల వచ్చినీ కన్ని

సంగతులను దెలిపెదను ఏవిఘ్నములును లేకుండ నీశ్వరానుగ్రహమున శుభకార్యము సంపన్నము కావలయును." అనియెను. సుచరిత యేమియు మాటాడలేదు.

మఱునాటియుదయమున నానందమయి లక్ష్మీదాసిచేఁ బెండ్లియిల్లు బాగు చేయించుచుండఁగా సుచరిత వచ్చెను ఆనందమయి పరమానందముతో నామెను గౌఁగిలించుకొనియెను. పరేశుఁడు కర్చులకొఱకు గొంతసొమ్ము సుచరిత కిచ్చి పంపెను. ఆనందమయియు సుచరిత లాలోచించి యాసొమ్ముతోఁ గావలసిన వస్తువులను గొనుటకు కేర్పాటు చేసికొనిరి. ఇంతలోఁ బరేశుఁడు కూడ లలితను వెంటఁ బెట్టుకొని యటకువచ్చెను. తనయిల్లంతయు లలిత కసహ్యముగా నుండెను. ఎవ్వరు నామెతో మాటాడుటకు సాహసింపకుండిరి. కాని యానిశ్శబ్దమే యామెకుఁ గష్టముగానుండెను. వరదాసుందరికి సహానుభూతిం దెలుపుటకై బంధుమిత్రులనేకులు ప్రతిదినమును వచ్చుచుఁ బోవుచుండిరి. ఇఁక లలిత నిట నుంచుట యుచితము కాదని పరేశుఁడు నిశ్చయించుకొనియెను. లలిత వచ్చునప్పుడు తల్లికిఁ బ్రణామము చేసెను గాని యామె పెడమొగము పెట్టుకొని. లలిత వెడలిపోయిన తరువాత నేడువఁదొడంగెను. లీలాలావణ్యలకు లలిత పెండ్లి గూర్చి సంతోషమే యుండెను. ఏమాత్ర మవకాశ మున్నను వారికిఁ బెండ్లికి రావలయు ననియే యున్నది. కాని, లలిత బయలుదేఱునప్పుడు బ్రాహ్మసమాజకఠోరకర్తవ్యమును స్మరించుకొని వారు గంభీరముగా నూరకుండిరి. ద్వారమునొద్దకు వచ్చునప్పటికి లలితకు సుధీరుఁడగపడియెను. కొంతమందిసామాజికులతోఁ గలసి యుండుటచే లలిత యాతనితో మాటాడలేదు. లలిత బండియెక్కెను. బండిలో నొక కాగితపుబంగి యామె కగపడియెను. దానినిఁ విప్పి చూడఁగా నందొకజర్మనీ వెండిపూలదానుండెను దానిలో "ఈదంపతుల నీశ్వరు డాశీర్వదించుఁగాక!" అను నక్షరములతో నొక కార్డుండెను. అందు సుధీరుని నామమును సూచించునక్షర మొకటికూడనుండెను. పితృగృహమునుండి వెడలునప్పుడు కన్నీరు పెట్టు కొనరా దని లలిత గుండె రాయిచేసుకొని యుండెను. కాని యప్పుడు తనబాల్యమిత్రుని ప్రేమోపహారముం గాంచినంతనే యామెకన్నీరు మున్నీరై పోయెను. పరేశబాబు ముద్రిత నయనములతో సుస్థిరుఁడై కూర్చుండెను.

ఆనందమయి "తల్లీ ! రమ్ము !" అని చెప్పుచు రెండుచేతులతో నామెను బట్టుకొని యామెకొఱకు నిరీక్షించుచున్నదానివలెనె లోనికిఁ దీసికొనిపోయెను. పరేశుఁడు సుచరితను "బిలిపించి "తల్లిలలిత యొక్కసారిగా మాయిల్లువిడిచి వచ్చినది" అని కంపితకంఠముతోఁ దెలిపెను. సుచరిత యాతనిచేయి పట్టుకొని "ఇక్కడ నైనను నీమె స్నేహపాలనము కెట్టిలోపములేదు. బాబా!" అనియెను.

పరేశుఁడు పోవఁజూచుచుండఁగా నానందమయి మేఁగుముసుఁగు సవరించుకొని వచ్చి యాతనికి నమస్కరించెను. పరేశుఁడు తొట్రుపడుచుఁ బ్రతినమస్కారముం గావించెను. అప్పు డానందమయి "మీరు లలితకొఱ కెట్టివిచారము నుంచుకొనవలదు. మీ రీమె నెవ్వనిచేతుల సమర్పించితిరో యాతనివలన నీమె కెట్టికష్టమును గలుఁగదు. నాకాఁడుబిడ్డలు లేరు. ఈశ్వరుఁడు నాకింత కాలమున కట్టి యభావమును గూడ నుడుఁగఁ జేసినాఁడు. వినయుని సహధర్మిణీమూలమున నాకుఁ బుత్రికలేనిదుఃఖము తీరు నని నేనాశపడుచుండఁగా కరుణామయుఁడగు నీశ్వరుఁడు నాకోరికను ఫలింపఁజేసినాఁడు! నాకింతటి యదృష్టము పట్టునని నేననుకొనలేదు.

లలితవివాహోద్యోగ మారంభ మైనతరువాతఁ బరేశునిహృదయము సంసారమునందొకచోఁ గూలఁబడుం గాంచి యథార్థసాంత్వనముం గాంచుట కిదియే ప్రథమసమయము.

## ౬౫

కారాగృహమునుండి వచ్చినప్పటినుండియు గోరాయొద్ద కనేకులు వచ్చి ప్రతిదినమును స్తుతిపాఠములు చేయుచు నాలోచించుచు నూపిరి తిరుగకుండ మాటలాడుచు, విసిగించుచుండుటచే గోరా కింటియొద్దుండుట యసహ్యముగాఁ దోఁచుచుండెను. అందుచే గోరా మునుపటివలె జనపదసంచారము నారంభించెను. ప్రాతఃకాలమున భుజించి బయలుదేఱి రాత్రి కింటికి వచ్చుచుండెను. ఆతఁడు దినమున కొన్నిపల్లెలకుఁ బోయి యందలి కమ్మరి, తెలుకలి, చాకలి మొదలగువారి యిండ్లకుఁగూడఁ బోయి వారియాదరముం గైకొనుచుండెను. అట్టి యుత్తమబ్రాహ్మణుఁడు తమయొద్దకు వచ్చి తమకష్టసుఖములం గనుఁగొనుచుండుటకుఁ గారణ మెఱుంగఁజాలక వారందఱు నిది యేమని శంకించుచుండిరి. కాని గోరా యెట్టిసంశయమును లేకుండ వారితోఁ గలసి మెలసి తిరుగుచుండెను.

ఇట్లు జరుగుచున్నకొలఁదియు నాతని హృదయమునం దొకయుద్దేశము బలపడుచుండెను. సమాజబంధము చదువుకొన్నవారిలోకంటెఁ బల్లెటూరివారియందే యెక్కువగా నగపడుచుండెను. ప్రతిగృహమునను రేయుంబవలు జరుగుప్రతికార్యమును నెప్ప వాల్పని సమాజదృష్టులలోనే జరగిపోవుచుండెను. అందఱును లోకాచారములందొక్కటే విశ్వాసము. ఆవిషయమున నెవ్వరికి నెట్టిసంశయ మైనను లేదు. కాని, యీనియమములును, నాచారనిష్ఠలును వారికిఁ గర్మక్షేత్రమునం దెట్టిబలమును గలిగించుటలేదు. ఇంతటిభీరువులును, నిస్సహాయులును, నాత్మహితవిచారాక్షములును మఱియొకచో నుండు రనుటసందేహమే. ఆచారమును బాలించుటకంటె వీరి కెట్టియుత్తమకర్మమును లేదు. దండముకంటెను, దగవులాటకంటెను, నిషేధమే బలవంత మైనదని వారికిఁ దెలి

సిన విషయము! ఈనిషేధశాసనములమూన వారిప్రకృతి యాపాదమస్తకము నొకజాలముచే బంధింపఁబడిపోయెను. ఈజాలము ఋణజాలము; ఈబంధము మహాజనబంధము; అంతేకాని రాజశాసనము కాదు. కష్టసుఖములయందు కలయికంగూర్చు నట్టి ఘనతరైక్యభావము దీనియందు లేదు. ఈయాచారాస్త్రముచే మానవుఁడు మానవుని రక్తశోషణము గావించి నిష్ఠురభావముతో నిస్సత్వముం గూర్చుచుండెనని గోరా యోచింపకుండ నుండఁజాలకపోయెను. సమాజకర్మములం దొకరియెడల నొకరిట్టిదయ యుండు జూపకుండుట యాతఁడెన్నియోసారులు చూచెను. ఒకనితండ్రి దీర్ఘరోగి యయ్యెను. అతనిచికిత్సలకై తనయుఁడు సర్వస్వమును వ్యయించివైచెను. ఊరివారాతనికి సాయపడుటయే లేదు. మీఁదుమిక్కిలి యజ్ఞాతపాపమునకై మీతండ్రికిఁ బ్రాయశ్చిత్తము చేయింపవలెనని నిర్బంధించిరి. అతనిదారిద్ర్య మందఱకును దెలిసినదే. కాని యెవ్వరికిని దయలేదు! బందిపోటుకంటెను, పోలీసువిచారణ పల్లెటూళ్ళకెట్లు భయంకరమో యట్లే తల్లిదండ్రుల చావుకంటెను శ్రాద్ధముపెట్టుట బిడ్డలకంత దుస్సహముగా నుండెను శక్త్యనుసారమనిన దప్పదు. నిర్దయమగుసమాజవిధిని సంపూర్ణముగ నెఱవేర్పవలసినదే. ఈసమాజము మానవునికష్టసమయముల సాయపడుట లేదనియు, విపత్సమయముల ధైర్యము నొసంగుటలేదనియుఁ గేవలము శాసనములమున లోఁబఱచుకొని విపన్నునిం జేయుచున్నదనియును గోరా గ్రహించుకొనియెను.

శిక్షితసమాజమధ్యమున గోరా యీలోపమును గనుపెట్టలేదు. ఏమనిన—అందు సాధారణజనక్షేమమునకొఱ కైక్యముంగూర్చుశక్తి బహిరంగముగఁ బనిచేయుచుండును. అందట్టియేకీభావప్రయత్నముల కానవచ్చుచుండును. కాని పల్లెలయందట్టి బహిశ్శక్తి యంతగాఁ బనిచేయుటలేదు. అచ్చట నిశ్చేష్టతామధ్యమున భారతవర్షగభీరతమదుర్బలస్వరూపమును, గోరా స్పష్టముగా గనుంగొనియెను. ఏధర్మము సేవారూపమునను, కరుణారూపమునను దానరూపమునను, శ్రద్ధారూపమునను నెల్లవారికిని బలమును, ప్రాణమును, కల్యాణమును గూర్చుచుండునో యాధర్మ మచ్చట నాతని కగపడలేదు. కేవలమును విస్తరించుచు విభాగములై పీడించుచు, బుద్ధికిదౌర్బల్యమును, భీరుత వికారమును గల్పించుచుండు నాచారములుమాత్రమే యందెల్లవిషయములందును బాధాకరములై యుండెను. పల్లెలయం దట్టిమూఢ నియమానుష్ఠానములవలన గలుగుచున్నయనర్థము లనేకవిధముల నాతని కగపడుచుండెను. అవి మానవస్వాస్థ్యమును జ్ఞానమును, ధర్మబుద్ధిని, సకలకర్మములనుగూడ సంపూర్ణముగ నాక్రమించుకొని యుండెను.

పల్లెలయందలినీచజాతులలో స్త్రీసంఖ్య తక్కువయగుటచేతనో, మఱియేకారణముననో గాని కన్యాశుల్కము విశేషించి యుండుట గోరా మొట్టమొదటనే తెలిసి

కొనియెను. పురుషులు చాలమంది చిరకాలమువఱకుఁ నవివాహితులై యుండిరి. ఇట్టిచో విధవావివాహముకూడ నిషిద్ధమై యుండెను. ఇందువలనం గలుగు కష్టములను బ్రత్యేకముగ నందఱు ననుభవించుచునే యుండిరి. ఈకష్టము ననుభవించుటే కాని దీనిఁ బ్రతీకారము చేయవలయు ననునూహ యెవ్వరికిని దోఁచుటలేదు. శిక్షితసమాజమున నెంతమాత్రము నాచారము నగౌరవింపని గోరా యిప్పు డాచారభంజనముం జేయఁదలంచి యొకపురోహితుని బిలిపించుకొని పనిచేసెను. కాని లోకులెవ్వరు నంగీకరింపలేదు. బ్రాహ్మణులు విధవావివాహము చేసికొన్నచో మేమును జేసికొందు మని వారు క్రోధముతో నెదిరించిరి. ఈతఁడు మమ్ములను హీనజాతిగా భావించి మాకు హీనాచారమును బోధించుచుండెననియే వారికోపమునకుఁ బ్రధానకారణము.

పల్లీసంచారమువలన గోరా యింకొకవిషయమును గ్రహించెను. ముసల్మానులలో సర్వైక్యముం గూర్చు నొకవస్తు వున్నదనియు, నాపత్సమయములందు వారందఱు నొక్కటిగాఁ జేరుకొందు రనియు, హిందువులలో నట్టియైక్యము లేదనియు గోరా తెలిసికొనియెను. ఒక్కచోటనే యున్న యీరెండుజాతులలోనను నింతటి ప్రభేద మేలకలిగె నని యాతఁడు బాగుగ నాలోచించెను. ప్రత్యుత్తరము తోఁచినది గాని దానిని విశ్వసించుట కాతని కెంతమాత్రము నిష్టములేదు. వారు మతముచేతనే యైక్యమై యుండిరిగాని యాచారములచేఁ గాదను విషయ మంగీకరించుట కాతనిహృదయము పరితపించుచుండెను. ఆచారములు వారిసమస్తకర్మములను నిరర్థకముగ బాధించుటలేదు. ధర్మబంధమే వారియెడల ఘనిష్ఠమై యున్నది. ఏది యసత్యము కాక, సత్యమై యుండెనో యేది ఋణాత్మకము కాక ధనాత్మకమై యుండెనో దేనికొఱకు మానవు లందఱు నొక్కకేకవైచినంతమాత్రమున నొక్కనిమిషములో నొక్కటిగాఁ జేరి యనాయాసముగఁ బ్రాణములనైన నర్పించివైతురో యట్టిధర్మమునే వారందఱు నేకమై యేకభావముతో విశ్వసించి యుండిరి.

శిక్షితసమాజమధ్యమున గోరా యన్యులకు బోధించుటకును, వారినిఁ దనవంకకుఁ ద్రిప్పుకొనుటకును దనభావములను మనోహరవర్ణరంజితములుగఁ జేసి వాదములను నుపన్యాసములను గావించియుండెను. మూలవిషయములను సూక్ష్మవ్యాఖ్యానములచే విపులీకరించెను; అనావశ్యకభగ్నావశేషములకు భావచంద్రాలోకముచే లోకమోహనాకృతులం గల్పించెను. దేశమునందలికొందఱు దేశాభిమానము లేక దేశమును ఘృణీకరించుచుండిరనియెంచి దేశానురాగియగు గోరా స్వదేశమునీయవమానమునుండి రక్షించి యత్యుజ్జ్వలభావావరణమధ్యమున నిలిపియుంచుటకై యహోరాత్రములు పాటుపడుచుండెను. ఇదియాతని కభ్యాసమైపోయెను. అన్నియును మంచివే; చెడ్డవానిలోఁగూడ నెచ్చటనో మంచి యుండును; అని యీవిధముగా వకీలువలె గోరా పరిశీలించుచుం

డుటే కాక మనఃపూర్వకముగ విశ్వసించుచుండెను. అసంభవవిషయములందుఁగూడ నాతఁ డిట్టివిశ్వాసమును స్పర్ధతోఁ జయపతాకంబోలె వహించి పరిహాసపరాయణులకు ప్రతిపక్షులయెడల సుస్థిరుఁడై నిలిచియుండెను. స్వదేశమునందు స్వదేశీయులకు విశ్వాసమును మరలఁ గలిగింపవలయుననియే యాతని యేకమాత్రోద్దేశము. దానికొఱ కాతనే తక్కినపనులన్నియును !

కాని పల్లెలలో నాతనియుపన్యాసములను వినువా రెవ్వరును లేకుండిరి. ఆతని యుక్తుల కుపయోగము లేకపోయెను; అసమానద్వేషముల నడఁగించుటకై తనశక్తి నంతను జూపవలసినప్రయోజనము లేకపోయెను ఇందుచే సత్య మాతని కస్పష్టగా లేకపోయెను. ఆతనిప్రబలదేశానురాగమే యాతనిసత్యదృష్టిని ప్రదీప్తముగాఁ జేసి వైచెను !

౬౮

ఒక పట్టుకోటు తొడిగి, మొలకొక శాలువఁ జుట్టుకొని, రైలుసంచి చేతఁబట్టు కొని కైలాసుఁడు వచ్చి హరిమోహినికిఁ బ్రణామముచేసెను. ఆతనివయసు ముప్పది యేండ్ల దగ్గఱగా నుండెను. క్షౌరకర్మాభావముచేఁ గుశాంకురములవలె నొత్తుగఁ బెరిగియున్న వెండ్రుకలతో నాతని మొగము దుబ్బులబీటిం బోలియుండెను. చాల కాలమున కత్తయింటియాత్మీయునిం గాంచి హరిమోహిని యాతని నాదరముతో నొకచాపపైఁ గూర్చుండఁజేసి "కాలుచేతులు కడిగికొనుము !" అనియెను. కైలాసుఁ డక్కఱలేదని చెప్పి "మీశరీరమువం దారోగ్యముగా నున్నదా ?" అని ప్రశ్నించెను. హరిమోహిని శరీరమును గూర్చి విసుఁగును సూచించుచు "ఆరోగ్య మెట్లుండును ?" అని అనేకవ్యాధులనామము లేకరువుపెట్టి "నేనీపాటికి మరణించిననే బాగుగ నుండును. కాని నాకుఁ జావురాకున్నది!" అనియెను.

కైలాసుఁ డామాటకు నొచ్చుకొనుచు "వదినె ! అన్నగారు లేకపోయినను మీరుండుటంబట్టియే నేనీకలకత్తాకు వచ్చి యిచ్చట నాశ్రయముం గాంచితిని. లేకున్నచో నెట్లు వత్తును !" అనియెను. తరువాత గ్రామస్థులంగూర్చి అనేకపరామర్శలు జరిగెను. కైలాసుఁడు సంభ్రమముతో నలువంకలఁ దిలకించి "ఈయిల్లా మీదేనా ?" అని ప్రశ్నించెను.

హరి—ఔను.

కైలా—చాలమంచియిల్లే.

హరిమోహిని యాతనియుత్సాహమును వర్ధిల్లఁజేయుచు "కాకేమి ! చాలఁగట్టి యిల్లు !" అనియెను.

కైలాసుఁ డాయింటిపనితనము నంతను బాగుగఁ బరిశీలించెను. తలుపులు ద్వారములు గోడలు మొదలగువానిదిట్టతనమును, నున్నితనమును జూచి యానందించెను; కొడమీఁదనుఁ గ్రిందను నెన్నినిన్నిగదు లున్నవో యడిగి తెలిసికొనియెను. ఆయిల్లు గట్టుట కెంతసొమ్మగునో గ్రహించుట కాతనికి శక్తిచాలదు. అతఁడు బాగుగ నాలోచించుకొని పదిబండ్రెండువేలగు నని నిశ్చయించుకొని కొంచెము తక్కువగనే చెప్పవలయునని యెంచి "వదినే! ఈయిల్లుకట్టుట కేడెనిమిదివేలగుననుకొందును!" అనియెను. హరిమోహిని కైలాసుని పల్లెటూరితనమునకు వింతపడుచున్నట్లు ప్రకటించి "ఇరువదివేలరూపాయలకుఁ దక్కువ కాదు!" అనియెను.

కైలాసుఁడు జాగ్రత్తగా నాయిల్లంతయును బరీక్షించి యంగీకారసూచకముగాఁ దల యూచుచు నీసుందరభవన మేకేశ్వరప్రభు నిర్మితమై యుండఁగలయును గాని యితరు లిట్లునిర్మింపఁజాల రని యపరిమితానందభరితుఁ డయ్యెను. తరువాత నాతఁడు "వదినే! అంతయును బాగుగనే యున్నది! కాని కన్యక యేదీ?" అని ప్రశ్నించెను.

హరిమోహిని తొట్రుపాటుతో "మేనత్తగారి యింటికి వెళ్ళినది. రెండుమూడు దినములలో వచ్చును!" అనిచెప్పెను.

కైలా—అట్లయినచో నేనాఁగుటెందులకు? నాకుఁ గోర్టుపని యున్నది. రేపు మరల వచ్చెదను.

హరి—వ్యవహారమూమాట యటుంచుము. ఇచ్చటిపని తీరువఱకును నీవు పోరాదు.

కైలాసుఁడు బాగుగ నాలోచించి "నేను పోకున్నచో వ్యాజ్యము డిక్రీయగును. అయిన నేమి? ఆలాభ మిక్కడ లేదా?" అని నిశ్చయించుకొని యిల్లంతయుఁ బరీక్షించుచు హరిమోహినిపూజామందిరమున నీరు నిలచి యుండుటం గాంచి "వదినే! ఈయిల్లు బాగుగ లేదు. ఇచ్చట నీరు నిలుచుచున్నది. ఇట్లు చేసినచోఁ జెమ్మచే గోడలకు భంగము కలుగదా?" అనియెను.

హరి—ఏమి చేయుదును బాబూ!

కైలా—ఏమైనను సరియే. ఈయింటిలో నింతగా నీటిని వాడఁగూడదు!

హరిమోహిని యూరకుండెను. తరువాతఁ గైలాసుఁడు కన్యారూపమునుగూర్చి ప్రస్తావించుటయు, హరిమోహిని యాతనిప్రథమభార్యకంటెను జాల నందమైనదని చెప్పెను! ఆకన్యసౌందర్యమును దనపెద్దభార్యసౌందర్యముతోఁ బోల్చి చెప్పుట కైలాసున కుత్సాహముగ లేకపోయెను. అప్పు డాతఁ డొకయదృష్టపూర్వం బగు మూర్తిని మనములో భావించుకొని దిగ్భ్రాంతుఁడై పోల్చుకొనుచుండెను.

ఒకపక్షము స్థిరపడిన దని హరిమోహిని నిశ్చయించుకొనియెను. ఇఁకఁ గన్యాపక్షమున నించుక సామాజికలోప మున్నను నదియొక యసాధ్యవిషయము కాదని కూడ నామె సమాధానపడియెను.

గోరా ప్రాతఃకాలమునందే యిల్లువిడిచి పోవుచుండె నను సంగతి తెలిసికొని వినయుఁ డింకను జీకఁటియుండఁగనే సోమవారమునాఁడుదయమునవచ్చి మేడమీఁది గదిలోనికిఁ బోయి చూచెను. గోరా యగపడలేదు. సేవకు నడుగఁగా గోరా పూజాగృహమునందున్నట్లు చెప్పెను. వినయుఁ డాశ్చర్యముతోఁ బూజామందిరమునకుఁ బోయిచూచెను. గోరామడిబట్టలు కట్టుకొని పూజచేసికొనుచుండెను. అతఁడుఁ జోళ్ళచప్పుడువిని వెనుకకుఁ దిరిగి వినయునిం గాంచి తత్తరముతో "లోనికి రావలదు!" అనియెను. వినయుండు "భయములేదు.! నేను లోనికి రాను. నీతో మాటాడవలసి వచ్చితిని" అనిచెప్పెను. గోరాబయటికివచ్చి మూడవ యంతస్తు గదిలోనికి వినయుని దీసికొని పోయెను.

విన—సోదరా ! గోరా ! నేఁడు సోమవారము.

గోరా—ఔను సోమవారమే. పంచాంగము పారఁబడినను నీవుమాత్ర మీ విషయమును మఱచిపోవు! ఎట్లయినను నిది మంగళవారముమాత్రము కాదు. ఈమాట యథార్థము.

విన—నీవు రావని యెఱుఁగుదును గాని, నీతో నొకసారి చెప్పకుండ నేని కార్యమునఁ బ్రవేశింపఁజాలకున్నాను. అందుచేతనే తెల్లవారకుండ నీయొద్దకుఁ వచ్చితిని ! గోరా యేమియు మాటాడలేదు. వినయుఁడును మాటాడలేదు. అప్పుడు గోరా తనహృదయవేదనను సంపూర్ణముగ గోపనముచేసికొని నవ్వుచు "నేనురాకున్న నేమి? నీవే జయించితివి! నీయమ్మను దీసికొనిపోయితివి. ఎంతకష్టపడినను నేనామె నాఁపఁజాలకపోయితిని! తుట్టతుదకు మాయమ్మమూలముననే నేను నీకోడిపోయితిని. వినయా! ఒక్కొక్కరేకలసిపోయినారు. నేనొక్కఁడనుమాత్రమే మిగిలియున్నాను! అనియెను. వినయుఁడు వినయముతో 'సోదరా! నీవు నాపైఁ దప్పుపెట్టవలదు. నా పెండ్లికి రావలదని నే నమ్మ కెన్నియోపాయములు జెప్పితిని. అమ్మనాతో "వినయా నీపెండ్లికిరానివారు నీవు పిలిచినను రారు; వచ్చువారు నీవురవలదన్నను మానరు. కావున నీవెవ్వరిని బిలువనువలదు; నిషేధింపనువలదు! మాటాడ కూరకుండుము' అని చెప్పినది. గోరా! నీవు నాకు లొంగితివా? అమ్మకు లొంగితివి! సహస్రపర్యాయములు లొంగితివి. అట్టితల్లి యింక నెవ్వరి కున్నది?' అనియెను.

గోరా యెంత వలదనినను వినక యాతనిక్రోధమును లక్ష్యముచేయక యానందమయి వినయునిపెండ్లికిఁ బోయె నని గోరా విచారించుటలేదు. విశేషించి యానం

దించుచునే యుండెను. వినయునకుఁ దల్లిగారియపరిమేయప్రేమలేశము లభించె నని యు, నాతనికిఁ దనతో నెంతటివిచ్ఛేదము కలిగినను, మాతృప్రేమసుధారసమునుండి యాతఁడు వంచితుఁడు కాలేదనియుఁ గ్రహించుటచే గోరాహృదయమునం దొకవిధమగు సంతుష్టియు, శాంతియు నుదయించెను. అన్నివిషయములయందును గోరా వినయునకు దూరమైపోవుచున్నను నతనియెడఁగల మాతృస్నేహబంధము నిగూఢరూపముతోఁ జిర బంధమై చిరకాలమువఱకు నయ్యిరువుర నతిసమీపవర్తులనుగనే చేసివైచుచుండును.

విన—సోదరా! నేనిఁకఁ బోయెదను. ఇష్టముగ లేకున్నచో నీవు రావలదు. కాని మనసులో మాత్రము మతియొకలాగుంచుకొనవలదు. ఈసమ్మేళనము నాజీవితము నెంతటిసార్థకముగాఁ జేసెనో నీవించుక భావింపఁగలిగినచో నీవెంతమాత్రము నావివాహమునకు విముఖుఁడవు కాఁజాలవని సాహసించి చెప్పఁగలను.

అని చెప్పి వినయుఁడు లేచుటయు, గోరా "కూర్చుండుము. నీ పెండ్లి రాత్రి గదా. ఇప్పటినుండియుఁ దొందర యేల?" అనియెను. వినయుఁడు తలఁచుకొనియైన నుండని గోరాయాదరమునకు విగళితహృదయుఁడై కూర్చుండెను. క్రమముగా వారిప్పటివలె మాటాడుకొనఁదొడంగిరి. ఈదినములలో వినయునిహృదయవీణ యంచనుస్వరము నెంతహెచ్చుగా మ్రోయించుచుండెనో యంత హెచ్చుగనే గోరా దానినడ్డగించుచుండెను. వినయుఁడు విడువకుండ మాటాడుచుండెను. వినయునిముఖమునుండి యకించిత్కారములును, బరిహాసపాత్రములునగుచిన్నచిన్న విషయములుగూడ మధురగానములం బోలి మధురరసోచ్ఛ్వసితములై వెలువడుచుండెను. ఇప్పు డాతనిహృదయమధ్యమునం దోచుచున్నయాశ్చర్యలీలను రసవంతముగఁ జేసి వినయుఁడు నిపుణభాషణములతోఁ సూక్ష్మముగను, గభీరముగను, హృదయంగమముగను వర్ణింప నారంభించెను. ఇంతటి యపూర్వవిజ్ఞానము! ఇంతటియనిర్వచనీయపదార్థమును హృదయపూర్ణముగఁ జేసికొనుట యెల్లరకును సాధ్య మగునా? లోకమునందలిసాధారణస్త్రీపురుషసమ్మేళనమునం దిట్టిమధుర సంగీతము వినఁబడ దనియు, నన్నితరులతోఁ బోల్పవల దనియు వినయుఁడు చెప్పెను. ఇట్టిసంఘటన మెన్నఁడు నెచ్చటను ఘటిల్లి యుండ దనియే యాతనియుద్దేశము. ఎల్లయెడల నిట్టిసంఘటనమే కలిగినచో వసంతపవనాంకురమున నవపల్లవపులకిత మగువనముంబోలి జగమంతయు నవజీవనకళావిలసితము కాదా? మానవులయందున్నసమస్తసౌందర్యమును, సమస్తశక్తులును సహజముగనే వివిధవర్ణములతో వివిధాకృతులతో విజృంభింపవా? ఈస్వర్ణకిరణస్పర్శము నెవ్వ రుపేక్షింపఁగలరు? దీనిమూలమున సామాన్యు లసామాన్యు లగుదురు! అట్టియసామాన్యత్వమును జీవితమునం దొకసారియైన రుచిచూచినవారే ధన్యులు!

వినయ—గోరా! నిజము చెప్పుచున్నాను. మానవస్వభావమును నిమిషములో మేల్కొల్పునది ప్రేమయొక్కటియే. ఏకారణముచేతనో యది మనలో దుర్బలమై యున్నది. అందుచేతనే మనకుఁ బరిపూర్ణప్రాణశక్తి లేకుండఁ బోవుచున్నది. మనలో నేమున్నదో మనకుఁ దెలియుట లేదు. మనలోనిరహస్యమును మనము ప్రకటింపఁజాలకున్నాము. మనసంచితమును మనము వ్యయింపఁజాలకున్నాము. అందుచేతనే నలుదెసలను మనకీనిరానందము! అందుచేతనే మనలోనిమహత్వము కేవలము నీవంటివా రొకరిద్దఱికే తప్ప సాధారణుల కందఱకును దెలియకుండఁ బోవుచున్నది—

ఇంతలో మహిముఁడు పడకనుండి లేచినశబ్దము వినవచ్చుటచే వినయునకుత్సాహభంగ మయ్యెను. అతఁడు గోరాయొద్ద సెలవు గైకొని పోయెను. గోరా డాబామీఁద నిలువఁబడి పూర్వసంధ్యాకాశమువంకఁ జూచి యొక్కనిట్టూర్పు విడిచెను. అతఁడు చాలసేపటివఱకు నచ్చటనే పచారు చేయుచుండెను. గోరా యెంత ప్రయత్నించినను దనమనోరథమును సఫలముగఁ జేసికొనఁజాలకుండెను. గోరా యొక్కఁడే కాక యాతని సమస్తజీవితక్రియలును నాకసమువంకఁ జేతులెత్తి సముజ్జ్వలమును, సుందరము నగునొకతేజమును వాంఛించుచుండెను. సమస్తోపకరణములును సంసిద్ధములై యుండెను. సమస్తసంపత్తియు సమకూర్పఁబడి యుండెను కాని, కేవలము నానాసాంత్వనోద్భాసితమును, స్నిగ్ధసుందరారుణరాగరంజితంబును నగు నాతేజ మెచ్చట నున్నది? ఉన్నదానిని వర్ధిల్లఁజేయుటకై ప్రయత్నించుటవలన నుపయోగము లేదు. కాని దానిని సముజ్జ్వలముగను, సౌందర్యమయముగను బ్రకాశింపఁజేయవలయుననియే యాతనివాంఛ! ఒకసుముహూర్తమున స్త్రీపురుషులప్రేమ నాశ్రయించి యనిర్వచనీయంబగునున్నతిం గాంతు రని వినయుఁడు చెప్పినప్పుడు గోరా మునుపటివలె నామాటను ద్రోసివైవఁజాలకపోయెను. అసమ్మేళన మసామాన్యమైనదనియుఁ, బూర్ణమైనదనియు సృష్టిసంపర్క మమూల్యమైనదనియు, నది భావములకు రూపమును రూపమునకుఁ బ్రాణమును బ్రసాదించుననియు, దానిమూలమునఁ బ్రాణమధ్యమునఁ గదలికయు, మనోమధ్యమున మననమును ద్విగుణీకృతము లగుటయే గాక యవి నూతనరససంసిక్తములుకూడ నగుననియు గోరా మనఃపూర్వకముగ నంగీకరించెను.

ఈసామాజిక విచ్ఛేదదినమున వినయునిహృదయము గోరాహృదయముపై నఖండమగు నేకతానమున నొకసంగీతమును మ్రోగించి పోయెను. వినయుఁడు పోయినను వేళ మించిపోయినను నాసంగీతము మాత్రము మ్రోగుచునే యుండెను. సముద్రాభిముఖమగునదీద్వయమిళితముంబోలి వినయుని ప్రేమప్రవాహ మిప్పుడు గోరా ప్రేమప్రవాహమునఁ బ్రవేశించి తరంగములచే దరంగములను ఘోషితములుగాఁ

జేసికొనుచుండెను. గోరా యిన్నాళ్ళవఱకును బంధించి క్షీణింపఁజేసి, యణఁగపడ యుండఁ జేయవలయు నని ప్రయత్నించిన యాబాహినియే యిప్పుడు కూలముల నొరసి సుస్పష్టాకృతితోఁ బ్రబలవేగముగఁ బ్రవహించుచుండెను. దాని నిప్పుడు నిందించు టకుఁగాని నిషేధించుటకుఁగాని యాతనికి శక్తి లేకుండెను—దినమంతయు నీవిధము గాఁ గడచెను. తుదకపరాహ్ణము సాయాహ్నమున విలీన మగుచున్నప్పుడు గోరా యిల్లు విడిచి పోవుచు "ఏది నాదియో దానిని నేను గైకొనవలయును. కాకున్నచో బ్రపంచమున నే నసంపూర్ణుఁడను వ్యర్థుఁడను నైపోవుదును!" అని భావించుకొనియెను. ఈప్రపంచమధ్యమున సుచరిత యాతనిపిలుపునకే వేచి యున్నదనువిషయమున గోరా కెట్టి సంశయమును లేదు. నేఁటిసాయంకాలమే యీకోరిక నాతఁడు సఫలముగఁ జేయవలయును.

అతఁడు జనాకీర్ణమగువీథినిఁ బడి యాతని నెవ్వరు ననుసరింపఁజాలనంతటివేగముతోఁ బోవుచుండెను. ఆతనిహృదయ మాతనిశరీరము నతిక్రమించి యేకాగ్రమై యెక్కడికో పోయి యుండెను. అతఁడు సుచరితయింటియొద్దకుఁ బోవునప్పటికి ద్వారము మూయఁబడి యుండెను. కొంతసే పాలోచించి పిమ్మట నాతఁడు తలుపు గొట్టి పిలిచెను. సేవకుఁడు తలుపు తీసి గోరాను జూచి "అక్కగారింటిలో లేరు." అని యడుగకుండఁగనే చెప్పివైచెను.

గోరా—ఎక్కడికిఁ బోయెను?

సేవ—ఆమె కొన్నాళ్ళనుండి లలితాసోదరివివాహప్రయత్నములలో నున్నది.

ఆమె వినయునివెండ్లికిఁ బోయియుండును నని గోరా నిమిషములో గ్రహించెను. ఇంతలో లోపలనుండి కైలాసుఁడు వచ్చి "అయ్యా! ఏమి కావలయును?" అని ప్రశ్నించెను. గోరా యాతని యాపాదమస్తకమును జూచి "ఏమియు నక్కఱ లేదు!" అనియెను. కైలాసుఁ డొంటిగ నుండుటచే నేమియుం దోఁచక యించుక సేపు కూర్చుండుఁడని బలవంతము చేసెను. గోరా నాకుఁ బని యున్నదని చెప్పి యతివేగముగ వెడలిపోయెను. తన జీవితమునందలి సంఘటనములు చాలవఱకుఁ గేవలమును దనయిచ్ఛచేతనే సాధింపఁబడునవి మాత్రము కావనియు, నందేదో భగవదుద్దేశముండుననియు స్వదేశవిధాతయగు నీశ్వరుని యేయుద్దేశమునో నిర్వహించుటకై తాను జన్మించితిననియు గోరాకు దృఢవిశ్వాసము కలదు.

అందుచే గోరా తనజీవితసంఘటనములను బాగుగఁ బరిశీలించుకొనుచుండును. తా నత్యంతోత్సాహముతో వచ్చినప్పుడు సుచరిత యింటితలుపు మూసి యుండుటయు, నామె లేదని తెలియుటయు నాతనికి భావపూర్ణసంఘటనములుగనే తోఁచెను. ఈజీవితమున సుచరిత తలుపిట్లే మూయఁబడి యుండుననియు, నామె నీకు లభింప

దనియుఁ దనజీవితవిధాయకుఁ డీవిధముగాఁ సూచించె నని గోరా యనుకొనియెను. గోరావంటివానికి వాంఛాముగ్ధుఁడై యుండుట కవకాశము లేదు. ఆతనికి స్వకీయము లగు సుఖదుఃఖములు లేవు. ఆతఁడు భారతవర్ష బ్రాహ్మణుఁడు. భారతదేవతారాధనమే యాతనికర్తవ్యము; భారతతపస్సే యాతనితపస్సు; ఆసక్తియు, ననురక్తియు నాతనికి లేవు. ఆతఁడు తనలో "జగద్విధాత నాయెదుట నాశక్తిస్వరూపమును బ్రదర్శించెను. అది శుభ్రశాంతస్వరూపము కాదు. మద్యముఁబోలి రక్తతీవ్రస్వరూపమైనది. అది బుద్ధికిఁ జాంచల్యమును గూర్చుటయే కాక రూపమునే మార్చివేయును. నేను సన్యాసిని నాసాధనమధ్యమున దానికిఁ దావులేదు" అని భావించుకొనియెను.

## ౭౧

చాలకాలమున కీదినములలోనే సుచరిత కానందమయిచెంత నెన్నఁడు ననుభవింపనంతటి విశ్రాంతి లభించెను. అపరిచిత వని గాని, పరాయిదానవనిగాని సుచరితకెన్నఁడు నెంతమాత్రమును దోఁచకుండునంతటివాత్సల్యముతో నానందమయి యామె నాదరించెను. ఆనందమయి సుచరితమనసంతయు నెట్లు గ్రహించెనో యట్టే యెట్టి మాటయుఁ జెప్పకుండఁగనే యామె కూరటం గల్పించెను. 'అమ్మా!' అనుశబ్దమును సుచరిత యిదివఱ కెన్నఁడు నింతహృదయపూర్వకముగా నుచ్చరింపలేదు. ప్రయోజనము లేకున్నను నానందమయి నమ్మాయని పిలుచుటకై సుచరిత యనేకావకాశములను గల్పించుకొనుచుండెను. లలితవివాహము సంపన్నమయ్యెను. సుచరిత యాయాసముతో శయనించి 'అమ్మను విడిచి నే నెట్లు పోఁగలను!' అని భావించుకొనుచు, దన్నుఁదానే "అమ్మా! అమ్మా" అని పిలుచుకొనుచుండెను. అప్పుడామెహృదయము వికసించి కన్నులనుండి యశ్రుధారలు వెలువడుచుండెను. అప్పు డాకస్మికముగా నానందమయి వచ్చి దోమతెరను వదల్చి పరుపుపైఁ గూర్చుండి సుచరిత నెమ్మేను నిమిరుచు "అమ్మా! నన్నెందులకు బిలుచుచున్నావు?" అనియెను.

అప్పుడు సుచరితకుఁ దెలివి వచ్చుటచేఁ దా నమ్మాయని పిలుచుచున్నట్లు బోధపడియెను. అప్పుడు సుచరిత ప్రత్యుత్తర మీయజాలక యానందమయియొడిలో బొరగిలఁబడి యేడువఁదొడంగెను. ఆనందమయియును మఱి యేమియు మాటాడక యా రాత్రి యామె చెంతనే శయనించెను.

వినయుని పెండ్లి యైపోయినను నానందమయి యింటికిఁ బోక "వీరింకను గృహకృత్యములను జక్కఁజేసికొనఁజాలరు. కొన్నాళ్ళుండి వీరికిఁ దగినయేర్పాటు చేయకుండ నే నెట్లుపోఁగలను?" అనియెను. అప్పుడు సుచరిత "అమ్మా! ఈకొన్నాళ్ళును నేనుగూడ నీతో నుండెదను" అనియెను. లలితయు నుత్సాహముతో 'ఔనమ్మా! అక్కకూడ మాతోఁ గొన్నాళ్ళుండవలయును' అనియెను. అంతలో సతీశుఁడు గం

తులు వైచుచు వచ్చి 'అక్కా! నేనుకూడ నీతో నుండెదను.' అనుటయు సుచరిత 'నీచదువో బాబూ?' అని ప్రశ్నించెను. నేను వినయబాబునొద్దఁ జదువుకొందు నని సతీశుఁడు చెప్పెను. సుచరిత నవ్వుచు 'వినయబాబు నీకుఁ జదువు చెప్పలేఁడు!' అనియెను. ప్రక్కగదిలోనే యున్న వినయుఁడు తత్క్షణమే "చెప్పఁగలను. ఎన్నియోరాత్రులు నిద్రలేకుండఁ జదివినచదు వంతయు నొక్కనాఁటికే మఱచిపోవుదు ననుకొంటివా?" అనియెను.

ఆనం—మీదొడ్డమ్మకిష్ట ముండునా?

సుచ—నే నామె కుత్తరము వ్రాసెదను.

ఆనందమయి "నీవువలదు! నేను వ్రాసెదను." అనియెను. అట్లు సుచరిత వ్రాసినచో హరిమోహిని కామెపైఁ గోపము కలుగుననియు దనపైఁ గోపము కలిగినను నష్టము లేదనియు నానందమయి యూహించుకొని 'లలిత కింటిపనులు నేర్పుటకై కొన్నాళ్ళు నేనింట నుండెదను. సుచరితను గూడ నుంచుకొనుటకు నీవనుమతించినచో లలితకు విశేషోత్సాహముగా నుండును." అని హరిమోహిని కుత్తరము వ్రాసెను.

ఆయుత్తరమువలన హరిమోహినికిఁ గోపమే కాక యొకవిధమగు సంశయము గూడఁ గలిగెను. ఈవిధ[illegible]నఁ దల్లిబిడ్డలు బాగుగ నాలోచించుకొని యెట్లయిన సుచరితను దమవలలోఁ [illegible]ంచుకొనుటకుఁ బ్రయత్నించుచుండిరని యామె యనుమానించెను. హరిమోహిని [illegible]నవతిశీఘ్రముగ సుచరితను విఖ్యాతరాయకుటుంబమునఁ జేర్పవలయునని యుండెను. కైలాసుఁడుకూడఁ గొన్నాళ్ళనుండి వేచియున్నాఁడు—ఈయుత్తరము చేరినమఱునాఁటియుదయముననే హరిమోహిని పల్లకియెక్కి వినయునియింటికి వచ్చెను. అప్పుడు క్రిందిగదిలో లలితాసుచరితలు, నానందమయియును వంటప్రయత్నములను జేయుచుండిరి. పైగదిలో సతీశుఁ డింగ్లీషుపాఠమును వల్లించుకొనుచుండెను, ఇంటిలో నంతగట్టిగాఁ జదువనక్కఱలేదు. కాని తాను చదువుచున్నట్లందఱకును దెలియుటకై యాతఁడు బిగ్గఱగాఁ జదువుచుండెను.

ఆనందమయి హరిమోహిని నత్యాదరముతో నభ్యర్థించెను. హరిమోహిని యాగౌరవమును పాటింపక "నేను రాధారాణిని దీసికొనిపోవుటకై వచ్చితిని" అనియెను. "అట్లే తీసికొనిపోవచ్చును కొంచెము సేపాఁగుము!" అని యానందమయి చెప్పుటయు హరిమోహిని "నాకుఁ బూజవేళ దాఁటిపోవును. ఇక్కడఁ గూర్చుండుటకు నాకవకాశము లేదు." అనియెను. సుచరిత యేమియు మాటాడక సొరకాయను దఱుగుచుండెను. హరిమోహిని యామెం గాంచి "వినఁబడినదా? వేళ మించిపోవుచున్నది." అనియెను. లలితయు, నానందమయియును మాటాడక కూర్చుండిరి. సుచరిత చటాలున లేచి "దొడ్డమ్మా! రమ్ము" అనియెను. హరిమోహిని పల్లకివైపునకుఁ బోవుచుం

డఁగా సుచరిత యామెచేయి పట్టుకొని గదిలోనికిఁ దీసికొనిపోయి “దొడ్డమ్మా! నాకొఱకు వచ్చిన నిన్నిందఱియెదుట నూరక తిరిగిపంపింతునా ? నేను నీతోనే వచ్చెదను. కాని రెండుజాములైనతరువాత మరల నేనిక్కడకు రావలయును!” అని చెప్పెను.

హరిమోహిని కటుస్వరముతో “అదేమిమాట! ఎప్పుడు నిక్కడనే యుండుమని చెప్పరాదా?” అనియెను. సుచరిత మెల్లగా “అట్టిభాగ్యము లేకుండుటచేతనే యవకాశమున్నంతవఱ కామెచెంత నుండఁదలంచి యామెను విడువఁజాలకున్నాను!” అనియెను. ఆమాటకు హరిమోహినియొడలు మండిపోయెను కాని యప్పు డేమనుటయు నామె కుచితముగాఁదోఁచలేదు. సుచరిత యానందమయిచెంతకువచ్చి నవ్వుచు “అమ్మా! నేనొకసారి యింటికిఁ బోయి వచ్చెదను. అనియెను. ఆనందమయి యేమియుఁ బ్రశ్నింపక “వెళ్లుము తల్లీ!” అనియెను.

నేను రెండుజాములకు మరల వచ్చెద నని సుచరిత లలితచెవిలోఁ జెప్పి పల్లకియొద్దకుఁ బోయి నిలువఁబడి “సతీశా!” అని పిలిచెను. సతీశుఁడుమాత్ర మున్నచోఁ దనబనుల కాతంకముగా నుండు నని యెంచి హరిమోహిని యాతని నచ్చటనే యుంచుమనియెను. ఇరువురును బల్లకి నెక్కి పోవుచున్నసమయమున హరిమోహిని తనభావిప్రబంధమునకు భూమికగా “అమ్మా! లలితకుఁ బెం[illegible]ది. పరేశున కొకయాఁడుఁబిడ్డవిచారము వదలి పోయినది. ఇంటిలో నీడువచ్చి[illegible]యుండుట గృహస్థున కెంత శ్రమ మనుకొన్నావు! ఏమని చెప్పుదును. నాకితరచింత[illegible] లేదు! భగవన్నామము చేసికొనుచుండఁగా నాకీవిచారమే తోఁచుచుండును. నాకు మునుపటివలె దేవపూజ జరుగుటయే లేదు గోపీవల్లభుఁడు నాకు మరలనూతనబంధనమును గల్పించినాఁడు.” అని యేమేమో చెప్పదొడంగెను.

హరిమోహిని కిది కేవలము సాంసారికోత్కంఠయే కాదు. ఇది యామెముక్తిపదమునకుఁగూడ నంతరాయమై యుండెను, ఆమెపలుకల యింతటిదుస్సహవిచారమును వినియును, సుచరిత యూరకుండెను. హరిమోహినికి సుచరిత యుద్దేశము బోధపడుట లేదు. మౌనమే సమ్మతిసూచకమనియు, సుచరితహృదయ మించుక మెత్తఁబడియె ననియు హరిమోహిని తనకనుకూలముగా భావించుకొనియెను.

పల్లకి యింటియొద్దకు వచ్చెను. ఇరువురును దిగి లోపలఁ బ్రవేశించుచుండఁగాఁ బ్రక్కగదిలో నెవ్వడో యొకయపరిచితపురుషుఁడు తల యంటుకొనుచున్నట్లు కనుంగొని సుచరిత నిస్సంశయముగా నాతనివంక దృష్టిప్రచారముం గావించి మేడమీఁదికిఁ బోయెను. అక్కడ హరిమోహిని తనమఱదివచ్చినసంగతి సుచరితకుఁ దెలియఁజేసెను. హరిమోహిని పూర్వభూమికఁబట్టి సుచరిత యీసంఘటనమున కర్థమును గ్రహించుకొనియెను. అప్పుడు హరిమోహిని “అమ్మా! మనయింట నతిథి యుండఁగా

నీవు మధ్యాహ్న మిల్లు విడిచి పోవుట మర్యాదగా నుండునా ?" అనియెను. సుచరిత దృఢస్వరముతో "కాదు దొడ్డమ్మా! నేను పోయి తీరవలయును.'' అనియెను. హారిమోహిని మెల్లగా "అట్లే పోదువుగాని—నేటికివ నుండి రేపు పోవచ్చును.'' అనియెను. సుచరిత యంగీకరింపక "నేనిచ్చట స్నానము చేసి తండ్రిగారియింట భుజించి యటనుండి లలితయింటికిఁ బోయెదను." అని చెప్పెను. అప్పుడు హారిమోహిని స్పష్టముగా "అతఁడు నిన్నుఁ జూచుటకే వచ్చినాఁడు!'' అనియెను.

సుచ—నన్నుఁ జూచుటకుఁ బ్రయోజన మేమున్నది ?

హారి—ఈదినములలో నిది యొకపద్ధతి ఇది పూర్వములేదు. నాపెండ్లికి బూర్వము మీపెదనాయన నన్ను జూడనేలేదు! ఇప్పుడిది యందఱకును సాధారణ మైపోయినది. అయినను నిందంత యుత్పాత మేమున్నది? అయిదునిమిషములు! ఒకసారి చూచి చక్కఁబోవును.

సుచ—వలదు.

వలదనునీతీవ్రస్పష్టవచనము హారిమోహినిని వెనుకకు గెంటివైచెను. అప్పుడు హారిమోహిని "అమ్మా! ఇది యంత యావశ్యకమే కాదు. అయినను కైలాసుఁడు కాలపువాఁడును, జదివినవాఁ [illegible] మీవలెనే పూర్వపద్ధతులను విశ్వసింపనివాఁడును గావునఁ గన్యను స్వయము [illegible] కలంచెను. నీవైనను నెవ్వరికంటను బడకుండ నింట నుండుదానవు కావు గ [illegible] జూపింతు నని నే నాతనితోఁ జెప్పియుంటిని. ఇందు నీవు సిగ్గుపడవల [illegible] అని చెప్పి కైలాసునిగుణగణంబులను దృష్టాంతపూర్వకముగా [illegible] ప నారంభించెను. అతనికి హిందూసమాజమునం గలవంశగౌరవమును [illegible] చెప్పెను—అట్టి యాతనిగౌరవమును భంగించుటకు సుచరిత యెంతమాత్రము నంగీకరింప దయ్యెను. ఆమె స్వలాభమునుగాని, స్వగౌరవమునుగాని చూచుకొనక హిందూసమాజమునఁ దనకుఁ దావు దొరకకున్నను విచారము లేనిదానివలె నుండెను. హారిమోహిని శ్రమపడి కైలాసుని సమ్మతింపఁజేయుట సుచరిత తనకెట్టి యుపకారముగను భావించుట లేదనుసంగతి మాధుర్యా లను హారిమోహిని గ్రహించుకొనలేకపోయెను. సుచరిత యిది యంతయుఁ దనకవమానము గనే భావించుకొనియెను ఆధునికవిపరీతవ్యాపారములందు హారిమోహిని హతబుద్ధియై యుండెను. అప్పు డామె గోరానుద్దేశించి నిందింపఁదొడంగెను—గోరా తానెంత హిందువు నని చెప్పుకొనుచున్నను సమాజమునం దాతని కెట్టిగౌరవ మున్నది ? అతఁడు లోభించి యేబ్రాహ్మకన్యకనైనను బెండ్లియాడి మరలఁ దనసమాజములోనే యుండునంతటిసామర్థ్య మాతనికున్నదా?'' ఇట్లే—

సుచ—దొడ్డమ్మా! నీకీమాట లన్నియు నేల ? వీని కేమైన మూల మున్నదా?

హరి—నేను మాటలచే మఱపించునంతటిపనిదానను గాను. నాకును గన్నులున్నవి; చెవులున్నవి. అన్నియును జూచుచు వినుచు నూరక కూర్చుండి యున్నాను. గోరా నిన్నెట్లయినఁ బెండ్లియాడవలయు ననుదుద్దేశముతో నున్నాఁడు ఈ విషయమున నాతఁడు తల్లితోఁ గూడ నాలోచించి యుండును. నీవు మా రాయవంశముతో సంబంధముం గూర్పవలయు నని నేను శ్రమపడుచున్నాను.

సుచ—నీవేవంశముంగూర్చి చెప్పితివో వారియందు నాకు గౌరవ మున్నది. అది యసామాన్యసంబంధ మని నీవే చెప్పితివి. కావున వారితోడిసంబంధమునకు నాకెట్టియవకాశమును లేదు. నేనిప్పు డిటనుండి పోయెదను. నీమనసు శాంతించినప్పుడు మరల వచ్చి నీతోఁగలసి యుండెదను.

హరి—గోరాను నీవు పెండ్లియాడఁదలంపకున్నచో నీకైలాసునితోడి సంబంధమునుగూడ నేల త్యజించెదవు? నీవెప్పుడును గన్యగనే యుండవుగదా!

సుచ—ఉండకేమి? నేను పెండ్లిచేసికొనను.

హరి—వృద్ధవయఃపర్యంతము నిట్లే యుందువా?

సుచ—ఆ. మృత్యుపర్యంతమును—

౭౨

ఈదెబ్బతో గోరామనసునకుఁ బరివర్త [illegible] సుచరిత తనమనసు నాకర్షించుటకుఁ గారణము నాతఁ డప్పుడ [illegible] అతఁ డామెతో సహవాసము చేసెను; తనకుఁ దెలియకుండఁ [illegible] కొనియెను; నియమసీమను దంభభావముతోఁ నుల్లంఘించెను— [illegible] ప్రత్యేకముగ నియమపాలనము చేసికొనకున్నచోఁ దెలిసియో, తెలియకో, స్వయముగ ననిష్టముల పాలగుటయే కాక పరహితముం గూర్పఁజాలువిశుద్ధశక్తినిగూడ గోల్పోవును. సంసర్గముచే వివిధములగు హృదయవృత్తులు ప్రబలి జ్ఞాననేత్రశక్తులను బలవంతముగ నావరించుకొనును.

గోరాకీసత్యజ్ఞానము కేవలబ్రాహ్మకన్యాసహవాసముచే మాత్రమే కలుగలేదు! అతఁడీనడుమం గావించినపల్లీసంచారమునంగూడ నొకసుడిగుండమునం బడి యాత్మవిస్మృతుఁ డగుట కారంభించెను. అతనికి మాటిమాటికిని దయ కలుగుచుండెడిది. అందుచేతనే "యిది లోపము; ఇది యన్యాయము; దీనిని సవరింపవలయును" అని తోఁచుచుండెను. కాని యిట్టిదయావృత్తియే మంచిచెడ్డలను నిర్ణయించుశక్తికి వికారముం గల్పించుటలేదా? దయచూపవలయు ననునుద్దేశము వర్ధిల్లుచున్న కొలఁదియు మనకు సత్యమును గ్రహించుశక్తి సన్నమైపోవుచుండును. అందుచేతనే సకలహితభారమును వహించువారు నిర్లిప్తులై యుండవలయు నని పెద్దలు విధించి యున్నారు.

ప్రజలతో నిరంతరసమ్మేళనముండిననే కాని రాజునకుఁ బ్రజాపాలన మసంభవమను మాట కేవల మమూలకమైనది. రాజునకుఁ బ్రజాసంబంధమున నుపయోగించుజ్ఞానము నిరంతరప్రజాసంపర్కముచేఁ గలుషితమైపోవును. అందుచేతనే ప్రజలు రాజును దమకు దూరముగాఁ జేసికొని యుందురు. రాజుకూడఁ బ్రజలను సహచరుఁడై యున్నచో రాజప్రయోజనము లేకుండఁబోవును. బ్రాహ్మణుఁడుకూడ నట్లే దూరస్థుఁడైనచో నిర్లిప్తుఁడగును. పరహితాచరణమే బ్రాహ్మణధర్మము. కావుననే యాతఁడెవ్వరిసంపర్కమును లేకుండ నుండవలయును.

గోరా—యిట్లనుకొనియెను. నేను భారతవర్షమునం దట్టిబ్రాహ్మణుఁడను. పదిమందిలోఁ గలసి ప్రబలవ్యవసాయపంకమునం బొరలుచుఁ బాపధనలోభముచేఁ బరమలుబ్ధులై శూద్రత్వపాశమును మెడకుఁ దగుల్చుకొని యుద్బంధనముచే నుక్కిరిబిక్కిరియై పోవుచుండువారి భారతవర్షమున సజీవపదార్థములుగాఁ బరగణింపఁబడరు. వారు శూద్రులకంటెను నధములు. శూద్రుఁడు శూద్రత్వముచేతనే తన్నురక్షించుకొనుచున్నాఁడు. కాని బ్రాహ్మణులు బ్రాహ్మణత్వాభావముచే జచ్చుచును నపవిత్రులగుచున్నారు. అట్టియపవిత్రాశౌచముచేతనే భారతవర్ష మిప్పుడు దీనభావముతో దినయాపనము [illegible]న్నది. నేనిప్పుడు నాలోనున్న బ్రాహ్మణసంజీవనము త్రమును సాధించెద[illegible]యను నియమంతుఁడనై యుండవలయును. నేనంద జితోఁడను సమానత్వ[illegible]త్వము నాకుఁ బ్రయోజనీయవస్తువు కాదు. నేను స్త్రీసాహాయ్య[illegible]వ శ్రేణిలోనివాఁడను గాను. సాధారణజనసంసర్గము నాకు వర్జ్య[illegible] వర్షముకొఱకు దూరాకాశమువంకఁ జూచుచున్నట్లే శ్రేయముకొఱకు బ్రాహ్మణునివంక నిరీక్షించుచున్నది. నేను సామాన్యులతోఁ గలసినచో వారిని రక్షించువా రెవ్వరు?

గోరాయిదివఱకు దేవపూజయందు మనసు బెట్టలేదు. హృదయము సంక్షుభితమై యవశమై, కర్మము శూన్యమై జీవనము సగమై, బాధాకరమై తోఁచుచుండుటచే నిప్పుడాతఁడు పూజయందు మనసు నిల్పుటకుఁ బ్రయత్నించుచుండెను. ప్రతిమయెదుట నుస్థిరుఁడై కూర్చుండి మూర్తియందుఁ జిత్తమున కేకాగ్రతం గూర్చుట కభ్యసించుచుండెను. కాని యేయుపాయముచేతను నాతఁడు తనభక్తిని నిశ్చలముగఁ జేసికొనలేఁ బోయెను. ఆతఁ డీశ్వరునింగూర్చి బుద్ధిచేఁ దర్కించుకొనియెను; ఒకమూర్తిగాఁ జేసికొన్నఁగాని గ్రహించుట యసాధ్యముగా నుండెను. కాని మూర్తియందు హృదయసంబంధమగుభక్తి నిలుచుట లేదు. ఆధ్యాత్మికప్రబోధమును బూజించుట కుపాయ మగపడుట లేదు. పూజలేకుండ నింటఁ గూర్చుండి తనలోఁ దానుగాని, మఱియొకరితోఁ గాని తర్కించుచు భావప్రవాహమున మనోవాక్కులను దేలించివైచునప్పు

డే యాతని కొకవిధ మగు నానందమును, భక్తిరససంచారము నగుచుండెను. అయినను గోరా విడువక యది యొకనియమముగాఁ బ్రతిదినమును బూజ చేయుచుండెను. భావసూత్రముచే సర్వసమ్మేళనముం గావించుశక్తి చాలనప్పుడు నియమసూత్రమునే గ్రహింపవలయునని యాతనియుద్దేశము. గోరా పల్లెలయందలి దేవాలయములకుఁ బోయి, యివియే మాకు విశేషస్థానము లనియు, భగవంతునకును, భక్తునకును నడుమ బ్రాహ్మణుఁడు సేతువువలె నిలిచి యుభయసంయోగమును రక్షించు ననియుఁ జెప్పుచుండును. క్రమముగా నాతనికి భక్తి యనునది సామాన్యులకే గాని బ్రాహ్మణునకు దానితో నిమిత్తము లేదనికూడఁ దోఁచెను. భక్తునకును భక్తికిని నడుమ జ్ఞానసేతువున్నదనియు, నదియే వాని పరస్పరసంబంధమును, నుభయసీమలను రక్షించు ననియు, యీశ్వరునకును భక్తికిని నడుమ జ్ఞానమను వ్యవధానము లేకున్నచో సమస్తమును విశృతమైపోవు ననియు, నిందుచేత నే భక్తివిహ్వలత్వము బ్రాహ్మణున కనావశ్యకమనియు, బ్రాహ్మణుఁడు జ్ఞానశిఖరమునం దుండి సామాన్యజనోపయోగమునకై భక్తిరసమును వినిర్మలముగఁ జేయుటకుఁ దపోనిరతుఁడై యుండవలయుననియు, బ్రాహ్మణునకు సంసారమున సుఖభోగములేనట్లే దేవార్చనమున భక్తిభోగమును లేదనియు, నిదియే బ్రాహ్మణగౌరవ మనియు, సంసారమున బ్రాహ్మ[illegible] యము సంశయములును, ధర్మసాధనమున జ్ఞానముమాత్రమే యావశ్యక[illegible] తని యభిప్రాయము.

హృదయము గోరా నుల్లంఘించు[illegible] బ్రవాసశిక్ష విధించెను. కాని యాశాసనము నమలుజరుపుట [illegible] బల మెచ్చట నున్నది?

౭[illegible]

ప్రాయశ్చిత్తసభకుఁ బ్రయత్నములు జరుగుచుండెను. ఇది సామాన్యులకు ధర్మజ్ఞానముం గల్పించుటకుఁ గాని కేవలము గోరాశుద్ధికొఱకే కాదనియుఁ గోరా యెప్పుడును బరిశుద్ధుఁడే యనియు, నీసభ దూరమున గంగాతీరమున జరుగుటకంటె నగరమధ్యమున జరుగుటయే యుచితముగా నుండు ననియు నవినాశుఁడు తలంచెను. వేదమంత్రములతోడను, హోమములతోడను నీపని జరుపవలయును గావున దీనికిఁ దపోవనమే యుచితస్థాన మని గోరా చెప్పెను. స్వాధ్యాయముఖరితమును, హోమానలప్రదీప్తము నగుపవిత్రగంగాతీరమునఁ బ్రాచీనభారతవర్షజగద్గురు నాహ్వానించి స్నానము చేసి పవిత్రుఁడై యాతనియొదుట నవజీవనదీక్షం గైకొనవలయు నని గోరా వాంఛించుచుండెను.

అందుచే నవినాశుఁడు పత్రికల నాశ్రయింపఁవలసివచ్చెను. అతఁ డీవిషయములను బత్రికలలో విపులముగఁ బ్రకటించుటయే కాక సంపాదకవ్యాసములలో

గోరా యప్రతిమానప్రభావముంగూర్చి వ్రాయించుచు నిది భారతవర్ష పాపప్రాయశ్చిత్తముగాని; గోరాకుఁ బ్రాయశ్చిత్తము కాదనుసంగతిని స్పష్టముగాఁ బ్రకటింపఁ జేయుచుండెను—మనదేశము దురదృష్టవశమున విదేశీయుల కారాగారమున దుఃఖపడుచుండుటచే గోరాకూడ నట్టిదుఃఖమునే స్వీకరించె ననియు, దేశాభిమాని యగు నాతఁడు దేశమునందలి యనాచారముల కీవిధముగా నిప్పుడు ప్రాయశ్చిత్తముం గావింపఁదలంచె ననియు నవినాశుఁడుకూడ స్వయముగ బత్రికలకు వ్రాయుచుండెను. ఈ వ్రాతలకు గోరా విరక్తుఁ డగుచునే యుండెను గాని, యవినాశుని మాన్పించుట కెట్టియవకాశమును లేకుండెను. అతఁ డెంతతిట్టినను లెక్కించుటలేదు.

అవినాశునిచేష్టలచే నీప్రాయశ్చిత్తసమాచార మంతటను వ్యాపించిపోయెను. గోరాను దర్శించుటకును నాతనితో సంభాషించుటకును జనులు గుంపులుగుంపులుగా వచ్చుచుండిరి. అతనికిఁ బ్రతిదినమును లెక్కలేకుండ వచ్చుచుండు నుత్తరములను జదువుటకుఁ దెరపియే లేకుండెను. ఇది యంతయుం గాంచి గోరా యీవ్యాపారము తనసాత్త్వికత్వమునకు భంగము కలిగించి రాజసికవ్యాపారముగాఁ బరిణమించుచున్నదనియు, నిది కా[illegible]బంధ మగుదోష మనియు భావించుచుండెను. కృష్ణదయాళుఁ డిప్పుడు ప్రతి[illegible]చుపుట లేదు. అయినను జనశ్రుతి యాతని సాధనాశ్రమముఁగూడ [illegible]తుఁ డగుగోరా పవిత్రమగుతండ్రిమార్గమునే యనుసరించి యేక[illegible]డయ్యె నని కృష్ణదయాళునియన్నమును దినుచున్న యా[illegible]ప్పకొనఁదొడంగిరి.

కృష్ణదయాళుఁడు [illegible] నాలుబట్టలను గట్టుకొని గోరాయింటికిఁ బోయి చూచెను. గోరా లేఁడు; [illegible] పూజామందిరమున దేవపూజ చేయుచున్నాఁడని సేవకుఁడు చెప్పెను. కృష్ణదయాళుఁడు వ్యస్తహృదయముతో నచ్చటికిఁ బోయి పూజ చేయుచున్నగోరానుజూచి బిగ్గఱగాఁ బిలిచెను. గోరా తండ్రిరాక కాశ్చర్యపడి చటాలున లేచి నిలువఁబడియెను. కృష్ణదయాళుఁడు తనసాధనాశ్రమమున దేవతాప్రతిష్ఠం గావించి వైష్ణవులచేఁ బూజ చేయించుచుండెను. అతఁ డిప్పుడు శాక్తేయమతము నవలంబించుటచే నాదేవాలయమునకుఁ బోవుటలేదు. అతఁడు గోరాను జూచి "రమ్ము! ఈవలకు రమ్ము!" అని పిలిచి గోరా వెలుపలికివచ్చినతరువాత "ఇదేమిపని! ఇక్కడ నేమి చేయుచున్నావు?" అని ప్రశ్నించెను. గోరా మాటాడలేదు. అప్పుడు కృష్ణదయాళుఁడు "పూజకుఁ బ్రాహ్మణు డున్నాఁడు. అతఁడు పూజ చేసినచో నింటివారం దఱును జేసినట్లే! ఈపనిలో నీవేల ప్రవేశించితివి?" అని ప్రశ్నించెను. "ఇంతమాత్రమున దోష మేమున్నది?" అని గోరా బదులు చెప్పెను.

కృష్ణ—దోషము లేదా! కావలసినంతదోష మున్నది. లేనియధికారమును గల్పించుకొనుట దోషము కాదా? అది నీయొక్కనిదేనా? ఇంటివారందఱినిగూడ బాధించును.

గోరా—భక్తిభావమునుబట్టి చూచినచో నెట్టియల్పునకైనను దేవునియెదుటఁ గూర్చుండుట కధికార మున్నదని చెప్పవచ్చును. కాని మీయభిప్రాయ మేమి? రామహరితాకూరునకే గాని పూజాధికారము నాకు లేదనియా?

దాని కెట్టియుత్తర మీయవలయునో కృష్ణదయాళుఁ డాకస్మికముగ భావించుకొనఁజాలక కొంతసేపాఁగి "పూజచేయుట యాతనికి జాతిధర్మము. ఆతనిపూజయందపచార మైనను దేవుఁడు సహించును. కాని నీకట్టియధికారము లేదు. అట్టిచో నీవీపనియం దేల ప్రవేశించితివి?" అనియెను. గోరావంటి యాచారవంతుఁడుకూడ దేవపూజకుఁ దగఁడని కృష్ణదయాళునివంటివాఁడు చెప్పుట యసంగతముగా నుండెను. అయినను గోరా సహించి యేమియు మాటాడ కూరకుండెను. కృష్ణదయాళుఁడు మరల "గోరా! నేనొకమాట విన్నాను. నీవు ప్రాయశ్చిత్తము చేయించుకొనవలయునని పండితుల నాహ్వానించితివా?" అని ప్రశ్నించెను. ఔనని గోరా చెప్పెను. కృష్ణదయాళుఁడు తీవ్రస్వరముతో "నేను బ్రదికి [illegible] నిట్టిపని జరుగఁగూడదు" అనియెను. గోరాప్రతికూలభావముతో "ఎ [illegible] ప్రశ్నించెను.

కృష్ణ—ఏమా! ప్రాయశ్చిత్త [illegible] ప్పుడు నీతోఁ జెప్ప లేదా!

గోరా—చెప్పితిరి గాని కారణము [illegible]

కృష్ణ—కారణము తెలుపవలసినపని లేదు. గురుజనానుమతికంటె నెట్టిశాస్త్రవిధులును బ్రధానములు కావు. నేను నీకు గురువును; మాన్యుఁడను. ఈప్రాయశ్చిత్తమునఁ బైతృకకర్మకూడ నుండు ననియెఱుఁగుదువా?

గోరా—ఉన్నంతమాత్రమున బాధయేమి?

కృష్ణ—కావలసినంత బాధ యున్నది. అది జరుగుటకు నేనంగీకరింపను.

గోరా కది హృదయాఘాతమువలె నుండెను. అతఁడు దృఢస్వరముతో "ఏండ్రీ! నాపవిత్రతకొఱకు నేను జేసికొనుచున్నపనిలో మీకింతకష్టమేల" అనుటయుఁ గృష్ణదయాళుఁడు "గోరా! నీవూరక యెల్లవిషయములనుగూర్చియు వాదించుచుందువు. ఇది వాదవిషయము కాదు. ఇందు నీకు బోధపడనిసూక్ష్మవిషయ మున్నది. నీవు హిందూధర్మమునఁ బ్రవేశింపఁ గోరుట కేవలమును బొరపాటు అది నీకు సాధ్యము కాదు. నీపాదములు మొదలు తలవఱకును గలప్రతిరక్తకణమునందు నది ప్రతికూలమై

వది. ఎంతకొట్టుకొన్నను నాకస్మికముగ హిందువునగుట కవకాశము లేదు. దానికి జన్మజన్మాంతరసుకృతము కావలయును.'' అనియెను.

గోరా వివర్ణవదనముతో "తండ్రీ! జన్మాంతరములమాట కేమి కాని, ప్రస్తుతము మీవంశక్రమమున నేయధికారము ప్రవహించుచున్నదో దానియందు నా కెట్టిస్వత్వమును లేదా?" అనియెను. కృష్ణదయాళుఁడు విసుగుతో "మరల దర్కమా? నాతో వాదించుటకు నీకు సంశయము లేదా? నేను హిందువు నని చెప్పుకొన్నంత మాత్రమున విదేశోన్మాద మెక్కడకుఁ బోవును? నామాట విని యిది యంతయును గట్టిపెట్టుము!" అనియెను. గోరా తలవంచుకొని యించుక సేపూరకుండి "ప్రాయశ్చిత్తము కాకున్నచో శశిపెండ్లిలో నాకందఱితోడను గలసి భుజించుట కవకాశ ముండదు!" అనియెను. కృష్ణదయాళుఁ డుత్సాహితుఁడై "అంతమాత్రమునఁ దప్పేమి? నీపీఁట వేఱుగా వేయుదురు" అనియెను. గోరా సంశయముతో "అట్లయినచో సమాజము నన్నుఁ బ్రత్యేకించినట్లు కాదా?" అని ప్రశ్నించెను. కృష్ణదయాళుఁడు గోరాకు సమాధానముగా "అయిన నేమి? నాతో నిప్పుఁ డెవ్వరు కలసి భుజించుచున్నారు? నన్నెవ్వరు పిలుచు[illegible]రు? నాకేమైన సమాజముతో సంబంధ మున్నదా? శాంతముగఁ గాలము[illegible]టకై కోరుకొనుచున్న నీ కీమార్గము నవలంబించుటే శ్రేయము" అని చెప్[illegible]

అధ్యాపన్నా[illegible]డవినాశుని బిలిపించి "మీరందఱును గలసి మాగోరా నాడిం[illegible]కోపపడుటయు నవినాశుఁడు "అతఁడే మన్మందఱి వాదించుచు[illegible]ాతఁ డాడుటయే లేదు." అనియెను. కృష్ణదయాళుఁడు మెల్లగాఁ [illegible]ప్రాయశ్చిత్తము నాకిష్టముగ లేదు. ఏలాగో మానివేసిన బాగుగ నుండును." అనియెను. అవినాశుఁడు తనలో "చాలమంది తండ్రులు తమబిడ్డల శక్తిని దెలిసికొనఁజాలక యున్నట్లు చరిత్రలవలనఁ దెలియుచున్నది. ఈతఁడుకూడ నట్టివాఁడుగనే తోఁచుచున్నాఁడు. ఈతఁ డూరక సన్యాసివలెఁ గాలక్షేపము చేయుటకంటెఁ గుమారునిబోధనలను వినుచున్నచో బాగుగనుండును!" అని భావించుకొనియెను. అవినాశుఁడు వాదములవలన ఫలము లేనిచోట వృథావాగ్వ్యయము చేయువాఁడు కాఁడు. అతఁడు మృదుస్వరముతో "అయ్యా! ప్రయత్నమంతయు జరిగిపోయినతరువాత మీకిష్టము లేనంతమాత్రమున మానుటకు వీలులేదు. ఇఁక వ్యవధి కూడ లేదు. ఇక్కార్యము తప్పక జరుగవలసి యేయుండెను. గోరామాట యటుండనిమ్ము. ఆనాఁడు మేమందఱమును బ్రాయశ్చిత్తము చేసికొందుము. దేశజనులలోఁ బాపమున కభావము లేదు'' అనియెను. ఈయాశ్వాసవాక్యమునకుఁ గృష్ణదయాళుఁడు శాంతుఁడయ్యెను.

గోరా యెన్నఁడును కృష్ణదయాళునిమాటను లక్ష్యముచేయలేదు. నేఁడుగూడ నాతనిశాసనమును పాలింపవలయునని గోరా యనుకొనలేదు. సాంసారికజీవితముకంటె నధికప్రధాన మగుజీవితవిషయమునఁ దల్లిదండ్రులనిషేధమును పాటించుట గోరా కంగీకారముకాదు. కాని నేఁటిదినమంతయు గోరామనసు పరితపించుచునే యుండెను. కృష్ణదయాళునిమాటలలో నేదియో యొకసత్యము గూఢముగా దాఁగియున్నట్లాతనికిఁ దోఁచుచుండెను. తన్ను బాధించుచున్నయానిరాకారదుస్స్వప్నము నాతఁడు వదల్చుకొనఁ జాలకుండెను. నలుదెసలనుండియు నెవ్వరో వచ్చి తన్నెత్తి దూరముగ విసరివైవఁజూచుచున్నట్లుగా నాతనికి బోధయగుచుండెను. తన యేకాకిత్వము చిరకాలమునకును సుస్థిరమై యున్నట్లిప్పు డాతనికిఁ దోఁచుచుండెను. అతనియెదుటఁ గర్మక్షేత్ర మతివిశాలమై యుండెను. కార్యములును విశేషించియుండెను. కాని యాతనిపార్శ్వమునం దెవ్వరును నిలువఁబడి యుండలేదు.

## ౭౪

రేపు ప్రాయశ్చిత్తము కావున నేఁటిరాత్రియే గోరా గంగాతీరోద్యానమునకు పోవలసి యుండెను. అతఁడు బయలుదేఱుచున్నవేళ[illegible]గా హరిమోహిని యటకు వచ్చుటయు గోరా యప్రసన్నుఁడై "నేనొకపనికై[illegible]చుండగా మీరు వచ్చితిరి. అమ్మ కొన్నాళ్ళనుండి యింట లేదు[illegible]టాడఁదలఁచి—"అనుచుండఁగనే హరిమోహిని "అక్కఱలేదు[illegible]కే వచ్చితిని. ఇంచుక నే పోఁగుము. ఆలస్యముచేయను"అనియెను. [illegible]. హరిమోహిని సుచరిత మాటయెత్తి బాబూ! నీమూలమున నా[illegible] ఆమె యిప్పుడు నాయాచారపాలనము చేయుచున్నది! బాబూ! నాకొకచిన్నకోరిక యున్నది. నీ వామెను మంచిమార్గమునకు మరలించితివి. ఇట్టియుపకారముం గావించిన నిన్ను బరమేశ్వరుఁడనుగ్రహించుఁగాక! సుచరితవయసువచ్చినది, ఇంకఁ బెండ్లి చేయకుండుట యుచితము కాదు. హిందూగృహమునందే యున్నచో నీపాటి కామెబిడ్డలతల్లి కావలసినది! నేనెంతో శ్రమపడి యసాధ్యసాధనముం గావించి నామఱఁది యగుకైలాసుని సమ్మతింపఁజేసి తీసికొని వచ్చితిని. అంతయు స్థిరపఱచితిని. ఎట్టికట్నమును లేకుండ నట్టి సంశయమును బడకుండ నేనాతని నొప్పించితిని. ఇట్టిస్థితిలో సుచరిత యెంతచెప్పినను సమ్మతింపకున్నది. ఆమె యుద్దేశమేమో, యామె కెవ్వరు బోధించిరో యామె హృదయ మెవ్వరిపై లగ్నమైనదో యాయీశ్వరునికే యెఱుక—కాని బాబూ! నేను నీకు స్పష్టముగాఁ జెప్పుచున్నాను. అది నీకుఁ దగినదికాదు. పల్లెటూరిసంబంధమైనచో నామెసంగతి యెవ్వరికిని దెలియకుండఁ బోవును. ఈ నగరమునందుండినీవామెను పెండ్లియాడినచో నీకుఁ దలయెత్తుకొనుట కవకాశ ముండునా?" అనియెను.

ఆమాటకు గోరా క్రోధోద్దీప్తుఁడై “ఈమాట లన్నియు నేల? నామెను పెండ్లియాడెద నని మీతో నెవ్వరు చెప్పినారు?” అనియెను. హరిమోహిని మృదుస్వరముతో “నాకట్లు తెలియును బాబూ! ఈసంగతి పత్రికలలోఁ బడినట్లు విని నేను సిగ్గుచేఁ జచ్చిపోవుచున్నాను.” అనియెను. పరేశుఁడో యాతనిమిత్రులో యిట్లు ప్రకటించి యుందురని గోరా యూహించుకొని బద్ధముష్టియై “అసత్యము! అంతయు నసత్యము!” అనియెను. హరిమోహిని యాతని గర్జాస్వరమునకు బెదరిపడి “నాయనా కూడ నదియే. బాబూ! నీవు నామాట విని యిప్పుడొకసారి మా రాధారాణి చెంతకు రావలయును!” అనియెను.

గోరా—పనియేమి?

హరి—నీవొకసారి వచ్చి యామెకు బోధింపవలయును.

ఈయవకాశమునుబట్టి యొకసారి సుచరితను జూచిరావలయునను నుద్రేకముతో గోరాహృదయ మిట్లాడు “ఒకసారి కడపటిదర్శనము చేయుఁగలయును. రేపే నీ ప్రాయశ్చిత్తము. తరువాత [illegible] తపస్వివయ్యెదవు. ఈయొక్క రాత్రిమాత్రమే నీకవకాశమున్నది. ఇంద[illegible] షమునులేదు. ఉన్నచో రేపటిప్రాయశ్చిత్తముతో నంతయు భస్మమై[illegible]చుచుండెను—గోరా యించుకసేపాలోచించి “ఆమెకు నే[illegible]?” అని ప్రశ్నించెను. హరిమోహిని పలుగా “ఏమియు నక్క[illegible]మృతసారముగ నీవు వెంటనే పెండ్లి చేసికొనవలె ననియు, హి[illegible]గలాను వంటివరుఁడు నీవంటిదానికి లభించుట సౌభాగ్య మనియు[illegible]ంపవలయును!” అనియెను. ఆమాట గోరా హృదయమున బల్లెపుఁబోటువలె నుండెను. తోడనే యాతని కానాఁడు సుచరిత ద్వారమునొద్దఁ గాన్పించినపురుషుఁడు స్మృతికివచ్చెను. అతనికి సుచరిత లభించునని భావించుటకూడ గోరాకు దుస్సహముగా నుండెను. అతని కప్పుడు సహాసప్రవృశ్చికదంశన మైనట్లుండెను “వలదు! ఎన్నఁటికి నట్లు కాఁగూడదు.” అని యాతని హృదయము వజ్రనాదము చేయుచుండెను.

ఇఁక నెవ్వరితోడను సుచరితసమ్మేళన మసంభవము. ఈప్రపంచమున గోరా యెదుటఁ దప్ప మఱియెవ్వరియెదుటను గభీరభావపరిపూర్ణం బగుసుచరిత నిస్తబ్ధగభీరహృదయము విస్పష్టముగాఁ బ్రకటితము కాలేదు. ఎన్నటికి నట్లు ప్రకటితము కాఁజాలదు. ఆహా! అది యెంతటి దుర్లభ మైనది. రహస్యనికేతనమునందలి యంతర్మందిరమునందున్న యనిర్వచనీయశక్తి కన్నులఁబడియెను! మానవజీవితమునం దిట్టి దుర్లభసందర్శన మెన్నిసారులు లభించును? సుచరిత నంతటి ప్రగాఢసత్యస్వరూ

వముగఁ జూచి సమస్తాంతఃకరణములచేతను ననుభవించినవాఁడుమాత్రమే యామెను బడయఁగలఁడు. ఇతరుల కట్టియవకాశ మెక్కడ నున్నది?

హరి—ఆమె యెప్పుడును గన్యగనే యుండునఁట! ఇది యెన్నఁడైన నెక్కడనైన నున్నదా?

అదియును నిజమే. రేపు గోరా ప్రాయశ్చిత్తము చేసికొని సంపూర్ణముగ శుచియై బ్రాహ్మణుఁ డగుచున్నాఁడు. కాని సుచరిత చిరకాలమువఱకవివాహితయై యుండఁగలదా? చిరజీవనవ్యాప్తమగునంతటిభారము నామెపై నెవ్వరు పెట్టఁగలరు? స్త్రీలోకమున కింతకంటెను ఘనభారము మఱియేమున్నది?

హరిమోహినిమాట లేవియును గోరాచెవులఁ బడుట లేదు. గోరా తనలో "తండ్రి గారు నాప్రాయశ్చిత్తమును నిషేధించుటలో నర్థమేమియును లేదా? నేను వాంఛించుచుండు నాభవిష్యజ్జీవనము కల్పనామాత్రమే వా? స్వాభావికము కాదా! అకపటభారమును వహించి నేను కుంటువడిపోవుచున్నాను. ఆభారముచే నేను సమాజమునం దెట్టికార్యమును దీర్పఁజాలకున్నాను. నాహృదయము మానోరికలతో నిండిపోయినది! ఈబరువు నెచ్చట దించుకొనవలెను? [illegible] బ్రాహ్మణుఁడనుగాని, తపస్విని గాని కాఁజాలననియే తండ్రిగా రట్లో [illegible] ను. కాకున్నచో నింత సాహసించి యేల నిషేధింతురు? నేనిప [illegible] లోప మేమో యాయన నడిగి తెలిసికొనవలయును. ఆయన య [illegible] నంగీకరించినచో నిఁక నేనామార్గమును వదలుకొందును. వదలుక [illegible] చ్చయించుకొని హరిమోహినిం గాంచి "మీరించుక సేపాఁగుఁడు. [illegible]" అని చెప్పి తత్తరముతోఁ దండ్రియొద్దకుఁ బోయెను.

సాధనాశ్రమద్వారము బద్ధమై యుండెను. గోరా యొకటిరెండుసారులు తలుపుగొట్టెను. ఎవ్వరును దలుపు తెఱువలేదు; పలుకలేదు. లోనుండి ధూపగంధము వీతెంచుచుండెను! నేఁడు కృష్ణదయాళుఁడు సన్న్యాసితోఁ గలసి నిగూఢంబును, దుర్గాహ్యంబునగు నొకయోగము నేకాంతముగ నభ్యసించుచుండెను. ఈరాత్రి యచ్చటకుఁ బోవుట కెవ్వరికి నధికారములేదు.

## ౭౫

"ప్రాయశ్చిత్తము రేపు కాదు. నేఁడే యారంభమైనది? రేపటికంటె నధికముగ నగ్నిజ్వాల యిప్పుడే విజృంభించినది. నానవజీవనారంభమునం దొకగొప్ప యాహుతి నీయవలయు ననియే విధాత నాహృదయమునం దింతటిప్రబలవాంఛితము గల్పించియున్నాఁడు. కాకున్నచో నీయద్భుతసంఘటన మేల? నాకు వీరితోఁ గలి

యుంట కొట్టి లౌకికసంభావనయును లేదు. ఇట్టి విరుద్ధసమ్మేళన మీప్రపంచమునం దెచ్చుటను లేదు. ఈసమ్మేళనము నావంటియుదాసీనుని హృదయమునఁగూడ దుర్జయాకాంక్షను గల్పించునని యెవ్వరును భావించియెన నుండరు! ఆకాంక్షయే నాకిప్పుడుపయోగించినది. నాసర్వస్వమును నేను దేశమునకు సులభముగనే సమర్పించివైచితిని. నా కేత్యాగమును గష్టముఁ దోఁచలేదు. దేశీయు లందఱు వస్త్రేల చేయఁజాలకుండిరో నాకింకను బోధపడకున్నది! కాని యీమహాయజ్ఞ మింతటిసులభదానములను వాంఛించుట లేదు. దుఃఖమునే వాంఛించుచున్నది! నాడీచ్ఛేదనముం గావించుకొని నేను నవజీవనలాభముం గాంచవలయును రేపు సభలో నాకు లౌకికప్రాయశ్చిత్తమగును! అంతకుముం దీరాత్రియే నాజీవనవిధాత వచ్చి నాతలుపు గొట్టుచున్నాఁడు! అంతరంగమధ్యమున నంత స్సమప్రాయశ్చిత్తము కాకున్నచో నేను రేపు విశుద్ధుఁడ నగుట యెట్లు? నాకుఁ [illegible]జించుటకు గష్టముగఁ దోచువస్తువును నేను దేవునకు సంపూర్ణముగ సమర్పించినచో నేను పవిత్రుఁడనై నిష్పాపుఁడను కాఁగలను. అప్పుడే నేను నిజముగా బ్రాహ్మ[illegible]ఁడ నగుదును" అని గోరా భావించుకొనుచు హరి మోహినిచెంతకు వచ్చెను.

హరి—బాబా [illegible] తోరమ్ము. నీవు వచ్చి యొకమాట చెప్పినచో నంతయుఁ బరిష్కార[illegible]

గోరా—నేన[illegible] కామెతో నేమిపని?

హరి—నిన్ను[illegible] జించుచున్నది; గురువువలె గౌరవించుచున్నది.

విద్యుత్తంబగు [illegible] హృత్పిండమునం దీవలనుండి యావలకుఁ గనిక్కన గుచ్చుకొన్నట్లగుటయు నాతఁడు "నేను రావలసినప్రయోజన మగపడుట లేదు. ఆమెను జూడవలయునని నాకెట్టియుద్దేశమును లేదు." అనియెను. హరిమోహిని సంతోషముతో "ఆమాట నిజమే! ఈడువచ్చినయాడుబిడ్డను దఱచుగఁ జూడఁబోవుచుండుటయును మంచిదికాదు కానియీచిక్కుమాత్రము నీవుతప్ప మఱియెవ్వరును దీర్పఁజాలరు. ఈపని దీర్చినచో నిఁక నిన్ను నే నెన్నఁడును బిలువను" అనియెను. గోరా తలత్రిప్పుచు "ఇఁక నేనురాను. అంతయు ముగిసిపోయినది. నన్ను నే నీశ్వరున కర్పించుకొంటిని. ఇఁక నానిర్మలజీవితమునం దెట్టిమచ్చయు నుండఁగూడదు. నేను రాఁజాలను" అనియెను. హరిమోహిని గోరానిశ్చయముం గ్రహించి "నీవురాకున్నచో నొక్కపని చేయుము. నీవామెకొకచీటిని వ్రాసి యిమ్ము" అనియెను. గోరా తల త్రిప్పుచు నే నట్టిపని నెంతమాత్రమును జేయను." అనియెను. హరిమోహిని మృదుస్వరముతో "మంచిది. నాకొక్కరెండు పంక్తులను వ్రాసి యిమ్ము. నీవు సకలశాస్త్రవేత్తవు నేను నీయొద్ద ధర్మసూత్రమును గ్రహింపవచ్చితిని." అనియెను.

గోరా—ఏవిషయమున ?

హరి—హైందవకన్య యుక్తవయస్సునఁ బెండ్లియాడి గృహధర్మముం దీర్చుట యన్నిటికంటె నుత్తమధర్మము కాదా ?

గోరా కొంతసే పాలోచించి "నీవూరక నాకిట్టిగొడవ తెచ్చిపెట్టవలదు. ధర్మనిర్ణయమునకు నేను పండితుఁడను గాను" అనియెను. హరిమోహిని తీవ్రభావముతో "నీయుద్దేశమేమో స్పష్టముగాఁ జెప్పగూడదా?" మొట్టమొదట నీ చిక్కు పెట్టిన వాఁడవు నీవే. ఇప్పుడు నేను గాననుచున్నావు. దీనియర్థమేమి ? ఆమె స్వేచ్ఛగా నుండుట నీకిష్టము లేదు. ఇంతేనా?" అని ధిక్కరించెను.

ఈమాటలకు మఱియొకప్పుడైనచో గోరా మండిపడవలసినదే. ఇట్టి సత్యాపవాదమునుగూడ నాతఁడు సహించి యుండఁడు. కాని నేఁడాతనికిఁ బ్రాయశ్చిత్త మారంభమయ్యెను. కోప మంతయును బోయెను. ఆతఁడు విమర్శించుకొని హరిమోహిని చెప్పిన మాట నిజమే యనుకొనియెను. ఆతఁడు సుచరితతోడిబంధమును వదల్చుకొనుట కుద్యుక్తుఁడుగనే యుండెను. కాని యవేద్యమగు నొకసూక్ష్మసూత్రమును మాత్ర మాతఁడు త్రెంపఁదలచుకొనలేదు. ఇంకను [illegible] త్యాగమును జేయఁజాలకుండెను—కాని కృపణత్వమును వ్యంజింపవల[illegible]తో దానముచేసి రెండవచేతితోఁ గట్టిగఁ బట్టుకొన్నచో నేమి[illegible]తఁడొక కాగితమును దీసి సాహసించి పెద్దయక్షరములతో "[illegible]నకు సాధన పథము. గృహధర్మమే యామెకు ప్రధానధర్మము [illegible]ధనముకొఱకుఁగాని, వాంఛాస్ఫూర్తి కొఱకుఁ గాదు. సుఖమై[illegible] సంసారము నేకాగ్రచిత్తముతో భావించుచు రమణీమణి సాధ్వియుఁ బవిత్రయునై మూర్తీభవించిన ధర్మదేవతవలెనుండుటయే యామె వ్రతము." అని వ్రాసెను. దానిం గాంచి హరిమోహిని "కైలాసునిగూర్చికూడ నించుక వ్రాసిన బాగుగ నుండును." అనియెను. గోరా విరక్తుఁడై "నే నాతని నెఱుఁగను. ఆతనిగూర్చి వ్రాయుట యెట్లు?" అనియెను.

హరిమోహిని యాకాగితమును మడచి చెంగునఁ గట్టుకొని యింటికిఁబోయెను. సుచరిత యింకను ఆనందమయితో లలిత యింటనే యుండెను. అక్కడకుఁ బోయి మాటాడుట మంచిదికాదని యెంచి హరిమోహిని రేపు మధ్యాహ్నమున కింటికి రావలయునని సుచరితకుఁ గబురు పంపెను. సుచరిత మఱునాఁ[illegible]టికిఁ బోయెను. ఆమెహృదయమంతయు వికలముగా నుండెను. మరల నీవివాహపుమాటలే వచ్చునని యనుకొనియెను. ఇఁక నెన్నఁడు నట్టిప్రశ్న కలుగకుండఁ దగినసమాధానము చెప్పవలయునని సుచరిత నిశ్చయించుకొనియెను. భోజన మైనతరువాత హరిమోహిని సుచరితం గాంచి "నిన్నసాయంకాలము నేను నీగురునియొద్దకుఁబోయితిని!" అని చెప్పెను.

సుచరిత కుంఠితయై "దొడ్డమ్మా! మరల నామాట యెత్తి నన్నవమానింపఁదలఁచితివా?" అనియెను.

హరిమోహిని మృదుస్వరముతో "అమ్మా! భయములేదు. నేనాతనితో జగడమునకుఁ బోలేదు. ఆతనియొద్ద నొకటిరెండు మంచిమాటలు వినిరావలయునని నేనాలోచించుకొని పోయితిని. అప్రసంగములో నీమాటకూడ వచ్చినది" అందుబిడ్డ చాలకాలమువఱకుఁ గన్యయై యుండుట మంచిది కాదనియు, నది యధర్మమనియు, దొరలలోనేగాని మనలో నది లేదనియు నాతఁడు చెప్పినాఁడు. నేను కైలాసుని గూర్చి చెప్పినాను. బాగుగనె యుండునని యాతఁ డన్నాఁడు!" అని చెప్పెను. సుచరితహృదయ మవమానదుఃఖముచే నుడికిపోవుచుండెను. అప్పుడు హరిమోహిని "నీవాతని గురునిగాఁ గౌరవించుచుంటివి గాన నాతనియాజ్ఞను బాలింపవలయును!" అనియెను. సుచరిత మాటాడలేదు. హరిమోహిని మరల "ఆమె నామాట నమ్మదు గావున నీవొకసారి వ[illegible]యామెకు బోధింపుమని యడిగితిని. నేనింక నామెను జూచుట మంచిదికాద[illegible]నాతఁడు చెప్పెను. దీని కుపాయమేమని నే నడుగుటయు నాతఁ డీచీటిని వ్రాసి[illegible]." అని యామె మెల్లగా నాచీటి సుచరిత కిచ్చెను. సుచరిత చదివెను. [illegible]ము రద్దైపోవుచున్నట్లుండెను. అట్లే యామె కొయ్యబొమ్మవలెఁ [illegible]

ఆచీటిలో న[illegible]ను నగువిషయ మేదియును లేదు. ఆమాటలలో సుచరిత కభిప[illegible]ను. కాని యది హరిమోహినిచేఁ దనకు బంపుటను గూర్చి సుచ[illegible]వ్యథముల బాధ నొందుచుండెను. "గోరా యిప్పు డిట్లాదేశించు[illegible]ల్లియాడుటను గూర్చిగాని పెండ్లినిగూర్చిగాని గోరా కింతటియావేగ మేల? నాసంబంధమున గోరా చేయఁదగినపని యంతయు ముగిసిపోయినదా? నేనాతనికర్తవ్యమునకుఁగాని, జీవితపథమునకుఁగాని యాతంకము గల్పించితినా? ఆత్మసమర్పణము చేసికొని యాతనిచెంత వాంఛింపవలసినది నాకేదియును లేనేలేదా?" అని యీవిధముగా సుచరిత భావించుకొనుచు నెట్లయిన నీహృదయవ్యథను దూరము చేసికొనవలయునని ప్రయత్నించుచుండెను. కాని యామె కొంతమాత్రము నూఱటకలుగుట లేదు.

హరిమోహిని సుచరిత కాలోచించుకొనుటకు సమయమిచ్చి యలవాటుప్రకారము నిద్రింపఁబోయెను. ఆమె నిద్రలేచి వచ్చి చూచునప్పటికిఁగూడ సుచరిత యొప్పటివలె నే కూర్చుండి యుండుటయు "అమ్మా! ఇంతయాలోచన మెందులకో చెప్పుము! ఇం దాలోచింపవలసిన దంతగా నేమున్నది? గోరాబాబేమైన నధర్మముగ వ్రాసినా?" అనియెను. సుచరిత శాంతస్వరముతో "లేదు. ఆతఁ డుచితము

గనే వ్రాసెను!" అనియెను. హారిమోహిని మెల్లగా "హిందూసమాజమున నీవు పెండ్లియాడుట మీపరేశబాబున కిష్టముండదు. కాని మీగురువు—" అనియెను. సుచరిత యసహ్యభావముతో "దొడ్డమ్మా! మాటిమాటికి నీవిట్లే యనుచుంటివేల? నాపెండ్లిని గూర్చి యాలోచించుటకే నేనాతనియొద్దకుఁ బోవుచుండుటలేదు. ఇప్పుడు నేనొకసారి యాతనియొద్దకుఁ బోయెదను." అనియెను.

పరేశునిసాన్నిధ్యమే సుచరితకు సాంత్వనస్థానమై యుండెను! సుచరిత వెంటనే పరేశునియింటికిఁ బోయెను. అతఁ డప్పుడు పెట్టెలో బట్టలు మొదలగునవి సవదుకొనుచుండెను. సుచరిత యంతయుం గాంచి 'బాబా! ఇది యేమి?' అని ప్రశ్నించెను. పరేశుఁడు నవ్వుచు "నేను కొంత కాలము సిమ్లాయం దుండఁదలఁచితిని. రేపటి బండిమీఁదఁ బోయెను." అని చెప్పెను. పరేశుని యీనవ్వులోఁ బ్రచ్ఛన్నమై యున్న దారుణవిప్లవేతిహాసము సుచరిత కగోచరమై యుండలేదు. ఇంటిలో భార్యాపుత్రికలును, వెలుపలబంధుమిత్రులును నాతని శాంతిని [illegible]ఇచ్చుట లేదు. కొన్నాళ్ళతఁడు దూరమై పోకున్నచో నాతని కింటియందలి [illegible]ండములలోఁ బడి కొట్టుకొనవలసివచ్చును. రేపాతని ప్రయాణము. అతనిబట్ట[illegible] యిచ్చువా రాయింట నెవ్వరును లేకుండిరి. అతఁడే స్వయముగఁ జా[illegible]ను. ఇది యంతయు సుచరితహృదయమునకుఁ జాల బాధాకర[illegible]ప్పుడు సుచరిత యా పనినుండి పరేశుని మరలించి స్వయము[illegible]సకములను నితరవస్తువులను యథోచితముగఁ బెట్టెలో సవరిం[illegible]తవాత సుచరిత "బాబా! మీరొక్కరే పోయెదరా?" అని ప[illegible]

వేదనాసూచక మగునీసుచరితప్రశ్న[illegible] గ్రహించి పరేశుఁడు "అమ్మా! నాకిందుఁ గష్ట మేమున్నది?" అనియెను. సుచరిత మెల్లగా "బాబా! నేను గూడ నీతో వచ్చెదను." అనుటయుఁ బరేశుఁడు సుచరిత మొగమువంకఁ జూచెను. అప్పుడు సుచరిత "బాబా! నేను నీకెట్టికష్టమును గలిగింపను. నన్నుఁగూడఁ దీసికొనిపొమ్మా!" అనియెను.

పరే—అదేమిమాట తల్లీ! నాకు నీవెప్పుడైనఁ గష్టమును గల్పించితివా?

సుచ—నీయొద్ద లేకున్నచో నాకుఁ దోఁచదు బాబా! నాకేమియును దెలియదు. నీవు బోధింపకున్నచో నేనేమియు నిశ్చయించుకొనఁజాలను. స్వబుద్ధియందే నిబ్బరముతో నుండవలయునని నీవు నాకు బోధింతువు. కాని నాకంతటిబుద్ధి లేదు. నామనసునం దంతటిదార్ఢ్యమును లేదు. నన్నుఁగూడ నీవెంటఁ దీసికొనిపొమ్ము బాబా!

అని యామె పరేశునకుఁ బ్రణామముం గావించెను. ఆమె కన్నులనుండి యూరక యశ్రుధారలు ప్రవహించుచుండెను.

# ౭౬

గోరా చీటివ్రాసి హరిమోహిని కిచ్చినప్పుడు సుచరితంగూర్చి త్యాగపత్రమును వ్రాసియిచ్చినట్లుగా నాతనిమనసునకుఁ దోఁచెను. కాని పత్రమువ్రాసియిచ్చినంతమాత్రమునఁ బని ముగియలేదు. ఆతనిహృదయ మాపత్రము నంగీకరించుటలేదు. ఆపత్రమునం దాతఁడు వ్రాసినవి సాహసముతోడి హస్తాక్షరములే కాని విశ్వాసముతోడి హృదయాక్షరములు కావు. అందుచేతనే యాతనిహృదయ మబాధ్యమై యుండెను. అట్టిదుస్సహమగుబాధ్యత యారాత్రియే గోరాను సుచరితయింటికిఁ బరుగెత్తింపఁగల సినదే! కాని యప్పుడే గంటస్తంభమునఁ బదిగంటలు కొట్టెను. తోడనే గోరాకుఁ జైతన్యము కలిగి యిది యెవ్వరియింటికిని బోయి చూడఁదగినసమయము కాదని తోఁచెను. తరువాత గంటల నన్నిటిని గోరా వరుసగా వినుచునే యుండెను.

మఱునాఁటియు[...]ంన కాతఁడు గంగాతీరోద్యానమునకుఁ బోయెను. ఆతఁడు నిర్మలదృఢహృదయ[...]ఁ బ్రాయశ్చిత్తము చేసికొనఁదలంచి యుండెను. కాని యట్టిహృదయావస్థయ[...]దిగ ?—పండితు లనేకులు వచ్చియుండిరి. ఇంకను వచ్చువట్లు తోఁచుచు[...]యందఱును సన్మానసంభావణలతో గౌరవించుచుండెను. ఆతనిస[...]ఱును సాధువాదములఁ జేయుచుండిరి. [...]క్రమముగాఁ దోఁట[...]పూర్ణ మైపోయెను. గోరా జాగరూకుఁడై నలుదెసలఁ దిరుగు[...]ధ్యమున గోరానిగూఢహృదయాంతరమున 'అన్యాయము చే[...]తివి!'' అనుమాట లనుభవగోచరము లగుచుండెను. ఆయన్యాయ[...]గా నాలోచించి తెలిసికొనుట కాతని కవకాశములేకుండెను. కాని యాతఁడాగభీరహృదయాంతర్ముఖము నెంతమాత్రమును బంధింపఁజాలకుండెను. ఆయనుష్ఠానవిపులాయోజనమధ్యమున నాతనిహృదయవాసియగు సంతశ్శ్రుతియాతనికి విరుద్ధముగా 'అన్యాయము జరిగిపోవుచున్నది!' అని సాక్ష్యమిచ్చుచుండెను. ఆయన్యాయము నియమలోపము కాదు. మంత్రలోపమును గాదు. శాస్త్రలోపమును గాదు—అది ప్రకృతిలోననే సంఘటిల్లినది. అందుచేతనే గోరా సర్వాంతఃకరణములును ననుష్ఠానోద్యోగమునకు విముఖము లైపోవుచుండెను.

సమయము సమీపించెను. సభాస్థలము సంసిద్ధము చేయఁబడియెను. గోరా గంగాస్నానము చేసి యార్ద్రవస్త్రములను విడుచుచుండఁగా జనసమాజమును ద్రోసికొనుచు నవినాశుఁడు దీనవదనముతో వచ్చి ''కృష్ణదయాళుబాబు రక్తము గ్రక్కుకొనుచున్నాఁడఁట! నిన్ను శీఘ్రముగ నింటికిఁ దీసికొనిపోవుటకై బండి వచ్చినది!'' అని చెప్పెను. గోరా తత్తరముతో వడలిపోయెను. అవినాశుఁడుకూడ నాతని వెంబడిం

చుటయు గోరా 'నీవు రావలదు. నీవిటలేకున్నచో నీవచ్చినవారి నభ్యర్థించుట జరుగదు!' అని చెప్పి గోరా యతివేగముగ నింటికిఁ బోయెను.

కృష్ణదయాళుఁడు శయ్యపైఁ బరుండి యుండెను. ఆనందమయి పాదముల నొత్తుచు నాతనిచెంతఁ గూర్చుండి యుండెను. గోరాయుద్విగ్నుఁడై యాయిరువురిముఖములవంకను జూచెను. కృష్ణదయాళుఁడు తనప్రక్కనున్నకుర్చీపైఁ గూర్చుండునట్లాతనికి సంజ్ఞచేసెను. గోరా కూర్చుండి తల్లిం గాంచి 'అమ్మా! ఎట్లున్నది?' అని యడిగెను. ఆనందమయి మెల్లగా 'కొంచెము నెమ్మదిగనే యున్నది. డాక్టరు దొరగారికిఁ గబురు వెళ్ళినది.' అనియెను. ఆయింట శశిముఖియు నింకొక సేవకుఁడును గూడ నుండిరి. కృష్ణదయాళుఁడు వారిని బొమ్మని సంజ్ఞచేసెను. వారుపోయిరి. అప్పుడు కృష్ణదయాళుఁ డానందమయి మొగమువంక నించుక సేపు చూచి గోరానుద్దేశించి మెల్లగా "నాకుఁ గాలము సమీపించినది. నే నింత కాలమువఱకును నీసంబంధమున దాఁచియుంచినవిషయము నిప్పుడు నీకుఁ దెలుపకున్నచో న[illegible]క్తిలేదు." అనియెను.

గోరాముఖము వివర్ణమైపోయెను. అతఁడు కు[illegible] కూర్చుండెను. కొంతసేపటివఱ కెవరును మాటాడలేదు. అప్పుడు కృష్ణద[illegible] గోరా! అప్పుడు నాకుఁ దెలియలేదు. అందుచేతనే యింతగొప్పపొరపా[illegible] తరువాత దానిని సరిరించుకొనుటకు మార్గము లేకపోయినది." [illegible] రకుండెను. గోరాకూడ నేమియుఁ బ్రశ్నింపక నిశ్చలుఁడై య[illegible]ఁడు మరల "ఇట్లే జరగిపోవలయు ననియు, నీసంగతి నీకెప్పు[illegible]్యకమే లేదనియు నేననుకొంటిని. కాని యది యుక్తము కాదని [illegible]ది. బాబూ! నామరణానంతరమున నీవు శ్రాద్ధముం గావించుట [illegible] అని [illegible] ప్రమాదభావనాతత్రముచేతనే కృష్ణదయాళుఁడు వడఁకిపోయెను. ప్రధానవిషయము తెలిసికొనవలయునని గోరా తొందరపడిపోవుచుండెను. అతఁ డానందమయివంకఁ జూచి 'అమ్మా! ఆసంగతి యేమో నీవు చెప్పుము! శ్రాద్ధముచేయుటకు నాకధికారమే లేదా?'' అని యడిగెను.

ఇంతవఱకును నిశ్చేష్టయై తలవంచుకొని కూరుచున్నయానందమయి గోరా ప్రశ్న కించుక తలయెత్తి యాతనివంకఁ జూచి "లేదుబాబూ! నీకధికారము లేదు." అనియెను. గోరా యదరిపడి "నే నీతనితనయుఁడను గానా?" అని ప్రశ్నించెను. ఆనందమయి భగ్నకంఠముతో "కావుబాబూ!" అనియెను. అప్పు డగ్నిపర్వతమునందలి యనలోచ్ఛ్వాసముంబోలి గోరావదనమునుండి "అమ్మా! నీవు నాతల్లివి కావా?" అనుసంతాపప్రశ్నము వెలువడియెను. ఆనందమయిగుండె పగిలిపోయెను. ఆమె యశ్రుహీనవేదనామయశుష్కస్వరముతో "బాబూ! గోరా! నీవు పుత్రవిహీనవగు

నాకుఁ బుత్రుఁడవు. నీవు నాకుఁ గన్నబిడ్డకంటెను నధికుఁడవే బాబూ!" అనియెను. అప్పుడు గోరా కృష్ణదయాళుని గాంచి "నేను మీ కెట్లు లభించితిని ?" అని ప్రశ్నించెను. కృష్ణదయాళుఁడు హీనస్వరముతో "అప్పుడు మ్యూటినీసమయము. ఎటావాయందు మే మున్నప్పుడు మీయమ్మ సిపాయిలభయముచేఁ బరుగెత్తుకొని మాయింటికి వచ్చి యొకరాత్రి మాయింటనుండెను. అంతకుముందే మీతండ్రి యుద్ధములో మరణించెను—అతని పేరు—"

అనినంతనే గోరా గర్జాస్వరముతో "అక్కఱలేదు అతనిపేరుతో నాకు నిమిత్తము లేదు." అనియెను. కృష్ణదయాళుఁడు గోరాయుద్రేకమునకు విస్మితుఁడై యూఁగిపోయెను. తరువాత మరల మెల్లగా "అతఁ డైర్లండుదేశీయుఁడు. ఆరాత్రియే మీయమ్మ నిన్నుఁ బ్రసవించి తోడనే మరణించినది. అప్పటినుండియు నీవు మా యింటనే పెరిగి పెద్దవాఁడ వైతివి." అని చెప్పెను. ఒక్కనిమిషములోఁ దనజీవితమంతయు నద్భుతస్వప్న ... మారిపోయినట్లు గోరా కగపడియెను. చిన్నతనమునుండియు నిర్మించుకొన్న ... యాతనిజీవితభిత్తి యంతయు నొక్కసారిగా విలీనమైపోయినది. అతని స్మ ... బోధపడకుండెను. అతనివెనుకభాగమున నతీతకాలమను వస్తువును లే ... నింతకాలము వఱకు నాతనియే కాఁగ్రలక్ష్యము నందుంచి సుస్పష్టం ... డ నాకస్మికముగ లోపించిపోయెను. అతఁడు కేవలము ... ప్రాంతరగల బిందువుంబోలి యుండెను. అతనికిఁ దల్లిలేదు; తం ... ; జాతి లేదు; పేరు లేదు; గోత్రము లేదు; దేవుఁడు లేఁడు! ... లేదనుమాటయే యున్నది! అతని కాశ్రయ మేమున్నది? ప ... రల నెక్కడ నారంభింపవలయును? దేనియందు లక్ష్య ముంచవలయును? ప్రతిదినమును గ్రమక్రమముగాఁ గార్యోపకరణముల నెక్కడనుండి సంగ్రహింపవలయును? దిగ్భ్రాంతింగూర్చు నీయద్భుతశూన్యమధ్యమున గోరా వాగ్విహీనుఁడై కూర్చుండి యుండెను. అతని మొగము చూచి యెవ్వరును మఱిమాటాడుటకు సాహసింపలేదు.

ఇంతలోఁ గుటుంబవైద్యునితోఁ గలసి డాక్టరుదొరగారు వచ్చి రోగినిఁ జూచెను. అల్లే యాతఁడు గోరానుగూడఁ జూడకుండఁజాలకపోయెను. ఈతఁ డెవ్వఁడని డాక్టరనుకొనియెను. అప్పుడు గోరా మొగమున గంగామృత్తికాతిలక ముండెను. అతఁడు పట్టుబట్టలను గట్టియుండెను. కంచుకము లేకుండుటచే నుత్తరీయాంతరమునం దాతనిప్రకాండశరీరము స్పష్టముగఁ గనపడుచుండెను. పూర్వమైనచో నింగ్లీషు డాక్టరనిన గోరాకుఁ గోపము గానుండును! ఇప్పు డా డాక్టరు రోగిని బరీక్షించుట గోరా

కుతూహలముతో నే చూచుచుం దనలో “ఇక్కడివారందరికంటెను నీతం డేనా నా కాత్మీయుండు?” అని ప్రశ్నించుకొనియెను.

డాక్టరు రోగిని పరీక్షించి “విరుద్ధలక్షణము లంతగాం దోంచుట లేదు. నాడి యందును దోషము లేదు. శరీరస్థితియందు వికృతియేమియును లేదు. కొంచెము జాగ్రత్తగనున్నచో నింకనట్టిజబ్బుచేయదు” అనిచెప్పి వెడలిపోయెను. గోరాకూడ నేమియు మాటాడకుండ లేచుట కుపక్రమించెను. డాక్టరు వచ్చుటచే లోనికింబోయిన యానందమయి చటాలునవచ్చి గోరాచేయి పట్టుకొని ‘బాబూ! గోరా! నాపైం గోప పడవలదు. అట్లయినచో నేను బ్రదుకజాలను.’ అనియెను. గోరా మనస్తాపముతో “ఇన్నాళ్ళవఱకు నేల చెప్ప లేదు? చెప్పినచో నీకెట్టినష్టమును లేదే!” అనియెను.

ఆనందమయి తప్పంతయును దనమీఁద నే వెట్టుకొని “బాబూ! నిన్నుం బోం గొట్టుకొందు నేమో యనుభయముచే నేనింతపాపము చేసితిని! తుదకుం జెప్పక తీరినది కాదు. ఇది యెవ్వరితప్పును గాదు. నాదే. గోరా [illegible] నాకు మరణశిక్ష యైనది బాబూ!” అనియెను. గోరా యేమియు మాటాడక “[illegible]!” అనియెను. ఆపిలుపుతో నింతవఱకును ఉమ్మడిముఖమై యున్నయానందమ[illegible] నుండి యశ్రుధారలు పొంగిపారలనారంభించెను. అప్పుడు గోరా ‘అమ[illegible] నేనొకసారి పరేశబాబునింటికిం బోయెదను!’ అనియెను.

ఆనందమయిగుండెలలోనిబరువు[illegible] ‘వెళ్ళుము బాబూ!’ అనియెను. కృష్ణదయాళుండు తనకు శ[illegible]కొందుటయు, గోరా రహస్యమంతయు వెల్లడియైపోయినదని [illegible]సంగతు లెవ్వరియొద్దను వెల్లడింపవలసినపని లేదు. నీవు కొంచెము [illegible] నీసంగతి యెవ్వరికిని దెలియంబోదు!’ అనియెను. గోరా యెట్టిప్రత్యుత్తరమును జెప్పక వెడలిపోయెను. కృష్ణదయాళునితోం దనకెట్టిసంబంధమును లేదనుమాట తలంచుకొని యాతండు విశ్రాంతుం డయ్యెను. గోరా బయలుదేరి పోవుచుండంగా మహిముం డెగపడి ‘గోరా ఎక్కడకుం బోయెదవు?’ అని ప్రశ్నించెను.

గోరా—శుభవార్త! డాక్టరు వచ్చినాండు. భయము లేదని చెప్పినాండు.

మహిముం డానందముతో “బ్రతికితిమి. ఎల్లుండి శశివివాహము. నీవు కొంచెము పాటుపడవలయును. వినయుం డాదినమున మనయింటికి రాంగూడదు. తవపెండ్లి కట్టివారు, రాంగూడదని యవినాశుండుకూడం జెప్పియున్నాండు. సోదరా! ఒక్కమాట చెప్పుచున్నాను. ఆదినమున మాకచేరీ పెద్దదొరలను బిలువందలంచితిని. నీవుమాత్రము గందరగోళము చేయకుము సుమా! ఏమంతకష్టమున్నది? ఒకసారి తలవంచి ‘గుడ్ ఈవినింగ్ సార్’ అన్నంతమాత్రమున హిందూధర్మము చెడిపోవునా యేమి? చూడు.

వారు రాజవంశజులు! వారి కించుక లొంగినట్లున్నచో నది మన కొక యవమానము కాదు.' అని చెప్పెను. మహిముని మాటకు బదులు చెప్పకుండఁగనే గోరా వెడలిపోయెను.

## ౭౭

తన కన్నీరు పరేశున కగపడకుండ సుచరిత బట్టలు సర్దుచున్నట్లు పెట్టెపై నొరగి యున్న సమయమునందే గౌరమోహనబాబు వచ్చెనను కబురు వచ్చెను. సుచరిత పని ముగించి చటాలున లేచెను. అంతలో గోరాయును వచ్చెను. గోరా మొగమునఁ దిలకమింకను వట్లే యున్నది. అతఁడు పట్టుబట్టలతోడనే వచ్చెను. అప్పుడు సుచరితకుఁ బ్రథమమున గోరానుజూచిన దినము స్మృతికి వచ్చెను. అప్పు డాతఁడు యుద్ధసన్నద్ధుఁడై వచ్చెనని సుచరిత యెఱుఁగును—ఇప్పుడుగూడ నదియే వేషము!

గోరావచ్చినతోడనే తల నేలపైఁ బొరలించుచుఁ బరేశునకు సాష్టాంగప్రణామము చేసి యాతనిపా[illegible]ళిని గైకొనియెను. పరేశుఁడు వ్యస్తభావముతో నాతని లేవనెత్తి 'కూర్చుండు[illegible]బాబూ! కూర్చుండుము.' అనియెను. గోరా చటాలున 'పరేశబాబూ! ఇప్పు[illegible]నెబంధమును లేదు!' అనియెను.

పరేశుఁడాశ్చ[illegible]'ఏట్టి బంధము" అనియెను.

గోరా—నేన[illegible]ము.

పరే—హైంద[illegible]

గోరా—కాన[illegible] దొఱకినబిడ్డనని నాకిప్పుడు తెలిసినది. మాతండ్రి యొల్లరందుఁ[illegible]న నుత్తరము మొదలు దక్షిణము వఱకును గల దేశమందిరద్వార[illegible]నాయెడుట రుద్ధములైపోయినవి. ఇప్పు డీ దేశమధ్యమున నెట్టి[illegible]త్రయిం[illegible]భోజనమునకుఁ దావులేదు.

సుచరితాపరేశులు స్తంభితులైపోయిరి. పరేశున కేమి చెప్పుటకును దోఁచుట లేదు. అప్పుడు గోరా 'పరేశబాబూ! నే నిప్పుడు ముక్తుఁడనైతిని. పతితత్వమునకుఁగాని, భ్రష్టత్వమునకుఁగాని నేనిఁక భయపడవలసినపని లేదు. నాకిఁక నడుగడుగునకు నేలమాపుకు చూచుచు శుచిత్వమును రక్షించుకొనవలసిననిమిత్తము లేదు' అనియెను. సుచరితయేకాగ్రదృష్టితో గోరాప్రదీప్తవదనమును గాంచుచుండెను. అప్పుడు గోరా మరల "పరేశబాబూ! నేనింతకాలమునుండియు భారతవర్షమును బడయుటకై ప్రాణములనర్పించి ప్రయత్నము చేయుచుంటిని—ఎక్కడనో యొకతావున బంధితుఁడనై యుంటిని. ఆబంధముతో నాశ్రద్ధను సమ్మేళనము చేయుటకై రేయుంబవలు నాజీవితముల వర్పించి పాటుపడితిని. ఆశ్రద్ధాభిత్తులను విస్తరింపఁజేయుటయందే మగ్నుఁడనై నేనిఁక నెట్టికార్యమును జేయఁజాలనైతిని. అదియే నాకుఁ బ్రధానకార్య మయ్యెను. అందుచేతనే వాస్తవభారతవర్షమును సత్యదృష్టింగాంచి సేవింపఁబోయి యనేకపర్యా

యములు భయముచే వెనుకకు మరలితిని. నిష్కంటకమును, నిర్వికారంబు నగుభారత వర్షమును మనమున భావించుకొని యాయభేద్యదుర్గమధ్యమున నాభక్తిని నిరపాయముగ రక్షించుకొనుటకై నాచుట్టుప్రక్కల నంతటను మహాగణము గావించితిని. ఇప్పుడొక్క నిమిషములో నాభావదుర్గము స్వప్నరాజ్యమువలె మాయమైపోయినది. నే నాకస్మికముగఁ ద్రోసివేయఁబడి యనంతసత్యమధ్యమునకు వచ్చిపడితిని. సమస్త భారతవర్షమునందలి మంచిచెడ్డలును, సుఖదుఃఖములును, జ్ఞానాజ్ఞానములును నొక్కసారిగా నాహృదయమధ్యమునకు వచ్చిపడినవి. ఇప్పుడు నేను సత్యమును సేవించుట కధికారినైతిని. సత్యసంబంధ మగుకర్మక్షేత్రము నాయెదుటికి వచ్చిపడినది. అది నామనోమధ్యమునందలి క్షేత్రముకాదు— అది వెలుపల నున్నట్టి శతకోటి ప్రజలను సంబంధించిన యథార్థకల్యాణక్షేత్రము!

నూతనలబ్ధం బగుగోరాయనుభవోత్సాహవేగము ప[illegible]చిగూడ నాందోళితునిం గావింపఁదొడంగెను. అతఁ డిఁకఁ గూర్చుండఁ జాలకపో[illegible] కుర్చీనుండి చటాలున లేచి నిలువఁబడియెను.

గోరా— నామాటలు మీకు బాగుగఁ ద్రి[illegible] నట్టివాఁడను గావలయునని రేయుంబవలు గోరుకొనుచుఁ [illegible]ట్టివాఁడ నిప్పటికిఁ గాఁగలిగితిని. నేనిప్పుడు భారతవర్షీయు[illegible] నిప్పుడు హైందవ, మహమ్మదీయ, క్రైస్తవాది సమాజము[illegible]లేదు. ఇప్పుడీ భారతవర్షమునందలి యన్నిజాతులును నాజాతి[illegible]ను నాయన్నమే. నే నీబంగాళమునందలి యన్నిజిల్లాలను దిరిగితి[illegible]గూడ నాతిథ్యమును గ్రహించితిని. నేను కేవలమును బట్టణసభలయందే యుపన్యసించువాఁడనని మీరనుకొనవలదు. కాని సామాన్యజనులందఱితోడను సమానముగఁ గలసియుండఁజాలకపోయితిని. ఇంతకాలమువఱకును నే నస్పష్టముగా నొకవిధమగు ప్రత్యేకత్వమును గల్పించుకొనియే తిరుగుచుంటిని. ఆభావమును మరల్చుకొనఁజాలకపోతిని. అందుచేత నే నాహృదయాంతరమునం దత్యంతమును శూన్యభావముండెను. అది యున్నట్లంగీకరింపకుండుటకై నే ననేకవిధములఁ బ్రయత్నించుచుంటిని. ఆశూన్యత్వము ననేక చిత్రాలంకారములతో నలంకరించి సుందరముగఁ జేయఁ బ్రయత్నించుచుంటిని. ఏమనిన— నేను భారతవర్షమును బ్రాణముకంటె నధికముగఁ బ్రేమించితిని. నేను దానియందేభాగమున కట్టిలోపము కలదనుటకును సహింపఁజాలకుంటిని. ఇప్పటికి నే నాయలంకారరచనమునందలి వృథాప్రయత్నమునుండి నివృత్తిం గాంచి బ్రదుకగలిగితిని పరేశబాబూ!

పరే— మనము సత్యమును గ్రహింపఁగలిగినప్పుడు మనసమస్తాభావములును సం
...న్నములు కాకపోయినను నాత్మసంతృప్తి కలుగును— దానిని మిథ్యోపకరణములచే
...లంకరింపవలయునను నిచ్ఛామాత్రమైనను మనకుఁ గలుగదు.

గోరా— పరేశబాబూ! చూడుము! నాకు రేపు ప్రాతఃకాలమునకు నవజీవన
లాభముం బ్రసాదింపుమని నిన్నటిరాత్రి నేను దేవుని బ్రార్థించితిని. నేను చిన్నతన
మునుండియు నిన్నాళ్ళవఱకు నజ్ఞానాశౌచములచే నావృతుండనై యుంటిని. ఇప్పు
డాయావరణము నిశ్శేషముగ నశించుటచే నాకు నవజన్మలాభము కలిగినది. నే నేభావ
ముతోఁ బ్రార్థించితినో యాభావము నీశ్వరుఁ డాలింపలేదు— అతఁ డాకస్మికముగాఁ
దనసత్యమును నాచేతులలోఁ బెట్టి నన్నొక్కసారిగా నానందపులకితునిం గావించి
నాఁడు. అతఁ డిట్లు నాయపవిత్రతను సమూలముగ నశింపఁజేయునని నేను
స్వప్నమందైనను ననుకొనలేదు. నే నిప్పుడు చండాలగృహమందైనను నపవిత్రతాభ
యము లేనంతటి శుచిష్ [illegible] నైతిని. పరేశబాబూ! నేను నేటిప్రాతఃకాలమున
...గముగ నావరణ [illegible] ం బగుచిత్తముతో నొక్కసారిగా భారతవర్షోత్సంగ
నాశ్రయింపఁగలిగి [illegible] కాలమునకు నేను మాతృక్రోడనివాససుఖ మనుభ
సంపూర్ణముగ గ్రహి [illegible]

పరే— గోర [illegible] నివాససౌఖ్యాధికారమధ్యమునకు మమ్ము
లనుగూడ నాహ్వానిం [illegible]

గోరా— నేని [illegible] ంచి ప్రప్రథమమున మిమ్మేల దర్శింప
వచ్చితినో యెఱుఁగుద [illegible]

పరే— ఎందు [illegible] అను [illegible]

గోరా— ఆమంత్రము మీయొద్దనేయున్నది— అందుచేతనే మీ కేసమా
జమునందును స్థానమును గైకొనలేదు. నన్ను మీరు మీశిష్యునిగా ననుగ్రహింపుఁడు!
ఎవ్వఁడు హిందువులకును, మూసల్మానులకును, క్రైస్తవులకును, బ్రాహ్మసామాజికులకును
గూడ సముఁడైయుండెనో యెవ్వనిమందిరద్వార మన్నిజాతులకును నందఱవ్యక్తుల
కును గూడ నేదినమునందైనను మూయఁబడియుండదో, యెవ్వఁడు కేవలమును హిందు
వులకుమాత్రమే దేవుఁడు కాక భారతవర్షమునకంతకును దేవుఁడైయుండెనో యా
దేవునిదివ్యమంత్రమును మీరు నా కిప్పు డుపదేశింపవలయును.

పరేశునివదనకమలమున గంభీరభక్తిరసపరిప్లుతము లగుచున్న స్నిగ్ధమధురచ్ఛాయలు
మిలమిల మెఱసిపోవుచుండెను— అతఁడు నిమీలితనయనుఁడై నిశ్శబ్దముగ నిలువఁబడి
యుండెను.

ఇంతసేపటికి గోరా సుచరితవంకఁ దిలకించెను. సుచరిత తనకుర్చీపై నిశ్చేష్టురా కూర్చుండియుండెను.

గోరా నవ్వుచు "సుచరితా! నే నిఁక నీగురువును గాను. నేను నిన్నొక్కటి ప్రార్థించుచున్నాను—" "నీవు నాచేయి పట్టుకొని నీయీగురునకు నన్ను సమర్పించుము!" అని కోరుచు గోరా తనదక్షిణహస్తమును సుచరితవైపునకుఁ జాచెను. సుచరిత చటాలునఁ గుర్చీనుండి లేచి తనకోమలకరపల్లవము నాతని కరకమలమ గీలించెను. అప్పుడు గోరా సుచరితతోఁ గలసి పరేశునకు సాష్టాంగప్రణామమును గావించెను.

## పరిశిష్టము

గోరా సంధ్యానంతరమున నింటికివచ్చి చూచెను.—ఆనందమయి యింటియెదుట వరండాలో నిశ్శబ్దముగఁ గూర్చుండియుండెను.

గోరా చటాలునవచ్చి యామెపాదములచెంతఁ ల్లెను. ఆనందమ హస్తద్వయముతో నాతనియుత్తమాంగము నెత్తి ముద్ది .

గోరా—అమ్మా! నీవే మాయమ్మవు, నే దకుకొనుచుఁ దిరుగుచుంటినో—ఆయమ్మ నాగృహమధ్యమున ది! అమ్మా! నీకు జాతిలేదు; విచారములేదు; అసహ్యభా ను కల్యాణమూర్తివి! నీవే నాభారతవర్షమవు!

అమ్మా! ఈసారి మీలక్ష్మీదాసిని నీ యుజలము దెమ్మని యామెతోఁ జెప్పుము!

అప్పుడానందమయి యశ్రువ్యాకులమృదుకంఠస్వరముతో గోరాచెవిచెంతఁ దన వదనకమలము నుంచి "గోరా! ఈసారి యొకసారి వినయుని బిలిపించెదను." అనియెను.

సమాప్తము

---



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA LO7B 184 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 399 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Ch. Ramya |
| స్కాన్ చేసినది | Prateyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |